# పెద్దిభొట్ల సుబ్బరామయ్య

# కథలు

**1992 - 93** సంవత్సరంలో తెలుగు విశ్వవిద్యాలయంవారి

బహుమతి పొందిన ఉత్తమ కథల సంపుటి

పెద్దిభొట్ల సుబ్బరామయ్య



విశాలాంధ్ర ... స

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్ - 500 001

ప్రచురణ నెం. : 1800
ప్రతుల సంఖ్య : 1000

ప్రథమ ముద్రణ : ఆగస్టు, 1990
ద్వితీయ ముద్రణ : ఏప్రిల్, 1994



టైటిల్ డిజైన్ : చంద్ర

**వెల : రూ. 50-00**

ప్రతులకు :

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
4-1-435, విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

**విశాలాంధ్ర బుక్ హౌస్**
విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్టణం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

**ISBN** : 81-7098-212-X

ముద్రణ : నాగార్జున ఎంటర్‌ప్రైజెస్, విజయవాడ - 520 004.



నా కిష్టమైన ఈ కథల సంపుటి

సన్మిత్రులు, సహాధ్యాపకులూ అయిన

శ్రీ దాసరి లక్ష్మణరావు గారికి బహుకృతి

# కృతజ్ఞత

ఈ సంపుటిలోని కథలన్నీ ప్రముఖ మాస, వారపత్రికలలో ప్రచురించబడ్డాయి.

'భారతి' సాహిత్య మాసపత్రిక, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, ఆంధ్రజ్యోతి వార పత్రిక, స్వాతి మాస పత్రిక సంపాదకులకు రచయిత కృతజ్ఞుడు.

# ఇందులోని కథలు

# పేరయ్యబావి

దిగంతాల నుండి విపరీతమైన వేగంతో సుళ్ళు తిరుగుతూ సమస్త జీవరాసులలోని తేమనూ, చైతన్యాన్నీ హరించి వేస్తూ వీస్తున్న వెచ్చని గాలి ఆ పరిసరాలలోకి వచ్చినంతనే చల్లబడుతున్నట్టుగా ఉంది. ఆకాశాన ఒక్క మేఘశకలమైనా లేదు. ఎండ వేడిమికి భయపడి కీటాది క్షుద్ర జీవులు కూడా తమతమ నెలవులు విడిచి చరించడంలేదు. ఇంత సేపటి కొక కాకి గూటిని వదలి ఆహారం కోసం బయటకు వచ్చిందో ఏమో, నీరసంగా ఎగురుతూ పోతున్నది.

ఆ యువకుడు సేదదీరి వేపచెట్టు బోదెకానుకొని కూర్చుని కళ్ళుమూసుకున్నాడు. అతనికి అంతా కలవలె తోచింది. అతడు ఉదయం అనగా బయలుదేరి సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చేదాకా చేతిలో సంచితో నడుస్తూనే ఉన్నాడు. అవన్నీ మరుభూములు. అక్కడక్కడ చెరువుల మీద ఆధారపడివుండే మాగాణి భూములు ఉన్నాయి. భూమి అంతా బీటలువారి నీటికి మొహంవాచి ఉన్నది. ఆ యువకుడు మరి నాలుగుమైళ్లు నడిస్తే స్వగ్రామం చేరుకోగలడనగా అతనికి విపరీతమైన దాహం ప్రారంభమైంది. వెచ్చనిగాలి బాణ వేగంతో వీస్తూవుండటంవల్ల అతని సర్వ నాడులూ క్రుంగిపోయాయి. అడుగుతీసి అడుగు వెయ్యటమే కష్టమైపోయింది. ఎక్కడా కనుచూపు మేరలో ఏవూరూ కనిపించటంలేదు. తూర్పుదిశగా ఒక వందగజాల దూరంలో ఒక వేపచెట్టు మాత్రం ఒంటరిగావుంది. అతడు ఆ చెట్టుదరికి చేరుకొన్నాడు. అతని కల వేయి రెట్లుగా ఫలించినటయింది. ఆ చెట్టుకు పదిగజాల దూరంలో ఒక బావి, ఇనుప గొలుసుతోవున్న

ఒక బొక్కెనా అతనికి కనిపించాయి. అతడు సంచి అక్కడ పడేసి త్వరత్వరగా ఆ నీళ్ళుతోడుకొని, కాళ్లూ చేతులూ మొహమూ కడుక్కొని తర్వాత కడుపునిండా త్రాగాడు. ఆనీళ్ళు కొబ్బరిపాలవలె ఉన్నాయి. అతడు నెమ్మదిగావచ్చి వేపచెట్టు బోదెకానుకొని కూర్చున్నాడు.

నిజానికి ఇంతకుపూర్వంవలె సూర్యబింబం నిప్పులను కురిపిస్తూనేవుంది. వేడిగాలి 'రివ్వున' వీస్తూనేవున్నది. అయినా అతని కళ్ళకు సమస్త ప్రపంచమూ, చల్లగా హాయిగా కనిపిస్తున్నది.

ఈ మరుభూమిలో, ఈ కాలిబాటల ప్రక్కగా ఒంటరిగా ఈ బావి ఎందుకు వుంది? అక్కడికి చుట్టూ ఏడెనిమిది మైళ్ళ పరిధిలో ఏ వూరూ ఉన్నట్టులేదు. ఈ ప్రాంతంలో బావిని ఎవరు త్రవ్వించారు? ఏ ప్రయోజనం ఉద్దేశించి త్రవ్వించారు?

ఆ యువకుడికి కొద్ది క్షణాల్లోనే మగతగా నిద్ర పట్టింది.

ఏపుగా పెరిగిన వెదురుచెట్ల మధ్య భుజం మీద మంచినీళ్ళ కావడితో వడివడిగా నడుస్తున్నాడు పేరయ్య. ప్రక్కనే ఏ చెట్టు కొమ్మలలోనో దాక్కొని ఉండి కోయిల కూస్తున్నది. వేగంగా వీచే గాలిని తమలో పూరించుకొని వెదురుపొదలు 'జుమ్మ'ని శబ్దం చేస్తున్నాయి. పేరయ్య త్వరత్వరగా నడిచి వూరి చివరగాఉన్న ఒక యింట్లో ప్రవేశించి నీళ్ళకావడి దింపాడు.

ఆ వూరిలో ఉన్న బావులన్నిటిలోనూ నీళ్ళు సముద్రపు నీటివలె ఉప్పగా ఉంటాయి. ఊరికి అరమైలు దూరంలో ఉన్నదొక పెద్ద మంచినీళ్ళ బావి. ఆ బావినీరే ఊళ్ళోవారికి శరణ్యం. ఉప్పునీరు స్నానాలకూ, పై వాడకానికి తప్ప మరెందుకూ పనికిరాదు. పేరయ్య రోజూ చీకటి ఉండగానే లేచి స్నానంచేసి, తడిగుడ్డతోనే భుజంమీద కావడి వేసుకొని బయలుదేరి, బాగా పొద్దెక్కేదాకా బావినుంచి వూరికీ,

పూరి నుంచి బావికి తిరిగి అందరి ఇళ్ళకూ నీరు చేరవేస్తాడు. తర్వాత ఇంటికివచ్చి నాలుగు గింజలు ఉడకేసుకుని తిని కాస్సేపు నడుంవాల్చి లేస్తాడు. మూడు గంటలు కాగానే భుజంమీద కావడితో బయలు దేరుతాడు.

అతని తండ్రికూడా సరిగ్గా అలాగే చేసేవాడు. పేరయ్య పదహారేళ్ళవాడై వుండగా అతని తండ్రికి పక్షవాతం వచ్చి కాలూ చెయ్యీ పడిపోయి మంచంలోనుంచి లేవలేకపోయాడు. తర్వాత కొద్ది రోజులలోనే, పసివాడైన పేరయ్య భుజంమీద కావడి, కుటుంబభారమూ పడ్డాయి. కుటుంబమంటే మందీ మార్బలమూ ఏమీ లేదు. అతనికి అప్పటికి ఉన్నదల్లా తల్లి ఒక్కతే. ఆమె అసలే బలహీనురాలు. పైగా భర్త మరణం ఆమెను మరింత క్రుంగదీసింది. ఆమెలో జవసత్త్వాలు సన్నగిల్లి పోయాయి. ఆమె కళ్ళు గాజుబిళ్ళలవలె ఉండేవి. పగలే చూపు సరిగా ఉండేది కాదు. అయినా తప్పనిసరి కాబట్టి నెమ్మదిగా తడువుకుంటూ ఇంటి పనులు చేసుకునేది. రోజూ పేరయ్య అన్ని యిళ్ళకూ నీళ్ళుమోసి అలసిపోయి యింటికివచ్చి భోజనం ముందు కూర్చునే సరికి ఆమె ప్రారంభించేది "ఏమిరా,నాయనా! చూస్తున్నావుగా నాఅవస్థ! పెద్దముండనైనాను బ్రతికినన్నాళ్ళు బ్రతకబోను. మొన్న ఆ పుండరీకాక్షయ్య ఎక్కడో ఏదో మనువు ఉన్నదని చెప్పాడు. నువ్వు ఒక యింటివాడివైతే చూసి కళ్ళుమూస్తాను...ఏమీ సమాధానం చెప్పకుండా అలా నల్లరాయిలా కూర్చుంటావు, ఎలారా నీతో వేగటం ?" అంటూవుండేది. పేరయ్య స్వతహాగా మితభాషి. తల్లి కళ్ళ నీళ్ళు పెట్టుకోవటం చూసి అప్పుడప్పుడు "ఇప్పుడేం తొందరొచ్చిపడిందే ? నీకు మరీ చాదస్తం..." అనేవాడు.

అంతగా పోరు పెట్టినప్పటికీ ఆ ముసలిదాని కోరిక తీరనేలేదు. ఒకనాడు మేఘాలు ముసురుకొని పగలే చీకటి కమ్మినట్టయి, మరి కాస్సేపట్లో వర్షం ప్రపంచాన్ని ముంచెత్తుతుందనగా ఆమె వంట పూర్తి చేసి పంచలోకి వచ్చి కొంగు పరచుకుని పడుకుని సునాయాసంగా ఎవరినీ బాధపెట్టకుండా ఒంటరిగా ప్రాణాలు వదిలింది.

పేరయ్య వచ్చి కావడి దింపి నిద్రిస్తున్న తల్లిని 'లేపి యిబ్బంది పెట్టటం ఎందుకులెమ్మ'ని అనుకుని లోపలికి వెళ్ళి సిద్ధంగావున్న అన్నం వడ్డించుకుని సుష్టుగా భోజనం చేశాడు. తర్వాత చెయ్యి తుడుచుకుంటూ పంచలోకి వచ్చి యింకా అలాగే పడుకునివున్న తల్లినిచూసి నవ్వుకుని 'అమ్మా' అని పిలిచాడు. ఆమె లేచి "ఎప్పుడు వచ్చావురా నాయనా" అని అడిగితే "నేను రావటమూ అయింది, నా భోజనమూ అయింది. నువ్వులేచి కాస్త ఎంగిలిపడు. అసలేపొద్దెక్కింది" అందామనుకున్నాడు. కాని అతడు రెండుసార్లు పిలిచినా, ఆమె కదలనైనాలేదు. అతనికి అనుమానం వేసి దగ్గరికివెళ్ళి పరీక్షగాచూసి ఒక్కసారిగా బావురు మన్నాడు. అతని ఏడుపు విని నలుగురూ చేరారు. తర్వాత వారు తలా ఒక చెయ్యి వేసి అన్నిపనులూ పూర్తిచేశారు. పేరయ్య మళ్ళీ ఆ యింట్లోకివెళ్ళి ఒక ప్రక్కగా కూర్చుని ఒంటరిగా దుఃఖించాడు.

అప్పటికి అతనికి ఇరవైయేళ్లు. రోజూ తెలతెలవారుతుండగా లేచి స్నానంచేసి కావడి భుజంమీద వేసుకుని బావికి బయలుదేరేవాడు. అపరాహ్ణందాకా అదేపని. తర్వాత మళ్ళీ మధ్యాహ్నం మూడు గంటలకే బయలుదేరి పొద్దుగూకిన తర్వాత యింటికి చేరుకునేవాడు.

ఆ వూరి కరణం ఒకనాడు పేరయ్యను పిలిచి "ఏమిరా ! ఇలా ఎన్నాళ్ళని చెయ్యి కాల్చుకుంటావు? రేపు నేను పాలెం పోతున్నాను. నా వెంటరా. నా ఎరికలో ఒక సంబంధం వుంది. పిల్లనుచూసి రావచ్చు" అన్నాడు. ఆయన ఎదుట మాట్లాడలేక పేరయ్య వినయంగా తలవూపి వచ్చేశాడేగాని తర్వాత ఆలోచిస్తే ఒక ముఖ్యవిషయం జ్ఞప్తికి వచ్చింది. పెళ్ళి అనగానే ఎంత లేదన్నా ఏమీ నగలూ నాణ్యాలూ పెట్టకపోయినా కొన్ని వందల రూపాయలు ఖర్చు. తన దగ్గర చిల్లి గవ్వకూడా లేదు. ఉన్న కొద్దిసొమ్ము తల్లి అంత్యక్రియలకూ, సంతర్పణకూ ఖర్చు అయింది. అతడు మర్నాడు కరణంగారి యింటికివెళ్ళి ఈ విషయం ప్రస్తావించాడు. డబ్బు విషయం ఎత్తగానే ఆయన నవ్వి "పిచ్చివాడా అదా నీ సందేహం ? మేమంతా ఏమైపోయామనుకున్నావు ? అలాంటి

పిచ్చి సందేహాలు పెట్టుకోకు. ఇంటికివెళ్ళి తెల్లని చొక్కావుంటే తొడుక్కునిరా" అన్నాడు.

పేరయ్య ఇంటికివెళ్ళి తన తండ్రి తాలూకు చొక్కా ఒకటి ఏరి తొడుక్కున్నాడు. అది తెల్లగానే వుంది. భుజం మీద కొద్దిగా చిరిగినంత మాత్రంలో ఏమీ లోపంరాదు. పైన ఉత్తరీయం ఉండనే వుంది.

అతడు కరణంగారివెంట పాలెంవెళ్ళి పిల్లను చూశాడు. పిల్ల తండ్రి బీదవాడు. ఆయనకు నలుగురు ఆడపిల్లలు. పెద్ద పిల్లలు ముగ్గురికీ ఉన్నంతలో మంచి సంబంధాలు కుదిర్చి పెళ్ళిళ్ళు చేశాడాయన. చివరి పిల్లపేరు వర్ధని. ఆ పిల్లవంతు వచ్చేసరికి ఆస్తి ఏమీ మిగలలేదు. పైగా పిల్ల పెళ్ళి కెదిగి కూర్చున్నది. ఈ భారం ఎలావదుల్చుకోవటమా అని ఎదురుచూస్తున్న ఆయనకు పేరయ్య అన్నివిధాలా తగినవాడుగా కనిపించాడు. కుర్రవాడు కష్టపడి జీవించే తరహావ్యక్తి కాబట్టి తిండికీ బట్టకూ లోపం జరగదు.

పేరయ్య తనముందు చాపమీద తలవంచుకుని కూర్చుని వున్న పిల్లను చూశాడు. ఆ కొద్దిసేపూ వినియోగించుకునేందుకు ప్రక్కయింటి వారినడిగి ఏవేవో నగలు తెచ్చి ఆ పిల్లను అలంకరించారు. నిజానికి ఆ పిల్లకు ఆ అలంకరణ లేవీ అవసరంలేదు. మంచులో తడిసిన మందార పువ్వువంటి ముగ్ధ సౌందర్యం ఆమెది. ఆ కన్నులు విశాలమూ సోగలై నల్లగా ఉన్నాయి. ఆ కళ్ళలో అమాయకత్వం ఉట్టిపడుతున్నది. ఆ శరీరచ్ఛాయ పచ్చువన్నె పసిడిఛాయతో పోటీ పడుతున్నది. ఆ తతంగం ముగియగానే పేరయ్య పెదవి కదపకుండా లేచి కరణంగారి వెంట బయటికి వచ్చాడు.

ఆయన "ఏమిరా ! పేరయ్యా ! పిల్ల ఎలావుంది ? నచ్చిందా ?" అని అడిగితే తలవూపి వూరుకున్నాడు. తర్వాత కొద్దిరోజుల వ్యవధిలోనే ఒక ముహూర్తం నిర్ణయించి నలుగురు పెద్దలూచేరి శుభ కార్యం అయిందనిపించారు. పేరయ్య తన ఒంటరితనం పోయినట్టూ, తనకీ ప్రపంచంలో అతిదగ్గర బంధువు లెంతోమంది ఉన్నట్టూ అనుభూతి

పొందాడు. అతని కాశ్చర్యంవేసింది. ఇన్నాళ్ళుగా ఈ విశాల విశ్వంలో 'నా' అనుకోదగిన వారెవరూలేని తనకు ఈనాడు చిత్రంగా తననే సర్వస్వం అనుకునే ప్రాణి లభించింది. అతడు ఆనందంతో, గర్వంతో ఉప్పొంగిపోయినాడు.

తర్వాత కొన్ని నెలలకు ఆ పిల్ల చీర సారెతో కాపురానికి వచ్చింది. వస్తూ ఆ యింటికి వెలుగును తీసుకువచ్చింది? పేరయ్య జీవితాన్ని వెలిగించే జోతిగా ఆమె ఆ యింట్లో అడుగు పెట్టింది. కొద్ది సాహచర్యంతోనే మామిడిచెట్టును అల్లుకున్న మాధవీ లతవలె ఆమె అతనికి తన్ను తాను అంకితం చేసుకొన్నది. రోజంతా కష్టపడి యింటికివచ్చిన పేరయ్య భార్య పరిచర్యలో స్వర్గసౌఖ్యం అనుభవించేవాడు. ఆమె, ప్రణయజలధిలో మునకలువేసి అలసి సొలసి, కాయలు గాచిన అతని భుజాలమీద తలవాల్చి నిద్రించేది.

తర్వాత సంవత్సరానికి ఆ పిల్ల గర్భవతి అయింది. తల్లిదండ్రులు వచ్చి కాన్పుకు ఆ పిల్లను తమవెంట తీసుకుపోయారు. ఆమె వెడుతూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది. పేరయ్య కూడా చలించిపోయాడు. అయినా ఆమెను సముదాయించి "పిచ్చిదానా! ఇక్కడికి పదిమైళ్ళే కదూ! ఏమన్నా దూరమా భారమా? రెండురోజుల కొకసారి వచ్చి నిన్ను చూడకపోతే నేనుమాత్రం బ్రతకగలనా?" అన్నాడు.

అలాగే మాట తప్పకుండా అతడు రెండు మూడు రోజుల కొకసారి వెళ్ళి చూచివస్తూనే ఉన్నాడు. ఆ రోజుల్లోనే ఆమెకేదైనా ఒక బంగారునగ చేయించాలనే కోరికతో అతడు డబ్బు కూడబెట్టడం ప్రారంభించాడు.

ఆమెకు తొమ్మిది నెలలూ నిండిన తర్వాత అతడొకనాడు వెళ్ళేసరికి ఆమె కళ్ళనీళ్ళు పెట్టుకుని కూర్చునివుంది. పేరయ్య ఆమె దగ్గరకువెళ్ళి "ఏమిటే వర్ధనీ! ఎందుకేడుస్తున్నావు?" అని అడిగాడు. ఆమె ఏమి మాట్లాడలేదు. తర్వాత పేరయ్య బావమరది నోట అసలు విషయం విన్నాడు. పండుగకు ఆమె అక్కలిద్దరూ పుట్టింటికి వచ్చారు.

వారిలో ఒకామెకూ వర్ధనికీ చిన్నప్పటినుంచీ పడదు. ఆమె 'నీ మొగుడు నీళ్లుమోసుకుని బతుకుతాడ'ని వర్ధనిని ఎగతాళి చేసింది. ఆ పూట వర్ధని అన్నం తినలేదు. అక్కవచ్చి "పొరపాటున అన్నాను. బుద్ధితక్కువదాన్ని. లేచి అన్నం తినవే" అని బతిమిలాడినా ఆమె కదలలేదు...

పేరయ్యకు నవ్వు వచ్చింది. వర్ధని దగ్గరగా వెళ్ళి "ఆ మాత్రం దానికే అంత కోపం చేసుకోవాలా ? తప్పుకదూ ! తమాషాకు ఏదో అన్నదే అనుకో, యింత రాద్ధాంతం చెయ్యవచ్చునా ? లే. త్వరగా అన్నం తిను..." అన్నాడు. ఆమె లేచి కళ్ళుతుడుచుకుని వంట యింట్లోకి వెళ్ళింది.

తర్వాత కొద్ది రోజులలోనే పేరయ్యకు పిడుగువంటి వార్త వచ్చింది. ఒకరోజున తెల్లవారుజామునే స్నానంచేసి బావికి బయలు దేరుతూ ఉండగా ఒక మనిషి వచ్చాడు. ఆ రాత్రి అతని భార్యకు నొప్పులు వచ్చాయనీ, కాన్పు కష్టమయిందనీ, పిల్లపుట్టి పోయిందనీ, తల్లికూడా బ్రతికేదాకా నమ్మకంలేదనీ కబురు తెచ్చాడా వ్యక్తి. పేరయ్య కాళ్ళ క్రింద భూమి కరగిపోతున్నట్లనిపించింది. త్వరత్వరగా పంచె కట్టుకుని పైన ఉత్తరీయంతో ఆ మనిషి వెంట నడిచాడు. అంత దూరమూ తన పెన్నిధిని తనకు దూరం చెయ్యవద్దని భగవంతుణ్ణి ప్రార్థిస్తూనే నడిచాడు. కాని విధి ప్రతికూలంగా వ్యవహరించింది. అతనికి చూపులైనా అందలేదు.

పేరయ్యకు లోకమంతా చీకటి అనిపించింది. అతని సుఖం చట్టుబండలైపోయింది. దొరికినట్లే దొరికి అంతలోనే చేయిజారిపోయిం దొక అమృత కలశం. అతడు ఎంతోసేపు శిలావిగ్రహంవలె చేష్టలు డిగి కూర్చుండిపోయాడు.

పేరయ్య మళ్ళీ తనపని ప్రారంభించాడు. జీవితం మళ్ళీ గాడిలో పడింది. ఒంటరిగా నిర్లిప్తంగా రోజులు గడపటం ప్రారంభించాడు. అతని మనసులో దిగులులేదు. బాధలేదు. యంత్రంవలె తయారైనాడు.

అప్పుడప్పుడూ వాళ్ళూ వీళ్ళూ 'మళ్ళీ పెళ్ళిచేసుకో పేరయ్యా!' అనేవారు. అతడు వారి మాటలువిని నవ్వి వూరుకునేవాడు. తర్వాత ఏళ్ళు గడిచేకొద్ది అతనిలో మార్పు వచ్చింది. అకాల వార్ధక్యం అతని సర్వాంగాలనూ ఆక్రమించింది. మొహం ముడతలుపడి జుట్టు తెల్లబడింది. శరీరంలో జవమూ, సత్త్వమూ ఉడిగిపోయి ఉత్సాహం తగ్గింది. అతడు తనపని తప్ప మరే విషయాన్నీ పట్టించుకునేవాడు కాదు.

ఒకనాడు కరణం అతన్ని పిలిచి 'పేరయ్యా! మా అమ్మాయికి ఏటి అవతల భోగాపురంలో సంబంధం కుదిరింది. నువ్వు వెళ్ళి లగ్న పత్రిక యిచ్చిరావాలి" అన్నాడు. పేరయ్య తలవూపి, అప్పటికి అన్ని యిళ్ళలోనూ నీళ్ళు చేరవెయ్యటం పూర్తి అయినందువల్ల, యింటికి వెళ్ళి త్వరత్వరగా నాలుగుగింజలు ఉడకేసుకుని తిని చొక్కా తొడుక్కొని సిద్ధమై వచ్చాడు. కరణం అతని చేతికి పసుపు పూసిన లగ్నపత్రిక యిచ్చాడు. పేరయ్య ఉత్సాహంతో నడవటం ప్రారంభించాడు.

నడివేసవి. వేడిగాలి విసురుగా వీస్తున్నది. ఆ గాలికి సర్వావయవాలూ చచ్చుబడిపోతున్నాయి. పేరయ్య కాలిబాటవెంట ఏడుమైళ్ళు నడిచిపోయి భోగాపురం చేరుకొని అక్కడ యిల్లువాకబుచేసి కనుక్కొని లగ్నపత్రిక యిచ్చి మళ్ళీ వెంటనే బయలుదేరాడు. "ఈ ఎండలో ఎలా పోగలవు? కాస్త నడుంవాల్చి పోరాదూ?" అని ఆ యింటి యజమాని చెప్పినా వినక "కాదండీ బాబుగారూ! అక్కడ నీళ్ళ యిబ్బంది ఉన్న సంగతి మీకు తెలుసుగా! కాస్త పొద్దువాటారేసరికి నేను కావడి భుజాన వేసుకోవాలి. లేకపోతే అందరూ యిబ్బంది పడతారు" అని సమాధానం చెప్పి తాంబూలంలో వచ్చిన రెండు రూపాయలూ రొండిన దోపుకొని తిరుగుముఖం పట్టాడు.

ఎండ వేడిమి ఏమాత్రమూ తగ్గలేదు. భానుబింబం నిప్పులు చెరుగుతున్నది. వేడిగాలి యథాప్రకారం బాణ వేగంతో వీస్తూనేవున్నది. పేరయ్య కాళ్ళకు చెప్పులైనాలేవు. ఆ ఏటి యిసుకలో నడిచి అవతలి

ఒడ్డు చేరుకునేసరికి అతనికి ఆయాసం వచ్చింది. కాళ్లు బొబ్బలెక్కినయ్. విపరీతమైన దాహంతో నాలుక పిడచగట్టుకపోతున్నది. ఉత్తరీయం కళ్ళకు ఒత్తుకుంటూ అతడు ఒక్క క్షణం వెనక్కి తిరిగి నుంచున్నాడు. విపరీతమైన వేగంతో సుడిగాలిరేగి అతన్ని ఎర్రని దుమ్ములో ముంచి వేసింది. అతని శరీరం తూలిపోయింది.

కొద్దిగజాల దూరంలో అతని కళ్ళకొక విశేషం కనిపించింది. అతడు తనలో "ఛ...ఇది నా భ్రమ అయివుంటుంది...ఈ మరు భూమిలో...యింత ఎండలో...అబ్బే" అనుకుంటూ తూలుతూ ఆవైపు నడిచాడు.

ఎనభై ఏళ్ళ ముదుసలి ఒకామె నాలుగైదు తాటాకులతో ఒక చిన్న పందిరి వేసుకుని కాలిబాట పక్కగా కూర్చునివుంది. ఆమె ముందు రెండు కుండల నిండుగా చల్లని నీళ్ళు ఉన్నాయి. ఆమె, తూలుతూ వచ్చిన పేరయ్యకు ఒక చెంబునిండా నీళ్ళు అందించి, "బాగా ఎండ దెబ్బ తిన్నావు...ముందు మొహం కడుక్కో నాయనా...ఒక్క క్షణం ఆగి నీళ్లు తాగవచ్చులే...ఇప్పుడే తాగితే వడతగులుతుంది" అన్నది.

పేరయ్య కాళ్ళూ, చేతులూ, మొహమూ కడుక్కున్నాడు. ఆ నీళ్ళ స్పర్శకే అతనిలో జీవం మోసులెత్తింది. ఖాళీచెంబు ఆమె కందించి ఒక్క క్షణం కూర్చున్నాడు. తర్వాత ఆమె త్రాగేందుకు నీళ్ళు అందించింది. కడుపునిండా ఆ చల్లని నీళ్ళు తాగి ఒక మూలగా ఆ నీడలో ముడుచుకుని పడుకున్నాడు పేరయ్య. అతనికి నిద్ర ముంచుకు వచ్చింది.

అతనికి మెలకువ వచ్చేసరికి ఎండవేడిమి కొద్దిగా తగ్గింది. గాలిలో వెచ్చదనంకూడా తగ్గిపోయింది. అతడు లేచి ఆ అవ్వవంక ఒక్కసారి చూశాడు. ఆమె బోసినోటితో మెరుపు మెరిసినట్టు నవ్వింది. పేరయ్య "వస్తానమ్మా" అంటూ నడవటం ప్రారంభించాడు.

అతడు కరణంగారి యింటికి కబురుచెప్పి తన యింటికి

వచ్చాడు. చొక్కావిప్పి వంకెకు తగిలించి సందుగు పెట్టెలోనుంచి ఒక చిన్న రేకుపెట్టె బయటికి తీశాడు. అందులో ఎన్నో ఏళ్ళ క్రిందట తన భార్యకు ఏదైనా నగ చేయిద్దామని అతడు కూడబెట్టిన ధనం వుంది. ఆ మొత్తం మొదట వంద రూపాయలే. ఆ తర్వాత అడపాదడపా లభించిన డబ్బు కూడా అందులోనేవేశాడు. కూర్చుని అంతా లెక్కపెడితే రెండువందల పదిహేను రూపాయలున్నాయి. ఇప్పుడు లగ్నపత్రిక మూలంగా దొరికిన రెండురూపాయలుకూడా అందులో వేశాడు.

తర్వాత కొన్ని రోజులపాటు అతడు ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉండేవాడు. ఎవరితోనూ మాట్లాడేవాడుకాదు. తాను ఆనాడు ఎండలో పడిన అవస్థ మళ్ళీ మళ్ళీ గుర్తుచేసుకునేవాడు. ఆ ముదుసలి తనపాలిట దేవతవలె ఆనాడు అక్కడ ఉండబట్టి సరిపోయింది. లేకపోతే తానప్పటి కప్పుడే ప్రాణాలు వదిలివుండేవాడు. రైలుస్టేషను నుంచి ఏ వూరికి రావాలన్నా ఆ కాలిదోవతే గతి. ఒక వూరినుంచి మరొక వూరికి పోవాలన్నా ఆ మరుభూములలో కాలిబాటలే శరణ్యం.

కరణంగారి యింట్లో పెళ్లి అయిపోయింది. పేరయ్యకు విపరీతమైన తాకిడి తగిలింది. అతడు కావడి క్రిందికి దింపేందుకు కూడా వీలు చిక్కలేదు. ఆ హడావుడి తగ్గినతర్వాత కరణంగారు పేరయ్యకు ఇరవైరూపాయలూ, ఒక ధోవతుల చాపూ తాంబూలంలోపెట్టి యిచ్చాడు.

పేరయ్య ఒకనాడు నడిచివస్తూ ఆగిపోయాడు. ఇంతకుపూర్వం కాలిబాట ప్రక్కన అవ్వ కూర్చునివున్నచోట పదేళ్ళ పిల్లవాడు కూర్చుని వున్నాడు. 'ఇక్కడ అవ్వ ఏదీ ?' అని పేరయ్య అడిగిన మీదట ఆ పిల్లవాడు కళ్ళనీళ్లు పెట్టుకుని "మా నాయనమ్మ... చచ్చిపోయింది" అన్నాడు.

పేరయ్య కొద్దిక్షణాలపాటు చేష్టలుడిగి నిలుచుండిపోయాడు. తర్వాత నెమ్మదిగా నడిచి తన వూరికి వచ్చాడు.

అతడు రెండురోజులపాటు ఏమాలోచించాడో తెలియదు. మూడో

నాడు ప్రొద్దున్నే నలుగురు పనివాళ్ళను పిలిచి వారితో మంతనాలు ప్రారంభించాడు. వాళ్ళలో ఒకడు "నీకు పిచ్చిగాని పట్టిందా బాప నయ్యా! అక్కడ బావి తవ్వటం ఎందుకు? తవ్వినా నీళ్లు పడవుకదా? అంతా గొడ్డునేల" అన్నాడు. పేరయ్య వినిపించుకోలేదు. "మీకు కావల సింది డబ్బు. నేనిస్తానుగా. మా పెరట్లో తవ్వినా వూరిబయట తవ్వినా ఒక్కటే...ఏమంటారు?" అని అడిగాడు. వాళ్లు తలలూపి 'సరే' అని వెళ్ళిపోయారు.

మర్నాడు ఉదయమే ఊరిబయట కాలిబాటల ప్రక్కగా బావి త్రవ్వకం ప్రారంభమైంది. కరణం అదివిని పేరయ్య యింటికి పరు గెత్తుకువచ్చి "నీకు పిచ్చిపట్టిందా పేరయ్యా! ఇప్పుడే విన్నాను. ఏమిటీ పస?" అని అడిగాడు. పేరయ్య ఏమీ మాట్లాడకుండా శిలా విగ్రహం వలె కూర్చున్నాడు. ఎంతసేపటికీ జవాబు చెప్పలేదు.

వరుసగా నాలుగురోజులు పని సాగింది. గంగ కటాక్షించలేదు. పేరయ్య తన పనులన్నీ పూర్తిచేసుకుని అక్కడికివెళ్ళి కూర్చునేవాడు. నాలుగోనాడు పనిపూర్తిచేసుకుని యిళ్ళకు తిరిగిపోతూ పనివాళ్ళు పెద వులు విరిచారు. 'లాభంలేదు. ఇక్కడ జలపడదు' అన్నారు. పేరయ్య కళ్లు చెమర్చినయ్. పనివాళ్ళంతా వెళ్ళిపోయిన తర్వాతకూడా అత డక్కడే చాలాసేపు కూర్చున్నాడు. చీకటి పడింది. పేరయ్య కదల లేదు. చిన్నచిన్న రాళ్లు చేతిలోకి తీసుకుని బావిలోకి విసిరివేస్తూ ఆలోచ నలో పడ్డాడు. ఉన్నట్టుండి అతని శరీరం జలదరించింది. 'బుడుంగు' మని చిన్న శబ్దం వినిపించి అతడు ఆతృతగా బావిలోకి తొంగిచూశాడు. నీళ్ళు! అతడు త్వర త్వరగా పనివాళ్ళు ఏర్పరచుకొన్న మెట్లుదిగి లోపలికి వెళ్ళి దోసిలినిండా నీళ్ళు తీసుకుని కళ్ళకద్దుకున్నాడు. ఆ నీళ్ళు కొబ్బరిపాలవలె ఉన్నాయి. అతడు ఉత్సాహంతో పొంగిపోతూ, నీళ్ళు నిండిన కళ్ళతో యింటికి వచ్చాడు. ఆ రాత్రి వాకిట్లో వేపచెట్టు క్రింద కుక్కిమంచంలో పడుకుని చల్లనిగాలి అలలు అలలుగా వీచి జోకొడుతూ ఉండగా ఆదమరచి నిద్రపోయాడు.

ఆ మరుభూమిలో జలపడటం, అందులోనూ అంత తీయని నీళ్ళు

పడటం అందరికీ చిత్రమనిపించింది. తర్వాత రెండు మూడు రోజులలో పనివాళ్ళు బావిచుట్టూ పళ్ళెం కూడా కట్టి డబ్బు తీసుకుని వెళ్ళిపోయారు. పేరయ్య వాళ్ళతో మాట్లాడుకొన్న డబ్బుకాక తనదగ్గర మిగిలిన మరో అయిదు రూపాయలుకూడా వాళ్ళకే యిచ్చాడు. అతని మనస్సు ఎంతో తేలికపడింది.

తర్వాత అతని జీవితం చాలా సాధారణంగా గడిచిపోయింది. వూళ్ళో ఎవరి యింట్లోనైనా పెళ్ళివంటి శుభకార్యాలు ఘటిల్లినప్పుడు ఉత్సాహంగా పనిచేసేవాడు. అతనికి నీళ్ళకావడి ప్రియతమమైన వస్తువైపోయింది. అతడు రోజూ బావినుంచి యింటికి వచ్చేదోవలో అటూ ఇటూ ఉన్న వెదురుపొదలు కాలక్రమేణా దట్టంగా పెరిగినయ్. ఆ వెదురు పొదలలోనుంచి రకరకాల ధ్వనులు వినిపిస్తూ ఉండేవి. కోయిల సమయం వచ్చినప్పుడు ఆకుల గుబురులలో దాక్కొని ఎవ్వరికీ కనిపించకుండానే కర్ణపేయంగా కూస్తూ వుండేది. వూళ్ళో హరికథ, భజనవంటి కాలక్షేపాలున్నప్పుడు పేరయ్య హాజరవుతూ ఉండేవాడు. భజన సమయంలో నలుగురితోచేరి 'సెమ్మె' చుట్టూ తిరుగుతూ చిరుతలు మోగిస్తూ పాటలు పాడుతూ ఉండేవాడు.

* * *

ఆ యువకుడు కళ్ళు విప్పి చూశాడు. ఎండలో చురుకుపాలు తగ్గింది. ఒక కాకి 'కావు కావు' మని అరుస్తూ ఎగిరిపోతున్నది. రెండు మూడు మబ్బు తునకలు ఆకాశంలో కదులుతున్నాయి. దూరంనుంచి సముద్రపు గాలి తెరలు తెరలుగా వీస్తున్నది.

అతడు లేచి నిలబడి, "అవును ఈ బావి త్రవ్వించిన వాడూ అందరిలాగే కాలం చేరువైనప్పుడు శాశ్వతంగా కన్నుమూసి ఉంటాడు. అయినా, ఇంకా అతడు దాహంగొన్న బాటసారులకు ప్రాణదానం చేస్తూనే వున్నాడు. అతని ఆత్మ యీ పరిసరాల్లోనే విహరిస్తూ దాహం గొన్న వారిని ఇటువైపే లాక్కొనివస్తుంది. అటువంటి వ్యక్తులకు 'పునర్జన్మ ఉండదు' అనుకుంటూ చేతిలో సంచితో నడక సాగించాడు.

(28-8-61, ఆంధ్ర సచిత్ర వారపత్రిక)

# మిస్. భారతి బి.ఏ.

"శైలజకూ సురేష్‌కూ మహావైభవంగా వివాహం జరిగింది. పెద్దలందరూ వధూవరులను ఆశీర్వదించారు."

ఆఖరివాక్యం చదివి విసుగుతో పుస్తకాన్ని విసిరికొట్టింది భారతి. లేచినుంచుని చీరె కుచ్చెళ్ళు సవరించుకుని వొళ్ళు విరుచుకున్నది. తర్వాత నెమ్మదిగా నడచివెళ్ళి అద్దంలో మొహం చూసుకున్నది. ఒక్క క్షణం తర్వాత మళ్ళీ అద్దాన్ని బల్లమీదవుంచి కిటికీ పక్కన కుర్చీలో కూర్చున్నది.

కిటికీలోనుంచి తెల్లని చంద్రబింబం కనిపిస్తున్నది. ఎదురింటి ఆవరణలో వున్న కొబ్బరిచెట్ల ఆకులమీద వెన్నెల వెండిమలామా పూస్తున్నది. ఎవడో బిచ్చగాడు ఇంటిముందు నిలబడి ఎంతోసేపటి నుంచి కేకలువేసి విసిగిపోయి కదిలి వెళ్ళిపోయాడు. వీధి చివర పెళ్ళి వారి ఇంటిలోనుంచి సన్నాయి వాద్యం గాలి విసురుకు ఉండి ఉండి మల్లె పందిరి దులిపినట్టు మనోహరంగా వినవస్తున్నది.

భారతి నిట్టూర్చింది. మొన్నటిరాత్రి ఎనిమిది గంటల వరకూ మిస్. శకుంతలగావున్న తన స్నేహితురాలు – తన కన్నా చిన్నది – ఆ పూటనుంచి మిసెస్ శకుంతలా రఘురామ్‌గా మారిపోయింది. మరి కొద్దిరోజులలో భర్తతోపాటు భిలాయ్ వెళ్ళిపోతుంది. తర్వాత సంసారం, పిల్లలూ హడావిడిలో పడిపోయి ఎప్పుడైనా సంవత్సరానికో రెండు సంవత్సరాలకో బుద్ధిపుట్టిననాడు మళ్ళీ పుట్టింటికి వస్తుంది కాబోలు!

భారతి కుర్చీలోనుంచి లేచి విసుగ్గా అటూ ఇటూ పచార్లుచేసింది.

గోడమీద ఆమె నీడ చిత్రంగా కదులుతూవుంటే అటే చూస్తూ ఏదో ఆలోచనలోపడి అలా చాలాసేపు పచార్లుచేస్తూ ఉండిపోయింది. ఆమెకు క్రితంరాత్రి పెళ్ళి వూరేగింపు గుర్తువచ్చింది. శకుంతల తల్లిదండ్రులు సంపన్నులు. ఆమె వారికి ఒక్కతే ఆడపిల్ల. పైగా వరుడు ఉన్నతోద్యోగి. అందువల్ల వారు డబ్బు విరజిమ్మి ముచ్చటలూ, వేడుకలూ ఘనంగా జరిపించారు. ఒక కారును పూర్తిగా పూలతో నింపివేశారు. ముందు యూనిఫారం ధరించిన బ్యాండ్‌మేళమూ వెనక సన్నాయి మేళమూ తర్వాత వధూవరులు కూర్చున్న పూలకారూ, దాని వెనుక నెమ్మదిగా నడుస్తున్న బంధువులూ అలా నేత్రపర్వంగా ఆ వూరేగింపు తమ ఇంటిముందుగా సాగిపోతూవుంటే భారతి కన్నులింతలు చేసుకుని రెప్పవెయ్యకుండా చూస్తూ నిలబడింది. ఆ వూరేగింపు తమ ఇంటిని దాటి ఎంతో ముందుకువెళ్ళి సందుమలుపు తిరిగేవరకూ అలా గుమ్మాని కానుకుని ఆమె కళ్ళార్పకుండా చూస్తూనే ఉండిపోయింది. తర్వాత తలుపులు మూసి లోపలికివెళ్ళి పక్కమీదవాలి నిద్రపోదామని ఎంత ప్రయత్నం చేసినా ఆమె కళ్ళలో చాలాసేపటివరకూ ఆ మనోహర దృశ్యమే నిలచిపోయింది.

భారతి తన నీడను చూసుకుంటూ పచారుచేస్తున్నదల్లా చటుక్కున ఆగిపోయింది. ఆమె ఎదురుగా గోడమీద ఆమె బి. ఏ. పట్టా వ్రేలాడుతున్నది. ఆమె తండ్రి డిగ్రీ కాయితం రాగానే ముచ్చటపడి దానికి ఫ్రేముకట్టించి గోడకు తగిలించి ఉంచాడు.

భారతి దగ్గరగావెళ్ళి దాన్ని పైనించి క్రిందిదాకా చదివింది. తర్వాత కొద్దిక్షణాలు ఆగి మళ్ళీ చదివింది. తన పేరును మళ్ళీ మళ్ళీ చూసుకున్నది. ఆ డిగ్రీ తనకు పద్దెనిమిదోయేట చేతికి వచ్చింది. అంటే అయిదేళ్ళ క్రిందటి సంగతి అది. అప్పటికి చదువూ, కాలేజీ ధ్యాసతప్ప తనకు మరేమీ ఉండేదికాదు. తోటి ఆడపిల్లలతో కాలేజీకివెళ్ళి శ్రద్ధగా పాఠాలు విని నేరుగా ఇంటికి వచ్చేయటం, ఇంటి పనులలో తల్లికి సాయంచేసి మిగిలిన వ్యవధిలో తన పుస్తకాలు ముందువేసుకుని కూర్చోవటం. అంతేతప్ప కాలేజీ పిల్లలు గుంపులు గుంపులుగా తమ వెనుక,

నడుస్తూ కొందరూ, సైకిళ్ళమీద కొందరూ పోజులువేస్తూ వ్యంగ్యంగా మాట్లాడుకుంటూ వస్తూవున్నా పట్టించుకోవడం జరిగేదికాదు. అప్పు డప్పు డామె తల్లి మాత్రం "ఎదిగిపోయిన పిల్లనిలా ఎన్నాళ్ళని ఇంట్లో ఉంచుకుంటామండీ! ఎక్కడన్నా సంబంధాలు విచారించండి" అంటూ ఉండేది. అందుకు సమాధానంగా ఆమె తండ్రి నవ్వి వూరుకునేవాడు. తప్పక సమాధానం చెప్పవలసి వచ్చినప్పుడు మాత్రం "అబ్బ! వూరు కోవే! దాని పరీక్షలు కాకుండా ఎలాగా? అయిన తర్వాత చూద్దాంలే" అనేవాడు. తర్వాత తన పరీక్షలై పోయాయి. అప్పుడొకరు పెళ్ళిచూపులకు వచ్చారు. చూసుకుని వెళ్ళిపోయారు. వారి దగ్గరినుంచి వెంటనే ఉత్తరం వచ్చింది. తమ పిల్లవాడు స్కూల్‌ఫైనల్ మాత్రమే ప్యాసయినాడనీ, వాడికి బి.ఎ. పిల్లను చేసుకోవటం తమకు ఇష్టంలేదనీ, పిల్ల బి.ఎ పరీక్షకు వెళ్ళిందన్న సంగతి తెలియక చూపులకనివచ్చి ఇబ్బంది కలిగించినందు లకు క్షమించవలసిందనీ ఉత్తరంలో సారాంశం. తర్వాత ఫలితాలు తెలి శాయి. తాను అన్ని పార్టులలోనూ ప్యాసయింది...గ్రూపులో సెకండ్ క్లాసు...మరొక నెల రోజులకు మరొక సంబంధం వచ్చింది. కట్నం విషయంలో తామూ తూగలేకపోయారు. మరొక సంబంధం. వరుడు నల్లనివాడు. అతనికి తాను నచ్చలేదట...తర్వాత మరొక సంబంధం... వరుడు ప్లీడరు...అప్పుడు వరహీనం అనుకొని వెళ్ళిపోయారు..ఆతర్వాత క్రమంగా కాలం గడిచేకొద్దీ "ఇంత ఈడొచ్చినా పెళ్ళి కాలేదెందుకో..." అనే మిషతో సంబంధాల సంఖ్య తగ్గిపోయింది. సంవత్సరం క్రిందట తానీ ఉద్యోగంలో చేరినప్పటినుంచీ మచ్చుకైనా ఎవరూ రాలేదు. తండ్రికి వస్తున్న పెన్షన్‌రాళ్ళు తప్ప వేరే ఏ ఆదాయము లేని తమ ఇంటి పరిస్థితి తాను ఉద్యోగంలో చేరిన తర్వాత వస్తున్న తొంభయి రూపాయలతో కొంచెం కుదుటపడింది.

భారతి జడ ముందుకు వేసుకుని చివరలు విప్పి మళ్ళీ అల్లు కుంటూ అటూ ఇటూ తిరగడం ప్రారంభించింది. బల్లమీద తెల్లని కవరు కనిపించేసరికి వెళ్ళి దాన్ని చేతిలోకి తీసుకుంది. ఆ కవరు నాలుగు మూలలా పసుపు పూయబడి ఉంది. లోపల తెల్లని ఆర్టు పేపరుమీద శుభ

లేఖ. మామయ్య కూతురు శశి పెళ్ళి... మొన్న రాత్రి ఇక్కడ శకుంతలకు ఏ ముహూర్తంలో పెళ్ళి అయిందో సరిగ్గా అదే ముహూర్తానికి వంద మైళ్ళదూరంలో మామయ్యగారి ఇంట్లో శశి పెళ్ళి కూడా జరిగి ఉంటుంది. మిస్ శశి...మిసెస్ శశీ రామచంద్రమూర్తిగా మారిపోయింది. పద్నాలుగేళ్ళ శశి...పోయిన సంవత్సరం ఇక్కడికి వచ్చినప్పుడు తన చిన్న చెల్లెలులా తిరిగిన శశి పెళ్ళికూతురై గృహిణి అయింది.

భారతి కవరు మళ్ళా బల్లమీద పడేసి తల్లిని తలుచుకుంది. శశి పెళ్ళి శుభలేఖ రాగానే ముందు తామందరమూ బయలుదేరి వెళ్ళాలని అన్నదామె తల్లి. భారతి ఒక్క క్షణం ఆగి తల వూపుతూ "నేను రానులే అమ్మా" అన్నది. ఆమె ఆశ్చర్యపోయి "అదేమిటే మా తల్లీ, అలా అంటావు? వాళ్ళేమైనా మనకు పరాయివాళ్ళా! శశి పెళ్ళికి వెళ్ళక పోవటం ఏమిటి? పైగా నీకు అదంటే అభిమానం కూడా కదా?" అన్నది. భారతి "అదికాదమ్మా..." అంటూ ఏదో చెప్పబోయి మానుకుని చివాలున లేచి వెళ్ళిపోయింది. ఆమె తండ్రి ఆమె మనసు అర్థంచేసుకుని ఏమీ మాట్లాడకుండా కూర్చుండిపోయాడు. తల్లి విసుగుతో "ఏమిటో బాబూ! ఈ పిల్లతో వేగడం కష్టంగానే ఉంది..." అనుకున్నది. తర్వాత పెళ్ళికి తల్లీ తండ్రీ ఇద్దరూ ప్రయాణమై వెడుతూవుంటే భారతి "నాన్నా! మామయ్య అడిగితే నాకు సెలవు దొరకలేదని సర్దిచెప్పు..." అన్నది. ఆమె తల్లి "సరేలే అమ్మా! నీకు రావటం కష్టమైనంత మాత్రంలో ఏదో ఒక సాకుచెప్పి తప్పుకోవడం మాకు కష్టమవుతుందా ఏమిటి?" అన్నది. ఆమె అమాయకురాలు. ఒట్టి బోళా మనిషి...

భారతికి మనస్సు కలుక్కుమన్నది. కళ్ళ ఎదురుగా మనసును రంపపుకోత పెట్టే దృశ్యం. తన తల్లిని పెళ్ళికివచ్చిన వారందరూ వంతుల ప్రకారం ఎవరికెదురయితే వారు కావాలని పలకరిస్తున్నారు. "ఏవమ్మా! పిల్ల పెళ్ళి ఎప్పుడు చేస్తావు?" అని ఒకరూ, "ఎదిగిన ఆడపిల్లను ఇంట్లో ఇంకా ఎలా ఉంచుకున్నావమ్మా? మా లచ్చికి తొమ్మిదో ఏడు... నా కప్పుడే కాళ్ళక్రింద మంటలు పెట్టినట్టుగావుంది. సంబంధాల కోసం మా వారు కాలికి బలపాలు కట్టుకు తిరుగుతున్నారంటే నమ్ము..." అని

ఒకరూ, "ఎదిగినపిల్ల గుండెలమీద కుంపటేసుమా..." అని ఒకరూ, "ఏది ఏమయినా పెళ్ళి దాని అచ్చటా ముచ్చటా చిన్నతనంలో చేస్తేనేసుమీ ! ఎద్దుల్లాగా ఎదిగాక ఏం పెళ్ళిళ్లు ? ఏం వేడుకలు ?" అని మరొకరూ అంటున్నట్టూ, ఆమె తల్లి ఏ సమాధానమూ చెప్పలేక అవమానంలో ముఖం కందగడ్డకాగా పైకిమాత్రం నవ్వడానికి ప్రయత్నిస్తున్నట్టూ వూహించుకుని భారతి నిలువెల్లా వణికిపోయింది.

తర్వాత ఆమె కాస్సేపు కిటికీప్రక్కనే కుర్చీలో కూచ్చున్నది. మొదటి ఆట సినిమా వొదిలినట్టున్నారు. వీధిలో గణగణమని శబ్దం చేస్తూ ఒకరిక్షా వెళ్ళిపోయింది. అందులో పసిపిల్లవాణ్ణి వొళ్ళో కూర్చోబెట్టుకుని ఒకామె కూచ్చునివుంది. ప్రక్కన ఉన్నది భర్తకాబోలు. అతడేదో చెబుతూవుంటే వింటూ ఆమె నవ్వుతున్నది. తర్వాత ఒక ముష్టి మనిషి కేకవేసుకుంటూ నడిచిపోయింది. ఆ తర్వాత ఒక్క నిముషం సేపు ఎవరూ వీధిలో కనబడలేదు. అంతలో తెల్లని పలుచని చీర కట్టుకున్న పద్దెనిమిదేళ్ల యువతీ, నల్లని సూటువేసుకున్న పాతికేళ్ల యువకుడూ చేతులు పట్టుకుని ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ గలగల నవ్వుకుంటూ నడిచిపోయారు.

భారతి లేచింది. కిటికీ రెక్కలు రెండూమూసి వీధి గుమ్మం దగ్గరికి నడిచింది. వీధి తలుపులు రెండూ బార్లగా తీసింది. గదిలోని కాంతి తలుపులు తియ్యగానే రెండుగీతలు గీచినట్టు పంచలో కొంతమేర పడింది. అందులో తన నీడ...చలిగాలికి పమిటకొంగు మెడచుట్టూ చుట్టుకుని ఆమె తన కదలని నీడను చూసుకుంటూ కొద్దిక్షణాలు లబడిపోయింది.

ఎడమవైపు అరుగుమీద అంతవరకు పడుకునివున్న వ్యక్తి అలికిడివిని తలతిప్పి చూశాడు. అతనికి పంచలో కొంతమేర వెలుగూ, అందులో భారతి నీడా కనిపించి ఉండాలి. భారతి అరుగుమీద ఎవరో ఉండటం గమనించి కూడా 'ఎవరో లెమ్మ'నుకుని వెనుదిరగబోతుండగా ఆ వ్యక్తి త్వరత్వరగా అరుగు దిగివచ్చి "ఏమండీ ... విపరీతంగా దాహం వేస్తున్నది. కాసిని మంచినీళ్లిప్పిస్తారా !" అని అడిగాడు.

భారతి లోపలికి నడిచింది. వంటయింటిలోనుంచి మరచెంబుతో నీళ్లు, ఒక గ్లాసూ తీసుకుని చీరె కొంగు మెడ చుట్టూ చుట్టుకుంటూ ముందుగదిలోకి వచ్చేసరికి ఆ వ్యక్తి గుమ్మంలో నిలబడివున్నాడు. ఆమె కొద్దిదూరంలో నీళ్ల చెంబు ఉంచగా దాన్ని తీసుకుని నీళ్ల గ్లాసులోకి వంచుకొని అతడు మూడుగ్లాసుల నీళ్ళు త్రాగాడు. ఎంతగా దాహంతో బాధపడుతున్నాడో మరి. కన్నెత్తకుండా గడగడ మూడు గ్లాసుల నీళ్ళూ త్రాగేసి అప్పుడు త్రేన్చుతూ "పోయే ప్రాణాలు నిలబెట్టినట్లయిందండీ..." అన్నాడు.

భారతి ఇంతసేపూ ప్రతిమలా కదలకుండా నిలబడిపోయి అతన్ని పరిశీలించింది. అతడు తనకు అపరిచితుడుకాదు. ఎప్పుడో ఏ సందర్భంలోనో తా మిద్దరికీ పరిచయం ఉంది. ఎక్కడ ? ఎప్పుడు ?

అతని గడ్డం మాసివుంది. ధరించివున్న పైజమా, చొక్కా కొద్దిగా మాసివున్నాయి. మెడలో ఒక ముక్కుపొడి రంగు మఫ్లరువుంది. క్రాపు రేగివుంది. రైలు ప్రయాణం చేసివచ్చినవాడిలా ఉన్నాడు. కొంచెం దళసరి అద్దాల కళ్ళజోడును ఒక వ్రేలితో సర్దుకుంటూ మరొక చేత్తో నీళ్ళ చెంబూ, గ్లాసూ ఆమెకు చేరువలో వుంచి అతడు తలయెత్తి చూశాడు.

అతడు ఉన్నట్టుండి "మీ పేరు భారతికదూ ?" అని అడిగాడు. ఆమె తలవూపింది. కాని అతనెవరో ఆమెకు ఇంకా గుర్తురాలేదు.

అత డామెనుచూసి నవ్వుతూ "నన్ను గుర్తుపట్టలేదా ? మీతో బి. ఏ. చదువుకున్నాను. నా పేరు విశ్వేశ్వరరావు... "విశ్వం" అంటూ వుండేవారందరూ..." అన్నాడు.

అప్పుడామె గుర్తుతెచ్చుకుని "ఓహో ! అలా చెప్పండి. మీరు బి.ఎ. మొదటి సంవత్సరంలో నాటకంవేసి కాలేజీ ఉత్తమ నటుడుగా వచ్చారుకూడా...ఇప్పుడు గుర్తు వచ్చింది" అన్నది.

అతడు నవ్వి అందుకే బి. ఎ. పరీక్ష సున్నాచుట్టింది. అప్పు

ఉందరూ నన్నొక గొప్ప యాక్టరనుకునేవారు. ఆ మాట నా ముందే అనేవారుకూడా. దానితో కళ్ళు నెత్తికెక్కి చదువు ధ్యాస ఒదిలి పరీక్షలు చెడగొట్టుకున్నాను" అన్నాడు.

భారతి కుర్చీకొంచెం పక్కకుజరిపి "ఇలాకూర్చోండి" అన్నది. అక్కడ ఒకేకుర్చీ ఉండటంతో సందేహిస్తున్న అతన్నిచూసి "ఫరవా లేదు. మీరు కూర్చోండి...నేనిలా నిలబడి మాట్లాడుతాను. అన్నట్టు మీరిప్పుడేం చేస్తున్నారు?" అని అడిగింది.

విశ్వం కళ్ళజోడు తీసి చొక్కా చివరలతో తుడుస్తూ నెమ్మదిగా "మద్రాసులో ఒక ప్రయివేట్ కంపెనిలో ఉంటున్నాను. నెలకు రెండు వంద లిస్తారు. నా భార్య ఒక స్కూల్లో టీచరు...ఆమెకు నూట అరవై వస్తాయి" అని చెప్పాడు.

తర్వాత ఒక్కక్షణం ఆగి మళ్ళీ "ఈ వూరికి చాలా చిత్రమైన పరిస్థితులలో వచ్చి చిక్కుపడిపోయాను" అంటూ జేబులోనుంచి ఒక ఉత్తరంతీసి "చూడండి 'నవకళా పరిషత్తు' అనే నాటక సమాజం ఉందిట యీ వూళ్ళో. వారు యీరాత్రి నేను వ్రాసిన ఒకనాటకం ప్రదర్శిస్తున్నా మని పిలుచేసుకుని వస్తే ఆనందిస్తామని వ్రాశారు. ఆ వ్రాయడం కేవలం మొక్కు తీర్చుకున్నట్టే ఉందిగాని రచయిత తప్పక వచ్చి చూడాలని వారనుకున్నట్టు తోచడంలేదు. కేవలం ఒక ఉత్తరం వ్రాసి వూరు కున్నారు. ఎంతయినా నాటకం వ్రాసినవాణ్ణికదా? ప్రదర్శన ఎలా ఉంటుందో చూద్దామని కోరిక చంపుకోలేక ఛార్జీలు పెట్టుకుని బయలు దేరి వచ్చేశాను. తీరా స్టేషనులో దిగిన తర్వాత ఆ బాపతు జనాభా ఎవరూ ప్లాట్‌ఫారంమీద కనిపించలేదు. ఇది నాకు కొత్తవూరు. పైగా తెలిసినవారెవరూ లేరు వీధులన్నీ గంటన్నరసేపటినుంచీ తిరిగి తిరిగి ఇక్కడికి చేరుకున్నాను" అన్నాడు.

భారతి "మరి మీ భోజనం..." అంటూవుండగా అతడు అర్ధోక్తిలో ఆపి నవ్వుతూ "ఆ దిగు అక్కరలేదులెండి ... హోటల్లో భోజనం ముగించుకునే వచ్చాను" అని చెప్పాడు. తర్వాత బిడియపడుతూ "మీరు నిలబడే ఉన్నారు" అన్నాడు.

ఆమె "ఫరవాలేదులెండి...అయితే మీరు నాటకాలు వ్రాస్తూ వుంటారా?" అన్నది.

విశ్వం కళ్ళజోడు తీసి మళ్ళీ చొక్కా చివరలలో దాన్ని తుడుస్తూ నెమ్మదిగా "ఆఁ! ఏదోలెండి...ఉబుసుపోకకు తీరిక దొరికినప్పుడు ఏదో గిలుకుతూ ఉంటాను. అవి ఏవయినా పత్రికలలో అచ్చయితే యిలాగే నాటక సమాజాలవారు అప్పుడప్పుడు తాము అక్కడ ప్రదర్శిస్తున్నామనీ, ఇక్కడ ప్రదర్శిస్తున్నామనీ ఉత్తరాలు వ్రాస్తూ వుంటారు. సాధారణంగా నేను ఎక్కడికీ వెళ్ళను. ఇవాళ మీరు ప్రదర్శిస్తున్నామని వ్రాసిన యీ నాటకం నాకు చాలా ఇష్టం...దాన్ని చాలా కష్టపడి వ్రాశాను నేను. అందుకే అది ఎలా ఉంటుందో చూడాలని కోరిక ఆగక ఇలా బయల్దేరివచ్చేశాను" అని చెప్పాడు.

భారతి నవ్వి "బహుశా వాళ్ళు కేవలం ఫార్మల్‌గా ఒక ఉత్తరం వ్రాసి పడేసిఉంటారు. 'మీరు అంతదూరంనుంచి రాబోయారా!' అని అనుకుని ఉంటారు. ఆ ఉత్తరం నమ్ముకుని మీరు వచ్చేశారు ..అన్నట్టు మనం చదువుకునే రోజుల్లో ఫైనలియర్‌లో గోపాలరావనే ఆయన ఉండేవాడు. గుర్తుందా మీకు! ఆ రోజులలో ఆయన పద్యాలూ, కథలూ వ్రాస్తూ ఉండేవాడు. కొన్ని పత్రికలలో అచ్చవుతూ వుండేవి కూడా. ఈ మధ్య ఆయన పేరే కనిపించడంలేదు" అన్నది.

విశ్వం గుర్తుతెచ్చుకుని నవ్వి "ఓహో! మా గోపాలం మాటేనా మీరు చెప్పేది? వాడు మన క్లాస్‌మేట్ మాత్రమేకాక మా రూమ్‌మేట్ కూడా. మీరు చెప్పినట్టు ఆ రోజుల్లో వాడు కథలు మంచివే వ్రాసేవాడు. వాడికిప్పుడు పెళ్ళయింది... ఇద్దరు పిల్లలు కూడా ననుకుంటాను. వాడిప్పుడు రైల్వేలో గార్డు...ఒకసారి ఎక్కడో కనిపించాడుకూడా. ఆ డ్యూటీతోనే వాడికాలం వెళ్ళమారిపోతున్నది. 'ఇక కవిత్వమూ, కథలూ ఎక్కడ? అన్నిటికీ ఒక్క నమస్కారంపెట్టి పూరుకున్నా'నని చెప్పాడు...పాపం..." అన్నాడు.

భారతి నవ్వి పూరుకున్నది. విశ్వం ఒక్క క్షణం ఆగి "అన్నట్టు

మా విషయాలన్నీ రాబట్టారు కాని, మీ సంగతులేవీ చెప్పారుకాదు. మీకు పెళ్లి అయిందా? పిల్లలా?" అని అడిగాడు.

భారతి చీరచెంగు మెడచుట్టూ లాక్కుంటూ నాలుగేళ్ళయిందండీ... ఇంకా పిల్లాపీచూలేరు... వారు ఇక్కడొక దినపత్రికలో సబ్ ఎడిటర్‌గా ఉంటున్నారు. ఇవాళ వారికి నైట్‌డ్యూటీ... పొద్దున ఎనిమిది గంటలకుగాని రారు. మా అత్తగారు పెద్దది. జబ్బు మనిషి. లోపల గదిలో పడుకుని ఉందిప్పుడు. ఆవిడ పెందరాళే నిద్రపోతారు..." అన్నది.

విశ్వం సర్దుకుని కూర్చుని మెడలో మఫ్లర్ పోగులు లాగుతూ అన్నాడు, "ఏమిటోనండి... ఆ చదువుకునే రోజులనాటి జీవితం మళ్లీ రాదు... అప్పుడు ఏ బరువులూ, బాధ్యతలు లేకుండా హాయిగా స్వతంత్రంగా ఉండేవాళ్ళం... అన్నట్టు మీకు మన యింగ్లీషు లెక్చరరు గిరీశంగారు గుర్తున్నారా? ఆయన అమెరికా వెళ్ళారట్ట యీ మధ్య... ఎకనమిక్స్‌లో ఒక నల్లని లావుపాటి లెక్చరరుండేవాడు... ఆయన పేరు గుర్తురావడంలేదు... ఆయన సముద్ర స్నానానికి వెళ్ళి మునిగి చచ్చిపోయాడు."

భారతి ఏమీ మాటాడలేదు. నెమ్మదిగా "మీతో కలిసి కాలేజీకి వస్తూవుండేది కోమలి... ఇప్పుడెక్కడుంది?" అని అడిగాడు.

భారతి కదిలింది. లోపలి గదిలోకి నడుస్తూ "మీకు తెలీదా? ఆ అమ్మాయికి రెండేళ్ళ క్రింద పెళ్లయింది. కాని, మూడు నాలుగు నెలల క్రిందటనే నేనొక విషయం విన్నాను..." అన్నది. ఆమెకు అన్నీ విషయాలూ గుర్తువచ్చాయి. కాలేజీలో చివరి సంవత్సరంలో ఈ విశ్వం, ఆ కోమలి అనబడే పిల్లను ఎన్నో విధాలుగా బాధపెట్టాడు. ఆ పిల్ల కుందనపు బొమ్మలా ఉండేది. సన్నగా, తెల్లగా, నడయాడుతున్న వెన్నెల తీగలా ఉండేది. మెత్తగా మధురంగా మాట్లాడేది. ఆ పిల్ల నితడు ప్రేమించాడుట... అలా అని ఉత్తరాలు వ్రాశాడు. వెంటబడి గోలచేశాడు. నలుగురిలో అప్రతిష్టపాలుచేశాడు. ఇప్పుడా

దీనురాలి గురించి వాకబు చేస్తున్నాడు. ఇతనికేం? మహారాజులాగా పెళ్లి చేసుకుని మంచి ఉద్యోగం చేస్తూ సుఖపడుతున్నాడు. పాపం! ఆ అమ్మాయిగతి చూడరాదూ, ఏమయిందో!

ఒక్క క్షణం ఆగి లోపలినుంచే పెద్దగా "ఆమె ఆత్మహత్య చేసుకుందని విన్నాను. ఎందుకో మరి..." అన్నది. ఆ మాటలు అని కొద్ది క్షణాలాగి ముందు గదిలోకి వచ్చింది. విశ్వం కుర్చీలో దిగాలుపడి నట్టు కూర్చుని ఉన్నాడు. అతని చేతిలో కళ్ళజోడున్నది. కళ్ళలో ఎక్కడో నీటిపొర ఒకటి దీపపు వెలుగులో తళుక్కుమన్నది. ఒక్క నిముషం తర్వాత విశ్వం సర్దుకుని కూర్చుని మళ్ళీ కళ్ళజోడు తుడుచు కున్నాడు. ఏమీ మాట్లాడలేదు.

బల్లమీది అలారం గడియారం టిక్కుటిక్కు మంటున్నది. చుట్టుపక్కల అంతా ప్రశాంతంగా నిశ్శబ్దంగా ఉంది. చల్లనిగాలి తెరల తెరలుగా వీస్తున్నది.

భారతి మళ్ళీ "కోమలి ఎంత మంచి కథలు వ్రాసేదో తెలుసా? ఎన్నోసార్లు పత్రికలలో ఆమె వ్రాసిన కథలు చదివాను. అన్నీ కొత్త కొత్త కథలు... ఆమెను నే నెప్పుడూ మళ్ళీ కలుసుకోలేదనుకోండి... అయినా ఆమె పేరుతో అచ్చయిన ప్రతికథనూ నేను మళ్లీ మళ్లీ చది వాను. ఎన్నోసార్లు ఆమెకు ఉత్తరాలు వ్రాద్దామనుకున్నాను. కాని ఆమె అడ్రసు తెలియలేదు.. అయినా నాలుగైదుసార్లు పత్రికల వారికి ఉత్త రాలు వ్రాసి రీడైరక్టుచేయమని కోరాను. వారలాచేసే ఉంటారు. అయినా నాకు సమాధానం రాలేదు ఎందుచేతనో మరి" అంటూ ఆగి మళ్లీ "పైగా మరొక చిత్రం ఏమిటంటే ఆమె వ్రాసిన ప్రతి కథలోనూ ఏదో ఒక పాత్ర ఆత్మహత్య చేసుకుంటుంది. ఒక్కొక్క కథలో ఒక్కొక్క పాత్ర ఒక్కొక్క పద్ధతిలో ఆత్మహత్య చేసుకుంటుందన్నమాట. ఒక కథలో నాయకుడు రైలు క్రిందపడి ఆత్మహత్య చేసుకున్నాడనుకోండి. మరో కథలో మరో అమ్మాయి ఉరిపోసుకు చచ్చిపోతుంది... మరో కథలో వంటినిండా కిరసనాయిలుపోసుకుని నిప్పంటించుకోవడం... అలా అన్నమాట..." అన్నది.

విశ్వం ఉదాసీనంగా నవ్వి వూరుకున్నాడు. భారతి మళ్ళీ ఏమీ మాట్లాడలేదు. క్రమంగా నిముషాలు గడుస్తున్నాయి. సెకండ్ల ముల్లు టిక్కుటిక్కుమని ధ్వనిచేస్తూ నిర్విరామంగా ముందుకు పరుగెత్తి పోతున్నది.

భారతికి నిద్రవస్తున్నది. ఆమె లేచి "మీరు ఈ గదిలోపడు కోండి. నేను వెనకవైపు మా అత్తగారి గదిలో పడుకుంటాను" అన్నది.

విశ్వం "మీకు ఇబ్బంది కలిగిస్తున్నట్టున్నాను. ఓ చాప ఇస్తే చాలు. ఇలా పరుచుకుని పడుకుంటాను" అన్నాడు.

భారతి చాప పరిచి ఒక దిండు పడేసి ముందు తలుపు గడియ వేసి లోపలికి వెళ్ళబోతూ "మళ్ళీ మీకు దాహమవుతుందేమో, యీ నీళ్ళ చెంబు ఇక్కడే ఉంచుతున్నాను" అని చెప్పింది. విశ్వం చాపమీదకూర్చుని ఉండి తలవూపాడు.

మరొక పావుగంట తర్వాత భారతి లోపలి గదిలో వెచ్చగా దుప్పటిలో ముడుచుకు పడుకుని ఉంది. తాను ఒంటరిగానే ఉన్నప్పటికీ ఇప్పుడాట్టే భయమేమీలేదు. తాను కల్పించిన అత్తగారి పాత్ర ఇప్పుడు తనకు రక్షణ ఇస్తుంది. హాయిగా నిశ్చింతగా నిర్భయంగా నిద్ర పోవచ్చు...ఆమెకు మాగన్నుగా నిద్రపడుతున్నది.

నిద్రలో పంచరంగుల కల...విశాలమైన ఆవరణలో వెనకగా ముచ్చటైన యిల్లు...ఆవరణ నిండా రంగు రంగుల పూలచెట్లు...నేల మీద ఒత్తుగా అందంగా పట్టువలె పెరిగి ఉన్న మృదువైన పచ్చిక... దానిమీద ఖరీదైన తివాచీ పరుచుకుని కూర్చుని తాను ఏదో చదువు కుంటున్నది. ఆమె భర్తపక్కనే వెల్లికిలాపడుకుని గుండెలమీద రెండేళ్ళ పసివాణ్ణి కూర్చోబెట్టుకొని ఆడిస్తున్నాడు. తాను చదవటం ఆపి తల పైకెత్తి చూసేసరికి ఆకాశంలో రంగురంగుల ఇంద్రధనుస్సు...పసి పిల్లలా కువకువలాడుతూ భర్తను చేత్తోతట్టి "అదిగో... అటు చూడండి..." అన్నది తాను.

దాని వెంటనే మరొక కల...దిగంతాలను చుంబిస్తూ రొద చేస్తున్నది సముద్రం. తెల్లని వెండిపళ్ళెంలా వెలుగులను చిమ్ముతున్న చంద్రబింబం ఆ అనంత జలరాశికి చిత్ర విచిత్రమైన రంగులను వేస్తున్నది. తీరాన తామిద్దరూ ఎన్నో జన్మలనాటి ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ అటూ యిటూ తిరుగుతున్నారు.

ఆ తర్వాతకూడా అదే తరహా కలలు భారతికి బోలెడువచ్చాయి. అయితే తెల్లవారి మెలకువ వచ్చినతర్వాత అవి అన్నీ గుర్తులేవు. మొదటి రెండు కలలుమాత్రం ఎన్నాళ్ళకూ మరపురానంత గాఢంగా మనస్సుకు హత్తుకుపోయాయి.

ఆమె లేచి కొనగోళ్ళతో తల సవరించుకుంటూ ముందుగది గుమ్మం దగ్గరకువచ్చి చూసేసరికి విశ్వం ఇంకా నిద్రపోతూనే ఉన్నాడు. అతని కళ్ళజోడు కుర్చీమీద వుంది.

భారతి తనలో తాను నవ్వుకుని లోపలికి వెళ్ళి పనులలో నిమగ్నమైపోయింది. కాఫీ కుంపటి వెలిగించి నీళ్ల పడేసి ముఖం కడుక్కునేసరికి ఎండవచ్చింది. నీళ్ళు దింపి కాఫీపొడివేసి పాలగిన్నెను కుంపటిలోవుంచి ముందుగదిలోకి వెళ్ళి చూసింది. విశ్వం అప్పుడే లేచాడు కాబోలు. కళ్ళజోడు తడివి తీసుకుని మొహానికి తగిలించు కున్నాడు. ముందు ఆమెనుచూసి నవ్వి తర్వాత టేబిల్‌మీద గడియారం వైపు చూపులు తిప్పి "అరె...చాలా టైమయిపోయిందే...నాకు ఎనిమిది గంటలకు బండి..." అన్నాడు.

భారతి నీళ్ళచెంబూ పళ్ళపొడి ముందుగదిలోకి తెచ్చివుంచి "ఇంకా వ్యవధి ఉందిలెండి...మొహం కడుక్కుని కాఫీ తీసుకుని వెడుదురుగాని..." అన్నది.

అతడు కళ్ళజోడు మర్శీ కుర్చీమీదవుంచి పళ్ళపొడి కొద్దిగా చేతిలో వేసుకుని నీళ్ళచెంబు తీసుకునివెళ్ళి అరుగుమీద కూర్చుని ముఖ ప్రక్షాళనం ప్రారంభించాడు.

భారతి కాఫీ కలిపి తాను తాగి అతనికోసం కప్పులో పోసి సిద్ధంగావుంచి తనలో తాను "మరి...అత్తగారికో కాఫీ...పాపం అసలే జబ్బు మనిషి...పైగా పెద్దతనంకూడా" అనుకుని నవ్వుకొంది. తర్వాత "ఎనిమిది గంటలకు శ్రీవారు వస్తారుగా. అప్పటికి సిద్ధంగా కాఫీ ఫ్లాస్కులో ఉంచవద్దూ" అనుకుని మళ్ళీ నవ్వుకుంది.

విశ్వం మాసిన చేతిరుమాలుతో మొహం తుడుచుకుని కళ్ళజోడు పెట్టుకుని కుర్చీలో కూర్చుని ఉన్నాడు. భారతి కొంగు మెడచుట్టూ చుట్టుకుని కాఫీతెచ్చి అతని చేరువలోవుంచి "తీసుకోండి" అన్నది. అతడు బిడియపడుతూ కప్పుచేతిలోకి తీసుకున్నాడు. తర్వాత ఒక్కసారి కాఫీ చప్పరించి తల పైకెత్తి చూసి "మరి...కాఫీమీకో" అన్నాడు.

"నే నిప్పుడు తాగనులెండి...ఎనిమిది దాటిన తర్వాత వారు డ్యూటీనుంచి వస్తారు. అప్పు డిద్దరమూ ఒక్కసారే తాగుతాము. ఏమిటో! ఇన్నేళ్ళనుంచీ అలాగే అలవాటయిపోయింది...మా అత్తగారికి ఇప్పుడే ఇచ్చివచ్చాను..." అని చెప్పింది, భారతి మళ్ళీ పమిటచెంగు మెడచుట్టూ లాక్కుంటూ. పైగా ఒక్కక్షణం ఆగి "మీరు ఎనిమిది గంటల బండికే వెళ్ళిపోవాలంటున్నారు. లేకపో ఆయన రాగానే పరిచయం చేదును' అన్నది.

విశ్వం ఖాళీకప్పు క్రిందవుంచుతూ "ఆఁ! ఎందుకులెద్దురూ... ఇప్పటికే మీకు చాలా యిబ్బంది కలిగించాను. ఇక సెలవు తీసుకుంటాను" అంటూ లేచాడు. జేబులో చెయ్యిపెట్టి కొన్ని చిల్లర రూపాయినోట్లు యివతలికి తీసి లెక్కపెట్టుకుని 'చాలు' అని గొణుక్కున్నాడు. తర్వాత చేతులు జోడించి 'సెలవు' అన్నాడు. ఆమెకూడా తలవూపుతూ చేతులు జోడించింది.

అతడు నెమ్మదిగా అడుగులువేస్తూ వీధివాకిలిదాకా వెళ్ళి ఎందుకో ఒక్క క్షణం నిలబడిపోయాడు. భారతికి అనుమానంవేసింది. అతడు తనను గురించి తాను కల్పించిచెప్పినవన్నీ నమ్మినట్టు నిదర్శనం ఏమిటి? వెనుదిరిగివచ్చి "ఎందుకలా అబద్ధాలు చెప్పారు? నే నంత నమ్మదగని

వాణ్ణి, దుర్మార్గుణ్ణి అనుకున్నారా?" అని అడుగుతాడేమో ! ఒకవేళ నిజంగా అలా అడిగితే ఏంచెప్పాలో తోచలేదామెకు.

విశ్వం వెనుదిరిగి ఆమెవంక చూశాడు. అతని కళ్ళు నీళ్ళతో నిండుతున్నాయి. అతడు ఒక్క అడుగు ముందుకువేసి ఆర్ద్రస్వరంతో "ఈ దిక్కులేని వూళ్ళో నన్ను సోదరిలా ఆదరించారు మీరు. మీకు నన్ను గురించి అంతా నిజమే చెప్పడం ముఖ్యమనిపిస్తున్నది. ఇన్నేళ్లుగా ఎందరిదగ్గరో ఎన్నో అబద్ధాలు చెప్పాను. ఎంతో మందిని కేవలం మాటలు చెప్పి మోసం చేశాను. కాని మీ దగ్గర అలా చేయలేకపోతున్నా నెందుకో! మీరు నన్ను ఆదరించడమేగాక కోమలిని గురించిన సమాచారం అందించి పుణ్యంకట్టుకున్నారు. నేనూ, మాఆవిడ ఉద్యోగాలు చేస్తున్నామని చెప్పాను కదూ? అది అబద్ధం. నా కసలు పెళ్ళికాలేదు. నేను చేసుకోలేదు. కోమలికి నేను ద్రోహం చేశాననిపించింది. ఆమెను నేను మనసారా ప్రేమించాను. అది వాస్తవం. ఆమె ప్రేమను కూడా పొందాను. కాని అదే నా దౌర్భాగ్యం. అనేక కారణాలమూలంగా ఆమెను మాత్రం పొందలేకపోయాను. ఆమెకు పెళ్ళి అయిందనీ, ఆత్మహత్య చేసుకుందనీ మొదటిసారి ఇదే నేను వినటం...నాకింతవరకూ ఆమెను గురించిన ఏ వివరమూ తెలియదు. నమ్మండి" అంటూ ఆగాడు. మళ్ళీ తన్ను తాను సంబాళించుకుని "కోమలిని పొందలేని నా బలహీనతకు ప్రాయశ్చిత్తంగా ఆత్మహత్య చేసుకుందామనుకున్నాను. ఎన్నోసార్లు ప్రయత్నించానుకూడా. కాని ధైర్యం చాలలేదు. నాకులేని సాహసం కోమలికున్నది. అందుకే ఆమె అలా దాటిపోయింది. ఆత్మహత్య చేసుకుందామనిపించినప్పుడల్లా కథవ్రాసి అందులో నన్నొక పాత్రలో వూహించుకుని ఆ పాత్ర ఆత్మహత్యకు పాల్పడేట్టుచేసి తృప్తిచెందేవాణ్ణి. మీరు కోమలి పేరుతో చదివిన కథలన్నీ నేను వ్రాసినవే. మీ ఉత్తరాలు కూడా నాకుచేరాయి..." అన్నాడు.

భారతి గుమ్మాని కానుకుని నిలబడి వింటున్నది. అతడు మళ్ళీ "నేను చేసే ఉద్యోగం ఏమిటో చెప్పనా ? చాలా సినిమాల్లో యుద్ధ దృశ్యాలుంటాయి చూడండి. రాజులతోపాటు వాటిలో వెనక పోట్లాడుతూ

ఉండేందుకు ఎందరో మనుషులు కావలసివస్తారు. ప్రతి సినిమాలో ఆ సీనులలో రెగ్యులర్‌గా పాల్గొనేవాళ్ళలో నేనొకణ్ణి. రోజూ ఇంతని జీతం ఇస్తారు. అది నా ఉద్యోగం. ఏదో అలా గడిచిపోతున్నది జీవితం..." అంటూ కళ్ళు తుడుచుకుని ఎందుకో అన్ని వాస్తవ విషయాలూ మీముందు మనసు ప్పి చెప్పాలనిపించింది. చెప్పాను. మన్నించండి...వీటిని మనసులో ఉంచుకోకండి. చక్కగా వివాహం చేసుకుని సుఖంగా ఉన్నారు. మీమనసులో ఈ క్షుద్ర విషయాలు నింపటం నా అభిమతం కాదు...సెలవు" అని గిరుక్కున వెనుదిరిగి పెద్ద పెద్ద అంగలువేస్తూ వీధిలోకి వెళ్ళిపోయాడు.

తెల్లబోయి శిలా ప్రతిమలా నిలబడిపోయింది మిస్ భారతి బి. ఏ.

(1965 ఫిబ్రవరి – భారతి)

# వన్ వే ట్రాఫిక్

"ఏమండీ తాతగారూ! ఐదున్నర అవుతున్నది. మధ్యాహ్నం వస్తానన్నారుగా? మరి త్వరగా బయలుదేరండి" అన్నాడు మధు గుమ్మంలో నుంచుని. అతడు తెల్లని ఫ్యాంటూ, షర్టూ ధరించి 'ట్రిమ్'గా తయారై వచ్చాడు.

అతని మాటలు విని, అరవైయేళ్ళ ముసలాయన, క్రింద చాప మీద కూర్చుని పాలు చల్లారుస్తున్న కోడలివంక చూశాడు. ఆమె తల పైకెత్తి కనుబొమలు ముడిచి "ఎక్కడికో ప్రయాణం కట్టినట్టున్నారే. సినిమాకా ఏమిటి? నిన్న డాక్టరు ఏం చెప్పాడో గుర్తులేదూ? మీ వంటికి చలిగాలి అసలు తగలనేకూడదని చెప్పాడుగా!" అన్నది. ఆయన ఏమీ మాట్లాడలేదు. మధు మాటిమాటికీ రిస్టువాచీవంక చూసుకుంటూ తొందర పడుతున్నాడు. ఆయనకేమీ తోచలేదు. దీనంగా కోడలివంక చూసి, "కాదమ్మాయీ. ఇవాళ మధ్యాహ్నం ఏవో మాటల సందర్భంలో మధు 'ఇవాళే కొత్త సినిమా విడుదల అయింది. నేను వెళదామనుకుంటున్నాను' అన్నాడు. 'మీరూ రాకూడదండీ తాతగారూ!' అని అడిగాడు కూడా. నేనేమో నువ్వు అడ్డుచెప్పవులే అని భరోసాతో 'సరే వస్తాన'ని అన్నాను" అన్నాడు. ఆమె పాలగ్లాసు మామగారికి అందిస్తూ "ఏమో! బాబూ! మీది అసలే గాజుకాయవంటివళ్ళు. పైగా పెద్దతనం. నాకసలు ఇష్టంలేదు" అన్నది. ఆయన ఏమీ మాట్లాడలేకపోయాడు. కొద్దికొద్దిగా పాలు చప్పరిస్తూ అలాగే కూర్చున్నాడు. ఆమె స్నానాల గదిలోవున్న భర్తకు తువ్వాలు యిచ్చేందుకు లోపలికి వెళ్ళింది. గుమ్మం అవతలినుంచి మధు "తాత గారూ! త్వరగా కానివ్వాలి. అసలే టిక్కెట్లు దొరకవేమోనని

అనుమానంగావుంది. మీరు ఆలస్యంచేస్తే ఏమీ లాభంలేదు. బుక్కింగు కట్టేస్తారు" అంటున్నాడు

ముసలాయన పాలగ్లాసు క్రిందపెట్టి తల పైకెత్తేసరికి మొహం తుడుచుకుంటూ కొడుకు లోపలిగదిలోనుంచి హాల్లోకి వచ్చాడు. ఆయన నెమ్మదిగా "ఒరే సారథీ" అని పిలిచాడు. అతడు పిలుపువిని "ఏం నాన్నా ? అంటూ దగ్గరికి రాగానే నెమ్మదిగా "మన ఇల్లుగలవారి అబ్బాయి సినిమాకు ఁడుతూ నన్నూ రమ్మన్నాడురా. నాకోసం వచ్చి ఁదుగదిలో కాచుకునివున్నాడు. "అమ్మాయేమో 'వీల్లేద'ని అంటున్నది. నువ్వొకాస్త చెప్పిచూడరా. ఈ ఒక్కసారికే. ఇక ఎప్పుడూ అడగను" అన్నాడు.

సారథి నవ్వి, "మీరు మరీ పసిపిల్ల లవుతున్నారేం ! ఏమీ ఫరవాలేదు, మీరు వెళ్ళండి. దానికి నేను చెబుతాన్లెండి' అన్నాడు. ముసలాయన ఉత్సాహంగా లేచి కళ్ళజోడు సవరించుకుని, చెప్పులు తొడుక్కుని, చేతికర్రకోసం వెదుకుతూవుండగా కోడలు ముందుగది లోకి వచ్చింది. ఆమె అంతా అర్థంచేసుకుని, "అయితే నేను చెప్పినమాట వినరన్నమాట. వెళ్ళితీరవలసిందేనా ?" అని అడిగింది. ముసలాయన ఆగిపోయాడు. సారథి నవ్వి, "పోనివ్వవే పాపం ! ఎంత సరదా పడుతున్నారో ! ఈ వొక్కసారికేలే" అన్నాడు. ఆమె భర్తకెదురు చెప్పలేక "సరేబాబూ ! మీ యిష్టం. నా కెందుకు మధ్య నిష్ఠూరం" అంటూ చేతికర్ర వెదికి మామగారికి అందించింది.

ఆయన ఉత్సాహంగా నడుస్తూ, ముందుగదిలోకి వచ్చేసరికి మధు లేచి "అమ్మయ్య ! వచ్చేశారా ! యింత ఆలస్యం చేశారేం తాత గారూ? మనం త్వరగా నడవాలి. ఇప్పటికే టిక్కెట్లిస్తూవుంటారు. పైగా కొత్త సినిమా. జనం విపరీతంగా వుంటారు కూడా" అంటూ నడవటం ప్రారంభించాడు. నడుస్తున్నంతసేపూ మధు కొత్తగా విడుదల అయిన ఆ సినిమా తీసినవారి గొప్పదనమూ, ఇంతకుముందు వారు తీసిన సినిమా లన్నీ వరుసగా రజతోత్సవాలు జరుపుకున్న వివరమూ, అందులో నటీ నటుల గొప్పదనమూ వివరిస్తూనే వున్నాడు. ఒక సెంటరులోకి రాగానే

ముసలాయన ఆగి మధును భుజంతట్టి ఆపి, "ఇంకా ఎంతదూరం ఆ హాలు ?" అని అడిగాడు, ఆయాసంతో. మధు "ఇంకెంతదూరమండీ, వచ్చేశాం, మరో పది నిముషాలు నడిస్తే చాలు" అన్నాడు. ముసలాయన పై పంచతో మొహం తుడుచుకుంటూ, "నేనిక నడవలేను. రిక్షా ఒకటి మాట్లాడుకుందాం నాయనా ?" అన్నాడు. మధు, "అదేమిటండీ ? ఇక్కడినుంచి 'వన్ వే ట్రాఫిక్' రిక్షాలో అయితే ఎంతో చుట్టుతిరిగి పోవాలి. నడిచిపోతే అర మైలుకూడా లేదు" అన్నాడు. ముసలాయన "అయినాసరే. నేను నడవలేను బాబూ ! అదుగో ఆ రిక్షాను పిలిచి మాట్లాడు" అన్నాడు. మధు వాచీవంక అనుమానంగా చూసి, తల పంకించి "ఆల్ రైట్! అంత నడవలేనప్పుడేం చేస్తాం? మీ యిష్టప్రకారమే కానివ్వండి" అంటూ రిక్షాను పిలిచి 'ఎక్కండి' అన్నాడు.

రిక్షా నడుస్తున్నంతసేపూ మధు ఆదుర్దాగా వాచీ వంక చూసుకుంటూనే వున్నాడు. వుండి వుండి "ఏమోనండీ తాతగారూ ! నాకు సినిమా అందుతుందనే నమ్మకం లేదు. మనం వెళ్ళేసరికి 'హౌస్‌ఫుల్' అని బోర్డు తగిలించి వుంటా రనుకుంటాను" అంటున్నాడు. అతని ఆదుర్దాచూస్తే ముసలాయనకు నవ్వు వచ్చింది.

సినిమాహాలు లైట్లతో దేదీప్యమానంగా వెలిగిపోతున్నది. వారు రిక్షాలోనుంచి దిగేసరికి టిక్కెట్లు దొరకని జనం కొంత మంది ఇళ్ళకు తిరిగిపోతున్నారు. గేటు తలుపుమీద "టిక్కెట్లు లేవు" అని బోర్డు తగిలించబడి వుంది. ముసలాయన మధును వారించి, రిక్షావాడికి తాను డబ్బులిచ్చి పంపాడు. మధు దీనంగా "చూశారా తాతగారూ ! నే నప్పుడే అనుకున్నాను. ఈ సినిమా ఎప్పుడెప్పుడు విడుదల అవుతుందా అని జనం ఎదురుచూస్తున్నారు. మనం కాస్త ముందుగా వచ్చివుండవలసింది. ఇప్పుడేమిటి చెయ్యడం ?" అన్నాడు. ముసలాయన లైట్లవంకా, సినిమా హాలుముందున్న నిలువెత్తు బొమ్మలవంకా చూసి, కాస్సేపాగి "చూడు మధూ ! ఇవాళ మా కోడలు చాలా కష్టంమీద వొప్పుకుంది. మళ్ళీ అన్నప్పుడల్లా నన్ను రానివ్వదు. కాబట్టి దగ్గర్లో, మరేదైనా సినిమా వుందేమో చూడు. మొదలు పెట్టినా ఫరవాలేదు" అన్నాడు.

మధు ఆలోచించి "ఈ ప్రక్కనే ఈశ్వర్ టాకీసు వుంది. అక్కడ యిప్పుడే సినిమా ఆడుతున్నదో తెలియదు. ఆ హాల్లో ఎప్పుడూ యిరవై పాతికేళ్ళనాటి తుక్కు ఫిలుములు వేస్తూ వుంటారు. ప్రేక్షకులకోసం ఎదురుచూస్తూ వుంటారు. పదండిపోదాం" అంటూ దారి తీశాడు. ముసలాయన చేతిలో కర్రతో అతన్ని అనుసరించాడు.

వారిద్దరూ మరొక అయిదారు నిముషాలు నడిచి ఆ హాలు చేరుకున్నారు. హాలుపైన ఒక్కలైటు తప్ప మరేమీ అలంకరణలులేవు. అక్కడకూడా సినిమా మొదలుపెట్టారు. మధు టిక్కెట్లు తీసుకుంటూ "ఎంతసేపయింది ఆట ప్రారంభించి!" అని అడిగాడు. "అబ్బే ఎంత సేపో ఎక్కడండీ. అయిదు నిముషాలుకూడా కాలేదు" అన్నాడు.

ఇద్దరూ హాలు లోపలికివెళ్ళి కూర్చున్నారు. హాలు లోపల పంకాలు కూడా ఆడటంలేదు. అన్ని తరగతుల ప్రేక్షకులూ కలిసి పాతిక మంది అయినా వుంటారో, లేదో! ముసలాయన రెండుమూడు నిముషాలు చూడగానే గంభీరంగా మారిపోయాడు. ఆయనకు గుర్తువచ్చింది. ఆ సినిమా ఇరవై అయిదు సంవత్సరాలనాటిది. అందులో కథానాయకుడి పాత్ర నిర్వహించింది తనే. తాను వేసిన నాలుగైదు సినిమాలలోను ఇందులో మాత్రమే ప్రముఖపాత్ర లభించింది. తను వేసిన మిగిలిన పాత్రలు చాలా చిన్నవి. ఇది ఒక జానపద సాహసిక గాథ. అందులో తానొక మామూలు సిపాయి. రాజకుమారిని ప్రేమిస్తాడు. రాజకుమారి కూడా తనను ప్రేమిస్తుంది. రాణికీ, రాజుకూ ఇది కంటకప్రాయంగా వుంటుంది. వారా సిపాయిని అనేక విధాలుగా హింసిస్తారు. రాణీగారు వెర్రివాడైన తన తమ్ముడికి రాజకుమారినిచ్చి పెళ్ళిచెయ్యాలని పట్టుదలతో వుంటుంది. ఇంతలో కథలో మరొక మాంత్రికుడు వస్తాడు. చివరకు కథానాయకుడు మాయలనూ, మంత్రాలనూ జయించి, మొసళ్ళతోనూ, పులులతోనూ పోరాడి మాంత్రికుణ్ణి చంపి ప్రేయసిని దక్కించుకుంటాడు. ఆ రోజులలో ఆ సినిమా విపరీతంగా ప్రజాదరణపొంది లక్షలకొద్దీ లాభాన్ని తెచ్చి పెట్టింది. ఆ సినిమా తీసిన ఒకరెడ్డి ఇప్పుడేమయినాడో తెలియదు. ఇప్పుడది పాతబడిపోయి అక్కడక్కడ తెగిపోతున్నది.

మాటలు సరిగా వినిపించటంలేదు. ఫిలుము కళాకాంతులు కోల్పోయి బాధగా నడుస్తున్నది. ముసలాయన సినిమా చూస్తూనే అంతా జ్ఞాపకం తెచ్చుకున్నాడు. రాజు రాణి పాత్రలను నిర్వహించిన వారిద్దరూ ఏమై పోయారో తనకు తెలియదు. రాజు పాత్ర ధరించినవాడు చాలా దుర దృష్టవంతుడు. అతని ఇంటిచుట్టూ ఎప్పుడూ అప్పులవారు కాచుకుని వుండేవారు. సినిమాలో 'విలన్' వేసినవాడు తెరమీద ఎంత క్రూరంగా, భయంకరంగా స్వార్థపరుడుగా కనిపించేవాడో, నిజజీవితంలో అంతసాధు శీలి, దయార్ద్ర హృదయుడు, దాత. 'చదువుకుంటున్నాను బీదవాణ్ణి' అనీ, 'జబ్బుగావుంది మందుకు డబ్బులేదనీ' 'ఇళ్లు కాలిపోయాయి. నిలువనీడలేదనీ' 'వరదబాధితులకు సాయం చెయ్యండి' అనీ ఎప్పుడూ ఎవరో ఒకరు అతని వెంట తిరుగుతూవుండేవారు. ఎవరినీ కాదనేవాడు కాదు. ఇచ్చే సమయంలో చేతి కెంతనోటు వచ్చేదీ గమనించేవాడుకాదు. అందువల్ల ఎంత డబ్బు సంపాయించినా అతడు ఆస్తిపరుడు కాలేక పోయాడు. సినిమా పరిశ్రమలో ఎక్కువ అనుభవం వున్నందువల్లను, చాల సినిమాలలో రకరకాలపాత్రలు నిర్వహించినందువల్లనూ అతడు తర్వాత ఎక్కడో రైలు ప్రమాదంలో మరణించినప్పుడు పత్రికలలో చిన్నఅక్షరాలతో అతని మరణవార్త అచ్చువేసి సంతాపం ప్రకటించారు. రాణిగారి తమ్ముడిది హాస్యపాత్ర. ఆ సినిమా కొత్తగా విడుదల అయిన రోజుల్లో ప్రేక్షకులను ఆ పాత్ర కడుపుబ్బ నవ్వించేది. ఆ వేషం వేసిన వాడు నిజజీవితంలో ఎప్పుడూ గంభీరంగా, నిరుత్సాహంగా, నీరసంగా వుండేవాడు. కదిలిస్తే వేదాంతం మాట్లాడేవాడు. అతడు తరువాత ఎప్పుడో "నా చావు కెవరూ బాధ్యులుకారు" అని ఉత్తరం వ్రాసిపెట్టి తన గదిలో దూలంనుంచి ఉరిపోసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. రాజకుమారిగా నటించిన ప్రమీల అనే ఆమెకిప్పుడు యాభైఏళ్ళువుంటాయి. ఆమె కిప్పుడు ఏడెనిమిదేళ్ళ మనవరాలుతప్ప మరెవరూలేరు. ఇంటి పెరటిలోవున్న కరివేపాకుచెట్టు ఆమెకు జీవనాధారం. ప్రతిరోజూ సాయంకాలంపూట కరివేపాకు కోసి కట్టలుకట్టి ఉదయమే మనవరాలిచేత ఒక బుట్టతో ఇంటింటికీ పంపేస్తుంది. వారు ఒక్కొక్క కట్ట తీసుకుని కాసిని బియ్యం ఆ బుట్టల్లో వేస్తారు. సినిమాలో తాను పాడిన ప్రేమ

పాటలకు ప్లేబ్యాక్ పాడినవాడు యిప్పుడు భీమవరంలో వుంటున్నాడు. నాలుగేళ్ళ క్రిందట ఒకసారి ఏదో పనిమీద ఆ వూరు వెళ్ళినప్పుడు అతని యింటికి వెళ్లాను. అతడప్పుడు గ్రామఫోనుమీద తాను పాతికయేళ్ళ క్రితం పాడిన పాటనే పెట్టుకుని వింటూ కూర్చునివున్నాడు. ఆ రికార్డు పూర్తిగా అరిగిపోయి అసహ్యంగా వినిపిస్తున్నది. తనను చూచి అతడు ఆదరించి మాటల సందర్భంలో తన యింట్లో ఎవరికీ గ్రామఫోను అంటే యిష్టం లేదనీ, రేడియోవచ్చాక దాన్ని పూర్తిగా మూలపారేశారనీ, తానుమాత్రం మరెవరూ లేకుండాచూసి, అప్పుడప్పుడు ఇలా వింటూవుంటాననీ చెప్పాడు.

కథలో తనకూ, దొంగల నాయకుడికీ మధ్య ముష్టియుద్ధం జరుగుతున్నది. ఆ సన్నివేశంలో ముసలాయన రక్తం పరుగులెత్తింది. ఆయన ఆవేశంతో చేయివిసిరి, కుర్చీదెబ్బతగలగా 'అబ్బా' అనుకున్నాడు బాధగా. మధు ఆశ్చర్యపోయి "ఏమిటి తాతగారూ ?" అని అడిగాడు. ముసలాయన, "అబ్బే, ఏమీలేదు" అన్నాడు. మధు కాస్సేపాగి "ఇవాళ పొద్దున్నే లేచి ఎవరిమొహం చూశామో, యీ తుక్కు సినిమాకు రావలసి వచ్చింది. అయినా ఏం సినిమాలండీ...ఆ పాత్రలూ, కథా అంతా అవాస్తవికంగా అసహజంగా వున్నాయి" అన్నాడు. ముసలాయనకు చాలా మనస్తాపం కలిగింది. ఆయన నెమ్మదిగా "నువ్వలా అనకోయ్ ! ఆ రోజుల్లో వాళ్ళుకూడా తమకున్న అవకాశంలో బాగానే సినిమాలు తీశారు"...అంటూవుండగా ఉన్నట్టుండి ఫిలిమ్ ఆగిపోయింది. లైట్లు ఒక్కసారి వెలిగి, మళ్ళీ ఆరిపోయాయి. కరెంటుపోయింది. ఉన్న కొద్ది మందిలోనూ ఎవడో ఈలవేశాడు. మధు లేచి బయటికి వెళ్ళాడు.

ముసలాయన అలాగే కూర్చున్నాడు. ఆయనకు దాదాపు పది రోజుల క్రిందటజరిగిన ఒకచిన్న విషయం గుర్తుకు వచ్చింది. ఆయన ఒకనాడు సాయంకాలం షికారువెళ్ళి తిరిగి వస్తూండగా ఒక వీధిచివర నలుగురైదుగురు పిల్లలు 'కర్రాబిళ్లా' ఆడుతూ కనిపించారు. ఆయన కాస్సేపు ఆ ప్రక్కనే నిలబడి చూశాడు. ఆయనకు ఆ ఆటంతా జ్ఞాపకం వచ్చింది. చిన్నతనంలో పల్లెటూళ్ళో యీ ఆట ఆడుతూవుంటే పట్టు

దలలు పెంచ్చి అన్నమూ, నీళ్ళుకూడా మరిచిపోయేవారు. గొడ్లను కాచుకునే కుర్రవాళ్ళు ఆట ధ్యాసలోపడి గొడ్లెటుపోయేదీకూడా గమనించే వారుకాదు. ముఖ్యంగా ఆయన తన చిన్నతనంలో ఆ ఆటలో నిష్ణాతుడు. అతడు ఏ జట్టులోవుంటే ఆ జట్టు గెలవటం తథ్యం. అతడు చేతికొద్దీ వేసిన దెబ్బకు ఆ కర్రముక్క 'కుయ్యో'మని గోలచేస్తూ, గిరాగిరా తిరుగుతూ ఫర్లాంగులకొద్దీ ఎగిరిపోయేది...వాళ్ళ ఆటచూస్తూ అదంతా జ్ఞాపకంచేసుకున్న ముసలాయనకు చిత్రమైన కోరిక కలిగింది. ఒకసారి చుట్టూచూసి, దగ్గర్లో ఎవరూలేరని తేల్చుకుని, ఆ కుర్రవాడిదగ్గరకు వెళ్ళి "ఒక్కసారి నేను ఆడతాను ఇస్తావా ?" అని అడిగాడు. వాడు ఆశ్చర్యపోతూ, కొద్దిగా నవ్వుతూ ఆ ముసలాయనకు కర్రాబిళ్ళా ఇచ్చాడు. తనచేతిలో వున్న ఖరీదయిన చేతికర్రను ఆ కుర్రవాడి చేతికిచ్చి కర్రాబిళ్ళా అందుకున్నాడు. పిల్లలందరూ ఆ ముసలాయనవంక చిత్రంగా చూస్తున్నారు ఆయన తన కెదురుగా కొద్దిదూరంలో నిలబడి వున్న ముగ్గురు పిల్లలవైపు బిళ్ళనుకొట్టాడు. అది ముచ్చటగా ఎగురుతూ పోయి ముందు నుంచునివున్న కుర్రవాడి చేతులలో పడింది. అంటే ఆయన 'ఛాన్సు' అయినట్టే అన్నమాట. పిల్లలందరూ ఇదిచూసి కేకలు పెట్టారు. ఆయన 'మరొక్కసారి వేస్తాను" అన్నాడు. మళ్ళీ ప్రయత్నం చెయ్యగా ఈసారి అది రెండవవాణ్ణి వరించింది. మళ్ళా పిల్లలు అరిచారు. ముసలాయన మొహాన అప్పటికే స్వేదబిందువులు అంకురించాయి. ఆయన మళ్లీ ప్రాధేయపడుతున్నట్టు "ముచ్చటగా మూడోసారి. ఇంక అడగనులే" అన్నాడు. వాళ్లు 'సరే'నన్నారు. ఈసారి ఆయన జాగ్రత్తగా వాళ్ళకు అందే వీలులేకుండా బిళ్ళను నేలబారుగావేశాడు. వాళ్ళలో ఒకడు ముందుకు వచ్చి దాన్ని మళ్ళీ 'కంచా' దగ్గరికి విసిరాడు. అదృష్టవశాత్తూ అది కంచాకు దూరంగానే పడింది. దాన్ని ఆయన చేతిలోవున్న కర్రతో మూడుసార్లు కొట్టగలిగినంతదూరం కొట్టవచ్చు. ఆయన ఒకసారి బిళ్ళను పైకి లేపుదామని ప్రయత్నించాడు. కాని అది మాటవినలేదు. రెండోసారి కర్రతో చివరను తాకించేసరికి అది తప్పనిసరి అయినట్టు ఒక అడుగు ఎత్తునలేచింది. ఆయన చేతిలోవున్న కర్రను బలమంతా ఉపయోగించి విసిరాడు. బిళ్ళకు అది తగలనేలేదు. కాని ఆ ఊపుతో ఆయన జబ్బ

దగ్గర 'కలుక్కు'మని విపరీతమైన నొప్పిపుట్టింది. ఆయన జబ్బను ఎడమ చేత్తో పట్టుకుని బాధగా 'అబ్బా' అనుకున్నాడు. తర్వాత పిల్లలందరూ ఆశ్చర్యంగా చూస్తూ వుండగా, ఆ కుర్రవాడి చేతికి కర్రయిచ్చి తన చేతికర్ర అందుకుని "మీరాడుకోండి నాయనా!" అంటూ నెమ్మదిగా సాగిపోయాడు.

ముసలాయన ఈ స్మృతినుంచి తేరుకొనేసరికి హాల్లో లైట్లు వెలిగాయి. హాలు బయటవున్న కొద్దిమంది జనమూ నిరుత్సాహంగా లోపలికి వచ్చారు. వారి వాలకంచూస్తే కరెంటు రాకపోయినా, సినిమా చూడకపోయినా వారికేమీ పట్టినట్టులేదు. ఏదో డబ్బు పెట్టి వచ్చాం గనుక తప్పదులెమ్మన్నట్టు, కరెంటు రాగానే నిరుత్సాహంగా లోపలికి వచ్చారు. మధుకూడా వచ్చి 'తాతగారూ! ఇంతసేపూ బయటికన్నారాక, యీ చీకటిగుహలో ఎందుకున్నారండీ?" అంటూ కూర్చున్నాడు.

మళ్ళీ సినిమా ప్రారంభమైంది. మధు ఇంతసేపూ సణుగుతూనే వున్నాడు. "ప్రొద్దునలేచి ఎవరిమొహం చూడటంవల్ల యీ డొక్కుసినిమా చూడవలసి వచ్చిందో" అని చాలాసేపు ఆలోచించాడు. తర్వాత 'పూర్వపు వారి కసలు సినిమా తియ్యటం ఎలాగో చేతకాదుపొమ్మ'న్నాడు. 'ఆ కథ చాలా అసహజంగా ఘోరంగా వుంద'న్నాడు. 'ఆ నటీనటులందరిలోనూ కళాకాంతులనేవి ఏ కోశానాలేవుపొమ్మ'న్నాడు. 'ముఖ్యంగా ఆ హీరో వేసినవాడు కేవలం ఎద్దుమొద్దు స్వరూపంలా వున్నాడేతప్ప, ప్రేమపాట పాడుతున్నప్పుడు, ఆ మొహంలో 'రొమాన్సు' కాగడాపెట్టి వెతికినా కనిపించటం లేద'న్నాడు. ఇన్ని అని చివరకు "ఇవాళ యీ సినిమా చూడటం పాతికయేళ్లు వెనక్కు వెళ్ళటంవంటిది. మనం చేసుకున్న కర్మ" అని వూరుకున్నాడు.

ముసలాయన యిన్నీ వింటూనే సినిమాలో లీనమైపోయాడు. తర్వాత మరొక యిరవై నిముషాలు గడిచాక 'యింటర్వెల్' వచ్చింది. లైట్లు వెలిగాయి. మధు చాటుగా సిగరెట్టు కాల్చుకునేందుకు ఎత్తువేసి "మీరిక్కడే కూర్చుని వుండండి తాతగారూ! హాలుబయట చలిగాలిలా

వుంది. మంచుకూడా కురుస్తున్నది. ఒంటికి మంచిదికాదు' అని చెప్పి బయటికి వెళ్ళాడు. ముసలాయన కుర్చీలో సర్దుకుని కూర్చుంటూ ఎందుకో ఎడమైపుకుచూసి మళ్ళీ చూపులను మరల్చుకోలేకపోయాడు. ఆయనకు అయిదారు కుర్చీల అవతల ఒంటరిగా యిరవైయేళ్ళ వయసులో వున్న ఒక యువతి కూర్చునివుంది. పచ్చని శరీరమూ, తెల్లని చీరా, నెమలికంఠంరంగు జాకెట్టూ, జుట్టుముడిమీద అర్ధచంద్రాకారంగా వున్న పూలూ...తాంబూలచర్వణంతో ఎర్రబడిన పెదవులూ...ముసలాయన మనసులో ఏదో గుబులు బయలుదేరింది. ఆయన ఏదో జ్ఞాపకం చేసుకునేందుకు ప్రయత్నించాడు. తానెప్పుడో యిదేరంగు చీరె, రవిక ధరించి యిదే విధంగా సిగ అలంకరించుకున్న స్త్రీనిచూశాడు ఎప్పుడు?.. ఒక్క క్షణంలో మెరుపుమెరిసినట్టయి ఆ వృత్తాంతమంతా జ్ఞాపకం వచ్చింది. 'అవును...యిదేరంగు రవిక, చీరె... యిదే అలంకరణ' అనుకున్నాడాయన. వెంటనే ఆ ఉదంతమంతా సినిమారీలువలె మనో రంగంమీద నడిచింది.

దాదాపు మూడు సంవత్సరాల క్రిందట తనకు పిత్రార్జితమైన భూమి వున్న వూరికి వెళ్లవలసివచ్చింది. ప్రతి సంవత్సరమూ ఆ పనిమీద వెళ్ళే కుమారుడికి సెలవు దొరికే సూచనలు కనిపించలేదు. అప్పటికే ఆయనమీద అన్ని ఆంక్షలు. డాక్టర్లు శరీర శ్రమ పనికిరాదన్నారు. చలి గాలిలో తిరగకూడదన్నారు. వర్షపు చినుకు వంటిమీద పడకూడ దన్నారు. వంటికి సరిపడనివీ, త్వరగా జీర్ణంకానివీ, వేడిచేసేవీ, నెమ్ము చేసేవీ... ఏ వస్తువులూ తినకూడదన్నారు. మందు వేళతప్పకుండా సేవించాలన్నారు. ఇన్ని ఇబ్బందులుండగా కోడలు, ఆయన ఇల్లు కది లేందుకు వొప్పుకోలేదు. ఆయన కొడుక్కి సెలవు దొరక్కపోవటం నెపంగా తీసుకుని వాదించాడు..."ఎంతదూరమని...ఒకరోజు పని... నాకూ ఈ వయసుతో వెడదామనిలేదు...అయినా అవసరంవచ్చినప్పుడు తప్పదుగా. కాస్తాకూస్తాకాదు. అయిదువందలు...నువు ఒక నెక్లెసయినా చేయించుకోవచ్చు...వేళకు పోలేకపోతే రైతులుతర్వాత సమాధానంకూడా చెప్పరు. ఇప్పుడు వెళ్ళి కళ్ళంలో కూర్చుంటేగాని లాభంలేదు...నాకూ

విశ్రాంతిగా వుందామనేవుంది. అయినా ఇప్పుడు వాడికి సెలవుదొరక్క పోతే ఎలా చెయ్యటం!" అని కోడలితో వాదించాడు. ఆయనకు లోలోపల, ఒక్కరోజయినా ఈ ఆంక్షలన్నిటినీ తొలగించుకుని స్వేచ్ఛగా తిరిగి రావాలనే వుంది. ఆయన కుమారుడికి సెలవుదొరక్కుండా చెయ్యమని భగవంతుణ్ణి ప్రార్థించాడుకూడా. అలాగే అయింది. తర్వాత కోడలికి అవసరమైన హామీలన్నీయిచ్చి, కొడుకుదగ్గర సలహాలు తీసుకుని ఆయన బయలుదేరాడు. ఆ వూరు స్టేషనుకు ఆరుమైళ్ళ దూరంలో వుంది. ఆయన రైలు దిగగానే ఒక బండిదొరికింది. ఆ వూరువెళ్ళి రైతులదగ్గర డబ్బు వసూలుచేసుకుని ఆయన మళ్ళీ బయలుదేరే సమయానికి రైతులు "మా బళ్ళన్నీ పనిమీద వుండిపోయాయి బాబుగారూ?" అన్నారు. ఆయన చప్పరించి, "ఆఁ! మీ కెందుకోయ్ శ్రమ. ఆరుమైళ్ళ భాగ్యానికి బండి కావాలా ? చిటికెలో నడచిపోనూ ?..." అని బయలుదేరాడు. పొలాల పక్క రెండుగజాల వెడల్పువున్న మట్టిబాట అది. బాట కిరుప్రక్కలా రకరకాల చెట్లు సిలువెత్తున దడికట్టినట్టు పెరిగివున్నాయి. స్టేషనునుంచి వచ్చేపొయ్యే బళ్ళన్నీ మెయిన్ రోడ్డుమీదనే వస్తాయి. ఆ వూరినుంచి దగ్గరలోవున్న ఇతర వూళ్ళకు పోవాలన్నా మెయిన్‌రోడ్డే దగ్గరి త్రోవ. ఈ చిన్న మట్టిబాట తను వచ్చేవూరినుంచి స్టేషనుకు మాత్రమే చేరుస్తుంది. అందువల్ల జనసంచారం చాలా తక్కువగా వుంటుంది. ముసలాయనకు అక్కడ నడుస్తూవుంటే చాలా హాయిగా వుంది. ఆకాశం వింత వింత రంగులతో ముచ్చటగావుంది. రెండుమూడు పక్షులు ఆకాశంలో తీరికగా ఎగురుతూ విన్యాసాలు చేస్తున్నాయి. ఒక మైలుదూరం నడవగానే ఆయనలో కొద్దిగా అలసట కనుపించింది. అయినా లెక్కచెయ్యకుండా చేతికర్రను వూపుకుంటూ కూనిరాగంతీస్తూ నడకసాగించాడు. ఉన్నట్టుండి ఆయనకు తనముందు కొంతదూరంలో నడుస్తున్న ఒకామె కనుపించింది. ఆయనలో హుషారు హెచ్చింది. ఈలకూడా వేసుకుంటూ, ఆమెను కలుసు కోవాలని పట్టుదలతో త్వరత్వరగా నడవటం ప్రారంభించాడు. ఆమె వెనకనుంచిచూస్తే చాలా అందగత్తెవలె కనుపిస్తున్నది. తెల్లని చీరె, నెమలి కంఠం రంగు జాకెట్టూ ధరించి తలలో అర్ధచంద్రాకారంగా బంతిపూలు పెట్టుకుని, ముద్దబంతిపూవువంటి పద్దెనిమిదేళ్ళ ఆ ముద్దరాలు, పంచ

కళ్యాణి గుర్రంవలె తీవిగా నడుస్తున్నది. ముసలాయన ఆమెను కలుసుకోవాలని ఇంకా త్వరత్వరగా నడిచి, చివరకు ఆమెకు చేరువగా రాగలిగాడు. ఆమె తనకంటె ఒక అడుగుమాత్రమే ముందువుంది. ఆయనకు కొద్దిగా ఆయాసం వచ్చింది. అయినా లెక్కచెయ్యకుండా హుషారుగా నడుస్తున్నాడు. మనసులో 'పిల్ల ఎంత అద్భుతంగా వుంది! పిల్ల అంటే అలా వుండాలి .. ఇంత వేడిగాలికూడా ఆమెమీదినుంచి రావటంవల్లనేమో చల్లగా హాయిగావుంది' అనుకున్నాడు...ఇంతలో ఒక విసురుగాలి చిలిపిగా వీచింది. ఆ గాలికి ఆమె పమిట కొంగు జారిపోయింది. ఆమె నడుస్తూనే సవరించుకుని ప్రక్కకుచూసింది. ఆయనలో రక్తం పరుగులు తీసింది. విశాలమైన కాటుకకళ్ళూ, వాడికత్తులవంటి చూపులూ ఆయనను గెచ్చగొట్టాయి. ఆయన, 'ఏదయినా చెట్టుచాటు చూసుకుని ఆ పిల్ల చెయ్యిపట్టుకోవాలి. కాస్త పెనుగులాడుతుంది అంతే... కాదనదు.... అంతగా అయితే జేబులోవున్న డబ్బులో పదో, పాతికో ఎర చూపించవచ్చు' అనుకున్నాడు... కొద్దిసేపట్లో ఆయన కల వేయిరెట్లుగా ఫలించినట్టు ఒక పెద్ద మర్రిచెట్టు కొద్దిగజాల దూరంలో కనుపించింది. ఆయన రక్తనాళాల్లో రక్తం వెచ్చగా పరుగులు తీసింది. ఆయన మరికాస్త పక్కకు జరిగి ఆ పిల్లకు మరీ దగ్గరగా నడవటం ప్రారంభించాడు. ఆ చెట్టు దగ్గరపడుతున్నది. ఆయన మరికాస్త పక్కకు నడిచాడు. ఉన్నట్టుండి ఆ పిల్ల చెయ్యిపట్టుకుని ఆ చెట్టుచాటుకు లాక్కుపోవాలని ఆయన ఉద్దేశం. ఆ చెట్టు మరొక నాలుగైదు గజాలదూరంలోకి వచ్చింది. హఠాత్తుగా ఆ పిల్ల ఆయన వంకకు తిరిగి "తాతగారూ! మీ చేతికి గడియారం వున్నట్టుంది... టైమెంత అవుతుందండీ?" అని అడిగింది. ఆయన నీళ్ళుకారిపోయాడు....నడక వేగం మందగించింది....నెమ్మదిగా తన ముంజేతిమీద సిల్కులాల్చీ తప్పించి గడియారం వంక చూసి "అమ్మా! మూడుగంటలవుతున్నది తల్లీ!" అని సమాధానం చెప్పాడు. ఆ పిల్ల 'అమ్మో! చాలా ఆలస్యమైపోయిందే!' అనుకుంటూ వడివడిగా నడిచి క్రమంగా కనుచూపుమేర దాటిపోయింది. ఆ మర్రిచెట్టు రానూ వచ్చింది. వెనుకబడిపోనూ పోయింది. ముసలాయన చేతికర్ర వూతగా

నెమ్మదిగా నడిచాడు. ఆయన ఒక్క నిముషంలోనే నీరసించి పోయినట్టు కనిపించాడు. ఇంతదూరం నడవటంవల్ల కలిగే ఆయాసమూ, అలసటా కాళ్ళనొప్పులూ అన్నీ ఇప్పుడు ప్రారంభమైనాయి. ఆయన నెమ్మదిగా నడిచి స్టేషన్‌కు చేరుకునేసరికి పొద్దుగూకుతున్నది. మధ్యాహ్నం ఎప్పుడో రావలసిన రైలు ఆలస్యంగా వచ్చినందువల్ల ఆయనకు ఏ ఇబ్బందీ కలగలేదు.

మధు వచ్చి మళ్ళీ ప్రక్కన కూర్చుని 'తాతగారూ, మీరేదైనా డ్రింకుగానీ, కాఫీగాని తీసుకుంటారా? తెచ్చి పెడతాను' అని అడుగుతూ వుండగా ఆయన ఆ స్మృతినుంచి తేరుకుని 'వద్దులే, నాయనా!' అన్నాడు.

మళ్లీ లైట్లు ఆరిపోయి సినిమా ప్రారంభమైంది. అక్కడక్కడ తెగిపోతూ నెమ్మదిగా, నిర్జీవంగా, కళావిహీనంగా సాగింది సినిమా. ఆయన కథలో లీనమై శ్రద్ధగా చూశాడు. మధు వుండి వుండి యింకా సణుగుతూనే ఉన్నాడు. హాల్లో ఉన్న కొద్దిమంది జనమూ శ్రద్ధాసక్తులు లేకుండా కూర్చున్నారు. ముసలాయనకు కుడివైపున అయిదారు కుర్చీల అవతల కూర్చునివున్న ఆ యువతిని ఒకడువచ్చి ఏదో మాట్లాడి వెంట తీసుకుపోయాడు. సినిమాలో పతాక సన్నివేశాన్ని ఆ రోజులలో లభ్యమైన హంగు లన్నిటితో చాలా జాగ్రత్తగా చిత్రీకరించారు. కథానాయకుడి తల్లి కుమారుడికోసం ఏడుస్తూవుండే దృశ్యమూ, రాజకుమారి ప్రియుడికోసం వియోగబాధతో పాటపాడే దృశ్యమూ, మాంత్రికుడు కథానాయకుణ్ణి నానాహింసలకూ గురిచేసే ఘట్టమూ, వెంట వెంటనే చిత్రీకరించారు. ఆ రోజుల్లో అది ఒక కొత్త పద్ధతి. మధు పతాక సన్నివేశం చూస్తూ కూడా తలపట్టుకుని 'అబ్బ! ఏమి సినిమారా బాబూ! అమృతాంజనం డబ్బా వెంట తెచ్చుకున్నా బాగుండిపోయేది' అన్నాడు.

కొద్ది నిముషాల తరువాత కథ సుఖాంతం అయింది. చివరి దృశ్యంలో రాజూ, రాణి, పశ్చాత్తాపం చెందిన రాణిగారి తమ్ముడూ, కథానాయకుడూ రాజకుమారీ, వరసగా నిలబడ్డారు తెరమీద 'శుభం'

అని పడింది. లైట్లు వెలిగాయి. జనం నిశ్శబ్దంగా హాలు బయటికి నడిచారు. ఎవరైనా 'బాగుంది' లేకపోతే 'బాగులేదు' అని అంటారేమోనని ముసలాయన జాగ్రత్తగా గమనిస్తూ బయటికివచ్చాడు. కాని వారిలో ఒక్కరైనా సినిమా బాగోగులను గురించి పల్లెత్తు మాటాడక పోవడంతో ఆయనకు మరీ బాధ కలిగింది.

చల్లని గాలి వీస్తున్నది. ఆకాశంలో గచ్చకాయ రంగులో ఉన్న మేఘం చివర, మలినమైన గుడ్డలో కట్టబడిన ముత్యంవలె ఉన్నది చంద్రబింబం. హాలు బయట జనమేలేరు. యితర సినిమాలకు టిక్కెట్లు అందనివారు యిళ్ళకు పోయేందుకు యిష్టపడక, 'ఏదోఒకటి చూద్దామ'ని ఆ హాలుకు వస్తారేమో! వాళ్ళున్ముకునే ఒక ఆపది పీఛిలైటు క్రింద క్రీనీడలో నిలబడి ఉండి, 'ఎవరైనా వస్తారేమోన'ని ఎదురుచూస్తున్నది.

ఇద్దరూ రిక్షా ఎక్కి బయలుదేరారు. ముసలాయన గంభీరంగా ఉన్నవాడల్లా ఒక్కసారి 'ఇదేమిటోయ్! ఇందాక మనం వచ్చినదోవ కాదే యిది?' అని అడిగాడు. మధు అది "అంతేనండి తాతగారూ! వన్ వే ట్రాఫిక్. బళ్ళు, అవీ అటు పొయ్యేందుకు వీలులేదు. ఇటు వచ్చే వీలూ లేదు. ఏ దోవలోనూ ముందుకు పోవటమేతప్ప వెనక్కి వచ్చే వీలుండదు" అని సమాధానం చెప్పాడు.

ముసలాయన గంభీరంగా నవ్వుకుని 'అవును జీవితమూ అటువంటిదే. ముందుకు పోవటమేగాని వెనక్కి వచ్చే వీలులేదు. ముందుకు కదలటంకూడా మన చేతుల్లో లేదు.' అనుకున్నాడు. రిక్షా చల్లని గాలి తెరలను చీల్చుకుంటూ గుడ్డివెన్నెలలో వడివడిగా సాగిపోయింది.

(1961 నవంబరు – భారతి)

# భయం

వంటయింటి గుమ్మంలో నిలబడి చొక్కా చివరతో ముక్కు తుడుచుకుంటూ, ఒక చేత్తో జారిపోతూన్న లాగూను పైకి లాక్కుంటూ, "పిన్నీ! నువ్విచ్చిన లెక్కలన్నీ చేసేశాను. ఇంక ఆడుకోమంటావా?" అని అడిగాడు చిరంజీవి. కుంపటిమీద కాఫీకి నీళ్ళుపడేసి జానకి అతని వంక చూస్తూ, కోపంగా "చొక్కాతో ముక్కు తుడుచుకోవద్దని నీ కెన్ని సార్లు చెప్పాను? మళ్ళీ ఎప్పుడన్నా చూశానంటే వీపు చీరేస్తాను. గుర్తు పెట్టుకో. ఇచ్చిన కూడికలూ తీసివేతలూ చేశావా? కాస్సేపు వుండి చూస్తాను. ఈ లోపుగా మన వరండాలో ఆడుకో. దుమ్ములో తిరిగినట్టు తెలిసిందా, నీ కివాళ మూడిందన్నమాటే" అన్నది.

చిరంజీవి పిన్ని అనుమతిపొంది త్వరత్వరగా ముందు హాల్లోకి పోయి బీరువా వెనకవున్న రబ్బరు బంతిని తీసుకుని వేపచెట్టు నీడలో నడిచి సరిహద్దు గోడపక్కగా వెళ్ళి– "సేతూ! మాపిన్ని ఆడుకోమన్నది రా!" అని పిలిచాడు. సేతు వాళ్ళ ఇంటి వరండాలో కుర్చీలో కూర్చుని ఏమీ తోచక కూనిరాగాలు తీస్తున్నాడు. చిరంజీవి పిలుపువిని సేతు గోడ గెంతి పరుగెత్తుకొని వచ్చాడు. వాడికెప్పుడూ తీరికే. వాళ్ళయింట్లో వాణ్ణి 'చదువుకో, లెక్కలు చెయ్యి, ఎక్కాలు వల్లెవెయ్యి' అని సాధించేందుకు ఎవరూలేరు. వాళ్ల అమ్మ వాడి చిన్నతనంలోనే పోయింది. వాళ్ళ నాన్న తాసీల్దారు. ఆయన మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు. సేతు ఈ వేసవికాలం సెలవల్లో ఏమీతోచక బాధపడతాడు. వాళ్ళ ఇంట్లో రేడియోవుంది. ఎన్నో బొమ్మల పుస్తకాలున్నాయి. ఆడుకునేందుకు కావలసిన సామాన్లు కొయ్యగుర్రం, 'కీ' ఇస్తే పరుగెత్తే రైలుబండి మొదలైన వెన్నో వున్నాయి. సేతుకు రేడియోవినటం ఇష్టంలేదు. దాన్ని వాళ్ళ అక్కయ్యకు

వొదిలేస్తాడు. బొమ్మలతో ఆడుకోవటమన్నా వాడికి చిరాకే. 'ఆరేళ్ళు వెళ్ళి ఇంత పెద్దవాణ్ణయిన తర్వాత వెధవ బొమ్మలాటేమిటి?' అని వాడు విసుక్కుంటూ వుంటాడు. అందువల్ల 'ఒక్కగానొక్క కొడుకే' అని గారాబంతో వాళ్ళ నాన్నగారు కొనుక్కువచ్చే బొమ్మలన్నీ అతని చెల్లెలు మంగకిచ్చేవాడు. వాడికి కాలక్షేపం చేసేందుకు తనంత పెద్దవాడొకడు తోడుకావాలి. చిరంజీవి అన్ని విధాలా తగునుకాని, వాడికి ఇంట్లో బోలెడన్ని బరువులూ, బాధ్యతలూ. వాడి పిన్ని వాడిపట్ల చాలా నిరంకుశంగా ప్రవర్తిస్తూవుంటుంది. ఆమె వాణ్ణి ఎండలో దుమ్ములో కాలు పెట్టనివ్వదు. ఆమె ఇచ్చిన లెక్కలన్నీ వాడు చెయ్యాలి. అంతా అయిన తర్వాత ఎప్పుడో ఒక్క గంటసేపు ఆడుకోనిస్తుంది. రోజుకిన్ని గంటలుండగా అంతా వ్యర్థంగా, లెక్కలుచేస్తూ, ఎక్కాలు వల్లిస్తూ ఇంకా ఏవేవో పాఠాలు చదువుతూ గడిపి ఒక్క గంటమాత్రమే ఆడుకోవాలనటం ఏమీ మంచివిషయం కాదు. ఇన్ని బాధ్యతలూ నిర్వహించుకుని గాని చిరంజీవి బంతి పుచ్చుకుని గోడ దగ్గరికివొచ్చి పిలవడు. ఏమీ తోచక బాధపడే సేతుకు ఆ పిలుపు వినిపించిందంటే మహదానందం కలుగుతుంది.

సేతు గోడదూకి రాగానే ఇద్దరూ కలిసి విశాలంగావున్న ఆ వరండాలో 'ఫుట్‌బాల్' ఆడుకోవటం ప్రారంభించారు. అది ఒక పెద్ద రబ్బరుబంతి. ఆట మొదలు పెట్టేముందు చిరంజీవి సేతుతో "ఒరేయి! పెద్దగా అరవకు. మా పిన్ని వూరుకోదు, నీకు తెలుసుగా. మునుపు మా నాన్నగారితో చెప్పి ఎట్లా కొట్టించిందో" అన్నాడు.

సేతుకు ఆ విషయం బాగా తెలుసు. అది గుర్తుకు వొచ్చినప్పుడల్లా అతని వొళ్ళు జలదరిస్తూవుంటుంది. పది, పదిహేను రోజులక్రితం ఒకనాడు వాళ్ళిద్దరూ యిలాగే ఆడుకుంటూ వుండగా, ఆ బంతి తగిలి వరండాలో గోడకు తగిలించివున్న ఒక ఫొటో కిందపడి, దాని అద్దం పగిలిపోయింది. ఆ ఫొటో చిరంజీవి తల్లిది. అతని తండ్రికీ పిన్నికీ యిద్దరికీ ఆ ఫొటో అంటే గౌరవం. పిన్ని ప్రతి శుక్రవారమూ దొడ్లో పూచిన మల్లెపూలతో దండగుచ్చి ఆ ఫొటోకు వేస్తుంది. నాన్న సంగతి సరేసరి. పిన్ని అంటే ఆయన కెంత అనురాగమో ఆ ఫొటో అన్నా

అంతే అనురాగం. ఈ విధంగా బంతి తగిలి ఫొటో క్రిందపడి పగిలి పోయిన సంగతి పిన్ని నాన్నతో ఆఫీసునుంచి రాగానే చెప్పింది. ఆయన రుద్రుడైనాడు. సేతు అంచనాప్రకారం ఆనాడు చిరంజీవి తిన్నన్ని దెబ్బలు యీ భూమిమీద ఎవరూ తినివుండరేమో! చివరకు వాళ్ళ పిన్ని అడ్డంపోయి చిరంజీవిని చేతుల్లోకి తీసుకుని, "బాగానేవుంది. ఏదో పొర పాటున బంతి తగిలి ఫొటో పగిలిపోయినంత మాత్రాన కుర్రవాణ్ని యింతగా బాదుకుంటారా? ఆ ఫొటోకు మళ్ళీ అద్దం వేయించుకువొస్తే సరి" అని భర్తను మందలించి, చిరంజీవిని సముదాయించింది. చిరంజీవి అప్పుడు వెక్కి వెక్కి ఏడుస్తూనే పిన్ని భుజంమీద తలపెట్టుకుని పడు కున్నాడు. ఇదంతా సేతు చాటుగావుండి చూశాడుకూడా.

గోడగడియారం మూడుగంటలు కొట్టింది. సేతూ చిరంజీవీ ఇంకా ఆడుకుంటూనే వున్నారు. బయట ఎండ మండిపోతోంది. నిప్పుల మీదినుంచి వస్తున్నట్టు గాలి వేడిగా వీస్తోంది. రెండు పిచికలు పంచలో నేలమీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాయి. వేపచెట్టుమీద వేంచేసి వున్న కాకి వొకటి 'కాకా' అని కూసింది.

ఇంతలో ఒక ప్రమాదం జరిగిపోయింది. చిరంజీవీ, సేతూ ఇద్దరూ నిర్విణ్ణులై నిలుచుండిపోయారు. చిరంజీవి శక్తికొద్దీ కాలితో తన్నిన బంతి, వరండాలో టిక్కుటిక్కుమని శబ్దంచేస్తూ ఆడుతున్న గోడగడియారం అద్దానికి తగిలి దాన్ని పగలగొట్టి పక్కగుమ్మంలో నుంచి ఎగిరి గదిలోపలికిపోయి అక్కడ గోడకు తగిలించివున్న నిలువుటద్దాన్ని క్రిందపడేసి మూలగావున్న కిరసనాయిలు సీసాను హరి కేన్ లాంతరునూ దొర్లించి మళ్ళీ వరండాలోకివచ్చి మెట్లుదాటి వేపచెట్టు క్రింద రాలివున్న ఎండుటాకులను గలగలలాడిస్తూ దొర్లిపోయి వేపచెట్టు మొదట్లో ఆగిపోయింది.

ఒక్క క్షణం గడిచాక వాళ్ళిద్దరికీ స్మృతివచ్చింది. ఇద్దరూ భయం భయంగా బిక్కచూపులు చూసుకున్నారు. తర్వాత ఇద్దరూ ఆ గదిలోపలికిపోయి జరిగిన ఘోరం అంతా చూశారు. కిరసనాయిలు ఆ

గదినిండా వ్యాపించింది. పెద్ద అద్దం నేలమీదపడి ముక్కలు ముక్కలై వుంది. హరికేన్ లాంతరు గ్లాసు 'పప్పు పప్పు'యిపోయింది. కిరసనాయిలు వాసన గుప్పుమని వ్యాపిస్తో ఇద్దరు స్నేహితులూ ఏం చెయ్యాలో తెలియక ఒక్క మొహాలు వేసుకుని ఒకచోట కూర్చున్నారు.

జానకి ఏదో పనిమీద వరండాలోకివచ్చి దొంగల్లాగా కూర్చుని ఒక్కచూపులు చూస్తున్న ఆ ఇద్దర్నీ చూసింది. ఆమెకు అనుమానం వేసింది. ఆమె గట్టిగా గాలిపీలుస్తూ 'ఏమిటీ ఈ వాసన' అంటూ ఆ గది లోకిపోయి చూసింది. సేతు 'ఎందుకైనా మంచిద'ని లేచి పోబోయాడు. చిరంజీవి అతని చేతిని పట్టుకుని 'ఇలా నన్ను ఆపదలో నెట్టేసి నువ్వు నిశ్చింతగా వెళ్ళిపోతున్నావా ?' అన్నట్టు జాలిగా చూశాడు. సేతు ఆగ లేదు. ఆమె వస్తే తనతో ఆడుతున్నందుకు కూడా చిరంజీవిని శిక్షిస్తుంది. అందువల్ల తను వెళ్ళిపోవటమే మంచిది. సేతు మరుక్షణంలో గోడదూకి తమ పంచలోకి వెళ్ళిపోయి కుర్చీలో కూర్చుని చూస్తున్నాడు.

ఆ గదిలో జరిగినదంతా చూసేసరికి ఆమెను విపరీతమైన కోపం వచ్చింది. ఆమెకు ఎప్పుడూ ఏ వస్తువూ పాడుకావటం ఇష్టంలేదు. ఇప్పుడు పగిలిపోయిన అద్దం ఆమె పెళ్ళినాటిది ఇప్పుడు పగిలిపోయిన హరికేన్ లాంతరు గ్లాసు రెండేళ్ళనాటిది. ఆమె, ఆ గదిలో జరిగిన ప్రళయం అంతా చూసి వరండాలోకి వచ్చేసరికి ఎదురుగా 'టిక్కు టిక్కు' మని ఆడుతున్న గడియారం అద్దం పగిలిపోయి దీనంగా కని పించింది. ఆమె 'హవ్వ' అని నోరు నొక్కుకుంది. చిరంజీవి వంక 'ఇలాంటి రాక్షసుడివేం, నువ్వు ?' అన్నట్టుగా చూసింది. ఆమె కళ్ళు కోపంతో ఎరుపెక్కినయ్. 'మీ నాన్నగార్ని రానియ్. ఇదంతా ఇలాగే వుంచి చూపిస్తాను. నీ ఆగడాలేమిటో ఆయనే కనుక్కుంటారు' అంటూ లోపలికి పోయింది.

చిరంజీవి అలాగే కూర్చునివున్నాడు. ఒంతి వేపచెట్టు మొదట్లో పడివుంది. వేపచెట్టుక్రింద ఎండిపోయిన ఆకులు రాలివున్నాయి. ఏదో పిట్ట విచిత్రంగాకూస్తూ హడావిడిగా ఎగిరిపోతోంది. వరండాలో

పిచ్చికలు రెండు కిచకిచలాడుతూ ఈ వ్యవహారాన్ని గురించే కాబోలు మాట్లాడుకుంటున్నాయి. ఎంత తీవ్రంగా కాస్తూనేవుంది. వరండాలో నుంచి కనబడుతున్న ఆకాశ భాగంలో మబ్బుతునకలు రెండు కదులుతున్నాయి. సేతు గోడదగ్గరికివచ్చి చిరంజీవిని నెమ్మదిగా పిలిచాడు. కాని చిరంజీవి పలకలేదు. కాస్సేపు ఎదురుచూసి సేతు మళ్ళీ ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

చిరంజీవికేమీ తోచలేదు. అతడు చాలాసేపు అలాగే కూర్చున్నాడు. అతని కిప్పుడంతా తలుచుకుంటే భయంగా వుంది. నాన్న అలిసిపోయి ఇంటికి వస్తాడు. అప్పుడీ విషయం విన్నాడంటే ఆయన కోపానికి హద్దుండదు. 'పుట్టగానే తల్లిని మింగిన రాక్షసు'డని ఆయన కసలే తనమీద కోపం. పిన్నికనక లేకపోతే ఈపాటికెప్పుడో తనను చంపివేసి వుండేవాడు. పిన్ని కూడా మంచిదే. కాని మంచితనం అతిగా చూపించి పిల్లవాణ్ణి చెడగొట్టటం ఆమె కిష్టంలేదు. అందువల్ల ఆమె ఈ విషయాన్ని భర్తకు చెప్పకుండా వుండదు.

గోడగడియారం నాలుగు గంటలు కొట్టింది. చిరంజీవి దానికేసి చూశాడు. దాని అద్దం ఏడెనిమిది ముక్కలుగా పగిలిపోయింది. దాన్నిలా ఎవరైనాచూస్తే అసహ్యంగానే వుంటుంది. అది చాలా పాత గడియారం. తన తాతగారు బాగా బ్రతికిన రోజులనాటిది. అది ఆ కారణంగా ఆ ఇంట్లో చాలా ప్రాముఖ్యాన్ని గడించుకుంది. తమ ఇంటికి ఎవరైనావస్తే వారు వింతగా చూపించేవాటిలో ఇదొకటి. ఒక వందయేళ్ళనాటి రోలూ, అరవై ఏళ్ళనాటి తిరగలీ, నలభై ఏళ్ళనాటి పెద్దపీటా దాదాపు నలభై ఏళ్ళనాటి ఈ గోడగడియారమూ– వీటిని చూపించి పాతకాలపు వస్తువులెంత మన్నికగలవో, ఎంత నిజాయితీగా పనిచేస్తాయో వివరిస్తారు. 'ఇన్నేళ్ళనుంచి విశ్వాసంతో పనిచేస్తున్నందుకు ఈనాటికి నీవు మంచి ప్రతిఫలమే చూపించావు' అని కోపం తెచ్చుకున్నట్టు ఆ గడియారం శబ్దంచేస్తూ ఆడుతోంది.

జానకి మొహం కడుక్కుని ముందు గదిలోకి వచ్చి చిన్న

అద్దంలో మొహం చూసుకుంటూ పౌడరు స్నో రాసుకోబోయింది. అవి రెండూ నిండుకున్నాయి. ఆమె 'అయ్యో! నిన్ననే తెమ్మని చెబుదామనుకున్నాను. నా మతి మండిపోను! గుర్తేలేదు!' అని విసుక్కోవటం చిరంజీవికి వినిపించింది.

తర్వాత ఆమె చిరంజీవిని వంటయింట్లోనుంచి పిలిచింది. బహుశా కాఫీ తాగేందుకు కావచ్చు. చిరంజీవి లేచి ముక్కు తుడుచుకున్నాడు. లాగూ పైకిలాక్కున్నాడు. వంటయింట్లోకి పోదామనుకున్నాడు. కాని అతడలా చెయ్యలేదు. వరండా మెట్లుదిగి వేపచెట్టు నీడలో నడిచిపోయి సింహద్వారందాటి వీధిలోకి వచ్చాడు.

వీధిలో ఎండ మాడ్చివేస్తున్నది. నాలుగు గంటలయినా సూర్యుడు నిప్పులు చెరుగుతూనే వున్నాడు. టెలిగ్రాఫ్ తీగలమధ్య రెండు గాలి పటాలు చిక్కుకుని వున్నాయి. ఆ వీధి చివర చెట్టు కింద ఒకడు, ఒక కుర్రవాడి సాయంతో గిన్నెలకు కళాయి వేస్తున్నాడు. ఆ కుర్రవాడు మోకాళ్ళమీద కూర్చుని తోలుతిత్తిని వొత్తుతున్నాడు. కొలిమి 'గుఫ్ గుఫ్'మని మండుతోంది. కొద్ది దూరంలో ఒక అరవైఏళ్ళ ముసలి నీడలో కూర్చుని మొక్కజొన్న పొత్తులు కాల్చి అమ్ముతోంది. ఇద్దరు పిల్లలు చెరొకటి బేరంచేసి కొనుక్కుంటున్నారు. ఒక ఇంటి పంచలో దూదేకులవాడొకడు దూదిఏకుతున్నాడు. చిరంజీవి ఆ ఇంటిముందు చాలాసేపు నిలబడి అదంతా చూశాడు. ఒకడొక బుట్ట భుజానపెట్టుకుని 'పాతపేపర్లు కొంటాం, పాత పుస్తకాలు కొంటాం' అని అరుస్తూ పోతున్నాడు. ఇక ఇంటి పంచలో, చిరంజీవి యీడుదే ఒకపిల్ల బెలూను వూది తనకంటే చిన్నవాడైన తమ్ముణ్ణి ఆడించబోయింది. ఆ పిల్ల బెలూనువూది బైటికి తియ్యగానే అది 'ఠప్'మని పగిలిపోయింది. ఆ చిన్నపిల్లవాడు 'కెవ్వు'మని ఏడవటం ప్రారంభించాడు. ఆ అమ్మాయి బెలూను పగులగొట్టినందుకూ, తమ్ముణ్ణి సముదాయించమంటే ఏడిపించినందుకూ తల్లి ఏం శిక్ష వేస్తుందోనని హడలిపోతూ బిక్కమొహంపెట్టి 'తమ్ములూ వూలుకో!' అంటున్నది. మరికొంత దూరంలో ఒక ఇంటిపంచలో పదిపదిహేను మంది ఆడవాళ్ళు కూర్చుని కబుర్లు

చెప్పుకుంటున్నారు. ఆ ఇంటి సింహద్వారంమీద మాత్రం 'కుక్కలున్నవి జాగ్రత్త' అని వ్రాసివుంది. చిరంజీవి ఆ వాక్యం కూడ బలుక్కుంటూ చదివాడు. అతని కక్కడ కుక్కలు కనిపించనేలేదు.

ఇన్ని చూస్తూ నడుస్తున్నా చిరంజీవి మనస్సు వికలమై వుంది. అతనికి నాన్న ఇంటికిరాగానే జరగబోయే తతంగం తలుచుకుంటే వొణుకు పుట్టుకొస్తున్నది.

చిరంజీవి పెద్దబజారులోకి వచ్చాడు. నాన్నగారి ఆసీసు ఇంక ఎంతోదూరంలేదు. ఆ ఆఫీసు అతనికి బాగా తెలుసు. చిరంజీవి కాళ్ళు కాలుతున్నాయి. అయినా అతడు లెక్క చెయ్యటంలేదు. అతని మనస్సంతా ఒకటి రెండు గంటలలో తనకుపడే శిక్షమీదేవుంది. నాన్న తనను పేము బెత్తంతో కొడతాడు. పిన్ని కూడా ఈసారి అడ్డంరాదేమో!

గంట అయిదయినట్టుంది. చిరంజీవి వాళ్ళ నాన్నగారి ఆఫీసు ముందు నిలబడ్డాడు. అక్కడ చాలామంది హడావిడిగా ఏదో వ్రాసుకుంటూ, చేతిలో కాయితాలతో అటూ ఇటూ తిరుగుతున్నారు. చిరంజీవి నెమ్మదిగా లోపలికి నడిచాడు. అక్కడ టేబుళ్ళమీద వెనక వున్న మనుషులుకూడా కనుపించనన్ని కాగితాలు వున్నాయి. చిరంజీవి అక్కడ ఒక బల్లవుంటే దానిమీద కూర్చున్నాడు. లోపల ఏవేవో కాయితాలు కదులుతున్న చప్పుడూ, కొద్దికొద్దిగా మాటలూ వినిపిస్తున్నాయి.

ఇంతలో అతన్ని శేఖరంగారు పలకరించారు. ఆయన ఇల్లుకూడా తమ వీధిలోనే. ఆయన కూతురు రుక్మిణి తన బడిలోనే చదువుకుంటున్నది. ఆయన కళ్ళజోడు సవరించుకుంటూ 'ఏమిరా ఇలా వొచ్చావు? మీ నాన్నగారికోసమా?' అంటూ గుమ్మంలోకి వెళ్ళి, "ఏమోయ్ సారథీ! మీ సుపుత్రు డెందుకో వేంచేశాడు" అంటూ చిరంజీవిని లోపలికి పంపించాడు.

నాన్నగారి ముందున్న బల్లమీద అటూ ఇటూ పెద పెద

గొంతల్లుగా కాయితాలు వున్నాయి. ఆ రెండుదొంతర్ల మధ్యనుంచి నాన్నగారి ముఖం కనుపిస్తోంది. ఆ బల్ల చివర చిరంజీవి గడ్డానికి ఆనుతోంది. ఆయన చిరంజీవిని చూసి "ఏమిటిరా' అని అడిగాడు. చిరంజీవికి ఆయన కోపంగా వున్నట్టు కనిపించాడు. నిజానికది అలసట తప్ప మరేమీ కాదు. ఆయన నుదుటిమీద అక్కడక్కడ స్వేదబిందువులున్నాయి. చిరంజీవి సమాధానం చెప్పకపోయేసరికి ఆయన 'ఏమిరా, మొద్దూ ! అలా మొద్దులా నుంచున్నావేం ?' అని కసిరాడు. చిరంజీవి ఏదో చెప్పాలనుకున్నాడు. కాని ఏం చెప్పాలో తోచలేదు. చివరకు "నాన్నా ! పిన్ని, సన్ని పొడరూ అయిపోయాయిట, తెమ్మన్నది" అన్నాడు. సారథి ఉలిక్కిపడి "నోరుమూసుకో వెధవా !" అన్నాడు. తర్వాత వాడు అన్నమాట ఎవరైనా విన్నారేమోనని చుట్టూ చూశాడు. కాని అదృష్టవశాత్తూ ఎవరి పనుల్లో వారు కంఠదఘ్నంగా మునిగి వున్నారు. సారథి గుండెలనిండా గాలి పీల్చుకుని మళ్ళీ కాయితం మీద ఏదో వ్రాయటం ప్రారంభించాడు. చిరంజీవి ఆ బల్లపక్కనే కూర్చున్నాడు.

పదినిమిషాలు గడిచేసరికి ఆయన పని పూర్తిచేసుకొని కాయితాలన్నింటిని ఎక్కడివక్కడ సర్దేసి చిరంజీవితో 'లే, పోదాం' అంటూ వుండగా బుర్రమీసాల వాడొకడు అక్కడికి వచ్చి 'మిమ్మల్ని ఆఫీసరుగారు రమ్మంటున్నారండి' అన్నాడు.

ఆ బుర్రమీసాలవాడి మెడలో ఏదో బిళ్ళవుంది. వాడి నెత్తిన టోపీ వుంది.

సారథి చిరంజీవినక్కడేవదిలి, త్వరత్వరగా ఆఫీసరుగారి గదిలోకి వెళ్ళాడు. ఆఫీసరు సారథిని కూర్చోమని చెప్పి "కంగ్రాచ్యులేషన్స్, మిష్టర్ సారథీ ! ఇవాళే కంపెనీనుంచి మిమ్మల్ని ప్రమోట్ చేస్తూ ఆర్డర్లువచ్చాయి. పని తొందరలో ఉండటంవల్ల ఉదయంనుండి చెప్పడానికి వీలుపడలేదు" అంటూ ఆ కాగితాలు ఆయనకు అందించాడు. సారథి పొంగిపోయాడు. ఆయన ఎన్నాళ్ళనుంచో ప్రమోషన్‌కోసం

కాచుకుని వున్నారు. ఆయన ఆనందం పట్టలేక ఆఫీసరుతో కరచాలనం చేసి ఇదంతా మీ చలవ అన్నాడు. ఆఫీసరు నవ్వుతూ "మరి మాకు ఏ డిన్నరో ఏర్పాటు చేయించండి" అన్నాడు. సారథి 'అలాగే' అంటూ ఇవతలికి వచ్చాడు. అప్పుడే అందరూ ఆయన్ని చుట్టేసి ఆ ఆర్డరు కాయితాలు చూస్తున్నారు. చిరంజీవికి ఆ గుంపులో వాళ్ళనాన్న కనిపించనేలేదు. వాడికి ఆదుర్దా ఎక్కువై 'నాన్నా' అని పెద్దగా కేక వేశాడు. సారథి ఇవతలికివచ్చి వాణ్ణి దగ్గరకి తీసుకున్నాడు. తర్వాత ఆయన అప్పటికప్పుడే అందర్నీ టీపార్టీకి ఆహ్వానించాడు ఆఫీసరు గారిని పిలిస్తే ఆయన "క్షమించు సారథీ ! నే నీపూట వూరికి వెళ్ళాలి. ఇంటికిపోయి ఎన్నో సర్దుకోవాలి. మరేమనుకోకు" అన్నాడు.

అందరూ తమతమ కాయితాలన్నీ సర్దేసి తయారైనారు. చిరంజీవికి ఈ హడావిడి అంతా ఏమిటో అర్థంకాలేదు. అతడు వాళ్ళ నాన్న చెయ్యిమాత్రం వదిలిపెట్టలేదు. వాళ్ళలో చాలామంది చిరంజీవిని చూసి "మీవాడేనా ?" అని అడిగి 'ఔన'నిపించుకుని వాడిబుగ్గలు నొక్కి నొక్కి వదిలిపెడుతున్నారు. శేఖరం వాణ్ణి ఎత్తుకుని 'అసలీవాళ వీడు రాబట్టే ఇది జరిగింది. ఇంటిదగ్గర వీణ్ణి ఎప్పుడూ కొట్టి చంపుతూ వుంటాడండి దుర్మార్గుడు' అన్నాడు సారథి నుద్దేశించి. సారథి మళ్ళీ చిరంజీవిని దగ్గరికి తీసుకుంటూ 'వూరికే ఎందుకు కొడతానురా శేఖర్ ! ఎప్పుడూ ఏవో అల్లరిపనులుచేసి వాళ్ళ పిన్నిని ఏడిపిస్తూ దెబ్బలుతింటూ వుంటాడు' అన్నాడు.

అందరూ ఏదో హోటల్లోకి వెళ్ళారు. అక్కడ చల్లగావుంది. అందరూ ఒకరూములో కూర్చుని ఏవేవో ఫలహారాలు తెప్పించుకుని తిన్నారు. చిరంజీవికి బల్లమీద వున్న జిలేబి అందలేదు. అతడు లేచి నిలబడి వాళ్ళవంక చూస్తూ ఆ జిలేబి తిన్నాడు. అది తినేసరికి అతనికి మొహం మొత్తింది. అందరూ మరి కొద్దిసేపట్లో బయటకువచ్చి సారథికి 'గుడ్‌బై' చెప్పి ఎవరిదోవన వారు వెళ్ళిపోయారు. సారథీ, చిరంజీవీ, శేఖరంగారూ ముగ్గురూ నెమ్మదిగా నడవటం ప్రారంభించారు. కొద్దిదూరం వెళ్ళిన తర్వాత చిరంజీవి "నాన్నా ! నొప్పి పొడదు..."

అన్నాడు. సారథి నవ్వి ఒక కొట్లోకివెళ్ళి స్నో సీసా ఒకటీ, పౌడరు డబ్బా ఒకటి కొన్నాడు.

ఇంటికి వెళ్ళేసరికి చిరంజీవికి మళ్ళీ భయంపట్టుకుంది. వాడు నాన్నగారి చేతుల్లోనుంచి స్నో సీసా పౌడరుడబ్బా తీసుకుని ఒక్క అంగలో యింట్లోకి వెళ్ళాడు. వాళ్ళ నాన్న శేఖరంగారితో మాట్లాడుతూ వాకిట్లోనే నిలబడ్డాడు.

చిరంజీవి ముందుగదిలోకి తొంగిచూశాడు. ఆ గది శుభ్రంగా కడిగివుంది. ఎక్కడా కిరసనాయిలు వాసనకూడాలేదు. అతడు వంట ఇంట్లోకి వెళ్ళి 'పిన్నీ పిన్నీ' అని పిలిచాడు. గుమ్మంలో నిలబడి తల్లో పూలు పెట్టుకుంటున్న జానకి అతన్ని చూసి కోపంతో "కాఫీనీళ్ళయినా తాగకుండా ఎక్కడికి పోయినావో చెప్పు ముందు" అని గదమాయించింది. చిరంజీవి వెనక దాచిపెట్టిన స్నో పౌడరూ బయటికి తీశాడు. ఆమె ఆశ్చర్యపోయి 'ఇవెక్కడివి?' అని అడిగింది. 'నాన్నగారు' అన్నాడు చిరంజీవి.

ఇంతలో వాళ్ళ నాన్న 'హల్లో జానీ!' అంటూ రానే వచ్చాడు.

జానకి మొహం ముడుచుకుని "ఛీ! జానీ ఏమిటి? పెంపుడు కుక్కలను పిలిచినట్టు!" అన్నది. సారథి కూర్చుంటూ "అయితే స్నోలూ పౌడర్ల కోసం ఆఫీసుకు కబుర్లుపెట్టడం ఎక్కడ నేర్చావు?" అని అడిగాడు. జానకి ఆశ్చర్యపోయింది.

చిరంజీవి నెమ్మదిగా వాకిట్లోకి వెళ్ళాడు. గోడ మీదుగా సేతు ముఖం కనుపించింది. వారిద్దరూ నిశ్శబ్దంగా ఒకరినొకరు చూసుకున్నారు. ఒక్క నిముషం గడిచేసరికి వంటయింట్లోనుంచి కేక వినిపించింది. చిరంజీవి నెమ్మది నెమ్మదిగా నడిచి లోపలికి వెళ్ళాడు.

సారథి వాణ్ణి దగ్గరకు తీసుకొని వొళ్ళో కూర్చోబెట్టుకుని గడియారం అద్దం పగలగొట్టావా? అలా వస్తువులను పాడుచేసుకుంటారా ఎవరైనా? తప్పుకదూ. రేపు దానికి మరో అద్దం వేయించి

బాగుచేయిస్తానే! అన్నట్టు యిందాక ఎండలో నడిచివొచ్చావు కదా కాళ్ళు కాలలేదూ? రేపు బజారుకుపోయి నీకు చెప్పులు కొంటానులే. నువ్వు కాఫీ తాగలేదని పిన్ని చెప్పిందే! ఇదిగో తాగు." అన్నాడు. చిరంజీవి 'అమ్మయ్య' అనుకున్నాడు. పిన్నిమాత్రం 'ఏదైనా అతి పనికిరాదు" అన్నది. తండ్రి నవ్వాడు. చిరంజీవి కూడా నవ్వాడు. అప్పుడే యింట్లోకి వచ్చిన సేతుకూడా నవ్వాడు.

(29-6-60 - ఆంధ్ర సచిత్ర వారపత్రిక)

# నిష్ఠ

"దీన్నిండా తప్పులే...మళ్ళీ వ్రాసుకురా...నీకు తెలియకపోతే నీ సీనియర్ని కన్సల్టు చెయ్యి. మరో అరగంటలో యిది కావాలి..." అన్నాడు ఆఫీసరు, జోగినాథం అంతకుముందు తయారుచేసిన డ్రాఫ్టు మళ్ళీ అతని చేతికి అందిస్తూ.

జోగినాథం వినయంగా "అలాగేనండి" అంటూ ఆ కాగితం అందుకున్నాడు. గది దాటి యివతలికి వచ్చేసరికి అక్కడే లోపలికి వెళ్ళేందుకు కాబోలు నిరీక్షిస్తూ నిలబడివున్న కుసుమ అతనికి కనిపించింది. ఆమె ఆఫీసరుగారి మాటలు వినేవుండాలి. అందుకు నిదర్శనం ఆమె అతనివంక చూసి నవ్విన నవ్వు.

ఉమాపతి తన సీటులో తీరికగా కూర్చునివుండి కళ్ళెగరవేసి "ఆ కాగితం మళ్ళీ నీ చేతుల్లోకే వచ్చిందేమిటయ్యా మహానుభావా?" అని అడిగాడు.

జోగినాథం మొహం తుడుచుకుని సిగ్గుపడుతూ "దీన్నిండా తప్పులున్నాయిట... ... మళ్ళీ రాసుకురమ్మన్నారు" అని చెప్పాడు.

ప్రక్కనే కూర్చుని ఏదో ఫైలు తిరగవేస్తున్న లక్ష్మీపతి తల యెత్తి చూసి "ఉద్యోగంలో చేరి నెలాపదిహేను రోజులేకదా అయింది ? ఏవో చిన్నచిన్న తప్పులుంటే తాను దిద్ది పైపిస్టు కివ్వగూడదూ ? అంతా హోషలే బ్రదర్...ఆ కుర్చీ అటువంటిది" అన్నాడు.

ఉమాపతి "సరే...ఇకనేం ? ఆ కాయితం యిలా తీసుకురా... గబగబా ఏదో గిలికి యిచ్చి త్వరగా బయటపడిపోదాం ... అన్నట్టు యివాళ సినిమా ప్రోగ్రాం కూడా ఉంది" అన్నాడు.

జోగినాథం ఆ కాయితం ఉమాపతికి అందించి అతని ముందు కుర్చీలో కూర్చుని "మీ యిద్దరూ సినిమాకు వెళుతున్నారా?" అని అడిగాడు.

ఉమాపతి, లక్ష్మీపతివంక చూశాడు. లక్ష్మీపతి కూడా ఆ ప్రశ్న విని జోగినాథంవైపు చూశాడు. అతడు విసుగుతో జోగినాథాన్ని ఉద్దేశించి "నీ ప్రవర్తన నాకేం నచ్చడంలేదోయ్... మనం ముగ్గురం ఒకే రూములో ఉంటూ ఒకే హోటల్లో భోజనం చేస్తున్నాము...అయినా నువ్వు అదేమిటో అంటీ అంటనట్టు ప్రవర్తిస్తూవుంటావు. మొన్న నొకసారి కూడా యిలాగే సినిమాకు పోదాం రమ్మంటే రానంటే రాను పొమ్మన్నావు. అలా స్నేహపూర్వకంగా అడిగినప్పుడు మొహంమీద కొట్టినట్టు రాను పొమ్మంటే ఎలా వుంటుందో ఆలోచించావా?" అన్నాడు.

ఉమాపతి "ఎందుకులే బ్రదర్! అతని తీరు తెలిసివచ్చింది కదా! ఇక యేమీ మాట్లాడక వూరుకో" అని తాను పనిలో మునిగిపోయాడు.

జోగినాథం యిరుకున పడ్డాడు. అతికష్టంమీద గొంతు పెగుల్చుకుని "క్షమించండి" అనగలిగాడు. ఉమాపతి వినిపించుకున్నట్టులేదు.

మరో అయిదు నిముషాల్లో ఉమాపతి తాను తయారుచేసిన కొత్త డ్రాఫ్టు జోగినాథం ముందుపడేసి లేచినుంచుని జేబులు సర్దుకుని లక్ష్మీపతి నుద్దేశించి "త్వరగా తెమలవోయ్" అన్నాడు. లక్ష్మీపతి ఫైలు మడిచి అవతలపడేసి "నేను సిద్ధమే" అంటూ లేచి మళ్ళీ జోగినాథం వంక చూసి "మరి యీాయనగారి మాటేమిటి?" అని అడిగాడు. ఉమాపతి జేబుల్లో చేతులుంచుకుని జోగినాథంవంక తిరిగి "ఏమంటావు?" అని అన్నాడు.

అతడు కాయితం మడతపెడుతూ లేచినుంచుని "నేనెందుకులెండి బాబూ! మీరిద్దరూ వెళ్ళిరండి. నేను రూములోనే వుంటాను" అన్నాడు.

ఉమాపతి కొద్దిగా కోపం తెచ్చుకుని అడుగులు ముందుకువేశాడు. లక్ష్మీపతి సీటులోనుంచి లేచి యివతలికివస్తూ "ఏం మాతో రావడం యిష్టంలేదా నీకు?" అని అడిగాడు.

జోగినాథం నీళ్ళు నములుతూ "పతీ! నాదగ్గర డబ్బు..." అంటూ ఆగిపోయాడు.

అంతలోనే అందుకుని లక్ష్మీపతి "భలేవాడివే జోగినాథం! నీ దగ్గర డబ్బు వుంటేమటుకు నిన్ను టిక్కెట్లు కొననిస్తామా? మరే మిటో అనుకున్నాను. అదా నీ సందేహం? ఊఁ. ఇకనైనా బయలుదేరు. డబ్బు మాదగ్గర వుందిలే..." అన్నాడు.

జోగినాథం "అది కాదండీ బాబూ! మీకెలా చెప్పాలో అర్థం కావడంలేదు. నేను రానుగాని, నన్ను విసిగించక మీరు వెళ్ళిరండి..." అన్నాడు విసుగుతో.

ఉమాపతి నిష్ఠూరమాడుతూ "అదయ్యా సంగతి... డబ్బును గురించి ఎంతమాత్రం కాదు. కేవలం 'యీ జులాయి వెధవలతో ఎందుకు తిరగాలి"...అని అతని బాధ. అతను బుద్ధిమంతుడు. జాగ్రత్తపరుడు. సినిమాలూ షికార్లూ అతనికి గిట్టవు. కాబట్టి యికమీదటనైనా మనం అతన్ని పిలిచి అవమానం చెందనక్కరలేదు. అర్థమయిందా? పోదాం పద" అన్నాడు.

లక్ష్మీపతి "అదీ నిజమే. ఇవాళ మనం సినిమాకు తీసుకువెడతా మంటే వెంటనేవస్తే... ...మళ్ళీ తనెప్పుడైనా ఆమాట అనవలసివస్తుం దేమోనని దిగులుకూడా ననుకుంటాను" అంటూ జేబులోంచి తాళం చెవులు తీసి బల్లమీదికి విసిరి "అయ్యా జోగినాథంగారూ, యివిగో రూము తాళాలు... మేము వెళ్ళొస్తాం..." అన్నాడు.

మరుక్షణంలో వారిద్దరూ చేతులు కలుపుకుని బయటికి వెళ్ళి పోయారు. జోగినాథం మనస్సు చివుక్కుమన్నది. లక్ష్మీపతి యెంత మాట అన్నాడు! తమతో కలసి సినిమాలకూ షికార్లకూ రానంత మాత్రంలో అంత మాట అనడమేనా?

అతడు చుట్టూ చూశాడు. అప్పటికే అంతవరకూ అక్కడవున్న

యితర గుమాస్తాలుకూడా వెళ్ళిపోయారు. మూలగా కుసుమ ఒక్కతే మాత్రం తన సీటులో కూర్చుని యేదో కాయితం టైపు చేస్తున్నది. జోగినాథం వుండి వుండి ఆమెవైపు చూస్తూ ఆఫీసరు గదిలోనుంచి పిలుపుకోసం ఎదురు చూస్తున్నాడు.

అంతలో అతనికి దూరంగా కిటికీలో ఎత్తుగా ఉంచబడిన నీళ్ళ కూజా కనిపించింది. నీళ్ళు మరింత చల్లగా వుండటంకోసం దానిచుట్టూ జనపనార తాడు అల్లివుంచారు. దానిపక్కనే రెండు గాజుగ్లాసు లున్నాయి.

జోగినాథం నెమ్మదిగా లేచివెళ్ళి శుభ్రంగా తళతళ లాడుతున్న గ్లాసును చేతిలోకి తీసుకుని దాన్ని నీళ్ళతోనింపి చెయ్యి పైకెత్తి ఒక్క నిముషంసేపు దానివంక కన్నార్పకుండా చూశాడు. గ్లాసులో నీళ్ళు తెల్లగా మిలమిల లాడుతున్నాయి. అటువైపునుంచి ప్రసరిస్తున్న వెలుగు కిరణాలవల్ల అవి క్షణక్షణానికీ మరింత మెరిసిపోతున్నాయి. అతడు నెమ్మదిగా ఆ గ్లాసు నోటిదగ్గర వుంచుకుని గుక్క తర్వాత గుక్కగా నింపాదిగా తాగాడు. తర్వాత గ్లాసు అక్కడ వుంచి మూతి తుడుచు కుంటూ తలతిప్పి చూసేసరికి తనవంకనే కన్నార్పకుండా చూస్తున్న కుసుమ కనిపించింది. అతడు సిగ్గుపడిపోయి త్వరత్వరగా తన సీటు లోకి వెళ్ళి కూర్చున్నాడు. కుసుమ అంతవరకూ యీతంతు అంతా తన పని ఆపుకుని మరీ చూసింది కాబోలు. అతడు కుర్చీలో కూర్చోగానే మళ్ళీ టైపుశబ్దం ప్రారంభమైంది.

కొద్ది నిముషాల తర్వాత ఆఫీసరుగారి గదిలో బెల్ మ్రోగింది. కుసుమ గబగబాలేచి లోపలికివెళ్ళి మళ్ళీ వెంటనేతిరిగివచ్చి జోగినాథంతో "మిమ్మల్ని పిలుస్తున్నారు." అన్నది.

జోగినాథం కాయితం చేతిలోకి తీసుకుని ఒక్క ఉదుటున లేచి వెళ్ళి ఆఫీసరుగారి ముందు నిలబడ్డాడు. ఆయన అతని చేతిలో కాయితం తీసుకుని తలఎత్తి "ఊఁ! ఎవరిని కన్నుల్లు చేశావు?" అని అడిగాడు.

జోగినాథం నెమ్మదిగా "ఉమాపతి వ్రాసి యిచ్చాడండి." అని చెప్పాడు.

ఆయన చురుకుగా చూసి "అలాగా? చూడు జోగినాథం! నువ్వు అలా ఉన్న విషయం చెప్పినందుకు నాకు చాలా సంతోషంగావుంది. కాని ఒక్క సంగతి గుర్తుపెట్టుకో. అతను గ్రాడ్యుయేటు. పైగా అనుభవం ఉన్నవాడు. అతనీనాడు నీకు స్నేహితుడు కాబట్టి సహాయం చెయ్యడం బాగానేవుంది. కానీ ఎన్నాళ్ళిలా? నువ్వు కొత్తవాడివి. పైగా నీకు చదువూ తక్కువే. అయినా నువ్వు కొంచెం చొరవ తీసుకుని పనిలో అభివృద్ధి చూపించాలి. వారిమీదా వీరిమీదా కొత్తల్లో ఆధారపడటం తప్పేమీకాదు. వాళ్ళు సహాయం చెయ్యటమూ తప్పుకాదు. కాని నువ్వు కూడా స్వతంత్రించి కొంచెం యింప్రూవ్‌మెంట్ సాధించాలి. నాలుగు వాక్యాలు స్వంతంగా తప్పులేకుండా వ్రాయడం బ్రహ్మవిద్యేమీ కాదు. సరే...నువ్వింక వెళ్ళు ..ఆ టైపిస్టును రమ్మని చెప్పు... ఈ కాయితం యివాళ వెళ్ళిపోవాలి..." అన్నాడు.

జోగినాథం తలవూపి యివతలికివచ్చి కుసుమనుద్దేశించి "మిమ్మల్ని పిలుస్తున్నారండీ..." అని చెప్పాడు. ఆమె లేచి ఆఫీసరు గదిలోకి వెళ్ళింది.

జోగినాథం టైపుమెషీను దగ్గర నిలబడ్డాడు. కన్నార్పకుండా దానివంకనే చూశాడు. కుసుమ లోపల ఆఫీసరుగారి గదిలో "అలాగేనండీ... యిప్పుడే చేసియిస్తాను." అంటున్నది.

అతడు టైపుమెషీను దగ్గరగా జరిగి ఒకవిధమైన చాపల్యంతో వ్రేలు కదిపి ఒకమీట నొక్కాడు. లోపల కాయితం చుట్టివున్న సిలిండరు 'ధన్'మని పెద్ద శబ్దంచేస్తూ మరోవైపుకు కదిలింది. అతడు అదిరి పడ్డాడు.

అంతలో కుసుమ చేతిలో కాయితంతోవచ్చి "అదేమిటి? 'టాబ్యులేటర్' నొక్కారా? అలాచేస్తే మెషీను పాడైపోతుంది. మీరిలా కూర్చోండి—మీ కాయితమేయిది. ఇప్పుడే ఆఫీసరుగారికి అందించాలి—

ఆ తర్వాత యిద్దరం కలిసే వెడదాం..." అంటూ కూర్చుని తనపనిలో నిమగ్నురాలయింది. జోగినాథం "అలాగేనండీ" అంటూ తలవూపి ఒక కుర్చీలో కూర్చున్నాడు. అతనితో కుసుమ యిదే మొదటిసారి మాట్లాడటం.

జోగినాథం కనురెప్పపాటు అయినా లేకుండా చూస్తూ కూర్చున్నాడు. అతనికి కుసుమ నైపుణ్యం అబ్బురం కలిగించింది. ఆమె పలుచని బంగారురంగు వ్రేళ్ళు టైపు మెషినుమీద వేగంగా అందంగా కదులుతున్నాయి. ఆ వ్రేళ్ళలో ఏదో మంత్రశక్తి ఉన్నట్లు అనిపించిందతనికి. తాను పుట్టినప్పటినుంచీ పద్దెనిమిదేళ్ళవరకూ— అంటే స్కూలు ఫైనల్ పాసయ్యే వరకూ— ఉన్నది గుంటూరు జిల్లాలో ఒక మారుమూల పల్లెటూళ్లో. తాను ఎనిమిదవ తరగతి వరకూ చదువుకున్నది పక్కవూరిలోని మిడిల్‌స్కూల్లో. ఆ వూరు కూడా పెద్దదేమీ కాదు. తన మిడిల్‌స్కూల్ చదువు పూర్తికాగానే తన తల్లి ఇంక చదువు మానుకోమన్నది. కాని, ఆ సంవత్సరం నుంచి స్కూల్‌ఫైనల్ వరకూ పై తరగతులు కూడా ఏర్పాటుచేసి ఆ స్కూల్‌ను హైస్కూలుగా మార్చారు. ఆ సదుపాయం రావటంతో అతని తల్లి మనసు మార్చుకుని 'ఊరువిడిచి ఎక్కడికీ పోనక్కరలేదు కదా' అనే ఆలోచనతో మళ్లీ ఫోర్తుఫారంలో చేరమన్నది. ఆ విధంగా అతడు, రెండు నెలల క్రిందట యీ ఉద్యోగం వచ్చేవరకూ, రైలు ప్రయాణం కూడా ఎన్నడూ చేయలేదు. ఇప్పుడు మెషిను ముందు కూర్చుని 'చకచక' టైపు చేస్తున్న కుసుమను చూస్తూవుంటే ఎంతో గొప్పగా వింతగా వుంది.

ఆమె ఆ కాయితం పూర్తిచేసి ఆఫీసరు గదిలోకి వెళ్ళింది. జోగినాథం లేచి మంచినీళ్ళ కూజా దగ్గరికి వెళ్ళి మూతతీసి లోపలి నీళ్ళ వంక ఒక్క క్షణం చూశాడు. అలా చూస్తూవుండగానే- తన వూరిలో తన చిన్నచెల్లెలు దాహంతో బాధపడుతూ కూర్చునివుంది. ఎండ నిప్పులు చెరుగుతున్నది. వెచ్చనిగాలి రివ్వున వీస్తున్నది. ఇంటి ముందు బయట ప్రదేశంలో దూరంగా సుడిగాలి గిర్రున తిరుగుతున్నది. తన తల్లి సగం మాత్రమే నిండిన బిందెను భుజాన పెట్టుకుని ఎండలో యింటికి నడిచి

వస్తున్నది. అన్నంతింటూకూడా నీళ్ళను పొదుపుగా వాడుకోవాలి అక్కడ...స్నానం చేసేందుకు సరేసరి... ఆ ఉప్పు నీళ్ళకుకూడా రేష నింగే... అతని కళ్లు చెమర్చాయి. వెంటనే గ్లాసు నీళ్ళతో నింపుకుని గడ గడ త్రాగాడు.

తర్వాత వెనుదిరిగి చూసేసరికి ఎంతసేపటి నుంచీ తనను గమనిస్తున్నదో కుసుమ—అక్కడే చేతులుకట్టుకుని నిలబడివుంది. ఆమె హఠాత్తుగా అతని చేతివంక చూసి "అరె! మీ చేతికి ఆరువ్రేళ్లున్నాయే!" అన్నది ఆశ్చర్యంగా.

జోగినాధం తన ఎడమచేతిని చూసుకుని నవ్వాడు.

కుసుమ "రండి... అయిదున్నర దాటింది.... ఇళ్ళకు చేరుకుందాం...." అంటూ దారితీసింది.

జోగినాధం ఆమె ననుసరించి మెట్లు దిగుతూవుండగా ఆమె మళ్ళీ "చేతికి ఆరువ్రేళ్లుంటే అదృష్టం అని అంటారే నిజమేనా అండీ?" అని అడిగింది. అతడు నిట్టూర్చి "ఆఁ! ఏం అదృష్టమో!" అన్నాడు.

ఇద్దరూ మెట్లు దిగి వీధిలోకి వచ్చి నడవటం ప్రారంభించారు. పేవ్‌మెంట్ మీద జోగినాధం కుసుమ పక్కగా నడుస్తున్నాడు. అతని కిది పూర్తిగా కొత్త అనుభవం.... అతని కిప్పుడు పందొమ్మిదోయేడు. ఇంత వరకూ అతడు పధ్నాలుగేళ్ళ తన చెల్లెలితోతప్ప పరాయి ఆడ పిల్లతో ఎన్నడూ మాట్లాడి ఎరుగడు. ఇప్పుడు కుసుమ వంటి అంద మయినదీ, నాగరికురాలూ అయిన పడుచువెంట నడవటం అతనికి చాలా యిబ్బందిగానేవున్నా ఒక వింత ఆనందాన్ని కూడా యిస్తున్నదని చెప్పక తప్పదు.

ఆమె నడుస్తూనే "ఏమండీ! ఇందాక పతిద్వయం మీమీద అలిగి వెళ్లినట్టున్నారే!...." అన్నది.

"అవునండీ! పోయినవారంలో కూడా ఒకసారి యిలాగే

జరిగింది. వాళ్లిద్దరూ సినిమాలకూ, సర్కసులకూ పోతూ నన్నుకూడా రమ్మంటారు. నాదగ్గర వాటన్నిటికీ డబ్బెక్కడవుంటుంది చెప్పండి?— మా వూళ్ళో యింటిదగ్గర మా అమ్మ యిద్దరు చెల్లెళ్ళూ వున్నారు. పెద్ద చెల్లెలికి పధ్నాలుగేళ్ళు— దానికి పెళ్ళి కావలసివుంది— చిన్న చెల్లెలు ఆరేళ్ళది— మాకు ఆస్తిపాస్తులేవీ లేవు. పైగా మా వూళ్ళ సంగతి తెలుసుగా మీకు? అక్కడ మంచినీళ్ళు కూడా 'బిందె యింత' అని కొనుక్కోవాలి— అందువల్ల నేను జీతం అందుకోగానే నాకోసం అతి తక్కువ డబ్బు వుంచుకుని మిగిలినదంతా అక్కడికి పంపుతాను. అలాంటప్పుడు నాకు వీళ్ళతో తిరగడం ఎలా సాధ్యపడుతుంది చెప్పండి—" అంటూ ఆగాడు జోగినాథం. కుసుమ జాలిగా అతనివంక చూసింది.

అతడు మళ్ళీ "నాదగ్గర డబ్బు ఉండదని తెలిసికూడా నన్ను తనతోరమ్మని బలవంతం చేస్తారు. అన్నిటికీ తమ డబ్బు పెట్టుకుంటా మంటారు. అది నాకు బొత్తిగా యిష్టం వుండదు. అలా అని చెబితే వాళ్ళకు కోపం పొడుచుకొచ్చేస్తుంది" అన్నాడు.

కుసుమ నవ్వి "బాగానేవుంది—" అన్నది.

జోగినాథం "మీ రెప్పుడూ మా ప్రాంతాలకు రాలేదు కదండీ. అక్కడ నీటిచుక్క కనిపించదు. అన్ని కాలాల్లోనూ ఒకటే కరువు. బావులన్నీ పాతాళంలోకి వెళ్లే సొరంగాల్లాగా వుంటాయి. తొంగిచూస్తే అడుగున ఏమీ కనిపించదు. పెద్దతాడు బొక్కెనకుకట్టి లోపలికి వదులుతూ వుంటే ఎంతకూ నీళ్ళు తగలవు. చివరకు బొక్కెన రాళ్ళ మీదపడిన శబ్దం వినిపిస్తుంది. ఇక నీళ్ళు ఎక్కడో చిన్ని గుంటలా కొద్దిగా వుంటాయి. బొక్కెనను అక్కడికి జరిపి నీళ్లు రాబట్టుకోవాలి.... మా ప్రాంతాలలో బొక్కెనలెలా వుంటాయో తెలుసా మీకు? కిరసనాయిలు డబ్బాలుంటాయి చూశారూ, వాటిని సగానికి తెగగొట్టి అతుకు వేసి నీళ్ళను తోడ్చుకు వచ్చేందుకు వీలుగా తయారుచేస్తారు. మధ్యాహ్నంపూట సూర్యుడు నడినెత్తిమీదవున్నప్పుడుమాత్రం బావిలోపల

ఎక్కడో నీళ్ళు తళతళ లాడుతూ కొంచెంగా కనిపిస్తాయి. అందరూ రాత్రివేళల్లో వెళ్ళి మరునాటికి కావలసిన నీళ్ళు తెచ్చుకోవలసిందే. ఎల్ల వారితే జల ఉండదు— చుక్కగూడా మిగలదన్నమాట—" అంటూ ఆగి మళ్ళీ నిట్టూర్చి "అందుకే నాకు మావూరంటే బొత్తిగా యిష్టంలేదు— మావాళ్ళను కూడా యిక్కడికి తీసుకు వొచ్చేద్దా మనిపిస్తూవుంటుంది అప్పుడప్పుడు—అయినా నాకిక్కడ వొచ్చేది చాలొద్దూ—" అన్నాడు.

కుసుమ అతడు చెప్పినదంతా కళ్లు పెద్దవి చేసుకుని ఆశ్చర్యంగా విన్నది. అతడు మళ్ళీ "రెణ్ణెల్ల క్రిందట నేను ఉద్యోగంలో జాయి నయేందుకు వచ్చేటప్పుడు రైలు కృష్ణానదిమీదినుంచి పరుగెత్తుతూ వుండగా చూసి ఆశ్చర్యంతో బొమ్మలా అయిపోయాను. మీరు నమ్మ రేమో! అన్ని నీళ్ళు ఒక్కచోట చూడటం అదేనాకు మొదటిసారి— చిన్నప్పుడెప్పుడో సముద్రం చూశానుగాని అవి ఉప్పునీళ్ళు కదా! ఇంత నదీ, యిన్ని నీళ్ళూ వున్న ప్రాంతం సంపన్నం కాకుంటా ఎలా వుంటుంది చెప్పండి? నీళ్ళు పుష్కలంగా వున్న చోటే నాగరికత— మా ప్రాంతా లలో మనుషులు వొంటినిండా పోసుకునేందుకూ కడుపునిండా తాగేందుకు పుష్కలంగా నీళ్ళులేకనే చిక్కిపోతున్నారని నాకప్పుడప్పుడు అనిపిస్తూ వుంటుంది. ఇక్కడ నాకు చాలా హాయిగావుంది. రోజూ ఉదయం లేచీలేవగానే కృష్ణకువెళ్ళి స్నానం చేస్తాను. సాయంకాలం ఆఫీసునుంచి వెళ్లివెళ్ళగానే బావిదగ్గర మళ్లీ స్నానం చేస్తాను. ఇప్పుడెంతో హాయిగా ఆరోగ్యంగా వున్నాను— అంతా నీళ్ళలోనేవుంది సుమండీ—" అని ఒక్కక్షణం ఆగి "నాగార్జునసాగర్ ప్రాజెక్టు పూర్తి అయితే మాకూ నీళ్ళకరువు తప్పుతుందనీ, మెట్టపొలాలన్నీ మాగాణి భూములవుతాయనీ అనుకుంటున్నాను. అది ఎప్పటికో—" అన్నాడు నిట్టూర్చి.

కుసుమ నవ్వి "అయితే మీ నిర్వచనం ప్రకారం నీళ్ళే నాగరికతకూ సౌభాగ్యానికీ మూలకారణం అన్నమాట—" అన్నది.

జోగినాధం తలవూపుతూ "అంతేనండీ— నిస్సందేహంగా

అందులో మీకేమి అనుమానం అక్కర్లేదు... అది కరెక్టు..." అన్నాడు...కుసుమ ఆ మాటలు విని మళ్ళీ నవ్వింది.

అప్పటికి వారు చాలాదూరం నడిచివచ్చారు. కుసుమ ఒకచోట ఆగి "ఇదే మా యిల్లు...రండి...ఒక్క నిముషం కూర్చుని పోదురు గాని..." అన్నది.

జోగినాథం "ఎందుకులెండి...యిప్పుడు" అంటూఏదోచెప్పబోయి ఆమెవంక చూసి ఆగి 'సరే పదండి..." అన్నాడు. ఆమె నవ్వుతూ మెట్లెక్కి తలుపుతట్టి "మా అన్నయ్య యింట్లోనే వున్నాననుకుంటాను.. మిమ్మల్ని పరిచయం చేస్తాను" అన్నది.

ఆరేళ్ళ పలుచని ఎర్రతెలుపంటి పిల్ల తలుపు తెరిచి లోపలికి వెడుతూ "అక్కయ్య వొచ్చింది" అంటూ రాగం తీసింది. కుసుమా, జోగినాథం గుమ్మం లోపలికి వెళ్లేసరికి కిటికీ పక్కగావున్న కుర్చీల్లో ఒకదాన్లో ఎవరో కూర్చుని పేపరు చూస్తున్నారు. కుసుమ అటు తిరిగి "అన్నయ్యా! నువ్వెంతసేపయింది వచ్చి" అని అడిగింది. ఆ వ్యక్తి పేపరు తప్పించి "ఇప్పుడే పది నిముషాలయి వుంటుందేమో" అంటూ జోగినాథం వంక చూశారు. కుసుమ "వీరు మా ఆఫీసులో పని చేస్తున్నారు.. మిస్టర్ నాథ్‌గారు. ఈయన మా అన్నయ్య కామేశం.. ఇక్కడ కాలేజీలో లెక్చరర్" అని ఒకరినొకరికి పరిచయంచేసి "మీరు కూర్చుని మాట్లాడుకుంటూ వుండండి.. నే నిప్పుడే అయిదు నిముషాల్లో కాఫీలు పట్టుకొచ్చేస్తాను" అంటూ లోపలికి వెళ్ళింది.

ఆ యిద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు. ఆయనకు యిరవై అయిదేళ్ళకు మించి వుండదు వయస్సు. సన్నగా, ఎర్రగా వున్నాడు. కళ్ళకొక రిమ్‌లెస్ జోడువుంది. ధరించిన దుస్తులు చాలా నాగరికమైనవీ, ఖరీదైనవీనూ.. ఆయన పేపరు పక్కనవుంచి జోగినాథం ఉద్యోగాన్ని గురించీ, అతని చదువును గురించీ ఏవేవో ప్రశ్నలు వేశాడు.

కొద్ది నిముషాల్లో కుసుమ దుస్తులు మార్చుకుని చేతుల్లో కాఫీ

కప్పులతో వచ్చింది. తానొక కుర్చీలో కూర్చుని ఆ యిద్దరికీ కాఫీలు అందించి అన్నగారివంక తిరిగి "మీరు యివాళ చాలా చిత్రమైన విషయం చెప్పారన్నయ్యా, అది మీ ఎకానమిస్టు లెవరూ యింతవరకూ కనిపెట్ట లేదని బల్లగుద్ది మరీ చెప్పగలను" అన్నది.

ఆయన తలయెత్తిచూసి నవ్వుతూ "ఏమిటో అది-" అన్నాడు. కుసుమ జోగినాథంవంక తిరిగి "చెప్పనా ?" అని అడిగింది. జోగినాథం బిడియపడుతూ "ఎందుకులెండి ? నాదంతా ఏదో పిచ్చి వాగుడు" అన్నాడు.

ఆమె 'అలా కాదు, చెప్పి తీరాలి .. అన్నయ్యా! వీరంటారు కదా, నీళ్ళే సర్వ నాగరికతకూ, సౌభాగ్యానికీ కారణంట. . నీళ్ళు దొరకనిచోట్లా లేక తక్కువగా ఉన్నచోట్లా నాగరికత అభివృద్ధి చెందదనీ, ప్రజలు సంపన్నంగా ఉండరని కూడ వారి సిద్ధాంతం . . ఇప్పుడు చెప్పు మీ ఎకన మిక్స్‌లో ఈ విషయం యింతకుముందు ఎవరైనా చెప్పారా" అన్నది.

ఆయన నవ్వాడు. కాఫీ కప్పు ఎదురుగా టీపాయ్ మీద ఉంచి "అది మంచిపాయింటే . . మీరు చెప్పింది సబబుగానే ఉంది. కాదనను.." అన్నాడు.

కుసుమ జోగినాథం వైపు "చూశారా ? మీరు గెలిచారు" అన్నట్లు చూసింది.

కామేశం మళ్ళీ తలపంకించి "కాని యిందులో ఒక తమాషా ఉంది. .మీరు చెప్పినట్లు నదు లెక్కువగా ఉన్నచోట్లా, వర్షాలు ఎక్కువగా కురిసేచోట్లా తప్పకుండా అభ్యుదయం ఉంటుంది. కాని అవి విపరీతంగా వున్నా బాధే—ఉదాహరణకు చూడండి . . ఇప్పుడు నదులకు వరదలు వొస్తున్నాయి. పంటలన్నీ గంగపాలైపోతాయి. లెక్కలేనంతమంది ప్రజలు నిర్వాసితులైపోతారు. అకాలంలో వర్షాలు కురిశాయనుకోండి... అప్పుడు పంటలు ధ్వంసమే. . . కాబట్టి ఎటూ గట్టిగా రూలింగ్ యిచ్చేందుకు వీలులేదు . ." అంటూ ఆగి, 'అన్నట్టు మీవూరేది ?" అని అడిగాడు.

జోగినాథం చెప్పాడు. కుసుమ అందుకుని "వాళ్ళ వూరును గురించి యిప్పుడు నాకు చెప్పారన్నయ్యా! అటువంటి వూళ్లు కూడా ఉంటాయా అని ఆశ్చర్యపోయాను. నీళ్లుకూడా కొనుక్కుంటేగాని దొరకవుట అక్కడ....తాగేందుకూ, వొంటికి పోసుకునేందుకూ అన్నిటికీ నీటి కరువట" అన్నది.

ఆయన "అందులో విచిత్రమేముంది? అలా ఎన్నో వూళ్ళున్నాయి మనదేశంలో...అన్నట్టు ఈ సందర్భంలో మా స్నేహితు డొకాయన చెప్పిన విషయం ఒకటి గుర్తువస్తున్నది, ఆయనను అటువంటి వూళ్ళో ఎవరో భోజనానికి పిలిచారట...అదే మొదటిసారి ఆయన ఆ వూరికి వెళ్ళడం...భోజనం చేస్తుండగా 'మంచినీళ్ళేమిట'ని ప్రక్కవారిని అడిగాడట...వాళ్ళు ఆయన విస్తరిముందున్న ఒక చిన్న గాజు గ్లాసును చూపించి అవిగో అవే మంచినీళ్ళు అన్నారట...ఆయన గ్లాసులో తెల్లగా తేనెకలిపినట్టున్న ఆ ద్రవం చూసి అంతవరకూ ఏదో డ్రింకు అనుకున్నాట్ట—తీరా చూస్తే అవే మంచినీళ్లు..."అన్నాడు.

కుసుమ జోగినాథం ఒక్కసారి నవ్వారు. తర్వాత జోగినాథం లేచి ఇక "వెళ్ళి వస్తానండీ..." అన్నాడు. అన్నాచెల్లెళ్ళిద్దరూ అతన్ని గుమ్మందాకా సాగనంపి వుండిపోయారు.

అతడు నెమ్మదిగా నడిచి రూము చేరుకుని తాళం తీశాడు. లోపలికి వెళ్ళి చీకటిపడుతున్నందున లైటువేసి స్నానానికి సిద్ధమైనాడు. చిన్న కొల్లాయి గుడ్డ ఒకటి కట్టుకుని భుజంమీద మరో టవల్ వేసుకుని బావి దగ్గరికి చేరుకున్నాడు. మొదట ఒక పెద్ద బాల్చీ నిండా నీళ్లు తోడుకుని నూతి పళ్లెంమీద కూర్చున్నాడు. హాయిగా, ప్రశాంతంగా ఒకదాని తర్వాత ఒకటిగా మూడు పెద్ద బొక్కెనల నీళ్ళు పోసుకున్నాడు.

ఇంట్లో మరో భాగంలో అద్దెకున్న ఒక గుమాస్తాభార్య నీళ్ళకోసం చేతిలో బిందెతో తమ వాటా గుమ్మంలో నిరీక్షిస్తూ నిలబడి వుంది.

అతడామెను చూడనేలేదు. ఆమె లోలోపల 'అతడు తనను చూసి కూడా త్వరగా తెములక బాధపెడుతున్నా'డని అనుకుంటున్నది.

జోగినాథం నెమ్మదిగా అరగంట తర్వాత నూతిపళ్లెం దిగి యివతలికి వచ్చాడు. ఇంటి యజమానురాలు అంతసేపటినుంచీ యీ తంతు అంతా చూస్తూనే వుంది. ఆమె నెమ్మదిగా అతన్ని మందలిస్తూ "అలా పనివేళ గంటల తరబడి నూతి పళ్లెంమీద కూర్చుండిపోతే ఎలా చెప్పు నాయనా ? ఆవిడ యిందాకటినుంచి నీళ్ళకోసం తొందరపడుతూ నీ కారణంగా అక్కడే నిలబడి వుంది...చూడలేదూ ?" అన్నది.

జోగినాథం నాలిక కరచుకుని ప్రక్కకు తిరిగిచూసి "పొరపాటయి పోయిందండీ..." అన్నాడు.

అతడు తర్వాత రూములో కొద్దిసేపు విశ్రాంతిగా కూర్చున్నాడు. ఆవేళ జరిగినదంతా మననం చేసుకున్నాడు. తన రూమ్ మేట్స్ యిద్దరితోనూ తాను అలా వ్యవహరించడంలోని ఉచితానుచితాలు బేరీజు వేసుకుని ఆలోచించాడు. చివరకు తానేమీ తప్పు చెయ్యలేదని నిరయించుకున్నాడు. అ ఆ యిద్దరూ తనకు మంచి మిత్రులు. అటు ఆఫీసులోనూ వాళ్ళు చేస్తున్న సహాయం అమూల్యమైనది. ఇద్దరూ చక్కగా చదువుకున్నవాళ్ళు. డబ్బున్నవాళ్ళు వాళ్ళకు తనమీద అంత అభిమానం వుండటం తనకెంతో మంచిది. దాన్ని తాను పోగొట్టుకో కూడదు.

ఉమాపతి గోదావరి జిల్లావాడు. మంచి సంపన్న కుటుంబంలో పుట్టినవాడు. అతని తండ్రికి పిత్రార్జితమైన తోటలూ, పొలాలూ, డొబ్బూ పుష్కలంగా వున్నాయి. అతడు బుద్ధిగా చదువుకున్నాడు. ఏ క్లాసులోనూ తప్పలేదు. డిగ్రీ రాగానే, చిన్నదే అయినా దొరికిన ఉద్యోగంలో వెంటనే చేరాడు. అతడు యింటికి నయాపైసా కూడా పంపనక్కర లేదు. ఇక లక్ష్మీపతి ఉన్నాడంటే అతని తండ్రి మొదట్లో బాగా కష్టాలు పడ్డవాడు. అయితేనేం ఆయనకు డబ్బు విలువ తత్వమూ బాగా తెలుసు ... కొంత డబ్బు సంపాదించిన తర్వాత యిక మన తెలివి

తేటలూ ప్రమేయమూ లేకుండానే ఆ డబ్బు, అతిగా పెరిగిపోతుందని అందులో అతిశయోక్తి ఏ మాత్రమూ లేదనీ ఆయన దృఢవిశ్వాసం... కావలసిందల్లా కొంచెం లౌక్యమనీ, డబ్బు మదుపు పెడితే అది పెరిగే చోట్లూ, తరిగే చోట్లూ ఉన్నాయనీ, పెరిగే చోట్లు గమనించి మదుపు పెట్టే మాత్రపు తెలివితేటలు చాలుననీ, యిక ఆవైపు కూడా అప్పుడప్పుడు తప్ప చూడ నక్కరలేదనీ ఆయన అంటూ వుంటాడు. ఆయన అలాగేచేసి ఆస్తులు అలాగే పెంచాడు కూడా. లక్ష్మీపతి ఆయనకు ఒక్కడే కొడుకు. ఇంట్లో అతని మాటకు ఎదురన్నదిలేదు.

జోగినాధం మనస్సులో కుసుమ మెదిలింది. ఆ అమ్మాయి ఎంతో అందంగా వుంటుంది. దబ్బపండు వంటి శరీరచ్ఛాయ ఆమెది. నాజూకైన సన్నని బంగారపు పుల్లలవంటి వ్రేళ్ళు పైపు మెషినుమీద చకచక కదులుతూ వుంటే చూసేందుకు ఎంతో అద్భుతంగా ఉంటుంది. ఆమె కన్నులు చెంపకు చేరెడేసి ఉండి తళతళ లాడుతున్న సీళ్ళను గుర్తుకు తెస్తాయి. ఆమె అన్న కామేశం అంత చిన్న వయస్సులో కాలేజీ లెక్చరరు అయినాడంటే ఎంతో తెలివిగలవాడయి వుండాలి. ఆయన కూడా స్ఫురద్రూపి.

జోగినాధానికి తన చెల్లెలు గుర్తుకు వచ్చింది. ఆ అమ్మాయికూడా ఒక వన్నె తక్కువగా కుసుమ రంగే. అయినా నీళ్ళ కరువు మూలంగానూ, తగిన పోషణలేకనూ ఆ పిల్ల జబ్బుపడి లేచిన దానిలా ఉంటుందెప్పుడూ... కాని ఆ అమ్మాయి తెలివితేటలూ, ఓర్పూ, పని పాటలలో నేర్పూ చెప్పుకోదగ్గవి. దానికి పెళ్ళిచేసి ఒక యింటిదాన్ని చేస్తే తమ బాధ్యత సగం తగ్గుతుంది. దానికి ఎక్కడ వ్రాసిపెట్టి వుందో మరి...అది కాస్తా అయితే తన తల్లిని, చిన్నచెల్లెలినీ తీసుకుని యిక్కడికి మకాం మార్చేయవచ్చు. అప్పటికి తమ శని తప్పినట్టవుతుంది. అయినా ఆడపిల్ల పెళ్ళి మాటలతో, ఆలోచనలతో అవుతుందా? దానికెంత కష్ట పడాలి? కట్నం పేచీ లేకుండా ఎక్కడైన సంబంధం కుదిరితే బాగుండిపోను... అయినా తన పిచ్చిగాని కట్నం లేకుండా ఎవడు పెళ్ళికి ఒప్పుకుంటున్నాడీ రోజుల్లో!

అతడు లేచాడు. రూముకు తాళంవేసి వీధిలోకి వచ్చి నడవటం ప్రారంభించాడు. అక్కడొకటీ, అక్కడొకటీ వీధి దీపాలు వెలుగుతున్నాయి. దూరంగా ఎక్కడో రైలు 'గుప్పు గుప్పు' మని పొగ వొదులుతూ పరుగెత్తి పోతున్నది.

జోగినాధం కామేశాన్ని గురించే ఆలోచిస్తున్నాడు. అతన్నీ, తన చెల్లెలినీ మనసులో పక్కపక్కనే నిలబెట్టుకుని మాటిమాటికి ఆలోచనలలో మునిగిపోతున్నాడు. చివరకు హోటలు ముందుకు వచ్చేసరికి తలవూపి ఏదో నిశ్చయానికి వచ్చాడు.

అతడు హోటల్లో ఒక బల్లముందు కూర్చొని అరిటాకు కడుగుతూ ఉండగా పక్కనే వున్న యిద్దరు సర్వర్లు "మంచినీళ్ళ పంతులుగారొచ్చారు..." అనుకుని నవ్వుకున్నారు. తర్వాత వారిలో ఒకడు ఏకంగా ఒక జార్ నిండా నీళ్లుతెచ్చి జోగినాధం ప్రక్కనే బల్లమీదవుంచి వడ్డన ప్రారంభించాడు. అతడు భోజనం చేసినంతసేపూ వారిద్దరూ ప్రతిపూటా చేసినట్టే ఆపూటకూడా అతడెన్ని గ్లాసుల నీళ్ళు తాగాడో లెక్కపెట్టారు. చివరకు లెక్క ఎక్కడో తప్పింది. ఒకడు పదిహేను గ్లాసులనీ మరొకడు పధ్నాలుగు గ్లాసులు మాత్రమేననీ కొంచెంసేపు తమలోతాము తర్కించుకుని తర్వాత సర్దుకున్నారు.

జోగినాధం భోజనం ముగించి చెయ్యి కడుక్కొని రూము చేరుకున్నాడు. లైటువేసి పక్కమీద వాలి కాగితమూ, కలమూ తీసుకుని యింటికి ఉత్తరం వ్రాశాడు. మామూలు యోగక్షేమాలతోబాటు అతడు కుసుమ అన్నగారి విషయంకూడా అందులో ప్రస్తావించి "కులగోత్రాల వంటి చిక్కులు రాకుండావుంటే, ఆయన ఒప్పుకుంటే నిజంగా మన చెల్లాయి అంత అదృష్టవంతురాలు ఎక్కడా ఉండదనే నా విశ్వాసం... నేను రేపే అన్ని వివరాలూ తెలుసుకుని మళ్లీ నీకు వ్రాస్తాను..." అని వ్రాశాడు.

తర్వాత కాగితం, కలం ప్రక్కనే ఉంచి ఆవులించి చిటికెవేసి వెల్లకిలా పడుకుని పైకప్పువంక చూస్తూ ఉండిపోయాడు. అంతలోనే అతని కళ్లు మూతలుపడ్డాయి.

పది గంటలు దాటిన తర్వాత సినిమా నుంచి వచ్చిన యిద్దరు మిత్రులూ గాఢంగా నిద్రపోతున్న జోగినాథం వంకచూసి నవ్వుకున్నారు. ఉమాపతి మెల్లిగా "తలుపు బార్లగా తీసిపెట్టి ఎలా దిట్టంగా నిద్ర పోతున్నాడో చూడు" అన్నాడు లక్ష్మీపతితో.

లక్ష్మీపతి కిటికీ పక్కగా పడివున్న కార్డును చేతిలోకి తీసుకుని చూసి "ఇది నీదేనయ్యా...ఇవాళే వచ్చినట్టున్నది" అన్నాడు. ఉమాపతి దాన్ని అందుకుని చదివి అవతలపడేస్తూ "నాన్నగారు వ్రాశారు...మళ్ళీ వరదలొస్తున్నాయట. ఈఏడు కూడా పంటల రాలుబడి తక్కువగా ఉంటుందేమోనని వ్రాశారు. అది ప్రతి రెండు మూడేళ్ళకూ మామూలే. వరద రావడం నిండు పంటను తుడిచిపెట్టి పోవడం...మా పొలాలు కొన్నిటికి ఫరవాలేదు కాని కొన్ని మాత్రం బాగా దెబ్బతింటాయి." అంటూ నిద్రపోతున్న జోగినాథం వంక చూసి మళ్ళీ "ఈ గురువుగారి కేమో నీళ్ళ కరువు. త్రాగేందుకు నీళ్ళచుక్క కూడా లేక వీళ్ళు అవస్థ పడుతూ వుంటారు. మాకేమో వరదలు...ఎంత తమాషాగా ఉందో చూడు" అన్నాడు.

లక్ష్మీపతి ఏమీ మాట్లాడలేదు. నిశ్శబ్దంగా దుస్తులు మార్చుకుని జోగినాథంవైపు చూస్తూ ఉమాపతితో "ఉత్తరం రాస్తున్నాడయ్యా యింటికి..."అని మళ్ళీ ఏదోరహస్యం చెబుతున్నట్టు నెమ్మదిగా "పోయిన నెలలో అనుకుంటాను...అంటే యిక్కడికి వచ్చిన పది పదిహేను రోజులకు అతను యింటికి వ్రాసిన ఉత్తరం ఒకటి చదివాను. తప్పే అనుకో. అయినా ఎంత తమాషాగా వుందో తెలుసా! అబ్బ! దారుణం! ఒక మతి చలించినవాడు రాసినట్టున్నది. ఆ ఉత్తరం...ఇక్కడ ఒంటి నిండా పుష్కలంగా కావలసినన్ని నీళ్ళు పోసుకుంటున్నానసీ, కరువు తీరా నీళ్ళు తాగుతున్నాననీ, తన వొంటిరంగు మారి ఆరోగ్యం కూడా పూర్వంకంటె ఎంతో బాగున్నదనీ వ్రాశాడు. పైగా నీళ్ళు తాగేటప్పుడు తల్లినీ, చెల్లెళ్ళనూ తలుచుకుని తలుచుకుని మరీ తాగుతాట్ట... అదీగాక అంతకుముం దెప్పుడో వాళ్ళ వూళ్ళో చిన్న చెల్లెలు నీళ్ళబిందె దొర్లించి కష్టపడి తెచ్చుకున్న నీళ్ళన్నిటినీ నేలపాలు చేసిందని తల్లి ఆ చిన్న

పిల్లను చావబాదిన వృత్తాంతం అతను నాకు చెప్పాడు. ఉమాపతీ! అది నువ్వు విన్నట్టయితే నిలువునా వొణికిపోయి వుండేవాడివి..." అన్నాడు.

జోగినాథం నిద్రలో మరోవైపుకుతిరిగి పడుకున్నాడు. ఉమాపతి మెల్లిగా ఆ వుత్తరం అందుకుని మడత విప్పాడు. ఇద్దరూ మోకాళ్ళమీద కూర్చుని ఆ ఉత్తరాన్ని చివరివరకూ చదివి మొహాలు చూసుకున్నారు. తర్వాత దాన్ని యథాపూర్వంగా మడిచి యథాస్థానంలో ఉంచి ఇవతలికి వచ్చారు.

ఉమాపతి నెమ్మదిగా గొంతు తగ్గించి "అంటే మనం వెళ్ళిన తర్వాత కుసుమ వెంట వాళ్ళ యింటికి వెళ్ళాడన్నమాట." అన్నాడొక విధంగా చూస్తూ.

లక్ష్మీపతి "అంతే అయివుండాలి మరి..." అని బదులుపలికాడు.

*    *    *

మరునాడు ఆఫీసులో జోగినాథం సాయంకాలం నాలుగు గంటలు దాటేవరకూ కుసుమను పలకరిద్దామని ఎంతగానో ప్రయత్నించేశాడు. కాని, వీలుపడలేదు. నలుగురూ అక్కడే ఉండటమూ, పైగా కుసుమ చాలా హడావిడిగా పనిలో మునిగి ఉండటమూ అందుకు ముఖ్య కారణాలు.

నాలుగున్నరకే అతడు తన పని పూర్తిచేసుకుని తీరికగా కూర్చున్నాడు. ఉమాపతికి ఆరోజున అసలు పనిలేనట్టే లెక్క. అతని సీటుతీరే అంత. పని బహుకొద్దిగా మాత్రమే ఉంటుంది. లక్ష్మీపతి మాత్రం ఏవేవో ఫైళ్ళు తిరగవేస్తూ రిఫరెన్సులకోసం తంటాలు పడుతున్నాడు.

జోగినాథం నీళ్ళకూజావంక చూశాడు. మళ్ళీ అటూ ఇటూ చూశాడు. నెమ్మదిగా లేచి కూజా దగ్గరికి వెళ్ళి నీళ్ళ గ్లాసులోకి వంచుకున్నాడు. చేతిలో గ్లాసు పైకెత్తిపట్టుకుని ఒక్కక్షణంచూసి తర్వాత గడగడ త్రాగాడు.

అది గమనించి శర్మ అనే మరో గుమాస్తా ఏమీ పనిలేక తీరికగా

కూర్చుని ఉంది, నవ్వి, "మన కూజాలో నీళ్ళన్నీ ఒక్క జోగినాథం గారే కాజేస్తున్నారండీ...అదేమి చిత్రమో ప్రతి అరగంటకూ ఆయనకూ దాహమవుతూనే ఉంటుంది" అన్నాడు.

వైనతేయరావు అనే మరో గుమాస్తా ఫైలులోనుంచి తలపైకెత్తి చూసి "బహూశా అదేదో జబ్బయి వుంటుంది" అని మళ్ళీ తలదించుకున్నాడు.

జోగినాథం నవ్వేందుకు ప్రయత్నించాడు. ఉమాపతీ, లక్ష్మీపతీ, ఒకరివంక ఒకరు చూసుకున్నారు.

ఇంతలో టైపు మెషీను చప్పుడు ఒక్క నిముషం ఆగినట్టుకాగా జోగినాథం తలఎత్తి చూశాడు. కుసుమ బల్లమీద చెయ్యి ఉంచుకుని తీరికగా, విశ్రాంతిగా కూర్చుని ఉంది. జోగినాథం నెమ్మదిగా ఆమె దగ్గరికి వెళ్ళి గొంతు తగ్గించి "ఏమండీ...మీతో కొంచెం మాట్లాడాలి..." అన్నాడు.

ఆమె నవ్వి "మాట్లాడండి..." అన్నది.

అత డామె ముందు కుర్చీలో కూర్చుని ఏదో చెబుదామని నోరు తెరిచేసరికి తన కొంప ఏదో మునిగినట్టు ఆఫీసరు గదిలో బెల్ 'గర్' మని మ్రోగింది. ఆమె హడావిడిగా లేచి "తర్వాత మాట్లాడుకుందాం... ఆఫీసరు పిలుస్తున్నారు. అన్నట్టు యివాళ మేము సినిమాకు వెడదామనుకున్నాం...మీరూ రండి, మా అన్నయ్య సంతోషిస్తాడు. పైగా మీరు మాట్లాడనూవచ్చు..." అంటూ హడావిడిగా ఆఫీసరు గదిలోకి వెళ్ళింది.

జోగినాథం కొద్ది క్షణాలు అలాగే కూర్చుండిపోయాడు. ఇవాళ ఏది ఏమయినాసరే వారితో యీ విషయం ప్రస్తావించి వివరాలు తేల్చుకుని ఉత్తరం వ్రాయాలి. నిజంగా యీ సంబంధం కుదిరితే అమ్మ ఎంతగా సంబరపడిపోతుందో !

కుసుమ మరో అయిదు నిముషాలకుగాని యివతలికి రాలేదు. వస్తూనే ఒక కాగితం చూపించి జోగినాథంతో "ఇదుగో యీ ఒక్కటీ

అందజేస్తే వెంటనే మనం వెళ్ళిపోవచ్చు...' అంటూ చకచక పనిచెయ్య సాగింది.

జోగినాథం 'అలాగే' అని తలవూపి లేచి నెమ్మదిగా నడిచివచ్చి యివతలి వరండాలో నిలబడి జేబులో చేతులు పెట్టి వెదికాడు. రెండు రూపాయనోట్లు కనిపించాయి. అతడు తేలికగా నిట్టూర్చి మళ్ళీ తన సీటు లోకి వచ్చి కూర్చున్నాడు. ఉమాపతి లక్ష్మీపతితో ఏదో రహస్యం మాట్లాడుతున్నాడు

ఉన్నట్టుండి ఉమాపతి శర్మ అనే గుమాస్తాతో "మీరిందాక జోగినాథం నీళ్ళు తాగడం గురించి మాట్లాడారు చూశారూ ! మీరా విష యంలో మరికొంత తెలుసుకోవడం అవసరం... వాళ్ళ ప్రాంతంలో వూళ్ళన్నీ ఎప్పుడూ కరువుతో కొట్టుకుపోతూ ఉంటాయి. ఎక్కడా నీళ్ళ చుక్క కూడా దొరకదు. కడుపునిండా తాగేందుకు, వొంటినిండా పోసుకునేందుకూ నీళ్ళుండవు. తాగేందుకు బిందెడు నీళ్ళు మూడణాలుపెట్టి మరీ కొనుక్కోవాలి. అటువంటి వూరి నుంచి వొచ్చినవాడికి ఇక్కడ పుష్కలంగా నీళ్ళు దొరికేసరికి కోతికి కొబ్బరికాయ దొరికినట్టేకదా" అన్నాడు.

జోగినాథం "అవును. భగవంతుడి దయ అలా ఉంది. మాకు నీళ్ళు లేవు...మీరేమో వరదల్లో మునిగిపోతున్నారు" అన్నాడు.

ఉమాపతి "భగవంతుడి దయ అనకు... అధర్మం పెరిగితే అంతే . నీటిచుక్క దొరకదు..." అన్నాడు.

జోగినాథం ఉడుకుమోతుతనంతో "వరదలు రావడానికి కారణం అధర్మంకాక మరేమిటో..." అన్నాడు.

లక్ష్మీపతి అందుకుని 'అలా కాదు, మీది మరీ దారుణం...నువ్వే చెప్పావు ఒకసారి గుర్తుందా ? మీ చిన్న చెల్లాయి నీళ్ళబిందె దొర్లించడం సంగతి" అన్నాడు.

శర్మా, వైనతేయరావూ ఒక్కసారిగా "ఎవరా చెల్లాయి ? ఏమా కథ ? అది చెప్పండి ముందు" అన్నారు.

అక్షీపతి జోగినాథం వంక తిరిగి "చెప్పనా?" అని అడిగి, తర్వాత అతని సమాధానం కోసం ఎదురుచూడకుండానే ప్రారంభించాడు. "అతనే చెప్పాడు వొచ్చిన కొత్తల్లో... ఒకసారి వాళ్ళ యింట్లో జరిగిన విషయమే.... రాత్రి అంతా కష్టపడి బావికి యింటికి తిరిగి ఒక బిందెడు మంచినీళ్లు సంపాయించుకున్నారట. మర్నాడు ఉదయం వాళ్ళ చెల్లెలు-చిన్న పిల్ల-గ్లాసు ముంచుకోబోగా ప్రమాదవశాత్తూ బిందె దొర్లిపోయింది. నీళ్ళన్నీ నేలపాలైపోయాయి. ఆ పిల్ల భయంతో బిగుసుకుపోయి నిలబడిపోయింది. తల్లివచ్చి రెక్కపుచ్చుకుని గొడ్డును బాదినట్లు చావగొట్టిందట.... ఇలా అని అతనే చెప్పాడు నాకు. కావలిస్తే అడగండి...."

జోగినాథం వంచిన తల ఎత్తలేదు. ఉమాపతి "ఇక ఇతను స్నానం ప్రారంభించాడా.... అది గంటల తరబడి సాగుతుంది!.... ఒక్కొక్క చెంబెడే తోడుకుని 'యిది చెల్లాయికి....' 'యిది అమ్మకు' 'యిది చిన్న చెల్లాయికి' అని గొణుక్కుంటూ వొంటిమీద పోసుకుంటాడండీ.... తాగేటప్పుడూ అంతే.... ... గ్లాసు పైకెత్తి పట్టుకుని చూస్తాడు మీరు గమనించారో లేదో. ఆ చూడటం నలకలున్నాయేమోనని మాత్రం కాదు... కళ్ళు మూసుకుని ఏమిటో గొణుక్కుని మరీ తాగుతాడు. రోజూ తెల్లవారుతుండగానే కృష్ణకు బయలుదేరి పోతాడు. సాయంకాలంపూట యింట్లో బావి ఉండనే ఉంది. ఇక హోటల్లో సర్వర్లందరూ యితనికేం బిరుదు యిచ్చారో తెలుసా! 'మంచినీళ్ళ పంతులుగారు.' మొన్న నేను విన్నాను" అన్నాడు.

శర్మ "ఇది వింత కేసే" అన్నాడు.

వైనతేయరావు వంకరగా నవ్వి గంభీరంగా "ఇదొక మానసిక వ్యాధి అయిఉంటుంది" అన్నాడు.

జోగినాథానికి కోపం ముంచుకు వచ్చింది. వీళ్ళందరూ తనను గేలిచేసి ఏడిపించేందుకు ప్రయత్నిస్తున్నారనే విషయం స్పష్టంగా తెలిసిపోయింది. ఆ క్రౌర్యం అతడు భరించలేకపోయాడు. అందర్నీ నిప్పులు చెరిగే కళ్ళతో చూశాడు. కుసుమ అన్నీ విన్నది కాబోలు సానుభూతితో చూస్తున్నది.

వైనతేయరావు వూరుకోకుండా "ఏది ఏమయినా అలా బొత్తుగా"... అని ఏదో అనబోతూఉండగా, జోగినాథం పెద్దగా "ఇక తమరేమీ మాట్లాడకండి సార్. ఇప్పటికే చాలా అసహ్యంగా మాట్లాడారు... మిమ్మల్ని అర్థంచేసుకోగలను లెండి... అంత బోధ్దాదని పసివాణ్ణేమీ కాదు..." అన్నాడు.

శర్మ అనే గుమాస్తా కలగజేసుకుని "అదేమిటండీ... మిమ్మల్ని యిప్పుడేమన్నామనీ మీకు అంత కోపం? ఏదో నీళ్ల ఎక్కువగా తాగుతారనీ..." అంటూ ఉండగా ఇక జోగినాథం వూరుకోలేకపోయాడు. విసురుగా సీటులో నుంచి లేచి 'ఆపండిక... మీరింకా అలాగే మాట్లాడుకుంటూపోతే ఏం చేస్తానో నాకే తెలియదు" అంటూ ఉద్రేకంతో ఊగిపోతూ, "అవునండీ... నేను నీటిచుక్క దొరకని వూళ్లో పుట్టి పెరిగాను. ఇక్కడ నీళ్ల చూసేసరికి కోతికి కొబ్బరికాయ దొరికినట్టే అయింది. విపరీతంగా తాగుతున్నాను. అంతేకాదు... కావలిస్తే మూర్ఖ్ఖవాడిలా పొట్ట పగిలేటట్లు నీళ్లు తాగుతాను. పిచ్చివాడిలా గంటల తరబడి స్నానంచేస్తాను. లేకపోతే ఏదన్నా మంచి ముహూర్తం చూసి కృష్ణలోపడి చస్తాను అయితే మాత్రం? మీకెందుకు?" అన్నాడు.

తర్వాత కణతలు పట్టుకుని సీటులో కూర్చుండిపోయాడు. అంతటా నిశ్శబ్దమైపోయింది. ఎవరూ పెదవి కదపలేదు. కుసుమ టైపు చేయడంలో మునిగిపోయింది. జోగినాథం యింత జరిగిన తర్వాత ఎప్పుడో అక్కడినుంచి పారిపోయి ఉండేవాడు. కాని యివాళ కుసుమతో, ఆమె అన్నగారితో మాట్లాడాలి. అది తప్పదు.

ఒక పావుగంట తర్వాత చాలామంది యిళ్ళకు వెళ్ళిపోయారు. కుసుమ టైపుమెషినుమీద కవరువేసి సిద్ధమై జోగినాథం వంక చూసింది.

అతడు లేచి నిలబడి రుమాలుతో మొహం తుడుచుకుని ఆమె వెంట బయలుదేరాడు. ఇద్దరూ మెట్లు దిగుతూవుండగా ఆమె జోగినాథంతో "మీరెందు కలా యిరిటేట్ అవుతారు?" అన్నది.

జోగినాథం వెంటనే సమాధానం చెప్పలేదు. కాని, ఒక్క క్షణం

ఆగి "అలా మనిషిని నిస్సహాయంగా చేసి వెర్రివాణ్ణి చేస్తుంటే ఎలా సహించడం చెప్పండి? ఏమయినా కారణం ఉందా అంటే ఏమీ లేదు. నా చేతికి ఆరువేళ్ళున్నాయి కదా! అది పట్టుకుని నన్ను నలుగురితో ఎగతాళి చేస్తుంటే ఎలా ఉంటుంది చెప్పండి? అవును నిజమే— మా వూళ్లూ, మా ప్రాంతమూ వట్టి దౌర్భాగ్యపువే. నీళ్ళ కరువు ఉంటే దౌర్భాగ్యం కాక మరేమిటి? అయినా మధ్య నేనెందుకు వెర్రివాణ్ణవు తాను. 'ఇదొక మానసిక వ్యాధిట.' ఆ వైనతేయరావు పిలక నాచేతిలో ఉంది. ఏమనుకుంటున్నాడో ఏమో? బోడిపేరు వాడూనూ—ఈసారి యిలా ఏమన్నా వాగితే ఆఫీసరుతో చెప్పేస్తాను" అన్నాడు.

కుసుమకు నవ్వు వచ్చింది. కాని ఆమె నవ్వలేదు. అతడు ఆఫీసరుకు చెబుతానన్నప్పుడు తోటి పిల్లవాడిమీద కోపగించి మేష్టారితో రిపోర్టుచేస్తానని బెదిరించే బడిపిల్లవాడు గుర్తుకువచ్చాడామెకు.

ఇద్దరూ కుసుమ ఇంటిముందు ఆగేసరికి లోపలినుంచి గోలగా నవ్వులు వినిపిస్తున్నాయి. కుసుమ తలుపు తట్టి అతనివైపు చూసి "ఎవరో బంధువులు దిగినట్టున్నారు" అన్నది.

తలుపు తెరిచిన చిన్నపిల్ల మామూలుగానే "అక్కయ్యొచ్చిందో" అని రాగంతీస్తూ లోపలికి వెళ్ళింది.

హాల్లో చాపమీద కూర్చుని క్యారమ్సు ఆడుతున్న వ్యక్తులను చూడగానే కుసుమ ఆనందంతో పరుగెత్తుకు వెళ్ళి "అరె! నువ్వెప్పు డొచ్చావ్ వసంతా?" అని అడిగింది. జోగినాథం గుమ్మం దగ్గరగా నిలబడి ఉండిపోయాడు. ఆ వసంత అనబడే అమ్మాయి ఇప్పుడే— ఒక అరగంట అయిందేమో— లోపల అమ్మ ఉంది—" అన్నది.

జోగినాథం ఆశ్చర్యపోతూ చూశాడు. అంతఅందమైన స్త్రీనతడు ఇంతవరకూ చూడలేదు. ఆమె ఎడమ చేతి కొక వాచీ, కుడిచేతికి మూడో నాలుగో బంగారు గాజులూ ఉన్నాయి. ఆ బంగారురంగు ఆమె వంటి మీద బొత్తిగా కనిపించకుండా ఉంది. నల్లని చిలిపి ముంగురులు కొన్ని నుదుటిమీద పడుతూవుంటే వాటిని ఎడమచేతి వ్రేళ్ళతో పైకి తోసు

కుంటున్నదామె. నవ్వుతున్నప్పుడల్లా బుగ్గలు ఎంతో అందంగా సొట్టలు పడుతున్నాయి. ఆమె వయస్సు పదహారేళ్ళకు మించి ఉండదు.

కుసుమ జోగినాథంతో "సార్? యిలా రండి మీరు— కూర్చుని ఉండండి, యిప్పుడే వస్తాను—" అన్నది.

కామేశం ఆ మాటలు విని తలతిప్పి చూసి "అరె! మీరువచ్చారా? గుడ్. ఇలా కూర్చోండి–" అంటూ మళ్ళీ తన ఆటలో లీనమైపోయాడు.

కుసుమ కొద్ది నిముషాల్లో యివతలికి వచ్చింది. జోగినాథం అక్కడే వారి ఆట చూస్తూ కూర్చుని ఉన్నాడు. కుసుమ ముందుకు వచ్చి "అన్నయ్యా! యివాళ మరి సినిమా ప్రోగ్రాం ఎలారా?" అని అడిగింది.

కామేశం "దానికేం?" అన్నాడు. అంతలో లోపలినుంచి ఒక ముప్పయి అయిదేళ్ళ స్త్రీ వచ్చి "అవును — దానికేం? మీరు సినిమా మానుకోవడమెందుకూ? అందరూ సరదాగా వెళ్ళిరండి... నేను యింటి దగ్గర వంటా వగైరాలు చూసుకుంటాను" అన్నది.

కుసుమ "ఇంకా టైముందిగా... రెండాటలాడి పోదాం... నేనూ అన్నయ్యా ఒక పార్టీ" అన్నది.

వసంత కాయిన్స్ తీస్తూ "అలా వీల్లేదు. నేనూ మీ అన్నయ్యా ఒక పార్టీ" అన్నది.

కుసుమ "నెరజాణవే నువ్వు... అప్పుడే అన్నయ్యను కలిపేసుకుంటున్నావ్. ఆగవమ్మా కొంచెం గుర్రాన్ని కట్టెయ్. కోర్సు పూర్తి కానీ..." అన్నది.

జోగినాథం చిత్రమైన అవస్థలో పడ్డాడు. అంతలో మళ్ళీ కుసుమ అతన్ని ఉద్దేశించి "సరే రండి... సార్... మీరూ నేనూ ఒక పార్టీట... కూర్చోండి" అన్నది.

అతడు సిగ్గుపడుతూ "నాకు బొత్తిగా రాదండీ... ఎలా?"... అన్నాడు.

కామేశం "ఫరవాలేదు... ఇక్కడ అందరూ యింటర్నేషనల్

ప్లేయర్స్...ఎవరికీ బాగా రాదు.... ఏదో సరదాగా ఆడుకుంటాం కానీ మరొకటి కాదుగదా! రండి రండి...." అన్నాడు.

జోగినాథం బిడియపడుతూ కూర్చున్నాడు. టాస్ వేయగా కుసుమకు అనుకూలంగా పడింది. ఆమె జోగినాథానికి స్ట్రయికర్ అందించి "ఊఁ! కానివ్వండి" అన్నది.

జోగినాథం ఎడమచేతితో స్ట్రయికర్‌ను బలంగా కొట్టాడు. వసంత ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి "మైగాడ్! ఈయన ఎడమచేతి వాటం... పైగా ఆరు వేళ్లున్నాయి" అన్నది.

కుసుమ "అన్నట్టు మరిచిపోయాను. వసంతా! వీరు మిస్టర్ నాథ్ అని మా ఆఫీసులో పనిచేస్తున్నారు" అని పరిచయం చేసింది. వసంత చేతులు జోడించింది.

ఆమె మళ్ళీ జోగినాథంతో "ఈమె మా మేనత్త కూతురు. పేరు వసంత...సెకండియర్ బి. ఎస్. సి వుడ్ బి మిసెస్ కామేశం...అంటే మాకు కాబోయే వదినగారన్నమాట. వాళ్ళకు తొందరగానే ఉంది గాని మా మామయ్య అండ్ కో పెద్దవాళ్ళందరూ 'ఆయ్! తొందర పనికిరాదు. ముందర పిల్ల చదువు పూర్తి కావాల్సిందే. అందాకా అలా ఉండండి. వేరు వేరుగా కలలు కంటూ" అని మందలించారు. అదన్న మాట అసలు విషయం" అన్నది.

వసంత బుగ్గలలో గులాబులు విచ్చుకున్నాయి. కొంచెం ఎర్రబడిన మొహంతో ఆమె కుసుమను మోచేత్తో పొడిచి మెల్లగా 'ఛీ వూరుకోవే!' అన్నది.

కామేశం నవ్వి జోగినాథంతో "మావాళ్ళు మరీ రాలుగాయి పిల్లలండీ బాబూ!" అన్నాడు.

జోగినాథం దిగాలుపడిపోయాడు. ఒక్కసారిగా మనిషిలో సత్తువ సన్నగిల్లి నీరసం ఆవరించింది. ఆట ఆడుతూనే వున్నాడు కాని మనసంతా చీకాకై పోయింది. సినిమా రీలులో లాగా తన వూరు... చెల్లాయిలూ, తల్లీ, గడ్డి కూడా మొలవని చవిటినేలా, రాళ్ళు పగిలే

ఎండలూ, వెచ్చనిగాలీ, నీళ్ళులేని బావులూ, నీళ్ళకోసం పాట్లూ, ఎక్కడ చూసినా నీరసంగా నిస్తేజంగా వుండే జనమూ...మనసులో తిరిగి పోయారు.

ఒక ఆట పూర్తి అయింది. కుసుమ 'కాబోయే దంపతులు గెలిచారు— సరే యిక యిది కట్టిపెడదాం — టైమవుతున్నది. అన్నయ్యా ! నువ్వు తయారేనా ?' అన్నది.

కామేశం లేచి "జస్ట్ వన్ మినిట్" అంటూ లోపలికి వెళ్ళాడు. జోగినాథం కూడా లేచి చొక్కా గుండీలు సర్దుకుంటూ "నేను వెళ్ళి వస్తానండీ" అన్నాడు.

కుసుమ ఆశ్చర్యపోయి "అదేమిటండీ— మీరుకూడా వస్తా నన్నారుగా—పైగా మా అన్నయ్యతో ఏదో మాట్లాడాలన్నారు కదా ?" అన్నది.

జోగినాథం ఏం చెప్పాలో తెలియక "ఏమీ లేదు లెండి" అని వూరుకున్నాడు. కుసుమ "మరి !" అని రెట్టించి అడిగింది.

జోగినాథం యిక అక్కడ నిలబడలేక పోయాడు. "ఏమీలేదు లెండి—కాలేజీ విషయాలేవైనా చెబుతారేమోనని కాస్సేపు తీరికగా మాట్లాడుదామనుకున్నాను. వీలైతే నైట్ కాలేజీలో చేరుదామని వుందను కోండి—అంతకంటె మరేమీ లేదు. మరోసారి మాట్లాడుతాను లెండి అదేమీ పెద్ద ముఖ్య విషయం కాదుగా ! వెళ్ళివస్తానింక" అంటూ వీధిలోకి వచ్చేశాడు. కుసుమ అలాగే ఆశ్చర్యంతో నిలబడిపోయింది.

అతడు నేరుగా రూముకు వచ్చేశాడు. తలుపులు తెరిచే వున్నాయి. ఉమాపతీ, లక్ష్మీపతీ, చెరొక పక్కా పడుకుని కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు. వాళ్ళిద్దరూ ఒకచోట చేరితే యిక కబుర్లకూ నవ్వులకూ లోటుండదు. ఏవేవో కాలేజీ కబుర్లు చెప్పుకొని విరగబడి నవ్వుకుంటూ వుంటారు.

జోగినాథం రావడం చూసి యిద్దరూ కబుర్లు ఆపేశారు. అతడు లోపలికి వెళ్ళి వెళ్ళటంతోనే పక్కమీద వాలిపోయికళ్ళుమూసుకున్నాడు.

ఉమాపతి లక్ష్మీపతి వంక చూసి కన్నుగీటుతూ "సినిమాకు వెళ్ళలేదా గురువుగారూ ?" అని అడిగాడు జోగినాథాన్ని. జోగినాథం "లేదం"టూ తల అడ్డంగా వూపాడు.

తర్వాత అతడు లేచాడు. క్రితం రాత్రి తాను యింటికి వ్రాసిన ఉత్తరం యివతలికి తీసి దాన్ని ముక్కలు ముక్కలుగా చింపి కిటికీలో నుంచి విసిరి వేశాడు. ఆ కాయితపు ముక్కలు గాలి విసురుకు చెల్లాచెదరై ఎటెటో ఎగిరిపోయాయి.

ఒక అరగంట దాదాపు నిశ్శబ్దంగానే గడిచింది. తర్వాత ఉమాపతి లేచి "నాకు ఆకలివేస్తున్నది బాబూ, హోటలుకు వచ్చేవాళ్లు రావచ్చు..." అన్నాడు. జోగినాథం కదలలేదు. లక్ష్మీపతి లేచి చొక్కా తొడుక్కుని "ఊఁ ! పోదాం పద..." అన్నాడు.

ఇద్దరూ గదిదాటి బయటికి వచ్చారు. ఉమాపతి ఆగి అనుమానంగా "మనం తప్పు చేస్తున్నా మనిపిస్తున్నదోయ్...అతని సంగతి మనకు తెలుసుకదా ! కేవలం అమాయకుడు. ఒకసారి వెళ్లి 'రమ్మ'ని పిలుద్దాం. రాకపోతే సరే...యిద్దరం వెళ్లిపోదాం ... అప్పుడు మన తప్పేమీ వుండదు" అన్నాడు.

తర్వాత మళ్ళీ యిద్దరూ లోపలికి వెళ్ళి జోగినాథాన్ని తట్టి లేపారు. అతడు కళ్ళు తెరిచిచూసి "ఏమిటండీ?" అని అడిగాడు.

ఉమాపతి "మీరు వచ్చినప్పటి నుంచీ ఎన్నడూ యిలా మేము నేరుగా వెళ్ళలేదు. మీరు రండి భోజనానికి..." అన్నాడు.

జోగినాథం కళ్ళలో ఎందుకో నీటిపొర నిలిచింది. అతడు గద్గద స్వరంతో "నాకీపూట ఆకలి లేదండి...నిజం... మీరిద్దరూ వెళ్ళిరండి" అన్నాడు.

ఉమాపతి అతని నుదుట చేయి ఉంచిచూసి "ఒళ్ళు కొంచెం వేడిగానే ఉంది. అయినా అన్నం మానటం మంచిది కాదేమో !" అన్నాడు.

జోగినాథం తలవూపి "కాదులెండి ... నేనీపూట ఏమీ తినలేను.

మీరిద్దరూ వెళ్ళిరండి..." అన్నాడు. దానితో వారిద్దరూ మరేమీ మాట్లాడకుండా వీధిలోకి వెళ్ళిపోయారు.

జోగినాథానికి ఎందుకో ఏడుపు పొంగివచ్చింది. అతడింతవరకూ ఎన్నడూ తల్లినీ, చెల్లెళ్ళనూ వొదిలి వున్నవాడు కాదు. ఈ రెణ్ణెల్ల నుంచీ అతడు ఎన్నో పర్యాయాలు ఏడుపును దిగమ్రింగుకున్నాడు. కాని యివాళ ఆఫీసులో జరిగిన ఉదంతం అతన్ని కలతపెట్టింది. కాని అతడు దాన్ని అట్టే లెక్కచేయలేదు. దాని తర్వాత కుసుమ యింట్లో జరిగినదంతా అతన్ని చాలా క్షోభపెట్టింది. తాను నిన్నటినుంచీ చాలా ప్రేమగా కట్టుకున్న పేకమేడలు ఒక్కసారిగా కూలిపోయినట్టయింది అతడు లోలోపల దుఃఖంతో దిగులుతో మెలికలు తిరిగిపోతూ అలాగే పడుకున్నాడు. అంతలోనే అతనికి గాఢంగా నిద్రపట్టింది.

*

అతడు కళ్ళువిప్పి చూసేసరికి రూములో చిన్న బల్బు వెలుగుతున్నది. ఎక్కడా ఏ అలికిడీ లేదు. ఉమాపతి, లక్ష్మీపతి యిద్దరూ గురకలు పెడుతూ నిద్రపోతున్నారు.

అతడు లేచి బల్లమీదవున్న ఉమాపతి రిస్టువాచీ చేతిలోకి తీసుకుని చూశాడు. అయిదు గంటలకు యిరవై నిముషాలు తక్కువ...ఇక కదిలితే మంచిది. తెల్లగా తెల్లవారిన తర్వాత నదికి బయలుదేరి వెళ్ళటం యిక మానుకోవాలి. లేకపోతే పిళ్ళతో చిక్కే ... త్వరగా వెళ్ళి వాళ్ళు లేవకముందే రూముకు చేరుకోవడం మంచిది. క్రిందటిరోజు ఆఫీసులో జరిగిన ప్రహసనం మళ్ళీ జరగదని హామీ ఎక్కడా లేదు కదా! అతడు త్వరత్వరగా రూము తలుపులు దగ్గరకు లాగి మెట్లుదిగి వీధిలోకి వచ్చాడు. క్రిందిమెట్టు దిగుతూ వుండగా ఎందుకో గుండె జలదరించింది.

వీధి చివర ఒక కుక్క అరుస్తున్నది. ఏయింటి పెరటిలోనో దాక్కునివుండి గుడ్లగూబ ఒకటి వుండి వుండి కూత పెడుతున్నది. వీధులలో అక్కడొకరూ, అక్కడొకరుగా జనం పలుచగా తిరుగుతున్నారు.

జోగినాథం మనసులో తనవూరూ, నెర్రెలు విచ్చిన పొలాలూ, రాత్రిళ్ళు నిద్రలేకుండా నీళ్ళుమోస్తూ తిరుగుతున్న తల్లీ చెల్లెలూ, నీళ్ళ బిందె దొర్లించి చావు దెబ్బలు తిన్న చిన్నచెల్లెలూ, నిస్తేజంగా నీరసంగా వుండే జనమూ, వెచ్చని హోరుగాలీ, రాళ్ళుపగిలే ఎండలూ, గిర్రున సినిమా రీలులాగా తిరిగిపోయాయి. లోలోపల "నాగార్జునసాగర్ పూర్తి అయితే మాకూ యీ బాధలు తప్పి పోతాయి. కావలసినన్ని నీళ్ళు వస్తాయి" అను కున్నాడతడు.

నది మెట్లక్రింద రొదచేస్తూ ప్రవహిస్తున్నది. దూరంగా వంతెన మీద ఏవోరైలు చప్పుడుచేస్తూ పోతున్నది. చల్లని, జీవంపోసే గాలి హాయిగా తెరలు తెరలుగా వీస్తున్నది. మెట్లదగ్గర అప్పుడే నలుగురైదు గురు మనుషులు స్నానం చేస్తున్నారు. వారిలో ఒకాయన ఏవేవోమంత్రాలు చదువుతున్నాడు. పలుచని వెలుతురు మందంగా వ్యాపిస్తున్నది.

జోగినాథం చొక్కా విప్పి తువాలు కట్టుకుని నెమ్మదిగా నీళ్ళ లోకి దిగాడు. చల్లని నీళ్ళు మంచులాగా మోకాళ్ళకు పైగా తగిలేసరికి శరీరం పులకరించినట్టయింది. మరొక అడుగు ముందుకువేసి మెట్టు దిగాడు హాయిగా, "ఎంత బావుంది!" అనుకున్నాడు. మరొక అడుగు ముందుకు... తానిలా హాయిగా మనసుతీరా స్నానం చేస్తూవుంటే తన వూళ్లో తనవారెలా వున్నారో అనే బాధ అతని మనసులోకి వచ్చింది. అమ్మ రాత్రి అంతా నీళ్ళకోసం తిప్పలుపడి యిప్పుడే కొద్దిగా నడుం వాల్చి వుంటుంది...

మరొక మెట్టు క్రిందికి... అతని మనసులో తన వూరూ, తన యిల్లూ, యింటివెనక ఎండిన పున్నాగ చెట్లూ, పొలాలూ, నీళ్ళులేని బావులూ, అన్నీ మళ్ళీ సినిమా రీలులాగా తిరిగిపోయాయి. మళ్లీ "నాగార్జునసాగర్ పూర్తి అయితే మాకూ యిబ్బందులు తప్పుతాయి. అప్పుడు కావలసినన్ని నీళ్ళు" అనుకున్నాడు. మరొక అడుగు ముందుకు వేశాడు. మెట్లమీద నిలబడ్డవారు ఆందోళనతో అతనివంక చూస్తున్నారు.

అంతలో అతని కాళ్ళు తేలిపోయాయి. అతని గుండెలు ఝల్లు మన్నాయి. అరె! భగవంతుడా! ఏమయిపోతున్నాడు తాను? ఎందుకలా

యీ నీళ్ళు తనను లాక్కుపోతున్నాయి? గుండ్రంగా రంగులరాట్నం తిరిగినట్టవుతున్న దేమిటి? కాళ్ళకు మెట్లు అందవేం? ఆ మనుషులు కనిపించరేం? తన కళ్ళకి నీళ్ళు అడ్డువస్తున్నాయెందుచేత?

దూరం నుంచి కేకలు లీలగా వినిపించాయి. నీళ్ళు తనచుట్టూ ఒక గోడ కట్టినట్టుగా ఏర్పడి వొడ్డునున్న వారిని చూసేందుకే వీలులేకుండా చేశాయి.

అతడు గొంతు పెద్దదిచేసి అరిచాడు. వెంటనే అతని గొంతు లోకి నీళ్ళుపోయాయి. రెండవసారి మళ్ళీ అలతోపాటు కొంచెం పైకి వచ్చినందువల్ల కాబోలు అతనికి దూరంగా మనుషులు కనిపించారు. అతడు చేతులెత్తి నమస్కారంచేసి "బాబోయ్ రక్షించండి..." అని అరిచాడు. దానితో మరికాసిని గుటకలు వేశాడు. అతని మనసులో క్షణంలో సగంలో మళ్ళీ సినిమా రీలులోలాగా తనవూరూ, తల్లి చెల్లెళ్ళూ, నీళ్ళులేని బావులు, నెర్రెలువిచ్చిన పొలాలూ, వెచ్చని హోరుగాలీ... తన స్నేహితులిద్దరూ, కుసుమా, కామేశం... కాంతి వేగంతో మనసులోకి వచ్చి వెళ్ళిపోయారు.

అంతలోనే అతడు మూడవసారి పైకి లేచాడు. మళ్ళీ చేతులెత్తి ఒడ్డున ఉన్నవారి నుద్దేశించి "బాభోయ్! రక్షిం..." అన్నాడు. అంతే. ఆ చేతులు నీరసంగా వాలిపోయాయి. పగబట్టిన పాముల సమూహంలా నీళ్లు అతన్ని 'రివ్వు'న లోపలికి లాక్కుపోయాయి. కొద్ది క్షణాల్లోనే ఒడ్డున ఉన్నవారికి అక్కడ ఏమీ కనిపించలేదు.

నది తన దోవన తాను భీకరంగా పరవళ్ళుతొక్కుతూ ప్రవహించి పోతున్నది. ఎక్కడో కొన్ని వందలమైళ్ళ దూరంలో మారుమూల పల్లెటూళ్ళో పూరియింట్లో నిద్రలో వున్న తల్లి పేగు కదిలింది.

(1965 జూన్ 'భారతి')

# రాళ్లూ - రత్నాలూ

"ఇప్పు డెలా ఉన్నానో చెప్పండి" అంటూ దగ్గరికి వచ్చిందామె.

నవ్వులు చిందే ముఖం, సొట్టలు పడుతున్న బుగ్గలూ...ఇన్ని హంగులతో శ్రీదేవి కుందనపు బొమ్మలా కుమారస్వామి ఎదురుగా నిలబడింది. శంఖంవంటి ఆమె గళ సీమను అలంకరించివుంచి దీపపుకాంతిలో తళతళలాడుతూ వెలుగులను చిమ్ముతున్న దొక కంఠ హారం...మరొక రెండుపేటల సైకిలుగొలుసు ఆమె వక్షస్థలాన్ని అంటి పెట్టుకుని వుంది. ఈ నగలతో ఆనాడు మరింత శోభాయమానంగా మనోహరంగా ఉన్న భార్య ఆకృతిని చూసి కుమారస్వామి ముగ్ధుడై ఉండవలసిందే. కాని అతడు ఎందుచేతనో ఖిన్నుడై విచారంతో తల దించుకున్నాడు.

శ్రీదేవి అతని గడ్డాన్ని మునివేళ్ళతో పట్టుకుని పైకెత్తుతూ గోముగా "చూశారూ ! చూశారూ ! మీరలా తల దించుకుంటే నాకెంత బాధగా ఉంటుందో ఆలోచించారా ?" అన్నది. తర్వాత అతనిపక్కనే కూర్చుని అతని తలను ఒళ్ళోకి తీసుకుంటూ "ఇవి గిల్టునగలనే కదూ మీ బాధ ? మరేం చెయ్యగలం చెప్పండి ! వీటికే పాతిక రూపాయలు ధారపోశాం. అన్నయ్య పెళ్ళి ఇలా అర్థంతరంగా వచ్చింది కాబట్టి గాని...లేకపోతే ఈ దండగకూడా ఎందుకు? ఇలా చూడండి...పొద్దున్న ఎప్పుడో తిని వెళ్ళిన అన్నం ..లేచి స్నానం చెయ్యండి ముందు...నేను కలిపి పెడతానుట...మీరేమో వేలు కొరక్కుండా తినాలిట...ఊఁ !" అన్నది.

అతడు లేచి కూర్చున్నాడు. శ్రీదేవి నీళ్ళు తోడేందుకు పెరటి

లోకి వెళ్లింది. కుమారస్వామి ఒకసారి నిట్టూర్చి అలాగే పరధ్యానంగా కూర్చున్నాడు. పిచ్చి శ్రీదేవి ! కాపురానికి వచ్చి నాలుగేళ్ళయినా ఒంటి మీద చిన్న మెత్తు నగ అయినా లేకుండా అలాగే ఉంది. పెళ్ళిలో ఆమె తండ్రి కూడా ఆమెకు నగలేమీ పెట్టలేదు ... రెండుజతల గాజులు మాత్రం ఉంటే తనకు ఉద్యోగం లేనన్నినాళ్ళూ గడవటంకోసం వాటిని తెగ నమ్ముకోవలసివచ్చింది. శ్రీదేవి తండ్రికి పెద్ద ఆడపిల్లలమీద ఉన్న మక్కువ అందరికన్నా చిన్నదయిన శ్రీదేవిమీద లేదు ! 'పుట్టగానే తల్లిని చంపిం'దని మాటి మాటికీ తిడుతూ ఆమెపట్ల అసహ్యభావాన్ని పెంచుకున్నాడాయన. వెదికి వెదికి కుమారస్వామివంటి చదువూ సంపాదనాలేని అసమర్థుడికి అంటగట్టి తన బాధ్యత ఒదిలి పోయిందనుకున్నాడు.

కుమారస్వామికి బంగారు దుకాణాల మధ్య ఉన్న 'ధర్మకాటా' దగ్గర ఉద్యోగం. ఉదయం తొమ్మిదిగంటలనుంచీ రాత్రి ఎనిమిది గంటల దాకా, లగ్గసరిరోజులయితే మరికాస్త పొద్దుపోయే దాకా అతడు 'ధర్మకాటా' ముందే కూర్చుని ఉండాలి... వెండివీ, బంగారువీ ఎన్నో రకాల వస్తువులు ఎంతెంతో విలువగలవి తూకంకోసం అతని దగ్గరికి వస్తాయి. అన్నింటినీ, చిన్నా పెద్దా అని లేకుండా ఓపికగా వెంట్రుకవాసి అయినా తేడా లేకుండా సున్నితపు త్రాసులో ఉంచి తూచి పంపిస్తాడు కుమారస్వామి.

శ్రీదేవి లోపలినుంచి వస్తూ "ఇంకా అలాగే కూర్చున్నారా ?... లేవండి" అన్నది. కుమారస్వామి లేచి పెరట్లోకి వెళ్ళి, భార్య చెంత నిలబడి చెంబుతో నీళ్ళు అందిస్తూ ఉండగా స్నానంచేశాడు ... తర్వాత వొళ్ళు తుడుచుకుని లుంగీచుట్టుకుని భోజనానికి కూర్చున్నాడు. అతని ముందు పింగాణికంచంలో అన్నమూ, పచ్చడీ ఉన్నాయి. శ్రీదేవి కంచం దగ్గరికి లాక్కుని కలిపి ముద్దలు పెడుతూవుంటే ఆ పచ్చడి మెతుకులే అమృతోపమానంగా కనిపించాయి.

కుమారస్వామి తిండి ముగించి పెరట్లో మంచం వాల్చుకుని

పడుకున్నాడు. తర్వాత దాదాపు పదినిముషాలలో శ్రీదేవికూడా పని అంతా ముగించుకుని తలుపులన్నీ వేసి వచ్చింది. కుమారస్వామి పడుకునివున్న మంచంపక్కనే చాప పరుచుకుని కూర్చుంటూ "వీటికి అసలు బంగారునగలకూ ఏమీ తేడా ఉన్నట్టే కనబడదు కదండీ?" అని అడిగింది. కుమారస్వామి నవ్వి "భలేదానివే, అనుభవం ఉన్న వాళ్ళకు మొదటిచూపులోనే తెలిసిపోతుంది. ఏమీ తెలియనివారికి దాని అసలు సంగతి తెలియడం కష్టమే" అన్నాడు. "రేపు పెళ్ళిలో బయట పడకుండా ఉంటే అంతేచాలు..." అన్నది పడుకుంటూ...

ఆమె తర్వాత కొద్దినిముషాలలోనే నిద్రపోయింది. కుమారస్వామి వెన్నెలలో చంద్రబింబాన్ని ధిక్కరిస్తున్న భార్యముఖాన్ని చూస్తూ అలాగే పడుకున్నాడు. అతనికి దాదాపు పదిహేను రోజులక్రిందట జరిగిన విషయం గుర్తుకు వచ్చింది.

వారున్న ఇంటికి ఉత్తరదిశగా మేడలో జడ్జిగారొకాయన ఉన్నాడు. ఆయన భార్యకు నగలంటే విపరీతమైన అభిమానం ..పిల్లలేమో లేరు... అంకంత ఆ ఇంట్లో భార్యాభర్తలిద్దరే ఉండేవారు. భర్త భోజనంచేసి కోర్టుకు వెళ్ళిపోయిన తర్వాత ఆమె కేమీ తోచేదికాదు. ఒక్కొక్కనాడు బంగారు దుకాణాలు చూసివద్దామని బుద్ధిపుట్టగానే నౌకరును కేక వేసి కారు సిద్ధంచేయించమని చెప్పి చేతికందినంత డబ్బు అందుకుని బజారుకు వెళ్ళిపోయేది. ఆమెకు తమ ఇంటిప్రక్కన చిన్న పూరింట్లో వున్న కుమారస్వామి దంపతులంటే అవ్యాజమైన అభిమానం. క్రొత్తగా బదిలీ అయి ఆ యింట్లో దిగిననాడే ఆమెను పక్క యింటి పెరటిలో కలనేతరంగుచీర కట్టుకుని లేడికళ్ళతో అమాయకమైన చూపులతో తనవైపు చూస్తున్న శ్రీదేవి ఆకర్షించింది. తర్వాత చాలాసార్లు మధ్యాహ్నంపూట ఏమీ తోచనప్పుడు వారిద్దరూ పెరటిగోడపక్కన చెట్టు నీడలో నిలబడి కబుర్లు చెప్పుకునేవారు. శ్రీదేవికి ఆమెను చూస్తే ఆశ్చర్యంగా ఉండేది. ఆమె ధగధగలాడే రాళ్ళ ఆభరణాలు కొన్నాళ్ళూ, తళతళలాడే కేవలం బంగారు వస్తువులు కొన్నాళ్ళూ ధరించేది. మొత్తానికి అన్నీ కళ్ళు జిగేలుమనిపించే నగలే...

ఒకనాడు సాయంకాలం జడ్జిగారి భార్య పెరటి గోడ మీది నుంచి శ్రీదేవిని పిలిచి "నేనిప్పుడే బంగారు దుకాణానికి వెళ్ళి వస్తున్నాను. మా వారికి ఒక ఉంగరం కొందామని వెళ్ళాను. మీ ఆయన తూకంవేసేచోట కూర్చుని ఉన్నాడు. అతనికి అక్కడ ఉద్యోగమా?" అని అడిగింది.

శ్రీదేవి నుదుట పడుతున్న ముంగురులను పైకి తోసుకుంటూ "అవునట...నే నెప్పుడూ అక్కడికి వెళ్ళలేదు" అన్నది.

జడ్జిగారి భార్య నవ్వి "భలేపిల్లవే నువ్వు...రేపు నేను మళ్ళీ వెడుతున్నాను. మా వారికి ఆ ఉంగరం నచ్చలేదు. దాన్ని మార్చి మరొకటి తీసుకురావాలి...రేపు నువ్వు కూడా రా నాతోపాటు" అన్నది.

శ్రీదేవి అప్పుడేమీ మాట్లాడలేదుగాని రాత్రి కుమారస్వామి భోజనం చేస్తూవుండగా అతని అనుమతి లేకుండా వెళ్ళడ మెలాగా అని సందేహించింది. అలా చేసే అతనికి కోపం రావచ్చునేమో కూడా అందు వల్ల తీరా ఆమె బయలుదేరే సమయానికి 'రాను పొమ్మం'టే సరిపోతుంది లెమ్మనుకున్నది...కాని మర్నాడు మధ్యాహ్నం ఎండ పూర్తిగ వాటార కుండానే జడ్జిగారి భార్య జరజరమని శబ్దంచేసే పట్టుచీరె కట్టుకుని ముస్తాబై వచ్చి "ఏంపిల్లా? ఇంకా ఏం చేస్తున్నావు? త్వరగా బయలుదేరు. కారుకూడా సిద్ధంగా వుంది" అన్నది. శ్రీదేవి చాప వేయబోయింది. ఆమె వారించి "ఇప్పుడు చాపలెందుకు పరుస్తావు? త్వరగా చీరె మార్చుకుని బయల్దేరు" అన్నది. శ్రీదేవి అనుమానిస్తూ "ఇప్పుడు నేనుకూడా ఎందుకు పిన్నిగారూ? మీరు వెళ్ళి రారాదూ? పైగా మావారికి ఏమీ చెప్పలేదు కూడా" అన్నది. ఆమె నవ్వి "అదా నీ భయం? ఏం ఫరవాలేదులే... ఆ అబ్బాయేమీ కర్కోటకుడు కాడులే. ఊఁ! త్వరగా కానివ్వు..." అని తొందర చేసింది. శ్రీదేవికి తప్పలేదు. ఆమె లోపలికి వెళ్ళి తాను కట్టుకునివున్న చీరనే మళ్ళీ సరిగా కట్టుకుని ముందుగదిలోకి వచ్చింది. ఆ పూరింటి నాలుగు మూలలూ చూస్తూ కూర్చున్న జడ్జిగారి భార్య శ్రీదేవి వైపు జాలికలిసిన చూపులతో చిత్రంగా చూసి లేచి బయలుదేరింది. ఇద్దరూ కారులో బంగారు దుకాణాలకు వెళ్ళారు. ఒక పెద్ద దుకాణం ముందు కారు ఆగగానే ఇద్దరూ దిగి ఒకవ్యక్తి దోవ చూపిస్తూవుండగా

లోపలికి నడిచారు. అది చాలా పెద్దదుకాణం. అద్దాల షోకేసులలో రక రకాలైన నగలు ఉన్నాయి. ఒక వైపు వెండివస్తువులు ఉన్నాయి. హాలులో ఎటుచూసినా తళతళలే. చూసేందుకు రెండుకళ్ళు చాలవని పించింది. వారు జడ్జీగారి భార్య రాగానే ఎంతో గౌరవంగా భక్తిశ్రద్ధ లతో ప్రవర్తించారు. ఆమె క్రిందటి రోజు కొన్న ఉంగరం తన భర్తకు నచ్చలేదని చెప్పి మిగిలిన రకాలు కూడా చూపించమన్నది. ఆమాట నోటినుంచి రావడమే తడవుగా డజన్లకొద్దీ ఉంగరాలున్న పెట్టెలు లెక్క లేనన్ని వారిముందు ఉంచబడ్డాయి. శ్రీదేవి కళ్ళు చెదిరిపోయాయి. అన్ని ఉంగరాలూ ధగధగలాడుతూ అద్భుతంగా ఉన్నాయి. అన్నీ నిగనిగ లాడుతూ కాంతులీనుతున్నాయి. వాటిలో ఒక్క ఉంగరాన్ని ఎన్నిక చెయ్యడ మెంత కష్టం? జడ్జిగారి భార్య మాత్రం ఆరితేరిన పరీక్షకురాలి వలె అన్నింటినీ పరిశీలించి చూసి ఒక ఉంగరాన్ని ఎన్నికచేసింది. దాన్ని ఒక కుర్రవాడు తీసుకొని ముందు నడుస్తూ ఉండగా ఇద్దరూ కొంచెం దూరంలోవున్న 'ధర్మకాటా' దగ్గరికి వెళ్ళారు... అది ఒక చిన్న గది... అక్కడ ఒకరిద్దరు మనుషులు తప్ప అప్పుడు మరెవరూ లేరు... గదిమూల గాలిచొర రానిచోట సున్నితపు త్రాసుముందు కూర్చుని ఉండి, జారిపోతువంటి బంగారపు హారాన్ని తూకం వేస్తున్నాడు కుమారస్వామి. అతని పచ్చని నుదుట స్వేదబిందువులు ఉన్నాయి. రెండు, మూడు పొడుగాటి వెంట్రుకలు క్రాపులోనుంచి విడివడి నుదుట పడుతున్నాయి. నిశ్చలుడైన యోగివలె అతడు సన్నని ముల్లువంక తదేకంగా చూస్తున్నాడు. శ్రీదేవి ఆసక్తితో చూస్తూ నుంచున్నది. ఆమెకు ఏమూలో కొంచెం భయంకూడా లేకపోలేదు. గుమ్మం పక్కగా ఒదిగి నుంచుని భర్త చూపులనుంచి తప్పించుకుంటే మంచిదనుకున్నది ఆమె. ఇంతలో తూకం నిర్ణయంచేసి చీటీమీద వేసి నగతోసహా అక్కడివారి కిచ్చి పంపించి అతడు ఉంగరాన్ని అందుకుంటూ జడ్జిగారి భార్యవంక చూసి గుర్తించి, "నిన్న నొక ఉంగరం తీసుకుపోయారుగా మీరు?" అన్నాడు. ఆమె నవ్వి "అవును. ఇది మరొకటి. మావారికి నిన్నటి ఉంగరం ఏమీ నచ్చలేదుట. అందుకని మళ్ళీ ఈ పూట వచ్చాము. అన్నట్టు ఇలా చూడు. ఈమనిషి యెవరో" అన్నది, శ్రీదేవిని ఇవతలికి

లాగుతూ. శ్రీదేవి ఇరుకునపడిపోయింది. ఆమె చీరెకొంగు పట్టి లాగడం వల్ల గుమ్మం పక్కనుంచి ఇవతలికి రాక తప్పలేదు. భయంతో ఆమెకు ముచ్చెమటలు పోశాయి. తడబడుతూ "నేను రాననే అన్నాను. ఒస్తేగానీ వీల్లేదని పట్టుబట్టి కూర్చుంటే రాక తప్పలేదు" అన్నది. కుమారస్వామి చిత్రంగా నవ్వి ఏమీ మాట్లాడకుండా వెనుదిరిగి తనపనిలో లీనమైనాడు. ఆ ఉంగరాన్ని తూకంవేసి చీటీమీద వేసి ఆ కుర్రవాడిచేతి కిచ్చాడు. తర్వాత వారు ఇవతలికి వచ్చారు.

ఇంటికి వచ్చాక ఆపూట అంతా శ్రీదేవి వ్యాకులపాటుతోనే గడిపింది. పనిపాటలన్నీ పరధ్యానంగానే చేసింది. పొద్దుగూకగానే పనులన్నీ పూర్తిచేసుకుని తెల్లని చీరె రవికా తొడుక్కుని జడ్జిగారి భార్య పెరటిగోడమీదుగా అందించిన మల్లెచెండు తలలో ఉంచుకుని భర్త కోసం ఎదురుచూస్తూ కూర్చున్నది. ఆమెకు లోలోపల భయంగా ఉంది. చెప్పకుండా అలా ఇల్లు వదిలి వెళ్ళినందుకు అతనికి కోపం రావచ్చు... ఎనిమిదిగంటలు దాటినతర్వాత కుమారస్వామి పైపంచెతో నుదుటిమీద చెమట తుడుచుకుంటూ వాకిలి తడికె తొలగించుకుని లోపలికి వచ్చాడు. శ్రీదేవి నిశ్శబ్దంగా అతన్ని అనుసరించి ఇంట్లోకి వెళ్ళి పైపంచె చొక్కా అందుకున్నది. తర్వాత పెరట్లోకి వెళ్ళి నీళ్ళతోడి ముందుగదిలోకి వచ్చి వినయంగా "స్నానానికి రండి" అని పిలుచుకువెళ్ళి నీళ్ళు సమపాళ్ళగా ఉన్నాయో లేదోనని కాసిని చేతిమీద పోసుకుని చూసి చెంబుతో ముంచి అందించింది. అలా స్నానఘట్టం పూర్తికాగానే భోజనసమయంలో దగ్గర కూర్చొని ఉండి విసురుతూ శ్రద్ధగా అన్నీ కనుక్కుని వడ్డించింది. అతని భోజనం పూర్తికాగానే పెరట్లో మంచంవాల్చి నెమ్మదిగా 'కూర్చోండి' అని చెప్పి లోపలికి వెళ్ళింది. చిత్రమేమిటంటే కుమారస్వామి అంతవరకూ పల్లెత్తుమాట అయినా అడలేదు. ఆమె ఆ మౌనం అంతా కోపంవల్లనే అని అనుకున్నది...తర్వాతతానుకూడా భోజనంచేసి తలుపులన్నీ వేసి వచ్చింది. నిండుజాబిల్లి పలుచని మబ్బులను లెక్క చెయ్యకుండా వెన్నెలవర్షం కురిపిస్తున్నది. చల్లని గాలి తెరలు తెరలుగా హాయిగా వీస్తున్నది. కుమారస్వామి కళ్ళుమూసుకుని వెల్లకిలా పడుకుని

ఉన్నాడు. శ్రీదేవి వెళ్ళి అతనిపక్కనే కూర్చున్నది. ఒక్కక్షణంసేపు ఊరుకుని తర్వాత ధైర్యం కూడగట్టుకుని నెమ్మదిగా "ఏమండీ, కోపమా?" అన్నది. అతడు కళ్లు తెరిచి ఒక్క క్షణం ఆమె ముఖంలోకి చూసి "ఎందుకూ?" అని అడిగాడు. ఆమె తల వంచుకుంది. తర్వాత నెమ్మదిగా "మీకు ముందుగా చెప్పకుండా అలా ... ఆమె వెంట వచ్చానని ..." అన్నది. కుమారస్వామి నవ్వాడు. నవ్వుతూనే చేతులను ఆమె చుట్టూ వేసి "పిచ్చిదానా" అంటూ దగ్గరికి తీసుకున్నాడు. ఆమె ఏదో బరువు దింపినట్టు 'అమ్మయ్య' అనుకుని నిట్టూర్చింది... తర్వాత నవ్వుతూ ముక్కుమీద వేలువేసుకుని 'ఇక్కడా ఇవన్నీ ? తప్పుకదూ ? ఎవరైనా చూస్తే' అన్నది. కుమారస్వామి చేతులు ఇవతలకు తీసుకుని, చుట్టూ చూసి "ఎవరున్నారిక్కడ? ఆ చందమామ తప్ప..." అన్నాడు. ఆమె గలగల నవ్వింది.

ఇది జ్ఞాపకం చేసుకుంటున్న కుమారస్వామి ఉలికిపడి చూశాడు. శ్రీదేవి నిద్రలో నవ్వుతున్నది...ఆమె కంఠసీమలో తళతళ మెరుస్తున్నది గిల్టు ఆభరణం...అతడు "వట్టి అప్రయోజకుణ్ణి" అనుకున్నాడు. తర్వాత అతనికి నిద్ర ముంచుకువచ్చింది.

రెండోనాడు ఉదయమే దంపతులిద్దరూ బయలుదేరి స్టేషనుకు వెళ్ళారు. కుమారస్వామి తమ ఇద్దరి దుస్తులనూ, ఒక చిన్న పెట్టెలో సర్దాడు. రైలురాగానే శ్రీదేవిని ఆ పెట్టెతోసహా ఆడవాళ్ళ పెట్టెలో ఎక్కించి, తాను వేరేచోట వెళ్ళికూర్చున్నాడు. శ్రీదేవి చుట్టూచూసింది. ఆమెకు ఎదురుగా కూర్చునివున్న స్త్రీకి ముప్ఫయేళ్లు ఉంటాయి. ఆమె పక్కనే చేతిసంచితో మరొక పాతికయేళ్ళ పడుచు కూర్చునివుంది. మొదటి ఆమెకు ఒక చేతినిండా గాజులూ, మెళ్ళో తళతళలాడే రాళ్ళ నెక్లెసూ, మరొక చేతికి బంగారు గొలుసు వేసిన వాచీ ఉన్నాయి. ఆమె చీర కొంగుతో విసురుకుంటూ "అబ్బబ్బ ? ఊపిరాడటంలేదు. రైలు కదిలితే కొద్దిగా గాలి ఆడుతుందేమో !" అన్నది. శ్రీదేవి ఏమీ మాట్లాడ లేదు. ఎదుటి ఆమె చూపులు శ్రీదేవి మెడలోవున్న నెక్లెస్‌మీదపడ్డాయి.

ఆమె పక్కన కూర్చున్న పడుచు మరీ నిర్ధనురాలేమో, ఆమె మెడలో మంగళ సూత్రాలు కూడా లేవు. ఒక పసుపు తాడు మాత్రం వుంది. ఆమె వీరిద్దరివంక తదేకంగా చూస్తున్నది.

రైలు ప్రయాణం సాగించగానే తెరలు తెరలుగా గాలి వీచటం ప్రారంభించింది. శ్రీదేవి ఎదురుగా కూర్చునివున్న ఆమె నగలలో రోజు రోజుకూ వస్తున్న మార్పులను వివరించటం ప్రారంభించింది. ఆమెకు తాను ధరించివున్న రాళ్ళహారం మీద మోజు పోయిందట. ఇప్పుడు శ్రీదేవి ధరించివున్న నెక్లెస్ వంటిదే అందరూ వాడుతున్నారట. ఇలా శ్రీదేవి ఏమీ మాట్లాడకుండానే ఆమె ఉపన్యాసంఇచ్చి, ఉన్నట్టుండి "ఏదీ! ఆ నెక్లెస్ ఒక్కసారి ఇలా ఇవ్వు తల్లీ...చూసి ఇచ్చేస్తాను" అని అడిగింది. శ్రీదేవి నుదుట చెమట బిందువులు నిలిచాయి. ఆమె ఆందోళనలు అణచుకుంటూ, నెమ్మదిగా మెళ్లోవున్న నెక్లెస్‌తీసి, ఎదుటి ఆమెకు అందించి మొహం తిప్పుకుని కిటికీలోనుంచి వేగంగా వెనక్కు వెళ్ళి పోతున్న టెలిగ్రాఫ్ స్తంభాల వంకా, చెట్లవంకా చూస్తూ కూర్చున్నది... ఒక అరనిముషం ఒక యుగంలా గడిచాక, ఆమె శ్రీదేవిని చేత్తోతట్టి, పిలిచి, "ఇదుగో పెట్టుకో అమ్మా సింపుల్‌గా ఎంతో బావుంది....నేను కూడా ప్రస్తుతం వున్న దాన్ని మార్చి ఇలాంటిదే తీసుకుంటాను. ఈ రాళ్ళకు డబ్బు పొయ్యటం దండగ...కొనేటప్పుడు పదులూ, ఇరవైలూ చేసేరాళ్లు అమ్మేటప్పుడు నయాపైసా కూడా చెయ్యవు. అన్నట్టు ఇది ఎన్నినవరసులు తల్లీ?" అన్నది శ్రీదేవి నెక్లెస్ మెళ్ళో ఉంచుకుంటూ, వెంటనే "నాలుగున్నర అనుకుంటాను. అయినా నాకు వివరాలు సరిగా తెలియవు. మావారే తెచ్చారు" అన్నది. ఒంటిమీద చిన్నమెత్తు బంగారం అయినాలేని ఆ మూడో ఆమె శ్రద్ధగా వింటున్నది

ఇంతలో బండి ఒక స్టేషనులో ఆగింది. సన్నగా, పొడుగ్గావుండి, మాసినపంచె, చొక్కా ధరించివున్న ఒక నడివయసు వ్యక్తివచ్చి, ఆ మూడో ఆమె దగ్గర సంచి అందుకున్నాడు. ఆమెలేచి దిగబోతూ శ్రీదేవి మెడవంక ఒకసారి చూసింది. శ్రీదేవి మనసు ఎవరో కెలికినట్టు బాధ పడింది. ఆమె దిగిపోగానే కుమారస్వామి వచ్చి 'ఏమన్నా కావాలా?' అని

అడిగాడు. శ్రీదేవి తల అడ్డంగా ఊపింది, ఏమీ అక్కర్లేదన్నట్టు. అతడు మళ్ళా వెళ్ళిపోయాడు. ఎదుటి ఆమె ముచ్చటపడి, "మీ ఆయనేగా?" అని అడిగింది. 'అవు'నని తలవూపింది శ్రీదేవి .. ఆమె ఇంకేమీ అడగలేదు.

*　　　　*　　　　*

స్టేషనులో దిగి దంపతులిద్దరూ నడక సాగించారు. ఇల్లు అరమైలు దూరం వుంటుంది. కుమారస్వామి మొదట్లో 'నువ్వు నడవలేవు బండి మాట్లాడనా?' అని అడిగాడు. శ్రీదేవి "వద్దు. కాస్త దూరమేగా! నడిచి పోదాం మళ్ళీ బండి కట్టుకుంటే ఏ అర్ధరూపాయో ఇచ్చుకోవాలి. చదివింపుకని తెచ్చిన పదిరూపాయలు తప్ప, మనకు మళ్ళీ చార్జీలకేగా డబ్బున్నది?" అన్నది.

ఇద్దరూ వెళ్ళేసరికి పెళ్ళియిల్లు హడావిడిగా వుంది. అందరూ ఏవేవో పనులమీద హడావిడిగా తిరుగుతున్నారు. పట్టుచీరెల జరజరలూ కాలి మట్టెల గణగణలూ, గాజుల గలగలలూ వీనులకు విందుగా వినవస్తున్నాయి. వరండాలో మేళం మోగుతున్నది. పిల్లలు అటూఇటూ గోలచేస్తూ తిరుగుతున్నారు.

వరండాదాటి ముందుగదిలోకి వెళ్ళగానే శ్రీదేవి పెద్ద అక్కగారు చూసి ఎత్తిపొడుపుగా "ఏంతల్లీ? పదిరోజులనాడు శుభలేఖవేస్తే తీరిగ్గా ముహూర్తం వేళకు వచ్చారా?" అన్నది... శ్రీదేవి నవ్విందేగాని మారు పలకలేదు.

తండ్రిదగ్గరికి వెళ్ళి కనిపించగానే, ఆయన ఏమీ మాట్లాడకుండా తలఊపి, 'ఊఁ!' అని మాత్రం అన్నాడు. కుమారస్వామికి దాహంతో నాలిక పిడచగట్టుకునిపోతున్నది. అతడు వరండాలో చాపమీద కూర్చుని, చిన్నవదినగారిని పిలిచి "ఏమండీ వదినగారూ! కాసిని మంచినీళ్ళిప్పిస్తారా!" అని అడిగాడు. ఆమె విని లోపలికి వెళ్ళి ఆపని శ్రీదేవికే ఒప్పజెప్పింది. శ్రీదేవి మంచినీళ్ళు తెచ్చియిచ్చి పెట్టె తీసుకుని లోపలికి వెళ్ళింది.

తర్వాత ఆమె పెళ్ళికుమారుడి దగ్గరికివెళ్ళి, "ఏమిరా

అన్నయ్యా!" అని పలకరించింది. అతడు పక్కకు తిరిగి చూసి, "నువ్వా?.. ఇప్పుడుటే రావటం! శుభలేఖ వేసి ఎన్నాళ్ళయింది? అంత తీరని ఉద్యోగం చేస్తున్నాడా మీ ఆయన?" అన్నాడు. శ్రీదేవి మనసులో కష్టపడినప్పటికీ, పైకిమాత్రం నవ్వి వెళ్ళిపోయింది.

కుమారస్వామి స్నానంచేసి ఉత్తరంవైపు వరండాలోకి వెళ్ళాడు. అక్కడ ఇంటి పెద్దఅల్లుళ్ళిద్దరూ కూర్చుని వున్నారు. పక్కన మరో ముగ్గురు బంధువులు కూడా ఉన్నారు. అందరూ ఖరీదైన పంచెలు, లాల్చీలు ధరించివుండి ఖరీదైన సిగరెట్లు తాగుతున్నారు. కుమారస్వామి ఒకపక్కన నిశ్శబ్దంగా కూర్చుండిపోయాడు. పెద్ద అల్లుళ్ళిద్దరూ సంపన్నులు. వ్రేళ్ళకు ధగధగమెరిసే ఉంగరాలు పెట్టుకుని వున్నారు. ఒకాయన మెడలో సన్ననిగొలుసూ, పులిగోరూ వున్నాయి. వారిలో పెద్దఅల్లుడు మాత్రం కుమారస్వామిని గుర్తించి పలకరించాడు. రెండో ఆయనకు గుర్తురాక అడిగి తెలుసుకుని, "ఓహో అలాగా!" అన్నాడు.

తర్వాత అక్కడివారందరూ పేకలు తెప్పించి ఆడటం ప్రారంభించారు. కుమారస్వామి ఎన్నడూ పేకాట ఆడలేదు. దాన్ని గురించి అతనికి ఏమీ తెలియదుకూడా, ఆ ఆట చిత్రంగావుంది. రూపాయలు గల్లుగల్లుమని చేతులు మారుతున్నాయి.

ఆనాడు భోజనాలైన తర్వాత ఆడవాళ్ళందరూ విశ్రాంతిగా హాల్లో కూర్చునిఉండగా, ఒక విశేషం జరిగింది. శ్రీదేవి దూరపు మేనత్త ఒకామె "ఏమే! నీ మొగుడు ఇప్పుడేం చేస్తున్నాడు? ఏమైనా సంపాదన ఉందా లేదా?" అని అడిగింది. శ్రీదేవి ఏమి మాట్లాడలేదు. ఆమె పెద్ద అక్కగారు వెంటనే అందుకుని మెడపట్టనన్ని ఆభరణాలు ధరించివుండి, వాటిని సర్దుకుంటూ, "ఆఁ! అతనేమి సంపాయిస్తాడు! మొన్న వచ్చినప్పుడు కూడా చూశాంగా. చిన్న మెత్తు బంగారమయినా లేదు.... తిండికి కూడా లోటు లేకుండా జరుగుతున్నదో లేదో అనుమానమే!" అన్నది. చిన్న అక్కగారు నవ్వుతూ శ్రీదేవివంక చూసి, ఆశ్చర్యపోయింది. శ్రీదేవి భుజాలమీదుగా కప్పుకున్న పమిట కొంగు కొంచెంజారి మబ్బు తెరలనుండి విడివడిన చంద్రరేఖలా నెక్లెస్ ఆమె

కంటబడింది. ఆమె వెంటనే, "ఏదో చేయించాడే మరిదిగారూ..." అంటూ శ్రీదేవి మెడలోనుంచి ఆ నెక్లెసును ఇవతలకి తీసింది. దాని వెంటనే రెండు పేటల సైకిల్ గొలుసు కూడా ఇవతలకి వచ్చింది.

శ్రీదేవి నుదుటపట్టిన చెమటను పమిట కొంగుతో అద్దుకుంటూ తలవంచుకుని కూర్చుండిపోయింది. కొన్ని క్షణాలు నిశ్శబ్దం... అందరూ ఆ రెండు వస్తువులనూ చేతుల్లోకి తీసుకుని చూస్తూ తమకు తోచిన వ్యాఖ్యానాలు చేస్తున్నారు.

"ఇప్పుడు రాళ్ళ నగలు ఫ్యాషన్ కాదు. ఇలాంటివే బావుంటాయి."

"నేనూ మామిడిపిందెల నెక్లెస్ తీసుకుందామనుకున్నాను. తీరా విచారిస్తే, మా ఊళ్లో చేసినవి తయారుగా లేవు..."

'సింపుల్‌గా ఫస్టుగా వుంది....'

మళ్ళీ ఒక్క క్షణం నిశ్శబ్దం. శ్రీదేవి మేనత్త ఆ నెక్లెసును వెలుగుకు ఎదురుగావుంచి చూసి అననే అన్నది..."ఇదేమిటే అమ్మాయీ! ఇదేం బంగారమే... తేడా కనిపిస్తున్నదే."

శ్రీదేవి లేచి విసవిస లోపలికి వెళ్ళిపోయి, పక్క గదిలో తలుపు చాటున నుంచున్నది... అవతలివారి మాటలు వినిపిస్తూనే ఉన్నాయి.

"ఇవి గోల్డుకవరింగ్ నగలేమోనే."

"నే నప్పుడే అనుకున్నాను. ఆ వాజమ్మ గురిగింజ ఎత్తు బంగారమయినా కొనగలడా?"

"అప్రయోజకుడు. ఏమీ లేకపోయినా నయమే. గిల్టునగలు కొని పెడతాడా?"

శ్రీదేవి గుడ్ల నీరుకుక్కుకుంటూ పెరటిలో నూతి పళ్లెంమీదికి వెళ్ళి నిలబడింది. ఒక ముసలామె అందర్నీ మందలించి "మీ కసలు బుద్ధిలేవు. వాళ్ళ కోరి ఏకెందుకు? ఇన్నాళ్ళూ వాళ్ళ ఆలనా పాలనా ఎవరైనా పట్టించుకున్నారు గనుకనా? పాపం, ఆ కుర్రవాడినంటున్నారు. మీరు ఒక వడ్లగింజఎత్తు బంగారం పెట్టాలా దానికి ఎప్పుడన్నా? సిగ్గు లేకపోతేసరి..." అంటూ ఆ గిల్టు నగలను తీసుకుని శ్రీదేవి దగ్గరికి

వచ్చింది. ఆమె ఎవరో దూరపు బంధువు. ఆ క్షణంలో తల్లే అలా వచ్చిందనిపించి శ్రీదేవి ఆమె భుజంమీద తల వాల్చి, వెక్కి వెక్కి ఏడ్చింది. కుమారస్వామి మంచినీళ్ళకోసం వచ్చి, సంగతి తెలుసుకుని ముఖం కందగడ్డలా చేసుకుని మంచినీళ్ళు అడగకుండానే విసవిసా వరండాలోకి వెళ్ళిపోయాడు. శ్రీదేవి ఆ ముసలామె భుజంమీద తలవాల్చి, దుఃఖిస్తున్న దృశ్యం అతన్ని కదిలించివేసింది. అతను 'ఉస్సు'రని నిట్టూరుస్తూ చాపమీద కూలబడ్డాడు.

పక్కవీధిలోనే ఆడపెళ్ళివారి ఇల్లు. ఆ రాత్రి పెళ్ళి అయిపోగానే కుమారస్వామి బయలుదేరి శ్రీదేవితో "నేను వెళుతున్నాను నువ్వు రెండు రోజులపాటు ఉంటావా?" అన్నాడు. ఆమె తల అడ్డంగాఊపి, "ఊహూ! ఇక్కడ ఉండను. మిమ్మల్ని వదిలి అసలు ఉండలేను. ఇద్దరం పోదాం పదండి..." అన్నది. వాళ్ళిద్దరూ ప్రయాణమవుతున్నారని తెలిసి తండ్రి ఏమీ మాట్లాడకుండా ఒక చీరె, పంచెలచాపూ తెచ్చి, తాంబూలంతోసహా ఇద్దరికీ ఇచ్చాడు. శ్రీదేవికి కళ్ళవెంట నీళ్లు తిరిగాయి. 'ఇక ఇంతలో మళ్ళీ ఇక్కడికి రాబోయేదిలేదు...' అనుకుని ఆమె కన్నీళ్లు వత్తుకుంటూ దగ్గరలో నిలబడివున్న అన్నగారికిచెప్పి బయలుదేరింది. ఆమె అక్కలిద్దరూ అప్పుడక్కడలేరు. ఆ ముసలామె వీధి గుమ్మందాగావచ్చి, గద్గద స్వరంతో "వెళ్ళిరాతల్లీ! పిళ్ళ సంగతి మనకు తెలియనిదేమున్నదీ? పశుప్రాయులు.. నువ్వేమీ బాధపడకు..." అని సాగనంపింది.

ఆనాడు రాత్రి వెన్నెల పున్నపువ్వులాంటిది. జాబిల్లి మబ్బుతెరలను చిల్చుకుంటూ బయటికివచ్చి, వెలుగులను కుమ్మరిస్తున్నది. కుమారస్వామి పెరటిపంచలో వెల్లకిలాపడుకొని ఉన్నాడు. కొన్ని నిముషాల తర్వాత శ్రీదేవి చేతిలో మంచినీళ్ళచెంబుతోవచ్చి, చెంబును గడపలో వుంచి, భర్త పక్కనే కూర్చున్నది. అతడు ముఖం తిప్పుకున్నాడు. ఆమె "ఇటు చూడరూ? నామీద కోపమెందుకూ? నేనేం చేశానసీ?" అని అడిగింది. అతడేమీ మాట్లాడలేదు. ఆమె ఒక్కక్షణం ఆగి, తన మెడలో

వున్న గిల్టు నగలనుతీసి విసిరి దూరంగా పారేసింది. "ఇప్పుడు నావంక తిరగండి" అన్నది అతన్ని తనవైపు తిప్పుకుంటూ. కుమారస్వామి రెండుచేతులతో ఆమెను దగ్గరికి తీసుకున్నాడు. శ్రీదేవికి అతని కళ్ళలో నీళ్ళు తగిలాయి. ఆమె చేతితో అతనికళ్ళు తుడుస్తూ, "ఛా తప్పుకదూ? వాళ్ళనుగురించి అసలు ఆలోచించకండి. ఈ నగలు గిల్టువయితే వాళ్ళు మనుషులే గిల్టు మనుషులు... మీ అంత మంచి వారెక్కడైనా ఉంటారా? మీరు రత్నం...మిగిలినవాళ్ల రాళ్లు..." అన్నది.

(15-6-62 ఆంధ్ర సచిత్ర వారపత్రిక)

# మనసు

"అరవైయేళ్ళు దాటి, రిటైరయిన తర్వాత బ్రతికి వుండడమే పెద్ద తప్పు..." అనుకున్నాను నేను చిరాకుతో, ఆ ఫోటో ముందు కూర్చుని పగిలిపోయిన అద్దం పెంకులను ఏరుతూ...

పెద్ద అవసరం వచ్చిన వాడిలా కుర్చీ వేసుకుని మరీ పైకి ఎక్కి దాన్ని క్రింద పడేసిన కుర్రవెధవ నా ప్రక్కనే కళ్ళు పెద్దవిచేసుకుని చూస్తూ నిలబడ్డాడు. గాజు పెంకులను ఏరుతూవుండగా ఒక బ్లేడువంటి గాజుముక్క వ్రేలికి గీరుకుపోయి నా చిరాకును సహస్రాధికం చేసింది. గారడీచూస్తున్నవాడిలా నిలబడిన ఆ కుర్రవెధవను ఉద్దేశించి కోపంగా "నువ్వు అవతలికి పో ముందు" అని అరిచాను. వాడు బొత్తిగా భయభక్తులులేని శుంఠ...అనవసరంగా నవ్వుతూ నన్ను మరింత ఉడికిస్తూ లోపలికి వెళ్ళాడు.

చాలా ఓపికగా గాజుపెంకులు ఏరి బయటపారబోసి ఆ ఫోటోను చేతిలో వుంచుకుని వాలుకుర్చీలో కూలబడ్డాను. మనసంతా ఎవరిమీదో, ఎందుకో తెలియని ఉక్రోషంతో, కసితో నిండిపోయివుంది.

నేను ఏళ్ళతరబడి పెద్ద పదవిలో ఠీవిగా, దర్జాగా కాలం గడిపి సంవత్సరం క్రిందటనే రిటైరయినాను. అంతకాలమూ మధ్యందిన మార్తాండునివలె ఒక వెలుగు వెలిగాను. అయినా ఎప్పటికీ సూర్యుడులా నడినెత్తినే ఉండిపోవడం సాధ్యం కాదుగదా ! ఈ సూర్యుడు ఉద్యోగ విరమణచేసి పెన్షన్ తీసుకోవలసి వచ్చింది. సరే తప్పదు కాబట్టి సోమరిగా యింటి పట్టున కూర్చుండి పోయాను. కాని నాకు మనశ్శాంతిలేదు. వారం రోజులనుంచీ యీ వానరసేన వచ్చిపడింది. దానితో మరీ చీకాకు పడిపోతున్నాను.

'వానరసేన' లోపల హడావిడిచేస్తున్నది. వాళ్లు మొత్తం ఆరుగురు. అందరికన్నా పెద్దవాడు రాజు. మా పెద్దమ్మాయి కొడుకు. ఫిఫ్తుఫారం పరీక్షలు వ్రాసి వాడు సెలవుల్లో యిక్కడికి వచ్చాడు. జుట్టు మొహం మీద పడుతూవుండగా ఎప్పుడూ గంభీరంగా ఏదో ఆలోచిస్తూవుంటాడు. మొదట్లో ఏ వేదాంతిగానో తయారవుతాడని అనుకున్నాను. కాని వాడు నా అంచనాలన్నీ తలక్రిందులుచేసి 'మెకానిక్'గా తయారైనాడు. ఎప్పుడూ ఎలక్ట్రిక్ బల్బులు తీసి మళ్ళీ పెట్టడం ఫ్యూజులు పోతే వెయ్యడం, వైరుతో ఏవేవో పనులుచేస్తూ వుండటం ఫ్యానులూ, రేడియోలూ, విప్పి మళ్ళీ బిగిస్తూ వుండటం యిటువంటి పనులలో వాడు ఆరితేరినవాడు. మొనుమొన్నెప్పుడో ఒకసారి సెలవులకువచ్చి వాడు యిక్కడే వుండగా ఒకరోజు రాత్రి అందరూ భోజనాలముందు కూర్చున్న వెంటనే ఫ్యూజుపోయింది కాబోలు లైట్లు టప్పున ఆరిపోయాయి. ఇల్లంతా అంధకారం అలుముకున్నది. అప్పుడు వాడు పెద్దగా "ఎవరూ కదలకండి. ఒక్క క్షణంలో అంతా సరిచేస్తాను." అంటూ తన పెట్టె దగ్గరికి వెళ్ళి టార్చి తీసుకుని పనిముట్లు తీసుకొని వెళ్ళి క్షణంలో లైట్లు వెలిగించాడు. అప్పుడు నా కొడుకూ, కోడలూ, నా మూడో కూతురూ, మా ఆవిడా వాణ్ణి తెగ మెచ్చుకుని ఒకటే మురిసిపోవడం— దాంతో వీడు గొప్ప వినయం నటిస్తూ "మీరు నన్నంతగా పొగడకండి. నేను నా ధర్మం నెరవేర్చానంతే" అన్న ధోరణిలో మాట్లాడటమూ నాకు బొత్తిగా నచ్చలేదు. తేలికగా చప్పరించి "ఈ పనులకు బాగానే పనికొచ్చేట్టున్నావు. ఇంకేం? చదువు మానేసి స్క్రూడ్రైవర్లూ, రెంచీలూ పట్టుకుని యిళ్ళవెంట తిరగడం మంచిది. మీ అమ్మకూ, నాన్నకూ ఈ చదువు పేరుతో డబ్బు దండగ ఎందుకు?" అన్నాను. అలా అని వాడిమొహం వంక చూసి గతుక్కుమన్నాను. వాడు ఆ మాటలు విని కూడా పరమహంసలాగా చిరునవ్వు నవ్వుతూ కూర్చున్నాడు. పైగా మా ఆవిడ మనుమడిని వెనక వేసుకుని వస్తూ "చాల్లెండి—ఏంమాటలండీ మరీనూ. ఇవాళ అన్నాలవేళా చీకట్లో చిందులాట తప్పించాడు బంగారు తండ్రి— వాడికి పనిముట్లు పట్టుకుని యింటింటికీ తిరగవలసిన ఖర్మ పట్టలేదు—వాడు ఏ కలెక్టరో అయి తీరుతాడు. చదువులో మాత్రం వాడు వెనుకబడ్డాడనుకుంటున్నా

రేమో! అల్లుడు నాతో చెప్పాడు— వీడే క్లాసులో అన్నింటా ఫస్టుట— పైగా ఇలా లైట్లుపోతే ప్రతిసారీ ఎవరోవచ్చి బాగుచేసి పోయ్యేవరకూ గతిలేదు—ఒక్కొక్కసారి పూటల తరబడి లైట్లులేక బాధపడతేదూ మనం? మళ్ళీ చూడబోతే యింట్లో అందరూ బి. ఏ. లూ ఎం. ఏ. లూ ప్యాసై ఉద్యోగాలు చేస్తున్నారు. వెధవది ఫ్యూజుపోతే వేసే దిక్కులేదు." అంటూ పెద్ద దండకం చదివింది. వాడు ఆమెను పూర్తిగా మాట్లాడ నిచ్చి "నువ్వూరుకో అమ్మమ్మా! తాతయ్య ఏదో అన్నాడే అనుకో— పెద్దవాడు— ఆయన అలా టీవిస్తేనే మంచిది" అన్నాడు. దానితో మిగి లిన వాళ్ళంతా విరగబడి నవ్వటం నాకు మతిపోయినంత పనయింది.

లోపల చరిత్రగతిని మార్చివేసే యుద్ధం వంటిదేదో జరుగు తున్నది. గబగబా లేచి వెళ్ళాను. ఒకరిమీద ఒకరు పడి పొర్లుకుంటూ రొప్పుతూ రోజుతూ పోట్లాడుకుంటున్నారిద్దరు. ఆ యిద్దరికీ ఏడో సంవ త్సరం నడుస్తున్నది. ఒకడు మా అబ్బాయి రాజశేఖరం కొడుకు. మరొకడు మా పెద్దమ్మాయి రెండో కొడుకు. నేను ఇద్దరినీ చెరో రెక్కా పుచ్చుకుని విడదీసి "వెధవల్లారా! ఎందుకలా కొట్టుకు ఛస్తున్నారు?—" అని అడిగాను. వారిలో ఒకడు నవ్వుతూ "ఊరికే తాతయ్యా! వాడు కుస్తీ పడదాం రమ్మన్నాడు—సరేనన్నాను అంతే" అన్నాడు. నాకు ఒళ్ళు మండిపోయింది. ఉద్రేకంకొద్దీ చెరొకటీ అంటించి "పోండి గాడిదల్లారా?" అంటూ మళ్ళీ హాల్లోకివచ్చి కూలబడ్డాను. ఆఫోటో చేతిలోకి తీసుకున్నాను. అందులో మా కుటుంబం అంతా వుంది. పిల్లలు మినహా మొత్తం పదు గురు. మా పెద్దబ్బాయి పెళ్ళినాటి ఫోటో అది. వాడిపేరు రాజశేఖరం. ఎమ్.ఇ. ప్యాసై ఇక్కడే పనిచేస్తున్నాడిప్పుడు. వాడి భార్య హైస్కూల్లో టీచరు. ఆమె పేరు రమ. ఆమె అంటే నాకు చాలా అభిమానం. ఆ ప్రక్కనే వున్నది మా పెద్దమ్మాయి సుజాత. ఆమె భర్తతో సహా భిలాయ్‌లో వుంటున్నది. అప్పుడప్పుడు తప్ప తరచుగా యిక్కడికి రాదు. ఆమె ప్రక్కనే రెండు జడలు గుండెలమీదికి వేసుకుని వున్నది వనజ. మా రెండో కూతురు. ఆమె భర్త బెంగుళూరులో కాలేజీ లెక్చరరు. ఆమె దగ్గరి నుంచి నాలుగు నెలల క్రిందట ఉత్తరం రాగానే మా ఆవిడ ఒకటే సంబరపడిపోతూ వెళ్ళిందక్కడికి. 'కాన్పుకు పుట్టింటికి పంప

వయ్యా అంటే, అల్లుడు 'ఇదేం మొదటి కాన్పు కనుకనా? ససేమిరా వీల్లేదన్నా'డుట. అందుకని ఆమె నామానాన ఎన్నొదిలేసి తను అక్కడే ఉండిపోయింది. పైగా అభిమానం అంతా ఒలకబోస్తూ మూడు రోజులకో ఉత్తరం రాసి పడేస్తుంది. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోమని నాకూ, నన్ను జాగ్రత్తగా చూసుకోమని మిగిలిన వాళ్ళకూ హితబోధలు చేస్తుంది. మా మూడో అమ్మాయి ఫోటోలో మూర్తి చిత్రంగా పెట్టింది. బహుశా ఎవరినన్నా వెక్కిరిస్తున్నదేమో! ఆమె కింకా పెళ్ళికాలేదు. 'పెళ్ళి'సంగతి ఎత్తినప్పుడల్లా అందర్నీ దులిపేస్తూ వుంటుంది. ఆ ప్రసక్తి తెచ్చామా ఖర్మ కాలించవన్నమాటే. ఒక పెద్ద తుఫాను... ఉప్పెన... వొచ్చిపడి నట్లే. హక్కులు, స్వాతంత్ర్యం. కాళ్ళమీద నిలబడటం, ఈ పదాలు వందలూ వేలుగా ఆమె నోట్లోనుంచి నిజంగా ఉప్పెనలాగేవచ్చి మన అను ముంచెత్తివేస్తాయి. కాని, దాని తెలివితేటలు నన్ను ఎల్లప్పుడూ ముగ్ధుణిచేస్తూ వుంటాయి. అది ఈ యీడుకే ఎం.ఏ.ప్యాసై స్థానిక స్త్రీల కళాశాలలో లెక్చరరుగా వుంటున్నది. పైగా అడపాదడపా వ్యాసాలూ, కథలూ వ్రాసి కొంత పేరు తెచ్చుకున్నది కూడా.

నేను ఫోటో ప్రక్కనేవుంచి నిట్టూర్చాను. ఏమీ తోచడంలేదు. ఇప్పుడేకాదు. ఉద్యోగ విరమణ చేసిన ఆ క్షణంనుంచీ నాకు ఏమీ తోచడంలేదు. కాకపోతే మా ఆవిడ వుండగా కొంత మనశ్శాంతి ఉండేది, ఆమె ఆదరణలో అన్నీ మరిచిపోయి విశ్రాంతి తీసుకునేవాణ్ణి. పెద్ద నిద్రగన్నేరు నీడలా ఆమె నన్ను సేదదీర్చి మనసుకు విశ్రాంతీ, ఆహ్లా దమూ కలిగించేది. పైగా యీ వానరసేనలేకపోతే యిల్లంతా నిశ్శబ్దంగా ఉండేది. అటూయిటూ హడావిడిగా ఎగురుతూ పిచ్చుకలుచేసే సవ్వడి తప్ప మరే శబ్దమూ వినిపించేదికాదు. హాయిగా దినపత్రిక చేతిలోకి తీసుకుని ప్రత్యక్షరమూ చదివి ఆనందిస్తూ ఉండేవాణ్ణి. అందువల్ల అనేక దేశాలు తిరిగినట్టూ, అనేక విషయాలు చూసినట్టూ అనుభూతి కలిగేది. ఈ వానరసేనవచ్చి పడినప్పటినుంచీ అదీ వీలుపడటంలేదు. పేపరు చేతిలోకి తీసుకునేసరికి ఏదో రొద, గొడవ ప్రారంభం. ...దానితో చదువు ముందుకు సాగదు.

ఉదయం తొమ్మిది గంటలకే యింట్లో వంటావార్పు అయిపో తుంది. తొమ్మిదిన్నరకల్లా మా మూడో అమ్మాయి పుస్తకాలు తీసుకుని చెప్పులు చప్పుడు చేసుకుంటూ కాలేజీకి వెళ్ళిపోతుంది. తొమ్మిదిముప్పావు అయ్యేసరికి రాజశేఖరం బైట నడుచుకుంటూ, బూట్లు చప్పుడు చేసుకుంటూ వెళ్ళి స్కూటర్ స్టార్టుచేసి హారన్ మ్రోగిస్తాడు. లోపలి గదిలోనుంచి "వొస్తున్నాను సార్! కొంచెం గుర్రాన్ని కట్టేయండి" అని సమాధానం చెప్పి మా కోడలు బయలుదేరి వచ్చి "స్కూలుకు వెళ్తున్నాను మామయ్యా!" అని నా అనుమతి కోసమే అన్నట్టు ఒక్క క్షణం నిలబడు తుంది. నేను నవ్వుతూ తల వూపుతాను. అప్పుడామె భర్తతోపాటు స్కూటర్‌మీద స్కూలుకు వెళ్ళిపోతుంది. పరాయి యింట పుట్టిన పిల్ల అయినా కోడలు అంటే నా కందుకే అభిమానం...ఆమెకు తప్ప ఎవరికీ యింట్లో 'ముసలి ముండావాడు పడివున్నాడు; కనీసం చెప్పివెళదా'మనే జ్ఞానం బొత్తిగా లేదు.

అలా పది కొట్టేసరికల్లా అందరూ ఎవరిపాటికి వారు బయలుదేరి వెళ్ళిపోతారా? నేనొక్కణ్ణే యింట్లో మిగిలిపోతాను. చేసేందుకా పని ఏమీ ఉండదు. నిద్రపోదామంటే ఎంత ప్రయత్నించినా కళ్ళుమూతలుపడవు. నా భార్య గుర్తుకువస్తుంది. చిరునవ్వులుచిందే ఆ ముఖం... వయస్సు మళ్ళినా తగ్గని శరీర లావణ్యమూ... ...నా పట్ల నెరపిన ప్రేమాభి మానాలూ గుర్తువచ్చి ఆమె లేని బాధను మరింత ఎక్కువ చేస్తాయి. అప్పుడు నా హృదయంలోని బాధనంతటినీ కాగితంమీద వ్రాసి ఆమెకు ఉత్తరం పోస్టు చేద్దామనిపిస్తుంది. నాలుగు రోజుల క్రిందట వ్రాసిన ఉత్తరంలో "నువ్వు లేకపోవడంవల్ల నేను పడుతున్న బాధ ఎలా చెప్పను? ఇక్కడ ఎవరూ, నన్నూ నా ఉనికినీ గుర్తించడమేలేదు. కేవలం కాపలాకుక్కలాగా యింట్లో పడివుంటున్నాను. ఇంకా నువ్వు రావెందుచేత? అమ్మాయి ప్రసవించి ఇన్నాళ్ళయినా నువ్వురాని కారణం ఏమిటి? నువ్వు కూడా యీ రిటైరయిన ముసలివాణ్ణి మరచి పోతున్నట్టున్నావు" అని వ్రాశాను. దానికి సమాధానంలేదు. నిజమేమరి... ఎవరికి మాత్రం నామీద గౌరవం ఎందుకుంటుంది? అందరూ సంపాదన

పదులైనారు. ఆడా, మగా అందరూ ఎవరిపాటికి వారు ఉద్యోగాలుచేసి స్వతంత్రంగా డబ్బు సంపాదిస్తున్నారు. మావాడికేమో అయిదువందలు పైమాటే జీతం...కోడలికేమో రెండువందలకు తక్కువ ఉండదు. మా మూడో అమ్మాయికి సరేసరి మూడువందల చిల్లర ... ఎవరి బ్యాంక్ అకౌంట్లు వారికున్నాయి. నా ముష్టి పెన్షన్ డబ్బు ఎవరికి కావాలి? ఇంటి ఖర్చులలో కూడా నయాపైసా అయినా నా డబ్బు పడేందుకు వీల్లేదు. ఈ ప్రపంచంలో మనిషిమీద గౌరవాభిమానాలు డబ్బునుబట్టే కొంతవరకూ పుట్టుకుని వొస్తూవుంటాయి. నేను ప్రతినెలా పెన్షన్ తీసుకుని వచ్చే దోవలోనే బ్యాంకులో నా పేర జమకట్టి యింటికి వచ్చేస్తాను. ఎవరికైనా డబ్బు కావలసివస్తుందేమో, నా ఆరువేల రూపాయల బ్యాలెన్స్‌లోనుంచి డ్రా చేసి 'షైన్' అవుదామని నాకు మహా కోరికగా వుంది. కాని ఆ అవకాశంరానిదే ఏం చేయను? మొన్నటికి మొన్న ఏం జరిగిందనుకున్నారు? మా అమ్మాయితో బుద్ధిపొరపాటున గడ్డితిని ఇలా అన్నాను. "నీకు ఒక నెక్లెసు చేయిద్దామనుకుంటున్నానే అమ్మడూ, నా డబ్బుతో." నా మాటలు విని అది చిత్రంగా చూసి "ఏమిటీ? నెక్లెసా? నాకా? ఇప్పుడా? గోల్డు కంట్రోల్ ఉందని తెలీదూ? బంగారం కొని పెట్టుకోవడం అంటే దేశ ద్రోహమని అర్థం. నీకా ఆలోచన వుంటే యింతటితో కట్టిపెట్టు..." అన్నది. దానితో నా నోట మాట రాలేదు.

ఒకనాడు పెన్షన్ డబ్బు బ్యాంకులో జమకడుతూ ఉండగా ఒక ఆలోచన వచ్చింది. విత్‌డ్రాల్ ఫారం తీసుకుని పూర్తిచేసి సంతకం చేసి గుమాస్తాచేతి కిచ్చాను. అతడు నన్ను బాగా ఎరిగినవాడు. ఒక్కసారిగా తలఎత్తి చూసి, "మూడువేల రూపాయలా?" అని అడిగాడు నేను గొప్పగా నవ్వుతూ, "అవునయ్యా! కావలసి వచ్చింది. ఇంట్లో కొన్ని అవసరాలు అనుకోకుండా వొచ్చిపడ్డాయి" అన్నాను. అతడు టోకెన్ యిచ్చాడు. చాలా ఏళ్ళతర్వాత మొట్టమొదటిసారిగా డబ్బు తీసుకోవడం కోసం క్యాష్ క్యాబిన్‌ముందు టోకెన్ చేతిలో ఉంచుకుని గర్వంతో నిలబడ్డాను. తర్వాత అంతడబ్బూ తీసుకుని లాల్చీ జేబులో ఉంచుకుని ఎకౌంటు బుక్‌తో యింటికి వచ్చి నిట్టూర్చి కుర్చీలో కూర్చున్నాను.

అప్పుడు మావాడు ఎక్కడికో వెళ్ళబోతున్నాడల్లేవుంది. ముందు హాల్లోకి వచ్చాడు. నా పిలుపువిని "ఏమిటి నాన్నా?" అంటూ నాదగ్గరికి వచ్చాడు. నేను నిర్లక్ష్యం నటిస్తూ, "అదుగో ! ఆ బ్యాంకు పుస్తకంలో నిలవ ఎంత వుందో చూసి చెప్పు ఒకసారి..." అన్నాను. వాడు పుస్తకం చేతిలోకి తీసుకుని "మూడువేల చిల్లరవుంది .. ఇవాళ మూడువేలు విత్‌డ్రా చేసినట్లున్నది యిక్కడ..." అన్నాడు. వాడు 'అంత డబ్బు ఎందుకు తీసుకున్నారు? ఏ అవసరం వచ్చింది ?' అని అడుగుతాడేమో అని ఎదురు చూశాను. కాని, అదేం చిత్రమో, వాడు 'ఎందుకు?' అని అడగనే లేదు. పైగా పుస్తకం అక్కడ పడేసి పోబోయాడు. నాకు ఉన్నట్టుండే చిరాకు పుట్టుకువచ్చింది. కోపంతో "అవును... మూడువేలూ తీసుకున్నాను. వూరికే బజారునపోయేవాళ్ళను పిలిచి పంచిపెడదామని అనుకుంటున్నాను" అని అరిచాను. నా కేకలు విని చిత్రంగాచూసి భార్యను కేకవేసి పిలిచి "రమా ! నాన్నగారికి ముందు కాఫీ యివ్వు...ఎందుకో చిరాగ్గా వున్నారు" అని చెప్పి వెళ్ళిపోయాడు. అంతే మర్నాడే ఆ మూడు వేలూ తీసుకుపోయి మళ్ళీ బ్యాంకులో జమకట్టి వచ్చాను. ఆ గుమాస్తా నవ్వి అదోలా చూడగా, 'ఆ డబ్బుతో అవసరం లేకపోయింది' అన్నాను. అతడు "అవునుసార్ ! ఈ డబ్బుతో ఏం పని మీకు ? మీ అబ్బాయి ప్రయోజకుడూ, మంచివాడూనూ. హాయిగా పెద్దతనంలో వాళ్ళు మిమ్మల్ని సుఖపెడుతున్నారు. మావాడూ వున్నాడు. బి.యస్సీ మూడుసార్లు తప్పి కూర్చున్నాడు. ఇక పరీక్షకు కూడా వెళ్ళనంటున్నాడు. వెధవస్నేహాలూ, తిరుగుళ్లూ...ఇంకేం బాగుపడతాడు..." అంటూ తన
పోయాడు.

అయ్యో ! ఈ వానరసేన లోపల ఏదో కొంప ముంచింది. మళ్లీ ...పరిగెత్తుకుంటూ లోపలికి వెళ్ళి శిలా ప్రతిమలా నిలబడిపోయాను. అక్కడ ఒక ప్రక్క రాజు చాలా దీక్షతో గ్రామఫోను బాగుచేస్తున్నాడు. ఏ భాగాని కాభాగం విడదీసి నేలమీద పరిచిపెట్టాడు. వాడి తమ్ముళ్ళు యిద్దరు మరోప్రక్క కూర్చుని ఖరీదైన పుస్తకాలలో బొమ్మలుచింపి

ముక్కలుచేస్తున్నారు. మా రెండో అమ్మాయి సంతానం అయిదేళ్ళ పిల్లవాడూ, ఏడేళ్ళ పిల్లదీ కలిసి సబ్బుసగం అరగదీసి నీళ్ళలో కలిపి ఏవో పుల్లలతో బుడగలు వూదుతూ గదినంతటినీ వాటితో నింపే ప్రయత్నం చేస్తున్నారు. ఇందాక ఫోటో అద్దం పగలగొట్టిన కుర్రవెధవ లోపలి నుంచి టూత్ పేస్టు ట్యూబ్ తెచ్చి అంతా పిసికి నేల అంతా ఖరాబు చేసి 'యింకేమి మిగిలివుందా?' అని చూస్తున్నాడు.

చెప్పొద్దూ, నాకు అరికాలిమంట నెత్తికెక్కింది కోపం పట్టలేక ఒక్కొక్కళ్ళనూ లేవదీసి వీధిలోకి దింపి వచ్చాను. చివరకు రాజు చెయ్యి పట్టుకుని లేవదీసి "నువ్వుకూడా పద వెధవా!" అన్నాను. వాడు నివ్వెరపోయి చూస్తూ, 'ఎక్కడికి తాతయ్యా?" అని అడుగుతూనే వున్నాడు. నే నదేమీ వినిపించుకోకుండా వాణ్ణి చేతులలో పనిముట్లతో సహా బర బరా యీడ్చుకుపోతూ "పెద్దవాడివై వుండి వాళ్ళు అంత రచ్చచేస్తూవుంటే చూస్తూకూర్చున్నందుకు యిదేశిక్ష నీకు...." అంటూ వీధిలోకి తీసుకుపోయాను. ఆ తర్వాత వీధి తలుపు గడియ వేసి పెద్దగా "పోండి వెధవల్లారా! ఎక్కడైనా ఊరేగండి..." అని అరిచాను. ఒంటి మీద చొక్కా అయినా లేకుండా కేవలం లాగూలతో ఏడుపు ముఖాలతో నిలబడ్డ యిద్దరు కుర్రి వెధవలను చూసినా నాకు జాలి కలగలేదు. ముందు హాల్లో కుర్చీలో కూర్చున్న నాకు రాజు వాళ్ళందర్నీ సముదాయించి వెంట నడిపించుకు పోవడం కనిపించింది. కాని ఆ కాస్సేపూ నా మనసు రాయిచేసుకున్నాను. అలాగే కొంచెంసేపు కళ్ళు మూసుకుని పడుకున్నాను. లోపల ఏమీ సవ్వడిలేదు. ఒక ఒంటరి పిచ్చుక ఏమిటో గొణుగుతున్నది. ప్రక్కయింట్లో రేడియోలో ఏదో పాట వినిపిస్తున్నది.

దాదాపు పది నిముషాల తర్వాత మనసులో ప్రారంభమైన ఆరాటం క్రమంగా అధికం అయింది. ఒంటిమీద చొక్కా కూడా లేని ఆ యిద్దరు కుర్ర కుంకలూ ఆ చిన్న పిల్లా, దాని మెడలో గొలుసూ గుర్తుకు రాగానే ఒక విధమైన భయం కలిగింది. వారు సెలవులకు ఆట విడుపుగా ప్రతి సంవత్సరం యీ వూరికి రావడం, యిక్కడే సెలవులన్నీ గడిపి తిరిగి స్కూళ్లు తెరచేవేళకు వెళ్ళడం చాలా యేళ్లుగా

తిరుగుతున్నది. నా చిరాకుకొద్దీ అలా చేశానేగాని, పసివాళ్ళు కోపం తెచ్చుకుని తమ తల్లిదండ్రులతో జరిగింది జరిగినట్టు చెప్పి వేసిన పక్షంలో యింకేమయినా వుందా? అల్లుళ్ళకూ, కూతుళ్ళకూ కోపం ముంచుకురావచ్చు. అప్పుడు వారు "మేము పిల్లలకు సెలవులుకదా అని స్థలం మార్పుకోసం....అదీ ముసలామె ప్రాధేయపడితే పంపించాముగాని మాకు బరువైకాదు. ఇక్కడ వారికి తిండికి బట్టకూ లేకనూ కాదు. ఇలా చేశారు కాబట్టి ఇక ఎప్పుడూ పిల్లలను పంపించము...మేమూ రామూ..." అని మంకు పట్టు పట్టవచ్చు. అబ్బో! ఆలోచించే కొద్దీ యీ వ్యవహారం ముదిరి చాలా దూరం పోయేట్టుంది.

నేను వెంటనే లేచి యింటి తలుపులకు తాళంవేసి చెప్పులు తొడుక్కుని వరండా మెట్లు దిగి ఆవరణ గేటు తలుపులు తీసుకుని రోడ్డుమీదికి వచ్చాను. బయట ఎండ మహా తీవ్రంగా వుంది. సూర్యుడు క్రూరుడైన నియంతవలె సమస్త లోకాన్నీ తన కోటి కోటి కిరణాలతో వేధిస్తున్నాడు. వెచ్చనిగాలి వేగంగా వీస్తున్నది. పిల్లల జాడ కనుచూపు మేరలో కనిపించలేదు. ఈ వెధవలెటుపోయారో ఏమో! నాలో ఆదుర్దా ఎక్కువయింది. ఈ రాజు గొప్ప ఆరిందాలాగా వాళ్ళను ఎటు తోలుకు పోయాడో ఏమో! వాడొక పొగరుబోతు—

వాళ్లు సాధారణంగా అప్పుడప్పుడు ప్రక్కయిళ్ళ పిల్లలతో కలిసి ఆడుకుంటూ వుండటం నాకు తెలుసు. కాని యింత ఎండవేళ ఆ యిళ్ళ తలుపులన్నీ మూసి బలవంతంగా పిల్లలను బంధించివేసి పడుకోబెట్టి వుంటారు తల్లులు. ఆ యిళ్ళలో ఎక్కడా పిల్లలు ఆవరణలలో తిరుగుతున్న అలికిడి లేదు. వీధి చివరిదాకా వెళ్ళి నేను మళ్ళీ వెనుదిరిగి వచ్చాను. మనసులో ఆందోళన మరింత ఎక్కువైపోయింది. గుండెలు దడదడ లాడాయి.

కాని ప్రహరీ తలుపు తీసుకుని లోపల ప్రవేశించి చూద్దునుగదా! వాళ్ళు వరసగా సైజుల వారీగా ప్రహరీ గోడ నీడలో కూలబడివున్నారు. ఫోటో అద్దం పగలగొట్టిన చిన్నవాడు— వీడి పేరు ఎప్పుడూ గుర్తు వుండదు నాకు— నోట్లో వ్రేలు వేసుకుని చీకుతూ కూర్చుని వున్నాడు.

ఆ ప్రక్కన మరొకడు-వొంటిన చొక్కా లేనివాడు—నా వంక కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తున్నాడు. వాడి పక్కనేవున్న చిన్నపిల్ల నన్ను చూడనట్టు నటిస్తున్నది. మరొకడు చేతిలో బొమ్మతోనే బైటికి వచ్చాడు కాబోలు బొమ్మను అటూ యిటూ తిప్పి చూస్తున్నాడు. రాజు మాత్రం ధైర్యంగా "ఎక్కడికి వెళ్లావు తాతయ్యా?" అని అడిగాడు.

నేను కొంచెం కోపంగా "మీ కోసమే. ఎండలో ఎక్కడికి వెళ్ళారో అని భయపడ్డాను. అయినా మీరు లోపలికెలా వచ్చారు?" అని అడిగాను. రాజు నవ్వుతూ "నువ్వు తలుపు దగ్గరికిలాగి వెళ్ళావు. మే మీ గోడ పక్కనే అవతల వైపు దాక్కుని వున్నామింతసేపూ..." అన్నాడు.

నా మనసు తేలిక పడింది. టూత్ పేస్టు పిసికి పాడుచేసినవాడి వంక చూస్తూ చేతులు చాపాను. వాడు మొహం చింకి చేటంత చేసుకుని ఒక్క ఉదుటున వొచ్చి నా చేతులలో వాలాడు. దానితో అందరిలో హుషారు బయలుదేరింది. బిలబిలలాడుతూ నా వెనకనే వరండాలోకి వచ్చారు. నేను తాళంతీసి అందర్నీ లోపలికి పంపించాను. రాజు వెళ్ళి వెళ్ళడంతోనే గ్రామఫోను విడిభాగాలముందు కూర్చుని పని ప్రారంభించాడు, "దీన్ని మరో అరగంటలో 'ఫిట్' చెయ్యాలి" అంటూ.

నేను వెళ్ళి మామూలుగా కుర్చీలో కూలబడి పత్రిక చేతిలోకి తీసుకున్నాను. తర్వాత చాలాసేపు అలా చదువుతూ కూర్చుండి పోయాను. లోపల ఆ వానరమూక ఎంత అల్లరి చేస్తున్నప్పటికీ పట్టించు కోనేలేదు.

అంతలో ఎండ తగ్గింది. చల్లనిగాలి మళ్ళింది. లోపల రాజు గ్రామఫోను మళ్ళీ బిగించినట్టున్నాడు. 'అన్‌మిలో' ప్రీతమ్ అని పాట వినిపిస్తున్నది. "ఈ కుర్ర వెధవకు యింత పనివాడితనం వుండటం గొప్ప విశేషమే..." అనిపించింది. అవునుమరి... వూరికే తిని బలాదూరు తిరిగి చెడిపోకుండా ఏదో వ్యాపకం... పిల్లల విషయంలో అది మంచిదే.

తలుపు తీసిన చప్పుడు విని తల ఎత్తిచూశాను. మా మూడో అమ్మాయి, కాలేజీలో పరీక్షల డ్యూటీ అయింది కాబోలు, వచ్చేసింది.

"ఏం నాన్నా ! ఇవాళ ఉత్తరా లేమన్నా వచ్చాయా ?" అని అడిగింది కోళ్ళు చప్పుడు చేసుకుంటూ లోపలికి నడిచి వెడుతూ.

నాకు వొళ్ళుమండింది. కోపంతో తల అడ్డంగా వూపాను. నాకు తెలుసు. వీళ్ళు నన్ను కేవలం యింటికావలి కుక్కలాగా చూస్తున్నారు. మా అమ్మాయి లోపల ఆశ్చర్యంతో "హారి పిడుగుల్లారా! యిల్లంతా ఒకొరిక్కి తెచ్చినట్టున్నారే...." అంటున్నది. తర్వాత కొద్ది క్షణాల్లో మళ్ళీ హాల్లోకి వచ్చి కూర్చుని "అమ్మ దగ్గరినుంచీ ఉత్తరంలేదు. ఎప్పు డొస్తుందో ఏమో!" అన్నది పెద్దగా.

నేను కోపంతో "ఆమెగారిప్పట్లో ఎలావొస్తుంది? అక్కడివాళ్లే ఆమెకు ముఖ్యం... ..." అన్నాను. మా అమ్మాయి ఎందుకో నవ్వింది. ఒక్క క్షణం ఆగి మళ్ళీ "ఈ కోతులు ఇల్లంతా ఎలా అడవిలా తయారు చేశారో చూశావా ?" అన్నది.

నేను వెంటనే చిన్న అబద్ధం ఆడేశాను. "నాకేం తెలుసు ? పొద్దుననగా ఒక స్నేహితుడి యింటికి వెళ్ళి నేనూ యిప్పుడే వొస్తున్నాను. ఇంతసేపూ చదరంగంతోనే సరిపోయింది... వాళ్ళు యిప్పటిదాకా కదల నీయందే..."

కాని లోపలినుంచి పరుగెత్తుకువచ్చిన ఏడేళ్ళ కుర్ర వెధవ నా పరువు తీశాడు. "కాదు పిన్నీ ! తాతయ్య అబద్ధం చెబుతున్నాడు. ఆయన పొద్దుణ్ణించీ ఎక్కడికీ కదల్లేదు." అని చెప్పేశాడు.

నేను ముఖం కందగడ్డలా చేసుకుని కూర్చున్నాను. మా అమ్మాయి ఆ విషయం వొదిలేసి నవ్వి లేచి నిలబడి, "ఇక యిల్లంతా బాగుచేసుకో వద్దూ... పొద్దు గూకుతున్నది" అంటూ లోపలికి వెళ్ళిపోయింది. నేను గభాలున వెళ్ళి నా పరువు తీసిన ఆ కుర్రగాడిచ చెవులు రెండూ పట్టుకుని పిండేశాను. వాడు కొంప మునిగినట్టు ఏడవటం సాగించాడు.

మరికొద్ది సేపట్లోనే స్కూటర్ యింటిముందు ఆగింది. ముందు కోడలు దిగివచ్చి నన్ను నవ్వుతూ పలకరించి లోపలికి వెళ్ళింది. తర్వాత మా వాడు తాళం చెవుల గుత్తి గిరగిరా తిప్పుకుంటూ లోపలికి వచ్చాడు.

వాడికేం ? రాజా, ఇప్పుడు హాయిగా స్నానం చేస్తాడు. చక్కగా చలువ బట్టలు కట్టుకుని స్కూటర్ మీద క్లబ్బుకుపోతాడు. అక్కడ ఏవేవో పేపర్లూ పుస్తకాలు చూసి ఏడున్నర ఎనిమిది గంటలకల్లా మళ్ళీ తిరిగి వచ్చేస్తాడు. అప్పుడు భోంచేసి హాయిగా నిద్రపోతాడు. మా అమ్మాయి తన గదిలో ఏదో చదువుకుంటూ పదిగంటల వరకూ మేలుకునే వుంటుంది. తర్వాత దాని గదిలోనూ లైటు వుండదు. ఇక నా ఒక్కడికే నిద్రపట్టదు. ఒకవేళ నిద్రపట్టినా అంతలోనే మెలకువ వచ్చేస్తుంది.

లోపల పిలమూక అంతా మామయ్య చుట్టూ చేరి

మావాడు కొంచెం ఆశ్చర్యపోయి 'అదేమిటినాన్నా, అంత కోపమెందుకు ?' అన్నాడు.

నేనింకా రెచ్చిపోయాను. "అవున్రా... నేను రిటైరయిన ముసలాణ్ణి.

ఎవరికీ పనికిరానివాణ్ణి. అందరూ ప్రయోజకులు కదూ. ఇక నా జోలీ గొంతీ ప్రమేయమూ ఎవరిక్కావాలి... ఇంటికి కావలికాచే కుక్కలాగా వొదిలిపెట్టి పోతారు. నేను యింటికి కావలికాస్తూ పడుండాలి...." అని అరిచాను.

మావాడు ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. అసలు వాడి చిన్నతనంలో నేను వాడికి నేర్పిన మొదటిపాఠం యిదే "కోపంగా ఉన్న వారితో మాట్లాడకు. వెంటనే తప్పుకో...వారి కోపం చల్లారిన తర్వాతనే నువ్వు మాట్లాడు..." అని. వాడు దాన్ని బాగా అలవాటు చేసుకున్నాడు.

వాడా విధంగా నా ముందు నుంచీ వెళ్ళిపోవడంతో నాకు గొప్ప చిరాకూ, బాధా కలిగాయి. చేతిలో వున్న పేపరు క్రింద విసిరికొట్టి "ఇక యీ యింట్లో అన్నం కూడా ముట్టను నేను...ఇంత అవమానం జరిగాక నాకేనా అభిమానం లేనిది..." అంటూ వెళ్లి ప్రక్క గదిలో కూర్చున్నాను. నా వెనకనే ఎవరో ఒకరు, లేక ఇంటిల్లపాదీ వచ్చి బతిమిలాడి తీసుకుపోతారనే భరోసాతో అడుగుల చప్పుడు కోసం చెవులు రిక్కించుకుని వింటూ వాలుకుర్చీలో కళ్ళు మూసుకుని కూర్చున్నాను.

కాని నాకు ఆశాభంగమైంది. ఎంతసేపటికీ ఆ అడుగుల చప్పుడు వినబడలేదు సరిగదా, వాకిట్లో స్కూటరు కదిలి వెళ్ళిపోయిన చప్పుడూ, లోపల పనులు చేసుకుంటూ వొదినా మరదళ్ళు మాట్లాడుకుంటున్న మాటలూ, రాజు వరసగా పెడుతున్న గ్రామఫోను రికార్డులూ వినబడుతున్నాయి. పిల్లలందరిచేతా వరసగా స్నానాలు చేయించి సముదాయిస్తున్నది మా కోడలు. వుండివుండి ఆమె మెత్తని కంఠస్వరం వినిపిస్తున్నది.

అంతలోనే నాకు నిద్రపట్టింది.

నాకు మెలకువ వచ్చేసరికి గదిలో వెలుతురేలేదు. చీకట్లో వొంటరిగా కూర్చుండిపోవలసి వచ్చినందుకు దుఃఖం పొంగివచ్చింది. నా భార్యేవుంటే ఇలా నిరాదరణపొందే దుర్గతి పట్టేది కాదుగదా అనిపించింది.

కాని లోపలి గదిలో నాకు తెలియని వ్యవహారం ఏదో జరుగుతున్నది. వినీవినగానే, హాయినిచ్చే ఆ కంఠ స్వరం ఉండి ఉండి వినిపిస్తున్నది. నా శరీరం హఠాత్తుగా పులకరించినట్లయింది. నెమ్మదిగా లేచి కిటికీలో నుంచి చూశాను.

హాల్లో పెద్దసభ జరుగుతున్నది. అందరి మధ్యా నా కూర్చుని వున్నది. పిల్లకుంక లందరూ బెల్లం మీదికి యీగలుముసిరినట్టు ఆమె మీదికి ఎగబడుతున్నారు. ఆమె అందరినీ పేరు పేరునా పలకరిస్తూ 'మాబాబే' అనీ, 'మా అమ్మే' అనీ సంబరపడిపోతున్నది. మావాడూ' కోడలూ, మా అమ్మాయి, రాజూ అందరూ పెద్దగా మాట్లాడుతున్నారు.

నేను మళ్ళీ వెళ్లి ఆ చీకటిగదిలోనే ఆ కుర్చీలో అలాగే కూలబడి కళ్ళు మూసుకున్నాను. మనసు తేలికపడినట్టు అనిపించిందేగాని పట్టుదల, రోషం మాత్రం తగ్గలేదు. అందుకే రాజు వచ్చి "తాతయ్యా! అన్నానికి రమ్మంటున్నారు..." అని పిలిస్తే "నేను రానని చెప్పు ఫో..." అని కసిరి కొట్టి పంపించేశాను. ఆ తర్వాత మరొక క్షుద్రవెధవ వచ్చి "అబ్బో! అంతా చీకటి... ...తాతయ్యా! అంతిందాం రా" అన్నాడు గుమ్మంలోనే నిలబడి. "ఫోరా గాడిదా. మీరందరూ తినండి... నాకేమీ అక్కర్లేదు..." అన్నాను. వాడు వెళ్ళిపోయాడు. ఆ తర్వాత మా కోడలు వచ్చి "ఇలా చీకట్లో కూర్చున్నారేం మామయ్యా?" అంటూ లైటువేసి 'రండి భోంచేద్దురుగాని" అని పిలిచింది. "నేను రాను.. నాకక్కర్లేదు...కడుపు నిండుగా వుంది" అన్నాను. ఆమె ఒక్కక్షణం అలాగే నిలబడి తర్వాత వెళ్లిపోయింది.

కొద్ది క్షణాల తర్వాత కొత్తచీరె సవ్వడీ... మల్లెల వాసనా నన్ను ఒక్కసారిగా ఉక్కిరిబిక్కిరి చేశాయి. చల్లని గాలితెర వీచినట్టయింది. మరుక్షణంలో నా నుదుట చల్లని గాజుల చేయిపడింది. ఒక్కసారిగా నిలువెల్లా పులకరించిపోయాను. కళ్ళు తెరిచి చూశాను.

నెలల తరబడి చాకిరీ వల్లనూ ప్రయాణపు బడలిక వల్లనూ, కొంచెం నీరసంగా కనిపిస్తున్నదామె. ముఖంలో అమృతప్రాయమైన చిరునవ్వు మాత్రం చెక్కుచెదరకుండా అలాగే వుంది. ఒకచేతో నుదుట

పడుతున్న వెంట్రుకలను పైకి తోసుకుంటూ "లేవండి బాబూ భోజనాలు కానిచ్చేద్దాం..." అన్నది.

నేను 'నాకేమీ అక్కర్లేదు..." అందామనుకున్నాను. కాని ఆమె నాకు మరికాస్త దగ్గరగా వచ్చి నా భుజం పట్టుకుని లేపడీసి "రండి... మీరు రాకపోతే కోడలుకూడా అన్నం మానేస్తుందట. పరాయి అమ్మ కన్నబిడ్డ... దాన్ని బాధ పెట్టడం ఎందుకు?" అన్నది.

నాకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆమెచేయి పట్టుకుని నడుస్తూ "నువ్వు వొస్తున్నట్టు నాకు రాయక పోయావా? స్టేషనుదగ్గరికి వొచ్చేవాణ్ణిగా" అన్నాను.

ఆమె నవ్వుతూ "నాకేం తెలుసు? అల్లుడు టెలిగ్రాం యిచ్చాడని చెబితే యింటికే యిచ్చాడనుకున్నాను. ఆయన కాస్తా బావమరిదికి టెలిగ్రాం యిచ్చి వచ్చాడని నాకేం తెలుసు..." అన్నది.

నేను కాళ్లు కడుక్కుని వంటయింట్లోకి అడుగుపెట్టగానే అంతా నిశ్శబ్దంగావుంది. పిల్లలందరూ అప్పుడే అన్నాలు తిని హాల్లోకి వెళ్లి పోయినట్టున్నారు. మావాడు ఒకవైపున గోడ కానుకుని కూర్చుని వున్నాడు. మా అమ్మాయీ, కోడలూ, చెరోవైపూ కూర్చునివున్నారు.

నేను వెళ్ళి వెళ్ళగానే కంచంముందు కూర్చుని మా కోడలి వంక తిరిగి "నువ్వు అన్నం మానేయడమెందుకూ పిచ్చిపిల్లా? మంచిదానవే... అందరూ కానివ్వండింక" అన్నాను.

తర్వాత మావాడి వంక తిరిగి "ఎవరో స్నేహితుడొస్తున్నాడని అబద్ధంచెప్పి వెళ్ళకపోతే నాకు నిజం చెప్పక పోయావురా?" అన్నాను. వాడు నవ్వి వూరుకున్నాడేగాని ఏమీ మాట్లాడలేదు.

నేను భోజనం ముగించి కబుర్లు ముగించి హాల్లోకి వచ్చేసరికి సరిగ్గా తొమ్మిది కొట్టింది. పిల్లలందరూ అప్పటికే పరుపుమీద పడుకుని నిద్రపోతున్నారు. వాళ్ళదగ్గర కొద్ది క్షణాలు కూర్చున్నాను. పిచ్చివెధవలు, పొద్దుటినుంచీ ఎంత అల్లరిచేశారు!

మా కోడలు వచ్చి "మామయ్యా! ఇటు వరండాలో మీకు మామూలుగా వేసే చోటనే పక్కవేశాను వెళ్ళి పడుకోండి" అన్నది.

నేను మా ఆవిడ వైపు చూశాను. ఆమె ఎవరూ చూడకుండా "వస్తాను... వెళ్ళను"ని నా వంక తిరిగి సైగ చేసింది. నేను హాయిగా గాలిలో తేలిపోతున్నట్లు అడుగులువేస్తూ వరండాలోకి వెళ్ళాను. నా మంచం పక్కనే చాప ఒకటి వేరే పరిచివుంది.

నేను పక్కమీద వాలిపోయాను. చల్లని సముద్రపు గాలి తెరలు తెరలుగా వీస్తున్నది. నక్షత్రాలు నల్లని ఆకాశంలో మినుకు మినుకుమని వజ్రపుముక్కల వలె మెరుస్తున్నాయి. రాత్రి వేళల విహరించే ఏదో పేరు తెలియని పక్షి రివ్వున ఎగిరిపోతూ 'క్రీక్' మని అరుస్తున్నది.

నా ప్రక్కనే అడుగుల సవ్వడి... ఆ క్రొత్త చీర జరజర, ఆ సిగలోని మల్లెల సుగంధం... ఆ చల్లని ఆప్యాయత కురిపించే చూపులు... ఎండవేళ విశ్రాంతినిచ్చి సేదదీర్చే చల్లని గన్నేరు నీడవంటి మంచి మనసు... నిద్రా దేవత కమ్మగా నవ్వుతూ మమ్మలను తన వొడిలోకి తీసుకున్నది. ఆ అమృత పరిష్వంగంలో అలాగే కమ్మగా నిద్రపట్టింది.

(భారతి, 1966 ఆగస్టు)

# మబ్బు విడిచిన ఎండ

ధనంజయరావుపంతులు కప్పుకునివున్న దుప్పటి తొలగించి, ప్రక్కనే బల్లమీద అందుబాటులోవున్న కళ్ళజోడు తీసి తగిలించుకుని కిటికీలోనుంచి బయటికి చూశాడు. నిద్రమత్తు యింకా వదలని ఆయన కళ్ళకు బయట సన్నగా జల్లుపడుతూ వుండటం కనిపించగానే అకారణంగా ఒక విధమైన ఉత్సాహం కలిగింది. ఆయనకు చిన్నతనం నుంచీ పక్కమీద మత్తుగా పడుకుని దుప్పటి కప్పుకునివుండి బయట జోరుగా కురుస్తున్న వర్షం వంక చూస్తూ గంటలకొద్దీ కాలం గడిపి వేయడమంటే ఎంతో యిష్టం. ఉద్యోగంలో ఉన్నన్నాళ్ళూ ఆదివారాలూ, శలవు రోజులలో తప్ప అటువంటి అవకాశం లభించేదికాదు. వర్షం పనికట్టుకుని శలవులలో, ఆదివారాలలో మాత్రమే కురవదుకదా! ఉద్యోగంలో ఉండగా గడిచిన ఎన్నో సంవత్సరాలుగా వర్షఋతువులలో ఆయన ప్రతిశనివారమూ రాత్రిపూటపడుకోబోతూ "తెల్లవారితే ఆదివారం. ఉదయం లేచీ లేవగానే వర్షం కురుస్తూ ఉండాలి" అనుకునేవాడు. కాని చాలా పర్యాయాలు ఆయన ఆశ ఫలించలేదనే చెప్పాలి. కళ్ళు తెరిచి కిటికీలోనుంచి చూసి హతాశుడయ్యేవాడు. కిటికీలోనుంచి దాదాపు ప్రతి సారీ నిర్మేఘమైన ఆకాశమూ, ప్రశాంతంగావున్న ప్రకృతీ కనబడి ఆయనకు నిరుత్సాహం కలిగిస్తూవుండేది.

ఇవాళ చాలా మంచి రోజులావుంది. కిటికీలోనుంచి కనిపిస్తున్న ఆకాశభాగం గచ్చకాయ రంగుతో వున్న జలార్ద్రమైన మేఘాలతో నిండి వుంది. నీటితో నిండిన ప్లాస్టిక్ సంచీలావున్న ఆకాశం ఉండి ఉండి ఉరుముతున్నది. కిటికీలోనుంచి చతురస్రంగా విభజించినట్టు కనిపిస్తున్న మేఘావృతమైన ఆకాశమూ, దానిమధ్యలో ఏపుగా పెరిగిన పున్నాగచెట్టూ, ప్రహరీగోడమీద వాలివుండి వానలో తడిసి మాటిమాటికీ

రెక్కలూ తలా విదిలించుకుంటున్న గోరువంకా, అన్నీ కలిసి ధనంజయ రావుపంతులుకు హుషారు కలిగించాయి.

ఉత్సాహమనే ఔషధాన్ని సిరంజిలో పోసి నరం లోపలికి నేరుగా రక్తంలోకి చేరేట్టు ఇంజక్షన్ యిచ్చినట్టయింది. ఆయన తన వయస్సు మాట మరిచిపోయి యీలవేస్తూ నిర్నిమేషంగా ఆకాశంవంక చూస్తూ పడుకున్నాడు. అప్పుడే తనకు ఈ అరవై అయిదేళ్ళ జీవితంలోనూ బాగా ఆనందం కలిగించిన విషయాలు కొన్ని గుర్తు వచ్చాయి ఆయనకు. అందులో మొదటిది ఆయన ఇల్లాలిని గురించినది. ఆమె ఇప్పుడు లేదు. ఆ ఇంట్లో కొత్తగా ప్రవేశించిన ప్రతి వ్యక్తి దృష్టినీ ముందుగా ఆకర్షించేది ముందు హాలులో గోడకు తగిలించబడివున్న నిలువెత్తు పంచ రంగుల ఫోటో. లోపలికి అడుగుపెట్టగానే ప్రతివారి చూపులూ ఆబొమ్మ కళ్ళచేతనే ఆకర్షించబడుతూ వుంటాయి. కలతలేక కుదురుగా వున్న నీళ్ళమీద ఉండి ఉండి తేలియాడే పెద్ద పెద్ద వెండిరంగు చేపలవంటి ఆ కళ్ళనుంచి దృష్టి మళ్ళించడం కష్టమే. అలా చేయగలిగితే తర్వాత అలంకృతమైన శంఖం వంటి కంఠమూ, జరీ అంచు చీరె, పండు తమలపాకులవంటి పాదాలూ కనిపిస్తాయి. అన్నిటికన్నా క్రింద ధనంజయరావు స్వహస్తూరీతో వ్రాసిన "సుభద్ర" అనే అక్షరాలున్నాయి. ఆమె చాలా యేళ్ళక్రిందట ఒక ఆదివారం ఉదయం బాగా వర్షం కురుస్తున్న సమయంలోనే కళ్ళు మూసింది.

ధనంజయరావుకు తలుచుకున్నప్పుడల్లా నిరంతరం సంతోషం కలిగించే మరొక విషయం లెక్కలు. ఆయన తన బి. ఏ. పట్టా లెక్కలలోనే సంపాయించాడు. ఆ శాస్త్రం అంటే ఆయనకు విపరీతమైన అభిమానం. సెలవు దొరికితే చాలు లెక్కల పుస్తకాలు ముందు పోగు పెట్టుకుని కూర్చుని ప్రాబ్లమ్ తర్వాత ప్రాబ్లమ్ సాధించుకుంటూ పోయేవాడు. అలా వందలకొద్దీ లెక్కలు, రకరకాల లెక్కలు సాధించిన తర్వాత ఆ పుస్తకాన్ని ఒకవైపుకు విసిరివేసేవాడు. రిటైరయిన యీ అయిదేళ్ళుగా ఆయన అల్మారాలో పాతబడివున్న ఆ పుస్త కాలన్నింటినీ యివతలికి తీసి చేసిన లెక్కలే మళ్ళీ చేస్తూ ఎంతకాలం గడిపాడో అంచనా వెయ్యడం కూడా కష్టమే.

ఆయనకు ఆనందం కలిగించే మరొక విషయం విశ్వనాథాన్ని ఆటలు పట్టించడం. విశ్వనాథం ఆయన చిన్ననాటి స్నేహితుడు. ఆయనకు లెక్కలంటే హడలే. ఇద్దరూ హైస్కూలులోనూ, కాలేజీలోనూ కలిసే చదువుకున్నారు. విశ్వనాథం ప్రతి క్లాసులోనూ సంవత్సరాల తరబడి కూర్చోకుండా పైకి సాగలిగాడూ అంటే అది అంతా ధనంజయరావు చలువవల్లనే అని చెప్పక తప్పదు. స్కూల్ ఫైనల్ పరీక్షలో కూడా విశ్వనాథం లెక్కలనబడే తన పాలిటి భూతంవల్ల భయంతో హాలి పోయిన సంపర్భంలో ధనంజయరావు రాత్రి అంతా మేలుకుని ఆయనకు ముఖ్యమైన లెక్కలూ సిద్ధాంతాలూ ఓపికగా బోధించాడు. అయితే మాత్రం? పరీక్షహాలులో పేపరు అందుకోగానే తన వెనకనే కూర్చున్న విశ్వనాథం మొఖం ఆఖరు గంటలో అతని ఆన్సరు పేపరులా తెల్లగా పాలిపోయివుండటం గమనించి వాచర్ల కంటపడకుండా అతి జాగ్రత్తగా తన లెక్కలు చూపించి వాటిని కాపీ చేసుకునే వీలుకల్పించి ఉద్ధరించిన వాడు ధనంజయరావుపంతులే. విశ్వనాథం. స్కూల్ ఫైనల్ తర్వాత హాయిగా నిట్టూర్చి ఇంటరులో తెలుగుహ చరిత్రలు గ్రూపుగా తీసుకుని కాలేజీలో చేరాడు. ఆ తర్వాతి జీవితంలోనూ విశ్వనాథం అట్టే పైకి రాలేకపోయాడు. రిటైరయేనాటికి ధనంజయరావు అయిదువందల రూపాయల జీతం తీసుకుంటూ ఉండేవాడు. విశ్వనాథం మరొక ఆరు నెలల తర్వాత ఎక్కడో గుమాస్తాగా రెండువందల చిల్లర రూపాయల వేతనంతో రిటైరయినాడు. ఆయన ఆ వీధిచివరలోనే ఒక పెంకుటింటిలో అద్దెకుంటున్నాడిప్పుడు. చేతికర్ర వూతగా ఆయన ప్రతిరోజూ విధిగా యిక్కడికి వస్తూనేవుంటాడు. ఇప్పటికీ ధనంజయరావు విశ్వనాథాన్ని అప్పుడప్పుడు లెక్కల విషయంలో ఎగతాళిచేస్తూనే వుంటాడు. అటువంటి సందర్భాలలో విశ్వనాథం కళ్ళజోడు సర్దుకుని "పోన్లేవోయ్! అంతమాత్రంలో నేను జీవితంలో తల్లక్రిందులైపోయిందేమీ లేదు. నువ్వు లెక్కల పుస్తకాలన్నీ మింగి జీర్ణించుకున్నంత మాత్రంలో నాకన్నా సుఖపడుతున్నదీ లేదు" అంటూ ఉంటాడు. దానితో యిద్దరూ నిర్మలంగా నవ్వుకుంటూ వుంటారు.

ధనంజయరావు కళ్ళజోడు తీసి ఒక్కసారి కళ్ళు నులుముకుని

బయటికి చూశాడు. ఆ గోరువంక అంతసేపటి నుంచీ అక్కడ ప్రహరీ గోడమీద సోమరిగా నిలబడివుండి వర్షంలో తడుస్తూ రెక్కలల్లార్చుకుంటున్నదల్లా ఎటో ఎగిరి చక్కాపోయింది. పక్కయింటివారి రేడియో పెద్దగా వాగుతున్నది.

అంతలో గది తలుపు తెరచుకుని లోపలికి తొంగిచూసింది వసంత. ఆ పిల్లకు పదమూడేళ్ళుంటాయి. సన్నగా, పచ్చగా నాజూగ్గా ఉంటుంది చేతిలో పుస్తకంతో లోపలికివస్తూ ఆమె, "లేచావా తాతయ్యా! ఇందాక ఒకసారి వచ్చి చూస్తే నిద్రపోతున్నావు నువ్వు" అంటూ పక్కమీద కూర్చున్నది.

ధనంజయరావుపంతులు నవ్వి, "ఏమిటి సంగతి?" అని అడిగాడు.

వసంత, "నువ్వు లేవలేదు కదా అని మళ్లీ వెళ్ళి ఇప్పటిదాకా లెక్కలుచేసుకుంటూ కూర్చున్నాను. ఇవిగో, అయిదు లెక్కలుచేశాను." అన్నది.

ధనంజయరావుకు అంత వయస్సు ఉన్నా ఆ పిల్ల లౌక్యం బొత్తిగా అర్థం కాదు. తాతగారికి ఏ మాట చెబితే ఆయన మెత్తబడి తానే వరం అడిగినా కాదనని స్థితిలోకి వస్తాడో ఆ పిల్లకు బాగా తెలుసు. అందుకే క్లాసుపిల్లలతో ఎక్స్‌కర్షన్‌కు వెళ్ళవలసి వచ్చినా, సాయంకాలం స్నేహితురాళ్ళతో సినిమాకు వెళ్ళవలసివచ్చినా, లేక ఏ యితర పర్మిషన్ కావలసివచ్చినా చేతిలో లెక్కల పుస్తకంతో ఆమె నెమ్మదిగా తాతగారి దగ్గరికి చేరుకుంటుంది. బస్! దానితో ఆమె తల్లీ, అత్తగారూ, తండ్రీ, యితర ప్రపంచమూ, మూర్తిత్రయమూ ఏకమైవచ్చి అడ్డునిలిచినా ఆమె కోరిక సిద్ధించకుండా ఎవ్వరూ ఆపలేరు. ఇవాళ ఆ అమ్మాయి తన స్నేహితురాళ్ళతో కొత్తగా విడుదల అయిన సినిమాకు వెళ్ళవలసివుంది మరి...

ధనంజయరావుపంతులు పుస్తకంలోకి చూసి పెద్దగా నవ్వడం ప్రారంభించాడు. కొంతసేపటికి నవ్వు ఆపుకోలేక దుప్పటి అవతలికి విసిరి పారేసి లేచి పొట్టపట్టుకుని మరీ నవ్వాడు. కళ్ళవెంట నీళ్లు తిరిగేట్టు

విపరీతంగా నవ్వి నవ్వి చివరకు ఆమెను దగ్గరికి తీసుకుని "భలేదానివే నువ్వు. ఈ లెక్క చూడు. ఏమిటిది?" అన్నాడు మళ్ళీ నవ్వుతూ.

వసంత తెల్లబోయి, తర్వాత తేరుకుని "ఏమిటి తాతయ్యా! అది ఆన్సరు... $6\frac{1}{4}$ ... దాన్లో నవ్వేందుకేముందీ ? అన్నది.

ఆయన కళ్ళజోడు తీసి తుడుచుకుని 'అవునే అమ్మడూ ! ఆ $6\frac{1}{4}$ అనేది ఆన్సరే ... నేను కాదనటంలేదు. కాని, ఏమిటవి ? రాళ్లా రప్పలా ? లెక్క ఏమో మనుష్యులను గురించి. వాడు లెక్కలో 'ఫలానా పని చేయుటకు ఎంతమంది కూలీలు కావలెను ?' అని అడుగుతున్నాడు. నీకేమో $6\frac{1}{4}$ అని ఆన్సరు వచ్చింది" అంటూ మళ్ళీ నవ్వుతూ "ఆరుగురు కూలీలంటే నేను అర్థం చేసుకోగలను. నాకు అర్థంకానిదల్లా ఆ 1/4 కూలీ అంటే ఏమిటీ ? అని..." అన్నాడు.

వసంత సిగ్గుపడి చప్పున పుస్తకం అందుకుని అవతలికి పారిపోయింది. ధనంజయరావు మళ్లీ నవ్వుకుంటూ 'పిచ్చిపిల్ల' అనుకున్నాడు. తర్వాత మరికొద్ది నిముషాలసేపు ఆయన మళ్లీ కిటికీలో నుంచి చూస్తూ అలాగే పడుకున్నాడు.

మబ్బులు ఇంకా కమ్ముకుని వస్తూనే వున్నాయి. ఆకాశం వుండి వుండి ఉరుముతూనే వుంది. నల్లని మేఘాలను చీల్చుకుని నిలువుగా గీత గీచినట్లు మెరుపు మెరిసింది.

అంతలో రాజశేఖరం చేతిలో సంచీతో ఆ గదిలోకి వచ్చి తండ్రి ఇంకా లేవకుండా అలాగే పడుకుని వుండడంచూసి సందేహిస్తూనే దగ్గరికి వెళ్ళి నిలబడ్డాడు.

ఆయన కళ్ళు తెరిచి చూసి "ఏంరా రాజా !" అంటూ పలకరించాడు. రాజశేఖరం తలవంచుకుని నెమ్మదిగా "నేను బజారుకు వెడుతున్నాను నాన్నా ! వీలయితే ఆస్పత్రికికూడా వెళ్లివస్తాను..." అన్నాడు.

ధనంజయరావుపంతులు కొంచెం చిరాకుపడుతూ "అలాగే వెళ్ళిరా ?" అన్నాడు.

రాజశేఖరానికి ముప్ఫయి ఎనిమిదేళ్ళుంటాయి. ఇన్‌కంటాక్సు డిపార్టుమెంటులో ఒక సెక్షన్ హెడ్‌గా పని చేస్తున్నాడు. అయినా అతడు ఇప్పటికీ తండ్రితో సంప్రదించనిదే ఏ పనిచేయడు. అదే ధనంజయ రావుకు అతన్ని గురించి చికాకు కలిగించే విషయం. విశ్వనాథం ఎప్పుడూ "నీ కొడుకు సుత్యంలాటివాడోయ్! లేకపోతే... ఈ రోజుల్లో రెక్కలు రావడమే తరువాయి. పిల్లలు మనలను మూలకూర్చోబెట్టేస్తారు. నీదే అదృష్టం... ఇన్నేళ్ళు వచ్చినా మీ రాజు నిన్ను గౌరవిస్తూ ప్రతి విషయంలో నీ సలహా తీసుకోవటం చూస్తూవుంటే నాకెంతో ముచ్చటగా వుంది" అంటూ వుంటాడు. విశ్వనాథం కొడుకు చక్రపాణి, రాజశేఖరం కన్నా చాలా చిన్నవాడు. అతడు సర్వే శాఖలో గుమాస్తాగా నెలకో నూటయాభై తెస్తూవుంటాడు. ప్రతి పనీ తానే స్వయంగా ఇతరుల ప్రమేయమూ, సలహాలూ కోరకుండా చేసుకుపోవడం అతనికి రివాజు. ఒకవేళ తండ్రి తనంత తానుగా ఏ విషయంలోనైనా జోక్యం కలిగించుకో బోతే వారించి "నీ కెందుకు నాన్నా! పెద్దవాడివి. సుఖంగా విశ్రాంతిగా వుండక ఈ బెడదలన్నీ పెట్టుకుని మనసు పాడుచేసుకోవడం దేనికి?" అంటూ వుంటాడతడు. విశ్వనాథానికి ఆ ధోరణి బొత్తిగా సరిపడదు.

ధనంజయరావు తలతిప్పి చూసేసరికి వసంత గుమ్మంలో నిలబడి వుండి నడుమున చెయ్యి వుంచుకుని తన మేనత్తను అనుకరిస్తూ పెద్ద ఆరిందాలాగా "తాతయ్యా! నువ్వింక లేచి నీ పనులు కానిచ్చుకో. నా కవతల బోలెడు పనులున్నాయి" అన్నది

ధనంజయరావు అర్థం చేసుకున్నాడు. బాగా పొద్దెక్కినట్లున్నది. లోపలినుంచి కబురు రావడం దానికిసూచన. ఇకతాను లేచి కాల్యాదులన్నీ ముగించుకుని కాఫీ తీసుకుంటే గాని అనూరాధ వంట ప్రయత్నం ప్రారంభించే వీలులేదు. పైగా ఆమె వంట వగైరాలు ముగించుకుని ఆసుపత్రికికూడా వెళ్ళవలసివుంది. అక్కడ కోడలు "ఎవరూ ఇంకా రాలేదే" అని ఆదుర్దాపడుతూ వుంటుందికూడా.

ఆయన లేచి కూర్చొని దుప్పటి ఒక మూలకు విసిరి వసంతతో "లేచానని చెప్పు అత్తయ్యతో" అన్నాడు. ఆ పిల్ల అది విని తలవూపి

వెళ్ళిపోగానే లేచి నిలబడి ఒళ్ళు విరుచుకున్నాడు. తర్వాత నెమ్మదిగా నడిచి లోపలిగదిలోకి వెళ్ళాడు. అక్కడ ఆయన కూతురు కుంపటి ముందుకూర్చుని కాఫీ కలుపుతున్నది. ఆ ప్రక్కనే వసంత ఒక గ్లాసు పుచ్చుకుని తన వాటా కాఫీకోసం సిద్ధంగా కూర్చునివుంది.

ధనంజయరావు నవ్వుతూ "ఏమే వసంతా! నీక్కూడా కాఫీ యేనా? చిన్నపిల్లలు కాఫీ తాగవచ్చునా? తప్పుకదూ?" అన్నాడు. అనూరాధ నవ్వుతూ తల ఎత్తిచూసింది.

వసంత, "ఎందుకు తాగకూడదు తాతయ్యా! అది కూడా చెప్పు వింటాను" అన్నది.

ధనంజయరావు అక్కడే పీటవాల్చుకుని కూర్చుంటూ "ఎదురు ప్రశ్నలు కూడానా? నేను కూడదని చెబితే అంతే. అమ్మాయీ! దీనికి కాఫీ యివ్వకు. మరీ రాలుగాయి అయిపోతున్నది..." అన్నాడు.

అనూరాధ నవ్వింది. ఆమె నవ్వితే ధనంజయరావు మనసు ఎప్పుడూ తేలికపడుతూవుంటుంది. అనూరాధ రాజశేఖరం తర్వాతది. అతనికన్నా నాలుగయిదేళ్ళు చిన్నది. సుభద్రకు ఆడపిల్లలంటే ప్రేమ మిక్కుటం కావడంవల్ల చిన్నప్పటినుంచీ అనూరాధ రాజశేఖరం కంటె గారాబంగా పెరిగింది. ఆమె అసమాన లావణ్యవతి. నిమ్మపండువంటి శరీరచ్ఛాయా, తీర్చిదిద్దినట్టుండే అవయవాలూ, చెంపలకు చేరెడేసి నీలి కన్నులూ, చూపులలో ఠీవి, ఎవరి నాకర్షించవు? ధనంజయరావు ఎల్లప్పుడూ తల్లి రూపురేఖలు అచ్చుగుద్దినట్టు భూమిమీద పడిన కూతురుని చూసి ఎంతగానో గర్విస్తూ వుండేవాడు. ఆమె పదహారోయేట స్కూల్ ఫైనల్ ప్యాస్‌కాగానే కొన్ని నెలలపాటు వరుల వేటలో నిమగ్నుడై ధనంజయరావు చివరకు సూర్యారావనే యింజనీరు విషయంలో అన్ని విధాలా సంతృప్తిచెంది ఆ సంబంధం ఖాయంచేసి అతనితో ఆమె పెళ్ళి జరిపించాడు. కాని, విధిదృష్టి వక్రించింది. ఒక ప్రాజెక్టు నిర్మాణంలో పనిచేస్తున్న సూర్యారావు, మరో నలుగురు తోటి యింజనీర్లతో సహా నదిలో మునిగిపోయి మరణించాడు. అప్పటినుంచీ అనూరాధ పుట్టింటిలోనే వుండిపోయింది.

వసంత తాతగారి మాటలకు కోపం తెచ్చుకుని చేతిలో గ్లాసు దూరంగానెట్టి బుంగమూతి పెట్టుకుని గోడకానుకుని కూర్చున్నది. అనూరాధ గ్లాసులో కాఫీపోసి ఆ పిల్లవైపు జరిపి "తీసుకో... కోపం తెచ్చుకోకు... నా తల్లి కదూ!" అన్నది.

వసంత కోపంగా చూస్తూ, "మరి అలా ఎందుకనాలేం?"

ధనంజయరావు లేస్తూ, "మరి అనదేమిటీ? $6\frac{1}{4}$ మనుషలని లెక్కలు చేస్తూవుంటే అనక ముద్దు పెట్టుకుంటారు కాబోలు. చదువుకునే పిల్లలు పూటపూటా కాఫీలు తాగితే అలాగేవస్తాయి అన్నర్లు..." అన్నాడు

"మరి... నువ్వు చిన్నప్పటినుంచీ కాఫీలు తాగకుండానే చదివావా?" అన్నది వసంత చురచుర చూస్తూ.

ధనంజయరావు నవ్వుకున్నాడు. అవును మరి! ఆ కాలం యీ కాలమా? ఆ పిల్లలు యీ పిల్లలా?

అనూరాధ, "పోనీ అమ్మా! పెద్దవాడు ఏదో తమాషా చేస్తూ వుంటాడంతే! నువ్వు పట్టించుకోగూడదు. హాయిగా కాఫీతాగేసి వెళ్ళి చదువుకుంటూ కూర్చో. మళ్లీ నేను వంట ముగించుకుని త్వరగా తెమిలి మీ అమ్మదగ్గరికి వెళ్ళాలి. అక్కడ ఆమెగారు ఎంతగా చిందులు తొక్కుతున్నదో, అసలే కంగారు మనిషి..." అన్నది.

ధనంజయరావు పెరటిలోకి వెళ్లి పది నిముషాలలో తిరిగి వచ్చేసరికి ఆమె టవల్ అందించింది. ఆయన మొహం తుడుచుకుంటూ, "ఈ ముసురు తగ్గేట్టులేదే... ..." అనుకున్నాడు.

అనూరాధ కాఫీ అందిస్తూ తండ్రితో "అదుగో ఆ బల్లమీద ఫ్లాస్కులో వేరే కాఫీ కలిపివుంచాను. ఆయన వస్తే యివ్వు నా కింక పనితో తీరుబడివుండదు. అప్పుడేమో నువ్వు కాఫీకోసం కేకలుపెడితే యెలా మరి? .." అన్నది. ధనంజయరావు నవ్వి తలవూపి "అలాగే" అన్నాడు.

ఆ రాబోయేవ్యక్తి విశ్వనాథం ఆయన రోజూ ఉదయమే నిర్ణీత వేళకు నెమ్మదిగా చేతికర్ర వూతగా వీధిచివరి తన యింటినుంచి యిక్క

డికి నడిచి వస్తాడు. ఒకవేళ ఏ నాడయినా, ఏ కారణం చేతనయినా, ఆయన రావడం ఆలస్యమైతే ధనంజయరావుపంతులు ఏమీ తోచక కాలు గాలిన పిల్లిలా అటూ యిటూ తిరుగుతూ ఉండేవాడు. ఇక నిరీక్షించలేని పక్షంలో లాల్చీ తొడుక్కొని తానే ఆయన యింటికి బయలుదేరి పోయే వాడు. అయితే అలా చాలా అరుదుగా మాత్రమే జరిగింది. అసలు ఎక్కువసార్లు ఆయన నిరీక్షించడం కూడా జరగలేదు. విశ్వనాథం చాలా కరెక్టు మనిషి. చిన్నప్పటినుంచి మంచి క్రమశిక్షణతో పెరిగాడు. అందు వల్ల ఆయన చేసే పనిలో క్రమం తప్పడం అనేది చాలా అరుదు. ఆయన రాగానే ఇద్దరూ ఎదురెదురుగా కుర్చీలలో విశ్రాంతిగా వెనక్కువాలి కూర్చుని ఏవేవో కబుర్లు చెప్పుకునేవారు. ఆ కబుర్లు మానవజాతికి సంబం ధించిన అన్ని రంగాలను గురించీ జరిగేవి. ఒక్కొక్కరోజు ఒక్కొక్క విషయంతో ప్రారంభమైన సంభాషణ మరేదో విషయంతో అంతమవుతూ ఉండేది. నిన్నటిరోజున నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదలతో ప్రారంభమై మానవుడి చంద్రమండల విజయం-దాని సాధ్యాసాధ్యాలు అన్న విషయంతో ముగిసింది వారి సంభాషణ. దాదాపు భోజనాలవేళకు గాని ఇద్దరూ లేచేవారు కాదు.

ధనంజయరావు వెచ్చగా కాఫీ చప్పరిస్తూ కూర్చున్నాడు. ఆయనకు కొద్దిదూరంలో వసంత చాపమీద కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నది. కాఫీ త్రాగడం ముగించి కప్పు నేలమీద వుంచి ఆయన కిటికీ పక్కకువెళ్ళి వీధిలోకి చూస్తూ నిలబడ్డాడు.

రోడ్డుమీద జనం చాలా పలుచగా తిరుగుతున్నారు. వర్షం ఇంకా పడుతూనే వుంది. ఒక గొడుగులో ఇద్దరు పసిపిల్లలు, నడుస్తూ వెళ్లి పోయారు. కూరలమ్మే మనిషి ఒకామె రకరకాల కూరగాయల పేర్లు చదువుకుంటూ నడిచిపోతున్నది. రెయిన్‌కోటు ధరించి మొహం గుర్తుపట్టడానికి వీలులేకుండా టోపీ ధరించిన ఒక వ్యక్తి బురదలో నడుస్తూ వెళ్ళాడు. వీధి చివరినుంచి ఒక రిక్షా వస్తున్నది. రిక్షాపైటాపు వేసివున్న కారణంగా లోపల ఎవరున్నారో తెలియలేదు. ఆ రిక్షాలోవున్న వస్తువులు ధనంజయరావు దృష్టిని ఆకర్షించాయి. నాలుగైదు పచ్చి

వెదుళ్ళు...ఒక కుండ. ధనంజయరావు అలాగే చూస్తూ నిలబడిపోయాడు. రిక్షా ముందుకు కదిలి వెళ్ళిపోతున్నది. ధనంజయరావు నిట్టూర్చాడు. ఎవరికి లోకంనుంచి నిష్క్రమణ లభించిందో ! ఎవరు, తనవారందరినీ వెనక మిగిల్చి ఎక్కడికో, ఏమీ తెలియని చోటికి అనంతయాత్ర సాగించారో !

ఆయన వాలు కుర్చీలో పీలుగా విశ్రాంతిగా కూర్చున్నాడు. బయట ఇంకా వర్షం కురుస్తూనే ఉంది. అయితే ఇందాకటిలాగా మరీ కుంభవృష్టి ఏమీ లేదు. ఉండి ఉండి జల్లు పడుతున్నది. చల్లని గాలిమాత్రం విసురుగానే వీస్తున్నది.

ధనంజయరావు కళ్ళు మూసుకున్నాడు. ఆయన మనసులో ఇందాకటి దృశ్యమే–రిక్షా, అందులో పచ్చి వెదుళ్ళూ, కుండ–కనిపిస్తున్నది. మనసంతా ఉన్నట్టుండి అకారణంగా బరువెక్కినట్టయింది. ఆ చచ్చిపోయిన వ్యక్తి ఎవరో ! ఎంత వయస్సుంటుందో! ఆడమనిషో, మగవాడో! ఇంత వర్షంలోనూ అన్ని పనులూ శాస్త్రోక్తంగా జరగక తప్పదు కదా ! పాపం ! పోయినవాడిది బాధ కాదు. వెనక ఈ కర్మకాండ అంతా యదావిధిగా జరపవలసిన వాళ్ళది అసలు బాధ.

ఆయన మనసంతా మేఘావృతమైన ఆకాశంలాగే తయారయింది. ఏవేవో అర్థంలేని దృశ్యాలూ, ఆలోచనలూ చెలరేగి మనస్సాగరాన్ని కల్లోలపరుస్తున్నాయి.

ఆయన వున్నట్టుండి వసంత నుద్దేశించి "అమ్మడూ ! ఏదీ, ఇందాకటి లెక్క ఇలా తీసుకురా ! చేసి చూపిస్తాను" అన్నాడు.

ఆ అమ్మాయి గబుక్కున లెక్కల నోట్సు పుస్తకం తెచ్చి తాతగారికి అందించి, "నువ్వు పెద్ద పెద్ద ఇంగ్లీషు లెక్కలు నిముషానికొకటి చేసి పారేయగలవు. నాకేమో ఈ లెక్కలే రావు. నువ్వేమో ఎగతాళి చేస్తావు. అందుకే నీకు చూపించ నెప్పుడూ" అన్నది.

ధనంజయరావు నవ్వి, "ఇంక ఎప్పుడూ ఎగతాళి చెయ్యనులే. అయినా నువ్వు ఏదయినా తెలియకపోతే అడిగి తెలుసుకోవాలి గాని,

నేను ఎగతాళి చేస్తానని ఉడుక్కుంటే చదువెలా వస్తుంది?" అన్నాడు. తర్వాత అయిదు నిముషాలసేపు ఆ లెక్క సాధించే విధానమూ, స్టెప్స్ క్రమంగా వెయ్యడమూ, అంతా వివరించి చెప్పాడు. అప్పుడా పిల్ల తన నోటుపుస్తకం తీసుకుని వెళ్ళి యథాప్రకారం చాపమీద కూర్చుని ఇతర పాఠాలు చదువుకోవడం ప్రారంభించింది.

ధనంజయరావు పంతులుకు అకారణంగా నిట్టూర్పు వచ్చింది. నిట్టూర్చి కుర్చీలో వెనక్కువాలి కళ్ళు మూసుకున్నాడు. విశ్వనాథం వచ్చేవేళ అయింది. నెమ్మదిగా కర్ర తాటించుకుంటూ నడిచివస్తాడు. నిజానికి ఆయనకు ఆ చేతికర్ర అవసరం బొత్తిగా లేదనే చెప్పాలి. అయినా అది పెద్దమనిషి తరహాకు చిహ్నమని చెప్పాడు విశ్వనాథం ఒక సారి. ఆయన వస్తేనేగాని తనకు ఏమీ బాగుండ దివాళ. ఆ పెంకుటింట్లో పంచలో వాలు కుర్చీలో ఏమీ తోచక కూర్చోవడం తప్పించి ఆయన చేసే ఘనకార్యం మాత్రం ఏముంది గనుక? అదీగాక విశ్వనాథం ఈ మాత్రపు వర్షానికీ, జల్లుకూ జంకడు కూడా. ఉత్తరీయం పైన వేసుకుని ఎంత దూరమైనా వెళ్ళగలడు. అసలే చువ్వవంటి మనిషేమో పాము పాకినట్టు నడిచిపోగలడు. వర్షంలో తడిస్తే జలుబూ, జ్వరమూ వంటివి వస్తాయేమోనని ఏమాత్రమూ భయపడడు. అంతంత మాత్రపు ఎండా వానలకు తేలికగా తట్టుకోగలడు. తన విషయం మాత్రం అలా కాదు. ఈ మాత్రపు జల్లులో తడిసినా, కొంచెం ఎండవేళప్పుడు నడిచినా గాజు కాయవంటి తన శరీరం తట్టుకోలేదు.

ధనంజయరావుకు మరో విషయం గుర్తుకురాగానే నవ్వు వచ్చింది. విశ్వనాథం గురించి చాలా తమాషా అయిన విషయం ఒకటి ఉంది. ఆయన తన సర్వీసులో ఎన్ని గొడుగులు కొన్నాడో లెక్కలేదు. కాని చిత్ర మేమిటంటే కొన్న ప్రతిగొడుగూ అయిదు రోజులకుమించి ఆయన దగ్గర ఉండేది కాదు. అయిదురోజుల వ్యవధిలో ఆయన తన చేతిమీదుగా కొన్న ప్రతి గొడుగూ పోవడం ఖాయమన్నమాట. అందుకే ఇటీవలి కాలంలో ఆయన అసలు గొడుగులు కొనటమే మానివేశాడు.

ఆయన లేచి బల్లమీది ఫ్లాస్కులో కాఫీ ఎంతవుందో చూశాడు.

ఫరవాలేదు. తాను మరికొంచెం తాగవచ్చును. అప్పటికి విశ్వనాథానికి సరిపడ అందులో యింకా కాఫీ మిగిలే వుంటుంది.

ఫ్లాస్కులోనుంచి కప్పులోకి కాఫీ వంచుకుని తిరిగి దాని మూత సరిగావుంచి వెనుదిరుగుతూవుండగా వరండాలో అడుగుల చప్పుడు వినిపించింది. ఎవరో చెప్పులు విడుస్తున్నారు. "విశ్వనాథమే అయి వుంటాడు మిగిలిన కాఫీ కూడా కప్పులోపోసి ఉంచుదాం. ఇద్దరమూ ఒక్కసారే త్రాగవచ్చు" అనుకుంటూ తలఎత్తి చూసేసరికి, గుమ్మం ఇవతల పీచుపట్టాకు కాళ్ళు తుడుచుకుంటున్న రాజశేఖరం కనిపించాడు.

అతని ముఖం ఎందుకో కాంతి విహీనమైవుంది. అతడు తండ్రిని చూసి ఏదో చెప్పబోయి నోట మాట రాని వాడిలా శిలావిగ్రహంలా నిలబడిపోయాడు.

ధనంజయరావుపంతులు "అదేమిటిరా ? అలా నిలబడిపోయావేం? ఏమిటి సంగతి ? కోడలి కెలావుంది ?" అన్నాడు ఆదుర్దాగా.

రాజశేఖరం కొన్ని అడుగులు ముందుకువేసి తడబడుతూ "నాన్నా ? మరి...విశ్వనాథంగారు...పోయార్ట..." అన్నాడు.

ధనంజయరావుపంతులు, "ఎక్కడికి ?" అని అడగబోయి అంతలోనే గుండుదెబ్బ తిన్నవాడిలా బిగుసుకుపోయాడు. చేతిలో వున్న పింగాణీకప్పు క్రిందపడి ముక్కలు ముక్కలైపోయింది.

ఆయన కనురెప్పపాటు లేకుండా కూర్చుని వుండగా రాజశేఖరం నెమ్మదిగా చెప్పాడు. "నిన్న సాయంకాలం దాకా బాగానే ఉన్నాట్ట నాన్నా ! చక్కగా అందరితో కబుర్లు చెబుతూ కూర్చుని హాయిగా భోజనం చేశాట్ట. పడుకోబోతూ కొంచెం గుండెనొప్పిగా ఉందన్నాట్ట. అంతే...గంటల్లో ముంచుకొచ్చేసిందట. ఒంటిగంటవేళకు లేచి కిటికీ తలుపులు తెరవమని అడిగాట్ట, ఆ తర్వాత స్పృహతప్పిందట— ఒంటిగంటన్నరకు అంతా అయిపోయిందిట..."

ధనంజయరావుపంతులు కొయ్యబారిపోయి కూర్చున్నాడు. ఇదంతా విన్నాడో లేదో కూడా తెలియదు.

ఆయన ఉలిక్కిపడ్డాడు. "గేటు మూసేవేళ అయింది బాబూ! ఇక లేస్తారా ?" అంటున్నాడు పార్కు జవాను, ఎదురుగా నిలబడి వుండి.

ఆయన తలవూపి నిట్టూర్చి చేతికర్ర అందుకుని లేచి ముందుకు నడిచాడు. పార్కులో బల్లలన్నీ ఖాళీగా వున్నాయి. అందరూ యిళ్ళకు వెళ్ళిపోయినట్టున్నారు. అంటే బాగా పొద్దు పోయిందన్నమాట.

ఆయన పార్కులోనుంచి యివతలికి వచ్చి నెమ్మదిగా నడవటం ప్రారంభించాడు. రోడ్డుపక్కన దీపాల వెలుగు మందంగావుంది. దూరంగా రైలొకటి కూత వేసుకుంటూ పోతున్నది. దూరాని కారైలు దీపాలతోరణం కదులుతున్నట్టు కనిపిస్తున్నది.

ఆయన ఇంటికి చేరుకునేసరికి కూతురూ, కొడుకూ, మనుమరాలూ వరండాలో నిలబడి ఆయనకోసం ఎదురుచూస్తున్నారు. గేటు తెరచుకుని లోపలికివస్తూ ఆయన కళ్ళబడగానే తేలికగా నిట్టూర్చి "అమ్మయ్య" అనుకున్నారు వారు.

అనూరాధ తండ్రికి ఎదురువెళ్ళి చేతికర్ర అందుకుని, "ఇంతసేపు ఉన్నావేం నాన్నా ? మేము ఇందాకటినుంచీ ఎంతగా దిగులుపడ్డామో తెలుసా" అన్నది.

ధనంజయరావుపంతులు బదులేమీ చెప్పకుండా కుర్చీలో కూలబడ్డాడు.

అనూరాధ మళ్ళీ, "పాపం ! ఆ చక్రపాణి బొత్తిగా చిన్నవాడు. వేరే పెద్ద దిక్కు కూడా ఎవరూ ఉన్నట్టులేరు. తల్లి అసలే లేదనుకో... నువ్వు అక్కడ ఉండటమూ మంచిదే అయింది. ఏదో పాపం, ఆ కుర్ర వాడికి కొంచెం ధైర్యం...అయినా నువ్వు 'ఆలస్యంగా వస్తా'నని చెప్పి వెళ్ళలేదు మరి... అందుకని కొంచెం గాభరా పడ్డాం ... అంతే" ... అన్నది.

రాజశేఖరం, "ఎవరో దూరపు బంధువులు కొందరు వచ్చినట్టున్నారు కదూ నాన్నా?" అని అడిగాడు.

ధనంజయరావు పైపంచెతో మొహం తుడుచుకుంటూ "ఏమో మరి... నాకు తెలీదు. నేనక్కడికి వెళ్ళలేదు..." అన్నాడు.

అనూరాధ లోపలి గదిలోకి వెళ్ళబోతున్నదల్లా ఆగిపోయి వెనక్కి తిరిగింది. రాజశేఖరం ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి "అదేమిటి? నువ్వు వాళ్ళింటికి వెళ్ళలేదూ? మరి పొద్దుటినుంచీ ఎక్కడున్నావు?" అని అడిగాడు.

ధనంజయరావు పిచ్చి చూపులు చూస్తూ తల వూపి "వెడదామనే బయలుదేరాను పొద్దున...కాని, అక్కడికి వెళ్ళలేదు. అక్కడా అక్కడా తిరిగి సాయంకాలం పార్కుకు వెళ్ళి కూర్చుని ఇప్పుడే లేచి వస్తున్నాను" అన్నాడు.

అనూరాధా, రాజశేఖరం ఇద్దరూ కొద్ది క్షణాలపాటు ప్రాణ్నపడి నిలుచుండిపోయారు. తర్వాత అనూరాధ నెమ్మదిగా "అదేమిటి నాన్నా! అలాటి పని చేశావేమిటి? ఆ పిల్లవాడు మరీ చిన్నవాడు కదా! అతనికి వచ్చిన ఆపద సామాన్యమైంది కూడా కాదు. నువ్వు తప్ప వోదార్చి, ధైర్యం చెప్పగల వారెవరున్నారు చెప్పు అతనికి? అదీగాక విశ్వనాథం గారు నీకు ఎటువంటి స్నేహితుడు! ఎవరైనా వింటే బాగుండదు కూడాను. పెద్దవాడివి. ఇలా చెయ్యవలసింది కాదు నువ్వు" అన్నది.

తర్వాత ఒక అరగంట గడిచాక స్నానం ముగించుకుని భోజనానికి కూర్చుంటూ ధనంజయరావు కూతురివంక చూసి "మీ వదిన కెలా వుంది ఇవాళ?" అని అడిగాడు.

ఆమె నెయ్యి వడ్డిస్తూ, "ఒకటి రెండు రోజులలో ప్రసవం అవుతుందన్నారు. ఏమీ గాభరా అక్కర్లేదన్నారు. వదిన కూడా ధైర్యంగానే ఉంది. కాన్పు ఎడం కావటంతో మనకి కొంచెం భయం... అంతకంటె మరేం లేదు..." అని చెప్పింది.

ధనంజయరావు ఏమీ మాట్లాడకుండా నిశ్శబ్దంగా కూర్చుని భోజనం చేశాడు. తర్వాత వెళ్ళి హాల్లో వాలుకుర్చీలో కళ్ళు మూసుకుని పడుకున్నాడు.

అనూరాధ వంటఇంటిలో పనులన్నీ ముగించుకుని ముందు హాల్లోకి వచ్చి తండ్రివంక చూసి నివ్వెరపోయి 'నాన్నా' అంటూ తట్టి లేపింది.

ధనంజయరావు ఉలికిపడి కళ్ళనులుముకున్నాడు. 'ఆ గదిలో నీ పక్క సరిచేశాను. వెళ్ళి పడుకో నాన్నా!" అన్నది అనూరాధ.

ఆయన "అలాగే" అని లేచి గదిలోకి వెళ్ళబోతూ మళ్ళీ ఆగి, "అన్నట్టు అమ్మాయీ? మన రాజు పక్క కూడా ఇవాళ నా మంచం పక్కనే వెయ్యి... వాణ్ణి ఇవ్వాల్టికి ఈ గదిలోనే పడుకోమని చెప్పు" అన్నాడు.

అనూరాధ ఆశ్చర్యంతో తల వూపి "అలాగే" అన్నది.

ఒక పావుగంట తర్వాత రాజశేఖరం, తండ్రి మంచం పక్కనే మరొక మంచం మీద పడుకుని నిద్రపోతున్నాడు. కిటికీలోనుంచి చల్లని గాలి వాడియైన బాణపు మొనలాగా పదునుగా వీస్తున్నది.

ధనంజయరావు కుమారుడివంక చూశాడు. అతడు నిశ్చింతగా నిద్రపోతున్నాడు. ఆయనకు రోజూ ఈపాటికి నిద్ర బరువుతో కను రెప్పలు వాలిపోతూ ఉండేవి. అయినా ఇవాళ నిద్ర సత్యాగ్రహం చేసినట్టున్నది. కళ్ళు గట్టిగా మూసుకుని ఏ ఆలోచనలూ లేకుండా నిద్రపోదామని ప్రయత్నంచేసి విఫలుడైనాడాయన.

కళ్లు మూస్తే సరి రోజూ చేతికర్ర వూతగా నెమ్మదిగా నడిచి వచ్చే విశ్వనాథమే కనుపిస్తున్నాడు. ఆయన అంత దూరమూ నింపాదిగా నడిచి వచ్చి ఈ ఇంటి వీధి గుమ్మం దిగుతూ పడబోయేవాడు. అలా రోజూ క్రమం తప్పకుండా జరుగుతూ ఉండేది. వీధి గుమ్మం మెట్లలో పైనున్నది మిగిలిన వాటికంటె ఎత్తయినది కావడమే దానికి కారణం. తర్వాత ఆ మెట్టును గురించే గునుస్తూ "ఆ ఒక్క మెట్టూ అలా ఎత్తుగా ఎందుకు కట్టించావోయ్. రోజూ నే నిక్కడ పొరపాటుపడుతూనే ఉంటాను..." అంటూ ముందుకు నడిచి వచ్చేవాడు. తర్వాత నింపాదిగా చేతికర్ర ఒక మూలవుంచి, చెప్పులు విప్పి వసంత తెచ్చి అందించిన నీళ్ళతో కాళ్ళు కడుక్కుని పై పంచెతో తడి అద్దుకుని, అప్పుడు వచ్చి కుర్చీలో కూర్చుని, "ఏదీ? నాకోసం ఏం ఉంచావూ?" అని అడిగేవాడు. ధనంజయరావు లోపలినుంచి కాఫీ తెప్పించి "అంతే ఒట్టి కాఫీతోనే సరుకుపోవాలి..." అనేవాడు. "గూడ్" అంటూ కాఫీ కప్పు అందుకునే

వాడాయన. తర్వాత మొదలయ్యేది అంతులేని సంభాషణ. ఇలా కొన్ని సంవత్సరాలుగా క్రమం తప్పకుండా జరుగుతూ వచ్చింది. మరి ఇవాళ...?

తన ఇంట్లో నవ్వుతూ పేలుతూకూర్చుని కులాసాగా గడపవలసినవాడల్లా చల్లగా బిగుసుకుపోయి ఉంటాడు. కదలికలేని ఆ శరీరాన్ని గోడకు ఆనించి కూర్చోబెట్టి ఈ చలిలోనే చల్లని నీళ్ళతో స్నానం చేయించి వుంటారు. మామూలు రోజులలో అయితే ఒంటిమీద చల్లని నీళ్ళు పడితే గజగజ వణికే విశ్వనాథం ఇప్పుడు ఏమీ అభ్యంతరం చెప్పకుండా నిశ్చలంగా వుండి వుంటాడు. "ఎంత చల్లని నీళ్ళయినా మీ ఇష్టం వచ్చినన్ని పోసి నన్ను స్నానం చేయించండి" అన్నట్టు రాతి బొమ్మలా కూర్చుండిపోయాడేమో! తర్వాత ఆ వెదుళ్ళు చీల్చి పేలుగా కట్టిన ఏడు కట్ల సవారీ మీద అతన్ని పడుకోబెట్టి నలుగురూ మోసుకుంటూ సాగిపోయి ఉంటారు. ఆ వెదుళ్ళు అతని శరీరానికి ఒత్తుకోవూ?

ధనంజయరావు బలవంతాన ఆలోచనలకు ఆనకట్టవేసి కిటికీలో నుంచి చూశాడు. బయట చీకటి, ఆకాశంలో నుంచి ఏదో అదృశ్య రాక్షస హస్తం సిరా ఒలకబోసినట్టు చిక్కగా వ్యాపించి వుంది

ఆయనకు హఠాత్తుగా గుండెలు దడదడ లాడాయి. విశ్వనాథం తనకన్నా చిన్నవాడు. తనకన్నా ఆరోగ్యవంతుడనే చెప్పాలి కూడా. అయినా ఎంత హఠాత్తుగా ఇదంతా జరిగిపోయింది? వ్యవధి లేకుండా సూచన అయినా లేకుండా మృత్యువు వచ్చి మీదపడి కబళించుకుపోవడం ఎంత చిత్రం?

తనకు నిద్ర రావడంలేదు. వస్తే బాగుండిపోను. ఈ ఆలోచనల సుడిగుండంలో పడి మునకలు వేయడం తప్పుతుంది. అయినా నిద్రకూ, చావుకూ తేడామాత్రం ఎంత? ధనంజయరావు గుండెలు జల్లుమన్నాయి. ఆయన ఒక్క క్షణం "నిద్రపోతున్న శేఖరాన్ని లేపి కూర్చోబెడదామా" అనుకుని మళ్ళీ అంతలోనే ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

తెల్లవారుతూ వుండగా మెలకువ వచ్చి కళ్లువిప్పి చూసేసరికి కిటికీలోనుంచి ఆకాశం నిర్మలంగా కనిపించింది. ధనంజయరావుకు ఒళ్ళంతా నొప్పులుగా అనిపించింది. రాత్రి అంతా సరియైన నిద్రపట్టక బాధపడ్డాడాయన. తెల్లవారుజాము వేళకు నిద్రాదేవత కొంచెం దయతల చింది కాని ఆ నిద్ర అంతా ఏవేవో అర్థంలేని కలలతో చికాకు కలిగించింది. తెల్లవారిన తర్వాత తీరికగా కూర్చుని జ్ఞాపకం చేసుకుందామను కుంటే ఆ కలలలో ఒక్కటి కూడా గుర్తు రాలేదు.

ఆయన ఆవులించి ఒళ్ళు విరుచుకుని లేచి లోపలి గదిలోకి వెళ్ళాడు. అనూరాధ తలఎత్తి చూసి ఏమీ మాట్లాడకుండా వూరుకున్నది. ఆయన నేరుగా పెరటిలోకి వెళ్ళి దంతధావనం ముగించి లోపలికి రాగానే కాఫీ అందించి, "నేను పెందరాళే వంట ముగించుకుని ఆసుపత్రికి వెడతాను నాన్నా! నువ్వు స్నానంచేసి విశ్వనాథంగారి ఇంటికివెళ్ళు...ఆ అబ్బాయి తెల్లవారుతూనే మన ఇంటికి వచ్చాడు పాపం! బొత్తిగా డీలాపడిపోయి ఉన్నాడు" అన్నది

ధనంజయరావు ఉలికిపడి "చక్రపాణి మన ఇంటికి వచ్చాడా?" అన్నాడు ఆశ్చర్యంతో. తర్వాత ఒక్క క్షణం ఆగి "మరి నన్నెందుకు లేపలేదు?" అని అడిగాడు.

ఆమె గిన్నెలు సవరిస్తూ కొన్ని క్షణాలు మెదలకుండా ఊరుకుని మళ్ళీ "నాకు జాలివేసింది నాన్నా! నేను మెలకువరాగానే వరండాలోకి వెళ్ళేసరికి బిక్కమొహం వేసుకుని వీధి గుమ్మంముందు అటూ యిటూ తిరుగుతూ కనిపించాడు. నేను అన్నయ్యను లేపి వెళ్ళి మాట్లాడమన్నాను. అన్నయ్య అతనితో మాట్లాడి పంపివేశాడు" అన్నది.

రాజశేఖరం లోపలికివస్తూ "డబ్బు కావాల్సివచ్చిందిట! నాన్నా! మొదట్లో 'నువ్వు రాలేదే'మని అడిగాడు. 'ఆయనకు ఈ విషయం విన్నప్పటినుంచీ మనసు బాగుండలేదు. అంతకంటె మరేమీ లేద'ని చెప్పి సర్దేశాను. ఇవాళ వెళ్ళు నాన్నా! లేకపోతే బాగుండదు. మధ్యాహ్నం నుంచీ ఆఫీసులో పని పూర్తిచేసుకుని నేనూ వస్తానక్కడికి" అన్నాడు.

ధనంజయరావు పంతులు కాస్సేపు నిశ్శబ్దంగాకూర్చుని తర్వాత లేచి ముందు గదిలోకి పోబోతూ "రాజూ ! ఇలారా, ఒక్కసారి..." అన్నాడు. రాజశేఖరం తండ్రి ననుసరించాడు.

ఆయన తన గదిలోకి వెళ్ళి "డబ్బు ఎంత కావాలన్నాడు'? అని ప్రశ్నించాడు.

"రాజశేఖరం రెండు వందలు కావాలన్నాడు. నేను నిన్ను అడిగి మధ్యాహ్నం తీసుకువస్తానని చెప్పాను" అన్నాడు.

ధనంజయరావు చిరాకుపడుతూ "దీనికూ్కూడా నా అనుమతి కావాల్సిందేనా? అయినా నువ్వు ప్రతిదానికీ ఇక నన్ను సంప్రదించ నక్కరలేదని ఎన్నిసార్లు చెప్పానురా నీకు ? మధ్యాహ్నం వచ్చేటప్పుడు 'డ్రా' చేసుకురా. నే నక్కడే ఉంటాను" అన్నాడు.

రాజశేఖరం తల వూపి వెళ్ళిపోయాడు.

తర్వాత ధనంజయరావు పంతులు స్నానం ముగించుకుని కుర్చీలో కూర్చున్నాడు. అనూరాధ ముందు గదిలోకి వచ్చి "అదేమిటి నాన్నా ! ఇంకా కూర్చున్నావేం ? వెళ్ళకూడదూ అక్కడికి ?" అన్నది.

ఆయన పరధ్యానంగా తల వూపి "వెడతానులే..." అని బదులు చెప్పాడు. కాని మరో అరగంట తర్వాత కూడా ఆయన బయలుదేరలేదు. ఆయన మనసంతా 'ఫలానా' అని చెప్పరాని విచిత్రావస్థకు లోనై వుంది. రెండు మూడుసార్లు లేచి బయలుదేరబోయి, శక్తి చాలని వాడిలా మళ్లీ కూర్చుండిపోయాడు. ఎందుకో కాళ్ళలో వణుకు పుట్టుకొని వస్తున్నది. అకారణంగా గుండెలు దడదడ లాడుతున్నాయి. మనసంతా మాటి మాటికీ బరువెక్కిపోతున్నది ఏమీ ఆలోచించకుండా కళ్లు మూసుకుని వూరికే నిట్టూరుస్తూ కూర్చోవాలనిపిస్తున్నది.

అనూరాధ తన పనులన్నీ ముగించుకుని ఆసుపత్రికి వెళ్లేందుకు తయారై వచ్చి ఇంకా అలాగే కూర్చుని వున్న తండ్రిని చూసి నివ్వెర పోయింది. "అదేమిటి నాన్నా? నువ్వింకా వెళ్ళనేలేదా?" అని అడిగింది.

అప్పుడాయన చివాలున లేచాడు. త్వర త్వరగా చేతి కర్ర

అందుకుని "ఇదుగో వెడుతున్నాను" అంటూ పెద్ద పెద్ద అంగలువేస్తూ వరండా మెట్లు దిగి వీధి తలుపు దగ్గరికి లాగి రోడ్డు మీదికి వెళ్ళాడు.

* * *

ఆ ఇల్లు అసలే చిన్నది. అక్కడే చిన్న పంచలో ఒక ప్రక్క మంత్రాలు వినిపిస్తున్నాయి. చక్రపాణి తడిపంచె కట్టుకుని కర్మకాండ నిర్వహణలో మునిగి తేలుతున్నాడు. అతని భార్య చాలా చిన్నపిల్ల. ఆమె అటూ, ఇటూ దిగులుగా తిరుగుతూ కావలసిన వస్తువులు అందిస్తున్నది ఇద్దరు మధ్యవయసు వ్యక్తులు — ఎవరో దూరపు బంధువులు కాబోలు - అరుగుమీద కూర్చుని ఉన్నారు. లోపల మరి కొందరు ఆడవాళ్లు వంట పనిలో ఉన్నారు. పదిహేను, పదహారేళ్ళ కుర్రవాడొకడు అటూ ఇటూ తిరుగుతున్నాడు.

ధనంజయరావు పంతులును చూడగానే చక్రపాణి మొహం విప్పారింది. అతడు అక్కడినుంచే "నిర్మలా" అని భార్యను కేకవేసి పిలిచి "ఆయన వచ్చారు చూడు... ఎక్కడైనా కూర్చోబెట్టు" అని చెప్పాడు.

ఆమె లోపలినుంచి పాత వాలు కుర్చీ తెచ్చి గుమ్మం పక్కనే వేయబోతూవుండగా ధనంజయరావు వారించి "అమ్మా! అవేమీవద్దులే... నువ్వు నీ పని చూసుకో, నేనిక్కడ కూర్చుంటాలే" అన్నాడు. ఆయనకు ఇంత వయసు వచ్చినా ఇటువంటి సందర్భాలలో ఎలా ప్రవర్తించాలో, ఏమి మాట్లాడాలో బొత్తిగా తెలియదు. పైగా ఆ పాత వాలుకుర్చీ ఆమె వేసినచోటనే వేసుకుని కూర్చుంటూ ఉండేవాడు విశ్వనాథం. ధనంజయరావుకు అక్కడ కూర్చునేందుకు మనసొప్పలేదు. గుండెలు ఎందుకో జల్లుమన్నాయి.

ఆ యిద్దరు వ్యక్తులూ ధనంజయరావువంక చూశారు. నిన్నటి నుంచీ చక్రపాణి, అతని భార్యా కొన్ని వందలసార్లు "ఆయన రాలేదే, ఇంకా!" అనుకోవడం వారు విన్నారు. అందుకనే "ఇంత ముఖ్యమైన మనిషి అసలైన సమయం తప్పించి యివాళ వచ్చాడేమిటా?" అని చూస్తున్నారు.

ధనంజయరావు కేమీ తోచలేదు. కాస్సేపు ఆకాశంవంక చూశాడు. పలుచ పలుచగావున్న మబ్బులు క్రమ్ముకుని వస్తున్నాయి. వర్షంకురిస్తే బాగుండిపోను. అయినా యిప్పట్లో వర్షం కురిసే సూచన లంతగా కానరాలేదు.

ఆయన మూలగా పడివున్న సుద్దముక్క చేతిలోకి తీసుకుని అరుగుమీద గుండ్రంగా ఒక సున్నా గీచాడు. ఇంకా అంతటితో ఆగక గీతలు గీయడం ప్రారంభించాడు. చివరకు చూస్తే అవి పులిజూదం గీతలు. అవతలి వ్యక్తులిద్దరూ ఆశ్చర్యంతో చూస్తున్నారు.

ధనంజయరావు పంతులు అరుగు ప్రక్కగా క్రిందికి వంగి చిన్న చిన్న రాళ్ళు ఏరి చేతిలోకి తీసుకున్నాడు. అవి మేకలు. మరి కొంచెం పెద్ద రాళ్ళు మూడు ఏరి తీసుకున్నాడు. అవి పులులు.

తర్వాత ఆ ఇద్దరిలో ఒకరి నుద్దేశించి పూడుకుపోతున్న కంఠస్వరంతో "ఇది ఆడటం వచ్చా మీకు?" అని అడిగాడు.

ఆ వ్యక్తి కళ్ళు పెద్దవిచేసి చూసి తల అడ్డంగావూపాడు. తర్వాత ధనంజయరావు చుట్టూచూసి దగ్గరలో నిలబడివున్న ఆ కుర్రవాణ్ణి పిలిచాడు. అతనికి ఆ ఆట వచ్చునట్లేవుంది. వెంటనే వచ్చి కూర్చున్నాడు.

ఇద్దరూ పులి జూదం ఆడటం ప్రారంభించారు. ఆ కుర్రవాడు పులులు తీసుకున్నప్పుడు ధనంజయరావుగారి మేకలన్నీ వెంట వెంటనే బలి అయిపోయాయి. అతడు మేకలు తీసుకున్నప్పుడు పులులను ఇట్టే కట్టివేసేవాడు. ఆ విధంగా దాదాపు ఒక అరగంటసేపు ఆ ఇద్దరు వ్యక్తులూ విరక్తి నిండిన కళ్ళతో చూస్తూ ఉండగా, ఆయనకోసమని నిర్మల తెచ్చి ఉంచిన కాఫీ చల్లగా చల్లారిపోగా, ఆట సాగింది.

అంతలో తలుపు తీసుకుని రాజశేఖరం లోపలికి వచ్చాడు. అతడు తండ్రిని చూసి కొయ్య బొమ్మలా కొన్ని క్షణాలు చేష్టలుడిగి నిలుచుండి పోయి తర్వాత తేరుకుని విసురుగా ముందుకు వెళ్ళి ఆ రాళ్ళన్నిటినీ పోగుచేసి క్రిందికి విసిరి పారేసి, ఆ గీతలన్నిటినీ తుడిచివేసి, "ఏమిటి నాన్నా! మరీ చిన్న పిల్లలై పోతున్నారేమిటి?" అన్నాడు ప్రక్కవారికి వినిపించకుండా.

అంతలో హఠాత్తుగా ధనంజయరావుకు దుఃఖం పొంగివచ్చింది ఆ మనసులో ఎన్నో అగ్నిపర్వతాలు బ్రద్దలైనట్టూ, ఎన్నో సముద్రాలు ఘోషించినట్టూ అయింది. కళ్ళవెంట జలజలమని అశ్రువులు ప్రవహించాయి. ఆయన ఉన్నట్టుండి మొహం చేతులతో కప్పుకుని 'బావురు' మన్నాడు.

రాజశేఖరం చక్రపాణిని చాటుకు పిలిచి డబ్బు చేతుల్లో వుంచి, "ఆయనకు నిన్నటినుంచీ మనస్థిమితంలేదు. నువ్వేమీ అనుకోకు" అని చెప్పాడు. చక్రపాణి తల వంచుకుని నిలబడిపోయాడు.

తర్వాత రాజశేఖరం తండ్రి చేయి పట్టుకుని లేవదీస్తూ "పద నాన్నా! ఇంటికి పోదాం. మళ్ళీ సాయంకాలం వద్దాంలే" అన్నాడు.

ధనంజయరావు లేచి కళ్ళు తుడుచుకుని ఒక విధంగా తేలికపడిన మనసుతో నిట్టూర్చి చక్రపాణివంక ఒక్క క్షణం చూసి కొడుకువెంట బయటికి నడిచి వెళ్ళిపోయాడు.

వారిద్దరూ ఇంటికి వెళ్లేసరికి అనూరాధ గుమ్మంలో కూర్చుని వుంది. ఆ ఇద్దర్నీ చూడగానే ఆమె లేచి ఎదురువచ్చి "నాన్నా! శుభ వార్త... నీకు మనుమడు... పండులా ఉన్నాడు... ఒరే అన్నయ్యా! ఆలస్యంగానైనా మొత్తానికి మొగపిల్లవాడితండ్రి వనిపించుకున్నావురా... బొత్తిగా ఇన్నాళ్ళనుంచీ అంతా 'మైనస్సే' అని బాధపడుతున్నావు. ఇప్పుడు 'ప్లస్' వచ్చి చేరి సరి సమానమైందిలే..." అన్నది గుక్క తిప్పుకోకుండా.

ధనంజయరావు వాలు కుర్చీలో కూర్చున్నాడు. మనసులో గందరగోళం తగ్గి ప్రశాంతత నెలకొన్నది. ఉన్నట్టుండి తల పంకించి 'విశ్వనాథం' అనుకున్నాడు.

అది పైకి వినిపించి మిగిలిన ఇద్దరూ ఆయన ఉద్దేశం అర్థం చేసుకున్నారు. వాళ్లుకూడా తేలికగా నిట్టూర్చారు. బయట మబ్బు విడిచిన బంగారురంగు ఎండ ఆహ్లాదకరంగా వ్యాపిస్తున్నది.

(1965 ఆగస్టు 'భారతి')

# పొగ మంచు

చుట్టూ చీకటి... కటిక చీకటి ... ఆకాశంనిండా మబ్బులు కమ్ముకుని వున్నాయి. నల్లని దట్టమైన మబ్బులు ... ఇప్పుడో మరి కాస్సేపటిలోనో కుంభవృష్టి ప్రారంభం కాబోతున్నది.

వరుసగా మూడుమెట్లూ ఎక్కి వరండాలో గుమ్మం దగ్గర కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా నిలబడ్డాను. తర్వాత తాళం చెవుల గుత్తిలో తాళంచెవి ఏరుకుని తలుపు తీశాను. కొత్తయింటి వాసన...గోడలకు కొత్తగా సున్నంకొట్టిన వాసన.

లోపల చీకటి...ఇన్ని యేళ్ళనుంచీ నా మనసులో పేరుకొని ఘనీభవించిపోయిన ఒంటరితనంలాంటి చీకటి ... స్విచ్ వేస్తే లైటు వెలగలేదు. కరెంటు లేదేమో !

తడువుకుంటూ వెళ్ళి కుర్చీలో కూలబడ్డాను...అంతలోనే పక్క కిటికీ తలుపులమీద జల్లుపడుతున్న సవ్వడి...ఆ జల్లులో తడుస్తూ ఏదో పక్షి చప్పుడు చేస్తున్నది.

అకస్మాత్తుగా అంతకుముందే జరిగిన సంభాషణ గుర్తు వచ్చింది. మనసంతా ఏదో అలజడి...ఇప్పటి ఆకాశంలాగే మనసంతా వ్యాకులంగా ఉంది. దట్టంగా పేరులేని చెట్టూచేమలూ అతలూ అడదిడంగా పెరిగి పోయి సూర్య కిరణం లెక్క ఒక్కటికూడా చొరరాని లాటి మనసు...ఇన్నేళ్ళుగా ఈ మనసనే పదార్థాన్ని గడ్డ కట్టించేసి, పనికిరాని రాయిలాచేసి యాంత్రికంగా నడిపిన జీవితం ... పగలల్లా ఉద్యోగం...నిద్రలేని రాత్రులు...నిద్ర మాత్రలు....

వాన బాగా పెద్దదెనట్టుంది.... ఉన్నట్టుండి లైటు వెలిగించి.

కుర్చీలోనుంచి లేచి కొన్ని క్షణాలు అటూయిటూ పచార్లు చేశాను. తర్వాతవెళ్ళి అలమారుతీసి చూస్తే నిద్రమాత్రల సీసా ఖాళీ...విసుగుతో ఖాళీసీసాను విసిరికొట్టాను. మళ్ళీ కుర్చీలో కూలబడి చొక్కా చేతులు మడతపెట్టుకున్నాను. బయట వర్షం నిలిచి జోరుగా ధారగా కురుస్తున్న సవ్వడి...

అంతలో ప్రభాకరరావు మాటలు గుర్తుకు వచ్చాయి. మాట్లాడే టప్పుడు అతని ముఖ కవళికలు గుర్తుకువచ్చాయి. అతని కళ్ళలో ఉండి ఉండి నీళ్ళు నిలవడం గుర్తువచ్చింది. గంట క్రిందట జరిగిన వృత్తాంతం మబ్బులేని పిడుగులా వుంది.

ప్రభాకరరావు క్లబ్బులో నన్ను కలుసుకుని 'ఒక్కసారి మా యింటికి రండి విశ్వంగారూ!' అనడంతోనే, నాకెలాగూ ఈ కొత్తవూళ్ళో సాయంకాలం గడవటం సమస్యకాబట్టి, ఏమీ అభ్యంతరం చెప్పకుండా అతనివెంట వెళ్ళాను. ప్రభాకరరావు యాభయ్యోపడిలో పడ్డాడు. దృఢంగా, బలంగా వుంటాడు. మర్యాదగా స్నేహంగా మాట్లాడుతాడు. ఇద్దరమూ ఎదురెదురుగా కుర్చీల్లో కూర్చుని చాలాసేపు ఏవేవో విష యాలు మాట్లాడుకున్నాము. అతడు మాట్లాడుతూవుంటే నేను అప్పు డప్పుడు మాటలు కలుపుతూ కూర్చున్నాను. అతని కుర్చీ వెనకనే గోడ మీద ఒకచిన్న పాతకాలపు ఫోటో వ్రేలాడుతున్నది. అప్పుడు నేను లేచాను. లేచి అటూ యిటూ తిరుగుతున్న వాడినల్లా ఆ ఫోటో దగ్గరకి వెళ్ళాను. ఆ ఫోటోను దగ్గరినుంచి చూశాను. చూడగానే నా కళ్ళు మెరిసి వుండాలి. ప్రభాకరరావు అప్పుడు వెనుదిరిగి చూసి 'ఓహో! ఆ ఫోటో చూస్తున్నారా?' అంటూ లేచి వచ్చాడు. నేనేమీ మాట్లాడలేదు. అప్పుడతను ఆ ఫోటోచేతిలోకి తీసుకుని చాలా గంభీరంగా మారిపోయి 'నేనొక మనిషి కోసం వెదుకుతున్నానండీ...చాలాఏళ్ళనుంచీవెదుకుతున్నాను' అన్నాడు. బయట మబ్బులు... నల్లని మబ్బులు గుమిగూడి వున్నాయి. నేను మళ్ళీ తిరిగివచ్చి కుర్చీలో కూర్చున్నాను.'ఎవరామనిషి?' అని అడిగాను. అతను నిట్టూర్చి ముందుకు నడుస్తూ 'ఏమో తెలీదు. అతని పేరు తెలీదు. ఊరూ తెలీదు. కానీ వెదుకుతున్నాను' అన్నాడు. ఇప్పుడు బయట

ఆకాశంలో మబ్బులు గుంపులు గుంపులుగా చేరి గర్జించడం వినిపిస్తున్నది. నేనిప్పుడూ ఏమీ మాట్లాడలేదు. అతడే మళ్ళీ కుర్చీలో కూర్చుంటూ —

'ఆ మనిషిని గురించి ఏమీ తెలీదు. అసలు పేరేమిటో కూడా తెలీదు. ఒక్క వివరం తప్ప...' అన్నాడు.

నేను ముందుకు వంగి 'ఇంతకీ... ఆ మనిషి కోసం ఎందుకు వెదుకుతున్నారు?' అని అడిగాను.

అతని కళ్ళలో చిత్రమైన కసి కనిపించింది. ఏదో గొణుక్కున్నాడు. తర్వాత తాపీగా సిగిరెట్టు వెలిగించుకుని 'ఆ మనిషి దొరికితే చంపెయ్యాలి....' అన్నాడు. బయట మబ్బులు గొప్ప యుద్ధానికి సన్నద్ధమై వున్న పెద్ద సైన్యంలా వున్నాయి. ఆ నల్లని మబ్బుల వెనక గొప్ప కోలాహలం...

ప్రభాకరరావు మాటలువిని నేను ఉలిక్కిపడ్డాను. అతడు మళ్ళీ కుర్చీలో సర్దుకుని కూర్చుంటూ 'అవును... దొరికితే వాణ్ణి చంపెయ్యాలి...' అన్నాడు. అంతలోనే అతని కళ్ళలో నీటి పొరకమ్మడం నేను గమనించాను. అది నా కళ్ళ బడకుండా మొహం త్రిప్పుకున్నాడు. 'ఆ మనిషినిగురించి ఒక్క వివరం మాత్రం తెలుసు... అతని మోచేతిపై భాగంలో జీడిగింజంత మచ్చ .. పుట్టు మచ్చ... ఉంటుంది. ఏ చేతికో తెలీదు' ఈ మాటలంటున్నప్పుడే అతని కళ్ళనిండా నీళ్ళు నిలిచాయి. అంతలో మళ్ళీ నెమ్మదిగా 'ఇంత జీవితం గడిచిపోయింది. ఆ మనిషిని కలుసుకోకుండానే గడిచిపోయింది. అయినా ఎలా చెప్పండి. యెలా కలుసుకుంటాను? రోజూ యింతమందితో వ్యవహరిస్తున్నాను. ఇంత ప్రపంచంలో, ఇంతమంది మనుషులలో ఆ మనిషిని ఎలా గుర్తుపట్ట గలను? ఎంతమంది చేతులు పరీక్ష చేయను? ఎవరి చేతులని పరీక్ష చేయగలను? ఆ పుట్టుమచ్చ వున్నవాడెవరో ఎలా తెలుస్తుంది?" అంటూ గొంతు రుద్ధంకావడంవల్ల ఆగిపోయాడు.

నేను మాటా పలుకూ లేకుండా యెదురుగా కిటికీలోనుంచి కనిపిస్తున్న మబ్బులవంక చూస్తూ కూర్చుండిపోయాను. మళ్ళీ అతడు మొహం

పక్కకు తిప్పుకుని కళ్ళు తుడుచుకున్నాడు. తర్వాత నెమ్మదిగా 'అది సాధ్యంకాదు. నేనా మనిషిని కలుసుకోవడం జరగనిపని. ఇప్పుడు మీరు నా ముందున్నారు. పెద్దవారు. పెద్ద ఉద్యోగస్తులు. ఆ పుట్టుమచ్చకోసం మీ చేతులు చూడనా? ఇలా ఎంతమందిని, ఎంతకాలం, ఎక్కడని పరీక్ష చెయ్యను? లాభం లేదు. అది జరగనిపని...' అంటూ నిట్టూర్చాడు.

నేనలాగే కూర్చున్నాను. కదలకుండా రాతిబొమ్మలా కూర్చు న్నాను. అతడంతలో లేచివెళ్ళి ఆ ఫొటో అందుకుని వచ్చి మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు. ఎందుకో ఒక్కసారి నవ్వాడు. తర్వాత నెమ్మదిగా ముందుకువంగి 'ఈ ఫొటోలో ఉన్న ముగ్గురిలో ఒకామె నా చెల్లెలు... ఇప్పుడు బతికున్నదో లేదో, బతికుంటే ఎక్కడున్నదో తెలీదు. నాకు తెలుసుకోవాలని కోరిక కూడా లేదు. (ఈ మాటలంటూ వుండగా అతని గొంతు బొంగురుపోయింది. అంతలో మళ్ళీ తమాయించుకున్నాడు) మిగిలిన యిద్దరూ దాని స్నేహితురాళ్ళు. పెద్ద స్నేహమేమీ కాదను కోండి. కొన్ని నెలల స్నేహం. అంతే...ఇదుగో, చివర ఉన్న అమ్మాయి ఒక జడ్జిగారి కూతురు...ఇప్పుడో పెద్ద పోలీసాఫీసరు భార్య...ఆయన పేరు... ఏమిటబ్బా?... ఆఁ! వివేకానంద... ఆయన డీవైయస్పీ అనుకుం టాను. ఇప్పుడు గుంటూర్లో ఉంటున్నారు. వారికి ముత్యాల్లాంటి పిల్లలు... ఈ చివర ఉన్న అమ్మాయిపేరు నాకు తెల్సు... సావిత్రి... ఆమె పెళ్ళి చేసుకోలేదు. ఇప్పటికి చేసుకోలేదు. గూడూరు హైస్కూల్లో టీచరు... ఇక మూడోది మా చెల్లెలు...' అంటూ గొంతు సద్దుకుంటూ ఒక్కక్షణం ఆగాడు. తర్వాత సిగరెట్టు కిటికీలోనుంచి విసిరిపారేసి చేతి వ్రేళ్ళు విరుచుకుని, 'నాకు ఒక్కతే చెల్లెలు...బంగారపుబొమ్మ-పందొమ్మిదేళ్ళు గారాబంగా పెరిగింది...ముద్దుగా పెరిగింది... తర్వాత... తర్వాత...' అంటూ ఆగి కణతలు నొక్కుకున్నాడు. అంతలో అకస్మాత్తుగా 'ఏమిటో —అనవసరమైన విషయాలు మాట్లాడేస్తున్నాను. మీరేమీ అనుకోకండి... అన్నట్టు... మళ్ళీ ఒకసారి కాఫీ పుచ్చుకుంటారా?' అని అడిగాడు.

నేను 'వొద్దొద్దు—కాఫీ వొద్దు—చెప్పండి మీ చెల్లెలి కేమయింది?' అన్నాను. అతడు అదొక రకంగా నవ్వుతూ లేచి 'ఏమయిందని చెప్పను?

చెబితే మీరు అసహ్యించుకుంటారు. అయినా చెబుతాను. మాచెల్లెలువున్న ట్టుండి ఒక్క-నాడు తెల్లవారేసరికి ఇంట్లో కనిపించలేదు. ఒక చీటీ వ్రాసి పెట్టి ఎక్కడికో వెళ్ళిపోయింది అంటూ అతడు బీరువా దగ్గరికి నడిచి అందులో ఏదో అరలో ఏదో పుస్తకంలో ఉంచిన చిన్న కాగితం తెచ్చి నాకు అందించాడు.

చాలా పాతకాగితం-మడతలు పడిపోయి రెండు ముక్కలుగా ఊడిపోతున్నది. అందులో ఎక్కువగా చదువుకోని ఆడపిల్ల దస్తూరీ-బహుశా హడావిడిగా వొణుకుతున్న చేత్తోవ్రాసిన వ్రాత. నేను లోలోపల చదువుకున్నాను. పైన 'అన్నయ్యా!' అని సంబోధన ఉంది.

'నాకోసం వెతకవద్దు. నిర్భాగ్యురాలిని. మీ ముఖం చూడలేను. ఈ యింట్లో ఉండలేను. వెళ్ళిపోతున్నాను. ఎక్కడికో యింకా నిర్ణయించుకో లేదు. (ఇక్కడ ఏదో వ్రాసి కొట్టివేసివుంది) చచ్చిపోదలచుకోలేదు. అన్నయ్యా! మీ కెప్పుడైనా, ఎన్నేళ్ళకైనా, మోచేతి పైభాగాన జీడిగింజంత పుట్టుమచ్చ వున్న వ్యక్తి కనిపిస్తే అతన్ని మీరు గుర్తిస్తే నేను చచ్చిపోయానని అబద్ధం చెప్పండి చాలు. ఈ మాటల మధ్యలో ఒకపేరు కొట్టేసి వుంది-

ఇవే మాటలు-ఆ వుత్తరంమీద కన్నీటి బొట్టు ఆరిన గుర్తులు-ప్రభాకరరావు మళ్ళీ ఆ చీటీ అందుకుని శ్రద్ధంగా అదే పుస్తకంలోదాచి, అదే అరలో పెట్టి బీరువా తలుపు మూశాడు. తర్వాత నా ముందు కూర్చుని నుదురు రుద్దుకున్నాడు. అంతలో వాచీ చూసుకున్నాడు.

బయట వర్షం మొదలుకాలేదుగానీ అందుకు అంతా సిద్ధంగా వుంది. ఒక్కగాలి విసురు మళ్ళితే చాలు, ఇక కుండపోతగా వర్షం మొదలయ్యేట్టున్నది.

నేను లేచాను. ప్రభాకరరావు తానుకూడా లేచి 'సరేనండి పొద్దు పోయింది. వర్షం కూడా వొచ్చేట్టుంది' అన్నాడు. తర్వాత నన్ను గుమ్మంవరకూ సాగనంపాడు. నేను చీకట్లో నెమ్మదిగా నడిచి యింటికి చేరుకున్నాను.

ఇప్పుడు — పక్కమీద నిద్రపట్టక దొర్లుతున్నాను. బయట వర్షం — కిటికీ రెక్కలమీద చప్పుడవుతున్నది. కిటికీలో ఆ పక్షి ఏదో యింకా కువకువ లాడుతున్నట్టే వున్నది. నేనులేచి కిటికీతలుపులు తెరిచి చూశాను. జల్లు 'రివ్వు'న కొట్టింది. అక్కడ ఏపక్షిలేదు. అంతానాభ్రమ.

మళ్ళీ పడుకున్నాను. నిద్రమాత్రలు నిండుకోవడం చాలా బాధ అనిపించింది. మనసంతా అల్లకల్లోలంగా ఉన్న సముద్రంలాగున్నది. బయట ఆకాశంలో ఉరుములు, మెరుపులు...బలవంతంగా కళ్ళు మూసుకున్నాను. మగతగావుంది. మత్తుగావుంది. ఆ మత్తులో ఏవో తెరలు కదిలాయి...ఏవో దృశ్యాలు...

(చుట్టూ మంచు... దట్టంగా పొగమంచు...

'ప్రియా !'

'ష్ ! ఏమిటా పిలవడం ?'

'నీ పేరు ప్రియంవద కదామరి ? ఇంకెలా పిలవాలి ?'

'ఎవరైనా చూస్తారేమో!'

'మనం ఎవ్వరికి కనిపించం ... చూడు మనచుట్టూ మంచు ఎలా దట్టంగా పట్టిందో...సిల్కు తెరలు కట్టినట్టు...'గలగలమని నవ్వు...)

ఉలిక్కిపడి లేచాను.. దాహమవుతున్నది. నెమ్మదిగా లేచి కూజా వంచుకుని గ్లాసెడునీళ్ళు గటగట తాగేశాను. మళ్ళీ కిటికీపక్కన పక్షి కూస్తున్న సవ్వడి...ఇంకా భ్రమ...

గడియారం చూస్తే అర్ధరాత్రి దాటింది. నాకు నిద్ర రావడం లేదు. రాదు. సిగిరెట్ వెలిగించి కూర్చున్నాను. బయట వర్షంరొద... మళ్ళీ కొత్తయింటి వాసన...గోడలకు కొత్తగా కొట్టిన సున్నం వాసన... అలాగే వెనక్కువాలి కళ్లు మూసుకున్నాను.

కారులోపోతున్నాను. రోడ్డంతా గతుకులు–ఒక రెండు ఫర్లాంగుల మేర రోడ్డుకటూ యిటూ సనాతన యోగులవలె నిలుచున్న చెట్లు...ఎండ లేదు. తేమ గాలి 'రివ్వు'న వీస్తున్నది.

కారు మరో అరగంట నడిచిన తర్వాత వర్షం మొదలైంది.. పెద్ద వర్షం... ఇదేదో గాలివాన... ఎక్కడో వాయుగుండం పడివుండాలి.. లేకపోతే ఎడతెరిపి లేకుండా ఈ వర్షం ఏమిటి?

వైపర్లు 'టిక్‌టిక్'మని చప్పుడు చేస్తున్నాయి. పక్కన అద్దాల మీద నీటిచుక్కలు పడి వరుసగా క్రిందికి జారుతున్నాయి. వాటిలో రకరకాల దృశ్యాలు...

('ప్రియా!'

'మళ్ళీ అదే పిలుపు — వొద్దన్నానా?'

'ఇంకెలా పిలవను?'

'ఏమో, నాకు తెలీదుబాబూ! అదుగో, ఆ పిచ్చిపనులే వొద్దన్నాను...అంతలోనే కోపమా? ఇదుగో యిటుచూడండి... చక్కగా మాట్లాడరూ?'

'కొండమీద చూడు మబ్బులెలా వ్రేలాడుతున్నాయో!'

'మబ్బులు వ్రేలాడటం ఏమిటీ?' గలగలమని నవ్వు—)

ఎదురుగా పిడెవడో లారీవాడు లైట్లతో వస్తున్నాడు. రోడ్డంతా జారుతున్నది. బురదబురదగా వుంది. రోడ్డు కటూయిటూ, నేల అంతా ఆకుపచ్చరంగు తివాచీ పరిచినట్టున్నది. కన్నులకింపుగావుంది. తడి తడిగావుంది. మబ్బులు గుత్తులు గుత్తులుగా ఆకాశంలో వ్రేలాడుతున్నాయి. వర్షంలో తడిసిన ఈ పిట్ట ఏదో నెమ్మదిగా రెక్కలూపుకుంటు ఎగిరిపోతున్నది.

వైపర్లు వేగంగా పనిచేస్తున్నాయి. కారు అద్దాలమీద నీటి బిందువులు-అవి యింకా అల్లిబిల్లిగా క్రిందికి జారుతున్నాయి. రోడ్డుపక్కన నిండుగా ఎర్రనిపూలు పూసిన ఈ చెట్టు పేరేమిటి? ఏమో, మనకు తెలియదు. ఎవరూ, ఎన్నడూ చెప్పలేదు — మళ్ళీ అద్దంమీద దృశ్యాలు—

('చినుకులు—పద పద—పరుగెత్తి మెట్లెక్కు—'

'ఇప్పుడీ వర్షం ఏమిటి?'

'అకాలంలో వర్షం—పెద్దదే—ఇప్పుడల్లా తగ్గేట్టులేదు—ఇదుగో, ఈ రుమాలు పెట్టి మొహం తుడుచుకో—

'ఈ రుమాలుమీద 'వి' అని వుందే'

'అది నాది కాదులే..విశ్వం అని ఒక స్నేహితుడిచ్చాడు'

'నేను 'బి' అనే అక్షరంతో చక్కగా కుట్టి ఒక రుమాలు మీకు యిస్తాను!'

'ఎప్పుడు?'

'రేపు... లేకపోతే ఎల్లుండి—'బి' అనికాదు. మీ పూర్తిపేరు కుట్టి యిస్తాను – ఎర్రదారంతో – అన్నట్టు ఎరుపు మీకిష్టమేనా? అలా వొద్దులెండి – మిమ్మల్ని అందరూ 'బిందు' అని పిలుస్తారన్నారుగా? బిందు అని కుట్టియిస్తాను ఏం?'

'మహాప్రసాదం – నీ బంగారుచేతులతో యిస్తే—

'ఇష్—అలా మాట్లాడకండి నాకేమిటోగా వుంటుంది'

'ఎలా ఉంటుంది చెప్పు...'

'అబ్బ ఉండండి...')

ఈ కారువాడెవడో నీళ్ళను చిందగొడుతూ వేగంగా దూసుకుపోతున్నాడు. ఎందుకంతవేగం? ఎక్కడేం కొంపలు కాలిపోతున్నాయో!

ఈ మబ్బులిక్కడ తెల్లతెల్లగా రెల్లుపూలతో పందిరి వేసినట్టున్నాయి. ఈ వర్షం యిప్పట్లో పూర్తిగా తగ్గేట్టులేదు.

కొంచెం కష్టంమీద యిల్లు కనుక్కున్నాను. కారు వీధిలో ఆపి దిగి గేటు దాటుతూవుండగా నల్లని పులిలాటి కుక్క భయంకరంగా అరుచుకుంటూ మీదికి దూకింది. వర్షపుజోరు తగ్గింది...సన్నని తుంపరలు మాత్రం పడుతున్నాయి.

అంతలోనే 'ఏయ్! టామీ!' అన్న మందలింపు విని కుక్క అరవడం ఆపి అనుమానంగా నావంక చూస్తూ అక్కడే కూర్చుండిపోయింది. నేను వరండాలోకి చూశాను. ఆమె అక్కడే నిలబడి వుంది. మనిషి నిండుగా హుందాగా వుంది.

నేను మెట్లెక్కి వరండాలోకి వెళ్ళి ఏమి మాట్లాడాలో తెలియక తటపటాయిస్తూ ఒక్కక్షణం నిలబడ్డాను.

ఆమె అంతలో 'ఎవరికోసమండీ? అలా కూర్చోండి' అన్నది.

నేనామె వంకచూసి నెమ్మదిగా, 'మీరేనా వివేకానందంగారి...' అంటూ ఆగిపోయాను.

'అవునండీ. మీకు వారితో ఏమన్నా పనివుందా ?'

'వారితో కాదులెండి...మీతోనే పనివుంది' అంటూ కూర్చుని నుదురు తుడుచుకున్నాను.

ఆమె కళ్ళు పెద్దవిచేసి చూస్తూ 'ఏమిటది?' అని అడిగింది.

నేను నెమ్మదిగా 'నాకు ఒక మనిషి ఆచూకీ కావలసివచ్చి తిరుగుతున్నాను...'

'అయితే అది మావారిపనే...' అన్నదామె నవ్వుతూ.

'కాదండీ నన్ను చెప్పనివ్వండి ... ఇది చాలా ఏళ్ళ క్రిందటి సంగతి ...మీకు గుర్తుండి వుంటుంది. మీకు ప్రియంవద అనే స్నేహితురాలుండేది. ఆమె, మీరు, మరొక స్నేహితురాలు కలిసి ఫోటో కూడా తీయించుకున్నారు—'

ఆమె భ్రుకుటి ముడిపడింది. కొద్ది క్షణాలు ఆలోచనలో పడింది. తర్వాత తను కూడా కూర్చుని చూపుడువ్రేలు బుగ్గమీద ఆనించుకున్నది. ఉన్నట్టుండి...'అవును...గుర్తున్నది...ప్రియంవద చక్కనిఅమ్మాయి... ఆమెకో అన్నగారుండేవారు. నేనెప్పుడూ ఆయన్ను చూళ్ళేదనుకోండి — మీరేనా ఏమిటి? అవును ఆ ఫోటోకూడా మా యింట్లో మొన్న మొన్నటి దాకా వుండాలి. చాలా పాతఫోటో—ట్రాన్స్ఫర్లూ, ఇళ్ళు మారడాలూ, ఈ గొడవల్లో ఎక్కడ పోయిందో ఏమో! ఇప్పుడు కనిపించడం లేదు' అన్నది.

నేను నిటూర్చాను. 'మీరేనా ఆమె అన్నగారు ?' అన్న ఆమె ప్రశ్నకు జవాబు చెప్పకుండా నెమ్మదిగా 'ఆమెను గురించే వెదుకుతున్నాను. ఆమె ఎక్కడ వుందో మీకు తెలిస్తే దయచేసి చెప్పండి — మీకు ఆజన్మాంతమూ...' అన్నాను.

'మీరు పెద్దవారు...అలా అనకూడదు. ఉన్న విషయం చెబుతున్నాను. ఆమెను అదే నేను చివరిసారిగా చూడటం. తర్వాత ఆమె

ఎలావుందో ఎక్కడవుందో నాకసలుతెలీదు. కొన్నాళ్ళపాటు మా స్నేహం మాటి మాటికీ గుర్తువొస్తూ వుండేది. ఇప్పుడదికూడా లేదు. అయినా, ఆమెకేమయింది? ఎందుకు మీరిలా...'

నేను డీలా పడిపోయాను. కుర్చీలో వెనక్కువాలి అలసటగా ఒక్క క్షణం కళ్ళుమూసుకున్నాను.

ఆ తర్వాత లేచి 'వెళ్ళొస్తానండీ' అంటూ మెట్లు దిగుతున్నాను. ఆమె వెనకనుంచి 'కొంచెం కాఫీ తీసుకుపోదురుగాని, ఉండండి...' అంటున్నది. నేను వెను దిరిగి చూసి 'ఒద్దండీ...తొందరగాపోవాలి... చాలా దూరం పోవాలి' అన్నాను. ఆమె ఆమాట విని అదొక రకంగా చూసింది.

మరో అయిదు నిముషాలలో ఊరుదాటి రోడ్డు మీదికి వచ్చేసరికి చల్లనిగాలి 'రివ్వు'న వీస్తున్నది. ఆకాశం యింకా నీళ్ళ సంచీలాగే వుంది. అడవి పావురం మెడరంగులోవున్న మబ్బులు గుమిగూడి ఉన్నాయి. అవి ఉండి ఉండి గర్జిస్తూ, ఉరుముతూ వున్నాయి.

రోడ్డు పక్కన ఒకచోట ఒక అమ్మాయి, ఒక అబ్బాయి...వారి వెంట ఒక ట్రంకుపెట్టె .. దానిమీద యిద్దరూ సర్దుకుని కూర్చుని వున్నారు. నేను దూరం నుంచే కారువేగం తగ్గించాను. ఆ అబ్బాయి ఆశగా ఆదురాగా లేచి నిలబడి చెయ్యి చాపాడు. కారు ఆపాను.

అతడు 'బస్సులు లేవండి...ప్లీజ్... పదిమైళ్ళు వెళ్ళాలి...పది గంటలకల్లా వెళ్ళకపోతే మా ఆఫీసరు మండిపడతాడు...' అన్నాడు ఆత్రుతగా...

ఆ అమ్మాయికూడా లేచినిలబడింది. నేను ఆ యిద్దరి వంకా మార్చి మార్చి చూశాను. తర్వాత వెనక తలుపు తీసి 'రండి' అన్నాను. ఇద్దరూ గబగబవచ్చి ఆ ట్రంకు పెట్టె లోపల పెట్టుకుని కూర్చున్నారు. కారు ముందుకు సాగింది.

నేను ఎదురుగా అద్దంలోకిచూస్తూ కారు నడుపుతున్నాను. ఆ అమ్మాయి ముచ్చటగా వుంది. అమాయకంగా వుంది. అందంగా వుంది. ఆ అబ్బాయి ముచ్చటగా వున్నాడు. అమాయకంగా వున్నాడు.

'ప్రపంచంలో అంతా మంచితప్ప మరేమీలేదు—' అని నమ్ముతున్న వాడిలా వున్నాడు. పది గంటలు దాటినతర్వాత ఆఫీసుకుపోతే అతని ఆఫీసరు మండిపడతాడట. టు హెల్ విత్ దట్ ఆఫీసర్!

అంతలో మళ్ళీ సన్నగా జల్లు మొదలైంది. అద్దంమీద నీటి బిందువులు జారుతున్నాయి. అంతలో మళ్ళీ నీడలు...

("ఏమండీ! మీరు మళ్ళీ ఎప్పుడొస్తారు"

'వారంలో... కాకపోతే పదిరోజుల్లో..'

'అమ్మో! అన్ని రోజులే..'

'తప్పకుండా వస్తానుగా... నామాట నమ్ము...'

'మిమ్మల్నే నమ్మాను... అయినా యిప్పుడెందుకో భయంగా వుంది..

'ఎందుకూ భయం?'

తర్వాత నిశ్శబ్దం... జలార్ద్రములై తళతళలాడే పెద్ద కళ్ళు...)

ఇక్కడ రోడ్డు కడ్డంగా పెద్ద చెట్టు పడిపోయి వుంది. ఎదురుగా వస్తున్న ఒక కారు డ్రయివరు చాలా జాగ్రత్తగా, నేర్పుగా నడుపుకుంటూ వచ్చాడు. నేను అంతసేపూ కారు ఆపి కూర్చున్నాను. వెనుదిరిగి ఆ అబ్బాయివంక చూశాను. అతని కళ్ళల్లో... భయం... అతని గుండెల్లో ఆ కర్కోటకుడైన ఆఫీసరు... 'భయం లేదు నాయనా! నిన్ను మెముకు మీ వూరు చేరుస్తాను. ఈలోపల వర్షం రానీ, పిడుగులు పడనీ, చెట్లు సమూలంగా కూలిపోనీ... నేను లెక్క చెయ్యను. నువ్వు హాయిగా, తీరికగా ఆఫీసుకు వెళ్ళవచ్చును' అనుకున్నాను. జాగ్రత్తగా, కూలి పోయిన చెట్టు తప్పించి కారు పోనిచ్చాను. అవతలివైపుకు వెళ్ళగానే ఆ అబ్బాయి ముఖంలో అమ్మాయి ముఖంలో సంతోష రేఖలు చూశాను. కారు రివ్వున ముందుకు సాగింది. మళ్ళీ నా ఎదురుగా అద్దంలో దృశ్యం

('ఏమండీ! మీ ధంపమీద ఈ పుట్టుమచ్చ ఎంత బావుందో!'

'పుట్టుమచ్చ బాగుండటం ఏమిటి?'

'మీకేం తెలుసు? అది గొప్ప అదృష్టం...')

అంతలోనే పై పంచెతో నుదురు తుడుచుకుని వేగం హెచ్చించాను. మరో అయిదారు నిముషాలలోనే ఆ అబ్బాయి 'వొచ్చేశాం సర్! ఆపండి...' అన్నాడు. కారు పక్కకు తీసి ఆపాను. వాళ్ళిద్దరూ దిగారు. అతడు ట్రంకు పెట్టె చేత్తో పట్టుకుని 'చాలా థ్యాంక్స్ సర్... గొప్ప మేలు చేశారు'... అన్నాడు.

నేనేమీ మాట్లాడలేదు. బహూశా పేలవంగా నవ్వి వుంటాను. తల ఊపి వుంటాను.

ఇంకా... ఇంతదూరం వచ్చినా, ఇన్ని గంటలు ప్రయాణం చేసినా, వర్షం... వర్షం... ఈ మబ్బులు నా నెత్తిమీదే, నాతో పాటే ప్రయాణం చేస్తున్నట్టున్నాయి.

ఊరంతా అసహ్యంగా వుంది. ఊళ్ళో రోడ్లన్నీ బురదగా అసహ్యంగా వున్నాయి. రోడ్లమీద మట్టి అంతా వర్షానికి కొట్టుకుపోయి మొనదేలిన రాళ్ళు పైకి తేలి వున్నాయి. సాయంకాలం నాలుగున్నరే అయినా చీకటి పడుతున్నట్టుగా వుంది. వారినీ వీరినీ అడుగుతూ హైస్కూలు చేరుకున్నాను.

ఎర్రని కొండరాళ్ళతో కట్టిన ప్రహరీ... లోపల విశాలమైన ఆవరణ... ఆవరణలో నిద్రగన్నేరు చెట్టు...

కారులోనుంచి దిగగానే ముందుకు తూలాను. ఇన్నేళ్ళుగా ఉపయోగించిన మందులూ, నిద్ర మాత్రలూ, ఇప్పుడు పనిచేస్తున్నట్టున్నాయి. ముసలివాడినై పోతున్నట్టున్నాను. ఇక ఇలాటి సందర్భాలలో ఉపయోగించుకునేందుకు ఒక దిట్టమైన చేతికర్ర కొనుక్కోవడం మంచిది...

లోపల చెట్ల క్రింద పిల్లలు... రంగు రంగుల పూల వలె అమాయకంగా, స్వచ్ఛంగావున్న పిల్లలు... నేను వరండాలో నెమ్మదిగా నడిచివెళ్ళి హెడ్మాస్టరు రూముముందు కూర్చునివున్న బంట్రోతును వివరం అడిగాను. వాడు ఒక్క క్షణం ఆగి 'సావిత్రమ్మగారా? అదుగో,

ఎదురుగా పాక వుందే...అందులో వుంటారు' అన్నాడు.

నా గుండెలు ఒక్క క్షణం దడదడలాడాయి. నుదుట చెమట పడుతూ వుంటే తుడుచుకుని నిద్ర గన్నేరు చెట్టు క్రింద కొద్ది క్షణాలు నిలబడ్డాను. గాలి విసిరినప్పుడల్లా ఆకులమీద నిలిచివున్న నీటి బిందువులు 'టపటప'మని పైనుంచి పడుతున్నాయి. తల ఎత్తి పైకి చూశాను. మెత్తని పూలు కొన్ని ఉన్నాయి.

('అబ్బ! భలేవారండీ మీరు! ఆ కొమ్మ వూపారా? మళ్ళీ వాన మొదలైందనుకున్నాను.'

'వాన వస్తే ఏం? హాయిగా ఇక్కడే కూర్చుండి పోవచ్చు...'

'మీకేం? ఎన్నయినా చెబుతారు. ఇంటికి పెందరాళే వెళ్ళకపోతే మా అన్నయ్య ..'

'మీ అన్నయ్య పేరేమిటి? మంచివాడు కాదా?'

'ప్రభాకరరావు...నాకు మా అన్నయ్యను చూస్తే భయమూ, భక్తి రెండూనూ...ఎంతెంత పెద్ద పుస్తకాలు చదువుతాడనీ...'

'ఇదుగో, ఈ పువ్వు చూడు. ఎంత మృదువుగా వుందో...'

గలగలమని నవ్వు...

'సరే సంబడం... నిద్రగన్నేరు పువ్వు మృదువుగా ఉండక కంకర రాయిలా వుంటుందా మరి?')

"ఏమండీ! సావిత్రమ్మగారెవరు?"

అక్కడ కూర్చుని మాట్లాడుకుంటున్న నలుగురూ నా ప్రశ్న విని నావంక తిరిగి చూశారు. ఒకామె లేచింది. ఆమెకు నలభై అయిదేళ్ళుండ వచ్చు...నల్లని చీరె కట్టుకుని తెల్లని జాకెట్టు వేసుకుని వుంది. చాలా మంచిగా, నమ్రతగా వుంది. తలలో పూలు వున్నాయో లేదో నేను గమనించలేదు.

ఆమె 'నేనేనండి... ఏంకావాలి మీకు? ఎవరు మీరు?' అని అడిగింది.

నేను సందేహిస్తూ 'మీతో ఒక్క నిముషం మాట్లాడాలి...' అన్నాను.

ఆమె కళ్లు పెద్దవి చేసుకుని ఒక్క క్షణం నా వంక చూసింది. తర్వాత ఏమనుకున్నదో ఏమో, మిగిలిన వారితో 'ఇప్పుడే వస్తాను... ఉండండర్రా...' అని చెప్పి ఇవతలికి వచ్చింది.

ఇద్దరం పది అడుగులు వేసి మరొక రూముకు వచ్చాము. అక్కడెవరూ లేరు. ఆమె 'కూర్చోండి...చెప్పండి...' అన్నది.

నేను నుదురు రుద్దుకుంటూ కూర్చున్నాను. రెండుసార్లు గొంతు సవరించుకుంటే గాని మాట వెలికి రాలేదు. 'నేను...నేను చాలా దూరంనుంచి వస్తున్నాను. చాలా ఆశతో వస్తున్నాను. మీవల్ల ఒక వ్యక్తి వివరం తెలుస్తుందన్న ఆశతో. కు తెలిస్తే తప్పక చెబుతానని మాట యివ్వండి...' అన్నాను.

ఆమె ఆశ్చర్యంగా చూసి 'మీరెవరో నాకు తెలీదు. వయసుకు పెద్దవారు కాబట్టి...ఏదో ఆదుర్దాగా కనిపిస్తున్నారు కాబట్టి, అలాగే... నాకు తెలిసిన వివరమైతే తప్పక చెబుతాను' అన్నది.

నేను నెమ్మదిగా 'చాలా యేళ్ళ క్రిందటి సంగతి... మీకు ప్రియంవద అనే స్నేహితురాలుండేది. మీరు కొన్ని నెలలు మాత్రం స్నేహంగా వున్నారు. మీరు ముగ్గురు...ఒకామె యిప్పుడు గుంటూర్లో వుంటున్నారు...ఆమె పేరు నాకు తెలీదు. పోలీసాఫీసరు భార్య...' అంటున్నాను.

ఆమె అకస్మాత్తుగా 'అవును...లక్ష్మి...' అన్నది. తర్వాత ఆమె చూపులు నా మీదనే నిలిచాయి. ఉన్నట్టుండి 'ప్రియంవద... గుర్తు లేకేం...నిక్షేపంగా గుర్తున్నది... అది సరే. అసలు విషయం చెప్పండి' ...అన్నది మళ్ళీ...

నాకు విపరీతమైన దాహం వేస్తున్నది... నాలికతో పెదవులు తడుపుకుని 'అవును. ప్రియంవద...ఆమెను గురించిన వివరంకావాలి... గంపెడాశతో వచ్చాను. దాచక చెప్పండి...' అన్నాను.

'వివరం అంటే ?' అని ఆమె రెట్టించింది.

నా గుండెలు దడదడకొట్టుకుంటున్నాయి. మెల్లిగా 'అంటే... ఆమె ఎక్కడ ఉందో, ఎలా వుందో చెప్పండి—దయచేసి' అన్నాను. నా గొంతు రుద్ధమైపోయింది.

ఆమె చిత్రంగా చూసింది. అంతలోనే 'మీరెవరు' అని అడిగింది. ఆమె చూపులు వాడిగా ఉన్నాయి.

నేను తల దించుకున్నాను 'నా పేరు విశ్వేశ్వరరావు—' అంటున్నాను.

ఆమె అకస్మాత్తుగా 'మీరెవరైతే నాకెందుకు? ఆమెను గురించి ఆరాటపడదగిన వాళ్ళిద్దరే ఉన్నారు. మొదటివారు ఆమె అన్నగారు. ఆయన పేరు నాకు తెలీదు. నేనాయన నెప్పుడూ చూడలేదు. రెండో వ్యక్తి ఒక మోసగాడు— పచ్చి మోసగాడు— అతని అసలు పేరు ప్రియుంవదకు కూడా తెలీదనుకుంటాను. ఆ యిద్దరిలో మీరెవరైనా నాకు పట్టింపు లేదు.' అంటూ ఒక్క క్షణం ఆగి 'మీరామెను చూడాలని నిజంగా అనుకుంటున్నారా?' అని అడిగింది.

'నిజంగా చూడాలి అది చాలా ముఖ్యం.'

'అలా అయితే మీరు ధైర్యం కూడగటుకోవాలి...ఆమె...'

నేను తడబడుతూ లేచాను. 'కూర్చోండి' అన్నదామె. మళ్ళీ కూలబడ్డాను.

'ఒకవేళ చచ్చిపోయిందని చెబుతానేమోనని మీరు భయపడ్డట్టున్నారు. లేదు లెండి...బ్రతికే వుంది. కాని మీలో ఆమెను చూడగల ధైర్యం ఉందా! ఆమె కొకవేళ ఏ కుష్టు వ్యాధిలాంటి భయంకర రోగమో అనుకోండి...మీరు వెళ్ళి చూడగలరా?'

నా ప్రాణాలు విలవిల కొట్టుకున్నాయి. 'అమ్మా! నాకంటె చిన్నదానివి— అయినా, నీకు దణ్ణం పెడతాను. నన్ను పరీక్షించకు. కాని—కాని—ఎట్టి పరిస్థితిలోనూ నేనామెను చూడాలి— చూసితీరాలి—' అన్నాను. నా గొంతు వొణికింది.

ఆమె నవ్వింది. 'సరే—అలాగే చూద్దురుగాని—కాని కొంచెం ఆగండి. ఇప్పుడే వెడితే మీరామెను చూడలేరు. రాత్రి తొమ్మిదిగంటల లోపుగా వెళ్ళకండి—ఎలా వెళ్ళాలో చెబుతాను వినండి' అన్నది.

ఆమె చెప్పిందంతా అతి జాగ్రత్తగా విన్నాను. మళ్ళీమళ్ళీ అడిగి

చెప్పించుకున్నాను. తర్వాత లేచాను. నా కళ్ళ వెంట ఎందుకో నీరు పొరలు కమ్ముతున్నాయి. గుండె గొంతుకలో కొట్లాడుతున్నది. విపరీత మైన దాహం—ఆకలి ఎప్పుడో చచ్చిపోయింది.

ఆమె నేను వెడుతూ వుండగా చిత్రంగా నవ్వింది. తర్వాత 'ఏమయిందిరా? తొమ్మిది గంటలకు గాని ఆ గుమ్మం ఎక్కవద్దు—' అన్నది.

నేను తల వూపి త్వరత్వరగా వచ్చేశాను. స్కూలు గేటు ఎదురుగా ఆగి వెనుదిరిగి చూశాను. ఆమె యింకా అక్కడే నిలబడి నావంకనే చూస్తూ వుండటం గమనించాను. తర్వాత వడివడిగా వెళ్ళి పక్క కొట్లో సోడా తీసుకుని తాగాను.

అంతలో బెల్లు మ్రోగింది. బిలబిలలాడుతూ పిలలందరూ బయటికి వచ్చేస్తున్నారు. కొద్ది నిముషాలలోనే అందరూ వెళ్ళిపోయారు. తర్వాత అంతటా నిశ్శబ్దం.

నేను కారు ఖాళీ స్థలంలో ఆపి కూర్చున్నాను. పొద్దుగూకు తున్నది. నిద్రగన్నేరు చెట్టుమీద పక్షులు అసంఖ్యాకంగా చేరి రొద చేస్తున్నాయి. అంతలో మళ్ళీ సన్నగా జల్లు మొదలైంది.

కాలం—చుట్టలు చుట్టుకుని పడుకున్న పెద్ద కొండ చిలువ వలె నెమ్మదిగా కదులుతున్నది. నా జీవితమంతా కాలం నెమ్మదిగా, నీరసంగా, నిరానందంగానే గడిచింది. గడియారం ముళ్ళు ఎంతకూ కదలడంలేదు. సిగరెట్లు మసి అవుతున్నాయి.

ఇప్పుడు నిజంగా చీకటి పడింది. జల్లులో తడుస్తూ కొందరు మనుషులు త్వరత్వరగా వెళ్ళిపోతున్నారు. చురాళ్ళ చప్పుడు నిర్విరామంగా వినిపిస్తున్నది. ఈ కీచురాళ్ళనేవి ఎలా ఉంటాయి? ఎక్కడ ఉంటాయి? ఏమో, నాకింత వరకూ తెలీదు.

తొమ్మిది గంటలు—శరీరంలో విచిత్రమైన ఉత్సాహం బయలు దేరింది. నరాల్లో రక్తం జివ్వున పరుగులు తీసింది. కారు దిగి అద్దాలు

పైకెత్తి తలుపులన్నీ వేసేశాను. తాళం చెవులగుత్తి లాల్చీ జేబులో వేసుకుని ముందుకు నడిచాను.

అన్నీ ముగికి వీధులు...లైట్లు అక్కడక్కడ మందంగా వెలుగుతున్నాయి. అదుగో...అదే ఆమె చెప్పిన మేడ...మేడ ఎదురుగా వీధి ఆ వీధిలో బాగా ముందుకు పోవాలి ..ఇదే నాలుగు చిన్న రోడ్లు కలిసే చోటు...ఇదే ఆమె చెప్పిన వీధి అరుగు గుర్తు...

కొద్ది గజాల దూరంలో కొన్ని క్షణాలు నిలబడ్డాను. గుండెల నిండుగా గాలి పీల్చుకున్నాను. ఆ యింటిముందు అరుగుమీద నలుగురో, అయిదుగురో మనుషులు కూర్చుని వున్నారు. ఒక గళ్ళ లుంగీవాడు పెద్ద వస్తాదులా వున్నాడు...అక్కడ గోడకానుకుని నిలబడి వున్నాడు.

నేను నెమ్మదిగా నడిచివెళ్ళి అక్కడ నిలబడ్డాను. ఆ మనుషులందరూ నావంక చూశారు. నేనేదో అడగబోయేలోగా ఆ గళ్ళలుంగివాడు ఒక్క అడుగు ముందుకు వేసి 'రండీ స్వామి' అని తర్వాత 'అరే చిన్నయ్యా!' అయ్యగార్ని లోపలికి తీసుకుపో...' అన్నాడు.

ఆ చిన్నయ్య అనబడేవాడు అక్కడే వున్నాడు. కుర్రవాడు... 'ఇటురండి సార్!' అంటూ నన్ను మెట్లెక్కించి లోపలికి తీసుకువెళ్ళాడు. నేనేమీ ఆలోచించకుండా లోపలికి నడిచాను. సన్నటి దారి...లోపలి కొన్ని గదులలో లైట్లు వెలుగుతున్నాయి. ఆ చిన్నయ్య నన్ను ఒక గదిలో కూర్చోబెట్టి నేను నోరెత్తే లోపుగా ఏమీ వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు. నేను అటూ యిటూ చూస్తూ కుర్చీలో కూర్చుండిపోయాను. గది గోడలకు లేత ఆకుపచ్చ రంగు. గుమ్మాలకు అదే రంగు తెరలు... పక్కన ఒక అలమారు...ఒక మంచం...

ఎన్నో క్షణాలు గడవలేదు. ఆ గదిలోకి ముగ్గురు అమ్మాయిలు వచ్చారు. ఒకరి ప్రక్కనే ఒకరు నిలబడ్డారు. ఎవరికీ పాతికేళ్ళకు మించి వయసుండదు. పలుచని చీరెలు కట్టుకుని వున్నారు. లోపల బాడీలు కనిపించేలా జాకెట్లు వేసుకుని వున్నారు. తాంబూలంతో వారి నోళ్ళు ఎర్రగా పండి వున్నాయి. అందరికీ తలలో పూలున్నాయి.

నే నప్పుడు ఏదో స్ఫురించి అదిరిపడ్డాను. వారు ఒకరి వంక ఒకరు చూసుకున్నారు ఏమనుకున్నారో ఏమో, వెళ్ళిపోయారు.

అంతలో పక్క గుమ్మం తెర తొలగించుకుని ఒకామె వచ్చింది. నేను ఉలికిపడి ఆమెవంక చూశాను. ఆమె జుట్టు నెరిగి వుంది. చాలా సాదా చీరె కట్టుకుని వుంది. చీరెకొంగు మెలితిప్పి మెడచుట్టూ చుట్టుకుని వుంది.

నాలో చలనం లేదు. శిలా ప్రతిమలా కూర్చుండి పోయాను. గుండె మాత్రం దడదడ కొట్టుకుంటున్నది. గుండెలో ఏ మూలనో కొద్దిగా నొప్పి...

ఆమె అక్కడే నిలబడి మాట్లాడింది. 'ఏం బాబుగారూ! పెద్ద వారు. ఏదో సరదాకొద్దీ వొచ్చివుంటారు. ఈ ముగురిలో ఎవరూ నచ్చలేదా ?'

నా నోట మాట రాలేదు. మాటిమాటికీ నుదుట పడుతున్న చెమటను తుడుచుకుంటూ అలాగే కూర్చుండిపోయాను. నా గుండె మాత్రం 'అయ్యో? ప్రియంవదా ! నీ బంగారు రంగు ఏమైపోయింది? నీ అందాల చిరునవ్వు ఏమైపోయింది ? రక్తాన్ని పరుగులెత్తించే నీ శరీర లావణ్యం ఎక్కడికి పోయింది? అసలు నువ్విక్కడ, ఇలా, ఎందుకున్నావు ?' అని కొట్టుకుంటూనే వుంది.

ఆమె ఒక్క అడుగు ముందుకువేసి 'పోనీ, ఇంకో అమ్మాయి వుంది. చూస్తారా? నా కూతురే...కాకపోతే కొంచెం డబ్బు...' అంటూ ఆగి 'అమ్మాయ్! రేవతీ! ఇలారా అమ్మా' అని కేక వేసింది.

నా కళ్ళు తెరుచుకునే ఉండిపోయాయి. గుండెలు దడదడ కొట్టుకుంటూనే వున్నాయి. ఇప్పుడు నేను లేవగలనా ? లేచి పడిపోకుండా నడవగలనా ? చేతి కర్ర కూడా లేదే...

మరుక్షణంలో గుమ్మంలో ఆ అమ్మాయి కనిపించింది. ఇరవై అయిదేళ్ళ వయసుంటుంది. తాంబూల చర్వణంతో పండిన క్రింది పెదవిని పంటితో నొక్కి పెట్టి నా వంకనే చూస్తున్నది.

నేను చివాలున లేచాను. వేదన, ఇక ఈ వేదన భరించలేను. చుట్టూ కమ్ముకుని వస్తున్న మంటల మధ్య నిలబడ్డట్టున్నది. ఇక్కడ మరో క్షణం ఉంటే ఏం మాట్లాడుతానో, ఏం చేస్తానో, ఏమైపోతానో తెలీదు. పెద్ద పెద్ద అంగలు వేస్తూ ఆ సన్నటి సందులోనుంచి నడిచి యివతలికి వచ్చాను. గబగబ మెట్లుదిగి దెబ్బతిన్న పాములా పరుగు వంటి నడక ప్రారంభించాను.

గాలి... చుట్టూ చల్లని తేమగాని... అయినా శరీరమంతటా చెమట పోస్తున్నది. వొళ్ళు కొంచెం తూలుతున్నది. మళ్ళీ విపరీతమైన దాహం...

కారు స్టార్టు చేసి ముందుకు దూకించాను. రెండు నిముషాలలో వూరి బయటికి వచ్చి మెయిన్‌రోడ్డు ఎక్కాను. తర్వాత వేగం మరింత హెచ్చించాను. కార్లూ లారీలూ 'సర్రు సర్రు'న దూసుకు పోతున్నాయి. వాటి హెడ్ లైట్లు నా చూపులను చెదరగొడుతున్నాయి. అయినా నేను వేగం తగించలేదు.

ఎంతసేపు కారు నడిపానో తెలీదు. మెయిన్ రోడ్డు పక్కన ఒక సన్నటి మట్టిరోడ్డు చీలి ఎటో పోతున్నది. అతంటా కనుచూపు మేర కటిక చీకటి. ఆ రోడ్డు వెంట ఒక యాభై గజాలు కారు నడిపి ఒక చెట్టు క్రింద ఆపాను. తర్వాత ఉన్నికే కూర్చుండిపోయాను. ఆ చుట్టు పక్కల ఎక్కడినుంచో ఏదో పూల వాసన... అడివి పూల వాసన... ఇది అంతా అడివేనేమో!

నేను కుడిచేతో ఎడమ మోచేతి పై భాగాన రుద్దుకుంటూ కూర్చుండి పోయాను. క్కడ... ఆ అసహ్యకరమైన పుట్టుమచ్చ చేతికి తగులుతున్నది. అది ఎలా రూపుమాసి పోతుంది? కాల్చుకుంటే పోతుందా? పదునైన చాకుతో అంతవరకు కోసేసుకుంటే పోతుందా? లేక ఏదయినా యాసిడ్...

అంతలో ఎదురుగా ఒక ముసలమ్మ నెత్తిమీద కుండతో రావడం కనిపించింది. ఆ కుండలో నీళ్ళున్నాయేమో! ఆ ముసలమ్మ దగ్గరికి రాగానే 'కాసిని నీళ్ళు పోస్తావా అవ్వా?' అని అడిగాను.

ఆమె ఆగి 'ఇది కల్లు బాబూ, తీపికల్లు.' అన్నది.

నేను ఉన్నట్టుండి 'ఉండు నాక్కావాలి' అన్నాను.

ఆమె ఒక గ్లాసు తీసి 'ఇది ఇరవై పైసలు...' అంటున్నది.

నేను మరేమీ మాట్లాడకుండా ఆమె కుండలోనుంచి ముంచి అందిస్తూ వుండగా తాగాను. అయిదారు గ్లాసులు తాగాను. తర్వాత లాల్చీ జేబులో నుంచి రూపాయి నోట్లు మూడో నాలుగో తీసి యిచ్చి వెళ్ళమన్నాను. ఆమె కుండ నెత్తి కెత్తుకొని వెళ్ళిపోయింది.

అంతలో మళ్ళీ వర్షం మొదలయింది. ఈసారి పెద్ద వర్షం... రాళ్ళతో కొట్టినట్టు పెద్ద పెద్ద చినుకులు. ఆకాశం భయంకరంగా ఉరుముతున్నది... గర్జిస్తున్నది.

నేను వెనక్కు వాలి కళ్ళు మూసుకున్నాను. అంతలోనే నాకు నిద్రపట్టింది. నిద్ర పట్టగానే కల మొదలు... కలలో మనుషులూ, ఏ యితర ప్రాణులూ కనిపించలేదు. అంతటా మంచు... దట్టంగా పట్టిన పొగమంచు... ఆ పొగమంచు తెరలలో ఎవరిదో ముఖం...అస్పష్టంగా వుంది. ఎవరిదో తెలియడం లేదు... కరిగిపోయే మంచు మాత్రం చివరి వరకూ మిగిలింది.

# పుష్టి

మా వెంకట్రావుగారు గొప్ప సాహిత్య ప్రియుడు.

ఎక్సైజు డిపార్టుమెంటులోనో మరెందులోనో కల్పవృక్షం లాంటి ఉద్యోగం చేస్తున్నాడు. ఎప్పుడూ తెల్లని మడత నలగని దుస్తుల్లో మల్లె పువ్వులా శుభ్రంగా వుంటాడు. అతనికి జీవితం ఎంతో సంతృప్తి కరంగా ఉంది. ఆ మాట దాచుకోడు నిర్మొహమాటంగా పైకి చెప్పేస్తాడు.

"హాయిగా తిన్నాను. ఇంట్లో ఏదీలేదని అనుకునే పని లేదు. అన్నీ వున్నాయి. ఉప్పు దగ్గర్నుంచి రోజా యాపిల్ పళ్ళ దాకా దేనికీ లోటు లేదు. ఖరీదైన చీపురుకట్ట దగ్గర్నుంచి ఫ్రిజ్ దాకా అన్నీ వున్నాయి. మొన్న మొన్ననే రేడియోగ్రాం కావాలని మా ఆవిడ పోరు పెడితే పడలేక వెంటనే కొనేశాను. గ్రామఫోనూ దానితో పాటు వందల కొద్దీ కొత్తా పాతా రికార్డులూ, పెద్దసైజు రేడియో ఇంకా రెండు ట్రాన్సిస్టర్లూ ఉండగా ఇంకా రేడియోగ్రాం ఎందుకు? అంటే మా ఆవిడా పిల్లలూ కూడా వినకుండా ఒక చిన్నసైజు విప్లవం లేవదీశారు. ఆ పోరు పడలేక కొనేశాను. అయినా మీరు మాటిమాటికీ **దేశంలో** పేదరికం, ఆకలీ అంటారు. ఎక్కడున్నాయవి? అందరూ తింటూనే వున్నారు. ఉన్నంతలో సినిమాలు చూస్తున్నారు. ఆఖరుకు చెట్టుక్రింద వండుకు తినేవాళ్లు కూడా సంతృప్తిగానే బతుకుతున్నారు. చూడబోతే మీ దృష్టిలోనే ఏదో లోపం ఉన్నట్టుంది. ఎప్పుడూ ఆకలితో చచ్చిపోయే వాళ్ళూ రోగిష్టివాళ్ళూ, అడుక్కుతినేవాళ్ళూ మాత్రమే కనబడతారెందుకు మీకు? అంటూ వుంటాడు.

ఆయనకు సాహిత్యమంటే యిష్టమని చెప్పాను కదా? సాయంకాలం ఆఫీసునుంచి వచ్చీరాగానే అందమైన అట్టలున్న పుస్తకాలు

ముందు వేసుకుని కూర్చుంటాడు. వాళ్ళ గ్రంథాలయంలోకి అప్పు డప్పుడూ తానే పుస్తకాలు 'సెలక్టు' చేస్తూవుంటాడు. ఇంట్లో అందరూ చదువుతూ కూర్చుంటారు. పిల్లలు పిల్లల బొమ్మల పత్రికలు పుచ్చుకుని కూర్చుంటారు. ఆయన భార్య త్రివర్ణ ముఖచిత్రమున్న 'బెస్ట్ సెల్లర్' నవల పేజీలు తిప్పుతూ కూర్చుంటుంది. వెంకట్రావుగారు కూడా అటు వంటిదే మరో పుస్తకంతో లీనమైపోతాడు. ఇది నాకు వెంకట్రావుగారి కుటుంబం గురించి గొప్పగా నచ్చిన విషయం.

ఆయనకు నేనంటే అభిమానం. మా ఆవిడకూ వాళ్ళ ఆవిడకూ మధ్య కూడా మంచి దోస్తీ వుంది. కాకపోతే మా ఆవిడ అప్పుడప్పుడూ ఒంటరిగా ఉన్న సమయాల్లో "ఏమండీ! ఆ భ్రమరాంబగారు ఇవ్వాళ బజారుకుపోయి నెక్లెస్ కొనుక్కుని వచ్చిందండీ. ఎంత బాగుందను కున్నారు. కళ్ళు జిగేల్మన్నాయి" అని మాత్రం అంటుంది. మరొకప్పుడు మరో రెండువందల రూపాయల ఖరీదుగల చీరగురించో, లేకపోతే వాళ్ళ ప్రెషర్‌కుక్కర్లూ గ్యాస్‌స్టవ్ గురించో, దేన్నిగురించో ఒకదాన్నిగురించి ఊరికే చెబుతూ వుంటుంది. అవి తనకు కూడా కావాలని అనదు కాని ఆ కళ్ళలో మెరుపు, ఉత్సాహం ఇవి మాత్రం స్పష్టంగా ఆ విషయం నాకు అర్థమయేట్లు చేశాయి. నేను విని ఊరుకుంటాను నాకు తెలుసు. ఒకనాడు వాళ్ళయింటికి గ్యాస్‌స్టవ్‌కుపయోగించే సిలిండర్ వచ్చింది. మా యిద్దరి పేర్లూ ఒకటే కావడంతో వాడు మాయింటిముందు ఆగాడు. 'వెంకట్రావు గారు మీరేగా?' అంటూ లోపలికి వచ్చాడు. మా ఆవిడ కూడా ముందు గదిలోకి వచ్చింది. నేను కిటికీలోనుంచి ఆ సైకిలూ, దాని వెనక ఉన్న సిలిండరూ చూసి 'పక్కయిల్లు' అని చెప్పాను. వాడు వెళ్ళిపోయాడు. మా ఆవిడ నావంక చూసింది. లోపల పొయ్యి సరిగ్గా మండటంలేదు కాబోలు కళ్ళు రెండూ ఎర్రగా జ్యోతుల్లాగున్నాయి. ఆ చూపులో నాకొక గొప్ప డైలాగే వినిపించింది. "పొయ్యిమండక ఛస్తున్నాను. పదేళ్ళ నుంచి ఇలా ఛస్తున్నాను. ఈకళ్ళెప్పుడో ఇలాగే పోతాయి. గుడ్డిదాన్నయి పోతాను. ఈ వంటపని నన్ను తినేస్తున్నది. ఇలాగే వంటయింటిని అంటి పెట్టుకుని ఇరవైనాలుగ్గంటలూ బాధపడమని దేవుడు నా నుదుట ఘట్టిగా రాసి పెట్టాడు. అయినా ఎవర్నో అని ఏం లాభం? పెట్టిపుట్టివుండాలి

దేనికైనా 'పుణ్యంకొద్ది పురుషుడూ దానంకొద్దీ బిడ్డలూ' అన్నారు" ఇన్ని మాటలు నాకా చూపుతో వినిపించాయి. తర్వాత అనవసరంగా కాళ్ళకడ్డం వస్తున్నారనే మిషతో పసివాళ్ళిద్దర్నీ నాలుగుబాది లోపలకు వెళ్ళిపోయింది. నేను నిట్టూర్చి వూరుకున్నాను.

వెంకట్రావుగారు ఒకనాడు హఠాత్తుగా మాయింటికి వచ్చాడు. చేతిలో ఒక పుస్తకంతో వచ్చాడు. చెప్పానుగా నామీద ఆయనకు అభిమానమని? ఆ అభిమానం నేను కూడా చిన్నదే అయినా గౌరవనీయమైన ఉద్యోగంలో ఉన్నానని కావచ్చు. ఉప్పుకూ పప్పుకూ లేకపోతే నెలాఖరులో 'పాతిక రూపాయల అప్పుకూ' ఆయన దగ్గరికి వెళ్ళడం లేదని కావచ్చు. లేకపోతే చచ్చోపుచ్చో ఒక రచయితనని అయినా కావచ్చు.

వచ్చీరావడమే సుడిగాలిలాగా సంరంభంగా వచ్చాడు. చేతిలో వున్న పుస్తకం నాముఖం ముందు ఆడిస్తూ "ఇదండీ నవల అంటే ఇప్పుడే చదవడం పూర్తిచేశాను. ఏమికథ, ఏమి పాత్రలు అద్భుతం" అంటూ పొగిడాడు. ఆయనకు తెలుసు నా ముందు మరొక రచయితను ఎంత పొగిడినా నేనేమీ ఇరిటేట్ కానని. నేను నవ్వి "అంత బాగుందా?" అని అడిగాను.

"బాగుందా ఏమిటి? మీరూ చదివితీరాలి. నేను చదివాను, మా ఆవిడ చదివింది. మా పెద్దమ్మాయి కూడా చదివింది. అందరిదీ ఒకటేమాట... 'అద్భుతం' అంతే...మరోమాట లేదు."

"సరే....నేనూ చదువుతాన్లెండి" అన్నాను.

ఆయన "చదవగానే సరికాదు; మీకు బాధ కలిగినా సరే అప్పులనుకుని ఒక్కమాట చెబుతాను. ఏమీ అనుకోవద్దు. ఇది చదవడమే కాదు చదివి నేర్చుకోవలసింది కూడా వుంది" అన్నాడు.

ఏమీ అనుకోవద్దనీ, బాధపడవద్దనీ ముందే చెప్పాడు కాబట్టి నేనేమీ అనుకోలేదు. నవ్వి ఊరుకున్నాను.

ఆ పుస్తకం నా ముందుంచి వెళ్ళిపోతూ, 'మీరూ అలా రాయండి.

అది నా కోరిక. ఎప్పుడూ ఆకలీ చావులూ, డబ్బు బాధలూ, రోగాలూ, వాటిని గురించి రాయకండి. అవి అస్సలు లేవనుకోండి. ఈ గుడ్డివాళ్ళను గురించీ, కుంటివాళ్ళను గురించీ, డబ్బు లేనివాళ్ళను గురించీ, పేదల గురించీ రాస్తే వాళ్ళు చదువుతున్నారా ? అందువల్ల మీరు ఏం సాధిస్తున్నట్టు? పుణ్యమా పురుషార్థమా? మీరెవరిని గురించి రాస్తున్నారో వాళ్ళు చదవరు. చదివే వాళ్ళకా ఈ ఆకలీ, వగైరా నాన్సెన్స్ నచ్చదు. అందువల్ల నా మాట విని ఒక మంచి కథ రాయండి. నవల సంగతి తర్వాత చూసుకోవచ్చు ఇదొక ఛాలెంజీగా తీసుకోండి. మళ్ళీ సాయంకాలం వొస్తాను ఇవాళా రేపూ సెలవుకదా! గట్టిగా కూర్చోండి" అంటూ వెళ్ళిపోయాడు.

నాకు మతి చెడినంత పని అయింది. పెద్దమనిషి, ఛాలెంజీ పారేసి వెళ్ళిపోయాడు. ముందున్న కాయితాలు గాలికి రెపరెపలాడుతున్నాయి. లోపలి నుంచి పిల్లల ఏడుపూ మా ఆవిడ గదమాయింపులూ వినబడుతున్నాయి. ఆ పుస్తకం చేతిలోకి తీసుకున్నాను. చదవడం పూర్తయే వరకూ లేవలేదు. ఈలోపల మా ఆవిడ రెండు మూడు సార్లు పిలిచినట్లున్నది 'పిల్లలు కూడా అన్నాలు తిన్నారు లేవండి బాబూ పన్నెండు గంటలయింది...' అన్న మాటలు కూడా వినిపించినట్లే ఉన్నాయి కాని చివరి పేజీ కూడా పూర్తిచేసి కాని నేను లేవలేదు.

"అయిందా? ఇప్పుడన్నా లేవండి. నాలుగు మెతుకులు తిని కాస్త నడుం వాల్చాలి. మళ్ళీ చాకిరీ ఉందిగా" అన్నది మా ఆవిడ. వెళ్ళి భోజనం ముందు కూర్చున్నాను. నిజమే ఆయన చెప్పిన మాట. పుస్తకం చదువుతూ వుంటే మరో అద్భుత ప్రపంచంలో విహరించినట్లుంది. ఆ ప్రపంచం ఎంతో అందంగా వుంది. అక్కడ ఆర్థిక అసమానతలూ, ఆకలీ, పేదరికమూ, ఏమీ లేవు. ఒక మంచి బ్రహ్మాండమైన ఎ. సి. హోటల్లో షడ్రసోపేతమైన భోజనం చేసినట్టున్నది. ఆ హోటల్ ముందు దీనులూ నిర్భాగ్యులూ అడుక్కుంటూ ఉంటారు. నిజమే కాని మనం వాళ్ళనెందుకు చూడాలి? వీలయితే ఆ హోటల్ వారితో చెప్పి వాళ్ళందరినీ బెత్తాలతో కొట్టించి దూరంగా తరిమివేయాలి. మళ్ళీ వాళ్ళందరూ అక్కడే

మూగవచ్చు. కాని మనం ఈ లోపల వెళ్ళి మిలమిల మెరిసే కారులో కూర్చుంటాం కదా! ఆ కారు నున్నటి రోడ్డు మీద జరజర జారిపోతుంది.

లోపలికి వచ్చి అంతకుముందు వ్రాయడం మొదలు పెట్టిన కథ మళ్ళీ చదివాను. తర్వాత వ్రాయడం కొనసాగించాను.

ఈ రైలు కోసం ఎదురుచూస్తూ ప్లాట్‌ఫారం మీద గంటకు పైగా గడిపాడు రవీంద్ర. మాటిమాటికీ కర్ణపుటాలను బద్దలుచేస్తూ ఆవిరి విడుస్తూ నడుస్తున్న ఇంజన్లూ, వుండి వుండి వొస్తూ పోతున్న రైళ్ళూ వాటి నిండా క్రిక్కిరిసి వున్న జనమూ, వారి సందడి. ప్లాట్‌ఫారం మీద కంగారుగా పరుగులు పెట్టే జనమూ, వారి కేకలూ మధ్య మధ్య బరువులు మోసుకుపోతున్న ట్రాలీలు, అవితోసే వారి హెచ్చరికలూ, ఇవన్నీ సహిస్తూ అతి కష్టంమీద గంటసేపు గడిపాడు.

ఎట్టకేలకు ఆ రైలు వస్తున్నది. దూరంగా దయ్యం కన్నులాంటి లైటు ముందు కనిపించింది. జనం అప్పటికే ఆదుర్దాగా లేచి తమతమ సామాన్లుపట్టుకుని నిలబడ్డారు. కొందరి ముఖాలలో 'ఆ రైల్లో కూర్చునేందుకు కాకపోయినా కనీసం నిలబడేందుకయినా చోటుంటుందా' అనే ఆత్రుత కనిపిస్తుంటే, మరి కొందరు రిజర్వేషన్లున్నవారు, పై తరగతి వారూ నిశ్చింతగా ఉన్నారు. మొత్తంమీద జనం ఆడవాళ్ళూ, మగవాళ్ళూ, పిల్లలూ, పాపలూ... అంతా గొప్ప హడావిడిగా ఉంది. కోలాహలంగానూ ఉంది.

రైలు వచ్చి ఆగింది. జనంలో ఆదుర్దా కూడా ఎక్కువయింది. మూడవ తరగతి రైలు పెట్టెల ముందు తొక్కిసలాటలు, కుమ్ములాటలు మొదలయ్యాయి. ప్రతి పెట్టె దగ్గరా ఆగి చూస్తూ నడుస్తున్నాడు రవీంద్ర. అంతలో "బావా! ఇదుగో ఇటు..." అని వినిపించింది. ఫస్టుక్లాసు కంపార్టుమెంట్ గుమ్మంలో నిలబడి వుంది వాణి. లేత ఆకుపచ్చని చీరె కట్టుకుని వుంది. నల్లని జాకెట్ వేసుకుని వుంది. చెవులకు రింగులు పెట్టుకుని వుంది. ఎడమ చేతికి ఖరీదైన బుల్లి వాచీ, కుడిచేతికి

ఏవో తమాషా అయిన గాజులూ ధరించి వుంది. మొత్తంమీద అద్భుతంగా అందంగా ఫస్టుక్లాసుగా వుంది. పైగా చిరునవ్వులు చిలికిస్తున్నది.

ఆమె రవీంద్రను చూసి నవ్వుతూ "బావా! వొచ్చేశావే? నువ్వు స్టేషనుకు రావనుకున్నాను" అన్నది.

అతను నుదుటిమీద పడుతున్న జుట్టు పైకి తోసుకుంటూ "రాకుండా ఎలా వుంటాను? ఇంత మహా ఘనత వహించిన మరదలు ఇన్నాళ్ళకుగానూ వొస్తూవుంటే ఆఫ్టరాల్ స్టేషనుకు రాకుండా వుండ గలనా?" అన్నాడు.

ఆమె మళ్ళీ నవ్వింది. "ఏమో నా పేరు చేరిందో లేదో, చేరినా చూశావో లేదో, చూసినా గుర్తు పెట్టుకున్నావో లేదో, గుర్తుపెట్టుకుందా మనుకున్నా గుర్తున్నదో లేదో," అంటూ ప్రారంభించింది.

అతడుకూడా నవ్వి "మొదలు పెట్టావూ." అని వూరుకున్నాడు.

"అవును మరి. మతి మరుపులో, పరధ్యానంలో తమరితో పోల్చ గలిగిన వారెవరూ లేరు కదా?"

"సరే— అంతా తర్వాత — ఇంటికి వెళ్ళి తీరిగ్గా ఆటలు పట్టిద్దువుగాని— ముందు దిగిరా—"

"కూలీ రావొద్దూ?"

"కూలీ దేనికి? అంత బరువు లేమున్నాయి?"

"సూట్ కేసు ఉందిగా మరి—"

"అది అంత బరువుగా వుందా? నువ్వుగాని అందులో కూర్చోవడం లేదుకదా? నువ్వు కూర్చోని పక్షంలో నేను పట్టుకు రాగలను దాన్ని.

"అబ్బో! బావగారికి మాటలు జోరుగానే వొస్తున్నాయే...కొంచెం తగ్గండి మరి...తమరు అవలీలగా దాన్ని నెత్తిన పెట్టుకుని నడవగలరు. నాకు తెలుసు. అయినా ఎవరయినా చూస్తే ఎంత అసహ్యంగా వుంటుంది?"

రవీంద్ర మరి మాట్లాడలేదు. అంతలో ఒక కూలీవాడు వొచ్చాడు. సూట్ కేసు తీసుకుని నెత్తిన పెట్టుకుని నడవడం ప్రారంభించాడు. వాడు జనంలో కలిసిపోతుంటే ఎక్కడ తప్పిపోతాడో అని వేగంగా అడుగులు వేశాడు రవీంద్ర, వాణి నవ్వి "నెమ్మదిగా పదండి బావగారూ! వాడెక్కడికీ పారిపోడు..." అన్నది.

ఇద్దరూ బయటికి వచ్చారు. టిక్కెట్లు ఇచ్చి మెట్లు దిగుతూ వుండగానే రిక్షాల వాళ్ళు గుమిగూడి గొడవచేయడం ప్రారంభించారు. వాళ్ళిద్దరూ ఆ గుంపును తప్పించుకుని ఇవతలికి వచ్చి 'అమ్మయ్య' అనుకున్నారు.

రవీంద్ర 'రిక్షా మాట్లాడటమా లేకపోతే జట్కా బండి బేరం చేయడమా' అని మీమాంసలో పడితే వాణి చొరవ తీసుకుని 'ఇలారండి బావగారూ!' అంటూ ఒక ఆటోరిక్షా ఎక్కి కూర్చుంది. కూలివాడు సూట్ కేసు అందులో ఉంచి ఆమె యిచ్చిన రూపాయో అర్ధరూపాయో మారు మాట్లాడకుండా పట్టుకుపోయాడు.

రవీంద్ర కూడా ఆటోలో ఎక్కి యింటి అడ్రసు చెప్పాడు. ఆటో మరు క్షణంలో రివ్వున దూసుకుని ముందుకు పోయింది, రోడ్డు ప్రక్క నుంచి భయంకరమైన దుర్గంధం...వాణి ముక్కు మూసుకుని 'ఘోరం' అన్నది. 'అవును ఘోరంగానే వుంది. మునిసిపాలిటీ సిబ్బంది నెల రోజులనుంచీ సమ్మె చేస్తున్నది. వారికి ఆరు నెలలుగా జీతాలు లేవట' అన్నాడు రవీంద్ర.

ఇంతవరకూ వ్రాసి వ్రేళ్ళు విరుచుకున్నాను. మా ఆవిడ ఎందుకో రుసరుస లాడుతూ కాఫీ తెచ్చి అందించింది. 'ఎందుకలా రుసరుసలాడు తున్నావని నేను అడగనూలేదు ఆమె చెప్పనూలేదు. కాఫీ చేదుగా వుంది. పాలు సరిపోలేదో, లేకపోతే పంచదార తక్కువయిందో అర్థం కాలేదు. గ్లాసు తీసుకు పోయేందుకు వచ్చిన మాఆవిడను పొరపాటున అడిగేశాను. 'కాఫీ చేదుగా వుందేమని.'

"ఆఁ! ఉండదూమరి? పంచదార అయిపోవచ్చిందని మీకు చెప్పి రెండురోజులయింది. అక్కడికీ ఎంతో పొదుపుగా వాడాను. ఇక్కడితో డబ్బా ఖాళీ అయింది. మీ యిష్టం. రేపటికి ఈ మాత్రంగా కూడా కాఫీ ఉండదని గుర్తుంచుకోండి... అయినా, మీకు ఇవన్నీ పట్టాయా? ఆఫీసు ఫైళ్ళు... కాస్త తీరిక దొరికితే ఆ రాతలూ... ఆ వెంకట్రావుగారు చెప్పినట్టు ఆకలీ, పేదతనమూ, ముష్టివాళ్ళు... వీటిని గురించి రాస్తే ఏం చొపుగుతుంది? కాయితాల కట్టలు పెరిగిపోతున్నాయి. పైసా ఆదాయం లేదు. క్షణం తీరికా లేదు. ఎందుకొచ్చిన ఆయాసం" అంటూ కలగా పులగంగా ఏదో మాట్లాడేసి గ్లాసు అందుకుని లోపలికి వెళ్ళిపోయింది. వెళ్ళికూడా లోపలినుంచీ యింకా ఏమిటో నసుగుతూనే వుంది.

నేను నిట్టూర్చాను. కొత్తరకం కథ. వెంకట్రావుగారినీ, మా ఆవిడనూ ఇంకా వేలాది పాఠకులనూ అలరించే కథ రాస్తున్నాను. ఎటువంటి కథలు వేలాది, లక్షలాది పాఠకులను అలరిస్తాయో పత్రికల వారికి బాగా తెలుసు. అందువల్లనే నా కథలేవీ అచ్చు కాలేదు. ఈ కథ మాత్రం అలా కాదు. తప్పనిసరిగా అచ్చయి తీరుతుంది. వెంకట్రావుగారి వంటి పాఠకులు ఎందరో ఉత్తరాలు రాసారు. అందువల్ల నిశ్చయంగా వెంకట్రావుగారినే కొలతబద్దగా తీసుకోవాలి ఆయన ఇంతవరకూ విని ఏమంటాడో కనుక్కోవాలి. ఆయన అభిరుచి ప్రకారం దీన్ని 'డెవలప్' చెయ్యాలి.

నేను పెన్ను మూసి లేచాను. ముందు ఇంట్లో పంచదార గురించి ఆలోచించాలి. ఇంకా నయం ... బియ్యం, ప్రధాన ద్రవ్యం, నిండుకో లేదు. నెలాఖరు రోజులు... మూడు రూపాయలు పుట్టించాలి. . ఈ డబ్బనేది ఇంత అపురయి, బ్రహ్మపదార్థం లాగా కంటికి కనిపించకుండా పోయిందెందుచేత?

ఇంతలో ఎవరో వాకిట్లో నుంచి పిలిచారు. 'వచ్చె వచ్చె' అంటూ వరండాలోకి వచ్చాను. మా యింటి కుడివైపు పెంకుటింట్లో వుండే గుమాస్తా. ఏదో డిపార్టుమెంటులో యల్డీసీ. తల్లీ తండ్రీ ముదివగ్గులై ఇంకా బతికేవున్నారు. ఆ తండ్రి మాటిమాటికీ "ఎప్పటికి భగవంతుడి

పిలుపొస్తుందా అని ఎదురుచూస్తున్నాను. అయినా ఇంతకాలం బ్రతక కూడదండీ...ఇతరులకు బరువుగా..." అంటూ వుంటాడు. తల్లి ఏమీ అనదు.

అతన్ని నవ్వుతూ పలకరించాను. అతడు సిగ్గుపడుతూ "ఏమీ లేదు" అంటూనే ప్రారంభించాడు. అతనికి రెండో మూడో రూపాయలు కావాలిట. మళ్ళీ, ఎల్లుండేకదా ఫస్టు తారీకు, ఆనాడిచ్చేస్తాడట. నేను 'లే'దనే లోపుగానే నన్ను మాట్లాడనివ్వకుండా తన చెల్లెలు మొన్ననే వచ్చిందనీ, ఆ సాయంకాలమే వెళ్ళిపోతున్నదనీ, చీరె కాకపోయినా రవిక గుడ్డ అయినా పెట్టి పంపకపోతే చాలా అన్యాయంగా, ఘోరంగా వుంటుందనీ ఆ మాటలు తన భార్య అన్నదనీ గబగబ చెప్పుకు పోయాడు.

నేను నోటమాట లేకుండా విన్నాను. తర్వాత ఆవులించి ప్రేళ్ళు విరుచుకుని "సరే కాస్సేపాగి, ఒక అరగంట ఆగిరండి. అలాగేయిస్తాను" అన్నాను. అతడు 'అలాగే' అని వెళ్ళిపోయాడు.

అయిందా? ఇప్పుడు వేటకు బయలుదేరాలి. నాకు మూడూ, ఆయనకు రెండూ అయిదు రూపాయలు కావాలి. నాకనిపించింది. ఒక వేళ రూపాయల చెట్టనేది ఒకటి వుండి దాన్ని పట్టుకొచ్చి మన పెరట్లో వేశామనుకోండి, మన పెరట్లో అది ఎదగదు. అసలు బతకదు. దానికి వేరే నేల, వేరే శీతోష్ణస్థితులూ కావాలి.

'సరే' అనుకుని పైన కండువా వేసుకుని 'రామనాథం యింటి దాకా వెళ్ళొస్తా'నని మా ఆవిడకు చెప్పి బయల్దేరాను. రామనాథం నాపుణ్యం కొద్దీ ఇంట్లోనే వున్నాడు. ఇంకా కట్ జోకర్ టైము అయినట్టు లేదు. అతడు అప్పుడప్పుడు అవసరమైతే అయిదూ పదీ యిస్తూ వుంటాడు నాకు. ఇప్పుడూ అడగ్గానే యిచ్చాడు. అది తీసుకుని దోవలో కిలో పంచదార ఘోరమైన బ్లాక్ మార్కెట్ ధరకుకొని యింటికివచ్చాను. అంతలో అతడు మళ్ళీ వచ్చి పిలిస్తే వెళ్ళి రెండు రూపాయలూ ఇచ్చే శాను. అతడు వెంటనే వెళ్ళిపోయాడు. పంచదార మా ఆవిడకు అప్ప

గించి అలా ఒక్క క్షణం కూర్చున్నానో లేదో వెంకట్రావుగారు వచ్చేశాడు. వచ్చీ రావడమే నా ఎదురుగా కూర్చుని "ఏదీ మొదలు పెట్టరా కథ" అన్నాడు.

నేను ఆ కాస్తా చదివి వినిపించాను. చాలా ఏకాగ్ర చిత్తంతో విన్నాడు. విని అటూ యిటూ కాస్సేపూ పైకి కాస్సేపూ చూశాడు. తర్వాత "బాగుంది..."అన్నాడు. మళ్ళీఎందుకో'ఫరవాలేదు'అన్నాడు. నేను జాగ్రత్తగా వింటున్నాను. ఆయన చెప్పడం మొదలుపెట్టాడు. "బాగుంది....మొదలు పెట్టడం బాగానే మొదలుపెట్టావు. ఒక ఆబ్సెంట్ మైండెడ్ బావగారూ, చలాకీ అయిన మరదలూ, బాగుంది. బావగారు కూడా బాగా డబ్బున్నవాడూ, కానున్నవాడూ, అయితే యింకా బాగుండేది. కాని ఫరవాలేదు. అతడు పేదవాడు కావడం కూడా మంచిదే ప్రేమకూ, పెళ్ళికీ ఈ అంతస్థులు అడ్డురావని నిరూపించవచ్చు. ఇకపోతే ఆ స్టేషనులో గందరగోళం, రిక్షావాళ్ళ గొడవ, ఆ మునిసిపాలిటీవాళ్ళ సమ్మె సంగతీ తీసెయ్యండి. దోవ కటూ యిటూ అవేవో చెట్లున్నాయి ? ఆఁ! అశోక వృక్షాలు పెట్టండి. ఇక తర్వాత పెళ్ళివర్ని యింటికి తీసుకుపొండి. అక్కడ మరో మగ పాత్రనో ఆడ పాత్రనో సృష్టించండి...ఒక డబ్బున్న అబ్బాయి లేకపోతే పేదయింటి అమ్మాయి...ఆ పైన పెయిష్టం...కావలసినంత సబ్జక్టు...ఆ అమ్మాయి యిద్దరు అబ్బాయిల్లో ఎవరిని పెళ్ళి చేసుకుంటుందో, లేకపోతే ఆ అబ్బాయి యిద్దరు అమ్మాయిల్లో ఎవర్ని పెళ్ళి చేసుకుంటాడో తేల్చకుండా చివరకంటా కథను లాగించండి...అసలు నవలే వ్రాయవచ్చునండీ బాబూ!" అన్నాడు. తర్వాత మళ్ళీ 'గుడ్‌లక్' అంటూ వెళ్ళిపోయాడు.

మళ్ళీ కథ వ్రాద్దామని కూర్చున్నాను. యిప్పుడు కళ్ళముందు యిందాక రెండు రూపాయలు అప్పుగా పుచ్చుకువెళ్ళిన పొరుగింటి ఆయనే కనిపిస్తున్నాడు. ఆ మాత్రం డబ్బులేక ఆయన పడిన ఆరాటమే గుర్తుకు వచ్చింది. 'ఆ రెండు రూపాయలూ దొరక్కపోతే, పుట్టింటికి వచ్చిన చెల్లెలికి చివరకు రవిక ముక్కయినా పెట్టకుండా పంపించవలసి

వస్తే అదెంత 'దారుణం' అని అతడూ అతని భార్యా పడిన ఆవేదనా, ఆరాటం...ఇదంతా మనసులో మెదిలింది. మనసంతా ఏదోలా అయి పోయి బరువెక్కింది.

కలం చేతిలోకి తీసుకున్నాను. మళ్ళీ వ్రాయడం ప్రారంభించాను.

* * *

ఇంటిముందు ఆటోరిక్షాలో నుంచి దిగుతూవుండగానే వరండాలో నిలబడివున్న రవీంద్ర భార్య అరుంధతి సంరంభంగా ఎదురువచ్చింది. 'ఏదీ మా వాణి వొచ్చేసిందా?' అంటూ.

"ఆఁ! వొచ్చేసింది...మీ బంగారు చెల్లెలు..." అన్నాడు రవీంద్ర. ఆటోవాడికి రెండు రూపాయలు ఇచ్చి పంపిస్తూ నెలాఖరు రోజులు... రెండు కరకు రూపాయలు ఈ ఆటోరిక్షాకు ధారపోశాడు. మళ్ళీ ఈనెల కూడా అప్పుచేయక గడిచేట్టులేదురా దేవుడా" అనుకుంటూ లోపలికి వచ్చాడు.

అరుంధతి మొహం వెలిగిపోయింది. ఫస్టు తారీఖున రవీంద్ర జీతం అందుకుని కొంచెం బరువైన జేబుతో ఆఫీసు నుంచి ఇంటికి వచ్చి నప్పుడు అతన్ని చూసిన ఆమె మొహం ఎలావుంటుంది? అలాగే వెలిగి పోయింది ఆమె మొహం. అక్క చెల్లెళ్ళిద్దరూ ఒకరి నొకరు కౌగలించు కున్నంత పనిచేశారు. "రావే లోపలికి...ఎన్నాళ్ళయిందో నిన్ను చూసి....అయినా మరిదిగారు అంత చిత్రమైన మనిషేమిటే? ఏడాదికొక సారయినా ఇటువైపు రారేం మీరు? ఎంత డబ్బున్న వాళ్ళయినా మేమెంత మామూలు మనుషులమైనా ఇంతయిది పనికిరాదే మాతల్లీ!" అన్నది అరుంధతి చెల్లెల్ని కళ్ళారా చూస్తూ.

వాణి "అదేమీ లేదక్కా...వారికి అస్సలు సెలవు దొరకదు... పాడు వుద్యోగం తీరికే వుండదు..." అంటూ కూర్చుంది.

"అవున్లే మరి...నెలకు పదిహేను వందల రూపాయలు ఊరికే వస్తాయా? మీ బావగారు చూడు ఆఫీసువేళ తప్పించితే ఊరికే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోడమే నాముందు. అన్నీ మరి దానికి తగ్గట్టేగా?"

"పాపం ! బావనలా అనకే. మంచివాడు..." అని నవ్వింది చెల్లెలు.

రవీంద్ర ఉలిక్కిపడ్డాడు. అనవసరంగా తన ప్రసక్తి యిప్పుడు తేవడం ఎందుకో అతనికి అర్థం కాలేదు. మతిపోయిన వాడిలా ఆ అక్కా చెల్లెళ్ళను చూస్తూ అలాగే కూర్చున్నాడు.

మళ్ళీ "ఎన్నాళ్ళయిందే నిన్ను చూసి" అన్నది అక్కగారు.

"అవునే...సుబ్బులు పెళ్ళిలో కలుసుకోవడమే..." అన్నది చెల్లెలు. మళ్ళీ ఒక్కక్షణం ఆగి "ఏం పెళ్ళిబాబూ ! ఉక్కిరిబిక్కిరై చచ్చాం...మావారయితే విసుక్కున్నారు కూడా" అన్నది.

"సుబ్బులు కిప్పుడు అయిదోనెల...నీకు తెలుసుటే?" అని అడిగింది అక్కగారు.

చెల్లెలు బుగ్గన వ్రేలు వేసుకుని "అరె, నాకు తెలియదే...అయినా అప్పుడే...అదేమిటే ... ఇక వరసగా పిల్లల్ని కని... బాధలతో..." అన్నది చెల్లెలు.

"సరే నువ్వు లే ముందు అలిసిపోయి వుంటావు" అంటూ లోపలి గుమ్మం వంక చూసి "ఇదుగో వీడు విస్సిగాడు. ఒరేయ్ నువ్వెందుకురా తలుపు చాటున నక్కి చూస్తున్నావు ? ఎవరనుకున్నావు. పిన్నిరా...రా యివతలికి ఇదుగో వీడు ప్రసాదు. అదేమో ఝాన్సీ. రండర్రా యివతలికి. మళ్ళీ రేపు సాయంకాలం వెళ్ళిపోతుందిరా పిన్ని..." అంటూ చెల్లెలివంక తిరిగి "అయినా అదేం చోద్యమే అంత పెద్ద వైరు యిచ్చావు? ఇక్కడ తీరాచేసి ఒక్కరోజు కూడా ఉండవుటే. ఇది అన్యాయమే" అన్నది.

వాణి "ఆఁ! ఎంత కాలం వుంటే నీకు తృప్తి. ళ
పోవాలి...రేపు బండిలో రిజర్వేషను కూడా వుంది"
వంక చేతులు చాపి "రండిరా నా దగ్గరికి" అన్నది. వాళ్ళు రాలేదు. ముగ్గురూ కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తూ నిలబడ్డారు.

"పోరేంరా పిన్ని దగ్గరికి" అని అరుంధతి "నువ్వీక లేదిరావే. కాళ్ళు కడుక్కుంటావా స్నానం చేస్తావా?" అని చెల్లెలిని అడిగింది.

వాణి "స్నానమే చేస్తాను. వెధవ రైల్లో వొళ్ళంతా హూనమై పోయింది" అంటూ సూట్ కేసు తీసి రెండు చీరెలూ, జాకెట్లూ ఇవతల పెట్టుకుని వొళ్ళు విరుచుకుంది.

అరుంధతి 'అయితే నీళ్ళుతోడి పిలుస్తానుండు' అంటూ లోపలికి వెళ్ళింది.

వాణి సూట్‌కేసులో నుంచి మూడు పెద్ద బిస్కట్ల ప్యాకెట్లు తీసింది. అంతవరకూ ఎవరో ఫారెనర్‌ని చూసినట్టు దూరదూరంగా ఉన్న పిల్లలు బిస్కెట్ల ప్యాకెట్లు కంటబడేసరికి చింకి చేటలంత మొహాలు చేసుకుని ఆమె దగ్గరగా వెళ్ళారు. వెళ్ళడమే కాకుండా ఆమె మీదపడి వాటిని తలా ఒకటీ లాక్కున్నారు.

అంతలో అరుంధతి లోపలి నుంచి "నీళ్ళు సిద్ధం చేశాను రావే. పెందలాడే భోజనాలు ముగించేస్తే తర్వాత తీరుబడిగా మాట్లాడుకోవచ్చు" అన్నది. అంతలో పిల్లల చేతుల్లో ప్యాకెట్లు చూసి "ఏమిటో తెచ్చి నట్టున్నావ్. అయినా యివన్నీ ఎందుకే... ఒరే వెధవల్లారా! అవి యిలా యివ్వండి. దాచిపెటి రేపు యిస్తాను. ఇప్పుడు అన్నాలు తినబో తున్నారుగా... ఇలా... ఇవ్వండి. అంటూ వాళ్ళ దగ్గరికి వచ్చింది. వాళ్ళు వాటిని గట్టిగా గుండెలకు హత్తుకు నిలబడ్డారు. తల్లికిచ్చే అభి ప్రాయం బొత్తిగా లేదని స్పష్టం చేశారు. "రేపు తినవచ్చురా. ఈ పూటకు దాచిపెడతాను. నా చేతికివ్వండి. మంచివాళ్ళుగా మీరు. ఒరే విస్సిగా, నువ్వు పెద్దవాడివి కదా, నా మాట విని అది యిలా యివ్వు చక్కగా అలమారులో దాచిపెడతాను" అన్నది.

వాణి నవ్వుతూ చూస్తున్నది. రవీంద్ర మౌనంగా చూస్తున్నాడు. అరుంధతి వాళ్ళ దగ్గర బలవంతంగా వాటిని లాక్కోబోయింది. వాళ్ళు అన్ని గదుల్లోకి పరుగెత్తారు. ఆమె కూడా వాళ్ళ వెంట పరుగెత్తి ఎలాగయితే నేం వాళ్ళు పెద్దగా ఏడుస్తున్నా వినకుండా వాటిని లాక్కొ

చ్చింది. ముందు గదిలోని భర్త మొహంలోకీ, చెల్లెలు మొహంలోకీ చూస్తూ నవ్వుతూ "ఏడిస్తే ఏడిచారు వెధవలు. కాస్సేపు ఏడ్చి వాళ్ళే ఊరుకుంటారు" అన్నది. తర్వాత మళ్ళీ చెల్లెలి వంక తిరిగి "నువ్వు లే. నీళ్ళు చల్లారిపోతాయి" అన్నది. ఆ బిస్కెట్ ప్యాకెట్లు అల్మారులో వుంచింది. పిల్లలు ముగ్గురూ ఏదో నిధి పోగొట్టుకున్న వాళ్ళ లాగున నెమ్మదిగా యింకా ఏడుస్తూనే వున్నారు. రవీంద్ర వాళ్ళను దగ్గరికి తీసుకుని "తప్పు యాడవకూడదు. అమ్మ రేపు అన్నీ మీకే పెడుతుంది. ఇప్పుడు అన్నం తినొద్దూ మరి" అని ఊరడించాడు.

వాణి చీరె, జాకెట్టు టవలూ తీసుకుని స్నానానికి లోపలికి వెళ్ళింది.

అరుంధతి భర్త దగ్గరికి వచ్చి నెమ్మదిగా "రేపు మళ్ళీ వెళ్ళిపోతుందది" అన్నది.

"అవును అలా అని వ్రైరిచ్చిందిగా?" అన్నాడు రవీంద్ర.

"అది సరేనండీ మీరర్థం చేసుకోరు. రేపొద్దున ఆఫీసుకు వెళ్ళే లోపల బజారుకు వెళ్ళి మంచి జాకెట్టు గుడ్డ ఒకటి కొనుక్కురండి. అది అన్నప్పుడల్లా రాదు. తెచ్చేదేదో కాస్త మంచిదే తీసుకురండి. పది, పదిహేను రూపాయల్లో..."

"అంత ఖరీదులో ఎందుకు?" అంటూ నసిగాడు రవీంద్ర.

"మీకు తెలియదు. నేను చెప్పినట్టు చెయ్యండి. సరేనా? ఏం డబ్బు లేదా?"

"లేకేం. సరిగ్గా పదిహేను రూపాయలే ఉంది."

"అది పెట్టి మంచి గుడ్డ పట్టుకురండి. లేకపోతే నాకిస్తే నేనే బజారుకు వెళ్దును గాని తీరిక ఏది? ఏమంటారు?"

"ఏమంటాను? ఫస్టు తారీఖు ఇంకా నాలుగు రోజులుంది. ఈ లోపల రోజూ పాలసీసాలకూ, వాటికీ..."

"ఏమీ ఫరవాలేదు. ఇది మనకు కొత్తా ఏమిటి? రేపే ఎవరినన్నా అడిగి మరో పదో పదిహేనో అరువు పుచ్చుకోండి."

'సరే' అన్నాడు రవీంద్ర. ఆఫీసులోకల్లా వారికీ, వీరికీ డబ్బు చిన్న మొత్తాలు అప్పు పెట్టగలిగిన వాడు అచ్యుతం ఒక్కడే. అయితే అతని దగ్గిరికి వెళ్ళి అడగటం... అతడేవో ప్రశ్నలు వేయడం . . . ఇదంతా గొప్ప బోరు . . .

"సరే ఏం చేస్తాం . . .ఇలాగే నడవనిద్దాం . . .బండిని" అనుకుని అతడు సన్నగా ఈల వేస్తూ కుర్చీలో వెనక్కు వాలి కూర్చుండి పోయాడు.

వ్రాత ఆగిపోయింది. వాకిట్లో ఏదో గొడవ. చిరాగ్గా కలం బల్లమీద పడేసి వెళ్ళి చూద్దునుకదా, మా ఆవిడ వరండాలో నిలబడి ఎవరితోనో పోట్లాడుతున్నది. వెళ్ళి కలుగ జేసుకోవడం నాకు యిష్టం లేదు. సంగతి అర్థం చేసుకుంటూ నిలబడ్డాను.

వాళ్ళు పాకీవాళ్లూ రోడ్లు శుభ్రంచేసే వాళ్ళూను, అయిదారుగురు వచ్చారు. సమ్మె చేస్తున్నారుట. జీతాలు నెలల తరబడి లేవని సమ్మె చేస్తున్నారట. పైవాళ్ళెవరూ లెక్కచేయడం లేదట. ఊరంతా కంపు కొడుతూ వుంటే ప్రజలు కూడా జీతాలివ్వని పరిపాలకులను కాక వీళ్ళనే తిట్టడం ప్రారంభించారు. సమ్మె చేసేకొద్దీ పొట్ట గడవడం కష్టంకదా అందుకని చందాలకు బయలుదేరారు.

మా ఆవిడ వాళ్ళని కసిరి కొట్టింది. "ఏం, వొళ్ళు పొగరెక్కి సమ్మె చేసినవాళ్ళు ఇలా ఇళ్ళవెంట చందాలని ముష్టెత్తుతూ తిరగడం దేనికి ? ఆ పట్టుకునే కాళ్ళేవో మునిసిపాలిటి వాళ్ళవే పట్టుకోరాదూ ? అసలు దేశంలో అందరూ వొళ్ళు పొగరెక్కి కొట్టుకుంటున్నారే. ఇంతే కావాలి మీకు ?" అలా ఏమిటేమిటో అడ్డదిడ్డంగా పెద్దగా అరిచింది.

వాళ్ళు మరుక్షణంలో నసుగుతూ బైటికి వెళ్ళిపోయారు. నేను కథ ముందు కూర్చున్నాను. ఇప్పుడేం రాయాలి ? ఏం రాయాలి ?

ఎందుకో నాకే తెలియదు. అప్రయత్నంగా 'రవీంద్ర కుర్చీలో వాలి కూర్చుండిపోయాడు.' అనే వాక్యం తర్వాత 'అంతలో సమ్మె చేస్తున్న మునిసిపాలిటి తోటీ పనివాళ్ళు చందాకోసం ఇంటి ముందుకు

వచ్చి నిలబడ్డారు; అని మరొక వాక్యం మాత్రం వ్రాసి తర్వాత విసుగుతో కాయితాలు లోపలికి తోసేసి వరండాలోకివచ్చాను. మనసంతా అరణ్యం లాగున చీకాగ్గా అసహ్యంగా బరువుగా వుంది, అర్థం లేని ఆలోచనలతో వేడెక్కిపోయింది. ఏదో చెయ్యాలనుకుని చెయ్యలేక పోయిన నిస్సహాయత... అసమర్థత...

మరునాడు సాయంకాలం వీధి గుమ్మంలో నుంచి వస్తున్న వెంకట్రావుగారిని చూసి గతుక్కుమన్నాను. లోపలినుంచి ఏదో వొణుకు లాటిది పుట్టుకొచ్చింది. మా ఆవిడతో 'ఇంట్లో లేనని చెప్పమని లోపల ఎక్కడైనా దాక్కుండిపోదామా' అనిపించింది.

కాని అంత వ్యవధి యివ్వకుండా ఆయన నేరుగా లోపలికే వచ్చేశాడు. నన్ను చూసి "నాకు తెలుసు. మీరాపనిమీదే వున్నారని. ఏదీ, తర్వాత ఏం రాశారో వినిపించండి." అన్నాడు.

నేను సిగ్గుపడిపోతూ "లేదండీ...ఏమీ రాయలేదు. కథ చెడి పోయింది" అన్నాను.

"ఫరవాలేదు. వినిపించండి ఎందుకు చెడిపోయిందో ఎక్కడ చెడిపోయిందో చూద్దాం" అన్నాడు విడవకుండా.

నేను తెగించి మొండిగా కాయితాలు బైటికి తీసి మొత్తం చదివే శాను. ఆ అర్థం పర్థం లేని ఆఖరు వాక్యం కూడా చదివేశాను.

నేను మధ్యలో పొరపాటున కూడా ఆయన వంక చూడలేదు. మొత్తం చదివి కాయితాలను నిర్లక్ష్యంగా లోపలి సొరుగులోకి తోసేసి కూర్చున్నాను. అప్పుడాయన వంక చూశాను.

ఆయన ముందు మతిపోయిన వాడిలా నా వంక కళ్ళు పెద్దవి చేసుకుని చూశాడు. తర్వాత ఒక్క క్షణం మాత్రం కూర్చుని అంతలో ఏమనుకున్నాడో ఏమో చివాలున లేచి 'వెళ్ళొస్తానండీ' అని మాత్రం అనేసి గబగబ వెళ్ళిపోయాడు. నేను చేతివ్రేళ్ళు విరుచుకుంటూ ఆవులించాను.

మర్నాటి నుంచి నేననుకున్నంతా అయింది.

వెంకట్రావుగారు నాతో మాట్లాడటం బొత్తిగా తగ్గించేశాడు.

# చీకటి

'ఇదుగో మాట ఒకసారిట్టా వొచ్చిపో...'

పిలుపువిని ఒక్కసారి పక్కకు తిరిగి చూసి అంతలోనే తల తిప్పుకుని నడిచిపోయాడు ఆ వ్యక్తి.

ఉదయం ... తొమ్మిది గంటలవేళ ఎండ చిట చిట లాడు తున్నది. తెల్లవారుతూనే సూర్యుడు కోటికోట్ల పదునైన కత్తులు తిప్పుతూ ఉదయించాడు. పొద్దెక్కే కొద్దీ ఎండలో వేడీవాడీ ఎక్కువై భరించ శక్యం కాకుండా ఉంది. నిరంకుశుడైన పరిపాలకుడిలా సూర్యుడు ధుమ ధుమలాడుతూ ఈ సమస్త ప్రపంచాన్నీ రోస్ట్ చేసేస్తున్నాడు. ఆకాశంలో ఎక్కడా మబ్బు తునక లేదు. గాలి అలిగి ఓగించుకు కూర్చున్నది.

"అబ్బబ్బ ! ఈ ఎండలేమిటో ఎన్నడూ ఎరగం...తపన పుడు తున్నది..." అన్నది సావిత్రి.

"ఇట్టాటె ఎండలు చాలా చూశాన్నేను." అని వూరుకుంది పక్క గుడిసె గుమ్మంలో నిలబడివున్న వరాలు.

అంతలో మళ్ళీ ఎవరో వీధిన పోతూవుంటే "ఇదుగో మాట. ఒక్కసారిట్టా వొచ్చిపో..." అని పిలిచారిద్దరూ.

ఆ మనిషి రాలేమ. తనను కాదన్నట్టుగా ఎటోచూస్తూ వెళ్ళి పోయాడు. సావిత్రి నిట్టూర్చింది. పొద్దుటినుంచీ ఇన్ని టీ నీళ్ళయినా తాగలేదు. ఆకలి...పొట్టలో ఏదో చిచ్చు పెట్టినట్టుగా మంట ... 'ఒక్క బేరం తగిలితే బాగుండిపోను. లేకపోతే నీరసం వొచ్చేసి పడిపోవడం ఖాయం..." అనుకుంది.

ఎదురుగా బ్రహ్మాండమైన సినిమాహాలు ... బాల్కనీ మీద ఆది వారం ఉదయం ఆటకు వచ్చినవారు కొందరు చల్లగా గోల్డ్‌స్పాట్‌లూ, కోకాకోలాలూ తాగుతూ నిలబడి వున్నారు.

సావిత్రి పెదవులు తడుపుకున్నది. ఈ దాహం, ఆకలితో ఇవాళ చచ్చిపోవడం తప్పదల్లేవుంది. గుడిసె వాకిట నిలబడి ఇప్పటికి గంట సేపటినుంచీ కనిపించిన వాడినల్లా పిలుస్తున్నది.

ఈ వరాలు దగ్గర రాత్రి బిజినెస్ తాలూకు కొంచెం సొమ్ము మిగిలివుంటుంది. పొద్దున్నే రెండిడ్లీలు తెప్పించుకుతిని టీ తాగి యిప్పుడే వచ్చింది గుమ్మంలోకి. కాస్త ముస్తాబయింది కూడా. పలుచని ఎర్ర చీర కట్టి తెల్లజాకెట్టు తొడుక్కుంది. రాత్రి అట్టేపెట్టిన కాసిని పూలు తల్లో పెట్టుకున్నది. కాస్త నిద్రకూడా పోయినట్టుంది. తనకు నిద్రలేదు. తెల్ల వారు జామున ఎప్పుడో కాస్త నిద్రపట్టింది గాని, అదేం నిద్ర ? అన్నీ కలలే... రెండుసార్లు కలల్లో అమ్మ కనిపించింది. ఒకదాన్లో ఆమె చెమ టలు కక్కుతూ పిండిరుబ్బుతూ కనిపించింది. రెండోదాన్లో ఎందుకో కళ్ళనీళ్ళు పెట్టుకుని కనిపించింది. ఏదో అంటున్నదిగాని తనకు తెలియ లేదు. అంతలోనే కాకిరూపం ధరించి ఎగిరిపోయింది.

సావిత్రి ఉలిక్కిపడింది.

'ఏమే ! నాబాకీ ఎప్పుడు తీరుస్తావ్ ?' అని అడుగుతూ నిలబడి వున్నాడు అప్పారావు. అతను తెల్లనిపంచె కట్టుకుని వున్నాడు. పలుచని లాల్చీ తొడుక్కుని వున్నాడు. మెడలో సన్నని బంగారు గొలుసుంది. నల్లని చేతివ్రేళ్ళకు ఒకటో రెండో ఉంగరాలున్నాయి. లోపలికి వచ్చే ధోరణిలో మాత్రం లేడు.

సావిత్రికి కళ్ళనీళ్ళొచ్చాయి. బొంగురుగొంతుతో "ఇస్తానిస్తాను" అన్నది.

"ఆఁ ! ఇస్తావు. ఎన్నాళ్ళయింది తీసుకుని ? రెణ్ణెల్లు దాటింది. ఏమనిచెప్పి తీసుకున్నావు? 'నాలుగు రోజుల్లో యిస్తాన'ని తీసుకున్నావు."

అప్పారావు యింకా ఏదో అనబోయాడుగాని ఎందుకో ఏమీ అన కుండా విసవిస నడిచి వెళ్ళిపోయాడు.

సావిత్రి నిట్టూర్చింది. "ఇంకానయం. 'ఇప్పుడు లోపలికి పోదాం రమ్మన'లేదు. అసలే నీరసంతో ఛస్తుంటే..." అనుకున్నది.

వరాలు "ఏవమ్మా! ఇంకా పీడి బాకీ తీరలేదా?" అని అడిగింది.

సావిత్రి తల అడ్డంగా వూపింది.

"మళ్ళీ ఎప్పటి కర్ఫ్యూరోజులు! ఏనాటి సంగతి? ఆ పదిరూపాయల బాకీ యింకా తీరలేదా? ఈ రెణ్ణెల్లలో ఎన్నిసార్లొచ్చి ఉండి పోయాడు నీతో? నేనే ఏ పదిసార్లో చూసి వుంటాను. అదంతా ఆ పది రూపాయలకి వడ్డీకింద లెక్కా?" అని అడిగింది.

"ఏమోమరి. అంతేనేమో!" అన్నది సావిత్రి.

ఆరోజులు... ఎంత భయంకరమైన రోజులు! వరసగా రోజుల తరబడి ఊళ్ళో కర్ఫ్యూపెట్టారు. మనిషన్నవాడు బయట కనిపించకూడదన్నారు. కనిపిస్తే నిర్దాక్షిణ్యంగా చావగొట్టారు. కాకీ దుస్తులవారితో, చేతుల్లో తుపాకీలు లాటీలు ధరించిన వారితో నిండిన లారీలు రివ్వురివ్వున వీధుల్లో తిరిగాయి. సాయంకాలం ఆరుగంటలకే వాళ్ళ పాలన మొదలు. బతికున్నవాడెవడూ బయట తిరిగేందుకు వీల్లేదు.

ఆ రోజుల్లో చేతిలో పైసాలేక తిండికి లేక కడుపుమాడి ఈ అప్పారావు దగ్గర సావిత్రి పది రూపాయలు అప్పుతీసుకున్నది. ఆనాడు అప్పారావు పదిరూపాయలయితే యిచ్చాడు కాని 'పొద్దూకింది కదా! కర్ఫ్యూ... ఇంటికెళ్ళేందుకుకుదర్దుమరి...ఉండిపోతా...'అనితన గుడిసెలోనే రాత్రల్లా ఉండిపోయాడు. ఆ తెల్లవార్లూ అతడు నిద్రపోలేదు. తననూ నిద్రపోనివ్వలేదు. దయ్యం పట్టిన వాడిలాగ ప్రవర్తించాడు. అయినా తాను సహించింది. ఎందుకు? పదిరూపాయలు అప్పు ఇచ్చాడు మరి!

సావిత్రి గుడిసెలోపలికి వచ్చింది. కాళ్ళు పీక్కుపోతున్నాయి. కాస్సేపు కూర్చుంటే బాగుండుననిపించి తడికెకు ఆనుకుని కూర్చుండి పోయింది. ఎదురుగా మట్టిగోడ మీద పాత సర్టిఫికెట్ వ్రేలాడుతున్నది. దాని ఫ్రేము పాతబడిపోయింది. అద్దం ఒకపక్క కొంచెం పగిలింది.

లోపల తెల్లని కాగితం కొంతమేర ఎప్పుడో వానకుతడిసి బ్రవును రంగు లోకి మారింది. ఏవేవో చిన్న పురుగులు కొట్టివేయడంవల్ల కాయితం చాలాభాగం చిల్లులుపడి తన జీవితం లాగేవుంది. అక్షరాలు కూడా అలుక్కుపోయి వున్నాయి. పక్కనే అటునుంచి యిటు కట్టిన తాటిమీద తన మరొక చీరె వ్రేలాడుతున్నది. అది మొన్నరాత్రి పూర్తిగా పాడయి పోయింది. ఇవాళ ఏదో ఒక సమయంలో పక్కనే ఉన్న కాలవకువెళ్ళి అందులో వున్న కాసిని నీళ్ళలో ఉతుక్కుని తెచ్చుకోవాలి. రాత్రికది ఆరుతుందా? ఎందుకారదు? ఈ ఎండకూ వేడిగాలికీ క్షణంలో ఆరి పోతుంది. ఫరవాలేదు.

సావిత్రి అలాగే చాలాసేపు తలమీద చెయ్యిపెట్టుకుని కూర్చుండి పోయింది. అంతలో అమ్మ గుర్తువచ్చింది. పధ్నాలుగేళ్ళదాకా తనను కళ్ళలో పెట్టుకుని పెంచిన అమ్మ! తనకోసం ఎన్ని యిళ్ళలో చాకిరీ చేసింది! ఎంత కష్టపడింది! అంత నీరసంలోనూ తాను పీలికలైన చీరలే కట్టుకున్నదో, చిరిగిన జాకెట్లే తొడుక్కున్నదో, తిన్నదో లేక పస్తు లున్నదో ఏమీ తెలీదు. కండరాలు కరిగించి పనిచేసి పైసా పైసా తన కోసం వెచ్చించింది. ఆరోజున... తనకు జ్వరం...అమ్మవారు పోసింది. తాను కుక్కిమంచంలో వొళ్ళు తెలియక పడివుంటే అంత చాకిరీచేసి వచ్చి తన పక్కన కూర్చుని 'అమ్మాయ్, ఇవాళ మీ బళ్ళో సభ జరుగు తుంది కదుటే. నీకు బహుమతి యిస్తారంటివిగా! నీబదులు నేను వెళ్ళి తీసుకొచ్చేదా?' అని అడిగింది. తానప్పుడేం చెప్పిందో గుర్తులేదు. పిచ్చి మనిషి! ఉరుకులు పరుగులుగా బడికివెళ్ళి ప్రయిజులిస్తున్నప్పుడు తన పేరు రాగానే పమిట సరిచేసుకుని స్టేజిమీదికి వెళ్ళిందిట. జనమంతా ఘొల్లుమన్నారు. స్టేజిమీద ఉన్న పెద్దలు 'నువ్వెవరు? దిగుముందు కిందికి పో...' అని గదమాయించారుట. 'మా అమ్మాయేనండి సావిత్రి. నాకూతురు. దానికి జ్వరం. ...నాకివ్వండి తీసుకుపోతాను.' అంటుంటే వినిపించుకోకుండా కిందికి దింపి తరిమేశారు. అంత అవమానం పొంది తిరిగి వచ్చి 'నువ్వు నాకూతురివే కదా? నీకు జ్వరంకదా? అందుకని నేనే వెళ్ళాను. నేనేం తప్పుచేశాను?' అని ఆరోజల్లా ఎంతో బాధపడిపోయింది.

అలాటి అమ్మ! పిచ్చితల్లి ...పని చేసి చేసీ శక్తి అంతా ఖర్చుపెట్టేసుకుని చచ్చిపోయింది. కూతుర్ని గురించిన దిగులుతో నిండిన ఆ కళ్ళలోనుంచే ప్రాణాలు పోయాయి.

బయట ఏదో గొడవ.

సావిత్రి లేచి యివతలికి వచ్చింది. ఎదురుగా లాటరీ టిక్కెట్ల బండి వెళ్తున్నది. మైకులో ఒకడు 'మైసూర్ లాటరీ...ఇవాళే డ్రా... టిక్కెట్టు రూపాయి మాత్రమే. త్వరపడండి. కొద్ది టిక్కెట్లు మాత్రమే ఉన్నాయి...లక్షలు లక్షలు...ఆ అదృష్టవంతులు మీరేకావచ్చు...ఘల్ ఘల్ ఘల్‌మని ఆ మహాలక్ష్మి తల్లి మీయింటికే...మీ యింటికేరావచ్చు..' అంటున్నాడు.

వరాలు 'ఇదుగో అబ్బి ! బండాపుకుని ఒకసారిట్టా వొచ్చిపో...' అని పిలిచింది.

అతడు నవ్వి 'టిక్కెట్టు కొంటావా? రూపాయేగా? లక్షరొస్తాయి. మైసూర్ గవర్మెంటు లాటరీ...'అన్నాడు.

'కొంటాన్లే రా' అన్నది వరాలు.

అతడు టిక్కెట్లు చేతిలో పుచ్చుకుని రాగానే "గవర్మెంటోళ్ళ లాటరీయా ? ఏ గవర్మెంటు?" అని అడిగింది.

'మన్దే. మైసూరు గవర్మెంటు...'

'మైసూర్ గవర్మెంటు మన గవర్నమెంటెలాగవుద్ది?'

'అది అంతేలే...'

'ఏమిటంతే? అసలు మన్దే గవర్మెంటు చెప్పు...ఆంధ్రాయేగా?'

'అవును'

'మరి మైసూరు గవర్మెంటు మన్దంటావేం ?'

'అదంతేలే. అసరింతకి టిక్కెట్టు కావాలా వొద్దా తేల్చు...లక్షలొస్తుంటే...'

'నువ్వు ముందు ఈ సంగతి తేల్చు ... తర్వాత కొంటాను' అంటూ వరాలు సావిత్రి వంక చూసింది. సావిత్రి మాట్లాడలేదు.

పక్కన చిన్న పందిట్లో కూర్చుని నిరంతరం బీడీలు కాలుస్తుండే గురువులు - అతడికి అరబ్బీ గుర్రాల్లాగా ఎదిగిన కూతుళ్ళిద్దరున్నారు. రోజూ రిషాలో లాడ్జింగులకుపోయి సంపాయించుకొస్తారు - నవ్వుతూ లేచివచ్చి వరాలుతో 'పిచ్చిమాలోకమా! అంతా యిన్నాను. అతన్చెప్పేదే కరెక్టు...మైసూరు కూడా మన్దేశంలోదే. టిక్కెట్టుకొను. డ్రా ఇయ్యాళే అంటుండాడుగా. నీకే తగలొచ్చు లక్షలు...' అన్నాడు.

వరాలు ఒక్క క్షణం ఆలోచించి 'సరే అయితే...మంచిదిగా చూసి ఒక టిక్కెట్టిచ్చిపో...' అన్నది టిక్కెట్టు అందుకుని అటూ యిటూ తిప్పి చూసి 'ఇదింతేనా ?' అని అడిగింది.

'అంతే, దానిమీద నంబరుంటుంది సూడు... ఆ నంబరు తెగితే చాలు...ఇదిచ్చేస్తే డబ్బిచ్చేస్తారు' అన్నాడు గురువులు మళ్ళీ.

వరాలు జాకెట్టు లోపలినుంచి చిన్న ఎర్రని ప్లాస్టిక్‌పర్సు తీసి అందులోనుంచి రూపాయి కాయితం ఇవతలికి లాగి మడతలు విప్పి అతనికి అందించింది. అతడు దాన్ని అందుకుని రిషాఎక్కి మళ్ళీ అరుచుకుంటూ వెళ్ళిపోయాడు.

'అయిపోయింది. ఇంక చిల్లర డబ్బులు మిగిలాయి' అన్నది వరాలు టిక్కెట్టు జాగ్రత్తగా మడిచి పర్సులో పెట్టుకుంటూ.

'నీ పని నయం. నా దగ్గర ఆ చిల్లర డబ్బులు కూడా లేవు...' అనుకుని నిట్టూర్చింది సావిత్రి.

గురువులు మళ్ళీ పందిట్లోకి వెళ్తూ 'వరాలూ! రేపు పేపరు చూసి నేచెప్తాలే...భలే ఛాన్సు నీకు...లక్షలు కొట్టేస్తావు...నీకొస్తే నాకందులో వాటా యిస్తావా ?' అన్నాడు.

'అబ్బ ఆశ ! ఇస్తాను. కాసుకూర్చో' అన్నది వరాలు. సూర్య కిరణాలు ఎర్రగా కాల్చిన పదునైన కత్తుల్లాగా వాడిగా వాతలు పెడుతున్నాయి. దోవనపొయ్యే వాళ్ళను సెమ్మదిగానే అయినా గొంతెండుకు పోయేట్టుగా పిలవడమే తప్ప ఫలితం కనిపించడంలేదు. చిటచిటలాడే

ఎండ...ధారలుగా కారుతున్న చెమట...అలాటప్పుడు ఎంత తిక్క వాడయినా, ఎంత పనికిమాలిన వాడయినా రాడుగాక రాడు.

ఈ ముసలి వాడెవడో తీపి మామిడికాయలమ్ముతూ పోతున్నాడు. సావిత్రి వాణ్ణి పిలిచింది. వాడు ఆమె ముందుకు వచ్చి తట్టదింపుకుని 'ఎన్ని కావాలి?' అని అడిగాడు.

'ఒక్కటి చాలు కాని డబ్బుల్లేవు. ఇప్పుడు కాయిచ్చిపోతే సాయంత్రం డబ్బులిస్తా.' అన్నది సావిత్రి కాయలవంక ఆశగా చూస్తూ.

ముసలివాడు గొణుక్కుంటూ బుట్ట తలకెత్తుకుని 'మంచిబేరమే...' అంటూ వెళ్ళిపోయాడు. వరాలు అంతా చూస్తూ నిలబడిందే తప్ప ఏమీ మాట్లాడలేదు.

సావిత్రి అలాగే నిలబడి ఆవులించింది తర్వాత చేతివేళ్ళు విరుచుకున్నది. బలహీనంగావున్న ఒక కుక్కపిల్ల ఏమీ తోచక రోడ్డు మధ్యగా నిలబడివుంది. వరాలు కూనిరాగం తీస్తూ మాటిమాటికీ పమిటతీసి విదిలించి మళ్ళీ వేసుకుంటున్నది. ఆమె మెడలో చవకరకం తెల్లని పూసల గొలుసున్నది.

పరిసరాలన్నీ-గుడిసెలూ, పైన తాటాకు కప్పులూ, ఎదురుగా గడ్డివామీ, చివరకు పక్కనే కాలవలో ఉన్న కొంచెం నీళ్ళూ - అన్నీ వేడెక్కిపోతున్నాయి. చండమార్తాండుడు కహకహ నవ్వుతూ క్రూరంగా రెచ్చిపోతున్నాడు. భూమి అనే పెనాన్ని బాగా వేడెక్కించి సమస్త జీవ రాసులనూ, వస్తు సముదాయాన్నీ కాల్చివేస్తున్నాడు. కాలవలో నామ మాత్రంగా ఎక్కడో కొద్దిగా నీళ్ళున్నాయి. ఎండకు అలిసిపోయిన కాకులు నీళ్ళలో నిలబడి మాటిమాటికీ తలలు ముంచి 'కావుకావు'మని మొరపెట్టుకుంటున్నాయి. వరసగా ఒకదానిమీద ఒకటిగా పేర్చినట్టున్న చిన్న చిన్న పాకలూ, ఆ పాకల్లో మాటిమాటికీ నిట్టూరుస్తూ దీనంగా ఉండే జనమూ, నిర్మేఘమైన ఆకాశమూ, ఆకాశంలో ఎగరలేక ఎగర లేక నీరసంగా ఎగురుతూ పోతున్న రెండో మూడో పక్షులూ -అంతటా అన్నిటా అలసట. మందకొడి తనం...ఆకలి...దాహం...

'బాగా పొద్దెక్కింది.' అనుకున్నది సావిత్రి. అనుకుని వరాలు వంక చూసింది.

వరాలు గుండెలమీద చెయ్యివేసుకుని నెమ్మదిగా 'లాట్రీ ఈపాటికి తీసుంటారేమో ? రూపాయి తగలేసి కొన్నాను. ఇయ్యాల్టికి తిండి జరిగి పోయేది...లాట్రీ తగిల్తే బాగుణ్ణు. దరిద్రం వొదిలిపోద్ది...నాకే గనక దఖ్ఖొస్తేనా ? ఎల్లిపోతాను. ఎటో ఎల్లిపోతాను. ఎల్లిపోయి హాయిగా ఐతుకుతాను...అన్నట్టు టిక్కెట్టు మడిచిపెట్టాను. అట్టా మడవకూడ దేమో...లోపల పుస్తకంలో పెట్టొస్తాను.' అన్నది.

నెమ్మదిగా ఈ మాటలని వరాలు లోపలికి వెళ్ళిపోయింది. లోపల నులకమంచం పక్కన (ఆమంచం పాక ఆసామీది. దానికి వేరే అద్దె) ఉన్న పాత పెద్దబాలశిక్ష తెరిచి ప్లాస్టిక్ పర్సులో ఉన్న టిక్కెట్టు యివ తలికి తీసి మడతలువిప్పి సరిచేసి అందులో వుంచి మూసేసింది. దాని పైన ఏదో బరువు వుంచి మళ్ళీ ఇవతలికి వచ్చింది. వచ్చేముందు గుమ్మంలో ఒక్క క్షణం ఆగి పమిటతీసి గుండెలమీద గట్టిగా ఊదుకుని 'అబ్బబ్బ ! ఏం చెమట ! ఏం చెమట ! ప్రాణాలు పోతున్నాయ్.' అనుకుంటూ వచ్చింది.

సావిత్రికి కళ్ళుతిరుగుతున్నాయి. నిలబడి నిలబడి కాళ్లు బరువెక్కి పోతున్నాయి. 'లోపలికి వెళ్ళి కాస్సేపు చాపమీద నడుంవాల్చి ఒక కునుకుతీస్తే బాగుండున'ను కున్నది. అనుకున్నదేగాని వెంటనే వెళ్ళ లేదు. ఏమో ! ఏ తిక్క మనిషైనా అటువస్తే బేరం తగలవచ్చు... అయినా అది అత్యాశలాగున్నది. ఈపూట అన్నప్రాప్తి ఉన్నట్టులేదు. సరే, ఇది మొదటిసారి గనుకనా! ఎన్నిసార్లు ఇలా కూడులేక మంచి నీళ్ళతో పొట్టనింపుకుని పడుకోలేదు ! మనిషి ఇన్ని కనిపెట్టాడు. ఆకాశంలో ఎగురుతున్నాడు. నీళ్ళలో ప్రయాణం చేస్తున్నాడు. దూరంగా ఎక్కడో ఉన్నవాళ్ళను చూస్తున్నాడు దూరంగా ఉన్నవారితో మాట్లాడు తున్నాడు. ఇతర గ్రహాలకు ప్రయాణాలు చేస్తున్నాడు. అయినా నిరంతరం ఆకలి వెయ్యకుండా ఒక మాత్రలాంటి దేదీ కనిపెట్టలేక పోయాడు. దేశంలో పండుతున్న పంట అంతా ఏమవుతున్నది? అచ్చే

సిన రూపాయి కాయితాలన్నీ ఏగంగలో కలుస్తున్నాయి? ఎందువల్ల, కొందరికసలు – ఆ మాటకొస్తే ఎక్కువ మందికి–అవి కనిపించకుండా పోతున్నాయి?

పక్కన 'ప్రభుత్వ సారా దుకాణము'లో కూడా వ్యాపారంమంద కొడిగా వుంది. గురువులు మాత్రం అక్కడ గుంజ కానుకుని కూర్చుని వున్నాడు. అతడు ఉన్నట్టుండి ఎదురుగా ఉన్నవాడితో 'ఒరే రాగవులూ! సోషలిజమొస్తాదంట' అన్నాడు.

రాఘవులు సర్దుకుకూర్చుని 'సోషలిజమా? అంటే ఏంది గురువులూ?' అని అడిగాడు.

'సోషలిజమంటేనా? ఉండు చెప్తాను.' అంటూ గురువులు బనీను జేబులోనుంచి బీడీతీసి వెలిగించుకుని అగ్గిపుల్లను జాగ్రత్తగా ఆర్పి అవతల పారేసి కాలితో రాచి 'అసలే ఎండాకాలం జాగర్తగా ఉండకపోతే అంతా బూడిదే ..' అన్నాడు.

తర్వాత తీరికగా దమ్ముపీల్చి పొగ వొదిలాడు. "సోషలిజమంటే ఏంటనికదా అడిగావు? అదిగో... ఆ మూడంతస్తుల మేడచూడు, అందులో ముగ్గురే మనుషులుండారు. అవునా?"

"అవును." అన్నాడు రాఘవులు "ఆళ్ళదేగా ఆ మేడ?"

"అవునుకదా? ముగ్గురు మనుషులకంత పెద్దమేడ, అన్నిగదులూ ఎందుకు సెప్పు? అందులో ఏవన్నా పనింగుందా?"

"ఊఁ! అయితే..."

"ఆ ముగ్గురికీ మూడుగదులు సాలు. ఆళ్ళకి మూడు గదులిచ్చేస్తారు."

"ఎవరిస్తారంటావు?"

"ఇంకెవరు? గవర్మెంటోళ్లు."

"మేడంతా ఆళ్ళదేగదా! ఆళ్ళగదులు ఆళ్ళకియ్యడమేంటి?"

"ఆళ్ళదీలేదు. ఈళ్ళదీలేదు. అంతా గవర్మెంటోళ్లు తీసేసుకుంటారు. ఆళ్ళను మూడుగదుల్లో సర్దుకోమంటారు."

"మిగిలిన గదులూ?"
"మన్నాటోళ్ళ కిచ్చేస్తారు."
"బాగుందయ్యా! ఎప్పుడొ స్తదది?"
"ఏంటె సోషలిజమా?"
"ఆఁ! అదే"
"వొచ్చేస్తావుంది" అంటూ చిటికెలు వేశాడు గురువులు.

రాఘవులు కళ్లు మెరిశాయి. సావిత్రి ఈ సంభాషణ అంతావింటూ బొమ్మలా నిలబడివుంది. తర్వాత మళ్ళీ నిశ్శబ్దం.

సినిమా వొదిలారు. హాలు ముందునుంచి వెళ్లేవాళ్లు వెళ్ళగా కొందరు తక్కువ తరగతివాళ్ళూ, సైకిళ్ళవాళ్ళూ వెనకనుంచి వచ్చారు. వరాలు గొంతు పెద్దది చేసింది. సావిత్రి కూడా ఏమీ తీసిపోలేదు. కాని, పని ఏమీ జరగలేదు. అయిదు నిమిషాల్లో అందరూ వెళ్ళిపోయారు. మళ్ళీ అంతా మామూలై పోయింది.

'ఇవాళ వరసేం బాగులేదు' అంటూ లోపలికి వెళ్ళింది వరాలు.

సావిత్రి కూడా ఇక నిలబడలేక లోపలికి వచ్చి చాపమీద నడుం వాల్చి ఉస్సురని నిట్టూర్చి కళ్లు మూసుకున్నది. వేడిగాలి రివ్వున వీస్తూ వుంటే తడికె తలుపుతోసి కొంగు మొహానికి కప్పుకున్నది. ఏవేవో నల్లని గుండ్రని మచ్చలు కళ్ళలో కదులుతున్నాయి. సావిత్రికి అంతలో నిద్ర ముంచుకుని వచ్చింది.

* * *

ఎంతసేపు నిద్రపోయిందో తెలీదు. ఏదో పెద్దరగడ. గొడవ...

ఉలిక్కిపడి లేచింది. బయట ఏదో రణగొణధ్వని. కోలాహలం... చుట్టూ వేడి... పొగలు...

వెంటనే తడికె తలుపుతోసి అరిచారెవరో.

"లోపల ఎవరున్నారు?"

సావిత్రి కళ్లు తెరవగానే ఎదురుగా తడికె చిల్లులలోనుంచి పొగలు

వస్తున్నాయి. గభాలున లేచి తడబడుతూ ఇవతలికి వచ్చింది. గబగబ రోడ్డుమీదికి పరుగెత్తింది.

వేడి....వేడి....అంతటా వేడి...

ఎదురుగా మంటలు... పాకలన్నీ తగలబడి పోతున్నాయి. సంధ్య వేళ నల్లని తెల్లని పొగల మధ్య ఎఱ్ఱని మంటలు... అగ్నిదేవుడు తన ఎఱ్ఱని నాలుకలుచాపి సమస్తాన్నీ విచక్షణారహితంగా మింగివేస్తున్నాడు. జనం ఆబాల గోపాలమూ కట్టుబట్టలతో పరుగులెత్తుతూ శోకాలు పెడుతున్నారు. తలలు బాదుకుంటున్నారు. నుదుళ్లు కొట్టుకొంటున్నారు. ఎదురుగా వెదుళ్లు 'తపతప'మని పేలుతూ కాలిపోతున్నాయి. తాటాకులు 'బుసబుస'మని కాలి ఎగురుతున్నాయి.జనంలో కోలాహలం... కేకలు... పరుగులు... ఏడుపులు...

"అయ్యో అయ్యో! ఇంకెలాగ బతుకుతాం?"
"ఇక సావేగతి."
"అంతా వొచ్చేశారా?"

'బాచమ్మ లేదా? ముసిలి...దానికి జరం... నారం రోజుల్నించీ లేవలేకుండా పడివుంది. అది కనిపించటంలేదు మరి..."

"సారా దుకాణం కూడా అంటుకుంది. ఇంక మంటలారవు. ఊరంతా భస్మమే..."
"నీళ్ళు కావాలొచ్చేస్తున్నాయి."
"వొచ్చి వాళ్లేం చేస్తారు? కాలవలో సుక్కయినా గంగలేదు."
"అయ్యో దేవుడా! ఏంగతి?"

పిల్లామేకా, ముసలీ ముతకా, అంతా కట్టుబట్టలతో మసక చీకట్లో గుంపులు గుంపులుగా నిలబడిపోయారు.

సావిత్రికి గుండెలు దడదడ లాడుతున్నాయి. కాళ్ళు వొణుకుతున్నాయి. కళ్ళు తేలిపోతున్నాయి. నాలుక పిడచ గట్టుకు పోతున్నది. చూస్తూ చూస్తూ ఉండగానే క్షణాలమీద తనయిల్లు తన కళ్ళముందే

పిడికెడు బూడిదయిపోయింది. "అయ్యో! లోపల సర్టిఫికేటు ఉండి పోయిందే" అనుకున్నది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

వరాలు ఏడుస్తూ "నా టిక్కెట్టు, లాట్రీ టిక్కెట్టు, లోపల పెద్ద బాలశిక్షలో పెట్టాను" అంటున్నది.

గురవులు పక్కనే నిలబడివుండి "ఇంకేం లాట్రీ? మరిసిపో... అంతా మసి... బూడిద..." అన్నాడు.

గంటలు మోగించుకుంటూ నీళ్ళ కార్లొచ్చాయి. అందులో నుంచి కొందరు దిగారు. అవీ ఇవీ కాస్సేపు హడావిడిగా సర్దుకున్నారు. ఉన్న నీళ్ళు చిమ్మారు. చాలలేదు. కాలవలో ఉన్న కాసిని నీళ్లూ వాడుకుందా మంటే అటువెళ్ళే వీలులేదు. కాలవ పక్కన అంతా మంటలతో కంచె వేసినట్టుగా ఉంది. అటువైపు నీళ్ళులేని కాలవలో జనం కంగారుగా పరుగెత్తుతున్నారు. తమ పాతగుడ్డలూ, నులకమంచాలూ, కుండలూ, చిప్పలూ, అగ్నిబారి పడకుండా రక్షించుకుని కొందరు కాలవలో కూర్చున్నారు.

సావిత్రి యింతసేపూ కదలలేదు. మెదలలేదు. ప్రాణం లేని కట్టె బొమ్మలా నిలబడిపోయింది. కళ్ళార్పకుండా ఎదురుగా జరుగుతున్న ఘోరం అంతా చూస్తున్నది.

అంతసేపూ మంటలతో ఎర్రబడిన ఆకాశం మళ్ళీ నల్లబడింది. ఇంక కాల్చేందుకు దగ్గర్లో ఏదీలేక అగ్నిదేవుడు శాంతించాడు. కాలిన కట్టెలూ, తాటాకులూ, మసీ, బూడిదా, రెండు మూడు కాలిపోయిన కుక్కలూ, జంగమ శవాల్లాటి మనుషులూ, వారి కాంతిలేని కళ్ళూ, మూటలూ, ముసలమ్మలూ, పిల్లలూ, వారి ఏడుపులూ — అంతా గొడవ గొడవగా నరకంలా వుంది.

సావిత్రి కాళ్ళీడ్చుకుంటూ ఇవతలకి వచ్చి నడవసాగింది. సినిమా హాలు...పక్కనే మరో సినిమాహాలు...ఇవతల జూదాలూ, డ్యాన్సులూ... లైట్లు...వెలుతురు...

అయిదారు నిముషాలసేపు ఏమీతోచని దానిలా పిచ్చెత్తిన దానిలా

తిరిగింది సావిత్రి. తిరుగుతూ మాటిమాటికీ "లాభంలేదు. వెళ్ళిపోదాం" అనుకున్నది. "వెళ్ళిపోయి ఏ రైలుకిందనైనా పడటమా? లేకపోతే ఎక్కడన్నా దూకి చావడమా?" అనుకున్నది. మళ్ళీ అంతలోనే నవ్వుకుని "నీళ్లెక్కడున్నాయి దూకి చచ్చేందుకు?" అనుకున్నది. తర్వాత మళ్లీ నడవటం సాగించింది.

వంతెన కింద బడ్డీకొట్టు బయట చెక్క బల్లమీద కూర్చుని వున్నాడు గురవులు. బడ్డీ కొట్లో లయిటుంది గాని కరెంటు కొరత మూలంగా లైటు వెయ్యకూడదని రూలుండటం మూలాన ఆ కొట్టు యజమాని రెండు కొవ్వొత్తులు వెలిగించి పెట్టుకుని కూర్చుని వున్నాడు. చుట్టుపక్కల ఇంకెవరూ లేరు. పనికిమాలిన కోయిల ఒకటి సందర్భ శుద్ధి లేకుండా ఎక్కడో దాక్కుని నీరసంగా కూస్తున్నది. పక్క యిళ్ళలో ఎక్కడినుంచో రేడియోలో కాబోలు 'నాదు జన్మభూమి కన్న నాక మెక్కడుందీ? సురలోక మెక్కడుందీ?' అని దేశ వైభవాన్ని గానం చేస్తున్నా రెవరో.

సావిత్రి గురవులు పక్కన నిలబడింది. గురవులు ఆమెను చూసి "నువ్వా? ఇంతసేపూ ఎక్కడి కెళ్ళావ్?" అని అడిగాడు.

"ఎక్కడికీ పోలేదు. అది సరేగానీ...పొద్దుటె నుంచీ టీ నీళ్ళయినా తాగలేదు. నీరసంతో చచ్చిపోతున్నాను. ఒక పావలా ఉంటే ఇయ్యి. టీ తాగొచ్చి...టీ తాగొచ్చి...ఎటన్నా పోదాం... పడుకుంటాను..."

గురవులు ముందు "అయ్యో! పాపం" అన్నాడు. తర్వాత "నాకాడ అస్సలు డబ్బుల్లేవే...ఎట్టా?..." అన్నాడు.

సావిత్రి నెమ్మదిగా కదిలి నడవడం మొదలు పెట్టింది. కొద్ది దూరంలో వంతెన...వంతెన మీద చీకటి...

గురవులు లేచాడు. దూరంగా నడిచిపోతున్న సావిత్రిని చూశాడు. చేతివ్రేళ్ళు విరుచుకున్నాడు. నిజానికి అతని బనీను జేబులో పావలా డబ్బులున్నాయి. కాని, మరి కాస్సేపట్లో అతడు బ్రాకెట్ కట్టవలసి

వుంది. ఇవాళ అతడు అనుకున్న నెంబర్లు ఖచ్చితంగా దిగి తీరుతాయి అంత గట్టి నమ్మకం ఉంది మరి.

ఇప్పుడతని మనసంతా చెడిపోయింది. ఉన్నట్టుండి 'సరే' అనుకుని గబగబ నడచి "ఇదుగో నినే అని పిలిచాడు.

సావిత్రి ఆగి వెనుదిరిగి చూసింది. గురువులు ఆమె దగ్గరికి నడిచి వచ్చి "ఇదుగో...పావలా ఉందిలే... తీసేసుకో...టీ తాగు..." అని పావలా తీసి ఆమె చేతికిచ్చాడు. సావిత్రి అది తీసుకుని నవ్వింది.

గురువులు తలవూపి "ఎదవ బ్రాకెట్టు... తర్వాత కట్టుకోలేక పోతానా? రాకపోద్దా? నువ్వు మళ్ళీ రావొద్దులే...ఎల్లిపో...నాకాడ ఓపిక లేదియ్యాళ..." అంటూ వెను దిరిగి త్వరత్వరగా నడిచిపోయాడు.

సావిత్రి వంతెన మీద ఓపిక చేసుకుని త్వరత్వరగా నడిచింది. అవతల చాలా దూరం కరెంటు కోత మూలంగా లైట్లు లేక చీకటిగా వుంది. దూరంగా ఎక్కడో వీధి మలుపులో ఒక ఒంటరి టీ దుకాణం... అందులో హరికేన్ లాంతరు ప్రసరిస్తున్న వెలుతురు...అక్కడ చెక్క బల్లమీద కూలబడి కొంగుతో విసురుకుంటూ దుకాణం వాడితో "మంచి టీ చేసియ్యి..." అన్నది.

అంతలో మబ్బులేని పిడుగు పడ్డట్టయింది. సావిత్రి గుండెలు గుబగుబ లాడాయి. మెళ్ళో గొలుసు సవరించుకుంటూ వచ్చాడక్కడికి అప్పారావు. ఆమెను అక్కడ చూసి కాస్త ఆశ్చర్యపోయి "అరె!నువ్వా? నీ యిల్లు కూడా కాలిపోయిందా?" అని అడిగాడు.

సావిత్రి తల వూపింది.

అతడు నవ్వి "పోతేపోనీ... అది నీ సొంత యిల్లేం కాదుగా? ఊఁ! సరే, నాతో వొచ్చెయ్ ఈ పూటకి. ఇంటికాడ ఎవళ్ళూ లేరు. ఒంటరోణ్ణయి పోయాను." అని టీ దుకాణం వాడితో "నాక్కూడామంచి టీ కలపవయ్యా" అంటూ కూర్చున్నాడు.

సావిత్రి టీ అందుకుంటూ నీరసంగా నవ్వింది. భయం భయం

గాః  నవ్వింది. అయినా తప్పదు. ఆమె కళ్ళ ముందు నల్లని మచ్చలు ఇంకా తిరుగుతూనే వున్నాయి. గుండెల్లో కర్ఫ్యూ రోజులనాటి పది రూపాయల బాకీ భయంకరంగా గంటలు కొడుతున్నది. ఈ రాత్రికిక తప్పదు. వడ్డీ క్రింద తన ఆయువు తరిగిపోవడమూ తప్పదు.

వంతెన క్రింద ఆ చిన్న దీపం మినహాయిస్తే అంతా చీకటి ... కాటుకలాటి చీకటి. తన ఆకలిలాంటి చీకటి...తనకు పాపపు బ్రతుకిచ్చిన దేవుడు పైనుండి వసూలు చేస్తున్న వడ్డీలాటి చీకటి.

# ముసుర

గడ్డం క్రింద చేయి ఆనించి వుంచుకుని దూరంగా కొండమీద తెరలు తెరలుగా కురుస్తున్న వర్షంవంక చూస్తూ కూర్చున్నాడు సింహాచలం. చలిగాలి విసురుగా వేగంగా వీస్తున్నది. కొట్టుమీదవున్న రేకులపైన రాళ్లు కురిసినట్టు దడదడమని ధ్వని వినిపిస్తున్నది. ఎదురుగా గాలికి అటూ ఇటూ వూగుతూ వర్షంలో తడుస్తున్నాయి పొడుగాటి చెట్లు. ఏ సాంద్రారణ్యం లోనో బలిసిన ఏనుగులన్నీ ఒకచోట చేరినట్టు మబ్బులు ఆకాశంలో గుమిగూడి గర్జిస్తున్నాయి. ఆ మబ్బులను చీల్చుకుని అప్పుడప్పుడు కళ్లు మిరుమిట్లు గొలిపేలా ఆకాశంలో గీత గీసినట్టు తళతళ మెరుస్తున్నది మెరుపుతీగ...

"ఛీ! ఎదవ ముసురు..." అనుకున్నాడు సింహాచలం విసుగ్గా... అయిదారు రోజులనుంచీ ఒకటే ముసురు...ఎడతెగకుండా రాత్రి పగలూ ఒకటే వర్షం...దూరంగా కనిపించే కొండలనూ, అడవులనూ నీళ్ళలో ముంచెత్తినట్టయింది. ఎక్కడ చూసినా నీళ్ళు...బురద...

సింహాచలం పాతమఫ్లరు చెవులచుట్టూ చుట్టుకుంటూ కళ్ళు పెద్దవి చేసుకుని చూశాడు. దూరంగా సన్నని తారురోడ్డుమీద జీపు ఒకటి వొస్తున్నది. అతడు లేచి నిలబడి వొళ్ళు విరుచుకున్నాడు. నోరంతా చేదుగా వుంది. పక్కన సీసాలో అడుగునవున్న పిప్పరమెంటు తీసుకుని నోట్లో వేసుకుని అతడు చూరు క్రిందకి వచ్చి నిలబడ్డాడు ... అవతల చిన్న పాకలో వుండే గురవయ్య కొడుకు వెంకడు అంత వర్షంలోనూ వొంటి మీద చొక్కా లేకుండా చేతిలో రెండు మూడు ఉప్పు చేపలతో ... ఒక చిన్న నూనె సీసాతో తడుస్తూ నడిచి పోతున్నాడు.

అంతకుముందు తారురోడు మీద దూరంగా కనిపించిన

మలుపు తిరిగి ఎటుపోయిందో, యిప్పుడు కనిపించడంలేదు. మరి కొద్ది సేపాగితే గాని అది మళ్ళీ కనిపించదు. సింహాచలం "వాళ్ళేనేమో..." అనుకుంటూ మాసిన గడ్డాన్ని చేతులతో తడుముకుంటూ అలాగే నిలబడ్డాడు. లోపల పాకలో ఏదో చప్పుడవుతున్నది.

ఇంతలో బంగారయ్య తాటాకు గొడుగులో వచ్చి "బీడీలియ్యి వయ్యా..." అన్నాడు. సింహాచలం బీడికట్టతీసి యివ్వబోతే తీసుకో కుండా తలవూపి "నువ్వు మనలోకంలో ఉండేట్టులేదే... ఏం కత? ఈ బీడీలెప్పుడన్నా తాగానా నేన.?" అని అడిగాడు.

సింహాచలం వెంటనే "నీ మాట్కా బీడీల్లేవు...ఇయాల్టికి ఈటితో సరిపుచ్చుకో... ఈ ముసురు తెరిపిస్తే ఎల్లి సరుకులన్నీ పట్టుకొస్తాను... అన్నీ నిండుకుండయ్..." అన్నాడు.

బంగారయ్య నవ్వుతూ ఆ బీడీకట్ట అందుకుని ఒక బీడీ యివతలకి తీసి వెలిగించుకుని "ఇంక నువ్వేం ఎల్తావులే...బంగారమంటి కోమటి.. సంగీతంతో సెద్దాడంట... ఇన్నాను... ఇన్నాను... అంతా ఇన్నానయ్యా... కలికాలం బుద్దులట్టా ముంచుకొస్తావుంటే నిన్నని ఏం లాభం?" అన్నాడు. సింహాచలం బొమ్మలా నిలబడిపోయాడు. బంగారయ్య అంతలో కదిలి "పద్దురాసుకో..." అంటూ వెళ్ళిపోయాడు.

సింహాచలానికి వొళ్ళు మండింది. కోపంతో క్రింద పెదవిని కొరు క్కుంటూ నిస్సహాయంగా నిలబడి దూరంగా రోడ్డుమీదకి చూశాడు. అంతలో జీపు మళ్ళీ కనిపించింది. రెండుమూడు నిముషాల్లోనే అది వేగంగావచ్చి అతని కొట్టుముందు ఆగింది. దానిచుట్టూ వర్షపుజల్లు పడ కుండా తెరలున్నాయి. లోపల ఎవరున్నారో కనిపించడంలేదు. అంతలో ఒకాయన బరువైన బూట్లతోదిగి, గొడుగు విప్పి, విసుక్కుంటూ, నీళ్ళను చిందగొడుతూ నడిచివచ్చి "ఏమయ్యా! గోల్డ్‌ఫ్లేక్ సిగిరెట్లు న్నాయా?" అని అడిగాడు.

సింహాచలం తల అడ్డంగావూపి వినయంగా "లేవుబాబూ! చార్మి నార్ తప్ప ఏవీలేవు...పాడు ముసురు...ఎటెల్లేందుకూ ఈల్లేకుండా..." అని చెప్పాడు.

ఆయన జీపువైపు తిరిగి పెద్దగా "ఫోర్ కాసిల్స్ తప్ప మరేపీ లేవుట... తెమ్మంటారా?" అని అరిచాడు.

ఎవరో చెయ్యి బైటికిపెట్టి "తెమ్మ"ని సైగచేసి మళ్ళీ వెంటనే చేతిని లోపలికి తీసుకున్నారు. ఆయన సింహాచలం వంక తిరిగి "సరే ...నాలుగు ప్యాకెట్లివ్వు..." అంటూ డబ్బు తీశాడు.

సింహాచలం సిగిరెట్ ప్యాకెట్లు ఆయనకు అందించి రూపాయి కాయితం తీసుకుని మిగిలిన చిల్లర యిచ్చాడు. ఆయన వాటిని కోటు జేబులో పడేసుకుని మళ్ళీ విసుక్కుంటూ నీళ్ళను చిందగొడుతూ జీపు దగ్గిరికి వెళ్ళాడు. ఆయన ఎక్కగానే జీపు కదిలి అంతలోనే కనుచూపు మేర దాటిపోయింది.

సింహాచలం చేతులు రుద్దుకుంటూ కొద్ది క్షణాలు నిలబడ్డాడు. తర్వాత బంగారయ్య మాటలు గుర్తువచ్చాయి. "ఏదో... ఇన్నాడంట... ఆడిబొంద... వొట్టి తాగుబోతు ఎదవ..." అనుకున్నాడు. మొన్న మొన్నటి వరకూ బంగారయ్యకు నిదరలో నడిచే జబ్బుండేది. రాత్రిపూట అటూ ఇటూ తిరుగుతూ కనిపించేవాడు... ఒకనాడు అర్ధరాత్రివేళ నిద్ర లోనే నడుస్తూవచ్చి ఒక ఎద్దుముందుకు వెళ్ళి నిలబడ్డాడు. అతని అదృ ష్టం మంచిది కావడాన, అతని పెళ్ళాం మెడలో నల్లపూసలతాడు గట్టిది కావడాన సింహాచలం అప్పుడు మేలుకుని వున్నాడు. గభాలున లేచివెళ్ళి యివతలికి ఈడ్చుకు రాబట్టి బతికిపోయాడు.. లేకపోతే ఆనాడు ఆ పోట్ల ఎద్దు అతన్ని కుమ్మికుమ్మి చంపేసి వుండేది.

సింహాచలం చిన్నపుస్తకంతీసి అందులో బంగారయ్యపేర బీడీకట్ట పద్దురాసి, ఏమి తోచక ఎవరెవరు ఎంత బాకీ వున్నారో లెక్కచూస్తూ కూర్చున్నాడు. గుర్నాథం...ఆయనొక కంట్రాక్టు గుమాస్తా... పదిరూపా యల చిల్లరయివ్వాలి. రంగడు... వీడు ఎరువుల ఫ్యాక్టరీలో కూలీ... అయిదురూపాయల పదిపైసలు. అప్పలస్వామి... కొండమీద బంగళాలో వాచ్‌మన్...పదిహేను రూపాయలు. పోతరాజు...వీడికి పనీపాటూలేదు... పెళ్ళాం అడివిలో పుల్లలేరుకుని కట్టలుకట్టి రైలుదగ్గర అమ్ముకువచ్చి పెడుతుంటే తిని బలాదూరు తిరుగుతూవుంటాడు... ఎనిమిది రూపాయల

యిరవై పైసలివ్వాలి. . . పైగా పెళ్ళానికి చెప్పొద్దని కాళ్ళు పట్టుకుంటాడు. సుబ్రమణ్యం . . . ఈయనకు నెలజీతం ఎంతో తెలియదు . . .గోల్డ్‌ఫ్లేక్ తప్ప మరొకటి కాల్చడు . . . పద్దెనిమిది రూపాయలివ్వాలి . . .

సింహాచలం ఆ చిన్న పుస్తకంలో పేజీలు తిప్పుతున్నవాడల్లా ఒకచోట ఆగిపోయాడు. తర్వాత నిట్టూర్చాడు. ఆ పేజీలో పైన వంకర టింకర అక్షరాలతో "సింగారవేలు" అనిపేరు వ్రాసివుంది. క్రిందకాతా... తర్వాత ఒక గీత . . . పేజీ చివర మూడురూపాయల పదిపైసలలెక్క...

సింగారవేలు అతని కళ్ళలో మెదిలినట్టయింది. సింగారవేలు సన్నగా పొడుగ్గా చువ్వలా వుండేవాడు...ఎల్లప్పుడూ లుంగీ పైకి కట్టుకుని నవ్వుతూ తిరుగుతూ వుండేవాడు... వచ్చీరాని తెలుగులో మాట్లాడుతూ అందర్నీ నవ్విస్తూ వుండేవాడు... అక్కడే బల్లమీద కూర్చుని మద్రాసును గురించీ, అక్కడి సినిమాలను గురించీ ఎడతెగకుండా కబుర్లు చెబుతూ వుండేవాడు . . .

సింహాచలం ఆలోచనలకు అడ్డుకట్ట వేసి పక్కకు చూశాడు. అప్పలస్వామి చిరుగుల గొడుగులో వచ్చి చూరుక్రింద నిలబడి దాన్ని నెమ్మదిగా మూసి ఒక పక్కనవుంచి "ఏమయ్యా! సింహాచలం—పేరం లేదనుకుంటానే బొత్తిగా . . ." అన్నాడు కూర్చుంటూ

సింహాచలం తల అడ్డంగా వూపి నిట్టూర్చి "ఇట్టా ముసురు పట్టిందిగదా! ఏం చెయ్యన్చెప్పు...ఒక్క సరుకులేదు కొట్లో..." అన్నాడు.

"అవునవును—ఇది గాలివానంట...బంగళాలో పెద్దోళ్ళనుకుంటా వుంటే యిన్నాను. ఇప్పట్లో తగ్గదంట..." అని చెయ్యిచాపి "ఏది ? బీడీకట్ట అందుకో...!" అన్నాడు అప్పలస్వామి...

సింహాచలం లేచి బీడీకట్ట యిచ్చి పద్దుతీసి "పదిహేను రూపాయలైంది నీ పద్దు. . .బొత్తిగా డబ్బులేదు . . .ఎప్పుడిస్తావు?" అని అడిగాడు.

అప్పలస్వామి బీడీ ముట్టించి అగ్గిపుల్లను విలాసంగా ఆర్పి అవతల పారేస్తూ "ఇస్తాలేవయ్యా! డబ్బురానియ్..." అన్నాడు. తర్వాత ఒక్క క్షణం ఆగి లోపలికి చూసి అదోరకంగా నవ్వుతూ "అయినా నీ

కిప్పుడు డబ్బుకు కొరవేంటి... బతే పిట్టను పట్టావు... నాకు తెలుసుగా దాని మెడనిండా బంగారమే... అన్నట్టు కథ ఎందాక వొచ్చిందేం? అయినా నా పిచ్చిగాని నువ్వు చెప్తావా? ఏవో చాదస్తం కొద్దీ అడిగా నంతే..." అని ఊరుకున్నాడు.

సింహాచలం కళ్ళు ఎర్రబడ్డాయి. కోపం పొంగివచ్చింది. అయినా తమాయించుకుని ఏమీ మాట్లాడకుండా అలాగే నిలబడిపోయాడు. అప్పల స్వామి కాస్సేపు నిశ్శబ్దంగా కూర్చుని తీరికగా బీడీ కాల్చుకుని లేచి నిల బడి తలగుడ్డ విదిలించి చుట్టుకుంటూ "తిరపతిగాడు...అదే నీ మాఁవ... కోపంతో చిందులు తొక్కుతున్నాడయ్యోయ్. అచ్చి కూడా మొన్న కన బడింది. ఒకటే ఏడుపంట రాత్రింబగలూ...తండ్రీ కూతుర్లు నీ పేరు ఇంటే సాలు మండిపోతా వుండారు... అయినా నువ్వు నాకు నచ్చావు.., ముందు మన లాబం చూసుకోవాలి... లేకపోతే ఈ లోకంలో బతకలేం.. మంచిపనే చేశావ్...కానియ్. కానియ్.." అంటూ గొడుగు తెరుచుకుని వెళ్ళిపోయాడు.

సింహాచలం నిస్సహాయంగా చూస్తూ కొయ్యబొమ్మలా నిలబడి పోయాడు. ఒక్క నిమిషం ఆగి ఎవరో తరుముకు వచ్చినట్టు లోపలికి పరుగెత్తుకు వెళ్ళాడు. లోపల పెరియనాయకి దణ్ణెంమీద తడిచీరను ఆర వేస్తున్నది. అడుగులు చప్పుడు విని వెనుదిరిగి చూసింది. ఆమెవి చెంపకు చేరెడేసి కళ్ళు...ఆ కళ్ళలో ప్రస్ఫుటంగా కనిపించేది అమాయకత్వం... చామనచాయ వొంటిరంగు...ప్రత్యేక శ్రద్ధతో తీర్చిగా కూర్చుని ఎవరో శిల్పి మలచినట్టుండే చక్కని విగ్రహం...

మనసులో అనుమానం తీరగానే సింహాచలం మళ్ళీ వెనుతిరిగి కొట్టుమీదికి వచ్చాడు. అతనికి ఈ అయిదారు రోజులనుంచీ కంటిమీద కునుకులేదు మనసులో ప్రశాంతతలేదు. ఆమె పరాయి మనిషి... మన భాష తెలీదు...కళ్ళు పెద్దవి చేసుకుని అమాయకంగాచూడ్డంతప్పమరేమీ చేతకాదల్లేవుంది ఆమెకు. నిశ్శబ్దంగా ఏడుస్తూ ఒక మూల కూర్చున్నదీ అయిదారు రోజులనుంచీ...సింహాచలం ప్రతి నిమిషమూ జాగ్రత్తగా వున్నాడు. అతని మనసులో అనుమానం...ఆమె తన కన్నుగప్పి ఏ

నిమిషంలో ఏ అఘాయిత్యం చేస్తుందో అని దిగులు...అందుకే కొట్లో సరుకులన్నీ నింపుకున్నా అతడు ఎక్కడికీ వెళ్ళలేదు. జాడ్డనికి ఓ గుక్కెడు ప్రాణాలూ పోవడానికి ఎంత కావాలి ? ఒక మూరెడు గుడ్డ పేలిక గాని తాడుగానీ చాలు...దొడ్లో బావి వుండనే వుంది. అదీ గాక పోతే కొంచెం కిరసనాయిలూ... ఒక అగ్గిపుల్లో ... అన్నీ ఆమెకు అందుబాటులోనే వున్నాయి. అందువల్లనే అతడు రాత్రిపూట కూడా కంటిమీద కునుకు లేకుండా మేలుకుని గడిపాడు. ఎప్పుడన్నా కొద్ది నిమిషాలసేపు కునుకు పడితే మెలుకువ రాగానే ఉలికిపడి లేచి చివాలున లోపలకి వెళ్ళి చూసేవాడు. తీరా చూస్తే ఆమె లోపల నేలమీద కొంగు పరుచుకుని నిద్రపోతూ వుండేది. పగటిపూట ధైర్యంచేసి ఆమెను వొంటరిగా వొదిలి సరుకుల కోసం వెళ్ళినా ఆమెను గురించీ ఆమె మెడలో నగల గురించే దిగులు తప్పదు...

అతడు కాళ్ళు ముడుచుకుని బల్లమీద కూర్చుని తాను అన్ని వివరాలతో ఉత్తరం వ్రాయించి ఎన్నాళ్ళయిందో వ్రేళ్ళు మడిచి లెక్కవేసుకున్నాడు. ఎంత ఆలస్యంగా చేరినా వాళ్ళకు ఆ ఉత్తరం ఈ పాటికి అందివుండాలి...వాళ్ళు ఈపాటికి బయలుదేరి రావల్సిందే మరి ... అయినా ఆనాడు బంగళాలోవుండే ఆ ముసలి పంతులు వాళ్ళ అడ్రసు సరిగ్గా రాసేడో, లేదో...అసలు ఆమె చెప్పిన అడ్రసు సరి అయినదో, కాదో...

అంతలో తిరపతి వానచినుకులలో తడుస్తూ తడబడుతూ నడుస్తూ వచ్చాడక్కడికి. సింహాచలం లేచి నిలబడ్డాడు. తిరపతి నుదుటినీ కనురెప్పలనూ తుడుచుకుంటూ కూర్చుని ముందు అదొక రకంగా నవ్వాడు. సింహాచలం ఏం మాట్లాడాలో, ఏం చెయ్యాలో తెలీని వాడిలా నిలబడి వుండిపోయాడు.

తిరపతి నలభై ఏళ్ళవాడు. బాగా తాగినట్టున్నాడు. మనిషిలో నిలకడ లేదు. అతడంతలో సింహాచలంవంక క్రూరంగా చూస్తూ కొన్ని క్షణాలు ఏమీ మాట్లాడలేదు. తర్వాత హఠాత్తుగా "ఏరా ! నా ముద్దుల అల్లుడూ అది లోపలే వుందా యింకా ?" అని అడిగాడు.

సింహాచలం తలవూపి ఊరుకున్నాడు.

"అవును...వుంటుందిలే...ఉండక మరింక యాడికి పోద్ది పాపం ...మంచి మొగోడివి దొరికావు...అదింక నిన్ను వొదిలి పెట్టుద్దా... అసలు మేవంతా తెలివితక్కువ సన్నాసులంరా ... నువ్వొక్కడివే ఈడ తెలివిగల మొగోడివి ... అంతే మరి..." అన్నాడు తిరపతి ఎగతాళిగా...

సింహాచలం తిరపతికి దగ్గరగావచ్చి "మావా! నువ్వు సెప్పుడు మాటలిన్నావు, తప్పుడు మాటలిన్నావు ... వాటిని నమ్మమాకు... తల్లి తోడు నేనే పాపం ఎరగను. ఆ పిల్ల పాపం కష్టంలో వుంది. ఆళ్ళ పెద్దోళ్ళకు కార్డు రాయించి పడేసినాను. ఆళ్ళొచ్చి ఆ పిల్లను తోలుకెళ్ళి పోతారు...నా మాట నమ్ము..." అన్నాడు.

తిరపతి ఉన్నట్టుండి పెద్దగా నవ్వటం మొదలు పెట్టాడు. లేచి వంగిపోయి పొట్టపట్టుకుని మరీ నవ్వాడు. తర్వాత అకస్మాత్తుగా గంభీరంగా మారిపోయి "అరేయ్! నాకు యాభై ఏళ్ళురా...ఇట్టాటి మోసపు మాటలీ సెవుల్తో ఎన్ని యిన్నానో లెక్కలేదు...గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించిందట...నాకు సదువులు నేర్పుతావురా దగాకోర్ ... లచ్చికి నీ సంగ తెలీదురా...పాపం పిచ్చి పిల్ల...నిన్ను నమ్మింది...ఇప్పుడందరికి నీ ద్రోహం తెలిసిందిరా ... అదురష్టమంతుడివిలే... మంచోళ్ళ మద్దె నున్నావు...ఇంకో సోట అయితే పిచ్చికుక్క నాగా కొట్టి తరిమేసే వాళ్లు...సరే...నీ కిప్పుడే చెప్పేత్తే మంచిది...లచ్చి మీన ఇంక ఆశలు పెట్టుకో మాకు...దానికి కోటిగాడికి నిన్ననే మనువు కుదిర్చేసినాం..." అంటూ లేచాడు.

సింహాచలం నివ్వెరపోయాడు. విషయం యింత దూరం వొస్తుందని అతడు కలలో కూడా అనుకోలేదు. అతని నోట మాట రాలేదు. అవాక్కయి శిలా ప్రతిమలా నిలబడిపోయాడు.

తిరపతి విజయం సాధించిన వాడిలా లేచి నిలబడి లోపలికి చూస్తూ మెటికలు విరిచి "అమ్మా! మహాతల్లీ! నువ్వెవరివో నాకు తెల్దు...

కాని గొప్ప తెలివిగల్దానివి... సుకపడతావు... నా ఉసురుకూడా పోసుకు బతుకు" అంటూ కొంత దూరం వెళ్లి ఆగి "ఇది లోకంరా... ఈడ తెలివి తక్కువోళ్లు ఎవరూ లేరు... పైన దేవుడుండాడ్రా... అంతా సూస్తానే వుంటాడు. నీకూ, దానికీ కనా కష్టపు బతుకు రాసిపెట్టే వుందిలే... ఇంతకింత అనుభవిస్తారు... ఎగిరి పడమాకండి.." అని తిడుతూ వెళ్లిపోయాడు.

సింహాచలం సర్వస్వం కోల్పోయిన వాడిలా ఒక్క నిముషం దీనంగా కూర్చున్నాడు. తర్వాత ఉన్నట్టుండి అతనికి కోపం ముంచుకొచ్చింది. లోపలచేరి యిరవై నాలుగ్గంటలూ ఏడుస్తూ ఈ పిల్ల అతని కొంపమీదకి తెచ్చింది. అతని బతుకులో నిప్పులు పోసింది. ఆమె నిహయిక్కణ్ణుంచి తరిమివేస్తే తప్ప లాభంలేదు. అతడంతలో కోపంతో మొహం కందగడ్డలా చేసుకుని పెద్ద పెద్ద అంగలు వేస్తూ లోపలికి వెళ్ళాక పెరియనాయకి– ఏం గుర్తు వచ్చిందో ఏమో — పెరటి గుమ్మంలో కూర్చుని నెమ్మదిగా ఏడుస్తున్నది.

సింహాచలం చప్పగా చల్లబడిపోయాడు. అంతలోనే "అయ్యో పాపం" అనిపించిందతనికి. దగ్గరికి వెళ్లి నిలబడి ఓదార్పుగా "ఊరుకో అమ్మా! నువ్వట్టా కళ్ల రొత్తలు పడేట్టు ఏడిస్తే మాత్రం ఆ పోయినోడు తిరిగొస్తాడా? గుండె రాయిచేసుకో... నా మాటినుకో..." అన్నాడు.

ఆమె కతని మాటల్లో ఎన్ని అర్థమయ్యాయో అతనికి తెలియదు. అయినా కొంగుతో కళ్లు తుడుచుకుని పేడుపుమానేసి దూరంగా కొండల వంకా, కొండలమీద దట్టంగా ఉన్న చెట్లవంకా, చూస్తూ ఉండిపోయింది.

అంతలో వాకిట్లో ఎవరిదో నవ్వు వినిపించింది. అతడు వెంటనే యివతలికి వచ్చాడు. గుర్నాథం నెత్తిన గుడ్డకప్పుకుని నిలబడివుండి నవ్వుతూ సింహాచలం వంకే చూసి "రెండు సిగిరెట్లియ్యవయ్యా!" అన్నాడు. అతడు సిగిరెట్లు తీసుకుని తన దారిన తాను పోకుండా, "ఓహ్! ఏం వాన! ఏం వాన; ప్రాణం తీసేసిందే... ఎప్పుడు తెరిపి యిస్తుందో గాని... సూర్య భగవానుడి దర్శనమే కాలేదు అయిదారు

రోజులనుంచీ. నేను పుట్టి బుద్దెరిగిన తర్వాత యింతటి గాలి వాన చూళ్లేదనుకో..." అన్నాడు.

తర్వాత మళ్ళీ ఒక్క క్షణం ఆగి 'అయినా నీకిదంతా పట్టదులే... హుషారుగా వున్నావు... నేనంతా విన్నాన్లే... మంచి పనే చేశావు... ఆపదలో వున్న ఆడపిల్లను రక్షించినట్టూ అయింది నీకు, మంచి లాటు దొరికినట్టూ అయింది. అంతేమరి... ఏ పని చేసినా ఇహ పరాలు రెండూ చూసుకోవాలి..." అంటూ విరగబడి నవ్వాడు. తర్వాత తన దారిన తాను వెళ్లిపోయాడు.

సింహాచలం మతిపోయిన వాడిలా కూలబడ్డాడు. తర్వాత వొణుకు తున్న వ్రేళ్ళతో చెక్కబల్లమీద కాస్సేపు తబలావాయించాడు. వెంటనే వున్నట్లుండి ఒక సోడా కొట్టుకుని గడగడా తాగి బీడితీసి ముట్టించాడు. అలవాటు లేనందువల్ల ముందు పొగ గుండెల్లోకి పోయి దగ్గువచ్చింది. వెంటనే తమాయించుకుని కాళ్ళు బల్లమీదకి జాపి కూర్చుని సారా తాగిన వాడిలా "ఒరేయ్! మీరందరూ మడుసులుకారు... పసరాల్రా...ఆ పిల్లకూ నాకూ రంకు కడతారంట్రా... ఒకొక్కడూ... రండ్రా... మీ అంతు తేల్చేస్తాను... రండ్రా ఒక్కొ దెబ్బతో అందర్నీ సఫా చేస్తాను! రండ్రా..." అని అరిచాడు పెద్దగా...

పెరియనాయకి లోపలి నుంచి వచ్చి చూసింది. అక్కడ చుట్టు ప్రక్కల ఎవరూలేరు. అతడెవరితో అలాఉద్రేకంగా మాట్లాడుతున్నాడో ఆమెకర్థం కాలేదు.

అంతలో అతడు వెనుదిరిగి చూసి సిగ్గుపడిపోయాడు. బీడీ అవతల పారేసి మామూలుగా కూర్చుని కూనిరాగం తీయడం ప్రారంభించాడు. ...కొన్ని క్షణాలు ఆగి వెనుదిరిగి చూస్తే ఆమె అక్కడలేదు. అతడు గుండెలనిండా గాలి పీల్చుకుని కళ్లు మూసుకుని అలాగే కూర్చున్నాడు.

—అంతకుముందు చాలాసార్లు సింగారవేలు తనను గురించిన వివరాలూ, తన యిబ్బందులూ అన్నీ చెప్పుకున్నాడు. అతడక్కడికివచ్చి మూడు నెలలయిందేమో! వచ్చీరాగానే ఎరువుల ఫ్యాక్టరీలో పనిలోచేరి

ఒక పాకలో కాపురం పెట్టాడు. అతన్నీ పెరియనాయకినీచూసి అందరూ మొగుడూ పెళ్ళాలనే అనుకున్నారు మొదట్లో...కాని అసలు విషయం ఎవరికి, ఎలా తెలిసిందోమరి, ఉన్నట్టుండి అందరూ "అరవ్వాడు ఆ పిల్లను లేవదీసుకొచ్చాడంటూ..." అని చెప్పుకోడం ప్రారంభించారు. ఆ విషయం అందరికీ తెలిసింది. సింగారవేలు ఆ మాటలను వినికూడా పట్టించుకోలేదు. మామూలుగానే నవ్వుతూ తిరిగేవాడు. సింహాచలంతో ఒకసారి "అవును తంబీ! ఆళ్ళంతా అనుకునేది నిజం!" అని చెప్పాడు కూడా...ఆ సందర్భంలోనే తమ కథ అంతా చెప్పుకొచ్చాడు...పెరియ నాయకీ, సింగారవేలూ చిన్నప్పటినుంచీ ప్రేమించుకున్నారు. అయితే కొన్నేళ్ళ తర్వాత ఆ రెండు కుటుంబాలమధ్యా కోర్టులో ఒక వ్యవహారం నడిచింది...అది తేలేందుకు చాలాకాలం పట్టింది. చివరకెప్పుడో వ్యవ హారం ముగిసింది. ఒకరు గెలిచారు. మరొకరు ఓడిపోయారు. ఇంత కాలమూ వారి మధ్య ఉంటూవచ్చిన ద్వేషాలూ, పగలూ తగ్గలేదుసరికదా మరింతగా ఎక్కువయ్యాయి. ఈ యింటిమీది కాకి ఆ యింటిమీద వాల డానికి వీల్లేదు...ఈయింటి పిల్లలు ఆ యింటి పిల్లలతో ఆటలాడు కోరాదు...వారూ, వీరూ ఎదురైతే మూతులు ముడుచుకుని, మొహాలు మాడ్చుకుని వెళ్ళిపోవడం...అప్పుడప్పుడు పిల్లులమీదా, ఎలుకలమీదా పెట్టుకుని ఒకరినొకరు తిట్టుకోడం, ఆడిపోసుకోడం, ఎక్కువైంది... అంతలో పెరియనాయకి తండ్రి ఆమె కొక సంబంధం కుదుర్చుకు వచ్చాడు. పెరియనాయకి ఏడ్చింది. తల్లితో తనకా పెళ్ళి యిష్టంలేదని చెప్పింది. తండ్రితో చెబుదామనుకున్నదిగాని భయంవల్ల చెప్పలేక పోయింది. తల్లి మాత్రం కూతుర్ని నాలుగుతిట్టి వూరుకున్నది. అంతలో యింట్లో పెళ్ళిపనులు ప్రారంభమైనాయి. పెరియనాయకి యిక సహించలేకపోయింది. చాటుగా సింగారవేలును కలుసుకుని మాట్లాడింది. అతడు ఆమెకు ధైర్యం చెప్పాడు. మాటిమాటికీ 'నేను నిన్ను ప్రేమిస్తు న్నాను...నువ్వు లేకపోతే బతకలేను...' అన్నాడు. తర్వాత ఇద్దరూ ఒకచోట కూర్చుని ఉపాయాలు ఆలోచించారు. ఎవరికి తోచింది వారు చెప్పారు. అవుననుకునీ, కాదనుకునీ చివరకు ఒక నిర్ణయానికి వచ్చారు. తెల్లవారితే పెళ్ళి అనగా పెరియనాయకి ఆ క్రిందటి రాత్రి బయలుదేరి

సెంట్రలు స్టేషనుకు వచ్చేట్టు... అప్పటికి సింగారవేలు అక్కడ టిక్కెట్లతో సిద్ధంగా వుండేట్టు నిర్ణయమైంది. తర్వాత గప్‌చిప్‌గా యిద్దరూ రైలెక్కి పెళ్ళిపోవడమే అన్నమాట... అంతా అనుకున్న ప్రకారమే జరిగింది...ముందు యిద్దరూ గుంటూరు వచ్చారు. అక్కడ ఎవరో చెప్పగా, ఇక్కడ కొత్తగా ఎరువులకంపెనీ పెట్టారని తెలిసి యిక్కడికి వచ్చేశారు. వచ్చీరాగానే సింగారవేలు వారి కాళ్లూ వీరి కాళ్ళూ పట్టుకుని ప్రాధేయపడి పని సంపాయించాడు. అతడు రోజూ ఉదయం నుంచీ సాయంకాలంవరకూ ఆ మట్టిలో, దుమ్ములో ఘాటైన వాతావరణంలో పనిచేసేవాడు. పొద్దుగూకుతూవుండగా తల కొక గుడ్డ చుట్టుకుని దుమ్ము కొట్టుకున్న బట్టలతో ఉసూరుమంటూ యింటికి చేరుకునేవాడు. అలా ఎన్నాళ్ళో గడవలేదు. అతని ఆరోగ్యం దెబ్బతిన్నది. వారం రోజుల పాటు జ్వరంమూలంగా అసలు లేవలేకపోయాడు. జ్వరం తగ్గిన తర్వాత నీరసంగానడిచి ఫ్యాక్టరీకి వెడితే అతన్ని పనిలోనుంచి తీసేశాం పొమ్మన్నారు. అతడు దిగాలుపడి తిరిగివచ్చాడు. పెరియనాయకి అతనికిధైర్యం చెప్పింది. 'అంతగా అయితే నాదగ్గరున్న నగలు అమ్ముదాం...'అన్నది. కాని అతడు వినలేదు. రోజూ ఏదో కాయకష్టంచేసి రూపాయో, అర్ధో సంపాయించుకొచ్చేవాడు. లేనినాడు అదీలేదు. ఇద్దరు గుట్టు చప్పుడు కాకుండా కడుపునిండా నీళ్ళుతాగి గడిపివేసే వారు——

...సింహాచలం కళ్లు తెరిచాడు... ఎదురుగా కోటమ్మ నిలబడి వుండి 'ఏఁవయ్యా! పుగాకుందా?' అని అడుగుతున్నది.

సింహాచలం ఆవులించి 'లేదు' అన్నాడు.

ఆమె 'సరే...బాగుందయ్యా.. పుగాకు నేకపోతే కొట్టెందుకు తెరిసినావు? మూసుకుని లోపల తొంగోకపోయావా? పుగాకు తీసుకెల్లక పోతే మా ఆయన ఎమిక లికగ్గొడతాడు... ఎట్టాగబ్బా...' అని గొణుక్కుంటూ వెళ్ళిపోయింది.

ఆకాశానికి చిల్లిపడినట్టు వర్షం నిలిచి కురుస్తున్నది. ఒక రంగు రంగుల బుల్లిపిట్ట వర్షంలో చప్పగా తడిసి ఎగురుకుంటూ వచ్చి తడికె

మీద నిలబడి రెక్కలు విదిలించు కుంటున్నది. దూరంగా కొండలన్నీ ఆ ముసుగులో మసక మసగ్గా మాత్రమే కనిపిస్తున్నాయి.

సింహాచలం మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. అతనికి అయిదారు రోజుల క్రిందట జరిగిన వృత్తాంతం అంతా కళ్ళముందు పునరావృతం అయింది.

—ఆ నాడు సింహాచలం రైలు దిగివచ్చి, సరుకులన్నీ సర్దు కున్నాడు. అంతలోనే కొండలమీదా, క్రింద అడివిలోనూ సమస్త ప్రపం చంమీదనూ చీకటి చిక్కగా వ్యాపించింది. సింహాచలం హరికెన్‌లాంతరు వెలిగించితెచ్చి తీగకు తగిలించాడు. పక్కనే తడికెవెనక అతడు ఉదయం బయలుదేరి వెళ్ళేముందు ప్రారంభమైన పేకాట యిప్పుడే ముగిసినట్టు న్నది. పేకలు "అవతల పారేసి వాళ్ళందరూ కబుర్లలోపడ్డారు. సింహా చలం అటువెళ్ళి చూశాడు. సింగారవేలు ఒకపక్కన మొహంమీద గుడ్డ వేసుకుని పడుకుని వున్నాడు. అక్కడ మధ్యలో దీపం వెలుగుతున్నది. కొందరు గోడకు ఆనుకుని కూర్చునీ, మరికొందరు నడుమువాల్చి ఏవేవో విషయాలు మాట్లాడుకుంటున్నారు. అంతలోనే సంభాషణ తాగుడు మీదికీ నిషేధం మీదికీ మళ్ళింది.

ఒకడు బీడీ ముట్టించుకుంటూ 'ఆఁ! ఇప్పుడీ 'లా' వచ్చింతర్వాత తాగుడు తగ్గిందా? నన్నడిగితే మునుపటికంటె ఎక్కువైపోయినాదంటాను. మునుపెవుడో తాగదల్చుకున్నోడు తాగేవోడు. ఇప్పుడు వొద్దనేతరికి మరింత పెరిగింది.ఇప్పుడంతా సుక్కేసుకుంటానే వుంటారు...' అన్నాడు.

'అవునోస్! మునుపే నయం...ఆమాట కొస్తే... ఇప్పుడు ఇంటింటికీ సారా బట్టీ.... పోయినేడు ఆ ఎంకటేశుగాడి పాక 'గుప్పు'న ఎట్టా తగలబడింది? సారాకాయలుండ బట్టేగా?'

'అప్పుడు డబ్బులు పారేస్తే మంచి సరుకు దొరికేది. ఇప్పుడటా కాదు. అందరూ వచ్చి అమోనియా సరుకు తాగుతా వుండారు. 'లా' వొచ్చి మంచి చేసిందట...ఏం మంచి?'

'అంతే మరి...నిషాకోసం ఏదిబడితే అది తాగేత్తా వుంటారు...

ఆపక్క పాకల్లోకి ఎల్లి సూడు తెలుసుద్ది... ఆ జహర్‌గాడు స్పిరిట్ తాగుతాడంట...'

'వ్యసనమంటే అదేరా నాయనా! ఆయాల్టికి ఏం దొరకక్కపో, కిరసనాయిలు కూడా తాగేత్తాడు...'

'కిరసనాయిలు తాగితే కిక్కు రమనకుంటా సచ్చి ఊరుకుం టాడు—'

సంభాషణ ఈ దశలో వుండగా సింగారవేలు ఒక్కసారిగా లేచి 'కిరసనాయిలు తాగితే సచ్చిపోతారా? ఎవురా మాట అనేది?' అన్నాడు ఛాలెంజి చేస్తున్నట్టు.

'నేను— నేనే అన్నానా మాట. ఏం? నువ్వు తాగ్గలవా?'

'తాగుతాను—కాయకిరసనాయిలు తాగుతాను... ఎంత పందెం?'

'అబ్బో! గొప్ప మొనగాడు బయల్దేరాడయ్యా! సరే— పాతిక రూపాయలు పందెం... కానియ్ తాగు...'

అప్పుడు సింగారవేలు కళ్ళు మెరిశాయి. అతని చూపులలో తెగింపు కనిపించింది. కళ్ళు ఎగరవేసి లేచి, సరిగా కూర్చుని 'సరే— తెప్పించండి...' అన్నాడు నిశ్చయంగా.

అంతలో ఒకడు దీపం పెద్దది చేశాడు. ఒకణ్ని డబ్బులిచ్చి కిరసనాయిలు కోసం పంపించారు. వాడు వెళ్ళి ముందు అందరికీ ఈ విషయం దండోరా వేశాడు. క్రమంగా అక్కడ జనం మూగారు. అంతా రణగొణ ధ్వనిగా వుంది. ఎదుటివాడు చెప్పేది వినిపించుకోకుండా అందరూ ఒకటే రొదగా మాట్లాడుతున్నారు.

అంతలో అందరూ నిశ్శబ్దంగా ఆత్రంగా నిలబడి చూస్తూ వుండగా సింగారవేలు సీసా కిరసనాయిలూ గుక్కెడు గుక్కెడుగా తాగేశాడు. చివరి గుక్క మింగి సీసా వంచి చూపించి వొణికే కాళ్ళతో లేచి నిలబడి చెయ్యిజాపి 'డబ్బులే...' అని అడిగి ఆ వ్యక్తి చేతిలో నుంచి నోట్లు అందుకున్నాడు. గోడకానుకుని నిలబడి నెమ్మదిగా లెక్క పెట్టుకున్నాడు. తర్వాత జనాన్ని తప్పించుకుని యింటికి వెళ్ళిపోయాడు.

జనం తర్వాత చాలాసేపు అతన్ని గురించి మాట్లాడుకున్నారు. మొత్తానికి అతడు గజ తాగుబోతు అయివుండాలనే నిర్ణయానికి వచ్చారు...

ఆనాడు రాత్రి ఆకాశంలో మబ్బులు దట్టంగా కమ్మాయి. దళసరి నల్లని తెరను ప్రపంచంమీద కప్పినట్టయింది... చల్లని గాలి దిగంతాల నుండి వేగంగా వీచింది. దానితో ఆ మబ్బులన్నీ ఝల్లున జలదరించాయి. దాదాపు అరగంటసేపు పెద్ద వర్షం కురిసింది.

తెల తెలవారుతూ వుండగా సింహాచలం లేచి కళ్లు నులుముకుంటూ యివతలికి వచ్చి కొయ్యబారిపోయాడు. సింగారవేలు పాకముందు జనం మూగివున్నారు...ఒకడు కత్తితో వెదురు వాసాలను చీలుస్తున్నాడు... మరొకడు వాటిని రెండు పొడుగాటి వాసాల మధ్య వుంచి తాడితో గట్టిగా బిగిస్తున్నాడు... ఆ చిన్న పంచలో సింగారవేలు శవాన్ని పడుకోబెట్టారు... పైనుంచి కిందిదాకా గుడ్డ కప్పారు. ఆ అరవపిల్ల పెరియనాయకి శవం పక్కన కూర్చునివుండి నోట్లో కొంగు కుక్కుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నది. సింహాచలం అంతా చూసి నిలువునా వొణికి పోయాడు.

తర్వాత నలుగురూ తలా ఒకచేయివేసి పనులన్నీ ముగించారు. ఏమీ మిగిలిపోలేదు. ఆ చిన్న పాకలో ఆ అరవపిల్ల మాత్రం సన్నగా ఏడుస్తూ మిగిలిపోయింది. ఆ రాత్రి పన్నెండు గంటలవేళ మళ్ళీ ప్రకృతి పగబట్టినట్టు వర్షం ప్రారంభమైంది. ఆకాశం జల్లెడలా తయారైంది. ఉరుములు మెరుపులతో రొదచేస్తూ అప్పుడే మొదలు ఈ కుంభవృష్టి... అప్పుడే ఎక్కడో పిడుగు పడిన ధ్వని... పెరియనాయకి హడలిపోతూ, నిలువెల్లా వొణికిపోతూ పరుగెత్తుకు వచ్చిందిక్కడికి... అంతే అలా మొదలైన గాలివాన యింతవరకూ తెరిపి యివ్వలేదు...

...సింహాచలం హఠాత్తుగా కళ్ళు తెరిచాడు. లేచి చేతులు వెనక్కి కట్టుకుని కొంచెంసేపు అటూ ఇటూ పచార్లు చేశాడు. తర్వాత మొహం తుడుచుకున్నాడు. అతనికి లచ్చి జ్ఞాపకం వచ్చింది. సన్నగా శలాకలా వుండి ఎల్లప్పుడూ నవ్వుతూ వుంటుంది. వెన్నలాటి మనసు. మనిషి చామనచాయ. మొహంలో ఎంత కళ! ఆమె ఎదుట నిలబడి కళ్లు

చెబుతూ వుంటే సింహాచలం పరవశించిపోయేవాడు. ఒకసారి తొందర పడి చెయ్యి పట్టుకోబోతే లేడి పిల్లలా ఛెంగున గెంతి తప్పించుకుని, కొన దేలిన సన్నని ముక్కుమీద వేలు వేసుకుని 'తప్పు...అప్పుడే కాదు...' అంటూ మాటి మాటికీ వెనుదిరిగి చూస్తూ నవ్వుతూ వెళ్ళిపోయింది.

అతడు హఠాత్తుగా నీరసపడిపోయాడు. ఇక లచ్చి తన మొహం చూడదు కాబోలు! దాని పట్టుదల తనకు తెలీదు గనుకనా ? ఇక జన్మాంతమూ లచ్చి తనకు దూరమైపోయినట్టే... అందులో ఏ మాత్రమూ అనుమానం లేదు...

సింహాచలం ఉలిక్కిపడి లేచి నిలబడ్డాడు. ఎదురుగా గొడుగుల్లో యిద్దరు నడివయసు వ్యక్తులు నిలబడి వున్నారు. వారిలో ఒకాయన నోట్లోని తమ్మిని ఉమ్మివేసి 'సింహాచలం యారప్పా...సొక్.' అని అడిగాడు.

సింహాచలం ఒక ఉదుటున లేచి 'రండి బాబూ, రండి. నే నే సింహాచలాన్ని ... మీ అమ్మాయి లోపలుంది...రండి...' అన్నాడు. ఆ యిద్దరూ హడావిడిగా గొడుగులు మూసి లోపలికి వచ్చారు.

పెరియనాయకి హఠాత్తుగా లేచి నిలబడి 'అప్పా' అని పెద్దగా ఏడుస్తూ తండ్రిని కౌగలించుకున్నది. అతడుకూడా కళ్ళనీళ్ళు పెట్టుకుని ఆమెను సముదాయిస్తూ చాలాసేపు మాటా పలుకూ లేకుండా నిలబడి పోయాడు. తర్వాత ఆ ముగ్గురూ ఉండి ఉండి కళ్ళు తుడుచుకుంటూ అక్కడే కూలబడ్డారు. పెరియనాయకి మధ్య మధ్య ఏడుస్తూ అన్ని విషయాలు చెప్పింది. ఆ రెండో వ్యక్తి సింగారవేలు తండ్రి అనీ, ఆయన కొక్కడే కొడుకనీ అర్థంకాగానే సింహాచలం తల్లడిల్లిపోయాడు. వారు ముగ్గురూ మాట్లాడుకుంటూ వుండగా బాగా అర్థంకాకపోయినాఏదో కొంతకు కొంత అర్థం చేసుకుంటూ సింహాచలం అలాగే చాలాసేపు నిల బడ్డాడు. తర్వాత సంభాషణ తన మీదికి మళ్ళిందని అర్థం చేసుకోగానే ఇవతలికి వచ్చి బల్లమీద నిశ్శబ్దంగా కూర్చుండి పోయాడు.

వర్షపుజల్లు తగ్గింది. చల్లని గాలి మాత్రం అడివిలోనూ కొండల

మీదనూ సుళ్ళు తిరుగుతూ వేగంగా వీస్తూనే వుంది. మబ్బులు బలహీన పడిపోగానే మందంగా చంద్రుడి కాంతి వ్యాపించింది.

అంతలో ఆ వ్యక్తులిద్దరూ యివతలికి వచ్చి వచ్చీరాని తెలుగులో అతన్ని చాలాసేపు పొగిడారు. అతడు చాలా మంచివాడన్నారు. అతడు లేకపోతే పెరియనాయకి కూడా తనకు దక్కేది కాదన్నారు. చుట్టు పక్కల వారి మాటలను గురించి పెరియనాయకి చెప్పిందనీ వాటిని అసలు పట్టించుకోవద్దనీ అన్నారు. ఏనుగులను చూసి కుక్కలు మొరుగుతాయి. అంతలో ఏమీ మునిగిపోదన్నారు...

సింహాచలం ఏమీ మాట్లాడలేక అలా బొమ్మలా కూర్చుని అంతా విన్నాడు తర్వాత వెనుదిరిగి చూస్తే పెరియనాయకి కళ్ళనిండా కృతజ్ఞత నింపుకుని చూస్తూ నిలబడి వున్నది.

మరోగంటలో అందరూ ప్రయాణానికి సిద్ధమైనారు సింహాచలం కొట్టుకట్టేసి గుమ్మానికి తాళం వేసి వారి వెంట మైలు దూరమూ నడిచి స్టేషనుకు వచ్చాడు. నడుస్తున్నంతసేపూ ఉండి ఉండి ఆ పెద్ద మనుషులు తమ కృతజ్ఞత తెలియబరుచు కుంటూనే వున్నారు.

వారు ఆ చిన్న స్టేషన్‌కు చేరుకున్న అయిదు నిముషాల వ్యవధిలోనే రైలు వచ్చింది. ఆ ముగ్గురూ చివరి పెట్టెలో ఎక్కి కూర్చున్నారు. గార్డు ఈలవేయగానే ఆ పెద్దమనుషులిద్దరూ చేతులు జోడించి 'వస్తాంసామీ–' అన్నారు. పెరియనాయకి కూడా రెండు చేతులు జోడించి ఏదో అన్నదిగాని, ఆ మాటలు రైలు కదులుతున్న రొదలో అతనికి వినబడలేదు. అతడు కొద్ది క్షణాలు చేయి వూపుతూ అలాగే నిలబడిపోయాడు.

అంతలో ఎక్కడలేని ఒంటరితనం అతన్ని ఆవహించింది. అతడు జేబులు తడువుకున్నాడు. చొక్కాచేతుల మడతలువిప్పి మళ్ళీ పెట్టుకున్నాడు. చేతివ్రేళ్ళతో జుట్టును పైకి తోసుకున్నాడు. తర్వాత నెమ్మదిగా నడిచి యివతలికివచ్చి రోడ్డుఎక్కాడు. ఆ రోడ్డు తెల్లగా కొండనుచుట్టిన తెల్లని కొండచిలువలా వుంది.

అతడు చాలదూరం నడిచివచ్చి ఒకచోట ఆగాడు. ఆ పాకలో నుంచి నవ్వులు వినిపిస్తున్నాయి. లచ్చి గల గల నవ్వుతున్నది. ఆ రెండో గొంతు కోటిగాడిదికదూ! వాడు పాతబాకి రెండు మూడు రూపాయ లివ్వాలి... రేపు నలుగురిలో నిలబెట్టి అడిగి వసూలు చెయ్యాలి...

అతడు కాలికి అడ్డంవచ్చిన రాయిని కాలితో ఒక్క తన్ను తన్ని విసురుగానడవటం ప్రారంభించాడు. అంతలో ఒకచోట ఆగి ఆకాశంలోకి చూశాడు. ఇన్నాళ్ళనుంచీ అసహ్యంగా అల్లకల్లోలంగావున్న ఆకాశం యిప్పుడు స్వచ్ఛంగావుంది. చంద్రబింబం పెద్ద మంచి ముత్యపు ముక్క వలె రెండు చిన్న మబ్బు తునకల మధ్య ప్రకాశిస్తున్నది.

సింహాచలం నోటివెంట అప్రయత్నంగా ఈలవచ్చింది. ఈ కొద్ది రోజుల ముసుగులో తాను చాలాకోల్పోయానని అనుకున్నాడింతసేపూ... ఇప్పుడు తమాయించుకున్నాడు. ఇక ఆపకుండా ఈల వేసుకుంటూ హుషారుగా నడిచి యిల్లుచేరుకుని ఆరుబయట కుక్కిమంచంవేసుకుని పడుకుని గుర్రుపెట్టి నిద్రపోయాడు. అతనికి కలలో అన్నీ రంగు రంగుల మంచి ముత్యాలూ, గంధపు చెట్ల అరణ్యాలు కనిపించాయి.

# నిప్పుకోడి

ఉదయం తొమ్మిదిగంట అయింది. ఎండలో చురుకుపాలు హెచ్చింది.

రామకోటి తన పాతలాల్చీ జేబుల్లో చేతులు పెట్టుకు నడుస్తున్నాడు. ఎండలో వేడిమి హెచ్చడంతో అత డనుకున్నాడు; 'ఆకలి లాగే ఈ ఎండకూ వెరే పనేమీ లేదు...'

ఒక పెద్దహోటలు... రామకోటి అకస్మాత్తుగా ఆగిపోయాడు. హోటలుముందు బోర్డుమీద వ్రాసివున్న అక్షరాలను కూడబలుక్కుంటూ చదివాడు. 'ఇచ్చట అన్ని పదార్థములు శుభ్రమైన వెన్నకాచిన నేతితో తయారుచేయబడును...'

రామకోటి క్రింది పెదవిని పళ్ళతో నొక్కుతూ మరొక పోస్టరు వైపు చూశాడు. అందులో యిద్దరు వస్తాదుల బొమ్మలున్నాయి. ఒకడిది గుండు... రెండోవాడి మెడలో ఒక తాయెత్తు వుంది. వాళ్ళిద్దరూ ఛాలెంజీ వసాదులు. ఆదివారం సాయంకాలం జరుగబోయే కాటా కుస్తీ పోటీలలో వారిద్దరూ ప్రత్యర్థులు.

'ఇవాళేగా ఆది రం తప్పకుండా వెళ్ళిచూడాలి ...' అనుకున్నాడు రామకోటి.

కాని, యిటువంటి ఇతర ఆలోచనలతో ఆకలిని మరిచిపోదామని అతడు చేసే ప్రయత్నాలు బొత్తిగా ఫలించడంలేదు. ఇప్పుడూ అంతే అయింది. అతని లాల్చీ జేబులో ఎంతవున్నదో అతనికి తెలుసు. అతడు బడ్డీకొట్టు పక్కకు తప్పుకుని జేబులో పైసలన్నీ యివతలికి లెక్కపెట్టుకున్నాడు. ఎన్నిసార్లు లెక్కపెట్టినా ముప్ఫయిపైసలే... డబ్బులు పిలలను పెట్టవుకదా!

అతడు పైసలను గుప్పిటలో వుంచుకుని హోటల్లోకి వెళ్ళాడు. లోపల ఎక్కడా ఖాళీలేదు. జనం తినేవాళ్ళు తింటూవుంటే 'వాళ్ళెప్పుడు లేస్తారా' అని కాచుకుని వున్నవాళ్ళూ వున్నారు. అందరి ముఖాలలోనూ ఆకలి...ఆకలి...

అత డొకచోట కూర్చున్నాడు. అతని కెదురుగా యిద్దరు యువకులు కూర్చుని వున్నారు. వారిలో ఒకడు తాళాలగుత్తిని చేతి వ్రేలికి చుట్టుకుని గిరాగిరా తిప్పుతున్నాడు. రెండో, యువకుడు ఉండి ఉండి ముఖం తుడుచుకుంటున్నాడు. ఉన్నట్టుండి మొదటి యువకుడు ఒక విజ్లు వేశాడు. రెండో యువకుడు నవ్వాడు. ఒక్కక్షణం తర్వాత మొదటి యువకుడు ఏమీ తోచనివాడిలా జేబులోనుంచి పర్సు తీసి డబ్బు లెక్క పెట్టడం ప్రారంభించాడు. అయిదు పదిరూపాయలనోట్లూ, ఒక అయిదు రూపాయలనోటూ...రెండో యువకుడు "మొన్ననే కదురా యింటినుంచి మనియార్డరు వచ్చింది? మిగిలిదంతా ఏంచేశావు ?" అని అడిగాడు. మొదటి యువకుడు నవ్వాడే కాని ఏమీ బదులు చెప్పలేదు.

యాభై అయిదు రూపాయలు! ఇరవై రోజుల క్రిందట రామకోటి చేతికి వూళ్ళో మార్వాడీ సరిగ్గా అంతే మొత్తం యిచ్చాడు. అతని చేతి మీదుగా చెల్లిపోయిన చివరి మెడలు అది... ఎన్నోయేళ్ళ క్రిందట విజయనగరంలో జరిగిన పోటీలలో నాలుగోవాడిగా వచ్చినందుకు తనకు లభించిన మెడలు అది. మొదట్లో దాన్ని తానెంత ప్రాణప్రదంగా చూసుకునేవాడు ! ఇప్పటికి అన్నిటివలెనే దానికీ కాళ్ళు వచ్చాయి.

సర్వారు వచ్చి నీళ్ళగ్లాసులు చప్పుడూ చేస్తూ బల్లమీద వుంచి 'ఏం కావాలి' అని అగాడు.

మొదటి యువకుడు 'నాకు చాలా ఆకలిగా వుంది. రాత్రి కూడా ఏమీ తినలేదు...' అంటూ ఏవో రెండు పదార్థాలు తెమ్మన్నాడు.

రామకోటి రెండు వ్రేళ్ళు చూపించి 'ఇడ్లీ' అన్నాడు.

'రెండిడ్లీలు !' అసలే పూతరేకుల్లా గాలి వేస్తే ఎగిరిపోయేట్టు వుంటాయవి. లోపల ఆకలి మాత్రం విపరీతంగా చెలరేగుతున్నది.

రెండిడ్లీలు ఏ మూలకు? అతడు చాలా ఏళ్ళక్రిందట నెల్లూరులో కాటా కుస్తీలలో పాల్గొనేందుకు వెళ్ళి ఒకానొక సందర్భంలో పందెం కట్టి నాలుగుడజనుల అరటి పళ్ళు తిన్న విషయం గుర్తుకు వచ్చింది.

ఆ శక్తి, ఉత్సాహమూ తగ్గిపోయి అన్నీ ఉడిగిపోయినా అతని ఆకలి మాత్రం తగ్గలేదు సరికదా తన దారిద్ర్యంతోపాటు, వయస్సుతో పాటు అదికూడా పెరుగుతూ వచ్చింది.

అనుకున్నంతా అయింది. ఈ రెండిడ్లీలూ క్షణంలో నోట్లో కరిగి పోయాయి. ఇరవైపైసలూ అయిపోయింది. పైగా దీనిమూలంగానూ సుప్త క్షుదాగ్ని జ్వాలలు మరింత విజృంభించాయి. మరొక ఇడ్లీ తెమ్మనిచెప్పి అతడు దిగులుగా కూర్చున్నాడు. పైసల నొక చేతిలోనుంచి మరొక చేతిలోకి మార్చుకుని నుదురు పట్టుకుని కూర్చుండిపోయాడు.

ఎదుటి యువకులలో మొదటివాడు చెయ్యి కడుక్కునివచ్చి రెండో అతనితో 'అమ్మ బాబోయ్! నేనిక ఏమీ తినలేను. నాకేమీ వొద్దు' అంటున్నాడు.

రామకోటి అప్రయత్నంగా 'అదేమిటి బాబూ! ఇందాక ఆకలిగా వుందంటివే. ఇదేనా నీ ఆకలి! నీ వయస్సులో నేను ఎంత తిండి తినే వాణ్ణి! ఇప్పుడీ హోటళ్ళలో డబ్బు లెక్కే తప్ప తిండి లెక్కేమున్నది! రూపాయలు అయిపోవడం తప్ప కడుపు నిండుతుందా ఏమన్నా నా?' అన్నాడు.

ఆ యువకు లిద్దరూ రామకోటి చొరవకు ముందు ఆశ్చర్యపోయి నట్టున్నారు. తరువాత ఆ యువకుల పెదవులమీద దరహాసం చూసిన రామకోటి మళ్ళీ 'అవునండీ! మీ వయస్సులో నాకెంత తిండిపుష్టి వుండేది! నా కిప్పుడు అరవైయేళ్ళు నిండాయి. ఇప్పటికీ ఉన్నపాటున నలభై జతల ఇడ్లీలు తినగలను...' అన్నాడు.

మొదటి యువకుడు గడుసువాడు. అతడు నవ్వి 'సరే...ఇప్పుడు నలభై ప్లేట్ల ఇడ్లీ తినండి... పందెం...ఏమీలేదు. మీరు గెలిస్తే ఆ బిల్లు నేనే చెల్లిస్తాను. మీరు ఓడిపోతే...అంటే నలభై ప్లేట్లూ ఖాళీచెయ్యలేక

పోతే-నేను నయాపైసాకూడా యివ్వను. అప్పుడాబిల్లు మీరిచ్చుకోవల సిందే... సరేనా?" అన్నాడు. రెండో యువకుడు ఇందాక తాను మిత్రుణ్ణి అడిగిన ప్రశ్నకు సమాధానం తెలిసినవాడిలా ముఖం పెట్టాడు. అతనికి హుషారు హెచ్చింది. రామకోటివంక నిశితంగా చూశాడు. మెడ మీద చిరుగుపట్టిన పాత లాల్చీ, అడ్డకట్టు లుంగీ, లావుపాటి బెల్టూ, బుంగ మీసాలూ అతని దృష్టినాకర్షించాయి.

రామకోటి కళ్ళు మెరిశాయి... తలవూపి "సరే" అన్నాడు. ఈ వ్యవహారం చుట్టుప్రక్కల వారినికూడా ఆకర్షించింది. అప్పటికే జనం ఆ బల్లచుట్టూ చేరడం ప్రారంభించారు.

సర్వరు పెద్ద ట్రేలో ఇడ్లీప్లేట్లు పట్టుకువచ్చి బల్లనిండా పరిచాడు. అటూఇటూ తిరుగుతూవుండే హోటల్ సూపర్‌వైజరు... పచ్చని వాడొకడు- "అక్కడ జనం మూగివున్నారేమిటా?" అని చూడవచ్చి తానూ అక్కడే నిలబడిపోయాడు.

రామకోటి నవ్వుతూ అంతటినీ తేలికగా తీసుకున్నాడు. తర్వాత త్వరత్వరగా తినడం ప్రారంభించాడు. చుట్టూ చేరిన జనం కళ్ళు పెద్దవి చేసుకుని ఉత్కంఠతో చూస్తూవుండగా అతడు వెంటవెంటనే ప్లేట్లు ఖాళీ చెయ్యడం ప్రారంభించాడు.

క్రమంగా చుట్టూ జనం ఎక్కువయినారు. కొత్తగా వచ్చిన వాళ్ళు అక్కడ అంతకుముందు నిలబడి వున్నవారిని "ఏమిటది ?" అని ప్రశ్నిస్తున్నారు.

"ఆ మీసాల ముసలాయన నలభై జతల ఇడ్లీలు తింటానని పందెం కాశాడు."

"పందెం ఎంత?"

"వేరే పందెం ఏమీలేదు. ముసలాయన అన్నీ తినగలిగితే ఆ బిల్లు అవతలివాళ్ళు చెల్లించేట్టు... తినలేకపోతే ఆయనే యిచ్చుకునేట్టు..."

"నలభై జతల ఇడ్లీలతో పందెమా? నా చిన్నతనంలో వంద రూపాయల పందెంకట్టి ఒక అరటిపళ్ళగెల అంతా తిన్నాడొకడు."

"నిజమే. ఈ మాత్రపు దానికి పందెం ఎందుకు ? ఈ మామూలుగా తినేవాళ్ళు కరవదిలో లెక్కలేనంతమంది ఉన్నారు. రెండు రోజులు ఉపవాసంచేస్తే మనమూ తినవచ్చు."

"భలేవాడివే...నువ్వా తినేది ? డోకులూ విరేచనాలు పట్టుకుని 'ఢామ్మ'ని ఛస్తావు..."

"గామా ఒకసారి మొత్తం మేకనే తినేశాట్ట..."

"ఇప్పుడింతకీ ఈ ముసలాయన మొత్తం తినగలడంటావా?"

"చూసాంగా..."

మొత్తం ముప్పయి ఖాళీప్లేట్లు లెక్కకొచ్చాయి. మళ్ళీ సర్వరు పదిప్లేట్లు తెచ్చి పెట్టాడు. రామకోటి ఆ కొద్దిక్షణాల విరామంలో మీసాలు తుడుచుకున్నాడు. అంతలోనే అతనిముందు పదిప్లేట్లూ కనిపించాయి. అతనికి లోపల కొంచెంగా దడ బయలుదేరింది. అప్పటికే కడుపు పూర్తిగా నిండిపోయింది. నీళ్లు తాగితే ఖాళీ వస్తుందేమో! అయినా ఎక్కువ నీళ్ళు తాగకూడదు. అప్పుడు వ్యవహారం మొత్తం అడ్డం తిరుగుతుంది. అందువల్ల ఒక్క గుక్కెడు నీళ్ళుతాగాడు. కొంచెం ఫరవా లేదనిపించింది. మరోప్లేటు ముందుకు లాక్కున్నాడు.

ఆ యువకుడు చేతి చూపుడు వ్రేలితో తాళంచెవులగుత్తిని గిర గిరా తిప్పుతూ అలాగే కూర్చున్నాడు. అతని తీక్షణమైన చూపులకు రామకోటి కళ్ళలో ఆదుర్దా తెలిసే వుండాలి. అందువల్లనే అతని పెదవుల మీద చిరునవ్వు ఉదయించింది. రెండో యువకుడు జేబురుమాలతో ముఖం మాటిమాటికీ తుడుచుకుంటూ అలాగే కూర్చున్నాడు.

"ఇంకెన్ని ఉన్నాయి?" అని అడిగారెవరో జనంలోనుంచి.

"అయిదు జతలు..." అని సమాధానం వినవచ్చింది.

రామకోటి కళ్ళకు ఆ చివరి పది ఇడ్లీలూ పెద్దపెద్ద కుడుముల్లాగా దిబ్బరొట్టెల్లాగా కనిపిస్తున్నాయి. అయినా ఈ హోటళ్ళవాళ్ళు యింతంత పెద్ద ఇడ్లీలు వేస్తారెందుకో! వీటినే తా నింతకు ముందు పూత రేకుల్లా, గాలి విసురుకు ఎగిరిపోయేలా వున్నాయని భ్రమపడ్డాడు. అతని

మనస్సులో భయం బయలుదేరింది. కళ్ళుమూసుకుని తింటూనే మనసులో లెక్క వేసుకున్నాడు. తాను ఓడిపోతే ఎంత యివ్వవలసి వస్తుందో ఆలోచించాడు...అంతలో అతని గుండెలు దడదడలాడాయి. జరగబోయేది తలుచుకుంటే నిలువెల్లా వొణుకు పుట్టుకుని వస్తున్నది. తాను ఓడిపోతే దాదాపు ముప్పయి ఎనిమిది ప్లేట్ల ఇడ్లీలకు సొమ్ము చెల్లించవలసివస్తుంది. తన దగ్గరున్నవి ముప్పయి పైసలు...తాను బయట పడిపోవలసివస్తుంది. నలుగురిలోనూ తలవంపులు... అవమానం... అందరూ తనను అసహ్యంతో దొంగను చూసినట్టు, మోసగాణ్ణి చూసినట్టు చూస్తారు. ఒకవేళ తాను ప్రాధేయపడి అడిగినా ఆ క్రూరవాడు ససేమిరా వీల్లేదంటే?... హోటలువాడూరుకుంటాడా? ఇటువంటి సందర్భాలలో చొక్కాలు విప్పించి తీసుకుని పంపిస్తారని తాను విన్నాడు. లేకపోతే తనను లోపల రెండు రోజులపాటు చాకిరీ చెయ్యమనవచ్చు. ఇంత బ్రతుకూ బ్రతికి ఇంత అవమానమా? ఇంత జరిగాక తనకు ఆత్మహత్యతప్ప వేరే శరణ్యం లేదు...

"ఇంక ఒక్క ప్లేటే మిగిలింది" అంటున్నారెవరో... అది విని కళ్లుతెరిచి చూశాడు రామకోటి. అంతలో అతనికి కొండంత బలం వచ్చింది. ప్రక్కన నీళ్ళగ్లాసు అందుకుని అరగుక్కెడు మాత్రమే నీళ్లు త్రాగి ఆ చివరి ప్లేటు ముందుకు లాక్కున్నాడు.

"బస్...గెల్చాడు ముసలాయన...గట్టివాడే..." అన్నారెవరో...

రామకోటి చివరిప్లేటు దూరంగా తోసేసి మళ్ళీ కొంచెం నీళ్ళు తాగాడు. తర్వాత చేత్తో గొంతు సర్దుకున్నాడు....జనంలో కలకలం— హోటల్ సూపర్‌వైజరు నవ్వుకుంటూ క్లీనర్లను పిలిచి "లేయ్—ప్లేట్లు తీసేయండి—ఊ—" అంటూ హడావిడి చేశాడు. చుట్టూ మూగిన జనం నవ్వుకుంటూ ఎవరి సీట్లలోకి వారు వెళ్ళిపోయారు.

ఆ యువకులిద్దరూ లేచారు. రామకోటికి చేయి అందించాడు మొదటి యువకుడు. రామకోటిలేచి వారివెంట యివతలికి వచ్చాడు. ఆ యువకుడు బిల్లు చెల్లించి బయటికివచ్చి నవ్వుతూ రామకోటి వంక చూశాడు.

రామకోటికి అకస్మాత్తుగా దుఃఖం పొంగివచ్చింది. అత డెంతగా ప్రయత్నించినా కళ్ళలో నీటిపొరను ఆపలేకపోయాడు. అప్రయత్నంగా చేతులు రెండూ జోడించాడు.

వారిద్దరూ వెళ్ళిపోయారు. రామకోటి వారిద్దరూ కనుచూపు మేర దాటిపోయేవరకూ చూసి నిట్టూర్చి వెనుదిరిగాడు. ఆ యువకుడి ముఖం... అతని కళ్ళలోని కాంతి... అతని చిరునవ్వూ రామకోటికి మాటి మాటికి గుర్తువచ్చాయి.

కొంచెందూరం నడవగానే అతడు బాగా స్థిమితపడ్డాడు. ఒకబడ్డీ కొట్టుముందు ఆగి పది పైసల బీడీలు కొనుక్కున్నాడు. ప్రక్కనున్న తాటితో ఒక బీడీ అంటించుకుని మిగిలిన వాటిని జేబులో వేసుకుని నెమ్మదిగా పొగ వొదులుతూ యివతలికి రాబోతూవుండగా ఆ బడ్డీకొట్టువాడు అతన్ని చూసి నవ్వి "నేను గుర్తున్నానా ?" అని అడిగాడు.

రామకోటి కళ్ళు పెద్దవి చేసుకుని చూశాడు. ఆ కొట్టుమీద వ్యక్తికి పాతిక సంవత్సరాలుంటాయి. పెద్ద పెద్ద కళ్లు...పచ్చని మనిషి... ఉంగరాల జుట్టు...సన్నగా పొడుగ్గా వున్నాడు. "నన్నింకా గుర్తుపట్టలేదా ?" అన్నట్టు నవ్వుతున్నాడు.

"నేను మౌలానా కొడుకుని..." అన్నాడతడు చివరకు...

రామకోటి అతని సమీపంలోకివెళ్ళి "మౌలానా కొడుకువా? గుర్తుపట్టలేకపోయాను సుమా? నీ పేరు ఇస్మాయిల్ కదూ ? అన్నట్టు మీ నాన్నను చూసి చాలా రోజులైంది...బాగున్నాడా ?" అన్నాడు.

ఇస్మాయిల్ దిగులుగా నవ్వుతూ "మీకు తెలీదేమో ! మా నాన్న ఆరేళ్ళక్రితమే పోయాడు" అని చెప్పాడు.

రామకోటి నిర్వెరపోయాడు. అతని కళ్ళముందు మౌలానా నిలబడినట్టయింది. తనకంటే చిన్నవాడు...మనిషి ఎట్లావుండేవాడు! కండలు తిరిగిన పచ్చని శరీరమూ, నున్నని గుండూ, మెడలో పులిగోరూ...

లంగోటాకట్టి తొడచరిచి గోదాలోకి దిగితే పెద్దపెద్ద వస్తాదులకు కూడా గుండెలు దడదడ లాడేవి... పెద్దలు సంపాయించిన ఆస్తి వుండేదేమో, మంచి తిండి తినేవాడు. నిరంతరం పదిమందినీచేర్చి వారికి వ్యాయామమూ, కుస్తీలు, పట్లూ పద్ధతులూ నేర్పుతూ వుండేవాడు. కావలిలోనో, ఒంగోలులోనో ఒకసారి తమ యిద్దరికి పోటీ పడింది. ఆ నాడు జనం విరగబడిపోయారు. కుస్తీ జరిగినంతసేపూ జనంలోనుంచి ఒకటేగోల... చప్పట్లూ...ఈలలూ ఆ నాడు తాను అతనిమీద గెలుపు సాధించినప్పటికీ అది గెలుపు అని తానెన్నడూ అనుకోలేదు.

ఇస్మాయిల్ ఎవరికో కిల్లీచుట్టియిస్తూ చెప్పాడు. "అప్పటికే ఖర్చు ఎక్కువయిపోయింది. ఇల్లేమో తాకట్టులోవుంది. అవతలివాళ్ళు కోర్టులో వ్యాజ్యంవేసి గెల్చి యిల్లుకొట్టేయించుకున్నారు. మేమంతా చిన్నపిల్లలం; ఇదుగో...ఇప్పటికి నేనిమాత్రంగా నిలదొక్కుకున్నాను. చెల్లెలి పెళ్ళి చేశాను. తమ్ముడు మీకు గుర్తున్నాడోలేదో, ఒకసారి మీరు మా యింటికి వస్తే "మామా మామా" అంటూ వెంటబడ్డాడు.వాడిప్పుడురైల్వేషెడ్డులో పనిచేస్తున్నాడు..."

రామకోటి ప్రతిమవలె నిలబడి విన్నాడు. తర్వాత ఉన్నట్టుండి "ఆ రోజులేవేరు. ఇప్పుడాహూషారేలేదు, అంతా కుర్రవాళ్ళు చేరారు... ఇవాళ క్లబ్బు గ్రౌండులో కుస్తీ జరుగుతుందని చూశానే ఎక్కడో... వెళ్ళాలనేవుంది...మరి టిక్కెట్టు ఎంతో, ఏమిటో..." అన్నాడు.

ఇస్మాయిల్ జేబులోనుంచి టిక్కెట్టుతీసి "ఇదిగో నా దగ్గర టిక్కెట్టుకుడావుంది. కావలిస్తే యిది తీసుకోండి...నేను విడిగా వస్తాను. అక్కడ అంతా నాకు తెలిసినవాళ్ళే..." అన్నాడు.

రామకోటి ఆ టిక్కెట్టు అందుకుని జేబులో వుంచుకుని నవ్వి "శిడా వుందన్నమాట ఈ పిచ్చి..." అన్నాడు.

"ఆ వాసన పోదుగా. మా అమ్మకు ఈ కుస్తీలంటే వొళ్ళుమంట. నేనయినా ఆమెకు తెలీకుండా వెళ్ళడమే... "ఆలస్యంగా వచ్చావేంరా?" అని అడిగితే "సినిమాకు వెళ్ళివచ్చాన"ని అబద్ధమాడుతూ వుంటాను. ఆమెకు తెలిస్తే గొడవచేస్తుంది..." అన్నాడు ఇస్మాయిల్.

"అయితే వెళ్ళొస్తాను..." అన్నాడు రామకోటి నడక సాగిస్తూ.

అతనికిప్పుడు హాయిగావుంది. కూనిరాగంతీస్తూ బీడీ చివరిదమ్ము పీల్చి విసిరి అవతల పడేసి త్వరత్వరగా నడిచాడు. అప్పటికి ఎండలో దాగా వేడిమి హెచ్చినా అతనికి అట్టే బాధాకరంగా లేదు.

ఆ యింటి యజమాని మంచివాడు. ఇంటిమీదవచ్చే అద్దెలతోనే కాలంవెళ్ళబుచ్చవలసి వున్నప్పటికే, ఆయన అద్దెలు విపరీతంగా పెంచ లేదు. ఆయనకు ముందూ వెనకా ఎవరూ లేరు. ఆ పెద్ద పెంకుటిల్లు పెద్దలు సంపాయించి యిచ్చినది. రిటైరయిన తర్వాత వచ్చే ఆ నాలుగు రాళ్ళతోనూ, యీ అద్దె డబ్బుతోనూ కాలక్షేపం చేస్తున్నాడు. రామకోటి ఆ యింటిలో ఒక చిన్న గదిలో చాలా యేళ్ళనుంచీ వుంటున్నాడు. గది మధ్యలో ఒక తడికె అడ్డం పెట్టుకుని ఒక భాగం పడక గదిగా రెండో భాగం వంట గదిగా ఉపయోగించుకుంటూ కాలం గడుపుతున్నాడు. ఇరవై రోజుల క్రిందట తన మెడల్ అమ్ముకున్న తర్వాత యింటిఅద్దె నాలుగు రూపాయలు చొప్పున తాను బాకీపడిన నాలుగు నెలల అద్దె చెల్లించివేశాడు.

ఆ గదిలో ఒక ఫొటో వుంది. అది రామకోటిని చిన్నతనంనుంచీ అభిమానించి ఆదరించిన రాజాగారిది. ఆయన ఆరునెలల క్రిందట హఠా త్తుగా గుండెఆగి చనిపోయాడు. అంతవరకూ ఆయన రామకోటికి ప్రతి నెలా ఎనభై రూపాయల వంతున పంపుతూ వుండేవాడు. అందుకే రామ కోటి ఎన్నడూ ఏ ఉద్యోగం కోసమూ ప్రయత్నించకుండా యిన్నాళ్ళూ హాయిగా కాలం గడిపాడు. ఇప్పుడు రాజాగారి కొడుకులు వేరుపడి తమను చూసేందుకు వచ్చిన రామకోటిని గమనించనేలేదు. పైగా పరిహసించారు కూడా. వారి ప్రవర్తన, వారికి రామకోటికి పైసా కూడా యివ్వరని చెప్పక చెప్పింది. అతడు వారితో మాట్లాడక తిరిగి వచ్చేశాడు.

అతడు తలుపు తెరిచి లోపలికి ప్రవేశించి పైనున్న తుండూ, లాల్చీ తీసి తడికె మీదికి విసిరి, నడుముకున్న తోలుబెల్టుతీసి దూరంగా

పడేసి కుక్కిమంచంలో కూలబడ్డాడు. పక్క వాటాలో అద్దెకున్న మునిసిపల్ ఆఫీసు ప్యూను కూతురు — అయిదేళ్ళ పిల్ల—పరుగెత్తుకు వచ్చింది. ఆ పిల్ల పేరు స్వరాజ్యం ... దాని పొట్టనిండా ప్రశ్నలే ... ఇంట్లో తల్లిని అడిగితే విసుక్కుంటుంది. అందువల్ల ఆ పిల్ల తనకు ఏ అనుమానం వచ్చినా రామకోటి దగ్గరికిచేరి వొళ్ళో కూర్చుని తీరికగా సంభాషణ ప్రారంభిస్తుంది.

అవాళ ఆ పిల్ల వచ్చిరాగానే "తాతా! మా అన్నయ్యకేమీ తెలీదు. వాడు బడికెళ్లేటప్పుడు ఒకమాట అడిగాను. చెప్పలేకపోయాడు. పైగా కసురుకున్నాడు" అన్నది వొళ్ళో కూర్చుంటూ.

రామకోటి నవ్వి "ఏమిటది ?" అని అడిగాడు.

"మరేమో, వాళ్ళ మనో లేదూ...అదే మనోరమ...అది చెప్పింది కదా, నిప్పుకోడి వుంటుందే, అది నిప్పులు తింటుందిట... నిజమేనా మరి ?..."

"ఏమో, నాకు తెలీదు..." అన్నాడు రామకోటి. స్వరాజ్యం అదోక రకంగా మొహం పెట్టి "నీకూ తెలీదూ?" అని వూరుకుంది.

రామకోటి ఆలోచనలో పడ్డాడు. అవును. నిప్పుకోడి అనే పేరు దానికెందుకు వచ్చిందో ! నిజంగా నిప్పులు తింటుందేమో ! లేకపోతే దానికీ తనలాగే ఆకలి ఎక్కువై ఏదిపడితే అది తింటుందేమో ! పావు రాళ్లు రాళ్ళను తినవూ ? అలాగేనేమో !

స్వరాజ్యం ఊరుకోలేదు. "నిప్పులు తింటే గొంతు కాలిపోదూ ? ఆ మనో ఎప్పుడూ యింతే...అన్నీ అబద్ధాలు చెపుతూ వుంటుంది. పైగా వాళ్ళ అన్నయ్య చెప్పాడంటుంది ... వాళ్ళ అన్నయ్య పెద్ద పెద్ద పుస్తకాలు చదువుతూ వుంటాడు" అన్నది.

రామకోటి ఆ పిల్ల వెళ్ళిపోయిన తర్వాత మంచంలో కాళ్లు జాపు కుని పడుకున్నాడు. అతని కెదురుగా గుమ్మంలోనుంచి చూస్తే పెద్ద వేపచెట్టు కనిపిస్తుంది. దానిక్రింద ప్రొద్దుటినుంచీ ఎవరో కొలిమి పెట్టి

గిన్నెలకు మాట్లువేస్తూ కళాయివేస్తూ పాటుపడుతున్నారు. పదేళ్ళ బక్క చిక్కిన కుర్రవాడొకడు ఆయాసంతో ఒగర్చుతూ తిత్తి వొత్తుతున్నాడు.

పక్క భాగంలో ఎవరో పేపరు పెద్దగా చదువుతున్నారు. "బీహారులో క్షామం. . ప్రజలు తిండిలేక పడుతున్న ఇక్కట్లకు లెక్కలేదు బావులలో నీటిచుక్కలేదు... మా విలేఖరి... భూమి నెర్రెలువిచ్చి భయం కరంగావుంది.. ప్రధాని పర్యటన... ప్రజలు ఆకలిగొన్న ముఖాలతో చుట్టు ముట్టి తమ ఇబ్బందులు చెప్పుకున్నారు. ప్రధాని కళ్ళలో నీరుతిరిగింది... క్షామప్రాంతంలో ఒక వృద్ధురాలితో సంభాషిస్తున్న దృశ్యం."

నెర్రెలునిచ్చిన భూమిని రామకోటి ఒకసారెప్పుడో చాలాయేళ్ళ క్రిందట చూశాడు. అదేదో, ఒంగోలుకు దూరంగా వున్న వూరు... మండు వేసవి... అసలే కరువుకాటకాలకు ఆ ప్రదేశం శాశ్వత స్థావరం. అతడు చనిపోయిన దున్నపోతు నొకదాన్ని చూశాడు. దాని నోరు భయంకరంగా తెరుచుకునివుంది. అటువంటి పగుళ్ళు నేల అంతా... ధరిత్రి అంతా వేయినోళ్ళతో "దాహం దాహం" అంటున్నట్టు... మూర్ఛవాడు నీటికోసం నోరు తెరిచినట్టు...

రామకోటి బలవంతంగా ఆలోచనలు మళ్ళించుకున్నాడు. అతని మంచం పక్కనే తడికెమీద చాలా పాతపేపర్లు అంటించాడు. అవన్నీ చాలా ఏళ్ళ క్రిందటివి... మద్రాసులో పెద్ద ఎత్తున జరిగిన కుస్తీ పోటీలకు సంబంధించిన బొమ్మలు... రామకోటి అతి శ్రద్ధ వాటిని తడికెమీద అంటించాడు.

బొమ్మలో చిన్నసైజు కొండలా వున్నాడు కింగ్‌కాంగ్... అతని చిన్ననితలా, పెద్ద శరీరమూ, ఆ చూపులూ తలుచుకుంటేనే అద్భుతంగా వుంటాయి.

మకుటంలేని మహారాజుగా చెలామణీ అవుతున్న కింగ్‌కాంగ్‌కు ఎదురునిల్చి 'సెబాష్' అనిపించుకున్నవాడు దారాసింగ్. భుజాల మీద గుడ్డ కప్పుకునివుండి బొ[illegible] చిరునవ్వు నవ్వుతున్నాడు. భారతదేశపు కుస్తీకి స్వర్ణయుగం మళ్ళీ వచ్చిందనిపించాడు. సరిసమానంగా ఏపుగా

పెరిగిన కండలు తిరిగిన శరీరం. ఆకర్షణీయమైన ముఖం. చక్కని క్రాపూ... కుస్తీలో ఒడుపూ వేగమూ, యితని ప్రత్యేకతలు.

ఆ పక్కనే బొమ్మలో వున్నవాడు రష్యన్ భల్లూకం. అతన్ని తలుచుకుంటేనే హడల్ పుడుతుంది. అతనికా పేరు ఎలా వచ్చిందోగాని నిజంగా అతనిది భల్లూకపుపట్టే. పెద్దపెద్ద అంతర్జాతీయ వస్తాదుల కూడా మద్రాసులో అతని భల్లూకపు పట్టులో చిక్కి జవజవలాడి నీర కారి పోయారు.

ఇంకా చాలామంది వున్నారు కాని వారందరి ఫొటోలూ అతడు సేకరించలేకపోయాడు. అప్పుడు మద్రాసులో ఎంత హడావిడి... ఎక్కడెక్కడి మహా వస్తాదులూ ఒక్కసారిగా రావటంతో గొప్ప అలజడి... జనం వేలకువేలు విరగబడిపోయారు. నగరంలో ఎక్కడ చూసినా అవే చర్చలూ... వాగ్వివాదాలూ...

రామకోటికి నిద్రపట్టింది. అతనికి సాధారణంగా కుస్తీలను గురించి కలలు కనటమంటే గొప్ప యిష్టం. అటువంటి కలలు వచ్చిన నాడు అతనికి చాలా హుషారుగా వుంటుంది. కాని యిటీవల చాలా రోజులుగా అతనికి కుస్తీలను గురించిన కలలు రావడంలేదు. ఎప్పుడూ కలల్లో పాములే కనిపిస్తున్నాయి. నిద్ర పట్టగానే మొదలు... రకరకాల పాములు...రకరకాల రంగులలో...లెక్కలేనన్ని కనిపిస్తాయి. ఒకసారి అయిదు తలల పాము కూడా కలలో కనిపించిందతనికి... ఇది విన్న ఒకాయన దాని ఫలితం చెప్పాడు. కలలోకి పాములు రావడం మృత్యు సూచనట.., 'సరేలే, ఎందుకింకా బతకడం? బోలెడు జీవితం అయి పోయింది. ఇక ఈ స్థితిలో అనాయాసంగా చావడం కంటె మరేం కావాలి?' అనిపించిందతనికి.

అతనికి యిష్టమైన కల మరొకటి వుంది. అతడు బాగా యవ్వనంలో వుండగా ఒక అమ్మాయిని ప్రేమించాడు. ఆ అమ్మాయి బంగారపు బొమ్మలా వుండేది. ఆమెను మొదటిసారి చూచినప్పుడు రామకోటికి మతి చెడింది. ఆమె నవ్వూ.. ఆ కళ్ళలోని కాంతీ... అంత గొప్పవి. ఆమెను కేవలం చూస్తూ అతడు కొన్ని నెలలు గడిపాడు.

ఒక్క మాట లేదు, పలుకులేదు ... నవ్వులు విసరడంలేదు... సైగలు చేయడం లేదు. పోనీ బుద్ధిగా పెద్దవారితో సంప్రదించడమూ లేదు. ఆమెకు ఉన్నట్టుండి ఎక్కడో సంబంధం కుదిరించన్నారు. వెంటనే పెళ్ళి అయిపోయింది. పెళ్ళికి అతడు కూడా వెళ్ళాడు. దూరంగా నిలబడి చూసి నాలుగు అక్షింతలు వేసి మరీ వచ్చాడు. చిరునవ్వులు చిందే అప్పటి ఆమె ముఖం అతనికి అప్పుడప్పుడు కలలోకి వస్తూ వుంటుంది. ఆ రోజున అంతా అతడు పసివాడైపోతాడు. ఆ గదిలోనుంచి ఆనాడు వినిపించే పాటలకూ, కూనిరాగాలకూ, ఈల పాటలకూ అంతే వుండదు.

ఆ సాయంకాలం...

రామకోటి జేబులో టిక్కెట్టు భద్రంగా వుంచుకుని బయలుదేరాడు. మధ్యాహ్నమంతా నిద్రపోవటంవల్ల వొళ్ళంతా హాయిగా తేలికగావుంది. పైగా చాలాఏళ్ళ తర్వాత అటువంటి కార్యక్రమానికి హాజరవుతున్నాడు తాను. ఇటీవల వూళ్ళో ఎవరూ ఇటువంటి కార్యక్రమాలు ఏర్పాటు చెయ లేదు.

అతడు హుషారుగా అడుగులువేస్తూ చురుకుగా నడిచాడు. విశాలమైన ఆవరణలో ప్రత్యేకంగా కుస్తీలకోసం ఏర్పాటు చేశారు. లోపలికి వెళ్ళేముందు ద్వారానికి అటూఇటూ పెద్దపెద్ద బొమ్మలున్నాయి. లోపల చాలా హడావిడిగా వుంది. రకరకాల తరగతుల టిక్కెట్లు కొనివచ్చిన జనం తమతమ స్థానాలలో కూర్చుని రొద చేస్తున్నారు. పలుచని లాల్చీల వారూ, మెడలలో పులిగోరులు ధరించినవారూ, బుంగమీసాలవారూ, కొందరు నిర్వాహకులూ, అటూ ఇటూ తిరుగుతున్నారు.

రామకోటి గ్యాలరీలో కూర్చుని చేత్తో మీసాలు సర్దుకుంటూ చుట్టూ చూశాడు. అతనికి గర్వం కలిగింది. ఈ జనంఅంతా కుస్తీలమీద, వ్యాయామకళమీద అభిమానం వున్నవారే అనిపించిందతనికి. ఇంత మంది డబ్బు పెట్టి టిక్కెట్లు కొని ఈ తరహా పోటీలను ఇంకా ప్రోత

హించడం అతనికి ఆనందం కలిగించింది. 'మనమూ ఒక ఛాన్సు తీసుకుందామా !' అని కూడా అనుకున్నాడు.

కొంతసేపు నిరీక్షణ తర్వాత జనంతో గోల బయలుదేరింది. ఇద్దరు వస్తాదులు గోదాలోకి దిగారు. వారిద్దరిలో ఒకడు పొట్టిగా లావుగా వున్నాడు. తల చాలా చిన్నది. రెండోవాడు పొడగరి. ఒడుపు వున్న వాడు...సన్నగా వున్నాడు. వారిద్దరూ గోదాలోకి దిగి ఒకరితో ఒకరు తలపడగానే ఇద్దరి శరీరాలూ పొంగాయి.

ఉండిఉండి జనంలో గోలా అరుపులూ ఎక్కువవుతున్నాయి. ఆనందించదగిన క్షణం వచ్చినప్పుడల్లా జనంలో ఉత్సాహం సముద్రపు హోరులా పెచ్చు పెరిగిపోతున్నది.

రామకోటి పక్కన ఉన్నవారు చాలామంది లావుపాటి వాడిపక్షం. వాడు విజృంభించినప్పుడల్లా వారు పెద్దగా కేకలు పెడుతున్నారు. రామకోటికి వాడిలో మూర్ఖపు చొరవ తప్ప మరేమీ కనిపించలేదు. రెండో వాడే కొంచెం నయం...తప్పుకోడం, వీలుచూసుకుని వేగంగా ముందుకు దూకడంవంటి మంచి లక్షణాలు కొన్ని వాడిదగ్గర ఉన్నాయి.

రామకోటికి ఎడమప్రక్కన నడివయసు మనిషి ఒకడు ప్రశాంతంగా కూర్చుని చూస్తున్నాడు. రామకోటి అతనితో 'పోటీ బాగానే వుంది కాని, వీళ్ళు మరీ సగటు వస్తాదులు కూడా కారండీ ... బొత్తిగా మామూలు రకం ... అయినా ఫరవాలేదు ...' అన్నాడు.

ఆ మనిషి రామకోటి వంక చూసి 'ఏదో...మామూలు కుస్తీలే... అయినా యివికూడా రాను రాను క్రమంగా తగ్గిపోతున్నాయి. మునుపు నేను చాలా చూశాను. చాలా వూళ్ళలో చూశాను. ఆ హుషారే లేదిప్పుడు ...ఏదో అభిమానంకొద్దీ రావడం తప్పితే...'అంటూ ఆగి అకస్మాత్తుగా అతన్ని గుర్తుపట్టినట్టు నవ్వి 'మిమ్మల్ని చాలాసార్లు చూశాను. విజయనగరంలో మొదటిసారి...నాకు బాగా గుర్తు...మీరు నాలుగో వాడుగా వచ్చారు... ఒక మెడల్ యిచ్చారు మీకు...' అన్నాడు.

రామకోటి 'అవునవును...' అన్నాడు. అతని కళ్ళవెంట ఆనందా

౹శువులు ఉబికి వచ్చాయి. అప్రయత్నంగా పైగుడ్డతో కళ్లు అద్దుకున్నాడు. తాను ఇరవై రోజుల క్రిందట అమ్ముకున్న ఆ ముచ్చటైన మొదలే కళ్ళలో మెదిలింది.

'మద్రాసులో పోటీలు కూడా చూశాను. కుస్తీలంటే అవి... ఒక్కొక్కడూ జగజ్జెట్టీ...కన్నులపండువుగా వుంది కదండీ...అయినా యిక యిప్పుడీ కుస్తీలూ, గర్రిటా క్రమంగా తగ్గిపోతున్నాయి లెండి... తెల్లవారి లేస్తే అందరూ పొదుపు పొదుపు అంటున్నారు. మామూలుగా తినే వాళ్ళకే తిండి సరిగా లేదు. ఇక వసాదులనేం తయారు చెయ్య గలం? పైగా యిపొక తక్కువ రకం హాబీ అయిపోయింది నలుగురి దృష్టిలోనూ...' అంటున్నాడింకా ఆ వ్యక్తి.

రామకోటి ఆనందంతో తల మున్కలై కళ్లు మూసుకున్నాడు. అతడు కళ్లు తెరిచేసరికి ఆ రౌండ్ పూర్తి అయింది.

* * *

అతడు యింటికి తిరిగి వెళుతూ వుండగా వెంకటేశు కనిపించాడు. అతడు నలభై అయిదేళ్ళవాడు. మనిషి సన్నగా పొడుగ్గా వుంటాడు. ఏదో ఆఫీసులో ప్యూను ఉద్యోగం చేస్తున్నాడు. జీతం తక్కువ—పై రాబడి అసలు అవకాశం లేదు. దానికి తోడు కుచేల సంతానం. భార్య ఉత్తమురాలు. రామకోటి వారింటికి చాలా తక్కువ సార్లు వెళ్ళాడు. వెళ్ళినప్పుడల్లా 'అన్నా' అంటూ పిలిచి తమకు కలిగిన దాన్లోనే కాఫీయో, మజ్జిగో యిచ్చి పంపుతూ వుండేది. పిల్లలు మొత్తం అయిదుగురు. అందులో ముగ్గురు మగపిల్లలు. ఆడపిల్లలిద్దరూ బాగా చిన్నవాళ్ళు.

వెంకటేశు మొహం తుడుచుకుంటూ వచ్చాడు—రామకోటి అతని భుజంమీద చెయ్యివేసి 'ఏమయ్యా? ఎట్లా వున్నావు? పిల్లలు కులాసా?' అని అడిగాడు.

వెంకటేశుకు తన పిల్లలంటే ప్రేమ. అతని ముఖం ఈ ప్రశ్నతో వికసించింది. 'మా పెద్దవాడిప్పుడు ఫిఫ్తుఫారం చదువుతున్నాడయ్యా; క్లాసులో వాడే ఫస్టు. మరొక సంవత్సరం ఓపికపడితే తర్వాత వాడికి మా ఆఫీసరుగారు ఉద్యోగం వేయిస్తానన్నాడు... తర్వాత వాళ్ళిద్దరినీ

బాగా పెద్ద చదువులు చదివించాలనీ మా ఆవిడ పట్టుదల... నా ఉద్దేశమూ అదే. అన్నట్టు నువ్వీ మధ్య బొత్తిగా నల్లపూసవైపోయావేం! ఏమిటి కథ?' అన్నాడు.

రామకోటి నవ్వి వూరుకున్నాడు. వెంకటేశు మళ్ళీ 'పిల్లలు 'మామ, మామ' అని గోల చేస్తున్నారయ్యా! ఒక్కసారి రాగూడదూ? ఏదో మాతోబాటు కలో గంజో తాగి కాస్సేపు ఉండిపోవచ్చు. తప్ప కుండా రా...' అంటూ సందు మలుపు తిరిగి పోయాడు.

రామకోటి నడుస్తూ ఆలోచనలో పడ్డాడు. మళ్ళీ రేపు తలుచు కుంటే భయంగా వుంది. ఎట్లా గడుస్తుంది? ఏమిటి చెయ్యడం? ఎక్క డన్నా ఏదన్నా పనిలో కుదురుకుంటే బాగుండిపోను. వెంకటేశుతో ఒక్క మాట చెప్పి వుంచితే బాగుండేది. ఏ ఆఫీసులో ఏ చిన్న ఉద్యోగం దొరి కినా రోజులు వెళ్ళిపోతాయి. ఇటీవల వరకూ తనకు డబ్బు పంపించిన రాజాగారు గుర్తుకు రాగానే అతని కళ్లు నీళ్ళతో నిండాయి. ఆయనతో ఒకప్పుడు 'నా కెక్కడన్నా చిన్న ఉద్యోగం ఇప్పించండయ్యా! చేసుకు బతుకుతాను. ఒక్కడి పొట్టకు ఎంత కావాలి? మీరు ప్రతినెలా ఊరికే డబ్బు పంపిస్తూ వుంటే తిని కూర్చోవడం తప్పుగా వుంది...' అన్నాడు రామకోటి. ఆయన అది విని గంభీరంగా నవ్వి 'అదేమన్న మాట? నేను కన్నుమూసేవరకూ మా సంప్రదాయాలు యిలా సాగిపోవలసిందే. నువ్వు మొదటినుంచీ మా మనిషివి. మేము నిన్ను అభిమానించాము. చిన్నప్పటి నుంచీ నువ్వు మా నీడలో పెరిగి పెద్దవాడవై మాకు పేరు తెచ్చావు. ఏదో మాకు చేతనైనంత ఎక్కువో తక్కువో యివ్వడం మా ధర్మం— ఎక్కువ యివ్వటానికి మునుపటి రోజులు కావనుకో...ముసలి వాడివై పోయావని నిన్ను వొదిలేస్తామా?...' అన్నాడు.

ఆయన చనిపోయిన తర్వాత తన అసలు బాధ ప్రారంభమైంది. ఆకలి యింత దారుణంగా మనుష్యులను బాధించగలదని అతనికి యింతవరకూ తెలీదు.

ఎవరో అతన్ని పిలిచారు... రామకోటి ఆగాడు. వాడా పేటలో పెద్ద రౌడీ అని పేరు పొందినవాడు. కొంచెం డబ్బున్నవాడు. వాడి

ప్రయోజకత్వం రామకోటికి బాగా తెలుసు. అనవసరంగా ప్రతివారితోనూ పోట్లాట పెట్టుకోవడం, సోడాబుడ్లు పెట్టి ఎదుటివారిని కొట్టడం, పదునైన బ్లేడుతో హఠాత్తుగా అవతలివారిని గాయ పరచడం—ఇటువంటి వాటిలో ఘనుడు.

అతడు పళ్ళన్నీ బయటపడేట్టు నవ్వి 'నువ్వు పెద్ద ఫైల్మాన్వు కదా? నేనొక పని చెప్తాను చేస్తావా? పని సక్రమంగా చేసుకొస్తే పాతిక రూపాయ లిస్తాను' అన్నాడు.

రామకోటి తలవూపి "ఎవరినన్నా తన్ని రమ్మంటావా?" అని అడిగాడు.

వా డాశ్చర్యపోయి 'బలే ఊహించావే! సరిగ్గా అదే...చేస్తావా, మరి?' అని అడిగాడు.

రామకోటి 'చేస్తాను. నాకు మనిషిని చూపించు...' అన్నాడు.

వాడు మళ్ళీ నవ్వి 'సరే. పోదాం రా... మందు పోయించాలా?' అని అడిగాడు నడుస్తూ.

రామకోటి తల అడ్డంగా వూపి 'అక్కర్లేదు' అన్నాడు.

ఇద్దరూ దాదాపు రెండు ఫర్లాంగుల దూరం నడిచారు. అతడొక సందు మొదట్లో హఠాత్తుగా ఆగి రామకోటిని ఆపి 'అదుగో, అటు చూడు...సరిగ్గా సమయానికె వచ్చాం...వాళ్ళిద్దరూ మెట్లెక్కడంలేదూ? అదే వాళ్ళ రూము...ఆ యిద్దరిలో అవతలివాడు స్టూడెంటు.'అన్నాడు.

రామకోటి కళ్ళు నులుముకుని మరీ చూశాడు. ఆ యిద్దరినీఅతడు మరిచిపోగలడా? తాళంచెవుల గుత్తి వ్రేలితో తిప్పుతూ తన మిత్రుడితో నవ్వుతూ కబుర్లు చెబుతున్న అతని విగ్రహం స్పష్టంగా కనిపించింది. మరుక్షణంలో వాళ్ళిద్దరూ లోపలికి వెళ్ళిపోయారు.

రామకోటి పక్కకు తిరిగి 'అతనేం ద్రోహం చేశాడు నీకు?'అని అడిగాడు.

'మొన్న సినిమాహాల్లో మాటా మాటా పెరిగింది. నన్ను అందరి లోనూ కొట్టాడు.'

'నువ్వు తిరిగి కొట్టలేకపోయావా?'

'తిరిగి కొట్టడమా? దెబ్బ కాచుకోడం కూడా చేతకాలేదు. అదేమి చెయ్యి? అదేమి చురుకు? కరెంట్‌షాక్ తగిలినట్టే...చూసేందుకు అలా వున్నాడా? చేతిచురుకు...బాబోయ్...చెప్పలేననుకో...'

రామకోటి తల అడ్డంగా వూపి 'నేనేమీ చెయ్యలేను' అంటూ వెనుదిరిగాడు.

'అరె పెద్దవస్తాదువని పిలిచానే నిన్ను... ఇంతేనా సంబడం...' అన్నాడతడు వ్యంగ్యంగా.

రామకోటి 'అవును...అంతే...' అంటూ సాగిపోయాడు.

* * *

మూడురోజులైంది. రామకోటి మంచంలో పడుకుని ఆలోచిస్తున్నాడు. ఈ మూడురోజులనుంచీ అతడు కేవలం మంచినీళ్ళతోనే కాలం గడిపాడు. ఇప్పుడు పరిస్థితి అతని వశంలోలేదు. పొట్టలో మండుతున్న కొలిమి ఒకటిఉండి సెగలు పొగలు చిమ్ముతున్నట్లు అనిపిస్తున్నది.

అతడు నీరసంగా లేచాడు. రాజుగారి బొమ్మ కనిపించింది. నీళ్ళు నిండిన కళ్ళతో చేతులుజోడించి, "ఆకలి యింత భయంకరంగా వుంటుందని నాకు తెలీకుండా ఏళ్ళతరబడి పోషించావు. మళ్ళీ జన్మ అంటూవుంటే నీ ఋణం తీర్చుకుంటాను..." అనుకున్నాడు.

నెమ్మదిగా లాల్చీ తొడుక్కొని తుండు పైనవేసుకుని తలుపు దగ్గరికిలాగి యివతలకి వచ్చాడు. గుడ్డివెన్నెల... ఒకదానిమీద ఒకటి కట్టినట్టున్న పాకలు...వాటిముందు బొంతలూ, చాపలూ, కుక్కిమంచాలూ వేసుకుని పడుకున్న పేదలు...కొంచెం దూరంలో చెట్లక్రింద ఆమాత్రపు వసతులుకూడా లేని దేశద్రిమ్మరులు...వీరంతా ఏం తింటున్నారు? ఎలా సంపాయిస్తున్నారు ?

అతడు నీరసంగా నడిచివెళ్ళి ఒకడాబా యింటిముందాగాడు. అది కుస్తీల కంట్రాక్టరు యిల్లు—పిలుపువిని ఒక కుర్రవాడువచ్చి "మానాన్నగారికోసమా ? లోపలికిరా..." అన్నాడు.

పంచలో వాలుకుర్చీలో కూర్చుని పేపరు చూస్తున్నాడాయన. రామకోటి నమస్కరించి పంచమెట్టుమీద కూర్చున్నాడు. ఆయన 'ఏం కావాలి!' అన్నట్టు చూశాడు.

'నా పేరు రామకోటి... మీరు వినేవుంటారండి... దేశమంతటా ఎన్నోచోట్ల పెద్దపెద్ద వాళ్ళతో పోటీచేసి 'సెభాస్' అనిపించుకున్నాను. మా రాజుగారికి నేనంటే అభిమానం... ఇప్పటిదాకా ఆయనే నన్ను పోషించారు. ఇటీవలే ఆయనపోయారు. కొంచెం బాధల్లో వున్నాను..." అన్నాడు రామకోటి.

'అయితే ఏంచెయ్యమంటావు?' అని అడిగాడాయన.

రామకోటి నెమ్మదిగా "వచ్చే ఆదివారంనాడు నాకొక ఛాన్సు ఇప్పించండి. నేనూ గోదాలోకి దిగుతాను—అవతలివాళ్ళకెంత యిస్తారో నాకూ అంతే యివ్వండి..." అన్నాడు.

ఆయన కళ్లు చిన్నవిచేసి నిశితంగాచూసి హఠాత్తుగా "ముసలాడివి నీకెందుకులేవయ్యా. ప్రమాదవశాత్తు ఏ కాలో చెయ్యో విరిగినా ఆ ఉసురు నాకు చుట్టుకుంటుంది. అవతల వాళ్ళంతా రాక్షసులు... శివమెత్తినట్టు గోదా అంతటినీ దున్నుతున్నారు. ఆ రోజులుకావుయివి...ఒక్కొక్కడూ నిన్ను నంజుకు తింటాడు ఏమనుకున్నావో. దుస్సాహసం పనికిరాదు... అంత యిబ్బందిగా వుంటే రేపొకపూట మా యింటికిరా అన్నం తిని పోదువుగాని..." అంటూ మళ్లీ పేపరు చూడటం ప్రారంభించాడు.

రామకోటికి నవ్వొచ్చింది. ఆ రోజులుకావు నిజమే ... అయినా గోదా అంతటినీ దున్నడం గురించీ, నంజుకుతినడం గురించీ ఆయన అన్న మాటలు యదార్థాలు కావు. తనకు తెలుసు వాళ్ళ పరాక్రమం ఎటువంటిదో! అతడు నీరసం వల్ల ఒక్క క్షణం నిశ్శబ్దంగా ఊరుకుని తర్వాత లేచి "సెలవు బాబూ!" అని చెప్పి బయటికి వచ్చాడు.

వీధిలోకి రాగానే నిస్సత్తువ అతన్ని ఆవహించింది. ఉన్నట్టుండి కాళ్ళు తడబడ్డాయి. వొళ్ళు తూలింది. ఎవరో తనను పిలుస్తున్న సవ్వడి... వెనుదిరిగిచూసే ఎవరూలేరు.

అతడు కాళ్ళీడ్చుకుంటూ మరికొంత దూరం నడిచి వెంకటేశు యింటిముందు నిలబడ్డాడు. వాళ్ళింట్లో యిప్పుడు అన్నం వుంటుందా? వెంకటేశు సంపాదన తనకు తెలియనిది కాదు. ఇప్పుడువెడితే యిబ్బంది పెట్టడం అవుతుందేమో!

అంతలో వెంకటేశు బయటికి తొంగిచూసి 'ఎవరది?' అంటూ యివతలికివచ్చి అతన్ని గుర్తించి "నువ్వేనా రామకోటీ! అలా నిలబడి పోయావేం? రా లోపలికి. సరిగా సమయానికి వచ్చావు. మీ చెల్లెలు అందరికీ అన్నాలు పెడుతున్నది. ఇంతసేపూ పిల్లలు చదువుకుంటూ కూర్చున్నారు. అందుకని ఇవాళ ఆలస్యమైంది..." అంటూ అతన్ని లోపలికి తీసుకుపోయాడు.

లోపల పిల్లలందరూ పింగాణి కంచాలముందు కూర్చునివున్నారు. ఆఖరి పిల్లవాడు రామకోటిని చూసి వెలుగుకుమ్మరిస్తూ నవ్వాడు. వెంకటేశు భార్య తలఎత్తి చూసి "నువ్వా అన్నా! రా, శాన్నాళ్ళకు వచ్చావు. మమ్మల్ని బొత్తిగా మర్చిపోయావిన్నాళ్ళూ..." అన్నది. వేరే విస్తరి వేస్తూ.

రామకోటి కళ్ళముందు మచ్చలు కదులుతున్నాయి. అతడు ఏమీ బదులు చెప్పకుండా విస్తరిముందు వెళ్ళి కూర్చోవడం చూసి భార్యాభర్తలు ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు. అంతలోనే వెంకటేశు భార్య గిన్నెలో మిగిలిన అన్నమంతా విస్తరిలో పెట్టి ఆధరువేదో వేసి "అన్నా...కానివ్వు" అన్నది. వెంకటేశు అతని పక్కనే కూర్చున్నాడు.

రామకోటి త్వరత్వరగా నాలుగు ముద్దలు మింగి నీళ్లతాగి ఈ ప్రపంచంలోకి వచ్చాడు. తర్వాత మిగిలిన అన్నం తింటూ పిల్లలందరినీ పలకరించాడు. వెంకటేశుభార్యతో "ఉన్న అన్నమంతా నాకే పెట్టేశావు. నువ్వేం తింటావు చెల్లెమ్మా" అన్నాడు. ఆమె నవ్వుతూ "మళ్ళీ కుంపటి మీద బియ్యం కడిగిపెడితే ఎంతసేపు ..క్షణంలో కాదూ..." అన్నది.

రామకోటి చెయ్యికడుక్కుని "నాకూ్కడా ఎక్కడన్నా చిన్న ఉద్యోగం చూసిపెట్టవయ్యా..." అన్నాడు. వెంకటేశు బీడీయిస్తూ ఆ

మాటవిని నవ్వాడు. రామకోటి కూర్చుని బీడీ ముట్టించుకోబోతూ ఆగి హఠాత్తుగా "ఎవరో పిలుస్తున్నారయ్యాన్నన్న...." అన్నాడు. వెంకటేశు వాకిట్లోకివచ్చి "ఎవరూలేరే" అన్నాడు. రామకోటి కలవరిస్తున్నవాడిలా "అదే మా రాజుగారి గొంతు..." అన్నాడు. తర్వాత బీడీ ముట్టించుకున్నాడు.

కొద్ది నిమిషాల తరువాత లేచి 'వెళ్ళొస్తాను చెల్లెమ్మా' అని కేక వేసి పిల్లలందర్నీ మళ్ళీ పలకరించి వెంకటేశుతో 'నా ఉద్యోగం సంగతి మర్చిపోకయ్యా' అని హెచ్చరించి వీధిలోనికివచ్చాడు. బాగా పొద్దుపోయి నట్టున్నది. ఎక్కడో ఏదో పక్షి ఒకటి వుండివుండి విచిత్రంగా అరుస్తున్నది. ఒక పాకలో పసిపిల్లవాడెవడో గుక్క తిప్పకోకుండా ఏడుస్తున్నాడు.

రామకోటి తన కుక్కి మంచంలో పడుకున్నాడు. ఆకలి తగ్గింది. కాని, కళ్ల ముందు రంగు రంగుల చక్రాలు కదలడం వింతగా వున్నది. గదిలోకి గాలి విసురుగా వీస్తున్నది. గాలిలో కలిసిన ఏదో గొంతు తనను పిలిచినట్టయింది. ఎవరు పిలుస్తున్నారో చూద్దామని అతడు లేవబోయాడు. కాని లేవలేదు. అతని కళ్ళు తెరుచుకుని ఉండిపోయాడు.

చూపుడు వ్రేలుతో తాళం చెవుల గుత్తి గిరగిరా తిప్పుతూ ఆ యువకుడూ, మాటిమాటికీ ముఖం తుడుచుకుంటూ అతని మిత్రుడూ కాలేజీకి వెడుతుండగా వీధిలో రోడ్డు ప్రక్కన ఒక దృశ్యం...

ఒక నడివయసు మనిషి ముగ్గురు చిన్నపిల్లలూ వీధిలో వెళ్ళే వారిని ఆపి 'అనాధప్రేతంబాబూ; ఎవరూలేరతనికి' అంటూ డబ్బులు అడుగుతున్నాడు. తోచిన వారు తోచినంత పడేసి వెళ్ళిపోతున్నారు. ప్రక్కనే శవం పడుకోపెట్టబడి వుంది. శవం తల నుంచి కాళ్ళవరకూ గుడ్డ కప్పి వుంచారు.

ఆ యువకుడు అటువైపు నడిచాడు. అతని మిత్రుడు 'ఎందుకురా నీకివన్నీ? అన్నీ యిటువంటి అనవసరపు పనులే చేస్తుంటావు. అందుకే తలకొప్పి నీతో' అంటూనే అతని వెనక వచ్చాడు.

ఆ యువకుడు ఒక అర్ధ రూపాయ నాణెం తీసి ఆ నడివయసు మనిషి చేతికిచ్చి శవం వైపు చూశాడు.

హఠాత్తుగా గాలి విసురుకు శవం ముఖంమీది గుడ్డ తొలిగింది. ఆ యువకుడు తన మిత్రుడి చెయ్యిపట్టుకుని 'అరె! మొన్న హోటల్లో మనతో పందెంకట్టి ఇడ్లీతినలేదూ, అతనే...'' అన్నాడు. అతని మిత్రుడు కూడా ఒకసారి అటుచూసి 'అవును. అయినా యిక వచ్చెయ్యి నువ్వు. అవతల కాలేజి టైమవుతున్నది...' అంటూ అతని చెయ్యి పట్టుకుని లాక్కుపోయాడు.

ఆ నడివయసు మనిషి, శవం ముఖంమీది గుడ్డను సరిచేశాడు.

# ఎక్‌స్ట్రా

"ఇట్లా అయితే నేనీ ఆట ఆడను. ఈ పట్టుపోగొట్టి బంగారం లాంటి ఆట చెడగొట్టావు". అంటూ వేలాయుధం చేతిలో పేకముక్కలు విసిరి గొట్టాడు. భైరవమూర్తి వేలాయుధం వంక కళ్ళు పెద్దవిచేసుకుని చూశాడు. వేలాయుధం మళ్ళీ అసలు తాగిన వాళ్ళను చూస్తేనే నాకు వళ్లుమంట. తాగి వచ్చిన వాడివి ఒక మూల కూర్చోక నీకీ ఆట ఎందుకు" అంటూ లేచి వెళ్ళి కిటికీలో నుంచి బయటికి చూస్తూ నిలబడ్డాడు.

ఉదయం ఎనిమిది గంటలవేళ...ఆ గదిలో మొత్తం నలుగురు వున్నారు. వారికోసం మరి కాసేపట్లో రాబోయే వ్యానుకోసం ఎదురు చూస్తున్నారు. ఆ మేస్త్రీ వచ్చాడంటే ఇక ఊపిరి కూడా పీల్చుకో నివ్వడు. "అవతల నామాటపోతుంది. మీరందరూ త్వరగా కదిలిరాక పోతే అక్కడ కొంపలంటుకుపోతాయి". అంటూ గోలచేస్తాడు. క్రింద వ్యానుహారన్ వినిపించగానే త్వరత్వరగా గది తలుపుకు తాళం వేసి రెండేసి మూడేసి మెట్లు ఒక్కొక్క అంగలో దూకుతూ వెళ్ళి వ్యానులో కూర్చుంటారు ఆ నలుగురు...

మిగిలిన ముగ్గురూ కూడ పేకముక్కలు ఒక మూలకు విసిరి పారేసి విశ్రాంతిగా కూర్చున్నారు. భైరవమూర్తి సిగిరెట్టు ముట్టించి తీరికగా పొగ వదులుతూ కూర్చున్నాడు. అతడు ఆరడుగుల భారీమనిషి. అతనిది కడప దగ్గర ఏదో ఊరు. చిన్నప్పుడు నాటకాలమీద ఆసక్తిలో చదువు పాడుచేసుకున్నాడు. అప్పుడప్పుడు ఏవేవో నాటకాలలో వేషాలు వేస్తూండేవాడు. కొన్ని చిన్న పరిషత్తులలో పాల్గొని సహాయ నటనకు "ప్రత్యేక గుర్తింపు" కూడా పొంది యున్నాడు. ఉన్న కొద్ది ఆస్తి కరిగి పోగానే ఇక్కడికి వచ్చి సినిమాల్లో పెద్ద నటుడుగా పేరు పొందాలని

ఆరాటపడ్డాడు. మనిషి చూపులకు భారీగా కనిపించినప్పటికీ ముఖంలో ఏ భావమూ పలుకని కారణంగా అతన్ని అదృష్ట దేవత వరించలేదు. దానితో అతనివంటి వందలకొద్ది వ్యక్తుల్లో ఒకడైపోయాడు. అప్పు డప్పుడు మనసు బాగా లేనప్పుడు కొద్దిగా తాగుతూ వుంటాడు. అతని మనసు చాలా తరచుగా బాగుండక పోవటం కూడా యధార్థమే.

వామనరావు పేరుకు తగ్గట్టు పిట్టవంటి మనిషి. తలమీద గుప్పెడు జుట్టుకూడా వుండదు. కీచుగొంతు. నిజానికి ఆ నలుగురిలోను ప్రస్తుతానికి అతని పరిస్థితి కొంత నయం. నాలుగైదు చిత్రాలలో హాస్య వేషాలున్నాయి. ఒక జానపద చిత్రంలో కొంచెం పెద్ద వేషమే వేస్తు న్నాడు.

మూడోవాడు వెంకటేశం... కాళ్ళు బార్లా జాపుకుని కూర్చుని "ప్రేమకోసమై వలలో పడెనే" అంటూ పాడుతున్నాడు. అతడు కొంచెం కలవారి చిన్నవాడు. ఇంట్లో చెప్పకుండా కొంత డబ్బు కాజేసి అయిదారు నెలల క్రిందటనే ఇక్కడికి పారిపోయి వచ్చాడు. అతని తండ్రి ఒక దినపత్రికలో "కనిపించడం లేదు" అనే శీర్షిక కింద "నాయనా వెంకటేశూ నీ కొరకు ఇంటిల్లిపాదీ దిగులు పడుతున్నాము. నీ వెక్కడున్నదీ తెలియజేస్తే డబ్బు పంపుతాను. నీవు కోరినట్లు చేయ గలము. వెంటనే బయలుదేరి రావలసినది" అని ప్రకటన కూడా వేయించాడు. అయినా వెంకటేశం తాను పెద్ద నటుడినైన తర్వాతగాని ఇంటి మొహం చూడనని భీష్మించుకుని కూర్చున్నాడు.

ఇక వేలాయుధం...తెలుగువాడే...అతనిది సరిహద్దు జిల్లాలో ఏదో చిన్న ఊరు. అతనికి ప్రపంచంలో ఎవరూ లేరు. అతని కోసం దిన పత్రికలో ప్రకటనలు వేయించేవారు ఎవరూ లేరు. అతని కోసం బాధ పడే వారూలేరు. సినిమా ప్రపంచంలో సాటిలేని మేటి నటుడిగా పేరు పొందాలనీ అతనికి లేదు. అందుకు అవసరమైన ఏ అర్హతలు తనలో లేవనీ అతనికి తెలుసు. నిజానికి రోజూ పని అయిపోగానే మేస్త్రీ అందరితోపాటు యిచ్చే మూడున్నర రూపాయలూ అతనికి చాలా అవసరం. అందుకోసమే అతడిక్కడ పడివున్నాడు. ఈ మాత్రపు

సంపాదన ఎక్కడో మరొకచోట, ఏ ఆఫీసులో వాటర్ బోయ్‌గా పని చేసినా, లేక పంకా లాగుతూ కూర్చున్నా వుండకపోదు. అయినా అతన్ని కాలు కదపకుండా ఆ వాతావరణానికి కట్టిపడేసిన ఆకర్షణ వేరే వుంది. ఇవాళ అతని లోలోపల ఒక హుషారు కలిగి అతన్ని నిలవ నీయడం లేదు. ఇవాళ తాము పనిచేయబోయే సినిమా చివరి దశలో పడింది. అదొక భారీ జానపద చిత్రం. అందులో ప్రధాన నాయిక వనజ. వేలాయుధం కళ్ళు మూసుకున్నాడు. ఆమె రూపమే అతని మనసులో మెదిలింది. ఆమెకు వయస్సెంత వుంటుందో ఖచ్చితంగా ఎవరికీ తెలియదు. అయినా చూసేవారికి పంపొమ్మిదేళ్ళ పిల్లవలె కనిపిస్తుంది. ఆమె అందం మత్తుమందు వంటిది. ఆమె వున్నచోట ఎవరికీ ఏమీ తోచదు. అందరూ తమ పనేమిటో, తామేం చెయ్యాలో మరచిపోయి ఒకరిమీద ఒకరు కేకలేసుకుంటూ వుంటారు. మరి నిన్నటి షూటింగ్ సందర్భంలో ఆ చెవిటి అసిస్టెంటు డైరెక్టరు చేసిన హడావిడి యింతా అంతా కాదు. మాటిమాటికి ముక్కుమీదకి జారుతున్న అద్దాలు సర్దుకుంటూ హియరింగ్ ఎయిడ్ సర్దుకుంటూ, అతను తాను కంగారుపడి ఇతరులను కూడా కంగారుపెట్టి ప్రాణాలు తీశాడు. వనజ ముందు నిలబడి వున్న వేలాయుధాన్ని చూపుడు వ్రేలితో దగ్గరికి రమ్మని సైగచేసి "నువ్వు యింకా ఇక్కడెందుకు నిలబడి వున్నావు? అలా గుడ్లప్పగించి లాంతరు స్తంభంలా నిలబడకపోతే వెళ్ళి మొహానికి మేకప్ కొట్టించుకోరాదూ? అవతల రిలీజింగ్ డేట్ పీకలమీదకి వస్తున్నది. తో త్వరగా..." అన్నాడు. వేలాయుధానికి అతని వైఖరి గొప్ప చిరాకు కలిగించింది. అగ్గిమీద ఆజ్యంలాగా వనజ ఆ మాటలు విని మరీ పమిటచెంగు నోటి కడ్డం పెట్టుకుని పెద్దగా నవ్వడం...

క్రింద ఏదో చప్పుడు వినిపించి కిటికీ లోంచి తొంగి చూశాడు వేలాయుధం ..శేఖర్ తన డొక్కు ఫారిన్ సైకిలును గోడ కానించి తాళం వేసి హడావిడిగా పైకి వస్తున్నాడు. అతడొక మళయాళీ. కండలు తిరిగిన శరీరంతో చిన్నసైజు వస్తాదులా వుంటాడు. నాలుగైదు సినిమా లలో సెక్ విలన్‌కు కుడి భుజంగా నటించి కుసీలు పట్టాడు.

అతడు గదిలోకి రావడమే సుడిగాలిలా వచ్చాడు. వస్తూనే చేతిలో పేపరు భైరవమూర్తి మొహాన కొట్టి కూర్చుంటూ "నిన్న రాత్రే ప్రధానం. రేపు సాయంకాలమే పెళ్ళి.... పేపర్లో అచ్చు పడింది ..." అన్నాడు. ఇక యితర వివరాలు చెప్పకుండా ఒకప్రక్క కూర్చున్నాడు. అతడు ఉదయమే బయలుదేరి ఎందరికి ఈ ప్రధానం వార్త అందించి వస్తున్నాడో? బాగా అలసిపోయి వున్నాడు. ఆ డొక్కు సైకిలు మీద పట్నం అంతా చెడతిరిగి వుంటాడు. అతని కేదయినా విషయం తెలిస్తే ఊరంతా అంటించే దాక నిద్రపోడు. ఆ ఫారిన్ సైకిలు అతనికి బహూః ప్రాణం. ఎప్పుడో ఎవరో విదేశీ ఫాదరీ దగ్గర అతడు వంటవాడుగా పని చేశాడు. ఆ ఫాదర్ తన దేశానికి వెళ్ళిపోతూ నమ్మకంగా తన దగ్గర పని చేసిన శేఖరుకు ఆ సైకిలు బహూకరించి వెళ్ళాడు. అతడు దాని మీద ఊరంతా రౌండ్లు కొడుతూ వుంటాడు.

వామనరావు అతనికి ఒక గ్లాసెడు మంచినీళ్ళు అందించి "సరిగ్గా చెప్పవయ్యా? నీ మళయాళం పేపరులో ఏంవేశారో మాకెలా తెలుస్తుంది? ఎవరికి ప్రధానం ఏమిటికథ?" అని అడిగాడు.

శేఖర్ వేలాయుధం వైపు తిరిగి నవ్వి తర్వాత గొప్పవార్త చెప్ప బోతున్నవాడిలా పోజు పెట్టి "వనజమ్మగారిది... పెళ్ళికొడుకు పెద్దడాక్టరు. ఆమె యింక పటాల్లో యాక్టుచెయ్యదు...అంతా రహస్యంగా జరిగింది. ఇవాళే షూటింగంటా ఆఖరు... రేపు సాయంకాలమే పెళ్ళి..." అన్నాడు.

వేలాయుధం దెబ్బతిన్నవాడిలా చూశాడు. వెంటనే ముఖం కిటికీ వైపు తిప్పుకుని నిలబడిపోయాడు. బయట ఎండ బాగా ఎక్కువైనట్టుంది. గాలి స్తంభించింది. అతడు చొక్కాచివరతో మొహం తుడుచుకున్నాడు.

వెంకటేశం మళ్ళీ "ప్రేమకోసమై..." అంటూ పాట అందు కున్నాడు. వామనరావు "మంచివార్తే చెప్పావు. అంటే ఇవాళ అంతా గొప్ప హడావిడి అన్నమాట. ఇవాళే షూటింగు ఆఖరంటే మనం వూపిరి పీల్చుకోవటానికైనా వీలుండదు. మనకున్న బుల్లిబుల్లి వేషాలన్నీ ఇంకా మిగిలేవున్నాయిగా..." అంటున్నాడు.

భైరవమూర్తి శేఖర్ దగ్గరగా జరిగి "పెళ్ళయిన తర్వాత యిక ఆమెగారు నటించటం మానేస్తుందా?" అని గుచ్చి, గుచ్చి అడుగుతున్నాడు.

శేఖర్ "అవునబ్బా! నేనేం చెప్పాను? కావాలంటే పేపర్లో చూడుమీ" అంటూ మళ్ళీ ఆ సాయంకాలం పేపరును అతని వొళ్ళోపడేశాడు. అతడు పేపరు విప్పి "[illegible]పించు" అని అడిగాడు. శేఖర్ మూడవ పేజీలో ఒకచోట వేలుపెట్టి చూపించాడు. భైరవమూర్తి 'అవునయ్యా! ఇక్కడ ఆమె [illegible] కూడా వేశారు [illegible]న్నారు. వెంకటేశం చప్పరించి "ఆc! ఆ ఫోటోకింద ఏం రాశివున్నదో మనకు తెలియదుగా..." అంటున్నాడు.

అంతలోనే క్రింద హారన్ వినిపించింది. అందరూ లేచి విలవిలలాడుతూ హడావిడిగా మెట్లు దిగి వచ్చారు. వేలాయుధం నెమ్మదిగా తలుపుకు తాళంవేసి ఒక్కొక్కమెట్టు నింపాదిగా దిగటం ప్రారంభించాడు. ఈలోపల వ్యానులోవారు సర్దుకుకూర్చున్నారు. మేస్త్రీ పెద్దగా కేకవేసి "ఏమయ్యా వేలాయుధం! నీకోసం ఇంకొక గంట వెయిట్ చెయ్యాల్నా! తొందరగా రావయ్యా? ఇవాళ అసలే హడావిడి. ఆమెగారి పెళ్ళి నాప్రాణానికి వచ్చింది. ఇన్నాళ్ళూ ఈ చిల్లర మనుషులతో షూటింగ్ చెయ్యకుండా వాళ్ళేమో తాత్సారం చేశారు. ఇప్పుడు కొంప మీదికి వచ్చింది. ఇవాళే పని అంతా అయిపోవాలని ఆ ప్రొడ్యూసర్‌గారు గోలపెట్టాడు. ఆయన యెప్పుడూ "నా లక్షలు నా లక్షలు"... అంటూ వుంటాడు. పైగేమో నీరసం మనుషులు దొరికారు... ఏం చేతునబ్బా" అంటూ సణుగుతున్నాడు.

వ్యానులో చోటులేదు. మేస్త్రీ,వ్యానులో చివరగా కూర్చున్న మరుగుజ్జు ఎక్‌స్ట్రాని కేకవేసి "నువ్వు నిలబడుకుని ఆయనగారికి చోటియ్యవయ్యా? పెద్ద లాడ్డులాగా కాళ్ళుజాపుకుని కూర్చున్నావు. కొంచెం ఒత్తుకో..." అన్నాడు పెద్దగా.

మరుగుజ్జు వాడివి లావుపాటి కాళ్ళూ చేతులూ, నల్లని పళ్ళింవంటి వెడల్పయిన ముఖం...ఇవాళ అతడు సంబరం సీనులో పాల్గొనాలి.

అతను పళ్ళికిలించి నవ్వుతూ లేచి నిలబడి "మీరు కూర్చోండిస్వామీ!" అన్నాడు. వేలాయుధం సర్దుకుని కూర్చోగానే మేస్త్రీ "ఏమయ్యా ! ఖయివరూ! పోనీయ్ బండిసి ఇంకా దిక్కులు చూస్తూ కూర్చున్నావు" అన్నాడు.

వ్యాను కదిలింది.

సెట్టునిండా జనం బిలబిలలాడుతూ హడావిడిగా తిరుగుతున్నారు. చెవిటి అసిస్టెంటు డైరెక్టరు కళ్ళద్దాలు సర్దుకుంటూ సంబరం సీను చిత్రించటానికి కావలసిన ఏర్పాట్లు చూస్తున్నాడు. ఒకవైపు హీరోపాత్ర ధారి, తళ తళ మెరిసే రాజకుమారుడి దుస్తుల్లో అచ్చం రాజకుమారుడికి మల్లేనే ఠీవిగా కూర్చుని తన పోర్షన్ చూసుకుంటున్నాడు. ప్రొడ్యూసర్ గారు మాటిమాటికి "లక్షలుపోసి పనిచేస్తున్నాం. త్వరగా కానియ్యండి." అంటూ అందర్నీ తొందరపెడుతున్నాడు. డైరెక్టరు తాపీగా కళ్ళు మూసుకుని కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నాడు.

ఒక పక్క సంబరంసీనులో పాల్గొనవలసినవారు దాదాపు యిరవై మున్ఫయిమంది ఎక్స్ట్రాలు మొహాలకు రంగులు వేసుకుని తలలకు పాగాలతో, చేతులలో కర్రలతో, ముక్కులకూ, చెవులకూ రింగులతో సిద్ధంగా నిలబడి వున్నారు. ఒక ఎలుగుబంటి కూడా ఆ సీనులలో పాల్గొనవలసి వుంది. అది శాపవశాత్తు ఎలుగుబంటిగా మారిన రాజ కుమారుడన్న మాట. దాని యజమాని ఆలస్యంగా వచ్చి కాసిని చివాట్లు తిని ఒక ప్రక్కగా నిలబడి వున్నాడు.

వేలాయుధం హీరోప్రక్క నిలబడి వుండి ఆయన వంకే కళ్లార్ప కుండా చూస్తున్నాడు. అంతలో అసిస్టెంట్ డైరెక్టరు హడావిడిగా వచ్చి అటూ యిటూ చూసి వేలాయుధంతో "ఏమప్పా. యింకా నిలబడే వుంటివి... కోటాకొట్టుకొనిరావయ్యా! తర్వాత దిక్కులే చూడవచ్చులే..." అన్నాడు.

వేలాయుధం నెమ్మదిగా నడిచి లోపలికి వెళ్ళాడు. అక్కడ సీనియర్ మేకప్‌మాన్ తప్ప మిగిలిన అందరూ తలా ఒకరికీ మొహాలకు రంగులు వేస్తున్నారు. సీనియర్ మేకప్‌మాన్ హీరోయిన్ వస్తే ఆమెకు మేకప్ చెయ్యాలి. అంతవరకూ ఆయన తన క్రింది వారిమీద అజమాయిషీ చేస్తూ అటూ యిటూ తిరుగుతూ వుంటాడు.

వేలాయుధం కుర్చీలో కూర్చోగానే గుండుమణి చేతిలో సీసాతో వచ్చాడు. "ఏమయ్యా? ఎవరో పోయినట్టు మొహం పెట్టావ్? ఏమిటి సమాచారం" అంటూ వేలాయుధం జుట్టు పైకి దువ్వి తలకు గుడ్డ కట్టాడు. వేలాయుధం ఏమీ మాట్లాడలేదు. గుండుమణి అతని మొహం నిండా రంగు చుక్కలు పెట్టి ఎవరో పిలవగా "వస్తున్నా సార్..." అంటూ పరుగెత్తి పోయాడు. వేలాయుధం కళ్ళు తెరిచి ఎదురుగా అద్దంలో తన ప్రతిబింబం చూచుకున్నాడు. అతడేం అందగాడు కాదు. పైగా పళ్ళు ఎత్తు...కళ్ళు చిన్నవి... నుదుటి మీద, చిన్నప్పుడెప్పుడో చిన్నబిడ్డ గుణం వస్తే చుట్ట పెట్టి కాల్చారు కాబోలు, ఒక పెద్ద మచ్చ ...లావుపాటి ముక్కు...దట్టమైన కనుబొమలు...

గుండుమణి పరుగెత్తుకుంటూ వచ్చి "నువ్వు ఒక్క క్షణం ఆగు సామీ; ముందు ఈయన గారికి రంగువేసి పంపాలి. హుకుం అయింది." అన్నాడు.

వేలాయుధం లేవగానే శేఖర్ నవ్వుతూ వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. సినిమాలో రాజుగారి వినోదార్థం ఏర్పాటైన కుస్తీ పోటీలలో శేఖర్ పాల్గొనాలి. "ఈ సీన్లు ముందు కానిచ్చేద్దాం. వనజగారు వచ్చే లోపల..." అనుకున్నారు డైరెక్టరుగారు. ఒక ప్రక్క రాజుగారికి కుమారుడు జన్మించిన సందర్భంలో ప్రజానీకం చేసుకున్న సంబరాలు, ఉత్సవాలు చిత్రిస్తున్నారు.

మేకప్ రూంలో కొందరు ఆడవాళ్ళు మేకప్ చేయించుకుంటున్నారు. ఒకామె వేలాయుధం వంక చూసి నవ్వుతున్నది. వేలాయుధం మొహం తిప్పుకున్నాడు. నిజానికి అతనికి కూడా నవ్వు వచ్చింది.

అవును మరి, మొహం నిండా రంగు చుక్కలతో తన అవతారం తనకే నవ్వు పుట్టిస్తున్నది.

ఇంతలో సరస అటువైపునుంచి అతని దగ్గరికి వచ్చి అతన్ని పలుకరించి "తంగం నీ కోసం అడిగిందయ్యా. నిన్ను చూసి ఎన్నాళ్ళో అయిందట...ఒకసారి రమ్మన్నది.. 'అని చెప్పింది. వేలాయుధం ఏమీ మాటాడకుండా యివతలికి వచ్చేశాడు.

అంతలో బయట హడావుడి...హీరోయిన్‌గారు వచ్చారు..." అని కేక పెట్టారెవరో...వేలాయుధం దాదాపు పరుగెత్తుతూ వరండాలోకి వచ్చాడు. బయట కారులోనుంచి దిగుతున్నదామె...ఆకుపచ్చని చీరె... తెల్లని రవిక...కళ్ళకు నల్లఅద్దాల జోడు...కాళ్ళకు హైహీల్సుజోడూ..

నాయక పాత్రధారి మేకప్‌తోనే ఆమె కెదురుగా వెళ్ళి "కంగ్రాచులేషన్స్" చెప్పి వెంట బెట్టుకుని వస్తున్నాడు. డైరెక్టరూ, నిర్మాతా కూడా అలాగే ఆమెను ఆహ్వానించారు. అసిస్టెంట్ డైరెక్టరు పీలు చూచుకుని కళ్ళజోడు సర్దుకుంటూ "విష్‌యూ ఎ హ్యాపీ మేరీడ్ లైఫ్" అన్నాడు.

ఆమె నవ్వుతూ లోపలికి వచ్చింది. వెడల్పయిన లేడి కళ్ళతో చుట్టూ చూసి వేలాయుధం మీద ఒక్క క్షణం దృష్టి నిలిపి వాలకం చూసి కాబోలు చిరునవ్వు నవ్వింది. వేలాయుధం వెంటనే లోపలికి పారిపోయాడు. శేఖర్ అద్దంలో మొహం చూసుకుంటూ వుండగా అతడు వెళ్ళి కూర్చుని గుండుమణితో "ఏం పని చేశావయ్యా! కొండమంగలి లాగా...ఈ చుక్కలెందుకు పెట్టావు? అందరూ నవ్వుతున్నారు. ముందు నా పని చూడు..." అన్నాడు.

గుండుమణి పెద్దగా నవ్వి "ఏమబ్బా. అంత సిగ్గు...సరే కానియ్ ముందు నీ పని పూర్తి చేస్తాను రా...పొద్దుటినుంచీ కాఫీ అయినా తాగలేదు. నా చేతులు పడిపోతున్నాయ్..." అన్నాడు.

అవతల సీనియర్ మేకప్‌మాన్ హీరోయిన్‌ను వెంట తీసుకువచ్చి మేకప్ ప్రారంభించాడు.

గుండుమణి "మాటి మాటికీ తల తిప్పకు సామి" అని కసురుతూ [illegible]

షూటింగ్ శరవేగంతో కొనసాగింది. రాజకుమారి చెలికత్తెలతో పాట పాడుతూ వన విహారం చేసే దృశ్యమూ, ప్రేయసీ ప్రియుల విరహ యుగళ గీతమూ, సేనాధిపతి రాజకుమార్తెను ప్రేమభిక్ష అర్థించడమూ ఇత్యాదులన్నీ త్వరత్వరగా షూట్ చేశారు.

మధ్యమధ్య హీరోయిన్ విశ్రాంతిగా కూర్చున్నప్పుడు వేలాయుధం అక్కడే ఆమె వంక చూస్తూ నిలబడేవాడు. పత్రికా విలేకరులు ఆమె చుట్టూ మూగి రకరకాల ప్రశ్నలువేసి ఆమెచేత జవాబులు రాబట్టే ప్రయత్నాలు చేశారు. "మీరు పెళ్ళిఅయిన తరువాత ఇక నటించరా?..." అని ఒకరు, "హనీమూన్‌కు ఎక్కడికి వెళదామనుకుంటున్నారు?" అని మరొకరు.

ఆమె ఉన్నట్టుండి "నాకు దాహంగా వుంది. ఎవరైనా కాసిని మంచినీళ్ళు యివ్వండి..." అన్నది. డైరెక్టరుగారు "మంచినీళ్ళేం ఖర్మ! కూల్‌డ్రింక్ తెప్పిస్తాను." అంటూ తెప్పించేలోగానే వేలాయుధం తళతళలాడే గాజుగ్లాసులో చల్లని మంచినీళ్ళు తెచ్చి ఆమెకు అందించాడు. ఆమె కూల్‌డ్రింక్ తీసుకోవాలా, మంచినీళ్ళు తీసుకోవాలా అని ఒక క్షణం ఆలోచించి చివరకు నవ్వుతూ వేలాయుధం చేతిలోనుంచి మంచి నీళ్ళ గ్లాసు అందుకున్నది. వేలాయుధం ఆమె చేతివేళ్ళు తన చేతికి తగలగానే కరిగిపోయాడు.

డైరెక్టరుగారు హడావిడిగా వచ్చి "అమ్మణ్ణీ! ఇక ఒకసీనే మిగిలింది. అది పూర్తయితే తమరు వెళ్ళవచ్చు. అది తొందరలో పీలుపడేటట్టు లేదే—" అన్నారు, అనుమానిస్తూ.

విలన్‌గారు వేరొకచోట పనిలో వున్నారు. ఆయన వెంటనే వచ్చేందుకు వీలుపడదు. అదీ ఫోనుమీద చేరిన సమాచారం. ఇప్పుడేం చేసేట్టు? ఆమె చేతి గడియారం చూసుకుని తల అడ్డంగా ఊపుతూ "లాభం లేదు. ఏ పరిస్థితులలోనూ మరొక గంటకంటె ఇక్కడ ఉండలేను" అన్నది.

అందరూ హడావిడి పడ్డారు. విలన్‌గారికి ఫోన్ చేశారు. ఆయన అసిస్టెంట్ డైరెక్టరుమీద కోప్పడి "నేను మామూలుగా ఇచ్చిన కాల్ షీట్లు ఇక్కడ పూర్తి కావాలి. మీరు షెడ్యూలు ముందుకు నెట్టారు. నేనా అందుకు బాధ్యుణ్ణి? మరో రెండు మూడు గంటల వరకూ నాకు ఫోను కూడా చెయ్యకండి. ఇక్కడ పీకల లోతున పనిలో మునిగి వున్నాం అందరమూ" అని ఫోను పెట్టేశాడు.

డైరెక్టరుగారికి గొప్ప ఆలోచన తట్టింది. విలన్ రాజకుమారి నిద్రిస్తూండగా వచ్చి ముక్కులకు మత్తుమందు వాసన చూపించి ఆమెను భుజాలమీద వేసుకుని వెళ్ళిపోవాలి. విలన్ ఆపాద మస్తకమూ నల్లని ముసుగు ధరించి వస్తే సరి. "ఓన్" ఏం దిగులుపడనక్కరలేదు. దానికి విలన్ పాత్ర అక్కరలేదు. ఆ మాత్రం ఒడ్డూ, పొడుగూ వున్న మనిషి ఎవరైనా పనికి వస్తారు. "లక్షలు లక్షలు" అంటున్న ప్రొడ్యూసర్ మొహం వికసించింది. "అయితే ఆ మనిషిని చూసి త్వరగా కానివ్వండి" అన్నాడు.

అందరూ అక్కడే చేరారు. డైరెక్టరుగారు అందరి ముఖాలవైపూ తీక్షణంగా చూశాడు. వేలాయుధం మీదికి ఆయన చూపులు రాగానే గొంతు సర్దుకుని ముందుకు జరిగాడు. డైరెక్టరుగారు సైగచేసి "ఇటురా" అన్నాడు. వేలాయుధం ముఖం వికసించింది. అతడు ముందుకు రాబోతే "నువ్వు కాదు ఆ వెనక మనిషి" అన్నాడు డైరెక్టరు. వేలాయుధం ముఖం వ్రేలాడవేసుకుని వెనుదిరిగి చూశాడు. భైరవమూర్తి... అతడు డైరెక్టర్ వెంట లోపలికి వెళ్ళాడు. మేకప్. జరుగుతూ వుండగానే సలహాలు సూచనలూ అన్నీ జరిగిపోయాయి.

మరి కొద్ది నిమిషాల్లో భైరవమూర్తి నల్లని ముసుగు మనిషిగా ఇవతలికి వచ్చాడు. వేలాయుధం మనసులో అసూయ వ్రేళ్ళుతన్ని మహా వృక్షమైంది.

రిహార్సల్... విలన్ గోడమీదుగా గదిలోకి వచ్చాడు. కెమెరా మరోవైపుకు తిరిగింది. రాజకుమారి హాయిగా నిద్రిస్తున్నది. ఆమె గుండె

లకు ఎదురుగా కొంచెం ఎత్తున కెమెరా... విలన్ నెమ్మదిగా నడిచి మంచం పక్కకు వచ్చాడు. ఒక్క క్షణం ముసుగు లోపలి కళ్ళు మెరిశాయి. అతని చేతులలో ఏదో మందు వుంది. దాన్ని ఆమె ముక్కుల వద్ద వుంచాడు. రాజకుమారికి స్పృహ తప్పింది. విలన్ ఆమెను లేవదీసి భుజాలమీద వేసుకుని నెమ్మదిగా నడిచి వెళ్ళాడు.

వేలాయుధం మనసు ఉడికిపోతున్నది. అతడు మాటి మాటికీ మొహం తుడుచుకుంటూ కళ్ళార్పకుండా అటే చూశాడు. "భైరవమూర్తి ఎంత అదృష్టవంతుడు..." అనిపించిందతనికి.

ఆ సీను అయిపోగానే అందరూ మేకప్ తుడుచుకుంటున్న హీరో యిన్ దగ్గరికి చేరారు. అందరూ తలా ఒకవైపునుంచి శుభాకాంక్షలు తెలుపుతూ వుండగా, కొన్ని కెమెరాలు క్లిక్ మంటూ వుండగా ఆమె చిరునవ్వు నవ్వుతూ అందరి దగ్గరా సెలవు తీసుకుంది. పెద్దలందరూ ఆమెను కారు వరకూ సాగనంపి వచ్చారు.

తర్వాత యుద్ధం సీను చిత్రించారు. చాలా మంది ఎక్స్ట్రాలు కత్తులు తిప్పుతూ ఒకరితో ఒకరు పోట్లాడుకున్నారు. వేలాయుధం ఇద్దరు శత్రువులను నేలగూల్చి తర్వాత వీరమరణం పొందాడు.

నగరమంతా లైట్ల వెలుగులో పట్టపగలువలె మెరిసిపోతున్నది. బజారులన్నీ వచ్చేపోయే విలువైన కార్లతో, బస్సులతో నిండివున్నాయి. ఆకార్లనిండా, బస్సులనిండా హాయిగా నవ్వుతూ ఎంతోమంది అదృష్ట వంతులున్నారు.

వేలాయుధం పేవ్‌మెంట్ మీద నెమ్మదిగా నడుస్తున్నాడు. అతని చొక్కాజేబులో మూడు రూపాయల చిల్లరవుంది. అతని ముఖం కళా విహీనమైవుంది. అతని మనసులో దిగులు గూడు కట్టుకుని వుంది.

అతనికి హఠాత్తుగా తంగం గుర్తుకు వచ్చింది. ఆమెకు ముప్పయి యేళ్ళుంటాయి. చాలా యేళ్ళ క్రిందట అయినవారి నందరినీ వదలిపెట్టి

సినిమా పిచ్చితో ఇక్కడికి పారిపోయివచ్చింది. వేలాయుధానికి ఆ రోజులు బాగా గుర్తు. అప్పటి కతడు ఆ వూరికి కొత్త. మొదట్లో తంగం బాగానే వుండేది. కాని, తర్వాత ఆమె స్థితి బాగా చెడింది. అమాయకు రాలు కావడం వల్ల అందర్ని నమ్మింది. బాగా వున్నప్పుడామెను అందరూ చేరదీశారు. ఇప్పుడు దూరంగా తోసేశారు. ఇప్పుడామెకు సంవత్సరన్నర వయసు గల ఆడపిల్ల వుంది. ఆ పిల్లే ఆమె సర్వస్వం. ఆ పిల్ల బొద్దుగా బాగుంటుంది. అప్పుడప్పుడు సినిమాలోకి పసిపిల్లలు కావలసి వస్తారు. అటువంటి అవకాశం దొరికితే తంగం తన పిల్లను ఎత్తుకుని తయారవుతుంది. అలా తంగం సంగతి ఎలా వున్నా ఆ పసి పిల్ల మాత్రం ఇప్పటికి రెండు మూడు సినిమాల్లో నటించింది.

వేలాయుధం అంటే తంగం పడి చస్తుంది. అందుకు కారణం ఏమిటో వారిద్దరికీ తెలీదు. వేలాయుధం ఆమెపట్ల వైముఖ్యం పెంచు కున్నాడు. అతనికి శరీరం అమ్ముకుని బ్రతికే ఆడవాళ్ళంటే రోత...

తలమీద నాలుగైదు వర్షపు చినుకులు పడేసరికి అతడు తల పైకెత్తి చూశాడు. వర్షం వచ్చే సూచనలైతే వున్నాయిగాని వేలాయుధం మాత్రం ఖచ్చితంగా "వర్షం రాదు..." అనుకున్నాడు.

తర్వాత అతడు ఎదురుగా వున్న పెద్ద హోటలులోకి వెళ్ళి అద నపు పదార్థాలతో సుష్టుగా భోజనం చేశాడు. తర్వాత త్రేన్చుకుంటూ వాకి ట్లోకి వచ్చి కిల్లీ వేసుకుని సిగిరెట్టు ముట్టించుకుని పొగ లోపలికి పీల్చి వొదిలి మెట్లు దిగి నడవటం ప్రారంభించాడు.

పెద్ద బస్సు ఒకటి రొద చేసుకుంటూ రోడ్డు మీద వెళ్ళింది... పాతకాలపు మోడలు డొక్కు కారు ఒకటి నిండా మనుషులతో, నెమ్మ దిగా వెళ్ళింది. నల్లని వాడొకడు ఏదో సినిమా పాట పాడుకుంటూ నడచి పోతున్నాడు. అడుక్కుతినే వాడొకడు యింటింటిముందూ ఆగి "తాయీ" అంటూ కేకలు పెడుతున్నాడు. ఇంగ్లీషు సినిమా వాల్‌పోస్టర్లో ఒక ఆడదీ మొగవాడూ బహిరంగంగా ముద్దుపెట్టుకుంటున్నారు. ఎదురుగా వచ్చే కారులో ఒక ప్రఖ్యాత నటుడున్నాడు. అవును... బహుశా షూటింగ్ ముగించుకుని ఇంటికి పోతున్నాడేమో!

చల్లని గాలి వీస్తున్నది. ఈ తంగం అంటే తనకు రోత. దాని పసిపిల్ల అంటే రోత...దాని ఇల్లంటే రోత...ఆ సందూ,వీధీ...అన్నీ రోత...అయినా యిప్పుడు వెళ్ళక తప్పదు. రేపు సాయంకాలమే పెళ్ళి...

"తంగం యీ వీధిలోనే వుంటుంది. ఇప్పుడాయింట్లో ఏడున్నాడో ఏమో! పాడుగోల... అయినా తలుపుతట్టి చూద్దాం..." అనుకుంటూ తలుపు తట్టాడు.

తంగం తలుపుతీసి "యారు ?" అని అడిగింది. మరు క్షణంలో ఆమె వేలాయుధాన్ని గుర్తించింది. ఆమె ముఖం వికసించింది.

"రా. లోపలికి...శాన్నాళ్ళకు మా పైద దయ కలిగిందే..." అన్నది.

వేలాయుధం నవ్వి లోపలికి అడుగుపెట్టాడు. ఒకసారి యిల్లంతా కలయజూశాడు. గది మధ్యలో ఉయ్యాలలో గుప్పిళ్ళు ముడుచుకుని పసిపిల్ల నిద్రపోతున్నది. మునుపు ఆ మూల కుర్చీ ఒకటి, బల్ల ఒకటీ వుండాలి. ఏమయ్యాయో మరి ?

తంగం మంచం వాల్చి ఎర్రని పళ్ళు కనిపించేలా నవ్వి "బొమ్మ లాగా నిలబడిపోయావే. కూర్చో సామీ!...నీ సొమ్మేం పోదులే...... నిన్న సరస మాట్టాడితే సమాధానమే చెప్పలేదటగా..." అన్నది.

వేలాయుధం ఉయ్యాల దగ్గరగా వెళ్ళి పసిపిల్లను చూశాడు. పిల్ల మొహంలో మంచికళ ఉంది. ఏమో దాని నుదుటి వ్రాత ఎలా వుందో.

తంగం పిల్లమీద గుడ్డసరిగా కప్పుతూ "సాయంకాలం పిల్లను స్టూడియోకు తీసుకుపోతిని. అక్కడ అంతా ఇంతా గోలకాదు. అందరి కళ్ళూ మా అమ్మణ్ణిపైనే... ఎట్లా నవ్విందనుకున్నావ్! పది రూపాయలు సంపాయించింది. కాస్సేపట్లో!" అన్నది. వేలాయుధం ఆమె వంక చూశాడు. ఆమె కళ్ళు మెరుస్తున్నాయి. తంగం అందగత్తె... పచ్చని వొంటిరంగు...పెద్ద పెద్ద కళ్ళు... తీర్చిదిద్దినట్టుండే అవయవాలు... మునుపు యింకా బాగుండేది.

తంగం లోపలికి వెళ్ళబోతూవుంటే వేలాయుధం "సాపాటు అయింది. కాసిని మంచినీళ్ళివ్వు..." అన్నాడు.

ఆమె వెనుదిరిగి నవ్వి "అవున్లే...నువ్వు నా యింట్లో ఎందుకు తింటావులే..." అన్నది. తర్వాత వెళ్ళి మంచినీళ్ళు తీసుకొచ్చి, క్రింద వుంచబోయింది. "చేతికివ్వగూడదా ?" అన్నాడు వేలాయుధం. "కూడదు ...నువ్వు మైలపడతావని..." అన్నది తంగం నవ్వి.

నీళ్ళు తాగుతూ వేలాయుధం ఆమెవంక పరీక్షగా చూశాడు. ఆమె నవ్వుతున్నది. ఆ నవ్వులో జీవం వున్నది. సరదా వుంది. ఆమె మెళ్ళో తళతళలాడుతున్న రెండు పేటల బంగారు గొలుసు వుంది. వేలాయుధం ఆమె చేతిని పట్టుకుని తన ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు. తంగం మెరుపు మెరిసినట్టు నవ్వింది.

మహావైభవంగా పెళ్ళి జరుగుతున్నది... పెద్దపందిరి...పందిరి నిండా విలువైన కుర్చీలు...కుర్చీలలో విలువైన మనుషులు...వారి ఖరీదైన నవ్వులు...

వాతావరణమంతా స్వర్గతుల్యంగా వుంది. వేలాయుధం మొదటి వరుస కుర్చీలో ఒకదాన్లో కూర్చుని వున్నాడు. అతడు ఖరీదైన సూటులో వున్నాడు. చేతిలో ఖరీదైన సిగరెట్ టిన్ వుంది. అటూ యిటూ వున్న వారితో ఉండి ఉండి మాటాడుతున్నాడు. ఉండి ఉండి చురుకైన కళ్ళతో కళ్యాణ వేదిక మీదనున్న పెళ్ళికొడుకునూ, పెళ్ళికూతురినీ చూస్తున్నాడు.

చదివింపులవేళ...పెద్దలందరూ వివిధమైన కానుకలను చదివించారు. వేలాయుధం చక్కని పచ్చరాయి పొదిగిన ఉంగరం ఒకటి తీసుకుపోయి చదివించాడు. వధువు ఉంగరం అందుకుంటూ అతని వంక కళ్ళు పెద్దవి చేసుకుని చూసింది. వేలాయుధం విషాదంగా నవ్వి ఇవతలికి వచ్చేసి జేబు రుమాలుతో కనురెప్పలు తుడుచుకున్నాడు. తర్వాత అతని కేమీతోచలేదు. చేతులురెండు తుడుచుకున్నాడు, తర్వాత వ్రేళ్ళు విరుచు

కున్నాడు. ఆవులించాడు. తర్వాత నెమ్మదిగా నడవటం ప్రారంభించాడు.

ఇంతలో గేటు దగ్గర అతన్నిచూసి సరస త్వరత్వరగా నడచి వచ్చింది. ఆమెను చూడగానే వేలాయుధం గుండెలు దడదడ లాడాయి. అతడు గబగబా పరుగెత్తుకుపోయి ఖాళీరిక్షాలో ఎక్కికూర్చుని "పోనియ్" అన్నాడు. సరస ఆగిపోయి పక్కనున్న ఆమెతో "దొంగ సచ్చినోడు. తంగం దగ్గిర బంగారు గొలుసు కాజేశాడు. పట్టుబడితే చెప్పుతీసి పళ్ళూడ గొట్టేదాన్ని తప్పించుకు పోయాడు" అన్నది.

* * *

వామనరావు మెట్లెక్కి పైకి వెళ్ళేసరికి ఇంకా తాళం అలాగేవుంది. అతడు ఉస్సురని నిట్టూర్చి "బాగానేవుంది. దరిద్రుడు తల కడిగితే వడగళ్ళవానట. మనవాడి దగ్గిర నాలుగు డబ్బులుండాయేమో కూడు తిందామని వస్తే ఎన్నిసార్లు తిరిగినా తాళం ప్రత్యక్షం..." అనుకుంటూ పంచలో అలాగే కూర్చున్నాడు. బాగా అలిసిపోయి అందులోను ఆకలితో వున్నాడేమో అతనికి అంతలోనే నిద్రపట్టింది.

అతనికి మెలకువ వచ్చేసరికి తలుపుతీసింది. అతడు ఒక్క గెంతులో లోపలికి వెళ్ళి చూశాడు. వేలాయుధం జాడ అయితేలేదు. గాని క్రింది చాపమీద ఒక పొట్లమూ చిన్న కాయితం కనిపించాయి. అతడు కాయితం తీసుకుని చదువుకున్నాడు.

"వా॥ మూర్తీ, నేను వెళ్ళిపోతున్నాను. ఎక్కడికి పోతున్నానో నాకే తెలియదు. మళ్ళీ వస్తానో రానో కూడా తెలియదు; ఈ ప్యాకెట్‌లో సూటువుంది. దాన్ని పెద్దబజారులో శ్రీలాండ్రీలో ఇస్తే వాళ్ళు పాతిక రూపాయలిస్తారు. ఆడబ్బు నువ్వు వాడుకోవచ్చు. తంగం యింటికి పోయి వేలాయుధాన్ని క్షమించమనిచెప్పవలసినది. ఇట్లువేలాయుధం" అనివుంది.

వామనరావు నివ్వెరపోయి క్రిందకి పరుగెత్తుకుంటూ పోయాడు. ఇక ఒక పావుగంట క్రితం వేలాయుధం వచ్చి మళ్ళీ అంతలోనే వెళ్ళిపోయాడని చెప్పారు క్రింద వుంటున్నవారు.

ఒకానొక చిత్రం షూటింగు సందర్భంలో వామనరావు, భైరవ మూర్తి, వెంకటేశమూ కలుసుకున్నారు. ముగ్గురూ రాజభటుల వేషాలలో వున్నారు.

భైరవమూర్తి సిగిరెట్టు ముట్టించుకుని హఠాత్తుగా "అన్నట్టు ఈ మధ్య నాకు ఒంగోలు స్టేషనులో వేలాయుధం కనిపించాడు" అన్నాడు.

మిగిలిన ఇద్దరికీ ఆదుర్దా హెచ్చి ప్రశ్నల వర్షం కురిపించారు. అక్కడే పిల్ల నెత్తుకుని నిలబడి వున్న తంగం ఈ సంభాషణ విని దగ్గరకు వచ్చింది.

"జుట్టు బాగా పెరిగింది. మనిషి నీరసించి పుల్లలాగా అయిపోయాడు. అసలు గుర్తుపట్టేందుకూ కష్టమైపోయింది. భోజనాల రూము దగ్గర నిలబడి ఆకలయితే వారి ముందూ వీరి ముందూ చేతులు జాపి నిలబడతాడు. తర్వాత ప్లాటుఫారం మీద చెట్టుకింద పడుకుంటాట్ట ...నేను పలుకరిస్తే నన్ను వింతగా చూసి వెళ్ళిపోయాడు." అని చెప్పాడు భైరవమూర్తి.

"అక్కడేవున్నాడా ఇప్పుడు?" అని అడిగింది తంగం ఆదుర్దాగా.

భైరవమూర్తి తల వూపి లేస్తూ "ఉహూ; అటువైపు వెళ్ళే రైల్లో నేను చూస్తూ వుండగానే ఎక్కాడు. ఎక్కడికి పోయాడో ఏమో!" అన్నాడు.

తంగం దూరంగా వెళ్ళి కళ్ళు తుడుచుకున్నది

# పూర్ణాహుతి

"ఏమీ లేదు పొమ్మంటూ వుంటే వినక శనిలా వెంటబడ్డావేమిటి? చెప్పేది నీకర్థం కాదూ? ఇవాళ అవకాశం లేదంటే వినిపించుకోవేం? వొదులు సైకిలు...అవతల నాకు వేళమించి పోతున్నది" అంటూ కసిరికొట్టాడు పేరిశా

నేను దిగాలుపడి నిలబడి పోయాను. పేరిశా,, మరు క్షణంలో సైకిలుమీద రివ్వున వెళ్ళిపోయాడు.

ఎండ చిటచిట లాడుతున్నది. తెల్లవారగానే కొరువులు తిప్పుతూ ఉదయిస్తున్నాడు సూర్యుడు. గాలి అంతా సాయంకాలం వరకూ ఎక్కడ దాక్కుంటుందో మరి పొద్దుగూకే వరకూ ఆకయినా కదలదు.

"ఉస్సుర"ని నిట్టూరుస్తూ వెళ్ళి గుడి అరుగుమీద మామూలుగానే పై పంచె పరచుకుని పడుకున్నాను. పైనించి కొద్దిగా నీడ పడుతున్నది. నాలుగయిదు పిచ్చుకలు రొదచేస్తూ అటూ ఇటూ ఎగురుతూ ఆడుకుంటు న్నాయి. గుడిముందు కిళ్ళీకొట్టు దగ్గర పదేళ్ళ కుర్రాడు ఆగి సోడా తాగు తున్నాడు పాపం. నెల రోజుల క్రితం ఆ పసివాడి తండ్రి అప్పటి వరకూ రాయిలా ఆరోగ్యంగా వుండేవాడు. హఠాత్తుగా చచ్చిపోయాడు. కుర్రవాడు చిన్నవాడు కావడం వల్ల ఉత్తరక్రియలు చేసేందుకు వీల్లేక పోయింది. అప్పుడు నామీద కర్తవ్యం పెట్టి అన్ని పనులూ ముగించాడు పేరిశాస్త్రి. ఆ వ్యవహారంలో పాతిక రూపాయలకు పైగానే గిట్టాయి నాకు.

సరే ఇక ఈ పూటకు గతి ఏమిటి? ఎప్పుడో నిన్న మధ్యాహ్నం అనగా భోజనం చేశాను...ఆయనెవరో లేబర్ ఇన్‌స్పెక్టరుగారు అయి

దారు రోజులుగా గ్రహశాంతికి పూజలు చేయించాడు. నిన్ననే పూర్ణాహుతి. వారికి గ్రహబలం చాలటం లేదనీ, అందువల్ల రావలసిన గొప్ప అవకాశాలు రావటం లేదనీ, ఆ పేరిశాస్త్రి ప్రేరేపించి వుంటాడు. వారి చేత నవ ధాన్యాలు, రొఖ్ఖమూ దానం చేయించాడు. నిన్న పదకొండు గంటల వేళకు వెళ్ళి వారి యింట్లో వరండాలో కూర్చున్నాను నేను. కార్యక్రమం అంతా అయ్యేసరికి దాదాపు రెండు గంటలయింది. ఈ పేరిశాస్త్రి దగ్గరవున్న లక్షణమే అది...ఇటువంటి వ్యవహారాలలో బాగా ఆలస్యం చేసి, క్షుణ్ణంగా సాంగోపాంగంగా కార్యక్రమం జరిపించినట్లు ఎదుటి వారికి అభిప్రాయం కలిగిస్తాడు. అమ్మో! పేరిశాస్త్రి అంటే సామాన్యుడా మరి...కోడిగుడ్డు చేతికి యిస్తే వెంట్రుకలు లాగగలిగిన

నాకు తలుచుకుంటే నవ్వు వచ్చింది. నిన్న నవధాన్యాలూ దానం పట్టేటప్పుడు గోధుమల దగ్గర గొడవ వచ్చిపడింది. గోధుమలు బజారులో దొరకడం లేదు కదూ, అందువల్ల పేరిశాస్త్రీ, నరసింహమూ "నేనంటే, నేన"ని పోటీపడ్డారు. నేను ఊరుకుంటే బాగుండిపోయేది. ఎన్నడూ పల్లెత్తి మాట్లాడని వాణ్ని, అదేమిటో, నిన్న కల్పించుకుని ఏదేదో వాగేశాను. పేరిశాస్త్రి మొహం చూడాలి అప్పుడు...గుడ్లు పెద్దవి చేసుకుని ఉరిమి చూస్తూ "నీకెందుకోయ్? నోరుమూసుకుని పడుండక.. అందరూ మాట్లాడేవాళ్ళే...పెద్దా చిన్నా ఏమీలేదు..."అంటూ సాగదీసుకున్నాడు. నాకు, చెప్పొద్దూ, భయం వేసింది కూడా. తర్వాత నా వంతు వచ్చింది. నేను శని దానమూ, మృత్యుంజయ దానమూ గ్రహించవలసి వచ్చింది. ఆ విషయంలో నాకు పోటీ అన్నది లేదు. ఇప్పుడే కాదు. ఏడెనిమిది సంవత్సరాలనుంచీ ఈ చిన్న బస్తీలో ఈ దానాలు పట్టేందుకు నేను తప్ప మరెవరూ లేరు. రాగానే పై పంచె దులిపి భుజాన వేసుకుని వెళ్ళి కూర్చున్నాను. ఆ దంపతులిద్దరూ నా కాళ్ళు కడిగి ముందు శని దానం యిచ్చారు. కాసిని బియ్యమూ, తిలలూ, రూపాయి బిళ్ళా... ఒక విస్తరిలో వుంచి దానం యిచ్చారు. నేనది గ్రహిస్తూ మనసులో "బాబూ, మీరు పిల్లా పాపలతో వర్ధిల్లాలి. మీకు సకల సంపదలూ సమకూరాలి.

శని మీకు అడ్డంరాడు. శని తాలూకు వక్రదృష్టి ఏమైనా వుంటే, ఇదిగో ఈ దానంతో నాకు సంక్రమిస్తుంది...దాన్ని నేను నెత్తిన వేసుకుంటాను" అనుకున్నాను. తర్వాత వెంటనే మృత్యుంజయ దానం యిచ్చారు. కాసిని బియ్యమూ యింత పత్తీ, నూనెలో ముంచి తీసిన ఒక ఇనుప మేకూ, రూపాయి నాణెం... నేను ఆ దానం గ్రహిస్తూ మళ్ళీ "రాసివ్వండి బాబూ! మీ కుటుంబంలో ఎవరికైనా అపమృత్యువు రాసిపెట్టి వుంటే, ఇదిగో, ఈ దానం ద్వారా దాన్ని నాకు సంక్రమింప జెయ్యండి. మీరు సుఖంగా వుంటారు...." అనుకున్నాను ఆ తర్వాత కాస్సేపటికి బియ్యం మూటగట్టుకుని ఓ పక్కని వరండాలో కూర్చున్నాను. పేరిశాస్త్రి అంత సేపూ నా వంక కోపంగా చూస్తూనే వున్నాడు. నా మాటలు మనసులో వుంచుకున్నట్టున్నాడు. లేకపోతే ఇవాళ ఈ చిటపట లేమిటి! అయినా నా నెత్తిన శని కూర్చుని అలా వాగించినట్టున్నాడు. పేరిశాస్త్రి విరోధం తెచ్చుకుంటే రోజులు గడవడం కష్టమే...

నేను ప్రక్క తిరిగి పడుకున్నాను. గుడి ముందుగా సినిమా బండి పోతున్నది. డప్పులూ, కేకలూ గందరగోళం...మళ్ళీ కాసేపట్లో అంతా సద్దు మణిగింది... యథాప్రకారం పిచ్చుకలు మాత్రం రొద చేస్తున్నాయి. ఎదురుగా మందుల కొట్లో ఒక ఆడమనిషి ఏవో మందులు కొంటున్నది. ఆమెను వెనుకనించీ చూసి గంగి అనుకొన్నాను. తీరా చూస్తే కాదు. నేను మళ్ళీ వెల్లకిలా పడుకుని గుండెల మీద చేతులుంచు కున్నాను. గంగి రూపం గుర్తుకు వచ్చింది. మనిషి కారునలుపు అయితే నేం? ఆ బిగువూ, పొంకమూ, నవ్వూ, మాటా, సామాన్యమైనవా? చూపులతో ఎదుటి వారిని మంత్రించగల జాణ ఎంత నేర్పరి కాకపోతే తేపికల్లు షాపు పేరుతో లోపల సారా వ్యాపారం సాగించ గలదు. నిన్న రాత్రి బాగా పొద్దు పోయిన తరవాత నేను వెళ్ళి బియ్యం మూటా, రెండు రూపాయి బిళ్ళలూ అందించగానే నవ్వి "ఏం బాపనయ్యా! ఎందుకిట్టా నీ కష్టార్జితం తెచ్చి పోస్తావు. నేను నీకేం యివ్వగలను చెప్పు... నువ్వా ఎందుకూ తెగించలేనోడివి. ఒక గ్లాసుడు మందు రుచి సూడవయ్యా అంటే ఆలోచనలో పడతావు. పోనీ నేను వొండి పెడతాను సక్కగా

తినవయ్యా అంటే పారిపోతావు..." అంటూనే బియ్యం మూట అందుకుని అవతల వుంచి రూపాయి బిళ్ళలను రెంటినీ బొడ్లో దోపుకుని వొళ్ళు విరుచుకున్నది. ఆ విరుచుకోవటంలో పైట పూర్తిగా జారిపోవటంతో నాలో నెత్తురు మరిగినట్టయింది. నాకు చిన్నప్పుడు పాఠశాలలో మను చరిత్ర పాఠం చెప్పారు. అందులో నాకు "ప్రాంచద్భూషణ బాహుమూల రుచితో పాలిండ్లు పొంగార..." అనేది తప్ప మరో అక్షరం కూడా గుర్తు లేదు. గంగి వొళ్లు విరుచుకున్నప్పుడు అకస్మాత్తుగా ఆ పాదం గుర్తుకొచ్చింది. అంతలోనే ఏమీ మాట్లాడకుండా తల వంచుకుని వచ్చేశాను.

అదంతా సరేనయ్యా, ఇప్పుడెలా? పొద్దెక్కింది. ఇంతవరకూ గిరాకీ తగల్లేదు. ఈ వరస జూస్తే ఇవాళ పస్తుండక తప్పేట్టులేదు. అందుకే పెద్దలు 'దాచుకో, దాచుకో' అని గోలపెడుతూ వుంటారు. కాని నా సంపాదన నిలిచేది కాదే... ఈ భూ ప్రపంచంలో శనిదానాలు పట్టి, మృత్యుంజయ దానాలు పట్టి పీనుగులను మోసీ పైసా అయినా వెనక వేసిన వాడెవడైనా వున్నాడా? లెక్కకు ఒక్కడు కూడా వుండడు కావాలిస్తే పందెం కడతాను. ఆ డబ్బే అటువంటిది. కనబడీ కనపడదు. అంతలోనే ఎటో ఎగిరి పోతుంది. మళ్ళీ నేనూ నా అవతారమూ తయారు.

గడ్డంకింద చేయి ఆనించుకొని ఎదురుగా చూస్తూ పడుకున్నాను. ఏడెనిమిదేళ్ళకిందట నే నెలా ఉండేవాడినో గుర్తుచేసుకుందామని ఎన్నో సార్లు ప్రయత్నించాను. అప్పుడు నావొంటిరంగు చామనచాయ అని బాగా గుర్తు. కళ్ళల్లో ఒక చక్కని వెలుగు వుండేది. మనసులో హుషారు వుండేది. ఇప్పటిలా కళ్ళక్రింద నల్లని మచ్చలు లేవు అప్పుడు. కళ్ళలో వెలుగు సరేసరి... ఈ దానాలు గ్రహించటం ప్రారంభించిన మొదటి సంవత్సరంలోనే అంతరించిపోయింది. ఇప్పుడు ఒంటిరంగు నలుపుకూడా కాదు. అదొక చిత్రమైన రంగు, అప్పుడప్పుడు నావంక నేను చూచుకొని ఆశ్చర్యపోతూవుంటాను. పచ్చని కట్టెను బాగా కాలిస్తే వచ్చేరంగు అది...

ఈ పేరిశాస్త్రి తరహా నాకు అంతుబట్టటం లేదు. నామీద బాగా

కోపగించుకున్నట్టున్నాడు. అలా కసురుతూ ఇంతకు ముందెన్నడూ మాట్లాడలేదు. అయినా నాది పొరపాటే... గోధుమలు నరసింహం తీసుకున్నా, పేరిశాస్త్రి తీసుకున్నా నిజానికి నాకు ఒకటే. నోట్లో శనిదేవత వేంచేసివుండి నాచేత అలా మాట్లాడించినట్లున్నది. లేకపోతే ఎన్నడూ ఏవిషయంలోనూ కలుగచేసుకోని వాణ్ణి నిన్న ఎందుకు అలా వాగినట్లు? ఇంతకు ముందు ఎన్ని చిత్రాలు చూడలేదుగనక? చీకటిమాటున ఆ రామమూర్తి తలగుడ్డ చుటుకుని 'టుగా నడిచివెళ్ళి తీపికల్లు షాపులో పక్కగా నిలబడి రా తాగిన సంగతి నాకు తెలీదూ? ఆ విశ్వనాథం మామూల సందులో గంగి చెయ్యిపట్టుకుని సరసాలాడుతుండగా చూడలేదూనేను. అంతెందుకు? ఆ పేరిశాస్త్రి అప్పుడప్పుడు తెల్లవారుఝామున ఇడ్లీలు తెప్పించుకుని తింటాడన్న విషయం నాకు తెలియనిదా? ఆ వెంకటేశం మాటిమాటికీ చాటుకుపోయి బీడీ దమ్ములు కొట్టటం నేనెన్నిసార్లు చూడలేదు?... ఇవన్నీ నిజానికి నాకెందుకు? నిజంగానే శని నాచేత అలా వాగించాడు. అట్లా మాట్లాడివుండ వలసింది కాదు.

అయిందా, ఈ పూట భోజనం సంగతి ఏమిటి? ఈ పిచ్చుకలు ఎక్కడినుంచో వడ్ల గింజలు తెచ్చుకుని తింటున్నాయి. నేను కళ్లార్పకుండా అటే చూస్తూ పడుకున్నాను. పెద్దపిచ్చుక ఉండి ఉండి ఎగిరివెళ్ళి ఒక్కొక్క గింజనే నోట కరుచుకు వస్తున్నది. చిన్న పిచ్చుకలు బుల్లి బుల్లి నోళ్ళు తెరిచి అందుకుంటున్నాయి. గోడమీద పెద్దబల్లి నిశ్చలంగా వుంది. తన పరిసరాల్లోకి ఏచిన్న కీటకం వచ్చినా అది దొంగలా కదిలి, మెరుపులా మీదపడి గుటుక్కున మింగుతుంది.

చురుకైన ఎండ నా కాళ్ళమీద పడుతున్నది. నేను చటుక్కున కళ్లు మూసుకున్నాను. అయినా ఆ ఎండలోని వేడిమి, చురుకూ తెలుస్తూనే వున్నాయి. మళ్ళీ కళ్లు తెరిచి పక్కనే ఎవరో పోతూంటే టైము అడిగి తెలుసుకున్నాను. పదకొండు గంటలు దాటింది. నాకు కళ్ళు మూతలు పడుతున్నాయి. నిద్ర వస్తున్నది. అదీ మంచిదే, రేపు తెలవారే వరకూ ఇలా మెలకువరాని నిద్రపడితే బాగుండిపోను. రేపు ఒక ఆఫీసరు గారి ఇంట్లో పూర్ణాహుతి వుంది. శేరుకు తక్కువ కాకుండా బియ్యమూ,

రెండు రూపాయ బిళ్ళలూ, భోజనమూ... అంతవరకూ పస్తు తప్పేట్లు లేదు. అయినా యిది మనకు లెక్కా? ఇంతకు ముందు ఎన్నిసార్లు పస్తుండలేదు కనుక ?

మెలకువ వచ్చేసరికి పొద్దుగూకు తున్నది; నేను చివాలున లేచి కూర్చున్నాను. ఆవులింత వచ్చింది. ఆవులించి చిటికెవేసి లేచి పై పంచె తీసి దులిపి భుజాన వేసుకుని గుడిమెట్లు దిగి వీధిలోకి వచ్చాను.

చల్లగాలి మళ్ళింది. సముద్రం మీదినుంచి ఆ గాలి హాయిగా వీస్తున్నది. సూర్యుడు అస్తమిస్తున్నాడు. నేనదిచూసి "అయ్యా! మళ్ళీ త్వరగా ఉదయించండి మహానుభావా!" అనుకున్నాను.

తర్వాత నెమ్మదిగా నడిచి కాలువకు వెళ్ళాను. నీళ్ళలోకి రెండు అడుగులువేసి కదలకుండా నిలబడి ఆకాశంవంకచూశాను. అస్తమిస్తున్న సూర్యుడి కాంతులు ప్రసరించి నీటి ఉపరితలం ఎర్రని కాయితంలా కని పిస్తున్నది. కాలువ ఒడ్డున చెట్టుకొమ్మలలో పక్షులు కాకిగోలచేస్తున్నాయి. నా చుట్టూ నీళ్ళు కుదుటబడగానే నేను వంగి నా ప్రతిబింబం చూసు కున్నాను. గడ్డం బాగా పెరిగివుంది. అంతే చూశాను. తర్వాత నా ప్రతి బింబం వంక నిశ్చలంగా చూసేందుకు భయపడి నీళ్ళను కలచివేస్తూ మరి కొంచెం లోతుకు వెళ్ళాను. చల్లని నీళ్ళు తగలగానే శరీరానికి హాయి అనిపించింది. చీకటి పడేవరకూ స్నానం చేశాను.

తర్వాత పైపంచెతో ఒళ్ళంతా తుడుచుకుని కాలువగట్టునే చాలా సేపు కూర్చున్నాను. నేను లేచి నడకసాగించే సమయానికి బాగా పొద్దు పోయినట్టున్నది. ఎక్కడా ఏ అలికిడీలేదు.

నేను నెమ్మదిగా నడిచివస్తూ తీపికల్లు దుకాణం దగ్గర కాళ్ళకు బందాలు వేసినట్టు ఆగిపోయాను. గంగి వాకిట్లో నిలబడివుంది. ఉండి ఉండి ఒళ్లు విరుచుకుంటున్నది. నన్ను చూసి గుర్తుపట్టి చప్పట్లు చరిచి "బాపనయ్యా. ఒక్కసారిలా వచ్చిపోవయ్యా!" అన్నది. నేను అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళాను. హరికేన్ లాంతరు కాంతిలో గంగిని చూశాను. ఆమె పలుచని తెల్లని చీరె కట్టుకునివుంది. తెల్లని జాకెట్టు

తొడుక్కొని వుంది. పలుచని జాకెట్టులోనుంచి లోపలి బాడీ కనిపిస్తు న్నది. నవ్వినప్పుడల్లా ఆమె తెల్లని పళ్ళు కనిపిస్తున్నాయి.

ఆమె నవ్వుతూ "ఏం దొరా? స్నానంచేసి పోతుండావా యేంది? మొగం సూస్తే ఇయ్యాళ తిండి తిన్నట్టులేదే...నా వంట అయింది. పెడ తాను తింటావా ?" అని అడిగింది.

నేను లోపలికి అడుగువేసి తల అడ్డంగా వూపి "ఊహూఁ! తినను ...నువ్వు తిను...నేను "మమ" అనుకుంటూ కూర్చుంటాను..." అన్నాను.

గంగి "ఏటో...నువ్వు మాట్టాడేది నా బుర్ర కెక్కదు...పోనీ కాస్సేపు కూసో...ప్యాసంజర్లు బాగా పొద్దూకితే గాని రారులే..." అంటూ తాను వెళ్ళి పింగాణి కంచం తెచ్చుకుని .వడ్డించుకుని తిండం ప్రారం భించింది. నేను ఉండి ఉండి అటువైపు చూస్తున్నాను. ఆమె ఏం తింటున్నదో ?

ఉన్నట్టుండి గంగి నవ్వి "ఇన్నిసార్లు నాకు బియ్యం తెచ్చి యిచ్చావు. నాకాడ ఏమి తీసుకోలేదు. గళాసు తాకలేదు ? పొరపాటున నా చెయ్యి తగిలితే తేలుకుట్టినట్టు పారిపోయావు. ఇయ్యాళ నా మాట ఇను...ఆకలిమీదున్నావు నాకు తెలుసు ..ఈడ ఎవరూ లేరు ...ఒక్క ముద్ద తిను...చేపలకూర తినొద్దులే పోనీ...వొట్టి ఉల్లిపాయ పచ్చడి... మా రుచిగా వుందిలే" అన్నది.

నేను ఉలికిపడి లేచి యివతలికి వచ్చేశాను. వెనక నుంచి ఆమె గలగల నవ్వడం చాలా దూరం వినిపించింది.

మరునాడు ఆ ఆఫీసరుగారి యింటికి వెళ్ళాను. అది పెద్ద మేడ, వరండాలో జనాభా అంతా వున్నారు లోపల పూర్ణాహుతి జరుగుతున్నది. పేరశాస్త్రి చదువుతున్న మంత్రాలు పెద్దగా వినబడుతున్నాయి. గృహ యజమాని పెద్ద గిన్నెలోని నెయ్యిలో ఆకు ముంచి "స్వాహా" అన్నప్పు డల్లా హోమగుండంలో పోస్తున్నాడు.

నన్ను అక్కడ ఎవరూ పలుకరించలేదు. వరండాలో ఒక

పక్కగా స్తంభాన్ని ఆనుకుని కూర్చున్నాను. విశ్వనాథం జంజెంతో వీపు గోక్కుంటూ కూర్చుని వున్నాడు. నరసింహం గుమ్మంలో కూర్చుని పేరిశాస్త్రితో గొంతు కలుపుతున్నాడు. రామమూర్తి వగైరాలందరూ గోడ కానుకుని నిమ్మకు నీరెత్తినట్టు ప్రశాంతంగా కూర్చుని వున్నారు.

నా చూపులు వారి ప్రక్కనే కూర్చుని వున్న వ్యక్తి మీద పడ్డాయి. అతనికి పాతిక ఏళ్లుంటాయి. నల్లగా వున్నాడు. గడ్డం మాసి వుంది. నీరుకావి పంచె కట్టుకుని వున్నాడు. కళ్లు మూసుకుని కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు.

నాకు ఏదో అనుమానం కలిగింది. అయినా దాన్ని గురించి ఎక్కువ ఆలోచించక పైకప్పు వంక చూస్తూ కూర్చున్నాను.

చాలాసేపు గడిచింది. పూర్ణాహుతి తంతు పూర్తి అయింది. వరసగా దానాలు ప్రారంభమైనాయి. విశ్వనాథం నరసింహం, రామమూర్తి, తదితరులు వెళ్ళి దానాలు గ్రహించి తెచ్చుకుని మూటలు కట్టుకుని కూర్చున్నారు.

నేను అనుకున్నంతా అయింది. పేరిశాస్త్రి "రామేశం...తొందరగా రా " అని కేకవేశాడు. ఆ కొత్త వ్యక్తి చివాలున లేచి లోపలికి వెళ్ళాడు. నేనూ లేచి వెళ్ళి చూశాను. అతడు పళ్ళెంలో కాళ్ళు వుంచి కూర్చున్నాడు, పాద ప్రక్షాళన జరగబోతున్నది.

నేను పెద్దగా "పేరిశాస్త్రిగారూ! ఇది మీకు న్యాయం కాదు, నాకు మీరు మొన్ననే చెప్పారు......"అన్నాను.

పేరిశాస్త్రి నా వంక కళ్ళు పెద్దవి చేసుకుని "న్యాయాన్యాయాలు నువ్వే చెప్పాలి నాకు...రేపటి నుంచి ట్యూషన్ ఇద్దువుగానిలే...ఇప్పుడు బయటికి నడు ముందు..." అన్నాడు.

నేను తెల్లబోయి తమాయించుకుని ఆ ఆఫీసరు గారితో "చూడండి బాబూ! నాకు ఈ పెద్దమనిషి మొన్ననే చెప్పాడు...ఇవాళేమో ఎవరో కొత్త వాణ్ని తీసుకువచ్చి దానం యిప్పిస్తున్నాడు. తమరే విచారించండి" అన్నాను.

ఆయన చిరాకుగా పేరిశాస్త్రి వంక చూసి "ఏమిటండీ యిది?" అని అడిగాడు. పేరిశాస్త్రి ఆ ప్రశ్నకు బదులు చెప్పకుండా "కానివ్వండమ్మా! ముందు మీరు పాద ప్రక్షాళన కానివ్వండి...అవతల ఆలస్యమవుతున్నది..." అంటూ తొందర పెట్టాడు. ఇక ఆఫీసరుగారు ఏమీ మాట్లాడలేక పోయాడు. భార్య నీళ్ల పోయిగా అతని కాళ్లు కడిగి నీళ్ల నెత్తిన చల్లుకుని యథా విధిగా దానం యిచ్చారు. నేనలా నిస్సహాయంగా నిలబడి చూస్తూ ఉండిపోయాను. బియ్యమూ, కాసిని తిలలూ...రూపాయి నాణెం ..అయిపోయింది...తర్వాత మృత్యుంజయ దానం కూడా అతనికే యిప్పించాడు పేరిశాస్త్రి. నాకు కడుపు మండిపోయింది. "ఇంత అన్యాయం చేస్తావా? నేను నీకేం ద్రోహం చేశాను!" అంటూ కేకలు పెట్టాను. కాని, ఏమీ లాభం లేకపోయింది. బియ్యమూ, పత్తి, ఇనుప మేకు, రూపాయి నాణెం. యథావిధిగా మృత్యుంజయ దానం కూడా అయిపోయింది.

"సరె, అయిందేదో అయింది...ఇక ఈ పూట కనీసం భోజనం పెట్టినా చాలు..." అనుకుంటూ స్తంభాన్ని ఆనుకుని కూర్చున్నాను. తర్వాత బియ్యం మూటగట్టుకుంటున్న ఆ కొత్త వ్యక్తి వంకనే చూశాను. నా కళ్ళలో ఈర్ష్య, అసూయ, ద్వేషం, అన్నీ అతనికి కనిపించి ఉంటాలి. అందుకే ఒకసారి తప్ప మళ్ళీ అతడు నా వంక కన్నెత్తి అయినా చూడలేదు.

నేను మనసులో "వీడెక్కడ దాపురించాడు రా బాబూ! ఈ క్షుద్ర దానాలు పట్టడం ఖర్మ ఏమిటి వీడికి? కొంచెం చదువుకున్న వాడిలా వున్నాడు కూడా" అనుకున్నాను.

అంతలోనే పేరిశాస్త్రి వరండాలోకి వచ్చి "నువ్వింకా ఇక్కడ ఎందుకు కూర్చున్నావు? పొమ్మంటే అర్థం కాదూ? శనిలా మొహం నువ్వూనూ...ఛో ఛో..." అన్నాడు పెద్దగా.

నేను బాగా తగ్గిపోయి "పోనీ ఈ పూటకు భోజనం..." అంటున్నాను.

అతడంతలోనే తారాజువ్వలా లేచి "అదేమీ కుదరదు. ముందిక్కణ్ణుంచి ఫో నువ్వు" అని అరిచాడు.

"నేనంతటి ద్రోహం ఏం చేశాననీ!"

"అస్సలు మాట్లాడకు. నాకు మళ్ళీ కనిపించకు."

నేను ఆ ఆఫీసరుగారి వంక దీనంగా చూశాను. పేరిశాస్త్రి అది అర్థం చేసుకుని "అయ్యా! మీరు నా మాట వినాలి. మీకు అనుభవం చాలదు. ఇటువంటి వాళ్ళను రానిస్తే ఇక మీరు నెగ్గలేరు. ఈగల్లా ముసురుతారు. ప్రాణాలు తోడేస్తారు." అంటూ ఆయనను కంగారు పెట్టేశాడు. ఆయన ఏమీ మాటాడలేక కాబోలు లోపలికి వెళ్ళిపోయాడు.

నేను పై పంచె దులిపి భుజాన వేసుకుని "సరే .. ఈ ఉసురు ఊరికే పోదులే. పేరిశాస్త్రీ, ఒక బ్రాహ్మడి కడుపుమీద కొడితే ఊరికే పోతుందనుకుంటున్నావేమో! ఈ పాపం కట్టి కుడుపుతుంది. పిల్లాపాపా కలవాడివి చూసుకో" అంటూ నోటికి వచ్చినట్లల్లా తిడుతూ మెట్లు దిగాను. పేరిశాస్త్రి వెనకనుంచి పెద్దగా "నీ బ్రాహ్మణ్యం మండినట్లే వుంది. రాత్రిపూట కల్లు పాకలలో దూరేవాడివి...నువ్వా ఒక మనిషినని మాట్లాడుతున్నావే ఫో ఫో..." అన్నాడు.

నేను పెనంలా కాలుతున్న రోడ్డుమీద నడక సాగించాను. సూర్యుడు నడిమింట నిప్పులు చెరుగుతున్నాడు. గాలి లేదు. కడుపులో ఆకలి కూడా నిప్పులు చెరుగుతున్నది. వీధి మలుపు తిరుగుతూ వుండగా కాలిలో ఏదో కస్సున గుచ్చుకున్నది. బాధతో మెలికలు తిరిగిపోతూ ఒక చేత్తో గోడ పట్టుకుని రెండో చేత్తో కాలిలో గుచ్చుకున్న వస్తువును లాగాను. పాత మేకు...బాగా తుప్పపట్టి ఉన్నది. మేకుతో పాటుగా రక్తం బుస్సున పొంగి వచ్చింది. ఆ మేకును చేత్తో పట్టుకుని అలాగే కుంటుతూ నడిచి గుడి అరుగు మీద కూలబడి మళ్ళీ ఆ మేకు వంక చూశాను. ఇన్నాళ్లుగా నేను పట్టిన క్షుద్ర దానాలలో వచ్చిన లెక్కలేనన్ని ఇనుప మేకులు కళ్ళ ముందు గిర్రున జల్లెడలా పరిభ్రమించడం ప్రారంభించాయి.

సాయంకాలం నిద్ర లేచేసరికి వొళ్ళంతా నొప్పులుగా ఉంది. లేచి మెట్లు దిగి ఒక్క క్షణం నిలబడ్డాను. జ్వరం తగులుతుందేమోనని భయం వేసింది. నా కెన్నడూ ఇటీవల జ్వరం రాలేదు. జ్వరం అంటే నాకు భయం కూడా.

నేను రైలుగేటు దగ్గర ఒక బోర్డు చూశానెప్పుడో, ఏవేవో లేహ్యాం పేర్లు గోడ నిండా వ్రాసి వుంటాయి. ఒక ముసలాయన కుర్చీలో నిశ్చలంగా కూర్చుని వుంటాడెప్పుడూ.

నేను నెమ్మదిగా నడిచి అక్కడికి వెళ్ళాను. దోవ పొడుగునా మాటి మాటికి వొళ్లు విరుచుకోవాలనిపించడం చిత్రంగా వుంది.

గుమ్మంలో నిలబడి లోపలికి చూశాను. బల్ల వెనక కుర్చీలో బొమ్మలా కదలకుండా కూర్చుని వున్నాడా ముసలాయన. నన్ను చూచి కూడా కదలలేదు, నేనే లోపలికి వెళ్ళాను. అక్కడ యింక ఎవరూ లేరు. నేను వెళ్లి నిలబడగానే ఆయన నా వంక కళ్లు పెద్దవి చేసుకుని చూశాడు. ఆయన లావుపాటి కళ్ళద్దాలను దారంతో చెవులకు కట్టుకుని వున్నాడు.

నే నాయనకు నమస్కారం చేసి "అయ్యా డాక్టరుగారూ! ఈ కాలిలో మేకు గుచ్చుకున్నది. తుప్పుపట్టిన మేకు..." అన్నాను.

ఆయన కొద్దిగా కదిలాడు. తర్వాత ఉన్నట్టుండి ఆశ్చర్య పోయాడు. నెమ్మదిగా "మేకు గుచ్చుకుందా? పైగా తుప్పుపట్టిన మేకా? అబ్బో చాలా ప్రమాదమేనే..." అంటూ మళ్లీ మళ్లీ ఆశ్చర్యం ప్రకటించాడు. తర్వాత లోపలికి చూస్తూ పెద్దగా "అమ్మాయ్! కాసిని వేణీళ్లు పట్టుకురా అమ్మా!" అని కేకవేశాడు. తర్వాత నా వంక తిరిగి ఏదో మందు పొట్లం విప్పుతూ మళ్ళీ "అబ్బో! తుప్పుపట్టిన మేకు గుచ్చుకుంటే గొప్ప ప్రమాదమే...ముందు కాలు వాచి జ్వరం వస్తుంది. సెప్టిక్ అవుతుంది. తర్వాత కాలు తీసివేయవలసి వస్తుంది. ఆలస్యం చేస్తే మనిషి గూడా...ఉష్..." అంటూ చిలక ఎగిరిపోవటం అభినయించాడు.

లోపలినుంచి వేణీళ్లు తెచ్చిందొక పిల్ల. ఆయన ఆ గాసు అందు

కుని తాను విప్పిన పొట్లం మందు నోట్లో వేసుకుని నీళ్ళు తాగి మూతి తుడుచుకున్నాడు. ఆ మందూ, వేడినీళ్ళూ నా కోసమే ననుకున్న నేను దిగాలుపడి పోయాను. ఆయన కొద్ది క్షణాలు కళ్ళు మూసుకుని తర్వాత నన్ను చూసి ఆశ్చర్యంతో "మీరింకా యిక్కడే వున్నారా? పాత మేకు గుచ్చుకుంటే ప్రమాదం. సెప్టిక్ అవుతుందని చెప్పానుగా? ముందు ఫెళ ఫెళా జ్వరం వస్తుంది. తర్వాత కాలు వాచి..." ఆయన యింకా ఏం చెప్పబోయే వాడో గాని హఠాత్తుగా లోపలి నుంచి ఒక యువతి వచ్చి ఆ ముసలాయనతో "నువ్వూరుకో తాతయ్యా! అసలక్కడ ఎందుకు కూర్చున్నావు నువ్వు?... ఏమండీ, మా నాన్నగారు వూళ్ళో లేరు. మళ్లీ రండి, ఈయన కేమీ తెలియదు" అని చెప్పింది.

'రక్షించావు మా తల్లీ! నాలుగు కాలాలపాటు పచ్చగా వర్ధిల్లు' అనుకుంటూ యివతలికి వచ్చాను.

గుడి ముందు అరుగుమీద కూర్చున్నాను చాలా సేపు. వీధిలో రద్దీ ఎక్కువగా వుంది. ఆ రద్దీలోనే నేను అ వ్యక్తిని గుర్తుపట్ట గలిగాను. ఒక్క ఉదుటున లేచి వెళ్లి అతని భుజం పట్టుకుని ఆపాను. అతడు నివ్వెరపోయి చూశాడు.

నేను కన్నార్పకుండా కొద్ది క్షణాలు అతని వంక చూసి "నీ పేరేమిటి?" అని అడిగాను.

"రామేశం..." అన్నాడతడు.

నేను అతని కన్నులలోకి సూటిగా చూస్తూ ప్రారంభించాను. "బాబూ! నువ్వు చిన్నవాడివి. నీకు ఈ మతలబులు బొత్తిగా తెలియవు. పేరిశాస్త్రి నిన్ను అన్యాయంగా ఇందులోకి దింపాడు. చూస్తూ చూస్తూ తెలిసి తెలిసి హాయిగా బ్రతక దలుచుకున్న వాడెవడూ ఈ దానాలు గ్రహించడు. ఇది సామాన్య మనుకుంటున్నావేమో? నా వంక చూడు. ఏడెనిమిదేళ్ళ క్రిందట నేను నీకంటే బాగుండేవాణ్ణి. ఇప్పుడు చూడు ఎలా అయిపోయానో! ఇది ఎంత పాప కార్యమో చెప్పలేను. ఇది మనలను తినేస్తుంది. శని మృత్యువు నెత్తి నెక్కి కూర్చుంటాయి.

క్షుద్రమైన బుద్ధులన్నీ మొదలవుతాయి. జూదం, తాగుడూ, వ్యభిచారం ...అన్ని వ్యసనాలూ తగులుకుంటాయి...కళ్ళలో కాంతి..."

ఇబ్బందిగా విని ఉన్నట్టుండి కదిలి పోబోయాడు. నేనతన్ని వదలలేదు. "కళ్ళలో కాంతి నశించి గాజు బిళ్ళల్లా తయారవుతాయి. నీ మీద నీకు అదుపు ఉండదు. శని నడిపించినట్లు నడుస్తావు. ఏమి మాట్లాడుతావో ఏమి చేస్తావో నీకే తెలియదు. అన్ని విధాలా పతనమై పోతావు. అయిన వాళ్ళందరూ కాకుండా పోతారు...ఈ క్షుద్ర దానాలంటే ఏమనుకున్నావో..."

"నేను ప్రతి పూటా గాయత్రీ చేస్తాను" అన్నాడతడు నెమ్మదిగా.

నేను పెద్దగా "శని, మృత్యువూ అంటే అల్లాటప్పా అనుకున్నావేమో! వాటి ముందు నీ గాయత్రి బలాదూర్. పైగా నువ్వు ఇవాళ నా నోటి దగ్గర తిండి పడగొట్టుకు పోయావు. ఆ పాపంలో నీకూ భాగముంది. నాకు రెండు రోజులనుండి తిండి లేదు." అని అరిచాను.

ఒక్క క్షణం తర్వాత "నీకు కావలసిన వారెవరైనా ఉన్నారా?" అని అడిగాను.

"ఒక తమ్ముడున్నాడు. చదువుకుంటున్నాడు. వాడికి ప్రతి నెలా డబ్బు పంపాలి."

"ఈ డబ్బు పంపుతావా? వాడిక చదివినట్టే. బతికి బట్టకట్టినట్టే."

అతని కళ్లు ఎర్రబడ్డాయి. పెదవులు వణికాయి. "మా తమ్ముణ్ణేమీ అనొద్దు" అన్నాడు.

నేనింకా పెద్దగా "అంటాను. ఇంకా అంటాను. నా నోటి దగ్గర తిండి పడగొట్టుకు పోయావు. ఆ పాపం...నిన్ను వొదలదు. ఈ దానాలు గ్రహించి తమ్ముణ్ణి చదివిద్దామనుకుంటున్నావా? చిట్టితండ్రీ! నీ తమ్ముడు కూడా నీలాగే కట్టెలా నిర్జీవంగా తయారై పాడుబుద్ధులు పుట్టి ఎందుకూ పనికిరాకుండా పోతాడు చూసుకో. నా సంగతంటావా? నాకీ ప్రపంచంలో ఎవరూ లేరు. ఇటువంటి దానాలు పట్టేవాళ్ళకు "నా" అనుకునేందుకెవరూ మిగలరు. జాగ్రత్త." అన్నాను.

అతడు నన్ను మింగేసేలా చూశాడు కోపంతో. నిలువెల్లా కంపించిపోతూ పెదవులు కొరుక్కున్నాడు. తర్వాత నిస్సహాయంగా కదలి నెమ్మదిగా అడుగులువేస్తూ వెళ్ళిపోయాడు. నేను విజయగర్వంతో యింకా పెద్దగా "సాటి బ్రాహ్మణ్ణి వుసురు పెట్టావు. అది వూరికేపోదు సుమా! నీకూ, నీ తమ్ముడికీ, నిన్ను యిక్కడికి నాకు పోటీగా తెచ్చి దించిన ఆ పేరిశాస్త్రికి తగలక మానదు." అంటూ కేకలు పెట్టాను. అతడు మాటి మాటికి వెనుదిరిగి చూస్తూ వెళ్ళిపోయాడు.

నేను మళ్ళీ గుడి అరుగుమీద కాలిమీద కాలువేసుకుని దర్జాగా కూర్చున్నాను. మొదట్లో అతనితో అలా మాట్లాడ గలిగినందుకు నాకు గర్వం కలిగింది. మరి కొద్దిసేపటి తర్వాత అంత నిర్దాక్షిణ్యంగా మాట్లాడి తప్పు చేశానేమో అనిపించింది. కాని అంతలోనే "నాకివాళ తిండిలేకుండా పోలేదూ?" అనుకుని సర్దుకున్నాను. పొద్దుపోయిన తర్వాత అక్కడే మామూలు చోటనే నడుంవాల్చాను. అంతలోనే వొళ్లు నొప్పు లనిపించింది. కండరాలన్నీ పిండేస్తున్నట్టు బాధ. పైగా తలనొప్పి... కాలిలో మేకు గుచ్చుకున్న చోట విపరీతమైన మంట. నేను అలాగే మూలుగుతూ కళ్ళు మూసుకున్నాను. అకస్మాత్తుగా భయంకరమైన చలి ప్రారంభమయింది. వందలూ, వేలూ ఇనుపమేకులు జల్లెడలా భయంక రంగా నా తలచుట్టూ తిరుగుతున్నట్టు అనిపించింది.

* * *

ఆ జ్వరం అలా మూడు రోజులపాటు ఉధృతంగా వచ్చింది. మధ్యమధ్య కొద్దిగా స్పృహ వచ్చినప్పుడు నా పక్కన నిలబడిన మనిషి, నా మీద పరుచుకుంటున్న దుప్పటీ, నా నోటిలో ఎవరో ఔషధం పోయడం, ఎవరో జబ్బమీద సూదిమందు పొడవడం... ఇవన్నీ నాకు కొంచెంగా తెలుసు. ఈ మూడు రోజులుగా ఆ మనిషిని నేను స్పష్టంగా గుర్తుపట్టలేదు.

ఆ పూట జ్వరం దిగజారగానే నేను కళ్ళుతెరచి చూశాను. గుడి కానే పక్కన చిన్న పాక అది. అందులో, ఈత ఆకుల చాపమీద

పడుకుని వున్నాను నేను. తలక్రింద దిండు...ప్రక్కనే మందుసీసాలు రెండు...కాలికి కట్టు...వాకిట్లో ఎవరిదో నీడ...

నేను మూలుగుతూ లేవడానికి ప్రయత్నించాను. అంతలో వాకిట్లో అంతవరకూ కూర్చునివున్న ఆ వ్యక్తి "ఏం కావాలి మీకు ? లేవకండి" అంటూ లోపలికి వచ్చాడు.

రామేశం! నేను మళ్ళీపడుకుని కళ్ళుమూసుకున్నాను. అతడు నా పక్కగావచ్చి కూర్చుని నుదుటిమీద చేయివుంచి "అమ్మయ్య! మీకు చెమటలు పట్టడం చూస్తే ఇహ జ్వరం తగ్గినట్టే అనిపిస్తున్నది...ఈ మూడు రోజులూ ఏం గాబరా పెట్టారండీ బాబూ! డాక్టరు ఇంజక్షన్ ఇవ్వడం కూడా తెలీదు మీకు..." అన్నాడు.

నా కళ్ళవెంట నీరు కారడం ప్రారంభించింది. మూసిన కను రెప్పల సందుల్లోంచి అవిరళంగా నీళ్ళు ఉబికి వచ్చాయి. 'నాయనా! నిన్నేనా నేను నడి బజారులో నిలబెట్టి అసహ్యంగా మాట్లాడి అవమానం చేశాను?'

కళ్ళు తెరచి చూస్తే గ్లాసులో మందు వంచుతున్న అతడు ఒక యోగిలా కనిపించాడు. "ఆఖరి డోస్; ఇది తాగి మీరు పడుకోండి. నేను డాక్టరు దగ్గరకి వెళ్ళి చెప్పివస్తాను. అవసరమైతే మళ్ళీ మందు తెస్తాను." అంటూ మందు నోట్లో పోసి మళ్ళీ "మా తమ్ముడి దగ్గరినుంచి ఇవాళే జాబు వచ్చింది. బాగా చదువుకుంటున్నానని వ్రాశాడు. వాడి కోర్సు యిక ఒక్క సంవత్సరం...తర్వాత వాడొక పెద్ద ఆఫీసరవుతాడు. మొన్ననే వాడికి ముప్పయి రూపాయలు పంపాను. ఇదిగో రసీదు. వాడి సంతకం చూడండి...ఇంగ్లీషులో ఎంత బావుందో....అంటూ ఏదేదో మాట్లాడుతూనే అతడు వెళ్ళిపోయాడు.

చీకట్లు ప్రపంచాన్ని అజ్ఞానంలా ఆక్రమించుకుంటున్నాయి. గుడి ఆవరణలో ఏదో పక్షి ఆక్రందనం చేస్తున్నది. నాగుండె లెందుకో హఠాత్తుగా జలదరించాయి. నెమ్మదిగా ఓపిక చేసుకుని లేచి యివతలికి వచ్చి

అరుగుమీద కూర్చున్నాను. మళ్ళీ గుండెల్లో జలదరింపు... తీతు వొకటి "క్రీక్' మని చప్పుడు చేస్తూ ఎగిరి పోతున్నది.

చాలా సేపటి తర్వాత గుంపుగా కొందరు మనుషులు వచ్చారు. వాళ్ళు చెప్పింది వినగానే ఒక్కసారిగా ఎండుటాకులా కంపించి పోతూ లేచాను. గుండె గొంతుకలోకి వచ్చి దడదడ లాడినట్టయింది.

"ఎక్కడ ?"

"మెయిన్ రోడ్డు."

కాళ్ళు తడబడుతూ వుండగా తూలిపోతూ పరుగెత్తాను. తీరా అక్కడికి పోయేసరికి అంతా అయిపోయింది. రామేశం రోడ్డు కడ్డంగా రక్తపు ముద్దలా పడివున్నాడు. ఆ లారీ డ్రైవరు ఎంతటి రాక్షసుడో ఆగనైనా లేదు. జనం గుమిగూడుతున్నారు.

నేను అతని మీదికి వంగి నీళ్ళు నిండిన కళ్ళతో చూశాను. అతని చూపులు అతని కుడిచేతి గుప్పిటమీద ఉన్నాయి. ఆ చేతిలో వున్నది తమ్ముడి ఉత్తరం...నేను భోరున ఏడుస్తూ ఆ ఉత్తరం తీసుకున్నాను. మందమైన లైటు వెలుగులో అక్షరాలు కనిపించాయి. "నేను బాగా చదువుకొంటున్నాను. ఇంకా బాగా చదువుకుంటాను. మరొక్క సంవత్సరం...తర్వాత నిన్ను పూజించు కుంటానన్నయ్యా."

నేను కళ్ళు మూసుకున్నాను. "అవును తమ్ముడూ బాగాచదువుకో. నేనున్నాను నీకు" అనుకుని కళ్ళు తెరిచేసరికి పోలీసులు ప్రమాదం... వివరాలు సేకరిస్తూ హడావిడిగా కనుపించారు.

# గాం

సృష్టిలో ఉన్న గాలి నంతటినీ ఏ అదృశ్య శక్తి తన ఉక్కు పిడికిలిలో బంధించి వుంచిందో తెలీదు. రోజుల తరబడి రాళ్ళు పగిలే ఎండలు... వాటికి తోడు ఎక్కడా ఆకయినా కదలదు. ఆకాశంలో చిన్న మబ్బు తునక అయినా ఉండదు. సూర్యుడు ఉదయించడమే ప్రళయ భీకరంగా వికటాట్టహాసం చేస్తూ వేడిగా ఉదయిస్తాడు. అక్కడి నుండి ఆయన భయంకర పరిపాలన మొదలు... భూమి నంతటినీ సున్నితమైన మంటలలో చుట్టి బాధించి చివరకు విజయ గర్వంతో పడమటి కొండల్లో దిగి వెళ్ళిపోతాడు. అయినా, సూర్యుడి పరోక్షంలో కూడా గాలి ఉండదు. ఎప్పుడో రాత్రి బాగా ప్రొద్దుపోయిన తర్వాత గాలి కొద్దిగా కదులుతుంది. కాస్సేపు అటూ ఇటూ వీస్తుంది. మళ్ళీ ఉదయం వేళకు ఎలా మాయమవుతుందో తెలీదు. అంతలో మళ్ళీ సూర్యుడు హుంకరిస్తూ తూర్పు కొండలు ఎగబ్రాకి పైకి వచ్చేస్తాడు.

ఆ మేడ చాలా పాతది. నాలుగంతస్తులలోనూ దాదాపు ఇరవై కాపురాలున్నాయి. ఆ మేడ యజమాని ఇటీవలే చచ్చిపోయాడు. ఆయన ఆస్తి నంతటినీ ఎలా సంపాయించాడో అక్కడి జనం కథలుగా చెప్పు కుంటారు. ఆ కథల మాట ఎలావున్నా, డబ్బు సంపాయించడం, జాగ్రత్తగా కూడబెట్టడం, దాన్ని ఎక్కడ మదుపు పెట్టాలో అక్కడ మదుపు పెట్టడం– ఇటువంటి వ్యాపకాలతోనే ఆయన జీవితం ప్రతి క్షణం గడిపాడనేది సత్యం. మానవులన్న తర్వాత ఎవరికైనా కొన్ని యిబ్బందులు రాక తప్పవు. ఆయన చాలా జాగ్రత్తగా యిబ్బందిలో వున్నవాళ్ళను గమనించేవాడు. వారిచేత అడిగించుకునేవాడు. కొంచెం బెట్టు చూపేవాడు. రెండు మూడు సార్లు తిప్పించుకునేవాడు. ఇబ్బందిలో వున్న వ్యక్తికి దేశంలో డబ్బు అంతా ఎక్కడో మటుమాయం అయి

పోయిందనీ, డబ్బు కళ్ళబడటం గొప్ప విశేషమనీ అర్థమైన తర్వాత చాలా కష్టంమీద సర్దుతున్నట్టు అడిగిన దానిలో సగమో మూడో వంతో సర్దేవాడు. కావలసిన మేకు బిగుంపులన్నీ నిరాటంకంగా ఆయన చెప్పిన ప్రకారం జరిగిపోయేవి. నోట్లు వ్రాయించుకోవడం, తనఖాలు పెట్టించు కోడం అన్నీ మామూలే. తర్వాత కొంత కాలం గడిచేది. మనిషి యిబ్బందిలో పడటం ఎంత సామాన్య విషయమో, ఇబ్బందిలోపడ్డవాడు మళ్ళీ తేరుకోడం అంత అసామాన్యమైన విషయం. మళ్ళీ మళ్ళీ అతనికి డబ్బు అవసర మవుతుంది. ఆయన చాలా మంచిగా మళ్లీ అప్పు పెట్టే వాడు. ఏ పరిస్థితుల్లోనూ అవతలి వాడి తాహతుకు మించి డబ్బు యిచ్చే వాడు కాదు. క్రమంగా అవతలి వ్యక్తి జుట్టూ, మాన మర్యాదలూ, పరువు ప్రతిష్ఠలూ అన్నీ ఈయన చేతిలోకి వచ్చేవి. ఆయన సమయం చూసి ఒకానొక నాడు "నా డబ్బేది?" అని అడిగేవాడు. ఇక అంతా మామూలే... అవతలి వ్యక్తి ఇవ్వలేక పోవడం, మరికాస్త వ్యవధి కావాలని ప్రాధేయపడటం, అన్నీ జరిగేవి. ఆయన ససేమిరా వీల్లేదనే వాడు. తాను ఎంతగా ఆర్థిక బాధల్లో వున్నాడో వివరించేవాడు. అప్పటి కప్పుడు అప్పు తీర్చడం తప్పదని బోధపడేట్టు మాట్లాడేవాడు. చివరకు చాలా సహృదయంతో, సానుభూతితో ఒక సదుపాయం సూచించేవాడు. "ఈ అప్పులూ వడ్డీలూ ఎందుకు? హాయిగా అమ్మిపారెయ్యరాదూ! వడ్డీ అయినా కలిసొస్తుంది..." అనేవాడు. అవతలి వాడు అప్పటికే విసిగిపోయి తల ఊపేవాడు. ఇక ధర కట్టడం, బాకీలు పోను మిగిలిన మొత్తం ఇచ్చేయడం, రిజిస్ట్రేషన్లూ వగైరా అన్నీ జరిగిపోయేవి. ఇక ఆ యిల్లు తన అధీనంలోకి రాగానే ఆయన దాన్ని జాగ్రత్తగా పరిశీలించి కొంత డబ్బు ఖర్చుపెట్టి మార్పులూ, చేర్పులూ చేయించేవాడు. దాన్ని అనేక భాగాలుగా విభజించి అద్దెల కిచ్చేవాడు.

ఈ విధంగా ఆయనకు ఒచ్చిపడిన అయిదారు యిళ్ళలోనూ అది ఒకటి. ఆయన చాలా నెలలు మంచానపడి తీసుకుని తీసుకుని చచ్చి పోయాడు. ఆయనకు సంతానం లేదు. ఒకణ్ణి పెంచుకున్నాడు. ఆ కుర్ర వాడు పెంపకం జరిగేనాటికి పద్దెనిమిదేళ్ళవాడు. ఆయన మంచాన పడ్డ

ప్పుడు అతడు చాలా శ్రద్ధగా డాక్టర్ల చుట్టూ తిరిగాడు. మందులు తెచ్చాడు. రోజూ కొంతసేపు ఆయన మంచం పక్కన దిగులుగా కూర్చునేవాడు. ఇతరులకు కూడా ఎల్లప్పుడూ దిగులుగా కనిపించేవాడు. అతని వాలకం గమనించి అందరూ పాపం! కుర్రవాడు చాలా దిగులు పడిపోయాడు" అనుకున్నారు. ఆ కుర్రవాడి మనసులో ఏముందో ఆ పరమాత్ముడికే తెలియాలి. ఆయన అప్పుడప్పుడు కళ్ళు తెరిచి కొడుకు వంక చూసి ఏదో మాట్లాడేందుకు ప్రయత్నించేవాడు. కాని మాట పైకి వచ్చేది కాదు. ఒక రోజు ఆయన అతన్ని బాగా దగ్గరికి జరగమని సైగచేసి ఆస్తిపాస్తులకు సంబంధించిన ముఖ్యమైన కాగితాలున్న బీరువా తాళంచెవులు అతనికప్పగించి ఆ చేతిని చాలాసేపు విడిచి పెట్టలేదు. కొడుకుకూడా ఆ చల్లని చేతిని విడిపించుకునే ప్రయత్నం చేయలేదు. కొద్ది నిముషాలలో ఆయన నిద్రతోనో, మైకంతోనో ప్రక్కకు వాలి పోయాడు. ఆ రాత్రే ఆయన చచ్చిపోయాడు. నలుగురూ చూస్తూ వుండగా ఆ కుర్రవాడు నిశ్శబ్దంగా ఏడుస్తూ పక్కగదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు. తెల్లవారు జామున కొందరు జనమూ, చుట్టుపక్కల వారూ రకరకాల బ్రాహ్మలూ ఇంటిముందు చేరి తలా ఒక వైపున రొదచేస్తూ, వుండగా బయటికి వచ్చాడు. ఎర్రగా ఉన్న అతని కళ్ళూ, అలసట సూచించే వాలకమూ గమనించి అందరూ అతను రాత్రల్లా ఏడుస్తూ గడిపి వుంటాడని అనుకున్నారు. అతడు రాత్రి అంతా నిద్రపోని మాట వాస్తవం. ఆ బీరువా తీసి అందులో వున్న కాగితాలన్నింటినీ ఒకదాని తర్వాత ఒకటిగా చదువుతూ అర్థం చేసుకుంటూ డబ్బు లెక్కపెట్టు కుంటూ కూర్చుండిపోయాడు. తెల్లవారిన తర్వాత బయటికి వచ్చి ఇక అవసర కార్యక్రమాలు ప్రారంభించాడు. వంద రూపాయలు ఖర్చు పెట్ట వలసిన చోట చాలా దిగులుగా మొహం పెట్టి "ఇంట్లో బొత్తిగా డబ్బు లేదు. అంతా లోకులమీద ఉంది. మా నాన్నగారు అడిగిన వాడికల్లా లేదనకుండా అప్పులిచ్చారు. దీనితో ప్రస్తుతానికి సర్దుకోండి..." అని యాభై మాత్రమే ఖర్చు పెట్టాడు. ఎవరో కావలసిన వారి దగ్గర అతడు కొంత పైకం అప్పు అడిగి తీసుకుని తన వాదానికి బలం చేకూర్చు కున్నాడు. ఆ విధంగా అంత్యక్రియలు పూర్తి చేశాడు. తర్వాత ఊళ్ళో

ఉన్న తన యిళ్ళకు పోయి వాటిలో కాపురాలుంటున్న ప్రతి ఒక్కరినీ కలుసుకుని చాలా ఆప్యాయంగా మాట్లాడి వచ్చాడు. అతన్ని చూసి అందరూ తలలూపి "కుర్రవాడు మంచివాడే సుమీ" అనుకున్నారు. కాల క్రమేణాగాని అతని అసలు రూపం తెలిసి రాలేదు. ప్రతినెలా రెండవ తేదీనాడు హాజరయ్యేవాడు. ఒకటవ తారీకు జీతాలు తీసుకున్నవాళ్ళు చచ్చినట్టు జమకట్టవలసిందే. ఏ యింట్లో ఏ భాగంలో అద్దెకున్నవారికి ఒకటవ తారీఖున జీతాలు వస్తాయో, మరెవరికి ఏడవ తేదీన వస్తాయో, అతనికి స్పష్టంగా తెలుసు. జీతాలందిన మరుసటిరోజు వెళ్ళి డబ్బు రాబట్టుకోకపోతే మరివారు యివ్వలేరనీ తెలుసు. అందువల్ల అతడు తంతనుగా ఏ యింటికే వేళ హాజరుకావాలో ఆరోజు అదేసమయంలో హాజరయ్యేవాడు. ఇద్దరు ముగ్గురు పెద్దలు అతన్ని వివాహ విషయంలో కదిపిచూసి నిరాశ చెందారు. అతడు "నే నిప్పుడు పెళ్ళి చేసుకోను... ఆ విషయమై మళ్ళీ మళ్ళీ మీరు రానక్కరలేదు." అని స్పష్టంగా చెప్పేశాడు. రాత్రిళ్ళు యింటికాలస్యంగా వస్తాడనీ అలాటివే మరికొన్ని చిన్న చిన్న అపవాదులు అతనిమీద ఉన్నాయి. అవి చాలా సామాన్య విషయాలు కదా!

కమల కళ్ళజోడు ఒకసారితీసి తుడిచి పెట్టుకుని పిట్టగోడ ఆనుకుని నిలబడి క్రిందికి చూసింది. అది మూడో అంతస్తులో అయిదోవాటా. ఎత్తునుంచి చూస్తే ఆ మేడ గుర్రపు నాడా ఆకారంలో చిత్రంగా కనిపిస్తుంది. క్రింది అంతస్తులలో అద్దెకుంటున్నవారు పొద్దున్న లేచింది మొదలు హడావిడిగా పనులు చేసుకుంటూ అటూ ఇటూ తిరుగుతూ ఉంటారు. పక్కగా మొదటి అంతస్థులో మొదటివాటాలో అద్దెకుంటున్న కాలేజీ విద్యార్థి మాత్రం నెమ్మదిగా నిద్రలేచి గుమ్మంముందు పక్కా అరగంటసేపు నోట్లో బ్రష్‌తో నిలబడి మాటిమాటికీ పైకి కమలవంక చూస్తున్నాడు. ఇతర వాటాలలో వారు కొందరు పిట్టగోడమీద రంగు రంగుల బట్టలు ఆరేసుకుంటున్నారు. ఆ నల్లని మాసికలచీరె ఆరేసిఉన్న భాగంలో అరవ దంపతులు వున్నారు. వారికి అయిదేళ్ళ పిల్ల. రెండు

నెలలు క్రిందట ఆ పిల్లకు అకస్మాత్తుగా జబ్బుచేసింది. రాత్రివేళ ఊపిరాడక మెలికలు తిరిగిపోవడం మొదలుపెట్టింది. ఆ పిల్ల తండ్రి రైల్వే షెడ్‌లో పనిచేస్తూ వుంటాడు. అతడు అప్పటికప్పుడు హడావిడిగా డాక్టరును పిలుచుకు వద్దామని పరుగెత్తుకుపోతే డాక్టరు దర్శనంకూడా కాలేదు. ఇంటికిపోతే క్లబ్బులో ఉన్నాడన్నారు. క్లబ్బుకుపోతే ఇంటికి వెళ్ళాడన్నారు.

అతడు క్లబ్బుకూ డాక్టరు యింటికీ రెండు మూడుసార్లు తిరిగి దీనంగా యింటికి వచ్చాడు. అప్పుడా పిల్లతల్లి ఏడుపు ప్రారంభించింది. చుట్టుపక్కల వాటాల్లో లైట్లు వెలిగాయి. ఏమిటేమిటంటూ కొందరు చేరారు. అప్పుడు కమల అన్నయ్య దాసు సెలవుమీద వచ్చి ఉన్నాడు. అతడంతావిని ఏవో హోమియోమాత్రలు తీసుకువెళ్ళి ఆ పిల్లచేత మింగించి ధైర్యంచెప్పి వచ్చాడు. మళ్ళీ అంతా సద్దుమణిగింది. పక్కవాటాల్లో లైట్లు ఆరిపోయాయి. తెల్లవారేసరికి ఆ పిల్లకు నెమ్మదించింది. దాసు మళ్ళీ అదేమందు ఒక డోసు వాడి, "ఇక ఏమీ ఫరవాలేదు. పొమ్మ"న్నాడు.

కమలకు అన్నయ్యను తలుచుకుంటే కన్నీళ్లు పొంగివచ్చాయి. ఆమె గొంతు సర్దుకుంటూ గోడుతీసి పమిటకొంగుతో కళ్లు తుడుచుకుంటూ అలాగే నిలబడింది. తర్వాత క్రింద కేకలు వినిపిస్తే కళ్ళుగోడు తగిలించుకుని క్రిందికిచూసింది. అక్కడ ఒక వాటాముందు నిలబడి పాలవాడు కేకలు పెడుతున్నాడు. అరిచి అరిచి చివరకు "అంత ఇయ్యలేనోళ్ళు పాలెందుకు పోయించుకున్నారు? ఇదేం మీ మల్లె అనుకున్నారా? రేపు నా డబ్బియ్యకపోతే మర్యాద్దక్కదు..." అని బెదిరించి వెళ్ళిపోయాడు. ఆ వాటాలో కాపురం ఉంటున్న వ్యక్తి కోమటి దుకాణంలో పద్దులు రాస్తూ వుంటాడు. ఆయనకు జీతం రావడానికి నెలలో ఫలానా తేదీ అని గడువు ఏమీ లేదు. షావుకారు తనదగ్గర డబ్బు పుష్కలంగా ఉన్నదనిపించినప్పుడు ఆ డెబ్బయి రూపాయలూ పారేస్తాడు. అది వచ్చేదాకా అతడు అడగకూడదు. అందువల్ల పాలవాడేకాదు. బొగ్గులవాడూ, కిరాణాకొట్టువాడూ ఇంకా యితరులూ అందరూ మాటిమాటికీ అతన్ని "మర్యాద దక్కదు" అని బెదిరించడం ఎన్నోసార్లు జరిగింది. ఆయన మర్యాద యింకా ఉందో, ఊడిపోయిందో అది తేలవలసిన విషయం.

కమల కుడిచేతి చూపుడు[వేలితో పిట్టగోడ మీద తాళంవేస్తూ అలాగే నిలబడింది. ఎదురుగా సూర్యుడు తీక్షణంగా ప్రకాశిస్తున్నాడు. ఎండలో చురుచురుకుపాలు హెచ్చుతున్నది. క్రిందివాటాలలో ఆఫీసులకు పోయేవారూ, కచేరీలకు పోయేవారూ ఆదుర్దాపడుతున్నారప్పుడే. వారి భార్యలు ఉన్నవేవో వండి పడెయ్యడానికి తొందరపడుతున్నారు. ఈ పక్కవాటాలో ఉన్న శాంతమ్మ ఇంకా ఇవతలికిరాలేదు. ఆమె లేచీలేవగానే మడికట్టుకుని వంట పూర్తిచేసి ఆ గుమ్మం ముందున్న చిన్న తులసికోటలో నీళ్లుపోసి తర్వాత భర్తకు అన్నం వడ్డిస్తుంది. ఆయన ఈ లోపల పదిసార్లు కేకలు పెడతాడు. ఉండి ఉండి అందరికీ వినబడేట్టుగా "నేనయిదుమైళ్ళు పోవాలి...నువ్వు నత్తనడకలు నడిస్తే అవతల ఊరుకునే వాళ్ళెవరూలేరు. కానియ్ కానియ్" అంటూ వుంటాడు. ఆమె "వొస్తున్నా వొస్తున్నా" అంటూ పనిచేసుకుంటూ వుంటుంది.

కమల కెదురుగా ఆకాశంలో గాలినంతటినీ కూడలాక్కుంటూ ప్రపంచంమీదికి చురుకైన వేడి కిరణాలను వదలుతున్న సూర్యబింబం నిప్పులుచెరిగే పళ్లెంలావుంది. ఒకటో రెండో పక్షులు అప్పుడే నీరసంగా ఎగురుతూ పోతున్నాయి. దూరంగా అన్నీ యిళ్ళు...తేనెతుట్టెల వంటి యిళ్ళు...వాటిలో ఇరుకు ఇరుగ్గావున్న వాటాలు...ఆ వాటాలలో ఇరుక్కుని కాలం గడుపుతున్న మనుషులు...ఆ పేట పక్కనే అవతల కనుచూపుమేర అంతటా పాకలు...భూదేవి శరీరంమీద వ్రణాలవలె అసహ్యంగా మురికిగా ఉన్న చిన్న చిన్న పాకలు... వాటిలోనూ లెక్కకు మిక్కిలిగా జనం...

కమల అలా చూస్తూ వుండగానే ఒక నల్లని బుల్లి కారు వచ్చి ఆ మేడముందు ఆగింది. అందులోనుంచి ఆ యింటి యజమాని ప్రభాకరం తెల్లని దుస్తులలో దిగి వచ్చాడు. అతని ఎడమ చేతిలో సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె ఉన్నాయి. ఆ చేతి వ్రేళ్ళకు ధగధగ మెరిసే రెండు రాళ్ళ ఉంగరాలున్నాయి.

కమల కొంచెం కంగారుపడింది. జాగ్రత్తగా చూసింది. అంతలో పమిట సర్దుకుని "ఇదే వస్తున్నాడు..." అనుకున్నది. తర్వాత గబగబ

లోపలికి వెళ్ళి ఎడమవైపున్న ఒక్కగానొక్క బుల్లి కిటికీ పక్కన నిలబడి చతురస్రంగా కనిపిస్తున్న ఆకాశం వంక చూస్తూ వుండిపోయింది.

అంతలో గుమ్మం దగ్గర అడుగుల చప్పుడయింది. అతడు "కమలాదేవిగారూ!" అని పిలుస్తూ చెప్పులు విడిచి లోపలికి రానే వచ్చాడు. కమల పమిట కొంగులో ఉన్న కుట్లు పైకి కనబడకుండా భుజాలమీదుగా కప్పుకుని అతనివైపు తిరిగి "రండి రండి" అన్నది.

అతడు రెండడుగులు ముందుకువేసి మూలగా మంచంలో పడుకుని ఉన్న ముసలాయన వంక చూస్తూ "ఇంకా మీ నాన్నగారికి అలాగే వుందా?" అని అడిగాడు.

కమల తలవూపి "అలాగే వుందండీ... ఏమీ మార్పులేదు. రాత్రి అంతా గాలిలేక ఊపిరాడక చాలా బాధపడ్డారు. ఇందాకే నిద్రపట్టింది ..." అన్నది.

ప్రభాకరం ముసలాయన వంక మళ్ళీ చూశాడు. ముసలాయన బరువుగా గాలి పీలుస్తున్నాడు. బాగా చిక్కిపోయి ఎముకల గూడులా ఉన్నాడు. గడ్డం మాసిపోయి నల్లగా, అసహ్యంగా ఉంది.

ప్రభాకరం "సరే! మిమ్మల్ని అద్దె అడిగేందుకు వచ్చాను. ఇప్పటికే మూడు నెలల అద్దె బకాయి ఉంది. మీ అన్నయ్య ఇంకా డబ్బు పంపలేదా ?" అని అడిగాడు.

కమల నెమ్మదిగా "లేదండీ...అక్కడ ఏ హడావిడిలో ఉన్నాడో ఏమో మరి!" అన్నది.

'మంచిది...అతని దగ్గరనుంచీ డబ్బు రాగానే మూడునెలల అద్దె యిచ్చేయండి. ఎప్పటి కప్పుడు జమకట్టకపోతే ముందు ముందు ఇవ్వడం మీకే కష్టం..." అంటూ అతడు గుమ్మంవైపు నడుస్తూ ఆగి "అన్నట్టు డబ్బు రాగానే ఎవరైనా డాక్టర్ని పిలిచి మీనాన్నగారికి మంచి మందు యిప్పించండి. జబ్బు ముదిరితే ప్రమాదం..." అన్నాడు. ఆతర్వాత గ్లాస్కో లాల్చీ జేబులలో చేతులుంచుకుని "నేనిక వస్తాను..."

అని గుమ్మంముందు ఆగి ఆమెవంక ఒక్కక్షణం కన్నార్పకుండా చూశాడు. అంతలో చూపులు తిప్పుకుని గబగబ నడిచి వెళ్ళిపోయాడు.

కమల ఒక్కసారి నిట్టూర్చి తండ్రివంక చూసింది. చూస్తున్న కొద్దీ ఆమెకు దిగులూ, దుఃఖమూ పొంగివచ్చాయి. ఆయన జీవితమంతా చాకిరీచేశాడు. రకరకాల చిన్న చిన్న ఉద్యోగాల్లో సంవత్సరాల తరబడి నడుం వంచి పనిచేశాడు. చివరకాయనకు ఏమీ మిగలలేదు. రిటైరయ్యే నాటికి ఒక జబ్బూ, దానివల్ల బలహీనతా, మానసిక చింతా, ఇవి మాత్రం మిగిలాయి ఆయనకు. పెద్దకొడుకు దాసూ, కూతురు కమలా యిద్దరూ రెండు కళ్ళు... "వారిని కన్నానేగాని సుఖం యివ్వలేకపోయానే" అని ఆయన చాలాసార్లు దిగులుపడ్డాడు. దాసుకు ఎస్సెల్సీ వరకూ చదువు చెప్పించేసరికి ఆయన శక్తి సన్నగిల్లింది. కమలకు చదువంటే యిష్టం... చదువుకున్న వారినీ, చదువుకుంటున్న వారినీ చూస్తే గౌరవం... ఆమె ఫోర్తుఫారం వరకూ చదివి తరువాత ఆపేయవలసి వచ్చింది. ఇంట్లో పనీ పాటా చేసుకుంటూ కాలం గడపవలసి వచ్చింది. దాసు కొన్నాళ్ళు ఏవో చిన్న చిన్న ఉద్యోగాల కోసం ప్రయత్నాలు చేసి ఫలించక విసిగి పోయి ఒక రోజున తెగించి ఉత్తరదేశం పారిపోయాడు. కొన్ని వందల మైళ్ళ దూరంలో ఒక ఫ్యాక్టరీలో స్థిరపడి ఇంటికి ఉత్తరం వ్రాశాడు. ఇటీవలే సెలవు మీద వచ్చి వెళ్ళాడు కూడా.

కమల అలాగే గుమ్మానికానుకుని నిలబడి అన్నను గుర్తు చేసుకుని కళ్ళు తుడుచుకున్నది. అంతలో ఆమెకు చిరాకు కలిగింది. "ఈ కళ్ళ జోడొకటి! అసహ్యంగా...అయినా ఈ వయసులో తనకి కళ్ళ జోడేమిటి ఖర్మ కాకపోతే ! ఛాఛా" అనుకున్నది.

మంచంలో ముసలాయన అంతలో కళ్ళు తెరిచాడు. నెమ్మదిగా కమలను పిలిచాడు. ఆమె త్వర త్వరగా తండ్రి దగ్గరికి వెళ్ళి "లేచావా నాన్నా ? మొహం కడుక్కో, కాసిని పాలు తాగుదువుగాని" అన్నది.

ఆయన ఏమీ మాట్లాడకుండా కళ్ళు పెద్దవి చేసుకుని కూతురివైపు చూస్తూ లేచాడు. తర్వాత ఆమె సాయంతో అవతల చిన్న గదిలోకి వెళ్ళి తూము దగ్గిర మొహం కడుక్కున్నాడు తర్వాత మళ్ళీ కూతురి భుజాల

పైద చేతులువేసి నడిచి వచ్చి మంచంలో కూర్చున్నాడు. కమల పాలు తెచ్చి యిచ్చింది. అవి నెమ్మదిగా తాగుతూ చిత్రంగా చూసి "ఇప్పుడొక కల వచ్చిందే అమ్మాయ్ !" అన్నాడు.

కమల "ఏమిటి నాన్నా అది ?" అని అడిగింది.

"నేను సముద్రం ప్రక్కన నడిచిపోతున్నాను. అక్కడెవరూ లేరు. కొంచెంసేపు పరుగెత్తాను. అంతలో నాకు రెక్కలొచ్చాయి. ఇక ఎగిరిపోవడం మొదలు పెట్టాను. అప్పుడు నా వంక నేను చూసుకుంటే కాకినై పోయాను, ఇతర కాకుల్లో చేరిపోయాను" అని నెమ్మదిగా చెప్పాడాయన.

పాలు తాగడం ముగించి ఎందుకో కళ్లు పెద్దవి చేసుకుని చిత్రంగా పైకి చూస్తూ పడుకున్నాడు. కాస్సేపట్లోనే ఆయనకు మళ్ళీ కునుకుపట్టినట్టున్నది. కదలకుండా పడుకుండిపోయాడు.

కమల పక్క గదిలోకి వెళ్ళి ఏదో డబ్బాలో తాను రెండు రోజుల క్రితం దాచిన ఒక ఉత్తరం యివతలికి తీసింది. అయితే ఆమె దాన్ని చదవలేదు. అసలు విప్పలేదు. ఒక్క క్షణం ఆగి దాన్ని అలాగే వుంచేసి యివతలికి వచ్చింది. చెమ్మగిల్లిన కనులతో చూస్తే కిటికీలోంచి కనిపిస్తున్న ఆకాశ భాగంలో రెండు పక్షులు జోరుగా ఎగిరిపోతూ కనిపించాయి.

మధ్యాహ్నం పన్నెండు గంటలు దాటింది. ఎండ... ఎండ... ఎండ... సమస్త చరాచర ప్రపంచాన్నీ ఎర్రగా కాలిన పెనంమీద ఉంచినట్టుంది. వేడిగాలి కొద్దిసేపు వీస్తుంది. అంతలోనే అలిగి గంటలతరబడి కదలడం మానేస్తుంది. సూర్య బింబం బాగా కాలిన ఉక్కు ముద్దవలె నిప్పులు కురిపిస్తూ సమస్త జీవరాసులచేతా "ఉస్సుర"ని పిస్తుంది.

కమల అతి ప్రయత్నం మీద తండ్రిని లేవదీసి కూర్చోబెట్టింది. ఆయన దాదాపు నిద్రపోతూనే కూర్చున్నాడు. ఆమె నెమ్మదిగా

స్పూనుతో బియ్యపు జావ తాగించింది. తర్వాత మొహం తుడిచి మళ్ళీ పడుకో బెట్టింది. ఆయన ఒక్క క్షణం ఆగి "గాలి...గాలి" అన్నాడు.

అవును గాలి లేదు. ప్రపంచంలో ఎక్కడా లేదు. సంపన్నులు డబ్బు పెట్టి కొనుక్కుంటే దొరుకుతుందో లేదో ఆమెకు తెలీదు.

ఆయన మళ్ళీ "గాలి గాలి..." అన్నాడు.

కమల ఒక్క క్షణం ఆలోచించింది. నిజమే. గాలి కావాలి. ఆమెకు అకస్మాత్తుగా గుర్తు వచ్చింది. పై అంతస్తులో మధ్య ఒక వాటాలో అద్దె కుంటున్న ఒక రైల్వే గుమాస్తా యింట్లో ఒక పాత ఫ్యాను ఉంది. దాన్ని కమల కొద్ది రోజుల క్రిందట చూసింది. ఎప్పుడో ఏదో వస్తువు బదులు కావలసి వచ్చి అక్కడికి వెళ్ళగా మూడో గదిలో స్టూలు మీద ఆ ఫ్యాను చుట్టలు చుట్టుకొని, తలఎత్తిన పెద్ద పాములా వుండి గిర్రున తిరుగుతున్నది. కమల ఇప్పుడు ఆలోచించింది. ఒక్క సారి వెళ్ళి వారిని ప్రాధేయపడితే ?

ఆమె నెమ్మదిగా లేచి జాకెట్టు చిరుగు కనిపించకుండా పమిట కొంగు భుజాల చుట్టూ కప్పుకొని, తలుపు దగ్గరకు లాగి బయలు దేరింది. వేడిగా నిప్పులు పరచినట్టున్న సన్నని వరండాలో నడిచింది. నెమ్మదిగా మెట్లెక్కి పై అంతస్తుకు వెళ్ళింది.

ఆ గుమాస్తా యింట్లో లేడు. ఆయన భార్య పిల్లలిద్దర్నీ చాపమీద పడుకోబెట్టి తాను ప్రక్కనే ఏదో పత్రిక చదువుకుంటూ పడుకుని వుంది. ఆ పక్కనే మూలగా ఫ్యాను తిరుగుతున్నది.

కమల గుమ్మం బయట నిలబడి ఒక్క క్షణం ఆలోచించింది, అంతలో ఆమె తలయెత్తి చూసి "ఎవరది?" అని అడిగింది.

కమల నవ్వుతూ "నేనే అక్కయ్యగారూ?" అంటూ లోపలికి వచ్చింది.

ఆమె లేచి కూర్చుని "రా, అమ్మా" అన్నది. కాని ఆమె మొహంలో ప్రసన్నత లేదు. కమల లోపలికి వెళ్ళి కూర్చున్న తరువాత

కూడా ఆమె మళ్ళీ చదువుకుంటూనే ఉండిపోయింది తప్ప ఏమీ మాట్లాడ లేదు.

కమల నెమ్మదిగా "అక్కయ్యగారూ? మా నాన్నగారు చాలా బాధ పడుతున్నారు..." అన్నది.

ఆమె తల ఎత్తి చప్పరించి జాలిగా "పాపం. పెద్ద వయసు. అందులోనూ నిప్పులు చెరిగే ఎండాకాలం..." అన్నది.

కమల "అవునండీ. ఊపిరాడక, గాలిలేక చాలా బాధపడు తున్నాడు. ఒక్కసారి..." అంటూ ఒక్క క్షణం ఆగింది.

ఆమె కమల వైపు చూసింది.

కమల తల వంచుకుని "ఏమీ అనుకోకపోతే, ఒక్కసారి మీ ఫ్యాను యివ్వండి. ఒక్క గంటసేపు వుంచుకుని మళ్ళీ తెచ్చి యిచ్చే స్తాను" అన్నది.

ఆమె ఒక్క క్షణం ఏమీ మాట్లాడలేదు. తర్వాత "చూడమ్మా! పిళ్ళు పసిపిల్లలు. నిద్రపోతున్నారు. ఇప్పుడెలా చెప్పు..." అన్నది. తర్వాత యిద్దరూ కాసేపు ఏమీ మాట్లాడలేదు.

కమల లేచింది. పమిట కొంగుతో నుదురు తుడుచుకుని విసురు కుంటూ "సరే...వస్తానండీ..." అని చెప్పి తన వాటాలోకి వచ్చేసింది. తండ్రి వంక చూస్తే ఆయన బరువుగా గాలి పీలుస్తూ పడుకుని వున్నాడు.

కమల కిటికీ పక్కనే కూర్చున్నది. ఆకాశంలోకి చూస్తూ గోడ కానుకుని కూర్చున్నది. కాస్సేపట్లో కళ్ళు మూతలు పడ్డాయి. అంతలో చక్కని పంచరంగుల కల ప్రారంభమైంది

...తమది ఒక పల్లెటూరు... అక్కడ అసలే ఇళ్ళు తక్కువ. ఉన్నవన్నీ దూరదూరంగా వున్నాయి. తమ యిల్లు ఊరికొసన కొబ్బరి చెట్ల మధ్యలో వుంది... ఆ వూరికి అరమైలు దూరంలోనే సముద్రం... ఎల్లప్పుడూ హోరుమని మోత వినిపిస్తూ వుంటుంది. సముద్రంమీద నించీ ఎల్లప్పుడూ విసురుగా బాణ వేగంతో గాలి వీస్తూ వుంటుంది. ఎప్పుడూ

రాత్రీ పగలూ అని లేకుండా ఒకటే గాలి... తాను తలంటి నీళ్ళు పోసుకుని అలా బయటికి వెళ్ళింది. విసురుగా వీస్తున్న గాలికి ఆమె తల వెంట్రుకలు చెల్లాచెదురై పోయి మాటి మాటికి మొహానికీ, కళ్ళకూ అడ్డం పడుతున్నాయి. ఆమె చిరాకుతో వెంట్రుకలను పైకి తోసుకుంటూ 'ఛ... వెధవ గాలి...' అని విసుక్కుంటున్నది.

అంతలో ఆమె ఉలిక్కిపడి లేచింది. ఆమె పంచరంగుల కల చెదిరిపోయింది. తండ్రి బాధగా మూలుగుతూ పిలుస్తున్నాడు. ఆమె తండ్రి దగ్గరికి వెళ్ళి కూర్చున్నది.

ఆయన ఆయాసంతో "గాలి ఆడటం లేదమ్మా... తలుపులు తియ్..." అన్నాడు.

"తలుపులన్నీ తీసేవున్నాయి నాన్నా" అన్నదామె.

ఆయన 'అలాగా' అని ఒక్క క్షణం ఆగి "అన్నయ్య దగ్గర నించి ఇవాళకూడా డబ్బు రాలేదా అమ్మా!" అని అడిగాడు.

ఆమె కళ్ళు తిప్పుకుని "లేదునాన్నా ? వాడక్కడ ఏ తొందర పనుల్లో ఉన్నాడో ఏమో ?" అన్నది.

ఆయన మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. అంతలోనే నిద్రపట్టిందో లేక మగత కమ్మిందో తెలీదు. కళ్ళుమూసుకుని పడుకుండి పోయాడు. ఆమె కాసేపు మెల్లగా విసురుతూ కూర్చున్నది. కాని అలా లాభంలేదు. అలా వచ్చినగాలి వేడిగా మరింతవేడిగా ఉంటుందేతప్ప దానివల్ల సుఖం లేదు.

ఆమె అంతలో లేచి లోపలి గదిలోకి వెళ్ళి మళ్ళీ ఆ ఉత్తరం చూసింది. అంతలో ఆమెకు కళ్ళవెంట నీళ్లు పొంగివచ్చాయి. బావురు మని పెద్దగా ఏడిస్తే బాగుండుననిపించింది. కాని అతి ప్రయత్నం మీద ఏడుపు ఆపుకుని కళ్లు తుడుచుకుని ఉత్తరం జాకెట్టులో దాచుకుని యివతలికి వచ్చింది. ఈ రాత్రికి ముందు గదిలో ఫ్యాను ఉండాలి. లేకపోతే తండ్రి స్థితి ఎంతగా విషమిస్తుందో తనకు తెలుసు. ఆయన

తానెంత ఓపికగా విసురుతూ కూర్చున్నా ఊపిరాడక తన్నుకుంటాడు. ఫ్యానువల్ల వచ్చే చల్లని తగుమాత్రపు గాలి ఈ రాత్రికి ఆయన అనుభవించాలి.

కమల క్రిందికి చూసింది. మెయిన్‌గేటులోనుంచి బుల్లి విమానం లాంటి ఆ కారు మళ్ళీ రావడం ఆమెకు కనిపించింది. అందులో నుంచి ప్రభాకరం దిగివచ్చి క్రింద ఎవరితోనో ఏదో మాట చెప్పి మళ్ళీ అంతలోనే వెళ్ళబోతున్నాడు. అంతలో అతడు పైకి చూశాడు. కమల అప్రయత్నంగా చేయివూపి అతన్ని పైకి రమ్మని సైగచేసింది. అతడు ఒక్క క్షణం ఆలోచించి నెమ్మదిగా నడిచి పైకి వచ్చాడు. అతడు పైకి రావడానికి చాలసేపు పట్టింది. అంతసేపూ ఆమె గుమ్మంముందు నిలబడి జాకెట్టు చిరుగు కనిపించకుండానూ, పమిట కొంగుమీద కుట్లు (నల్ల చీరమీద తెల్లదారం కుట్లు) కనిపించకుండానూ, జాగ్రత్తగా సర్దుకున్నది. తర్వాత ఆ చిన్న వరండాలో ముందుకు నడిచి వస్తున్న అతనివంక చూసింది. చిరునవ్వు నవ్వింది.

అతడు దగ్గరకు వస్తూనే "ఏమిటండీ పిలిచారు ? డబ్బు వచ్చిందా ?" అని అడిగాడు.

కమల తల అడ్డంగా వూపి "లేదండీ...ఇవాళ తప్పకుండా వస్తుందనుకున్నాను. అలా అని ఇదిగో ఉత్తరంకూడా వచ్చింది. రాగానే మీ డబ్బు మీకు పువ్వుల్లోపెట్టి మరీ యిచ్చేస్తానుగా..." అన్నది.

అతడు "సరే" అన్నాడు.

కమల మళ్ళీ "ఏమండీ ! ఇక్కడ ఒక్కదాన్నీ...ఏమీ తోచడం లేదు...నాకు మీ యిల్లు చూడాలని వుంది. రమ్మంటారా ?" అన్నది.

ప్రభాకరం కొద్దిగా ఆశ్చర్యంగా చూసి అంతలోనే తేరుకుని "దానికేం భాగ్యం ? అలాగేరండి... యిప్పుడే వెడదామా ?" అని అడిగాడు.

"ఓ...ఇప్పుడే వెడదాం...ఇదిగో, తలుపు దగ్గరికి వేసివస్తాను."

అంటూ ఆమె గుమ్మంలో నిలబడి ఒక్కసారి తండ్రివంక చూసింది. ఆయన పడుకున్న పద్ధతిలో మార్పేమీలేదు. ఇవాళ పొద్దుగుంకే వేళకు ఆయన మంచం పక్కనే చల్లని గాలిని తెరలు తెరలుగా తిప్పుతూ చక్కని ఫ్యాను ఉంటుంది. ఆయన రాత్రి హాయిగా నిద్రపోతాడు. ఏమయితే చక్కని కలలుకూడా కంటాడు.

కమల తలుపు దగ్గరికి లాగి పదండి" అంటూ అతని వెంట నడిచింది. ఆమెకు తెలుసు. ప్రభాకరం యింట్లో అతడు తప్ప మరె వరూ ఉండరు. అతడు మంచివాడు కాదని కొందరనుకోగా ఆమెకూడా విన్నది. అయినా ఆమె ఏ మాత్రమూ తొణకకుండా అతనివెంట నడిచి వచ్చి కారులో ఎక్కింది. అతడు స్టీరింగ్ ముందు కూర్చుని కారును వేగంగా పోనిచ్చాడు. ఆమె కారు కదలిక వల్ల వచ్చిన గాలి తాకిడిలోని ఆనందాన్ని అనుభవిస్తూ ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నది.

ప్రభాకరం కారు పోనిస్తూ "మీ నాన్నగారికి పాపం, ఒంట్లో సుస్తీ తగ్గలేదనుకుంటానే... ఎవరైనా మంచి డాక్టర్ని పిలిచి..." అన్నాడు.

కమల "నవ్వి పెద్దతనం కదండి మరి...చెయ్యి నొచ్చినా, కాలు నొచ్చినా తొందరగా తగ్గదు..." అన్నది.

అతడు మరేమీ మాట్లాడలేదు. ఆమె మాత్రం కాస్సేపాగి "అబ్బబ్బ ఏమి ఎండ ! ఈ సంవత్సరం మరీ దారుణంగా వుంది. దానికి తోడు గాలి కూడా సమ్మె చేసినట్టు బిగించింది" అన్నది.

అతడు తల వూపి "అవునవును" అని ఊరుకున్నాడు.

ఆమె మళ్ళీ "ఏమిటో, నాకీ వాతావరణం ఎప్పుడూ అలవాటు లేదు. చిన్నప్పటినుంచీ మా ఊళ్ళో హాయిగా పెరిగాను. అన్నట్టు మా ఊరు సంగతి మీకు తెలీదుకదండీ... మాది ఎంచక్కని పల్లెటూరు.... ప్రశాంతంగా ఉంటుంది. ఊరికి దగ్గరలోనే సముద్రం...ఎంత ఎండా కాలంలోనైనా కమ్మనిగాలి...ఒక్కొక్కప్పుడు విసుగుకూడాపుట్టేది. ఒక్కటే రోదచేస్తూ హోరుమని గాలివీస్తూంటేకూడా బాధేకదండీ మరి.

...ఇప్పుడేమో ఇక్కడ గాలి ఆడక బాధపడుతున్నాం...ఇప్పటి కిప్పుడు మా ఊళ్ళో వుంటే ఎంత బావుంటుందో..." అన్నది.

ఆమె పుట్టింది పెద్దపట్నంలోని ఒక మారుమూల ఇరుకు పేటలో అద్దె యింట్లో. పెరిగింది కూడా అటువంటి ఇరుకు పేటలోని అద్దె వాటాలలోనే. ఆమె ఎన్నడూ యింతవరకూ ఒక ప్రశాంతమైన పల్లెటూరును చూడనైనా లేదు.

ప్రభాకరం కారు మలుపు తిప్పుతూ "మీ అన్నయ్య చేసూ వుంటాడన్నారూ !" అని అడిగాడు.

ఆమె "ఇంతవరకూ నేనేమీ అనలేదే." అని నవ్వింది. అతడూ కూడా నవ్వి "పోనీ యిప్పుడు చెప్పండి..." అన్నాడు.

ఆమె, ఉత్తరదేశంలో ఏదో ఊరిపేరు చెప్పి "అక్కడ టాంకులు...విమానాలు తయారు చేస్తూంటారు చూశారు! పెద్ద ఫ్యాక్టరీ... అందులో పని..." అన్నది.

అతడు మరేమీ మాట్లాడకుండా కారును గ్యారేజిలోకి పోనిచ్చి ఆపాడు. ఆమె దిగి యివతలికి వచ్చి చూసింది చక్కని చిన్న యిల్లు... అందంగావుంది...ముందు రకరకాల మొక్కలున్నాయి.

అతడు "రండి..." అంటూ వరండాలోకి వెళ్ళి తలుపు తాళం తీసి పక్కగది చూపిస్తూ "లోపలకూర్చోండి...ఇప్పుడేవస్తాను..." అని మరో గదిలోకి వెళ్ళిపోయాడు.

కమల తలుపుతోసింది. అది స్ప్రింగ్ తలుపు. ఆమె లోపలికి వెళ్ళగానే దానంతట అదే మూసుకున్నది, లోపల చల్లగా అతి చల్లగా వుంది. కిటికీలో ఏదో పెట్టెవంటి మెషినులోంచి చల్లనిగాలి హాయిగా వీస్తున్నది పైన ఫ్యాను తిరుగుతున్నది. ప్రభాకరం కొద్దిసేపటి క్రిందట ఫ్యానుకూడా ఆపకుండా ఉన్నపట్టున బయలుదేరి ఉండాలి...కిటికీ పక్కన దోమతెరకట్టిన మంచం...దానిమీద మెత్తనిపరుపు...రెండు మూడుదిండ్లు...మంచంపక్కనే చక్కని నగిషీచెక్కబడిన ఖరీదైన

అందాల టీపాయ్...పక్కన కుర్చీలు...టీపాయ్‌మీద ఏవో పుస్తకాలు. మరో చక్కని బల్లమీద టేబిల్ ఫ్యాను. అది మాత్రం తిరగడం లేదు.

కమల దాని వంకనే కన్నార్పకుండా చూసింది. ఆకలి గొన్న కళ్ళతో చూసింది. దాన్ని అప్పటికప్పుడే స్వంతం చేసుకోవాలన్నంత ఆశగా చూసింది.

ప్రభాకరం దుస్తులు మార్చుకుని వచ్చాడు. వస్తూనే "ఇదండీ మాయిల్లు. కాదు. కాదు, నా యిల్లు!" అన్నాడు. తర్వాత "అరె! మీరలా నిలబడేవున్నారేం ? కూర్చోండి..." అన్నాడు. "మంచి నీళ్ళు కావాలా ?" అని అడిగాడు. ఆమె కావాలని తల వూపగానే కిటికీలోని అందాల కూజాలోంచి చల్లని మంచి నీళ్ళు తెచ్చి యిచ్చాడు. ఆ గ్లాసు అందుకుంటూ వుండగా ఆమె చేతివ్రేళ్ళు అతని వ్రేళ్ళకు తగిలాయి. ఆమె గ్లాసు అందుకొని గడగడ త్రాగేసి సోఫాలో వెనక్కువాలి, "అమ్మయ్య" అనుకున్నది.

తర్వాత అతని పుస్తకాల షెల్ఫ్‌వంకచూసి లేచివెళ్ళి పరీక్షగా అన్ని పుస్తకాలూ చూసింది. ప్రభాకరం ఆమెవంకనే కన్నార్పకుండా చూస్తూ మంచం మీద దిండు ఆనుకుని కూర్చున్నాడు.

ఆమె "అరె, మీదగ్గర మంచి మంచి పుస్తకాలు ఉన్నాయే... ఇదుగో ఈ పుస్తకం నేనూ చదివాను. ఎక్కడబ్బా? అవును మావూళ్ళో పంచలో కూర్చుని చదువుతూవుంటే హోరు గాలికి పేజీలు నిలవక చిరాకు పుట్టింది కూడా... నాకు చాలా నచ్చిందీ పుస్తకం..." అన్నది.

తర్వాత కుర్చీలో కూర్చుని తమ వూరిని గురించి చాలాసేపు మాట్లాడింది. అటువంటి ఊరు పృథ్విలో ఎక్కడా వుండదన్నది. అక్కడ కృత్రిమ వాతావరణం అసలు లేదన్నది. ఎంత ఎండాకాలం అయినా సరే ఆవూరు ఊరంతా ఎయిర్‌కండిషన్డ్ గదిలా వుంటుందన్నది. ఫానులూ పాడూ ఏవీ అక్కర్లేదన్నది. సాయంకాలం పూట అలా సముద్రపు ఒడ్డుకు వెళ్ళి కూర్చుంటే జీవితంలో ఇంకేమీ కావాలనిపించదు అన్నది.

ప్రభాకరం నిశ్శబ్దంగా కూర్చుని అంతా విన్నాడు.

అంతలో ఆమె లేచి "సరే...నే నొచ్చి చాలా సేపయింది... వెళ్తా నిక..." అన్నది.

అతడు వాచీ చూసుకుని "నాలుగేకదండీ అయింది? కాస్సేపు కూర్చోండి...కొంచెం చల్లబడ్డ తర్వాత వెళ్ళవచ్చు..." అన్నాడు.

తర్వాత అతడు కాఫీ తయారు చెయ్యబోయాడు. ఆమె నడుం బిగించి "అదేమిటండీ, మీరు కాఫీ చెయ్యడం ఏమీ బాగులేదు. ఇవాళ నాచేతి కాఫీ రుచి చూడండి..." అన్నది తాను స్టవ్‌ముందు కూర్చుంటూ. ప్రభాకరం కావలసినవన్నీ అక్కడ అమర్చగా ఆమె కాఫీ పెట్టింది. అంతసేపూ ఏదో మాట్లాడుతూనే వుంది.

ప్రభాకరం ఆమె వంకనే చూస్తూ ఉండిపోయాడు. "ఈ పిల్లకు కళ్ళజోడు లేకపోతే ఎంత బాగుండును. పెద్దపెద్ద ఆకళ్ళకు అసహ్యంగా జోడేమిటి? ఒకవేళ ఉన్నా చక్కని అందమైన ఫ్రేం ఉండాలిగాని ఇలా చవకబారు నల్లని ఫ్రేము మరీ ఘోరంగా ఉంది. ఆ నల్ల చీర పాతదై పోయింది. అక్కడక్కడ కుట్లు కనిపిస్తున్నాయి. జాకెట్టు కూడా భుజం మీద చిరిగి వుండాలి. అలా పమిట నిండుగా కప్పుకోవడంలో అర్థం అదే..." అనుకున్నాడు.

ఆమె కాఫీ కప్పు అతనికి అందించి తానొక కప్పు తీసుకుని కూర్చుని చెప్పండి...ఎలా వుంది కాఫీ ?" అని అడిగింది.

"అద్భుతంగా ఉంది..." అన్నాడు ప్రభాకరం.

ఆమె కబుర్లు చెబుతూనే కాఫీ తాగింది. తర్వాత కూర్చున్నదల్లా లేచి గదిలో అటూ యిటూ పచార్లు చేస్తూ తమ పల్లెటూళ్ళో అన్నయ్యా, తనూ చిన్నప్పుడు తోటల్లోనూ, పొలాల్లోనూ ఆడుకున్న ఆటలను గురించి చెప్పింది. ఆ వాతావరణం, ఆ గాలీ, ఆ సముద్రం, అన్నిటిని గురించీ మళ్ళీమళ్ళీ చెప్పింది. అప్పుడప్పుడు తలవెనక్కువేసి చక్కగా నవ్వింది.

ప్రభాకరం అలాగే కూర్చుని అంతావిన్నాడు. బయట చీకటిపడు తున్నది. అతడులేచి లైటువేశాడు. ఆమె ఒక్కసారిగా ఉలిక్కిపడిలేచి "అరెరే! అప్పుడే పొద్దుగూకిందే..." అంటూ తొందర పడింది.

ప్రభాకరం "ఉండండి...గుడ్డలు మార్చుకుని వస్తాను. మిమ్మల్ని యింటిదగ్గర దింపేస్తాను..." అన్నాడు లోపలికి పోతూ.

కమల ఫ్యానువంకనే చూసింది. అది రాత్రికి తమ వాటాలో తండ్రి మంచం పక్కనే ఉండాలి. ఉండి తీరాలి.దానికోసం....ఆమె చేతులతో ఫ్యానును తిప్పుతూ నిలబడింది. అంతలో ప్రభాకరం గదిలోకి వచ్చాడు.

కమల అతని దగ్గరగా నడిచివచ్చి "ఏమండీ... అన్నట్టు మిమ్మల్నొకటి అడగటం మర్చిపోయాను. ఏంలేదూ... మా నాన్నకు వొంట్లో బాగులేదుకదా! ఊపిరాడక, గాలి అందక బాధపడుతున్నాడు. మా ఫ్యాను రిపేరుకిచ్చాను. అది యింకా రాలేదు. ఇప్పుడీఫ్యాను మనతో తీసుకుపోదాం. మళ్ళీ మీరు రేపెప్పుడన్నా పిలైనప్పుడు తెచ్చుకుందురుగాని..." అన్నది.

ప్రభాకరం "దానికేం ? అలాగేచేద్దాం." అంటూ ప్లగ్ పిన్ను తీసి వైరును ఫ్యాను మెడ చుట్టూ చుట్టి "పదండి పోదాం..." అన్నాడు చొరవగా ఆమె భుజంమీద చెయ్యివేసి నవ్వుతూ.

కమలకూడా నవ్వి "థాంక్స్" అంటూ అతని చేతిని నెమ్మదిగా విడిపించుకుని నడుస్తూ "మా అన్నయ్య డబ్బు పంపగానే ఒక కొత్త సీలింగ్ ఫ్యాను కొనాలండీ...అది అన్నిటికంటె మంచిది. అలా అనమీ అద్దెడబ్బు యివ్వనని కంగారుపడకండి... ఈసారి మా అన్నయ్య చాలా డబ్బు పంపుతానని వ్రాశాడు...ఇదిగో వాడి ఉత్తరం..." అన్నది జాకెట్టులోనుంచి ఉత్తరాన్ని యివతలకి తీసి. అయితే ఆమె ఆ ఉత్తరం అతని చేతికివ్వలేదు.

కమల వెనక సీటులో ఫ్యాను పక్కనే కూర్చుని కారు నడుస్తూవుండగా చేతిలోని ఉత్తరం మళ్ళీ చదువుకుంది. ఆమెకు కళ్ళ వెంట ధారాపాతంగా నీళ్ళు వచ్చాయి. పమిట కొంగుతో ఎన్నిసార్లు తుడుచుకున్నా లాభం లేకపోయింది.

ప్రభాకరం వెనుదిరిగి చూసి "అదేమిటండీ ?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"ఏమీలేదు మా అన్నయ్య మహా చిలిపివాడు. చిన్నప్పటి నుంచీ అంతేవాడు. ఉత్తరం మళ్లీ చదువుకుంటే వాడు గుర్తుకు వచ్చాడు" అన్నది కమల.

ప్రభాకరం మామూలుగా కారు నడిపాడు.

కమల వెనక్కు వాలి కళ్ళు మూసుకుంది. ఆ ఉత్తరం... అందులోని వార్త ఇప్పటికి తన కొక్కదానికే తెలుసు. ఎంత పెద్ద ఫ్యాక్టరీయో అది? ఈ పేట అంత ఉంటుందేమో? అందులో ఎన్ని భయంకరమైన ముళ్ళ చక్రాలు నిరంతరం తిరుగుతూ వుంటాయో! అయినా వాడు, అంత జాగ్రత్త పరుడు, ఆ పెద్ద ముళ్ళ చక్రాల మధ్య ఎలా చిక్కుకు పోయాడో! అసలా చక్రాల మధ్యకు ఎందుకు వెళ్ళాడు? ప్రాణం పోయేందుకు ఎంతసేపు పట్టి వుంటుంది? చివరి క్షణంలో వాడేమనుకుని ఉంటాడు? వందల మైళ్ళ దూరంలో ఉన్న ముద్దుల చెల్లెల్ని, తండ్రినీ తలుచుకుని వుంటాడా? వాణ్ని? ఆ మాంసం ముద్దను ఆ ఫ్యాక్టరీ అధికారులేం చేసి వుంటారు? అసలు మాంసం ముద్దయినా మిగిలిందా లేదా?

కారు ఆగింది. కమల కళ్ళు తెరచి చూసేసరికి నలుగురైదుగురు పిల్లలు అప్పటికే కారుముందు నిలబడి చూస్తున్నారు. క్రింది అంతస్తులో అద్దెలకుంటున్న కొందరు అప్పటికే గుమ్మాలముందు నిలబడి చూస్తున్నారు. ఒకరితో ఒకరు కళ్ళతోనే ఏదో మాట్లాడుకుంటున్నారు. మొదటి అంతస్తులో ఉండే కాలేజి విద్యార్థి చేతిలో ఒకే ఒక పుస్తకంతో అసూయగా కారువంక చూస్తూ నిలబడి వున్నాడు.

కమల కారులోనుంచి దిగి ఫ్యాను ఒకచేత్తో పట్టుకుని రెండడుగులు వేసి ప్రభాకరంతో "థ్యాంక్సండీ... గొప్పసాయం చేశారు. వుంటానిక. అన్నట్టు మీయింట్లో కొన్ని పుస్తకాలు కావాలి నాకు. రేపెప్పుడైనావచ్చి తెచ్చుకుంటాను. మళ్లీ నలగకుండా జాగ్రత్తగా చదివి యిచ్చేస్తాను లెండి..." అన్నది నవ్వుతూ.

ప్రభాకరం కారు దిగి నిలబడి నవ్వుతూ "అలాగే... నేనే వచ్చి సమయం చూసి మిమ్మల్ని తీసుకుపోతాను" అన్నాడు. అదో రకంగా నవ్వుతూ.

కమల నెమ్మదిగా మెట్లు ఎక్కి వరండాలో నడిచి, మళ్ళీ మెట్లు ఎక్కి పైకి చేరుకున్నది. తమ వాటా గుమ్మం ముందుకు వచ్చి నిలబడి క్రిందికి చూసి నవ్వుతూ చేయి వూపింది. తర్వాత "ఇవాళ ఇంత ఎక్కువగా ఎలా మాట్లాడగలిగానబ్బా! అనుకుని నవ్వుకుంటూ ఫ్యాను పట్టుకుని తలుపు తోసుకుని లోపలికి వెళ్ళింది. తండ్రి మంచంలో అస్తవ్యస్తంగా పడుకుని ఉన్నాడు.

కమల లైటువేసి ఫ్యాను తండ్రి మంచం పక్కగా రేకు పెట్టె మీద వుంచింది. ప్లగ్ పెట్టి ఫ్యాను వేసింది. అంతలో చల్లనిగాలి తెరలు తెరలుగా వీచింది. తర్వాత ఆమె "నాన్నా ... నాన్నా" అంటూ తండ్రిని చేతితో తట్టిలేపేందుకు ప్రయత్నించింది. కాని ఆయన లేవలేదు. గాలి లేక, ఊపిరాడక... ఎంత బాధపడి తన్నుకుని ప్రాణాలు విడిచాడోమరి. ఒక చేయి మంచం క్రిందికి వ్రేలాడుతున్నది.

కమల కళ్ళముందు ఒక్కసారిగా నల్లని తెరలేవో దిగినట్టయింది. కళ్ళముందు కటిక చీకటి రాత్రి... గాలిలేని రాత్రి... ఆ చిక్కని చీకటిలో కూడా రేకు పెట్టెమీద ఉన్న ఫ్యాను తెల్లగా పడగ ఎత్తినపాములా కనబడింది.

ఆమె ఒక్కసారిగా బావురుమన్నది.

# కళ్ళజోడు

మార్తాండ బింబం నిప్పులు చెరుగుతున్నది. అసలు సూర్య బింబం ఉదయించడమే కోట్లాది పదునైన కత్తులు తిప్పుతూ ఉదయిస్తున్నది. ఇక పొద్దెక్కేకొద్దీ మరింత ప్రతాపం చూపుతూ రెచ్చిపోతూ అగ్ని చక్రాలు తిప్పుతూ నిప్పులు కక్కుతూ ఉంటుంది.

ఎండ... ఎండ... ఒకటే ఎండ... ఆకాశంలో సజలమైన మబ్బుముక్క కూడా లేదు.

చుట్టూ కనుచూపుమేర ఎటు చూసినా బీటలు వారిన భూమి... భూమాత ఒళ్ళంతా కళ్లు చేసుకొని మబ్బులకోసం ఆకాశం వంక దీనంగా చూస్తున్నట్టుంటుంది... సుళ్లు తిరుగుతూ ఎర్రని దుమ్ము లేపుతూ వేడి గాలి...

మాచమ్మ కర్ర కొట్టుకుంటూ నడుస్తున్నదల్లా ఆగి కాంతి లేని తన గాజు కళ్ళకు చెయ్యి అడ్డం పెట్టుకుని చూసింది. కాలిబాట పక్కగా ఉన్నది బ్రహ్మజెముడు పొద. అందులో యెక్కడో దాక్కుని వుండి కూస్తున్న దొక బుల్లి పక్షి... దాని గొంతయితే వినిపిస్తున్నది గాని అదెక్కడున్నదో మాచమ్మకు కనిపించలేదు. దాన్ని చూద్దామని ఆ ముసలిదాని తాపత్రయం... కాని, ఎంతగా కళ్లు చికిలించుకుని చూసినా అది ఆమెకు కనిపించనే లేదు.

క్రింద కాళ్ళు మాడిపోతున్నాయి. త్వరత్వరగా నడుచుకుంటూ పోయి కొద్ది గజాల దూరంలో ఉన్న, యెక్కువ కొమ్మలూ, ఆకులూ లేని ఒంటరి చెట్టు నీడను చేరి నిట్టూర్చింది.

'క్రింద నయితేనేం? కాస్సేపు కూలబడదామ'ని అనిపించింది గాని

ఆమె కూర్చోలేదు. ఆమెకు కళ్ళు బొత్తిగా కనిపించడం లేదు. అలా అని పూర్తిగా గుడ్డితనం వచ్చేసిందని కాదు. బాగా చూపు ఆనడం లేదు. గొంతుకను బట్టి మనుషులను గుర్తు పట్టడమే. లేకపోతే మరీ దగ్గరగా వెళ్ళి పరకాయించి చూడవలసిందే. 'ఇంకెన్నాళ్ళు? రాలిపోతానెప్పుడో...' అనుకున్నది మాచమ్మ. కళ్ళూ, కాళ్ళూ పోయినా ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే ఆమె పళ్ళు మాత్రం శుభ్రంగా రాళ్ళలాగా దిట్టంగా ఉన్నాయి. ఆకలీ తగ్గలేదు. 'ఆ మహారాజు' రెండేళ్ళ క్రితం ఒకనాడు హఠాత్తుగా కళ్ళు మూసేవరకూ నవ్వుతూ "నా పళ్ళన్నీ వూడిపోయాయి ఏమీ నమల లేకుండా వున్నాను. నువ్వేమో యెప్పుడూ పళ్ళు కటకట లాడిస్తూ ఏదో ఒకటి నములుతూనే వుంటావు" అనేవాడు. నిజానికి తానే ఆయనకన్నా ముందు పోతే బాగుండునని ఆమె ఎన్నోసార్లు ఎంతగానో అనుకున్నది. కాని అలా జరగనేలేదు. ఆయన రెండు రోజుల్లో పోతా డనగా కూడా నవ్వుతూ "ఏమేవ్! మాకు సన్మానం చేస్తార్ట... రాజధానికి పిలిపించి పూలదండలు వేసి సత్కరించి అవేవో తామ్రపత్రాలు— ఇస్తారుట. బహుశా నెలకింతని డబ్బు కూడా మంజూరు చేస్తారు. దాన్తో మన శని విరగడయి పోతుంది. హాయిగా వుంటాము..." అన్నాడు. కాని అంతవరకూ దేవుడు ఆయన్ని ఉంచలేదు. ఏళ్ళ తరబడి జైళ్ళలో ఉండి, లాటీదెబ్బలు తిని, తినరాని కూళ్ళు తిని, పడరాని పాట్లు పడి, ఆస్తి అంతా తగలేసుకుని దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక సుఖపడతామని ఎంతగానో ఆశించిన ఆ మనిషి చివరి రోజులలో వారింటికీ, వీరింటికీ వెళ్ళి యాచనమీద బ్రతకవలసి వచ్చింది.

పోయిన సంవత్సరం ఆ ఉత్సవాలేవో ఎంతో ఆడంబరంగానే జరిగాయుట. మాచమ్మకు అవధానిగారి కొడుకు పేపర్లో చదివి వినిపించాడు కూడా. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని, త్యాగాలు చేసి బాధపడిన వారిని ఢిల్లీ పిలిపించి ఘనంగా సత్కరించి పంపారుట. తామ్రపత్రాల మీద ఏదో చెక్కించి యిచ్చారుట. తన భర్త ఆనాడు ఉండి వుంటే ఎంత సంతోషించేవాడో!

"పిచ్చి మారాజు..." అనుకున్నది మాచమ్మ. కళ్ళ

నిండుతూ వుండగా. భర్తను గురించి తామిద్దరూ ఉన్నప్పుడు ఆయనతో ఆమె చాలాసార్లు "నువ్వొట్టి పిచ్చిమాలోకానివి..." అని సరసమాడేది కూడా. ఆయన తర్జనితో బెదిరిస్తూ "ఏయ్ ముసలమ్మా! నన్ను పిచ్చి వాడంటావా? ఉండు నీ పని చెప్తాను..." అని వెంటబడేవాడు. "అవును, నువ్వు పిచ్చివాడివే... వొట్టి పిచ్చివాడివి..." అని రెట్టిస్తూ ఆమె తప్పించుకుని అటూ ఇటూ పరుగెత్తేది. చివరకు అలుపు వచ్చి ఇద్దరూ ఆగినప్పుడు "తప్పు? ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? ముసలివాళ్ళ సరసం చూసి నవ్వుతారు. వూరుకోండి. యింక" అనేది. ఆయన ఉప్పురిసిపోయి సగం కూలిన గోడలవంక చూసి తలవూపి "అవును సుమా! నిజమే..." అని కూలబడేవాడు. ఇక ఇద్దరూ నవ్వులకు పడేవారు.

మాచమ్మ నిట్టూర్చి కళ్ళు తుడుచుకుని మళ్ళీ నడక ప్రారంభించింది. ఇంకా చాలా దూరం నడవాలి. అన్నట్టు దోవ తప్ప లేదు కదా! కాదు. ఇదే దోవ... అయినా ఈ దోవ ఎంతకూ తరగడం లేదు. ఆకలి వేస్తున్నది. పైన మాడుస్తూ ఎండ సమస్త శక్తినీ పీల్చివేస్తూ వెచ్చని గాలి. ప్రకృతి పగబట్టి జీవరసాన్నంతటినీ పీల్చి వేస్తున్నట్టున్నది.

మాచమ్మ నడుస్తూనే "ఆ పిట్ట గొంతు ఎంత తియ్యగా వుంది! దాన్ని చూడటమే పడలేదు. అసలది కనిపిస్తేగా? ఆ కళ్ళజోడు వుంటే కనిపించే వుండేది..." అనుకున్నది.

మూడురోజుల క్రిందట...

ఉదయం పదిగంటలవేళ... అవధానిగారి కొడుకు కళ్ళజోడు పెట్టుకుని వసారాలో ఏదో పత్రిక చదువుకుంటూ కూర్చుని వున్నాడు. అవధానిగారికి అరవై ఏళ్ళుంటాయి. కొడుకు వయసు నలభై లోపు... అప్పుడు తాను వసారాలో చివర కూర్చుని వుంది. లోపల యింకా వంట పూర్తయినట్టు లేదు. మాచమ్మ వారి యింటికి అంత దూరమూ నడచుకుంటూ పోతే ప్రేమగానే పలకరించి 'ఇప్పుడు నడిచి అంత దూరం పోలేవు...మాతోపాటు ఇంత తిని చల్లబడ్డాక పోదువుగానిలే మాచమ్మా!"

అన్నాడు అవధానిగారు. మాచమ్మ ఆశించింది అదే! తిండికోసమె ఆమె అక్కడికి వెళ్ళింది. ఆ మాట వినగానే 'సర్లే' అని అలాగే కూర్చుండి పోయింది తిండి మీది ఆశతో! అప్పటికి ఆమె సరిగా తిండి తిని మూడు రోజులయింది. ఆ క్రిందటి సాయంకాలం తిన్న రెండు సీతాఫలాలు తప్ప మళ్ళీ వేరే ఆహారమేమీ లేదు. అవి కూడా ఆ పళ్ళమ్మి సణుగుతూ, గొణుగుతూ ఎంతో బతిమాలగా అప్పుగా ఇచ్చింది. మాచమ్మ వసారా చివర కూర్చున్నదల్లా ఉన్నట్టుండి నవ్వుతూ అవధాని కొడుకుతో "ఏమయ్యా! నీకప్పుడే కళ్ళజోడెందుకూ? పట్టుమని నలభై ఏళ్ళు లేవు. అప్పుడే చత్వారం వచ్చిందా?" అని అడిగింది. అవతల కూర్చున్న అవధాని అది విని నవ్వి "ఏమనుకున్నావు మరి? ఈకాలం తీరె అంత..." అన్నాడు. అవధాని కొడుకు కూడా ఏమీ అనుకోలేదు. నవ్వి వూరుకున్నాడంతే. మాచమ్మ నిట్టూర్చి నెమ్మదిగా, అతని దగ్గరగా జరిగి 'నాకు బొత్తిగా చూపు పోతున్నదయ్యా' అన్నది. అవధాని కొడుకు నవ్వుతూ తన కళ్ళజోడు తీసి 'ఇదిగో ఇది పెట్టుకు చూడవమ్మా!' అన్నాడు. మాచమ్మ దాన్ని వొణుకుతున్న చేతులతో అందుకుని మొహానికి తగిలించుకుంది. చూస్తే బాగానే ఉందనిపించింది. చుట్టూ గోడలూ, గోడలకు కొట్టివున్న పిడకలూ, గోడమీద నిలబడివున్న రెండు మూడు కాకులూ, దూరంగా గాలికి వూగుతున్న చిన్న వేపచెట్టు, వసారా ముందు మందార చెట్టు, దానికున్న ఒకే ఒక ఎర్రని పువ్వు... అన్నీ కనిపించాయి బాగానే కనిపించాయి. ఎన్నాళ్ళకో మళ్ళీ ఈ ప్రపంచాన్ని చూస్తున్నట్టు అనుభూతి కలిగింది. "ఏవమ్మా! బాగా కనిపిస్తున్నదా?" అని అడిగాడతడు. ఆమె కళ్ళు మెరుస్తూ వుండగా తల వూపింది. పేపరు చూస్తే అక్షరాలు తప్ప అన్నీ బాగానే కనిపిస్తున్నాయి. ఇక ఆకళ్ళజోడు తీసి అతనికి యివ్వాలనిపించలేదు. కాని అలా ఎంతోసేపు కొనసాగలేదు. లోపలి నుంచి అవధానిగారి భార్య వచ్చి "వంటయింది... లేవండి. నువ్వూరా, మాచమ్మ! లోపల కూర్చుందువుగాని..." అని పిలవడంతో ఆ కళ్ళజోడు తీసి అతనికి ఇచ్చేసింది. లోపల తండ్రీ కొడుకులిద్దరూ భోజనానికి కూర్చున్నారు. అత్తా కోడళ్ళు వడ్డిస్తున్నారు. మాచమ్మ ఆ పక్కనే గుమ్మంలో ఇవతల కూర్చున్నది. అంతసేపూ ఆమెకు ఒకటే

ఆలోచన. తనకు కళ్ళజోడు కావాలి...అలాటిదే కావాలి... ఆ కళ్ళ జోడు పక్కదిమ్మలు రెండూ సన్నగా వుండి కాస్త మాసినా వెండితో చేసినట్టున్నాయి.

మాచమ్మ 'అమ్మయ్య' అనుకుంది తాను వూళ్ళోకి వచ్చేసింది. అక్కడొక యిల్లూ...అక్కడొక యిల్లూ...మొత్తం వూరంతా కలిపితే పాతిక యిళ్ళుంటాయి. ఒక్కటే మంచినీళ్ళ బావి... వూరవతల ఉన్న ఎర్రమట్టి మైదానాన్ని 'చెరువు' అంటూ ఉంటారు. అందులో ఎప్పుడూ నీళ్ళుండవు. ఇతర ప్రపంచమంతా మునిగిపోయే వర్షం కురిస్తే అప్పుడీ చెరువు నిండుతుందేమో! పాతబడిన ఇళ్ళు...పాత గోడలు... వీధిలో రెండేళ్ళ క్రితం చచ్చిపోయిన అహ్మద్‌గాడి గుర్రం, కృశించిపోయి ఎముకలపోగై వొంటిమీద వాలే ఈగలను తోలుకునేపాటి శక్తి కూడా లేక నీరసంగా పడుకుని వుంది.

మాచమ్మ నడుస్తున్నదల్లా ఆగిపోయింది. ఎదుటగా పళ్ళమ్మి నెత్తిన బుట్టతో నిలబడివుండి "ఏం తల్లీ! 'రేపిస్తాను చూసుకో!' అని పళ్ళు తీసుకున్నావు. డబ్బులేవీ?" అని అడుగుతున్నది.

మాచమ్మ "నువ్వా? ఎవరో అనుకొన్నాను. ఇస్తాన్లే డబ్బులు..." అన్నది.

"ఆ! ఇస్తావిస్తావు. ఎప్పుడిస్తావు? 'రేపు' అని ఆ గోడమీదరాసుకోమంటావా?" అని సణుగుతూ వెళ్ళిపోయింది పళ్ళమ్మి.

మాచమ్మ 'అమ్మయ్య' అనుకుని గండం గడిచినట్టు నిట్టూర్చి ముందుకు సాగింది.

అవధానిగారి ఇల్లు...వసారాలో ఎవరూ కనబడటంలేదు. మళ్ళీ యింతలో వచ్చానని చులకన చెయ్యరుకదా? ఏమీ చెయ్యరు. అవధాని భార్యా కొడుకూ ఎంతో మంచివాళ్ళు. ఆ మాటకొస్తే అవధాని కోడలు మాత్రం ఎంత మంచిది! రత్నంలాంటి మనిషి...మాచమ్మ మొగుడు

బ్రతికుండగా అవధానీ ఆయనా ఎంతో కలుపుగోలుగా, స్నేహంగా ఉండేవారు. నిజమే మరి! ఇద్దరూ కలిసి ఆ రోజుల్లో జైళ్ళకు వెళ్ళి ఆస్తులు పాడుచేసుకున్నవాళ్ళేగా! అయినా అవధానికి ప్రచారం మీద మోజు లేదు. అతని పేరు ఎవరికీ తెలియదు. దేశ స్వాతంత్ర్యం కోసం త్యాగాలు చేశానని చెప్పి సన్మానాలూ, బిరుదులూ, తామ్రపత్రాలూ అందుకున్న వాళ్ళలో ఆయన లేడు. ఆయన పేరు ఎప్పుడూ పైకిరాలేదు.

మాచమ్మ వీధి గుమ్మం దాటి లోపలికి వచ్చింది. ఇంట్లో ఎవరూ ఉన్నట్టు లేరు. మాచమ్మ మెల్లెక్కి వసారాలోకి వచ్చి తలుపు తట్టింది. అవధానిగారి మనుమరాలు...పదిహేనేళ్ళపిల్ల లోపలినుంచి "ఎవరది? వొస్తున్నా..." అనడం వినిపించింది. మరుక్షణంలో తలుపు తెరచు కుంది. ఆ అమ్మాయి "నువ్వా రా..." అన్నది మాచమ్మను చూసి.

ఆమె లోపలికి వచ్చి "ఏం అమ్మడూ! ఇంట్లో ఎవరూ లేరా? అమ్మా! నాయనమ్మా వాళ్ళు ఏరీ?" అని అడిగింది కూర్చుంటూ.

ఆ అమ్మాయి దిగులుగా "అందరూ పొద్దున్నే బస్సులో పట్నం పోయారు. మా నాన్నకు నిన్న రాత్రి పెద్ద జబ్బు చేసింది. ఆస్పత్రికి తీసుకుపోయారు..." అన్నది. ఈమాటలు చెప్పేటప్పుడు ఆ అమ్మాయి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

మాచమ్మ గుండె దడదడ లాడింది. "ఏమిటే... ఏమయింది? సరిగా చెపు..." అన్నది

"ఏముందీ! నిన్నరాత్రి మామూలుగా భోజనంచేసి ఆరుబయట పడుకున్నాడు. కాస్సేపు నిద్రపోయాడు కూడా. అర్ధరాత్రి వేళ పెద్దగా అరుచుకుంటూ లేచాడు. గుండె పట్టుకుని "నొప్పి నొప్పి..." అని మెలి కలు తిరిగిపోయాడు. ఆచారిగారొచ్చి చూసి ఏదో మందిచ్చాడుగాని ఏమి తగ్గలేదు. గుండెజబ్బుట. పట్నం పెద్దాసుపత్రికి తీసుకుపోయారు..." అన్నదా అమ్మాయి.

"అయ్యయ్యో! ఎంతపని జరిగిందే మాతల్లీ!" అన్నది మాచమ్మ. ఆమె గుండె దడ తగ్గలేదు. గొంతు పట్టుకున్నట్టయింది.

గుండె జబ్బు! అంటే ఏమిటో! గోడగడియారంలాగా టక్కు టక్కున కొట్టుకుంటూ వుండే గుండె ఉన్నట్టుండి ఆగిపోవడమేనా? ఎందుకలా అవుతుంది? అంతే... మరి... పక్షి ఎగిరిపోయే వేళకు ఏదో నెపం కావాలి. మోకాలి లోతు నీళ్ళలో మునిగి చచ్చిపోయిన వాళ్ళున్నారు. తేలు కుట్టి ప్రాణాలు విడిచిన వాళ్ళున్నారు. చిన్న దెబ్బకే నేలకూలిన వాళ్ళున్నారు... తిన్న ఆహారం విషమై పోయిన వాళ్ళున్నారు. ఏమీ లేకుండానే పోయిన వాళ్ళున్నారు. ఈ గుండె జబ్బులనేవి తను చిన్న తనంలో ఎరగదు. ఇప్పుడందరికి అవే...

మాచమ్మ అలాగే కూర్చుండి పోయింది. మాటిమాటికీ 'అయ్యయ్యో! ఎంతపని జరిగిపోయింది!' అని నొచ్చుకుంటూ కూర్చుండి పోయింది. ఆ అమ్మాయి లోపలికి వెళ్ళి పని చూసుకుంటున్నది.

మాచమ్మ పక్కనే ఉన్న పుస్తకం చేతిలోకి తీసుకుని కళ్ళకు దగ్గరగా ఉంచుకుని చూసింది. అది పాత పెద్దబాలశిక్ష. కొన్ని కాయితాలు చిరిగి పోయాయి. పై కాయితాలు కూడా మూలల కుక్క చెవులుపడి చిరిగిపోయేందుకు సిద్ధంగా ఉన్నాయి. మాచమ్మ చిన్నప్పుడు పెద్దబాలశిక్ష చదువుకున్నది. ఆమె బలహీనమైన వ్రేళ్ళతో పేజీలు తిప్పుతూ కూర్చుని అంతలో ఉన్నట్టుండి, లేచి లోపలికి వెళ్ళి "అమ్మాయ్! నేను పెద్దబాలశిక్ష చదువుతూ కూర్చుంటాను" అన్నది.

'అలాగే' అన్నదా అమ్మాయి.

"కళ్ళు బొత్తిగా కనబడటం లేదే..." అన్నది మాచమ్మ మళ్ళీ.

ఆ అమ్మాయి నవ్వుతూ "పోనీ చదవటం మానేసి ఇక్కడ కూర్చుని కబుర్లు చెప్పరాదూ?" అన్నది.

మాచమ్మ ఒక్క క్షణం ఊరుకుని "మీనాన్న కళ్ళజోడెక్కడ పెట్టావ్? ఒక్కసారి యివ్వు. అది పెట్టుకుంటే బాగా కనిపిస్తుంది నాకు" అన్నది.

ఆ అమ్మాయి లేచి చేతులు కొంగుకు తుడుచుకుంటూ "బల్ల మీదే ఉంటుంది. అక్కడే పెట్టాడు రాత్రి పడుకోబోయేముందు. ఉండు

తెచ్చి యిస్తాను" అంటూ ఇవతలికి వచ్చి బల్లమీది కళ్ళజోడు అందుకుని మాచమ్మ చేతి కిచ్చింది.

మాచమ్మ దాన్ని భద్రంగా అందుకుని మొహానికి తగిలించుకుని పుస్తకం చదువుతూ కూర్చుంది. చైత్రము, వైశాఖము... వగైరా. ఈ పన్నెండున్నూ తెలుగు మాసముల పేర్లు... జనవరి... ఫిబ్రవరి... వగైరా ఈ పన్నెండున్నూ ఇంగ్లీషు మాసముల పేర్లు... షట్చక్రవర్తులు ...పంచమహా పాతకములు... సప్త ద్వీపములు... అబ్బో! తానిదంతా ఎప్పుడు చదివింది? ఎన్నేళ్ళ క్రిందటి మాట! అప్పుడు జీవితమంతా పచ్చపచ్చగా హాయిగా వుండేది. ఎన్ని పండగలు? ఎన్ని శ్రావణ మాసాలు! ఎన్ని వర్షాలు? ఎన్ని ఎండలు? ఎన్ని పూలు?... ఆ బంగారు కాలమంతా ఏ గంగలో కలిసిపోయింది? ఆ పూలరంగులన్నీ ఏమైపోయాయి? అసలా పూలన్నీ ఏమై పోయాయి?

మాచమ్మ అంతలో ఆవులించింది. బయట ఎండ నిప్పులు చెరుగుతున్నది. కాకి ఒకటి వోపిక లేక కావు కావుమని మొర పెట్టు కుంటూ నీరసంగా ఎగిరి పోతున్నది. మాచమ్మ మళ్ళీ ఆవులించింది. లోపల ఆకలి.

అంతలో ఆ అమ్మాయి లోపలి నుంచి వచ్చింది... వస్తూనే మాచమ్మతో "పదకొండు గంటలు దాటింది. వీళ్ళింకా రాలేదు మరి..." అన్నది.

"నువ్వు వెళ్ళి కాస్త ఎంగిలిపడు తల్లీ! వస్తార్లే. దగ్గరా, దాపా? పది మైళ్ళు పోయి రావొద్దూ? అక్కడ ఏం చెప్పారో ఏమో?" అన్నది మాచమ్మ తాను కూడా లేవబోతూ.

"నువ్వూరా అయితే, ఇద్దరం తిందాం..." అన్నదా అమ్మాయి.

"మా అమ్మే... మా తల్లే... పద..." అన్నది మాచమ్మ.

లోపల మాచమ్మకు విస్తరివేసి ఆ అమ్మాయి కంచం పెట్టుకుని వడ్డనకు ఉపక్రమిస్తూ, "ఇవ్వాళ ఏమిటో అంతా పిచ్చిగా వుంది. ఏమీ

తోచడం లేదు. అందుకే ఏమీ చెయ్యలేదు. అన్నం వండి వూరుకున్నాను పచ్చళ్ళున్నాయిలే..." అన్నది.

"పోన్లే అమ్మ! ఇంత దిగులుతో ఎవరేం చెయ్యగలరు? ఏం వేసుకున్నా పూట గడిచిపోతుంది. అయినా వీళ్ళు త్వరగావస్తే బాగుండే పోను. ఈ ఆందోళన కష్టమే మరి..." అన్నది మాచమ్మ.

ఆ అమ్మాయి అన్నం కలుపుకుంటూ "ఆ కళ్ళజోడు పెట్టుకుంటే బాగా కనిపిస్తున్నదా?" అని అడిగింది.

మాచమ్మ "అయ్యో తల్లీ! ఎంతో బాగుందే... చక్కగా కనిపిస్తు న్నాయన్నీ...నేనే ఉంచేసుకుంటే బాగుణ్ణనిపిస్తున్నది" అన్నది.

ఆ అమ్మాయి నవ్వి "పోనీ తీసేసుకో...మా నాన్న మళ్ళీ వేరే మరోటి కొనుక్కుంటాడులే...ఇది పాతబడిపోయింది కూడా...కావలిస్తే నేను చెప్తాలే ఆయనకు..." అన్నది.

మాచమ్మ మొహం విప్పారింది. కళ్ళు మెరిశాయి.

భోజనాలు ముగించి చేతులు కడుక్కొని వంట యిల్లు బాగుచేసి ముందు గదిలోకి రాగానే మాచమ్మకు నిద్ర ముంచుకు వచ్చింది. వొట్టి నేలమీద గుమ్మం తలగడగా నడుంవాల్చి చల్లగా వుండమ్మా అంటూనే కళ్ళు మూసుకున్నది.

ముందు మూసిన కళ్ళ ముందు తెరలు దిగినట్టయింది. మనస్సు రెక్కలు కట్టుకుని ఏవో అజ్ఞాత లోకాలలోకి ఎగిరి పోయినట్టయింది. అంతటా చీకటి అయితే అందులో ధగధగలాడుతున్న బంగారు సింహాసనం మీద చేతులు చాపిన నిద్రా దేవత. మాచమ్మకు గాఢంగా నిద్రపట్టింది.

ఆమెకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. లేచి చూసి కొయ్యబారి పోయింది.

అవధానీ, భార్యా, కోడలూ లోపలికి వస్తున్నారు. బండిలో నుంచి ముద్దయ ముగ్గురు శవాన్ని దింపుతున్నారు. అవధానిగారు ఏడుస్తున్నారు

గాని పైకి వినపడటం లేదు. ఆడవాళ్ళిద్దరూ అంతవరకూ దుఃఖం ఎలా బిగబట్టుకున్నారో అనూహ్యం. వాకిటి ముందుకు రాగానే ఒక్కసారి కట్టలు త్రెంచుకున్నట్టయి నేలమీద పడి దొర్లుతూ ఏడవసాగారు. చుట్టు పక్కలవాళ్ళు చేరారు. అందరి ముఖాలలోనూ దిగ్భ్రాంతి..అపనమ్మకం. మాచమ్మ నిలువెల్లా వొణికిపోతూ లేచి వారి దగ్గరికి వెళ్ళి "నా తల్లీ, ఏమిటే...ఎందుకే, ఎందుకింత అన్యాయం జరిగిపోయిందే...వూరు కోండి... లేచి లోపలికి రండి..." అంటూ ఏమిటేమిటో మాట్లాడింది. కాని చెట్టంత కొడుకును పోగొట్టుకున్న ఆ తల్లి దుఃఖం ఆపడం తరమా? బంగారంలాంటి భర్తను పోగొట్టుకున్న ఆ యిల్లాలి దుఃఖం ఆపడం తరమా ?

వారూ, వీరూ చేరి కట్టెను వసారాలో పడుకోబెట్టారు. అతడింకా నవ్వుతూనే ఉన్నట్టున్నాడు. గుండెల వరకూ గుడ్డ కప్పారు. తలక్రింద చిన్న దీపం పెట్టారు కాళ్ళ బొటనవ్రేళ్ళు రెండూ కలిపి దారంతో కట్టారు. ఇక రెండు మూడు గంటలసేపు వచ్చేవారూ, పోయేవారూ... ఏడపులు, పెడబొబ్బలు...వూరంతా ఇంటి ముందుకు చేరినట్టయింది.

మరో పక్కన ఏర్పాట్లన్నీ జరిగిపోతున్నాయి. ఆ మనిషి మనం ఎంతగా ప్రేమించే వాడయినా వాడే మనకు సర్వస్వం అయినా మరే మయినా సరే శవాన్ని ఇంట్లో పెట్టుకుని ఎల్లకాలం ఉండలేము కదా! దాన్ని బండెడు కట్టెలపాలుచేసి రాక తప్పదు.

ఎవరో అయిదు గంటలవేళ లేచి "ప్రొద్దుకూకుతున్నది... కానివ్వండి... అవధానీ! కానివ్వు...ఇక అలా కూర్చోకు... లేవండి... మింగేసేయ్ అంతా...కావలసిన పన్లు చూడు" అన్నారు.

ఆ తర్వాత అన్నీ వరుసగా జరిగిపోయాయి. శవాన్ని స్నానం మాడించి, ఏడుకట్ల సవారిమీద వేసుకొని తీసుకు పోయారు. మరీ పాడె లేచే వేళకు ఆ ఆడకూతుళ్ళను పట్టశక్యం కాకపోయింది. మాచమ్మ కళ్ళలో నీళ్ళన్నీ ఇంకిపోయాయి. అలాగే వొణుకుతున్న గొంతుకతో వాళ్ళను వోదారుస్తూ ఉండిపోయింది.

కాస్సేపటిలో ఇల్లంతా బావురుమంటున్నది. ఇంకా ఏడుపులూ, వెక్కిళ్ళూ వినబడుతూనే ఉన్నాయి. కాకులు కొన్ని అనవసరంగా ప్రహరీ గోడ మీద సమావేశమై గొడవ చేస్తున్నాయి.

మాచమ్మ బయలుదేరింది. "పోస్తాను తల్లీ ! రేపు మళ్ళీ వస్తానులే...ఇంక ఊరుకో... పోయిన వాళ్లు తిరిగి వచ్చేది లేదు కదా? వూరుకో...దేవుడు చూడలేక పోయాడు..." అన్నది.

అవధాని భార్య తలవూపి ఊరుకుంది. కోడలు తల ఎత్తి ఒకసారి మాచమ్మ ముఖంలోకి చూసి మళ్ళీ తల దించుకుంది.

మాచమ్మ వీధిలోకి వచ్చి నడవటం ప్రారంభించింది. సాయంకాలపు ఎండ...పక్షులు పగలల్లా అలసిపోయి గూళ్ళకు చేరుకుంటున్నాయి.

ఆమె త్వరత్వరగా నడవసాగింది. చీకటిపడే లోపుగా గూటికి చేరుకోకపోతే కష్టం...అలా నడుస్తూ ఉండగానే వున్నట్టుండి మాచమ్మ శరీరం భయంతో ఒక్కసారి జలదరించింది. ఆమె అంతలో నవ్వుకుని "నాకు ఇంతలో రాదు చావు...దానికీభయమే నేనంటే..." అనుకున్నది.

కాలిబాట ప్రక్కన నాగజెముడు పొదలో మళ్ళీ పొద్దుటి పక్షి కూత వినిపించింది. మాచమ్మ ఆగి చూసింది. అది యిప్పుడు బాగానే కనిపించింది. కాని నల్లగా ఎంతో అసహ్యంగా వుంది. చీకటిని ముద్ద చేసినట్టున్నది.

ఆమె చెయ్యి అంతలో కళ్ళజోడు మీదికి పోయింది. "అరె! ఇంతసేపూ ఇది గుర్తేలేదు. మరిచిపోయాను. వాళ్ళేమనుకుంటారో ఏమో! ఎంత పొరపాటు జరిగిపోయింది." అనుకున్నది. మళ్ళీ వేగంగా నడుస్తూ అంతలోనే "పోన్లే. అంత దుఃఖంలో వాళ్ళకిదే పట్టిందా ? అంతగా అయితే రేపెప్పుడయినా మళ్ళీ వెళ్ళినప్పుడు అవధానితో ఒకమాట చెప్తే సరిపోతుంది...నువ్వే ఉంచేసుకోవమ్మా! అంటాడు..." అనికూడా అనుకున్నది.

ఉప్పరిసిన గోడల సందు మలుపు తిరుగుతూ ఉండగా సందె

చీకటిలో ఇద్దరు పిల్లలు ఒకరినొకరు తరుముకుంటూ వచ్చి మాచమ్మను ఢీకొన్నారు. ఆమె కంగారులో భయంతో అటూ యిటూ పరుగెత్తి వీధి పక్కన పడిపోయింది.

"గాడిదల్లారా! బుద్ధిలేని వెధవల్లారా" అని తిడుతూ వుంటే వాళ్ళిద్దరూ వచ్చి ఆమె చేతికర్ర అందించి చెరొక రెక్కా పట్టుకుని లేవదీసి "పొరపాటయింది పెద్దమ్మా" అన్నారు.

ఆమె వాళ్ళను ఇంకా తిడుతూనే కింద పడిన కళ్ళజోడు కోసం వెదికింది. అది ఎక్కడా కనబడలేదు.

ఆ పిల్లలు "ఏమిటి పెద్దమ్మా, వెతుకుతున్నావు" అని అడిగారు.

మాచమ్మ ముందు కోపంతో 'నా బొంద' అన్నదేగాని తర్వాత 'కళ్ళజోడు ఎక్కడో పడిపోయింది...' అన్నది.

వారిద్దరూ వెదికారు. ఒకడు దాన్ని పక్కన ఉన్న గుట్ట పైనుండి తీసుకొచ్చి భయం భయంగా, 'ఇదిగో!' అని ఆమె చేతికి అందించాడు. మాచమ్మ ఆత్రంగా దాన్ని అందుకుంది. కాని ఏం లాభం? ఎప్పుడో కట్టబోయే యింటి కోసం రాళ్ల మాత్రం తోలించుకున్న ఆచారిగారి పుణ్యమా అని అద్దాలు రెండూ పగిలిపోయాయి. వొట్టి ఫ్రేము మాత్రం మిగిలింది ఆమె చేతిలో.

ఆమె ఇక వారిని తిట్టలేదు. నెమ్మదిగా మసక చీకట్లో తడువు కుంటూ గుమ్మం దాటి లోపలికి వెళ్ళి చిన్న బుడ్డి దీపం వెలిగించింది. కాస్సేపు ఒక పక్కన కూర్చున్నది.

ఆ తర్వాత చిమ్మచీకటి వ్యాపించింది. అంతటా నల్లని ముసుగు భూమ్మీద పరిచినట్టు, అజ్ఞానం కమ్ముకున్నట్టు...

మాచమ్మ లేచి వెళ్ళి కాసిని మంచినీళ్లు తాగి వచ్చి కొంగు పరుచుకుని పడుకుండిపోయింది. ఆమె చేతిలో కళ్ళజోడు ఫ్రేమున్నది. మనసులో కాస్సేపు ఏదో తెలియని భయం...అలజడి... తర్వాత మళ్ళీ ప్రశాంతత...నిద్ర...మధ్యలో మాత్రం ఒక చిన్న కల... అందులో కాకులు గుంపులు, గుంపులుగా కనిపించాయి.

# అలజడి

కిటికీ బాగా ఎత్తుగా వుండటంవల్ల అతనికి కనిపించడం లేదుగాని ఆకాశం ఘోరమైన రణరంగంలా వుంది. మబ్బులు గుమిగూడి గర్జిస్తున్నాయి. సన్నగా జల్లు పడుతున్నది. మరి కాస్సేపటిలో కుంభ వృష్టి తప్పదనిపిస్తున్నది. జలార్ద్రమైన నల్లని మబ్బుల వెనుక గొప్ప కోలాహలం. అలజడి...

బయట బరువైన బూట్ల సవ్వడి...

మోకాళ్ళ చుట్టూ చేతులు కట్టుకుని కూర్చున్న గాంధీ తల ఎత్తి చూశాడు. కటకటాల అవతల వరండాలో నిలబడి బీడీ కాల్చుకుంటు న్నాడు అప్పలస్వామి. రెండు దమ్ములు పీల్చి, వరండా క్రిందికి ఉమ్మి వేసి, వెనుదిరిగి కటకటాల దగ్గరగా వచ్చి నవ్వుతూ "ఏం బాబూ! నిద్ర పట్టలేదా" అని అడిగాడు గాంధీని.

గాంధీ తల అడ్డంగా ఊపాడు. అప్పలస్వామి మళ్ళీ ఏదో మాట్లాడబోయి అంతలోనే విరమించుకుని నెమ్మదిగా నడిచి వెళ్ళి పోయాడు. అతని బూట్ల సవ్వడి వరండాలో క్రమంగా దూరమైపోయింది.

గాంధీ ఉన్నట్టుండి లేచి కళ్ళజోడు తీసి తుడుచుకుని ఆ చిన్న గదిలో చేతులు వెనక్కు కట్టుకుని అటూ యిటూ పచార్లు చెయ్యడం ప్రారంభించాడు.

బయట వర్షం కొంచెం పెద్దదయింది. బుల్లిపిట్ట ఒకటి— దాని రంగు ఏదో సరిగా తెలియడం లేదు. అంత రాత్రివేళ ఎందుకు వచ్చిందో మరి, కిటికీలో నిలబడి సన్నగా అరుస్తున్నది. అది బహుశా పూర్తిగా తడిసిపోయి ఉండాలి. గాంధీ ఆగి చూశాడు. ఒక నిముషం గడిచి.

వుంటుంది. ఆ పిట్ట, పాపం లోపలికి వస్తే బాగుండుననిపించింది. కాని అది రాలేదు. కొద్ది క్షణాల్లో చిన్న చిన్న రెక్కలు విదిలించుకున్న ధ్వని. ఆ వెనువెంటనే అది ఎగిరిపోయిన మృదువైన సవ్వడి... ఆ తర్వాత అంతా నిశ్శబ్దం...

కిటికిలోనుంచి ఆకాశం, కత్తిరించిన నల్లని కాగితం ముక్క లాగున్నది. కిటికీ అవతల ఏమున్నదో తెలియదు. బహుశా, అది అంతా ఖాళీ స్థలం కావచ్చు. ఆ పైన బలమైన కొండరాళ్ళతో కట్టబడిన ఎత్తయిన ప్రహరీ గోడ ఉండే వుంటుంది. ఆ ప్రహరీ పైన గాజు పెంకులు దట్టంగా బిగించబడి వుంటాయి.

ఎక్కడో గంటలు కొడుతున్నారు. గాంధీ ఆగి చెవులు రిక్కించి వింటూ, వ్రేళ్ళు మడుస్తూ లెక్క పెట్టాడు. మొత్తం తొమ్మిది గంటలే వినిపించాయి. ఇప్పుడు తొమ్మిదేనా అయింది? కాదు. బహుశా గాలివాలు కారణంగానూ, వర్షపు జల్లు మూలంగానూ, కొన్ని గంటలు తనకు వినబడి వుండవు.

మళ్లీ అప్పలస్వామి వరండాలో నడిచి వచ్చాడు. అతడు గాంధీ వంక ఆ సన్నని వెలుతురులో ఒకసారి చూసి కటకటాలమీద చేతితో మీటుతూ 'ఇవాళ కోర్టులో ఏమయింది?' అని అడిగాడు.

గాంధీ చేతివ్రేళ్లు విరుచుకుని చప్పరించి 'ఏమీ కాలేదు...' అన్నాడు.

'అంటే విచారణ జరగలేదా?'

'జరిగింది...'

'అదే ఏం జరిగిందీ అని అడుగుతున్నాను!'

గాంధీ నుదురు తుడుచుకున్నాడు. ఒక్క క్షణం ఆగి నెమ్మదిగా 'ఏమీ జరగలేదు. అన్నట్టు కాసిని కాయితాలూ, కలమూ కావాలని అడిగా కదా! ఎప్పుడిస్తారు?' అని అడిగాడు.

అప్పలస్వామి అనునయంగా చూశాడు. తర్వాత 'అడిగాను... వీల్లేదన్నారు. అవి అంత అవసరమా?' అన్నాడు.

'అవసరమే...చాలా రాసుకోవాలి...ఎన్నో విషయాలు బుర్రను పాడుచేస్తున్నాయి. రాసుకునే వీలుంటే బాగుండిపోను. నా పుస్తకాలూ, నేను రాసుకున్న కాయితాలూ అన్నీ ఏం చేశారో ఎవ్వరూ చెప్పడం లేదు. అన్నీ నాకు ముఖ్యమైన సైన్సు పుస్తకాలు' అన్నాడు గాంధీ చాప మీద కూలబడుతూ.

అప్పలస్వామి 'అవన్నీ నీకు ముఖ్యం... కాని వాళ్ళకు మాత్రం అవేవీ పట్టవు. ఒక్క కాయితమే వాళ్ళకు ముఖ్యం... ఆ చిన్న చీటీ... ఉత్తరం....' అని ఒక్క క్షణం ఆగి పక్కకు చూస్తూ 'ముసురు బాగా పట్టింది. ఇప్పట్లో తగ్గేట్టు లేదు...' అన్నాడు.

తర్వాత మళ్ళీ 'ఆ ఉత్తరంలో ఏం రాశావు?' అని అడిగాడు.

గాంధీ మాట్లాడలేదు. అతని కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. మనసులో ఏదో అజ్ఞాత కంఠం దిగులుగా గుసగుసలాడుతున్నట్టున్నది.

'గాంధీ అనబడే నేను...ఎం. ఎస్. సి...న్యూక్లియర్ ఫిజిక్స్... యూనివర్శిటీ మొత్తంమీద సెకండ్... నిరాశా నిస్పృహలతో జీవితంలో ఓడిపోయి ..నిరుద్యోగిగా బ్రతకలేక...జీవితాన్ని అంతం చేసుకుంటు న్నాను. నాకు ఎవ్వరూ లేరు...కావలసిన వారూ లేరు...శత్రువులూ లేరు.. నా చావు కెవరూ బాధ్యులు కారు... ఎవరినీ నిందించను... నా అంతట నేను స్వయంగా చచ్చిపోతున్నాను.' (అవును. ఈ వాక్యం కూడా వ్రాశాడు. అయినా ఇదేం వాక్యం?)

గాంధీ ఏమీ మాట్లాడకుండా నిశ్శబ్దంగా కూర్చుండిపోయేసరికి అప్పలస్వామి ఒకసారి నిట్టూర్చి మళ్ళా వరండాలో నడుచుకుంటూ వెళ్ళి పోయాడు.

గాంధీ చాపమీదకి వొరిగి గోడ కానుకుని కళ్ళు మూసుకున్నాడు. అంతేనా తాను ఆనాడు వ్రాసింది? బహుశా అంతే... కాకపోతే ఇంకా నాలుగైదు అర్థరహితమైన వాక్యాలు వ్రాశాడేమో గుర్తులేదు—అప్పుడు తన మనసంతా ఇప్పటి ఆకాశంలాగే ఘోరంగా అస్తవ్యస్తంగా అరణ్యంలా వుంది. భయంకరంగా కూడా వుంది.

గాంధీ మళ్ళీ కళ్ళజోడు తీసి మాసిన లాల్చీ చివరతో అద్దాలు తుడుచుకుని మళ్ళీ మొహానికి తగిలించుకున్నాడు. తల తిప్పి గోడవంక చూస్తూ కూర్చున్నాడు. అకస్మాత్తుగా ఆ గుడ్డి వెలుతురులో అతనికి ఆ గోడమీద పెన్సిలు గీతలు కనిపించాయి. కళ్ళు చిట్లించి జాగ్రత్తగా చూశాడు. ఎవరు, ఎప్పుడు గీశారో మరి—

ఒకసున్నా—అది తల—రెండు గీతలు—అవి చేతులు—తొడలు మాత్రం లావుగా గీశారు. వక్షస్థలాన్ని సూచిస్తూ మళ్ళీ రెండు పెద్ద సున్నాలు— అవి సహజంగా, పెద్దవిగా ఉన్నాయి. అంతే—ఇంకేమీ లేదు.

అతడు అప్రయత్నంగా నిట్టూర్చి మోకాళ్ళ మధ్య తల పెట్టుకుని కూర్చున్నాడు. అతనికి హఠాత్తుగా తల్లి గుర్తుకు వచ్చింది. పదేళ్ళ క్రిందట— అవును. సరిగ్గా పదేళ్ళ— ఆమె చనిపోయే ముందు ఎలా వుండేదో గుర్తుచేసుకునే ప్రయత్నం చేశాడు. అప్పటికి ఆమెకు బహుశా నలభై ఏళ్ళుంటాయేమో! దుఃఖభారంవల్ల పేదరికంవల్ల మనిషి జవసత్వాలు కోల్పోయి చాలా ముందుగానే వృద్ధురాలై పోయింది. అకాల వార్ధక్యం ఆమెను లొంగదీసుకుని అశక్తురాలిని చేసింది. ఒకనాడు— తాను బడిలో వుండగా— మధ్యాహ్నం సూర్యుడు నిప్పులు చెరిగేవేళ— అట్టే బాధపడకుండానే చనిపోయింది. అది మొదటిసారి అతడు శవాన్ని చూడటం—తండ్రిని యెరుగడు— తాను తల్లి కడుపులో ఉండగానే తండ్రి చనిపోయాడు. వాళ్ళూ, వీళ్ళూ చెప్పుకోడం మాత్రం గుర్తు— ఆయనను గురించి అందరూ జాలిగా, సానుభూతిగా మాత్రమే అనుకుంటూ వుండేవారు. ఒక్క ఋణదాత తప్ప— అదీ అయిదువందల రూపాయలే —తన తల్లి తర్వాత రెండేళ్ళకు గాని ఆ అప్పు తీర్చలేకపోయింది. ఎవరో ఒక ముసలాయన తన తండ్రిని గురించి మాట్లాడటం అతనికి బాగా గుర్తున్నది. 'పాపం! మంచివాడు. కలియుగంలో ఉండవలసిన మనిషి కాదు. "సొతంత్రం—సొతంత్రం—" అంటూ వున్నదంతా కరిగించుకుని, జైళ్ళకుపోయి, లాఠీ దెబ్బలు తిని, నానాబాధలు పడ్డాడు. ఏం మిగిలింది? ఏం సాధించాడు? ఏమీలేదు. పైగా మిమ్మల్ని దిక్కు

లేని పక్షులను చేశాడు.' బహుశా అప్పుడు అమ్మ అక్కడ కళ్ళనీళ్లు పెట్టుకుని నిలబడివుంది. తానూ అప్పుడు అక్కడే వున్నాడు. పోనీ, చూద్దామంటే, తండ్రి ఫొటో కూడా ఏదీ మంచిదిలేదు. ఒక పాత గ్రూప్ ఫొటో–ఆయన కాలేజీలో చదువుకుంటుండగా తీయించుకున్నది— ఉన్నది కాని అందులో మొత్తం నలభైమంది పైగా ఉన్నారు. ఫొటో పట్టనట్టు కిటకిటలాడుతున్న అంతమందిలోనూ, 'ఇదుగో. వీరే మీ నాన్న...' అని ఒకసారి తల్లి చూపించింది. కాని ఆ బొమ్మ చాలా చిన్నది. తల తప్ప ఏమీ కనిపించలేదు. ఆ కళ్లు మాత్రం చెంపకు చేరెడేసి వున్నాయి. భవిష్యత్తులోకి ఆశగా, అద్భుతంగా చూస్తున్నట్టు ఉన్నాయవి. తనవీ అచ్చం అవే కళ్ళని అమ్మ ఎన్నోసార్లు అన్నది.

గాంధీకి అంతలో అనవసరంగా నవ్వు వచ్చింది. తాను కడుపులో వుండగా తనతండ్రి స్వాతంత్ర్యోద్యమంలో సుస్మరంగా, నిర్విరామంగా తిరిగాడు. తనకు కూతురు పుడితే 'స్వరాజ్యలక్ష్మి' అనీ; కొడుకు పుడితే 'మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ' అని పేరు పెట్టాలన్నాడు. 'పెద్దల పేర్లూ, దేవుళ్ళ పేర్లూ అసలు వొద్దు పొమ్మ'న్నాడు. ఇన్నీ అని తాను పుట్టకముందే పోయాడు.

బయట రణగొణ ధ్వని. కాటుక కొండలవంటి మేఘాల చాటున ఫిరంగులు మ్రోగుతున్నట్టున్నది. ఉరుములు... మెరుపులు...

ఎనిమిది, తొమ్మిది నెలల క్రిందట...తాను అప్పటికే కనిపించిన ప్రకటన లన్నిటికీ అప్లయిచేసి వున్నాడు. మొదటిసారి ఒక చిన్న, కొత్త కాలేజీకి ఇంటర్వ్యూకు వెళ్ళిన ఉదంతం గుర్తుకు వచ్చింది. ఆలస్యంగా వచ్చిన రైల్లో ఆ వూళ్ళో దిగేసరికి వర్షం... సన్నగా ప్రారంభమై అంతలోనే పెద్దదయింది. కాస్సేపు స్టేషన్లో తలదాచుకుని తర్వాత వూళ్ళో వారినీ వీరినీ అడుగుతూ చివరకు పొలాలగట్లవెంట నడిచి కాలేజీకి పోయాడు. బురదలో నడుస్తూవుండగా తాను అనుమానిస్తున్నట్టే చెప్పు తెగింది. శుభ్రంగా తడిసి ముద్దయిపోయి వున్నాడు. చేతిలో సర్టిఫికెట్లు, టెస్టిమోనియల్సుతో నిండిన సంచీ తెగిన చెప్పు, చప్పగా తడిసి నిలువెల్లా నీళ్లుకారుతూ తాను కాలేజీ చేరుకున్నాడు.

కాలేజీ అంటే చుట్టు తాటాకుల పాకలు...వాటిలో రొదచేస్తూ విద్యార్థులు మధ్యలో కొంచెం దిట్టమయిన చిన్న కట్టడం...తాను అక్కడికి చేరు కున్న కొద్ది క్షణాల్లోనే విద్యార్థులందరూ 'పాకలు కురుస్తున్నాయి... సెలవు కావాలి...' అని ప్రిన్సిపాలు గదిముందు వర్షంలో నిలబడి నినాదాలుచేసి అయిదు నిముషాల్లో సెలవు సంపాదించుకుని ఎటువారటు పోయారు. అంతా సద్దుమణిగిన తర్వాత తాను ప్రిన్సిపాల్‌ను కలుసు కుంటే ఆయన చప్పరించి 'ఆలస్యమైపోయింది... అప్పాయింట్ మెంట్ జరిగిపోయింది...' అన్నాడు. తర్వాత తెలిసింది-అదిముందే నిశ్చయమై పోయిన విషయం. కాకపోతే ఇంటర్వ్యూ అనేది ఒక తప్పనిసరి ప్రహసనం... కేవలం తమాషా...అంతే...

గాంధీ అనవసరంగా దగ్గి చాపమీదికి జారి పడుకున్నాడు. కళ్లు మూసుకున్నా నిద్ర పట్టడంలేదు. మళ్ళీ రేపు కోర్టుకు తీసుకుపోతారు. ఇవాళ ఎక్కువ ఏమీ జరగలేదు. రేపు ప్రశ్నలవర్షం కురిపిస్తారు. ఉక్కిరి బిక్కిరి చేస్తారు.

ఆ తర్వాత చాలా రోజులు ఏ ఉద్యోగమూ రాలేదు. కనీసం ఇంటర్వ్యూలైనా పిలుపు రాలేదు. తన పని మామూలే. నెలకు ఆరు రూపాయలకు అద్దెకు తీసుకున్న చిన్నగదీ, (దానికి రెండునెలల అద్దె బకాయి) గదిలో చాప, పక్కన పాత ట్రంకుపెట్టె, పైనా క్రిందా పుస్త కాలు. పెచ్చులూడిపోయిన గోడకు ఒక పిల్లిబొమ్మ ఉన్న క్యాలెండరూ, ఒక ఐన్‌స్టయిన్ ఫొటో, గ్లాసు, అద్దం...ఇదీ తన సంపద. వారానికి అయిదు రోజులే తిండి...రోజుకో యింటి చొప్పున అయిదు ఇళ్ళే మిగి లాయి అప్పటికి. సోమవారం, శుక్రవారం తనకు తిండిపెట్టే మంచి వాళ్ళకు ట్రాన్స్ఫరయి ఎటో వెళ్ళిపోయారు. రోజూ సాయంకాలం పూట అయిదారుగురు పిల్లలకు ట్యూషన్ చెప్పడం. మిగిలిన కాలమంతా, 'కావలెను' ప్రకటనలు చూస్తూ ప్రతిచోటికీ అప్లయి చేయడం, చదువుతూ, వ్రాస్తూ గడపడం. ఏమీ తోచనప్పుడు ఐన్‌స్టయిన్ ఫొటో చేతిలోకి తీసుకుని ఊరికే చూస్తూకూర్చోడం, ఇంతే...ఆరోజుల్లో అతడుసాధించిన ఘనకార్యం ఒక్కటే. ప్రక్క యిళ్ళల్లో పనిచేసే పదేళ్ళరంగడనే అనాథ

బాలుడికి చదవడం, వ్రాయడం నేర్పాడు. ఉద్యోగం దిగులెక్కువై పోయింది. ఎక్కడికి పోయినా 'లేదు' అనే మాట తప్ప మరోటి వినబడ లేదు. కొన్ని చోట్ల—

"మాకు న్యూక్లియర్ ఫిజిక్స్ పనికిరాదు బాబూ! మామూలు ఫిజిక్స్ అయితే ఏదో చూసేవాళ్ళం. అయినా రిసెర్చికి పోకపోయావా? స్కాలర్‌షిప్ వచ్చేదిగా!"

"అవకాశం రాలేదండీ... ప్రయత్నించాను."

"ప్చ్! ఏం లాభం లేదు."

మరి కొన్ని చోట్ల —

"ఇంత క్వాలిఫికేషన్ మా కెందుకు నాయనా! ఏదో మామూలు స్కూలు..."

ఇతర చోట్ల —

"మాకు మామూలు అకౌంట్స్ తెలిసిన గుమాస్తా కావాలి. ఈ సైన్సు లెందుకు?"

"పోనీ...అదే చేస్తానండీ..."

"కుదరదు... నువ్వు చెయ్యలేవు..."

చదువుకున్నన్నాళ్ళూ తాను వారాలు చేసుకుని లోకులమీద ఆధార పడ్డాడు. ట్యూషన్లమీద పెద్దగా వచ్చిందేమున్నది? పై ఖర్చులు మాత్రం వెళ్ళిపోయేవి. చదువైపోయింది. డిగ్రీ చేతికొచ్చింది. విన్నవారూ, చూసినవారూ ఏమనుకుంటారో అనిపించేది. ఎవరింటికయినా పొద్దున్నే వెళ్ళి 'ఇవాళ మీ యింట్లో వారం!' అని చెప్పిరావడానికీ, తిండికి వెళ్ళ డానికి సిగ్గుతో కుంగిపోయేవాడు.

గాంధీ చలికి ముడుచుకు పడుకున్నాడు. తల్లి కడుపులోవున్న పిల్లవాడిలాగున. అతని తల్లి అంటూ వుండేది. మా వాడు నిద్రలో కద లడు. పుస్తకంలాగు పడుకుంటాడు అని. అతనికి మాగన్నుగా నిద్ర

పడుతున్నది. కాని అది సరయిన నిద్రకాదు. కళ్ళముందు ఏవేవో చిత్రాలు...దృశ్యాలు.

అతడూ గురువారంనాడు భోజనంచేసే యిల్లు... ఆయన ఒక మెడికల్ రిప్రెజెంట్‌టివ్...చాలామంచివాడు... బ్రహ్మచారి...వయసులో వున్న వితంతువైన చెల్లెలు. ఆమెకు ఒక పసిపిల్ల... వరండా ప్రక్కన గదిలో వయసుమళ్ళిన ముసలి తండ్రి... ఆనాడు రాత్రి తొమ్మిదిగంటల వేళ గాంధీ భోజనానికి వెళ్ళాడు. ముసలాయన గదిలో అలికిడి లేదు. బహుశా నిద్రపోతున్నాడేమో, లేకపోతే వూళ్లో లేడో!...మూడేళ్ళ పిల్ల హాల్లో సోఫాలో పడుకుని నిద్రపోతున్నది. సోఫా క్రింద నేలమీద ఒక చెయ్యి విరిగిన బొమ్మ... గోడమీద 'టిక్కు టిక్కు' మంటున్న గడియారం...చుట్టూ నిశ్శబ్దం...తలుపు తట్టిన శబ్దం విని ఆమె వచ్చింది. 'నీ కోసమే చూస్తున్నా'నంటూ లోపలికి తీసుకువెళ్ళి అన్నం పెట్టింది. ఆ తర్వాత హాల్లోకి వచ్చాడు. ఆమె వెనుకనుంచి 'ఇప్పుడంతదూరం వెళ్ళడం దేనికి? ఇక్కడే పడుకో... నాకూ భయంగా వుంది. ఒంటరిగా వున్నాను' అన్నది. అతడు హాల్లోనే సోఫాలో ఒకపక్కన కూలబడ్డాడు. అంతలోనే అతనికి నిద్ర ముంచుకు వచ్చింది. ఎంతసేపు నిద్రపోయాడో ఏమో! ఆమె అతని మీదికి వంగి లేపుతూ వుండగా మెలకువ వచ్చింది. ఆమె మెడలోని ఒంటిపేట బంగారు గొలుసు అతని నుదుటికి చల్లగా తగులుతున్నది. ఆమె "లే...లేచి లోపలపడుకో..." అంటూ పక్క గది లోకి వెళ్ళింది. అతడు లేచాడు. చేతివ్రేళ్ళు విరుచుకుని, నుదురు గట్టిగా తుడుచుకుని ఒక్క క్షణం నిలబడి అంతలోనే తలుపు తీసుకుని వరండా దాటి మెట్లుదిగి వీధితలుపు విసురుగా తోసి వీధిలోకివచ్చాడు. విసవిస నడవడం ప్రారంభించాడు. ఆమె వెనకనుంచి 'అదేమిటి? వెళ్ళిపోతున్నావా?' అనడం వినిపించింది. కాని అతడుక్షణంఆగలేదు. వెనుదిరిగి చూడనైనా లేదు. వెలుగు చీకట్లతో నిండిన వీధిలో గబగబ నడచి పోయాడు.

గాంధీ పక్కకు ఒత్తిగిలి పడుకున్నాడు. అంతలో అతనికి ఎప్పుడో తాను చూసిన కడుపుతో ఉన్న పెద్ద బల్లి గుర్తుకువచ్చింది.

ఆ వెనువెంటనే వందలాది కాళ్ళతో అసహ్యంగా నడిచే కాళ్ళజెర్రి గుర్తుకు వచ్చింది. 'దానికి అన్ని కాళ్ళెందుకో!' అనిపించింది. ఎక్కడి నుంచో మృదువైన వాసన...జైల్లో ఈ వాసన ఏమిటి? ఆనాడు తాను సీసాలో తెచ్చుకున్న పదార్థం వాసన ఇలా మృదువుగా లేదు... చాలా ఘాటుగా ఉంది.

ఆనాడు ఆగస్టు పదిహేనవతేదీ... దేశమంతటా గొప్ప కోలాహలం...సంచలనం...హడావిడి...ప్రబోధాలు హితోక్తులు... ప్రసంగాలు...ప్రదర్శనలు...పతాకాలు...అంతా... సంతలాగు, సంబరంలాగున్నది. ఆ చిన్న రూములో పగలంతా ఒంటరిగా గాంధీ...రాత్రి పది గంటలు...చుట్టూ నిశ్శబ్దం...కిటికీలో లాంతరు మందంగా వెలుగుతున్నది...బహుశా ఆనాటితో అందులో కిరసనాయిలు అయిపోతుంది... ట్రంకు పెట్టెమీద ఫొటోలో ఐన్‌స్టయిన్ కళ్ళు, నిశితమైన, చురుకైన కళ్ళు తీవ్రంగా చూస్తున్నాయి. గోడమీది క్యాలెండరులో పిల్లి—ఏ క్షణంలోనైనా యీలవేస్తేచాలు లేచి రావచ్చునన్నంత సహజంగా వుంటుంది– మూతి ముడుచుకుని మెరిసే కళ్ళతో చూస్తున్నది. చాపప్రక్కన మూలగా ఆ చిన్న సీసా. అతడు లావాటి పుస్తకం తీశాడు. దానిలో పేపరు కటింగ్స్ చాలా ఉన్నాయి. హాల్డేన్, నర్లేకర్, ఖొరానాల ప్రసంగాలు. బొమ్మలు, ఇంకేవేవో వైజ్ఞానిక వ్యాసాలు. బాబా ఫొటో ఒకటి. చంద్రమండలంమీద మానవుడు పాదం పెడుతున్న రంగుల దృశ్యం; తన క్లాస్‌మేట్ ఒక అమ్మాయి (ఆమె నతడు ప్రేమించాడా?), ఎప్పుడో పంపిన గ్రీటింగ్ కార్డు వెనుక వెన్నెలలో తాజ్‌మహల్ సుందర దృశ్యం; తాను వ్రాసిన ఏవేవో వ్యాసాల కట్టలు; సైన్సులో నోబెల్ బహుమతి పొందిన వారి వివరాలు; ఒక యువ సైంటిస్టు నిరాశా నిస్పృహలతో ఆత్మహత్య చేసుకుంటూ వ్రాసిన విషాదకరమైన చివరి ఉత్తరం; ఇన్నింటినీ ఒక్కసారి తిరగవేశాడు. తర్వాత ఒక కాగితం చేతిలోకి తీసుకున్నాడు. కలంలో సిరా అయిపోయిందో ఏమో విదిలిస్తేకాని వ్రాయలేదు. అప్పుడు తనకు మనస్థిమితం ఉన్నదా? ఉన్నదనే అనుకున్నాడు. కళ్ళవెంట మాటిమాటికీ నీళ్ళు ఉబుకుతున్నాయి. వొణుకుతున్న చేత్తో కాసిని వాక్యాలు వ్రాశాడు. చివర సంతకం పెట్టబోతే సిరా

అయిపోయిందేమో, పూర్తిగా పిలుపడలేదు. చివరి అక్షరం తేలిపోయింది. తేదీ వెయ్యలేదు. ఆ తర్వాత చాలాసేపు కదలకుండా కూర్చొని వొణుకుతున్న చేతులతో ఆ సీసా తీసుకుని దానివంక కాస్సేపు కన్నార్పకుండా చూశాడు. మనసంతా మొద్దుబారి పోయింది. ఏ అనుభూతీ ఆలోచనా లేని అవస్థ...గ్లాని...చేతులు వొణుకుతున్నా పని పూర్తిచేసుకున్నాడు. తర్వాత చాపమీద వెల్లకిలా పడుకున్నాడు. కొద్దిక్షణాలే...బహుశా నిమిషంకూడా అయివుండదు. మెదడులో ముందు, కేవలం యెర్ర తామరపూలతో నిండిన చెరువు...తర్వాత అంకెలూ, అక్షరాలూ, ఏవేవో ఈక్వేషన్‌లూ తిరిగి పోయాయి...ఏదో అజ్ఞాతలోకంలోకి వేగంగా ప్రయాణం చేస్తున్న అనుభూతి...తర్వాత భారరహితస్థితి... రెక్కలువచ్చి మబ్బులుదాటి కాంతివేగంతో వెళ్ళిపోతున్నట్టు... 'అన్నట్టు కాంతివేగం సరిగ్గా ఎంతో' అన్న భావన...సరిగ్గా ఆ క్షణంలో రంగడు మెరుపులాగా వచ్చాడు. ఎందుకు వచ్చాడో తెలియదు. ఆగస్టు పదిహేను హడావిడి అంతా వాడి మొహంలోనే ఉన్నట్టున్నది. గుండెమీద చిన్నజెండా పెట్టుకుని వున్నాడు. వాడు గాంధీని పిలిచి, అతడు బదులు పలక్కపోయేసరికి పెద్దగా అరిచి కేకలు పెట్టాడు. అంతలో హడావిడిగా అందరూ వచ్చారు. గుంపుగా వచ్చారు. తర్వాత అతన్ని అపస్మారకస్థితిలో ఆస్పత్రికి తీసుకుపోయారు. అక్కడ డాక్టర్లు అతని పొట్టలోని విదేశీ పదార్థాన్ని విజయవంతంగా యివతలికితీసి అతన్ని బ్రతికించారు. తర్వాత రెండుమూడు రోజులే ఆస్పత్రిలో వుంచారు. ఈ మధ్యలో పోలీసులు హడావిడి చేశారు. అతని రూము అంతా గాలించారు. అవసరమైనవీ, అనవసరమైనవీ అన్నీ తీసుకున్నారు. 'ఆస్పత్రిలో ఇంక ఉండనక్కరలేదు వెళ్ళిపొమ్మని' డాక్టర్లు సాగనంపేసరికి సిద్ధంగా ఉన్నారు పోలీసులు...

కోర్టులో విచారణ...కొండరాళ్ళతోకట్టబడిన పాతకాలపు కట్టడం... విశాలమైన హాలు...ఎదురుగా జడ్జి...నల్లకోట్లుధరించిన న్యాయవాదులు... తలలకు పాగాలతో వరండాలలోనూ, లోపలా ప్లీడరు గుమాస్తాలు, బిళ్ళ బంట్రోతులు...జడ్జిగారి పైన గోడమీద పెద్దసైజు జాతిపిత, ప్రధాని, రాష్ట్రపతుల రంగుల ఫొటోలు...

న్యాయమూర్తి నడివయసువాడే... మూర్తీభవించిన మంచితనంలా వున్నాడు. అవసరం వస్తే కఠుడు కట్టిన కాఠిన్యంలాగానూ ఉండగల వాడిలా కనిపిస్తాడు. గాంధీని మధ్యాహ్నం వేళకు లోపలికి తీసుకుపోయి బోనెక్కించారు. ఒక న్యాయవాది- దళసరి కళ్ళద్దాలు ధరించినవాడు— విషయం అంతా పెద్దగొంతుతో నివేదించాడు. న్యాయమూర్తి ప్రసన్నంగా గాంధీ వంక చూస్తూ బుగ్గన చెయ్యి ఆనించుకుని విన్నాడు. కొందరు న్యాయవాదులు కూడా ఉత్కంఠతతో విన్నారు. పోలీసులు గుమ్మందగ్గర నిలబడి వున్నారు. వెనక బల్లలమీద కొందరు కూర్చున్నారు. వారు కూడా విన్నారు. గాంధీ అంతసేపూ నుదురుచేత్తో రుద్దుకుంటూనూ, లాల్చీ జేబుల్లో చేతులుంచి మళ్ళా బయటికి తీస్తూనూ, నిలబడిపోయాడు. అంతలో అతనిచేత నిజమే చెబుతానని ప్రమాణం చేయించి ప్రశ్నలు ప్రారంభించాడు. అతని రూములో పోలీసులు లోబరుచుకున్న కాయి తాలలో అతని స్కూల్ ఫైనల్ రిజిస్టరు మొదటి పేజీ కాపీ వుంది.

పేరు—మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ, ముష్టి.

పుట్టిన తేది—ఆగస్టు మొదటితేదీ పందొమ్మిది వందల నలభై ఏడు.

పుట్టుమచ్చలు — ఎడమ మోచేతిపైన పెద్ద పుట్టుమచ్చ ఒకటి, కుడిభుజాన పైన చిన్న పుట్టుమచ్చ మరొకటి.

నడవడి — సంతృప్తికరం.

గాంధీ నిశ్చలంగా వింటున్నాడు. అతనికి అంతలో ఎప్పుడో తాను నీళ్ళలో చూసిన శవం గుర్తుకు వచ్చింది. అది నీళ్ళలో నాని బాగా ఉబ్బి పోయివుంది. బోర్లా పడుకుని నీళ్ళలో తేలుతూ లాకులదగ్గర ఆగి పోయింది. 'అది తనకు ఎందుకు గుర్తుకు వచ్చిందా' అని ఆలోచించాడు. ఆ ఆలోచన తెగలేదు. అంతలో అతన్ని పరధ్యానంగా ఉన్నందుకు మందలించి ప్రశ్నలు మొదలు పెట్టారు.

గాంధీ కంఠం వొణుకుతూ వుండగా చెప్పాడు.

'అవును. ఆత్మహత్య ఘోరమైన నేరమే.' అతని కళ్ళలో నీళ్లు నిలిచాయి.

'అయినా గత్యంతరం లేకపోయింది. అయినా వాళ్లెవరూ లేరు. చిన్నప్పటినుంచీ శ్రద్ధగా చదువుకున్నాను. వారాలు చేసుకుని, వీధి లాంతర్ల క్రింద చదువుకున్నాను. ట్యూషన్లు చెప్పుకున్నాను చదువై పోయిన తర్వాత రిసెర్చి స్కాలర్‌షిప్ వస్తుందికదా అని ఆశపడ్డాను. కాని రాలేదు. ఎన్నో ఉద్యోగాలకు అప్లయి చేశాను...' అతడు ఆగి వొణుకుతున్న వ్రేళ్ళతో కనుతుదలు తుడుచుకుని కళ్ళజోడు పెట్టుకుని మళ్ళీ అన్నాడు.

"ఏదీ రాలేదు. ఎంతకాలం ఇట్లా ? ఇట్లా బ్రతకలేననిపించింది' అంతే...'

జడ్జి కళ్ళజోడు తీసి ఎదురుగా బల్లమీద పెట్టి నుదురు తుడుచుకుని కాస్సేపు కళ్లు మూసుకున్నాడు. కొద్ది క్షణాలు కోర్టుహాల్లో నిశ్శబ్దం వ్యాపించింది. జడ్జి అంతలో గడియారం చూసుకొని కళ్ళజోడు అందుకుని చివాలున లేచి లోపలికి వెళ్ళిపోయాడు. మరునాటికి వాయిదా వేశారు.

గాంధీకి నిద్రపట్టింది. కాని కలవరిస్తూనే వున్నాడు. ఏవో అస్పష్టమైన మాటలు.

అప్పలస్వామి అర్ధరాత్రివేళ వచ్చి కటకటాల పక్కన నిలబడి బీడీ ముట్టించుకుని, ఆ అగ్గిపుల్ల వెలుతురులో లోపల నిద్రపోతున్న గాంధీవంక చూసి తనలో తను నెమ్మదిగా నవ్వుకుని బీడీదమ్ము పీలుస్తూ చాలా సేపు అక్కడే నిలబడ్డాడు. తర్వాత బూట్లు చప్పుడు కాకుండా నెమ్మదిగా నడిచి వెళ్ళిపోయాడు.

గాంధీకి మెలకువ వచ్చేసరికి బాగా పొద్దెక్కింది. అతని కళ్లు ఎర్రగా జ్యోతుల్లాగా ఉన్నాయి. కణతలమీద నరాలు ఉబ్బి ఉన్నాయి. నిద్రలో వరసగా కలలు వచ్చాయి..ఒక కలలో అంకెలు...అన్నీ అంకెలే అల్లిబిల్లి తిరుగుతూ అద్భుతంగా కనిపించాయి. మరో కలలో లెక్క లేనన్ని పాములు... వందలూ వేలూ—తర్వాతి కలలో అసంఖ్యాకమైన సౌరకుటుంబాలూ, తారా సందోహాలూ, గ్రహాలూ, గ్రహ శకలాలూ, తోకచుక్కలూ, పరమాణు ప్రయోగాలూ కనిపించాయి.

అప్పలస్వామి తలుపు తీయగానే గాంధీ 'ఏవీ కాయితాలు? కలం ఏదీ?' అని అడిగాడు. అప్పలస్వామి ఏమీ మాట్లాడలేదు.

గాంధీకూడా మళ్ళీ ఏమీ అడగలేదు. బయటికి వచ్చిచూస్తే పలుచని ఎండ మృదువుగా, మెత్తగా అతని ముఖానికి తగిలింది. ఆవరణలో కాస్సేపు అటు ఇటు తిరిగి కాపలావాడిని పిలిచి, ఆ ప్రహరీ గోడను చూపిస్తూ "ఆ గోడ అవతల ఏముంది?" అని అడిగాడు.

కాపలావాడు కళ్ళు పెద్దవిచేసి చూసి "ఏమీలేదు" అన్నాడు.

"ఏమీ లేదూ?" అని గొణుక్కున్నాడు గాంధీ. "అవును. ఏమీ ఉండి ఉండదు. అడివేమో అది అంతా" అన్నాడు మళ్ళీ.

వ్యానులో కోర్టుకు తీసుకుపోతూండగా అప్పలస్వామి అతన్ని నిశితంగా చూశాడు. అతని కణతలమీద నరాలు ఉబ్బి ఉన్నాయి. కళ్ళు ఎర్రగా ఉన్నాయి. కళ్ళజోడు తీసి జేబులో ఉంచుకుని మాటిమాటికీ కళ్ళు నులుముకుంటూ కూర్చుని వున్నాడు. చూపులు ఎక్కడా నిలవడం లేదు.

కోర్టు హాల్లోకి పిలిచి బోనెక్కించగా ఉన్నట్టుండి పెద్దగా "నా రూములో ఫోటో ఉందాలి—ఐన్‌స్టయిన్ ఫోటో—అది ముందు నాకిప్పించండి" అన్నాడు.

ఎవరూ పట్టించుకున్నట్టు కనిపించలేదు. కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి. వొణుకుతున్న కంఠంతో మళ్ళీ "దాన్ని తీసుకురండి—ఆ పైన గోడకు తగిలిద్దాం—ఇక్కడ ఉండాలి అది—లేకపోతే నేనూరుకోను—" అన్నాడు.

న్యాయవాది వరుసగా ప్రశ్నలు వేశాడు. గాంధీ సమాధానాలు చెప్పకుండా నిలబడిపోయాడు. రెండు చేతులతో లాల్చీ గట్టిగనాన్ని పరీక్షించాడు. అది అంతలో ఫర్రున చినిగింది. అతడు తలఎత్తి "చూశారా? ఇలా అనేసరికి చినిగిపోయింది—" అన్నాడు.

పోలీసు అధికారీ, పోలీసులూ, అప్పలస్వామి, న్యాయవాదులూ, వెనక కూర్చున్నవారూ, న్యాయమూర్తి అందరూ కళ్ళు పెద్దవి చేసుకుని

చూస్తున్నారూ—అంతలో గాంధీ "ఎంతసేపూ మీరడగడమూ, నేను చెప్ప డమూ కుదరదు. నేను చెప్పవలసినదంతా నిన్ననే చెప్పాను—అవును— చచ్చిపోదామనుకున్నాను. ఇప్పుడు నేనడుగుతాను—తెలిస్తే చెప్పండి— అని ఒక్క క్షణం ఆలోచించి 'ఆc! కాళ్ళజె్రి తెలుసుగా? దానికి అన్ని కాళ్లెందుకో చెప్పండీ—చూద్దాం—" అన్నాడు. మళ్ళీ "చెప్పలేరు—నాకు తెలుసు— పోనీ 'ఈ ఈజ్ ఈక్వల్ టు ఎం సి స్క్వేయిర్' అంటే ఏమిటి?" అని అడిగాడు. తర్వాత ఏమీ మాట్లాడకుండా ఉండిపోయాడు. అతని చూపులెక్కడో ఉన్నాయి.

న్యాయమూర్తి చివాలున లేచి లోపలికి వెళ్లిపోయాడు. అంతలో గాంధీ ముందు మెరుపు మెరిసినట్టయింది. ఎవరో కెమేరా 'క్లిక్' మని పించారు. గాంధీ పెద్దగా అరిచాడు—"ఎవర్రా అది— పట్టుకోండి—" తర్వాత తనలో తాను గొణుక్కుంటూ నిలబడిపోయాడు. కొద్దినిమిషాల తర్వాత పోలీసు అధికారి అతన్ని సమీపించి "రండి వెళదాం" అన్నాడు. గాంధీ వాక్ప్రవాహం ఆపి "ఎక్కడికి?" అని అడిగాడు.

"ఇంటికి పోదాం" అన్నాడాయన.

"నాకు యిల్లులేదు. వాకిలీ లేదు—" అన్నాడు గాంధీ.

"మీ యిష్టం వచ్చిన చోటికి తీసుకుపోతాను రండి" అన్నాడు. ఆయన మళ్ళీ.

"అయితేపదండి—రామలీలామైదానంలో మీటింగుఉంది. అక్కడ మాట్లాడుతాను ఇవ్వాళ— ఆ తర్వాత గేట్ వే ఆఫ్ ఇండియాకు పోదాం—"

"సరే- అక్కడికే పోదాం—" అన్నాడు పోలీసుఅధికారి అతని చెయ్యి పట్టుకుని.

"రైటో—కాని అక్కడ ఫిరంగులూ అవీ ప్రేల్చగూడదని చెప్పండి— అవి నాకు గిట్టవు— అన్నట్టు నాకు కాయితాలూ, కలమూ కావాలి— ముందు అవి తెప్పించండి—"

వ్యాను రోడ్డుమీద నడుస్తూ వుండగా రోడ్డుమీద ఏదో ప్రజా ప్రదర్శన... అంతటా అలజడిగా, కోలాహలంగా ఉంది.

గాంధీ రహస్యం చెబుతున్నట్లు 'అన్నట్టు మీకు రోజువారీ వాడకానికి ఆటంబాంబులు కావాలి కదా? ఎట్లా మేనేజ్ చేస్తున్నారు? మీకు కావాలంటే చెప్పండి... రెండు రోజుల్లో చేసియిస్తాను. కావలసిందల్లా కాయితాలూ— కలమూ అంతే...' అంటూ వెర్రినవ్వు నవ్వాడు.

అప్పలస్వామి పోలీసు అధికారిని నెమ్మదిగా ప్రశ్నించాడు' 'సార్! ఏమిటి సంగతి?'

పోలీసు అధికారి కణతమీద చూటనవ్రేలుంచుకుని నవ్వి నెమ్మదిగా 'మతి చెడింది... ఇక పిచ్చాసుపత్రే శరణ్యం...' అన్నాడు.

జైలుకు వెళ్ళగానే అతనికి కాసిని కాగితాలూ, కలమూ ఇచ్చారు. గాంధీ వాటిని ఆశగా, ఆదుర్దాగా అందుకుని వెంటనే చాపమీద కూలబడి వ్రాయడం ప్రారంభించాడు. అప్పలస్వామి దగ్గరగా నిలబడి చూశాడు. ఏవేవో వ్రాసి గాంధీ అయిదు నిముషాల తర్వాత అలిసిపోయాడు. తర్వాత కాస్సేపు ఆలోచించి ముందు ఒక సున్నా గీచాడు...అది తల.. తర్వాత రెండు గీతలు గీచాడు ... అవి చేతులు .... మళ్ళీ చాలా గీతలు— అవి తొడలు ... కాళ్ళు ... తర్వాత వక్షస్థలాన్ని సూచిస్తూ రెండు పెద్ద సున్నాలు గీచాడు... అంతే... ఇక ఇతర వివరాలేవీ. కన్ను, ముక్కు వగైరాలేవీ లేవు. బొమ్మవేసి అప్పలస్వామి వంక చూసి నవ్వి 'పేరు పెడతాను చూడు...' అంటూ కొద్దిక్షణాలు ఆలోచించి ఆ బొమ్మ క్రింద పెద్ద అక్షరాలతో 'కాళ్ళజెర్రి' అని వ్రాశాడు... తర్వాత నిద్ర వచ్చింది కాబోలు చాపమీద బోర్లా పడుకుని గురక పెడుతూ నిద్రపోయాడు.

# ఇంటర్వ్యూ

"టిక్ టక్" మని ఠీవిగా నడుస్తున్నాను. పూర్తిగా ఎయిర్ కండిషన్ చేయబడిన ఆఫీసు...ఎటు చూసినా తళతళ లాడుతూ అద్దాలు... గదులలో నేలమీద ఖరీదైన తివాచీలు...అటూ యిటూ గోడలకు ఖరీదైన అందాల చిత్రాలు... ఇక్కడ పని చేయడం ఒక వరం అనిపిస్తున్నది.

ప్యూను లేచి సలాం కొట్టి స్వింగ్ డోర్ తీశాడు.

లోపల అడుగుపెట్టి ఎదురుగా కూర్చున్న వారిని 'విష్' చేశాను. వారు ముగ్గురు... ఖరీదైన కుర్చీల్లో కూర్చుని వున్నారు...పొడుగాటి బల్ల ...దాని నిండా ఫోనులూ... ఇతర సామాగ్రి ఒక ప్రక్కన టైపు మెషీను ముందు అందమైన స్టెనో...

ఆ ముగ్గురూ ఆదరంగా తలలు పంకించారు. ఒకాయన 'ప్లీజ్ టేక్ యువర్ సీట్' అన్నాడు. కూర్చున్నాను. తర్వాత నా కాగితాలన్నీ చూశారు. ఈ లోపల నేను తలవంచి తళతళలాడే నా బూట్లవంక, మరి కాస్సేపు గోడల నున్న బొమ్మలవంక చూస్తూ మాటిమాటికీ టై సవరించు కుంటూ కూర్చున్నాను. వారు కాగితాలు చూసి కొన్ని ప్రశ్నలు వేశారు. అన్నిటికీ అద్భుతంగా సమాధానాలు చెప్పాను. అంత సేపూ ఆ ముగ్గు రిలో ఒకాయన 'కుర్రాడు వండర్‌ఫుల్‌గా ఉన్నాడు. అమ్మాయినిచ్చి చేస్తే ఎంతో బాగుంటుంది' అనుకుంటున్నట్టు అనిపించింది. మరొకవ్యక్తి 'ఇలాంటి కొడుకువుంటే ఎంత బాగుండేది' అనుకుంటున్నట్లు అనిపిం చింది. మూడో వ్యక్తి 'ఇలాంటి చాకువంటి కుర్రాడు మన ఫరమ్‌లో ఉద్యోగంలో ఉంటే ఫరమ్ ఘనత, హోదా వందరెట్లు పెరిగిపోతాయి.' అనుకుంటున్నట్లు అనిపించింది.

"వెంటనే జాయినవుతారా?"

నేను తల వూపాను.

నిముషాలమీద స్టెనో అప్పాయింట్‌మెంటు అర్డరు టైపుచేసి తెచ్చింది. అందుకుని చూశాను. పదిహేను వందలు జీతం...ఇతర అల వెన్సులు ఫరవాలేదనిపించింది

"ఫారిన్ పంపిస్తే వెళ్తారా ?"

"ఆలోచించి చెబుతాను."

"గుడ్..."

సంతకాలు పూర్తిచేశాము. వారు ముగ్గురూ లేచి నాతో కరచాలనం చేశారు. తర్వాత నా వెంటవచ్చి పక్క రూంకు తీసుకువెళ్ళి "ఇది మీ రూము. వస్తాం మరి... గుడ్‌లక్..." అని వెళ్ళిపోయారు. అంతా శుభ్రంగా తళతళలాడుతున్నది. పెద్ద బల్లమీద ఎంతోగొప్ప అలంకరణ ...ఖరీదైన ఆఫీసు సామాగ్రి...చల్లగా స్వర్గంలో ఉన్నట్టుగా ఉంది. కోటు విప్పి హాంగర్‌కు తగిలించి రివాల్వింగ్ కుర్చీలో కూర్చుని పై సర్దుకున్నాను. అంతలో టెలిఫోను 'ట్రింగ్ ట్రింగ్' మని మ్రోగడం ప్రారంభించింది.

ఎవరో తట్టి లేపుతున్నారు. 'ఫోను ఫోనం'టూ ఉలిక్కిపడిలేచాను. నులకమంచం కిర్రుమన్నది. ఎదురుగా అక్కయ్య...చేతిలో ఏదో పళ్ళెంతో నిలబడివుంది నవ్వుతూ "ఫోనంటావేమిట్రా సుబ్బా ! ఎనిమిది గంటలయింది. ఇంకా కలవరింతలా? చప్పున లే...ఇవాళ ఇంటర్వ్యూ ఉందని మూడు రోజుల్నించీ హడావిడి చేశావు...లేచి త్వరగా తెములు..." అంటున్నది. ఎక్కడో అందాల అంతరిక్షంలో నుంచి భూమ్మీద పడినట్టయింది.

నులకమంచం మధ్యలో బాసిపట్టువేసుకు కూర్చుని బయటికి వెళ్తున్న అక్కయ్య వంక చూశాను. అక్కయ్యకు ఇరవై అయిదేళ్ళు నిండుతున్నాయి. పెళ్ళికాలేదు. అద్భుతంగా పాడుతుంది. మనిషి కూడా బాగానే వుంటుంది. కాని, ఏం లాభం? పెళ్ళికాలేదు. నెలకు సగటున

కనీసం ఇద్దరు ముగ్గురైనా రావడం, వచ్చి చూసి తర్వాత తెలియజేస్తామని వెళ్ళడం, రివాజుగా జరుగుతున్నది. పెళ్ళిచూపుల పేరుతో గొప్ప సంరంభం...పక్క యిళ్ళలో కుర్చీలుతెచ్చి అమర్చడం... టిఫిన్లు, కాఫీలు సరఫరా చెయ్యడం...వాళ్ళేమోచూసి తలలూపి వెళ్ళిపోవడం... తర్వాత బేరసారాలు... ఏమీ కుదరకపోవడం... ఇదంతా గొప్ప న్యూసెన్సయిపోయింది. అక్కయ్య పాతకాలపు మనిషి కాబట్టిగాని, లేకపోతే ఎదురుతిరిగి "పెళ్ళివొద్దు...పెటాకులూ వొద్దు...నన్ను ఇలా పడివుండనివ్వండి. వేధించక..." అని ఒక చిన్న సైజు విప్లవం సృష్టించి ఉండేది. నాకు ఉద్యోగం రావడం, అక్కయ్యకు పెళ్ళికావడం, రెండూ ఇంతలో అయ్యేట్టు లేవు. రెండూ గగన కుసుమాల్లాగే వున్నాయి.

"ఏరా సుబ్బా! ఇంకా కూర్చున్నావేరా? లేలే... నాన్న కూడా అడుగుతున్నాడు నీ గురించే..." అంటూ వొచ్చింది అక్కయ్య.

"అక్కయ్యా! ఒక్కక్షణం ఇలా కూర్చో...పొద్దున్నే నవ్వుతూ దేవతలాగా కనిపించావు. ఒక్క క్షణం మాట్లాడు" అన్నాను.

నవ్వుతూ "ఏం మాట్లాడనురా?" అన్నది అక్కయ్య.

"ఏదో ఒకటి...పోనీ ఒక పని చెయ్యి... ఈ రెండు వేళ్ళలో ఏదో ఒకటి పట్టుకో...ఉద్యోగం వస్తుందో రాదో తెలుసుకుందాం..."

"బాగానే వుంది నీ చాదస్తం...సరే పోనీ చూద్దాం...కాని మనం కాదురా...బేబీని పిలుద్దాం..." అంటూ అక్కయ్య పెద్దగా "బేబీ! బేబీ! ఇలారా, ఒక్కసారి..." అంటూ కేక పెట్టింది.

బేబీ జడ అల్లుకుంటూ "ఏమిటి?" అంటూ వచ్చింది. దాని ముఖం ఎప్పుడూ ధుమధుమలాడుతూ వుంటుంది. పెనంమీద వేగుతున్న జీడిగింజ లాగా ఎప్పుడూ చిటపటలాడుతూ వుంటుంది. ఏదో క్లాసులో అది స్నేహం చేసే వాళ్ళందరూ కార్లున్న వాళ్ళు. సంపన్నుల పిల్లలు... వాళ్ళలాగా రోజుకో డ్రస్సు వేసుకోవాలనీ, కనీసం కార్లోఅయినా తిరగాలనీ, ఇవి దాని సరదాలు. పక్షవాతం వచ్చి కాలూ, చెయ్యీ పడిపోయి

మంచంలో వున్న నాన్నకు అందరికన్నా అంటే ప్రత్యేకమైన అభిమానం.

అక్కయ్య దాన్ని కూర్చోబెట్టి "అన్నయ్య ఏదో అడుగుతున్నాడు చూడు" అన్నది నవ్వుతూ.

బేబీ నావంక తిరిగి 'ఏమిటన్న'ట్టు భృకుటి ముడిచి చూసింది. నేను రెండు వ్రేళ్ళూ నుదుటి కానించుకుని ఒక్క క్షణం ఆగి దాని ముందుంచి "ఒక వేలు పట్టుకోవే బేబీ!" అన్నాను.

అది మొహం చిట్లించి మళ్ళీ అంతలో ఏమనుకున్నదో ఏమో, ఒక వేలు పట్టుకున్నది. ఒక్కసారి నేను ఆనందంతో పులకరించి పోయాను. వెంటనే లేచి దుప్పటి విసిరి అవతల పారేసి "నేను నిద్రలేచానహో" అని అరిచి వొళ్లు విరుచుకుని అవతలి గదిలోకి వెళ్ళాను.

దొడ్లో మొహం కడుక్కుంటూ వుండగా ఎందుకో అకారణంగా మనసు బరువెక్కింది. ఇంత కష్టపడి చదువుకున్నాను. క్లాసు తెచ్చుకున్నాను. సంవత్సరం దాటిపోయింది. ఇంతవరకూ పైసా సంపాదన లేదు. ఇంట్లో ఇటీవలే మంచానపడిన తండ్రీ, పెళ్ళికాని అక్కయ్య, నా తర్వాతది పదహారేళ్ళ కమల, తర్వాత బేబీ, ఇంతమంది వున్నారు. సంవత్సరానికి అమ్మతో కలుపుకుని, ఇంకెవరెవరికో నాలుగైదు తద్దినాలున్నాయి. ఇన్నాళ్లూ అప్పుల మీదనే గడిచింది. ఇక అప్పులు గూడా పుట్టవుగాక పుట్టవు. పైగా ఇంతకు ముందు అప్పులిచ్చిన వారు క్రమక్రమంగా ఇంటికి వచ్చి అడగటం ప్రారంభమైంది మొన్న నాన్న స్నేహితు డొకాయన వచ్చి నిష్ఠూరంగా మాట్లాడి "మీకు డబ్బివ్వడం బుద్ధి తక్కువ అయింది" అని వెళ్ళిపోయాడు. నాన్న కళ్ళలో నీళ్ళు చూశానప్పుడు. వళ్ళు మండిపోయింది.

"ఇవ్వడం మీ బుద్ధి తక్కువయితే తీసుకోవడం మా బుద్ధి తక్కువే అయింది," అనేద్దామనిపించింది. లేకపోతే చేతికందిన దేన్నో అందుకుని బాది పారేద్దామనిపించింది. కాని తమాయించుకున్నాను. ఇంకా ఇలాంటి వెన్ని చూడాలో! ఎన్ని అనుభవించాలో! డిగ్రీ చేతికి

వచ్చిన హుషారు అణిగిపోయి చాలా కాలమైంది. రంగు రంగుల కలలు కంటూ ఊహా లోకాలలో తేలిపోతూ ఆడుతూ పాడుతూ తిరిగిన ఆ రోజులన్నీ ఎక్కడో ఎప్పుడో కరిగిపోయాయి. ఆ మధురకాలం మీద మందమైన నల్లని వాస్తవికపు తెర దిగినట్టయింది. "చాదస్తాలు తగవు. మూఢ విశ్వాసాలు తగవు. అవి తగవు...ఇవి తగవు..." అని డిబేట్లలో వాదించిన వాణ్ణి, ఇవాళ నిద్ర లేవగానే బేబి చేత చేయించిందేమిటి?

అనవసరంగా విసుక్కుంటూ మొహం కడుక్కోవడం పూర్తిచేసి లోపలికి వచ్చాను. అక్కయ్య కుంపటి ముందు కూర్చుని కాఫీ పెచ్చబెడుతున్నది. నేను వెళ్ళి ఆమె పక్కనే కూర్చున్నాను. మరోపక్క కమల పీటమీద కూర్చుని పాత పత్రిక ఏదో తిరగేస్తున్నది. "అందరూ కాఫీలు తాగేశారు. నిన్ను గంటసేపటినుంచి లేపుతుంటే లేవకపోతివి...అన్నట్టు కమలా! ప్యాంటు ఆరిందేమో చూశావా? చొక్కా నిన్ననే ఉతికి మడత పెట్టి ఉంచాను" అన్నది. కమల లేచివెళ్ళి మరుక్షణంలో వచ్చి "కొంచెం తడిగానే వుందే! కాస్సేపాగితే బాగా ఆరుతుంది..." అన్నది మళ్ళీ కూర్చుంటూ.

ఈ కమల విచిత్రమైన మనిషి. అసలు ఎప్పుడూ మాట్లాడదు. లోపల ఏ ఆలోచనలు చేస్తుంటుందో ఎవరికీ తెలియదు. అత్యవసరమైతే తప్ప పెదవి కదపదు. నిశ్శబ్దంగా ఏదో ఒకటి చదువుకుంటూ కూర్చుని వుంటుంది ఎల్లప్పుడూ...

కాఫీ రెండోసారి వెచ్చబెట్టడంవల్ల కాబోలు. ఏదో కాటువాసన వేస్తున్నది. నెమ్మదిగా చప్పరిస్తూ కూర్చుని వున్నాను. అక్కయ్య ఉన్నట్టుండి "ఒరే తమ్ముడూ! ఇవాళ జాగ్రత్తగా ఉండు. వాళ్ళు అడిగిన వాటికి వినయంగా జవాబులు చెప్పు...వాళ్ళతో మన యింటి పరిస్థితులు వివరించి చెప్పు...కాస్త జాగ్రత్తరా బాబూ; ఈసారికి..." అన్నది. ఈ మాటలు అంటూ వుండగానే ఆమె కళ్ళలో నీటిపొర నిలిచింది. గొంతు గద్గదికమై పోయింది. కమల ఈ మాటలు వింటూ తల ఎత్తి చూసి మళ్ళీ పత్రిక పేజీలు తిరగేయసాగింది.

'ఊఁ' అంటూ లేచాను నేను. ముందుగదిలోకి వెళ్ళి అలమారులో క్రితం రాత్రి సర్దుకుని సిద్ధంగా ఉంచుకున్న కాగితాలు మళ్ళీ చూసుకున్నాను. సర్టిఫికెట్లు, మార్కుల లిస్టులు, సత్ప్రవర్తనను రూఢిపరుస్తూ పెద్దలుయిచ్చిన టెస్టిమోనియల్స్, అన్నీ ఒక్కసారి తిరగేశాను. మార్కులు చూసుకుంటే గర్వం కలిగింది. చక్కని మార్కులు— డిగ్రీకాగానే యూనివర్శిటీకివెళ్ళి పోస్టుగ్రాడ్యుయేట్నై ఎక్కడో పెద్ద కాలేజీలో లెక్చరరుగా చేరిపోదామని ఎంతగానో కలలు కన్నాను. సూటూ బూటూ వేసుకుని, టైకట్టుకుని ఠీవిగా క్లాసులకు వెళ్ళి పాఠాలు చెబుతూ విద్యార్థి లోకంలో గొప్పపేరు సంపాయిద్దామని ఆశించాను. అసలు అంతకుముందు నా చిన్నతనంనుంచీ నాదృష్టి ఎప్పుడూ మెడిసిన్ మీద ఉండేది. డాక్టరునై తెల్లటి డ్రస్సు వేసుకుని మెడలో స్టెత్‌తో ఎల్లప్పుడూ నవ్వుతూ రోగులతో ఎంతో దయగా మాట్లాడుతూ చుట్టూ తెల్లని దుస్తులలో ఉన్న రాజహంసలవంటి నర్సులతో మానవసేవ చేద్దామనుకున్నాను. ఏదో ఒక పల్లెపట్టున స్థిరపడి దీనజనులకు సేవచేసి తరించిపోదామనుకున్నాను. కాని, అసలు మెడిసిన్ ప్రసక్తే ఎత్తేందుకు వీల్లేకపోయింది. ఆ కలలన్నీ కల్లలైపోయి ఈనాడు మామూలు గుమాస్తా ఉద్యోగంకోసం కాళ్ళరిగేటట్టు తిరగడం తప్పనిసరి అయింది. ఎన్ని అప్లికేషన్లు పెట్టాను! కాళ్లు పట్టుకోవడం మాత్రం మినహాయించి ఎంత మంది దగ్గర ప్రాధేయపడ్డాను! చుట్టుప్రక్కల అప్పులుచేసి ఎన్ని ఇంటర్వ్యూలకు వెళ్ళాను!

అక్కయ్య లోపలికివచ్చి "ఒరే సుబ్బూ! నాన్న పిలుస్తున్నాడురా—" అన్నది.

లేచి లోపలికి వెళ్ళాను. నాన్న వెల్లకిలా పడుకుని వున్నాడు. కిటికీలో నుంచి ఆయన నడుంమీద సన్నగా గీతగీచినట్టు పలుచని ఎండ పడుతున్నది. ఆయన కళ్ళతోనే తన పక్కన కూర్చోమని సైగ చేశాడు. తర్వాత చాలాసేపు నావంక కళ్ళార్పకుండా చూశాడు. నేను దుప్పటి పోగులు లాగుతూ నిశ్శబ్దంగా కూర్చున్నాను. ఆయన ఒక్కసారి స్వాధీనంలో వున్న తన చెయ్యెత్తి నా చేతిని నిమిరాడు. ఏదో మాట్లాడు

దామని కాబోలు నోరు తెరిచాడు. గాని ఎందుకో ఏమీ చెప్పకుండా ఊరుకుండిపోయారు.

అంతలో అక్కయ్య "నువ్వు చప్పున లేచి స్నానానికి రా— ఎనిమిది గంటలవుతున్నది. ఎంతో దూరం పోవాలికూడా—" అన్నది.

నేను లేచి ఒక్కసారి నాన్న మొహంలోకి చూసి ఇవతలికి వచ్చేశాను. కమల నా ప్యాంటు మడత పెడుతున్నది. బేబీ అంతకుముందే స్కూలుకు వెళ్ళిపోయింది. అక్కయ్య "నీళ్ళతోడాను. వెళ్ళి స్నానం చెయ్యి" అన్నది. నేను టవల్ కట్టుకుని తలకు నూనె రాచుకుని పగిలిన అద్దంలో చూసుకుంటూ తల దువ్వుకున్నాను.

ఇవాళ నా ముఖం ఎందుకో నాకే విచిత్రంగా కనిపించింది. అద్దం దగ్గరగా వుంచి చూశాను. గడ్డం కొద్దిగా మాసినట్టున్నదిగాని, అంత వికృతంగా ఏమీలేదు. కళ్ళు ఉబ్బినట్టువున్నాయి. ఎర్రని జీరలు కళ్ళ నిండా—

స్నానం ముగించి వచ్చేసరికి లోపల వాదన జరుగుతున్నది. బియ్యం తీసుకు రావాలి. ఎవరో ఒకరు క్యూలో గంటలతరబడి నిలబడి సాధించుకు రావాలి. బేబీ వంతు అయిపోయింది. అది తెల్లవారుజామునే వెళ్ళి పాలక్యూలో నిలబడి పాలు సాధించుకువచ్చి తన బాధ్యత నెరవేర్చుకుని బడికిపోయింది. ఇక ఇప్పుడు బియ్యంకోసం కమల తప్ప వెళ్ళేవారెవరూ లేరు. అక్కయ్య విసుగుతో "వాడేమో ఇంటర్వ్యూకు పోవాలి మరి—నువ్వు కాదంటే ఎలాగ ?" అంటున్నది.

కమల మొహం మాడ్చుకుని, కాస్సేపు సణిగి, చివరకు తప్పని సరయి సంచి అందుకుని రెండు రూపాయల నోటు తీసుకుని వెళ్ళిపోయింది. అది యిప్పుడు అరమైలు దూరం వరకు నడిచి పోవాలి. అక్కడ క్యూ హనుమంతుని వాలంవలె అంతులేకుండా వుంటుంది. ఆ క్యూలో నిలబడి కిలో బియ్యం సాధించుకు రావాలి—ఎంత కష్టం ! కమల మీద జాలి వేసింది నాకు.

అక్కయ్య నా కోసం ఏదో చేసింది. "మళ్ళీ ఎప్పుడొస్తావో

ఏమిటో! కాస్త తినిపోతే మంచిది...' అన్నది. నేను తింటున్నంత సేపూ నా వంకనే చూస్తూ కూర్చున్నది. తిన్నానేకాని వెగటనిపించింది. అక్కయ్య తృప్తికోసం తినేశాను తర్వాత వచ్చి గుడ్డలు వేసుకుని కాయితాలన్నీ తీసుకుని, చెప్పులు తొడుక్కుని ఒక్కసారి పక్క గది లోకి వెళ్ళి "వెళ్తున్నాను నాన్నా!" అని చెప్పి రోడ్డుమీదికి వచ్చాను. అక్కయ్య వీధి గుమ్మంలోకి వచ్చి "జాగ్రత్త తమ్ముడూ!" అని నేను సందు మలుపు తిరిగేవరకూ చూసి లోపలికి వెళ్ళిపోయింది.

నడుస్తూనే ఎవరినో టైమ్ అడిగాను. తొమ్మిది గంటలయింది. సెంటరుకు వెళ్ళి బస్సుకోసం నిలబడాలి. అదెప్పుడో దయకలిగినప్పుడు వస్తుంది. దాన్లో చోటుండాలి. లేకపోతే కాళ్ళకు పని చెప్పడమే మంచిది. కాస్త అలిసిపోయినా సరిగా టైముకు చేరుకోగలం. లేకపోతే అసలు పని చెడుతుంది.

పెద్ద క్యూ! బస్సులు ఎన్నో వస్తూపోతూ వున్నాయి. ఆకలిగొన్న రాక్షసుల్లా మనుషులను పట్టినంతమందిని కడుపుల్లో కుక్కుకుని రివ్వు, రివ్వున వెళ్ళిపోతున్నాయి.

నేను నిలబడ్డాను...నిలబడ్డాను...ఇంతలో మనకుకావలసిన బస్సు వచ్చే సూచనలేవీ లేవు. ఎండ చిటపటలాడుతున్నది. నుదుట చెమటపడు తున్నది. తలలో ఏదోహోరు... మనసులో ఉద్వేగం... ఆ ఉద్వేగాన్ని అణుచుకునేందుకు ఇతర విషయాల మీదికి మనసు మళ్ళిద్దామని ప్రయత్నించాను.

క్యూలో నా ముందు నిలబడిన వారిని లెక్కపెట్టాను. మొత్తం ఇరవై అయిదు వరకూ లెక్కపెట్టేసరికి మనసు నిలవలేదు... ఉదయం వచ్చిన కలను గుర్తుచేసుకున్నాను. ఎంత అందమైన కల అది?...మళ్లీ అంతలో మా యింట్లో తిరుగాడే పిల్లి గుర్తుకు వచ్చింది... దూరంగా ఎవరో కుక్కను నడిపించుకు పోతున్నారు... చాలమంది కుక్కలను పెంచుతారు. కాని, నిజానికి పిల్లులే మంచివి. ఇది అందరూ ఒప్పుకోక పోవచ్చు. కాని, నాకు మాత్రం పిల్లి అంటేనే ఎక్కువ ఇష్టం...కుక్కను

పెంచితే లాభాలెక్కువ....ఈ అమ్మాయి ఎవరో బొడ్డు క్రిందకి చీరెకట్టి పొట్టి రవిక తొడిగి నిలబడివున్నది... ఎదురుగాకొట్లో ఎవరో ఫోనులో పెద్దగా అరుస్తున్నాడు. ఆ అరుపులు అవతలివారికి వినిపించేందుకు వేరే ఫోనెందుకు? అనిపించింది... ఈ బస్సు ఖాళీగానే వచ్చిందిగాని మనకు పనికిరాదు... జనం బిలబిలలాడుతూ ఎక్కేశారు- ఆ బస్సుపొట్ట నిండిన రాక్షసుడిలా 'బేవ్' మని త్రేన్చి బయలుదేరి వెళ్ళిపోయింది....బస్సుస్టాప్ ప్రక్కన నీడకోసం ఎవరో ధర్మాత్ములు కట్టించిన కట్టడం మీద పెద్ద అక్షరాలతో "ఫలానావారి జ్ఞాపకార్థం వారికుమార్తు ఫలానావారి ధర్మం" అని వ్రాసివుంది. ఎదురుగా ఒక ఆడపిల్ల సైకిలు తొక్కుతూపోతున్నది.

అదుగో! బస్సు వచ్చేసింది...ఆగింది కూడా... డ్రైవరు నల్లగా లావుగా ఉన్నాడు. సీటునిండా ఉన్నాడు. దయతలచి ఆపిన వాడిలా ఆపి అంతలోనే ముందుకు లాగించాడు. నేను ఉదుటన కమ్మీ పట్టుకుని ఎక్కేశాను. అమ్మయ్య! ఎలా అయితేనేం! మొత్తంమీద బస్సులో పడ్డా.... నడక బాధ తప్పింది. ఒక చేతిలో కాగితాలు భద్రంగా పట్టుకుని మరో చేత్తో పడిపోకుండా పై కమ్మీ పట్టుకుని నిలబడ్డాను. టిక్కెట్టు తీసుకునే టప్పుడు మాత్రం పావలా ఖర్చయిపోతున్నదే అనిపించి మనస్సు చివుక్కుమన్నది. వెనక కొందరు కూర్చుని గల గల మాట్లాడుకుంటు న్నారు. బహుశా యూనివర్శిటీ విద్యార్థులై వుంటారు.... అందరూ ఉత్సాహంతో నిండిన బెలూన్ల లాగున్నారు. జోకులమీద జోకులు వేసు కుంటూ ఒకరిమీద ఒకరు వాలిపోతూ త్రుళ్ళిపడిపోతున్నారు. నేను వారి వంకనేచూస్తూ నిలబడ్డాను. అంతలో ఒక అమ్మాయి నా వంక చూసింది. వెంటనే మరో అమ్మాయితో నన్ను చూపించి ఏదో చెప్పింది. ఇద్దరూ నా వంక చూసి ఫక్కున నవ్వారు. 'ఏమిటా' అని నా వంక నేను చూసుకున్నాను. జేబునిండా సిరా.... పెన్ను లీకవుతున్నట్టున్నది. అయ్యయ్యో! చూసుకోనేలేదు. అరచేతి వెడల్పున జేబు పాడయింది. ఛీ! ఛీ! ఈ వెధవ పెన్ను తీసుకురాకపోయినా బాగుండేది.... దాన్ని ఇవతలికి తీసి చేత్తో పట్టుకున్నాను. బస్సు వేగానికి గాలి విపరీతంగా వీస్తూ నున్నగా శ్రద్ధగా దువ్వుకున్న జుట్టునంతా చిందర వందర చేసింది.

దిగవలసిన స్టాపులో దిగి నడవసాగాను. అప్పుడు తెలిసింది. బస్సు ఎక్కే హడావిడిలో చెప్పు ఉంగటం తెగిందని. నవ్వు వచ్చింది. అలాగే నడిచాను. ఎండలో తీక్షణత ఎక్కువై సూదులతో పొడుస్తున్న ట్టుగా ఉంది. దాహం వేస్తున్నది. పక్కనేవున్న హోటల్లోకి వెళ్ళి తాపీగా రెండు గ్లాసుల నీళ్లు తాగి ఇవతలికి వచ్చాను. తర్వాత నడక...

అది పెద్ద ఆవరణ...ముందు పెద్ద ఇనుపగేటు... లోపల పెద్ద పెద్ద చెట్లు...వాటికి పూలున్నాయా? కొన్ని ఉన్నట్టున్నాయి. మొత్తానికి అన్నీ ముసలి చెట్లు...లోపలికి చక్కని కాలిబాటలు...ప్రక్కన చిన్న చిన్న మొక్కల వరుసలు...భవనం బలమైన కొండరాళ్ళతో కట్టారు... బయట బాగా వుందిగాని, లోపల జైలులాగా వుంది... పెద్ద ఆఫీసే... లోపల చాలామంది పనిచేస్తున్నారు.బల్లలమీద కట్టలుకట్టలు కాగితాలు... ఫైళ్ళు...కొన్ని గదులు మరీ అడవుల్లాగా వున్నాయి.

ఒకాయనను సమీపించి మా ఇంటర్వ్యూ జరిగేదెక్కడో కనుక్కు న్నాను. ఆయన మాటా పలుకూ లేకుండా కేవలం చేత్తో సైగచేసి వెళ్ళి పోయాడు.

అటువైపు వెళ్ళిచూస్తే ఒక్కసారిగా నీరసం ఆవహించినట్టయింది. ఆ వరండాలో ఇరవై ముప్పయిమంది వరకూ ఉన్నారు.... రకరకాల వ్యక్తులు....రకరకాల డ్రస్సుల, వయస్సుల, వాలకాలవారున్నారు. కొందరి ముఖాలలో ధైర్యం....ధీమా.... ఎక్కువ మంది ముఖాలలో దైన్యం....నిరాశ....కొందరు అతి మామూలుగా ఉన్నారు. కేవలం ఇద్దరు ముగ్గురు మాత్రమే కాస్త అతిశయంగా ఉన్నారు.... ఒకాయన బెంచీమీద కూర్చుని సన్నగా ఈలవేస్తున్నాడు. బహుశా జేబుడబ్బుతోనో, రికమెండేషన్లతోనో బరువుగా ఉండే ఉంటుంది. మాటిమాటికి జేబు తడువుకుంటున్నాడు కూడా.

నేను ఒకప్రక్కన గోడకానుకుని నిలబడ్డాను. ఎందుకో అంతలో మనస్సు బరువెక్కింది. మొహం రుమాలుతో తుడుచుకుని జేబులో నుంచి చిన్న దువ్వెన ఇవతలికి తీసి తలదువ్వుకున్నాను. తర్వాత నేను కూడా ఈల వేద్దామనుకున్నాను కాని వేయలేదు.

ఒక ఇరవైఏళ్ళ యువకుడు నా దగ్గరికివచ్చి "అగ్గిపెట్టెవుందా ?" అని అడిగాడు. నేను తల అడ్డంగా ఊపాను. 'పోన్లెండి' అంటూ తాను కూడా నా ప్రక్కనే నిలబడి "ఇంటర్వ్యూకేనా ?" అని అడిగాడు.

"అవున"న్నాను.

అతడు చప్పరించి "ప్చ్! లాభంలేదండీ.... ఈ ఉద్యోగాలు మనకు రావు" అన్నాడు. మళ్ళీ నెమ్మదిగా రెండుమూడుసార్లు "లాభం లేదు...లాభంలేదు..." అని గొణిగాడు. తర్వాత కొద్దిగా మాసిన గడ్డం తడవుకున్నాడు. "ఎన్నో ప్రయత్నాలుచేశాను. యోగ్యతలూ,అర్హతలూ అన్నీ వున్నాయి. కాని శని కూడా వుంది... ఈ ఉద్యోగాలన్నీ ఇదివరకే ఫిలప్ అయిపోయి వుంటాయి. డబ్బండీ... అంతా డబ్బుతో నడుస్తున్నది. ప్రపంచం...ఈ ఉద్యోగాలు కూడా రావు మనకు. అంతే" అన్నాడు మళ్ళీ.

"రాదనుకుంటూ ఇంటర్వ్యూ కెందుకు వచ్చారు ?" అని అడిగాను నేను.

అతడు నవ్వి "ఇక్కడికి వచ్చేవరకూ కొంచెం ఆశ వుంది. అరగంటనుంచీ ఇక్కడ జరుగుతున్న తతంగం చూస్తూవుంటే మతి పోతున్నది. మనం గమనించంగాని పెద్ద పెద్ద కుట్రలు కళ్ళముందు జరిగిపోతుంటాయి. అదుగో! ఆ గడ్డంవాణ్ణి చూడండి. వాడు యేదో పెద్ద ప్రయత్నంలో ఉన్నాడు. ఎవరితోనో మాట్లాడటం, లోపలికి వెళ్ళడం మళ్ళీ యివతలికి రావడం, వీడికేదో చెప్పడం... ఇప్పటికిలా అయిదారు సార్లు జరిగింది. ఇప్పుడు మళ్ళీ వచ్చాడు చూడండి..." అన్నాడు.

నేను చూశాను. ఆ గడ్డంవాడు బల్లమీద కూర్చుని ఈలవేస్తున్న వ్యక్తి దగ్గరికి వెళ్ళి మాటలు కలుపుతున్నాడు. ముందు ఏదో అడిగాడు. తర్వాత సిగరెట్ ఆఫర్ చేశాడు. ఒక్క నిముషంసేపు దగ్గరగా జరిగి ఏదో మాట్లాడాడు. తర్వాత ఇద్దరూ లేచివెళ్ళి దూరంగా చెట్టుక్రింద నిలబడి మళ్ళీ మాట్లాడుకున్నారు. తర్వాత గడ్డంవాడటు వెళ్ళిపోయాడు. ఇతడు వచ్చి మళ్ళీ బల్లమీద కూర్చున్నాడు.

నా చేతి వ్రేళ్ళు వణుకుతున్నాయి. నా పక్కన నిలబడిన యువకుడు కళ్లు చిన్నవి చేసి చూస్తున్నాడు. ఏదో ఆలోచిస్తున్నాడను కున్నాను. ఉన్నట్టుండి బొంగురు గొంతుకతో "ఈ దేశం బాగుపడదు... సినిమా టిక్కెట్ల దగ్గర నుంచి ఉద్యోగాల వరకూ ఆ మాటకు వస్తే మంత్రి పదవుల వరకూ ఇదే తంతు... లాభంలేదు— విప్లవం రావాల్సిందే—వచ్చి మొదలంటూ నాశనం అయితేకాని లాభంలేదు" అన్నాడు. తర్వాత ప్రక్కన ఎవరినో అడిగి అగ్గిపెట్టె తీసుకుని వణుకు తున్న వ్రేళ్ళతో సిగరెట్టు వెలిగించుకున్నాడు. మళ్లీ నా దగ్గరికి వచ్చి "రెండేళ్ళయింది— చదువై పోయి— ఇంతవరకూ ఉద్యోగం లేదు. చాలచోట్ల ట్రై చేశాను. ఇంట్లో పరిస్థితులేమో బాగులేవు. నాన్న చచ్చి పోయాడు. పెళ్ళి కావలసిన ఆడపిల్లలూ, చదువుకోవలసిన తమ్ముళ్లూ వున్నారు—" అంటుండగా అతని గొంతు గద్గదికమయింది. అంతలో సర్దుకుని "సారీ! యేదో అనవసరంగా మాటాడుతున్నాను. ఏమీ అనుకోకండి" అన్నాడు.

నేను నవ్వి "ఫరవాలేదు లెండి—నా పనీ అచ్చం అలాగే వుంది, పోతే మీరు చెప్పారు- -నేను చెప్పలేదు—అంతేతేడా అన్నాను.

అతడూ నవ్వాడు. అంతలో నెమ్మదిగా పిలుపులు రావడం మొదలయింది. అందరూ సర్దుకుని కూర్చున్నారు. కొందరి ముఖాలలో ఆత్రుత—మరికొందరి ముఖాలలో ఆనందం— కొందరు వాడిపోయి వున్నారు.

లోపలికి వెళ్ళి ఇంటర్వ్యూ ముగించుకు వచ్చిన ఒక వ్యక్తి నేరుగా వెళ్తున్నవాడల్లా మా దగ్గర ఆగి "మన దేశం ఆటంబాంబు తయారు చెయ్యాలా? వద్దా? అని అడిగితే ఏం చెప్పాలి? చెయ్యాలంటే ఒక గొడవ— కూడదంటే ఒక గొడవ. పైగా లోపలివాళ్ళు మహా గొప్పవాళ్ళయినట్టు అనవసరంగా నవ్వుతూ మనల్ని మరింత కంగారు పెట్టేయడం— ఈ వరసేం బాగులేదు—దారుణం—" అన్నాడు.

నా ప్రక్కన ఉన్న యువకుడు "ఎందరున్నారు లోపల" అని అడిగాడు.

"ముగ్గురు" అని చెప్పి ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు.

నాకు ఉదయం వచ్చిన కలలో కూడా నన్ను ఇంటర్వ్యూ చేసిన వారు ముగ్గురే—నాకు అంతలో తెలియని హుషారు వచ్చింది. సన్నగా కూనిరాగం తీస్తూ నిలబడ్డాను. కాని జేబువంక చూసుకుంటే బాధ అనిపించింది. అక్కయ్య ఎంతో శ్రద్ధగా ఉతికిపెట్టిన చొక్కా అనవసరంగా పాడైపోయింది— లోపల వాళ్ళుచూసి ఏమనుకుంటారో ?

అలా చాలా సేపు వేచివుండవలసి వచ్చింది. ఈ లోపల ఎటన్నా పోయి కాసిని కాఫీ నీళ్ళు తాగివద్దామన్నా వీల్లేదు. ఎప్పుడు పిలుపొస్తుందో తెలియదు కదా మరి !

ఒంటిగంట వేళకు ఇంటర్వ్యూలు ఆగిపోయాయి. లంచ్ టైం అన్నారు. మిగిలినవారు మరొక గంటలో తిరిగి రావాల్సి ఉంటుందని ప్యూను పెద్దగా అరుస్తూ చెప్పాడు.

నేనూ, ఆ యువకుడూ కలిసి ఇవతలికి వచ్చి దగ్గరలో ఉన్న హోటలులో ఏదో యింత తిని కాఫీ తాగాము. ఇద్దరం ఎవరి బిల్లు వారే ఇచ్చుకున్నాం. ఇవతలికి వచ్చాక అతడు సిగరెట్ ముట్టించాడు.

తిరిగి వచ్చి కాస్సేపు కూర్చున్న తర్వాత లోపలివారు కారులో వచ్చి దిగి లోపలికి వెళ్ళారు. ఒక పావుగంట విశ్రాంతి— మళ్ళీ పిలుపు మొదలు.

ప్యూను నా పేరు పిలవగానే ఉలిక్కిపడి లేచి కాయితాలు చేతిలోకి తీసుకుని పరుగు పరుగున వెళ్ళాను. వెనకనుంచి ఆ యువకుడు 'గుడ్‌లక్' అనడం వినిపించింది. కాని నేను వెనుదిరిగి చూడనైనా చూడలేదు.

స్ప్రింగ్‌డోరు తోసి లోపలికి అడుగుపెట్టాను. ఎదురుగాస్క్రీను -అవతల పెద్ద బల్ల—కుర్చీలలో సుఖంగా కూర్చునివున్న ముగ్గురు లు నములుతున్నారు. ఒకాయన మాటిమాటికీ పక్క కిటికీలోంచి ఉమ్మేస్తున్నాడు—మరొకాయన ఏకంగా కాళ్ళు జాపుకుని నన్ను కూర్చోమని ఎవరూ అనలేదు. నిలబడే

ఉండిపోయాను. కాగితాలు అందుకుని చూశారు. ఏవేవో అడిగారు. ఏదో చెప్పాను.... నా ఇంటి పరిస్థితులు వివరించి చెప్పాలనీ, ఉద్యోగం ఎంత అవసరమో చెప్పి ప్రాధేయపడాలనీ అనుకున్నాను. కాని అంతలో ఆ ముగ్గురిలో ఒకాయనను చూస్తూవుంటే నాకు హఠాత్తుగా ఎలుగుబంటి గుర్తువచ్చింది. ఎందుకు అలా గుర్తువచ్చిందో తెలియదు. ఒక కుర్చీలో తెల్లని గుడ్డలు వేసుకుని కిళ్ళీ నములుతూ ఎలుగుబంటి కూర్చునివున్న దృశ్యం.... నేను కంగారు పడుతూ చూపులు మరల్చుకున్నాను. అంతలో రెండో ఆయన ఎందుకో లేచాడు. ఆయన భారీ మనిషే. కానీ కాళ్ళూ చేతులు చాలా పొట్టివి. అంతలో నా మనసులో మరొకబొమ్మ. సముద్రాల ప్రక్కన పెంగ్విన్ అనే పక్షి ఉంటుంది. దాన్ని తెలుగులో ఏమంటారో తెలియదు.... దానికి ఒళ్ళంతా ఉదరమే.... గొంతునుంచి పాదాలవరకూ అంతా పొట్టే దానికి. కాళ్ళూ చేతులూ బుల్లిబుల్లివి. అచ్చు దానిలాగా ఉన్నాడీ వ్యక్తి.... నాకు నవ్వు వచ్చింది. కిసుక్కున నవ్వాను. ముగ్గురు నావంక చూశారు. తర్వాత నవ్వు యింకా రావడం మొదలైంది.... ఆపుకుందామనుకున్నాను.... కాని ఆ ప్రయత్నం ఫలించలేదు సరికదా నవ్వు తెరలు తెరలుగా రావడం మొదలయింది. జేబురుమాలు నోట్లో కుక్కుకుని ఆపుకోలేక లేచి మరీ నవ్వడం కొనసాగించాను.

వారు ఒకరి మొహంలోకి ఒకరు చూచుకున్నారు. "ఎందుకలా నవ్వుతావు?" అని గద్దించాడు మరొకాయన. ఆయన నేను లోపలికి వెళ్ళినప్పటి నుంచీ కదలక మెదలకకూర్చుని వున్నాడు. చచ్చిపోయిన తర్వాత కొందరిని కుర్చీలో కూర్చోబెట్టి అవసరమైతే నడుంకూడా పట్టుకుని శవాలకు ఫోటోలు తీయిస్తూ వుంటారు. ఈ మూడో వ్యక్తి అదేవాలకం.. పైగా ఆడగొంతు.

నా నవ్వు ఆగలేదు. అలాగే లేచి కాగితాలందుకుని నవ్వుతూ ఇవతలికి వచ్చేశాను. లేకపోతే ఆ మూడో ఆయన కోపం పట్టలేక చేత్తో పట్టుకొని వున్న గాజు పేపరు వెయిట్‌తో మొహం బద్దలు కొడతాడేమో అనిపించింది. ఇవతలికి వచ్చాక దిగులు పట్టుకుంది. ఎందుకిలా ఆపుకో లేనంత నవ్వువచ్చిందీరోజున? ఒక్కొక్కప్పుడింతే, ఖర్మకొద్దీ ఇలా

జరుగుతూ వుంటుందంతే—కనీసం వచ్చేటప్పుడు ఆగి నమస్కారమన్నా చెయ్యలేదు. ఘోరం అనిపించింది. కళ్ళనిండా నవ్వువల్ల నీళ్ళుతిరిగాయి.

ఆ యువకుడు నవ్వుతూ "నావంతు వచ్చింది. త్వరలో ముగించుకు వచ్చేస్తాను. ఉండండి కలిసి పోదాం...."అన్నాడు లోపలికి వెళ్తూ.

కొద్ది క్షణాలు నిశ్శబ్దం.... మొహం తుడుచుకున్నాను. కళ్ళు తుడుచుకున్నాను. ఇంతలో లోపల ఏదో గొడవ.... కేకలు.... ప్యూను వున్నటుండి లేచి లోపలికి వెళ్ళాడు.

మరుక్షణంలో ఆ యువకుడు దూసుకుని వేగంగా ఇవతలికివచ్చి "పదండి తొరగా పోదాం...." అన్నాడు.

ఇద్దరం దాదాపు పరుగెత్తుతూ రోడ్డు మీదికి వచ్చాము, ఖాళీగా వెళ్తున్న రిక్షాను ఆపి వెంటనే ఎక్కి "త్వరగా పోనియ్" అన్నాడతడు. రిక్షా రివ్వున వాలుగాలికి ప్రయాణం సాగించింది. ఫర్లాంగు దూరం వచ్చిన తర్వాత నేను ఊపిరి పీల్చుకుని అడిగాను.

"ఏం జరిగింది?"

"ఏమీ లేదు ఉద్యోగం రాదన్నారు.... నాకు కోపం వచ్చింది. నిలబెట్టి కడిగేశాను. ఏమీ మిగల్చలేదు. డబ్బుతిని ఉద్యోగాలిస్తున్నారనీ, కక్కుర్తిపడుతున్నారనీ ఒకటేమిటి కడుపు మంట అంతా వెళ్ళకక్కేశాను. చివరకు "గెటవుట్" అన్నారు. కోపం ఆగక పేపరు వెయిట్ అందుకుని గోడకేసి విసిరి కొట్టాను....ఇవతలికి వచ్చేశాను...అంతే...."

సెంటర్లో దిగి రిక్షా పంపేసి ఒకరి ముఖంలోకి ఒకరం చూచుకుంటూ కొద్ది క్షణాలు నిలబడి పోయాము. ఎవరమూ ఏమీ మాట్లాడలేదు. పలుచని సాయంకాలపు బంగారు రంగు ఎండ... జనంతో నిండి కోలాహలంగా ఉన్న రోడ్డు....బస్సులరద్దీ...రంగులు...రంగులు...

ఉన్నట్టుండి అతడు చెయ్యిచాపి "వెల్! లెటజ్ పార్ట్" అన్నాడు.

నేనూ చెయ్యి అందించాను. మరుక్షణంలో ఇద్దరం చెరో వైపునా జన సముద్రంలో కలిసిపోయాము. నాకు మళ్ళీ నవ్వు వచ్చింది. ఎంత ఆపుకున్నా ఆగలేదు. ఒక చోట గోడమీద పోస్టరు చూస్తున్న మిషతో ఆగి కరువుతీరా నవ్వుకున్నాను. తర్వాత బంగారు రంగు ఎండ కెదురుగా నడవసాగాను... ఈల వేస్తూ...

# సావిత్రి

రజని కిటికీ దగ్గరికి వచ్చి నిలబడింది.

కిటికీలో నుంచి కత్తిరించిన నల్లని కాయితం ముక్కలాగా కనిపిస్తున్న ఆకాశంలో నక్షత్రాలు బొత్తిగా లేవు.

పిలిస్తే బదులు పలుకుతుందేమో అన్నంత దట్టంగా చిక్కగా వుంది చీకటి. ఆకాశంలో అలజడి. యుద్ధానికి సన్నద్ధమవుతున్న గజ సైన్యంలా జలావర్ణమైన మబ్బులు గర్జిస్తున్నాయి. ఇప్పుడో, మరి కాస్సే పటిలోనో కుంభవృష్టి ప్రారంభం అయ్యేట్టు ఉన్నది. వర్షం మొదలైతే ఇక ఆగదు. ఆకాశంలోనుంచి ఏవో అదృశ్య శక్తులు భూమిని బలమైన తాళ్ళతో పైకి లాగుతున్నట్టే కురుస్తుంది.

రజని ఇవతలికి వచ్చి చాపమీద కూర్చున్నది. చిన్న గది. గోడ పక్కనే పాత ట్రంకు పెట్టె...కిటికీ ఇవతలగా చిన్న ఫొటో. అందులో కొత్తగా పెళ్ళయిన దంపతులు. రజని అందులో కుర్చీకి చెయ్యి ఆనించి సిగ్గుతో తల వంచుకుని నిలబడి వుంది. ప్రభాకర్ కుర్చీలో గంభీరంగా కూర్చుని వున్నాడు. సన్నటి మీసాలు. పెద్ద నుదురు. ఎదిగిన చెంపలు. పెద్ద పెద్ద కళ్ళు...అంత మనిషీ అకస్మాత్తుగా పోయాడు. రజనికి మిగిలింది అయిదు నెలల పసికందు.

రజని పమిటకొంగు దగ్గరగా లాక్కుని చెవులు చుట్టూ కప్పుకుని పెట్టె తెరచింది. ఏదో రెండు పుస్తకాలు...ఒక చిన్న ఫైలు... రెండో మూడో చీరెలు, జాకెట్లు. ప్రభాకర్ తాలూకు ఎప్పటిదో డైరీ...అందులో అక్కడక్కడా మామూలు లెక్కలుతప్ప ఎక్కువ పేజీలు ఖాళీ...రజని ఫైలుతీసితిప్పింది. బుద్ధిగా చదువుకున్నందుకు ఫలితంగా వచ్చిన డిగ్రీ... ట్రైనింగ్ సర్టిఫికెట్. మొదటి హిందీ పరీక్ష ప్యాసైన సర్టిఫికెట్. ఏవో

అప్లి కేషన్ల కాపీలు, ఇటీవల తనను పనిలేదని ఉద్యోగంలోనుంచి తీసేస్తు న్నట్టు స్కూలు వారిచ్చిన నోటీసు... దస్తూరీ సరిగా తెలియకుండా గందరగోళంగా ఉన్న ఒక మనియార్డరు రశీదు, రజని నిట్టూర్చింది. దీపంలో కిరసనాయిలు అయిపోయినట్టున్నది. వెలుగు మందగిస్తున్నది. పైన ఆకాశంలో మబ్బుల కోలాహలం పెరుగుతున్నది. పక్క గదిలోకి వెళ్ళే తలుపు మూసి ఉంది. సావిత్రి ఇప్పుడల్లా రాదు. తెల్లవారుతూ వుండగా గాని రాదు.

సావిత్రి ఎర్రగా వుంటుంది. అంతలావూ కాదు, అంత సన్నమూ కాదు. మొహాన చిన్న చిన్న ఎర్రని మచ్చలుంటాయి. ఎనిమిదో తరగతి వరకూ చదివానని చెబుతూ వుంటుంది. చదువుకునే రోజుల్లో తాను మరీ సన్నగా ఎర్రగా వుండేదనీ, అందరూ తనకు "ఎర్ర తేలు" అని పేరు పెట్టారనీ కూడా చెప్పిందొకసారి. రోజూ రాత్రి ఎనిమిది, తొమ్మిది గంటలవేళ సింగారించుకుని బయల్దేరి వెళ్ళిపోతుంది. ఒక్కోసారి మొదటి ఆట సినిమాకు వెళుతుంది. కాని మళ్లీ తెల్లవారుజాము వరకు రాదు. సావిత్రి కెవరూలేరు. రజనికీ ఎవరూ లేరు. ఆ పసిపిల్ల విజ్జీ తప్ప.

సావిత్రి విజ్జీని చంకన వేసుకుని వెళుతున్నది రెండు మూడు రోజులుగా.రాత్రల్లా పసిదాన్ని ఎక్కడ పడుకోబెడుతుందో,ఏం చేస్తుందో ఆ భగవంతుడికే తెలియాలి.

సావిత్రి మనిషి మంచిదే. రజని ఉన్నట్టుండి ఉద్యోగం పోయి బాధలో ఉంటే సావిత్రి ఆదరించింది. ఏం సంపాదిస్తుందో, ఎలా సంపాదిస్తుందో రజనికి ఆమె ఎప్పుడూ చెప్పలేదు కాని, రజనికూడా అంత లోకంతెలియని అమాయకురాలేమీ కాదు. ఆమెకు తెలియక పోలేదు.కాని ఎప్పుడూ పైకి తేలలేదు. ఈ పది రోజుల పరిచయంలోనూ రజని తాను అసలు ఏమీ తెలియనట్టే మెలగుతూ వచ్చింది. కాని రెండు మూడు రోజుల నుంచి తనను బతిమలాడి, ఒత్తిడిచేసి విజ్జీని ఎత్తుకుపోతుంటే బాధగా ఉండి కూడా రజని ఎదురు చెప్పలేదు. ఇవాళ మాత్రం ఆమె మనసెందుకో వికలంగా ఉంది. బయటి ప్రకృతిలాగే ఆమె మనసులో కూడా ఎందుకో కారణంలేని అలజడి. మాటిమాటికి కళ్లెందుకో చెమర

స్తున్నాయి. ఆమె లేచి మళ్ళీ కిటికీ దగ్గర నిలబడి బయటికి చూసింది. అకస్మాత్తుగా చల్లనిజల్లు ఆమె మొహంమీద కొట్టినట్టయింది. శరీరం జలదరించింది. కొద్ది క్షణాల్లో గాలి విసురు తగ్గి వర్షం నిలిచి కురవడం ప్రారంభించింది. రజని పమిటతీసి మళ్ళీ వేసుకుంది. జాకెట్ మొనలు తడిసి వున్నాయి. గదిలో లాంతరు కొడిగట్టి వెలుగు పూర్తిగా మందగించింది.

* * *

"ఇంత వర్షం యీ మధ్య ఎప్పుడూ చూడలేదు" అనుకున్నది సావిత్రి. వీధి చివరి వరకూ లైట్లు మందంగా వెలుగుతున్నాయి. చిన్న వరండాలో చివరగా నిలబడివుంది ఆమె— భుజంమీద విజ్జి నిద్రపోతున్నది. వర్షం చప్పుడుచేస్తూ కురుస్తున్నది. వీధి నిర్మానుష్యంగా ఉంది. ఉండి ఉండి ఒక్కొక్క రిక్షా గుంటలలో పడుతూ లేస్తూ వెడుతున్నది. ఆ వరండా చిన్నది. రోడ్డు మీదికి వుంది. ఇల్లు మాత్రం ఎవరిదో, తాళం వేసి వుంది. వరండా అవతలి చివర ఒక నడివయస్కుడు స్తంభం ఆనుకుని నిలబడి సిగరెట్టు కాలుస్తున్నాడు.

సావిత్రి అతనితో మాటలు కలిపింది, కొద్దిగా వొణుకుతూ.

"ఈ వాన తగ్గేట్టు లేదు" అన్నది.

అతడు తలతిప్పి చూశాడు. చూసి సిగరెట్టు నుసి విదిలిస్తూ "అవును. తగ్గేట్టులేదు. ఒక రిక్షా వొచ్చినా బాగుండును ఇంటికి పోవచ్చు—" అన్నాడు.

సావిత్రి మరేమీ మాట్లాడకుండా కాస్సేపు అతని వంక చూస్తూ నిలబడింది. అతడు కొద్ది క్షణాలాగి "మీరెక్కడికి వెళ్ళాలి ?" అని అడిగాడు.

సావిత్రి అతని దగ్గరగా వచ్చి "ఏదీ— అరగంట క్రితమే రైలు దిగాను. మళ్లీ హైదరాబాదు రైలు తెల్లవారితేగాని లేదు. ఏం చెయ్యాలో తోచటంలేదు. పైగా ఈ వాన—" అన్నది.

అతడు ఆమె వంక నిదానించి చూశాడు. తర్వాత ఏమనుకున్నాడో ఏమో, సిగరెట్టు పారేసి "మా యింటికొస్తే—రాదలచుకుంటే రావచ్చు— ఇంట్లో ఎవరూలేరు. తెల్లవారిన తర్వాత రైలుకు పోవచ్చు—" అన్నాడు.

సావిత్రి నెమ్మదిగా "డబ్బులేదు పర్సు పోయింది—" అన్నది.

అతను అనుభవజ్ఞుడు— అర్థం చేసుకున్నాడు. నేనిస్తాను. ఖాళీ రిక్షా వొస్తే వెడదాం మా ఇంటికి. ఇల్లు విడిగా వుంటుంది. ఏ యిబ్బందీ వుండదు. డబ్బెంత కావాలి?" అన్నాడు.

సావిత్రి ముందు 'మీ యిష్టం' అని తర్వాత 'యాభై ఇవ్వండి' అన్నది. అతడు తల వూపాడు. ముందుకువంగి వీధి చివరకు చూశాడు. రిక్షాకోసం—నిలువెల్లా రెయిన్ కోటూ, తలపైన టోపీ ధరించి సైకిల్ మీద ఒక పోలీసు వస్తున్నాడు. ఇందాక అతడు ఇటే వెళ్ళాడు. మళ్ళీ ఇటే వస్తున్నాడు. వరండాలో నిలబడ్డ వీరిద్దరి వంకా ఇందాక వెడుతూ చూశాడు. ఇద్దరు చెరొక వైపు నిలబడి వున్నారిందాక. ఇప్పుడు దగ్గరగా చేరారు. వెడుతూ తల తిప్పి సావిత్రి వంక చూశాడు. అతనికి అనుమానం వేసింది. 'ఇది పాత కేసు లాగుందే' అనుకున్నాడు. అంతలో అతనికి గుర్తు వచ్చింది. కేవలం నెలరోజులు కూడా కాలేదు. ఒక లాడ్జింగులో తాను స్వయంగా పట్టుకున్నాడామెను. అతడిప్పుడు ప్రశాంతంగా ముందుకు వెళ్ళి వీధి చివర ఆగాడు.

రిక్షా ఒకటి పోతున్నది. ఆ వ్యక్తి "ఏయ్ రిక్షా ఖాళీయేనా!" అని అడిగాడు పెద్దగా.

రిక్షా వరండా పక్కకు వచ్చి మెట్లక్రింద ఆగింది. ఆ వ్యక్తి రిక్షా మాట్లాడి సావిత్రి వంక తిరిగి "పద" అన్నాడు. ఇద్దరూ కూర్చున్న తర్వాత రిక్షా కదిలింది. వీధిలో చిన్న చిన్న గుంటలలో నీళ్లు నిలిచి వున్నాయి. రిక్షా మలుపు తిరిగింది.

అతడు సావిత్రి భుజం మీద చెయ్యివేశాడు. తర్వాత నెమ్మదిగా! "పిల్లా? పిల్లవాడా?" అని అడిగాడు.

"పిల్లే- అయిదు నెలలు" అన్నది సావిత్రి. ఈ మాటలు అని అతని వంక మందమైన వెలుగులో నవ్వుతూ చూసింది.

ఉన్నట్టుండి రిక్షా ఆగింది. "ఏమిటి?" అన్నాడతను ముందుకు చూసి. ఎదురుగా పోలీసు నిలబడి వున్నాడు. అతని రెయిన్‌కోటుమీద

నీళ్ళుపడి వీధి దీపం వెలుతురులో మెరుస్తూ క్రిందికి జారుతున్నాయి. సావిత్రి భుజంమీద విజీని రెండో భుజంమీదికి మార్చుకుంది. "ఏమిటి?" అని అడిగాడు అతను పోలీసు నుద్దేశించి.

పోలీసు సైకిల్ స్టాండువేసి "ఆవిడ ఎవరు ?" అని అడిగాడు.

ఆ వ్యక్తి కొంచెం సందేహిస్తూనే లో గొంతుకతో 'నా భార్య' అన్నాడు. అతని గొంతు అతనికే చిత్రంగా వినిపించింది.

"ఏమిటిసార్ పెద్దవారు, చదువుకున్నవారు, ఎందుకబద్ధాలు చెబుతారు. వొళ్ళమ్ముకునే ఆడదాన్ని పట్టుకుని భార్య అని చెప్పేంత ఖర్మ ఏం పట్టిందండీ సార్ మీకు?"

ఆ వ్యక్తి గతుక్కుమన్నాడు. సావిత్రికి గుండెలు జల్లుమన్నాయి. పోలీసు సావిత్రి నుద్దేశించి "ఏయ్? నిన్ను ఎన్నిసార్లు స్టేషనుకు తీసుకు వెళ్ళలేదు నేను? నీ పేరేమిటి?" అన్నాడు.

"సావిత్రి" అన్నదామె నెమ్మదిగా.

"సరే... స్టేషనుకు పదండి!"

ఆ వ్యక్తి గాభరాపడిపోయాడు. కళ్ళముందు ఆఫీసూ, పరువు ప్రతిష్టలు గిర్రున తిరిగాయి. ఉన్నట్టుండి రిషాదిగి పోలీసుతో 'నేను... నేను' అంటూ నసుగుతున్నాడు.

"ఏమిటండి...ఏమిటి మీరనేది ?" అన్నాడు పోలీసు. ఆ వ్యక్తి పోలీసును పక్కకు తీసుకువెళ్లి నెమ్మదిగా మాట్లాడటం సాగించాడు. సావిత్రి పాము గొంతుకలో పడిన ఎలుకలా నిస్సహాయంగా కూర్చుండి పోయింది. అతని మాటలలో "ఆఫీసు తప్పదు... వెళ్లి తీరాలి. ఈసారికి చెడ్డపేరు..." అని కొన్ని మాటలు మాత్రం వినిపించాయి.

తర్వాత కృతార్థుడయిన పోలీసు "సరే మీరు వెళ్ళండి" అనడం వినిపించింది. సావిత్రి తల పక్కకు తిప్పి చూస్తే ఆ వ్యక్తి వర్షంలో పెద్ద పెద్ద అంగలు వేస్తూ నడిచిపోవడం కనిపించింది.

పోలీసు రిశావాడితో 'పదరా. స్టేషనుకు పోనియ్' అని తాను సైకిలెక్కాడు.

* * *

చిన్న కటకటాల గదిలో నలుగురు ఆడవాళ్ళున్నారు. మాసిన చీరెలతో, ప్లాస్టిక్ పూసల గొలుసులతో, జాకెట్ల వెనక నూనెడాగులతో, తాంబూలం వల్ల గారపట్టిన పళ్ళతో, తలల్లో వాడిన పూలతో – వాడిన పూలకు మల్లే చూడగానే వ్యభిచారిణులని అర్థమైపోతున్నది.

తలుపు 'కీచు' మని చప్పుడుచేస్తూ తెరుచుకున్నది. సావిత్రిని పిల్లతో సహా లోపల ప్రవేశపెట్టి మళ్లీ తలుపు మూశారు. లోపలవున్న వారందరూ ఆమెవంక ఒకసారి చూసి మళ్ళీ మామూలుగా సర్దుకున్నారు. సావిత్రి కొద్ది క్షణాలు గోడకానుకుని నిలబడి తర్వాత అలాగే కూల బడింది. పిల్లను వొళ్ళో పడుకోబెట్టుకుంది. గుడ్డ సరిగా కప్పింది. కొంగు తల చుట్టూ తిప్పి చుట్టుకుని ఒక్క క్షణం కళ్లు మూసుకున్నది. ఆమెకు అంతలో రజని గుర్తుకు వచ్చింది.

బయట వర్షం భూమిమీద మబ్బులు పగబట్టినట్టు, కసి తీర్చు కుంటున్నట్టు ఎడతెగని వర్షం.

కటకటాలకవతల ఒక పోలీసు స్టూలు మీద కూర్చుని బీడీని శ్రద్ధగా కాలుస్తున్నాడు. కాలుస్తూ అందులో ఆనందం అనుభవిస్తున్నట్టు ఉండి ఉండి పారవశ్యంతో కళ్లు మూసుకుంటున్నాడు.

* * *

సావిత్రి ఉలిక్కిపడి కళ్లు తెరిచింది.

అర్థరాత్రి దాటి వుంటుంది. పిల్ల ఎప్పుడు మేలుకున్నదో ఏమో, ఏడుస్తున్నది. పెద్దగా ఏడుస్తున్నది.

సావిత్రి సర్దుకుని కూర్చుని పిల్లను సముదాయించే ప్రయత్నం చేసింది. చుట్టూ చూసింది. ఎక్కడి వారక్కడ కునుకుతున్నారు.

పిల్ల ఏడుపు విని ఒకామె కళ్లు తెరిచి కాస్సేపు చూసి ఉన్నట్టుండి నవ్వి "నలుసంతలేదు... పెద్దగొంతే..." అన్నది.

సావిత్రి చేత్తో పసిదాని పొట్టమీద కొడుతూ సముదాయిస్తున్నదీ. కాని ఫలితం లేకపోయింది. కటకటాల కవతల స్టూలు మీద వున్న పోలీసు ఆవులిస్తూ, చిటికెవేసి, "ఏయ్! ఎవరది? ఏమిటాగోల?" అని అడిగాడు.

అవతలి ఆమె అకారణంగా నవ్వుతూ "ఏమున్నదీ? పసిపిల్ల ఏడుస్తున్నది" అన్నది సమాధానంగా.

అతడది విని "అది తెలుస్తూనే వుంది" అన్నాడు. తర్వాత సావిత్రి నుద్దేశించి "ఏయ్ ఆకలై ఏడుస్తున్నదేమో? పాలివ్వు పడు కుంటుంది..." అన్నాడు. సావిత్రి గతుక్కుమన్నది. నిజమేనేమో పైకి మాత్రం "కడుపులో నొప్పో ఏమో" అన్నది.

"పాలివ్వు ముందు లేకపోతే రాత్రల్లా అందరికీ తలనొప్పి" అన్నాడు పోలీసు గొంతు పెద్దదిచేసి.

అవతలి ఆమె "అవును ఆకలై ఏడుస్తున్నది. పాలివ్వు..." అన్నది. సావిత్రి ఇరకాటంలో పడింది. పిల్ల ఏమో ఏడుపు మానలేదు. సరికదా ఎవరో తొడపాశం పెట్టినట్టు పెద్ద గొంతుకతో 'కెవ్వు కెవ్వు'న ఏడుపు సాగిస్తున్నది.

సావిత్రి సముదాయించే ప్రయత్నం మానలేదు. పిల్ల ఏడుపు మానలేదు. కునుకు తీస్తున్న వారందరికీ మెలకువ వచ్చింది. అందరూ కళ్లు పెద్దవి చేసుకుని చూస్తూ కూర్చున్నారు.

బయట కూర్చున్న పోలీసు మళ్లీ పెద్దగా "ఏవమ్మోవ్! ఏమిటీ న్యూసెన్సు? పాలిచ్చి పడుకోబెట్టమంటే వినిపించుకోవేం?" అని, మళ్ళీ "అర్ధరాత్రివేళ ఈ గొడవ ఏమిట్రా దేవుడా" అనుకున్నాడు అందరికీ వినిపించేట్టుగానే. తర్వాత లోపలికి వెళ్ళి 'గణగణ' మోగుతున్న ఫోను అందుకుని ముందు వినయంగా "హలో ! ఎవరండి ?" అని ప్రారంభించి, ఆ తర్వాత పెద్దగా "ఏమిటీ ? అయ్యో ! ఇది హాస్పిటల్ కాదండీ బాబూ ! నా మాట వినండి ముందు.

ఇది హాస్పిటల్ కాదు... పోలీస్ స్టేషను. బోధపడిందా ? అవు నవును. రాంగ్‌నంబర్" అంటూ మాట్లాడి పెట్టేశాడు.

పసిపిల్ల యేడుపు మానలేదు. మరింత గొంతు పెంచి యేడు స్తున్నది. ఒకామె ఆవులిస్తూ "మా ప్రాణాలు తియ్యక పాలిచ్చి పడుకో మ్మా తల్లీ" అన్నది.

పోలీసు బీడీ వెలిగించుకుని పొగ వూదుతూ "ఇక ఊరుకో నమ్మాయ్ ! ఇంతమంది చెబుతుంటే వినిపించుకోవేం ? అయినా ఏం పోయే కాలం వచ్చి పడిందిరా దేవుడా! పిల్ల అట్లా ఏడుస్తుంటే రాయిలా కూర్చుంటావు. నువ్వేం తల్లివి" అన్నాడు కోపంగా.

సావిత్రి అన్నీ వింటూ శిలా ప్రతిమలా కూర్చుండిపోయింది.

కాస్సేపటిలో పరిస్థితి విషమించింది. అందరికీ నిద్రాభంగం కావడంతో అందరూ తలా ఒక మాటా అంటున్నారు. గొణుగుతున్నారు.

సావిత్రికి మెదడు మొద్దుబారిపోయినట్టున్నది. కొయ్యబొమ్మలా చలనం లేకుండా కూర్చుండిపోయింది

బయట వర్షం ఇంకా జోరుగా కురుస్తూనే వుంది. పిల్ల ఇంకా పెద్దగా ఏడుస్తూనే వుంది.

సావిత్రి జాకెట్టులోంచి చిన్న పర్సు తీసి డబ్బులు లెక్కపెట్టుకున్నది. మొత్తం తొమ్మిది రూపాయలు పైన కొంచెం చిల్లర ఉంది. ఆమెకు తల తిరిగినట్టయింది. రేపు బయట పడేందుకు ఖర్చెంత అవుతుందో ఏమో తెలీదు. ఈ అనుభవం ఆమెకు కొత్త కాకపోయినప్పటికీ ఇంత చికాకుగా ఎప్పుడూ లేదు. ఈ పిల్లతో పెద్ద బెడద వచ్చిపడింది. అంతలో ఆమె చిగురాకులా వొణికిపోయింది. ఒక నిముషం తర్వాత విపరీతంగా ఏడుస్తున్న పసిదాన్ని క్రింద పడుకోబెట్టి లేచి కటకటాల దగ్గరికి వచ్చి నిలబడింది.

పోలీసు కళ్ళతోనే "ఏమిట"ని ప్రశ్నించాడు.

సావిత్రి ఒక రూపాయి నోటు ఇవతలికి తీసి "పిల్లకు పాలు కావాలి" అన్నది.

అతడు కనుబొమ లెగరవేసి "అది తెలుస్తూనే వుంది. అయితే ఏం చెయ్యమంటావు ? నన్నిమ్మంటావా ?" అని అడిగాడు ఎగతాళిగా. లోపల ఎవరో నవ్వారు.

సావిత్రి ఒక్క క్షణం ఆగి "అది కాదు. పక్కన ఎక్కడన్నా చిన్న హోటలుంటే పాలు తెచ్చుకుంటానూ" అన్నది.

పోలీసు తల అడ్డంగా ఊపి "వీల్లేదు" అన్నాడు.

"పోనీ, మీరు వెళ్ళి తెచ్చిపెట్టండి... పసిపిల్ల గొంతు కెండుకు పోయి అల్లాడి పోతున్నది" అన్నది సావిత్రి.

అతడు కళ్ళు పెద్దవిచేసి చూశాడు. "ఏమిటీ? ఈ వానలోనా? భలే దానివే. అయినా నీ సంగతి చిత్రంగా వుందే... అసలు ఒక మాట చెప్పు. ఇందాక రైటర్ గారికి ఏం చెప్పావు? ఆ పిల్ల నీ పిల్లే కదా!" అని అడిగాడు.

సావిత్రి "అవున"ని తల వూపింది.

"అయితే... పిచ్చి వేషాలు కట్టిపెట్టి పాలివ్వు."

సావిత్రి స్థాణువులా నిలబడిపోయింది.

పిల్ల ఏడుపు తగ్గేటట్టులేదు. బయట వర్షం తగ్గేట్టులేదు.

పిల్ల ఏడుస్తూనే వుంది. కాకపోతే ఓపిక తగ్గి నెమ్మదిగా.

వర్షం తగ్గుముఖం పట్టింది.

నెమ్మది నెమ్మదిగా తెల్లవారింది. ముందు పక్షుల కలకలం. కాకుల అరుపులు. తర్వాత సన్నని వెలుగు. ఆ పైన బంగారు రంగు ఎండ. ఇలా తీరికగా, నెమ్మదిగా తెల్లవారింది.

ఒకామె "ఏం పిల్ల, ఏం పిల్ల...రాత్రల్లా ఏడుస్తూనే వుంది..." అన్నది.

పోలీసు "ఏం తల్లి... ఏం తల్లి... పిల్ల అట్లా ఏడుస్తుంటే రాయిలా కూర్చుందే తప్ప పాలివ్వలేదు..." అనుకున్నాడు.

* * *

కళ్ళజోడు బల్లమీద వుంచి కళ్ళు నులుముకుంటూ పోలీసుల కథనం విన్నాడు న్యాయమూర్తి. తర్వాత కాస్సేపు పైన కదులుతున్న గుడ్డ పంఖాకేసి చూశాడు. ఆడవాళ్ళందరిదీ ఒకటే నేరం. వ్యభిచారం.

ఆయన అంతలో ఏదో గుర్తుకు వచ్చినట్టు కళ్ళజోడు అందుకుని మొహానికి తగిలించుకుని అలవాటు ప్రకారం "ఒక్కొక్కరికి యాభై

రూపాయలు జరిమానా, చెల్లించకపోతే నెల రోజుల విడి ఖైదు" అని చివాలున లేచి వెళ్ళిపోయాడు.

సావిత్రికి గుండెలు దడదడ లాడాయి. మిగిలిన ఆడవాళ్ళకు కావలసిన వారెవరో వచ్చారు. జరిమానాలు చెల్లించారు. కొద్దిసేపట్లో అంతా వెళ్ళిపోయేందుకు సిద్ధపడ్డారు.

పోలీసు తల వూపుతూ "నీ సంగతి?" అని అడిగాడు.

సావిత్రి మాట్లాడలేదు.

ఈదురుగాలి వీస్తున్నది. కోర్టు ఆవరణలో వరంచాలో అలజడిగా వుంది.

ఒంటిగంట దాటి వుంటుంది.

"ఇంకా నిలబడే వున్నావేం?"

సావిత్రి తలయెత్తి చూసింది. ఎదురుగా మాణిక్యం...ఆరడుగుల భారీ మనిషి... నల్లగా, లావుగా ఉంది. నవ్వుతున్నది. గారకట్టిన పళ్ళు బయటకు కనబడుతున్నాయి. ఊళ్ళో ఎక్కడో పడుచు పిల్లలను చేర్చి వ్యభిచార గృహం నడుపుతూ వుంటుంది.

"డబ్బు లేదు" అన్నది సావిత్రి.

"అదీ తెలుస్తూనే వుందిలే... ఈ పిల్ల ఎవరిది?"

సావిత్రి సమాధానం చెప్పలేదు. పిల్ల వీపుమీద ఉన్న చేతికి ఒక్క విషయం మాత్రం తెలుస్తున్నది. ఇంకా అది బతికే వుంది. ఇక ఏడ్చే ఓపిక లేక సొమ్మసిల్లి నీరసంగా పడుకుని వుంది.

మళ్ళీ మాణిక్యమే "నెమ్మదిగా నేను కడతాను డబ్బు. పది రోజులపాటు మా ఇంటికి వస్తావా? బొత్తిగా చేతులు తక్కువై పోయాయి" అని అడిగింది.

సావిత్రి కళ్ళు మెరిశాయి. "అలాగే" అని తల వూపింది. కళ్ళలో నీటిపొర కమ్మింది.

తర్వాత కొద్ది సేపట్లో ఆ తంతు అంతా ముగిసింది.

సావిత్రి గబగబ అడుగులు వేసింది. మాణిక్యం వెనక నడుస్తూ నెమ్మదిగా "గుర్తుంచుకో...ఇవాళ్టినుంచే రా, రాత్రి ఏడుగంటలకల్లా

మా యింటికి రావాలి. తిండీ తిప్పలూ అక్కడే" అన్నది.

సావిత్రి తల వూపిందేగాని ఆగలేదు. త్వరత్వరగా ఆవరణ దాటి బయటికి వచ్చి రిక్షా ఎక్కింది.

రజని గుమ్మంలోనే వుంది. రిక్షా ఆగగానే ఆమె ఆదుర్దాగా మెట్లు దిగి ఎదురు వచ్చి చేతులు చాపింది. "ఏమయింది" ? అన్నది.

సావిత్రి భయం భయంగా పిల్లపంక ఒకసారి చూసి తర్వాత రజనికి అందించింది.

"ఏమయింది? ఏమయింది?" అన్నది రజని పిల్లనందుకుంటూ. సావిత్రి "పాలివ్వు" అన్నదంతే...మరుక్షణంలో తన గదిలోని చాప మీద పడిపోయింది.

అంతలోనే ఆమెకు ఏడుపు పొంగి వచ్చింది.

# దుర్దినం

అది దుర్దినం...

అంటే ఆకాశంలో దట్టంగా మబ్బులు పట్టిన రోజు...

ఆకాశం గచ్చకాయ రంగులో ఉంది. బలిసిన ఏనుగులన్నీ ఒక చోట చేరినట్టు జలార్ద్రమైన మబ్బులన్నీ ఒకచోట చేరి 'కురుస్తాం... కురుస్తా'మని గర్జిస్తున్నాయి.

పగలే చీకట్లు కమ్ముకొస్తున్నాయి. ఉండి ఉండి ఆకాశం ఆ చివర నుంచి ఈ చివరకు విద్యుత్తుతో గీత గీచినట్టు మెరుస్తున్నది. మెరుపుతీగ...ఇంకా జల్లు ప్రారంభం కాలేదు. ఈదురుగాలి వీస్తున్నది.

కనకయ్యశాస్త్రి గుండెల్లో కలుక్కుమన్నట్టయి చివాలున లేచి కూర్చున్నాడు.

మాసిపోయిన పాతగుడ్డను చెవుల చుట్టూ కప్పుకొంటూ కొంచెంగా వొణుకుతూ 'అబ్బో! వానొచ్చేట్టుందే' అనుకున్నాడు. వీధిలో జనం పలుచగా తిరుగుతున్నారు. బస్సు ఒకటి చెవులు బద్దలయ్యేలా హారను మోగించుకుంటూ 'రివ్వున' వెళ్ళిపోయింది. ఎదురుగా మురికినీళ్ళ మడుగు మధ్య ఉన్న మంచినీళ్ళ పంపుదగ్గర ఇద్దరు ఆడవాళ్ళు నిలబడి నీళ్లు పట్టుకొంటున్నారు. వాళ్ళలో వాళ్ళేదో మాట్లాడుకుని నవ్వుకుంటున్నారు. ఆ గాలి హోరులో వారి మాటలు కనకయ్యశాస్త్రికి వినిపించలేదు. వారిలో ఒకామె నిండుబిందెను చంక నెత్తుకుని వెళ్ళిపోయింది. రెండో ఆమె బిందెను కడిగి పంపుకింద పెట్టి అనవసరంగా చీరెను మోకాళ్ళవరకూ లాక్కుని నడుంమీద చేతులు పెట్టుకుని నిలబడి కనకయ్యశాస్త్రి వంక చూసింది.

కనకయ్యశాస్త్రి మళ్ళీ గుండెల్లో కలుక్కుమనగా చూపులు తిప్పు కున్నాడు. ఆమె నడివయసులో ఉంది. బిగించిన పైటలో ఎతులు కనిపి

స్తున్నాయి. పచ్చని పిక్కలపైన వెంట్రుకలున్నాయి. బిందె నిండి నట్టుంది. ఆమె అంతలో నిండిన బిందెను ఎత్తుకుని వెళ్ళిపోయింది; పంపు ఇంకా ధారగా పడుతూనే వున్నది. అది కట్టుబడదు. నీళ్ళు చప్పుడు చేస్తూ పడుతున్నాయి.

కనకయ్యశాస్త్రి ఎడమచేత్తో గడ్డం నిమురుకున్నాడు. తర్వాత పైకి చూశాడు. ఇప్పుడో, మరి కాస్సేపటిలోనో, కుంభవృష్టి ప్రారంభం కావచ్చు. మొదలయితే ఇక ఎప్పుడు తెరిపియిస్తుందో చెప్పడం కష్టం. బహుశా రోజల్లా విడవకుండా కురుస్తూనే వుండవచ్చు.

కనకయ్యశాస్త్రి విసుక్కుంటూ సర్దుకుని కూర్చుని ఎదురుగా నేలమీద ఉమ్మేశాడు. ఇవాళ ఎవరూ రాలేదు. అందరికీ పనులున్నట్టున్నాయి. అంటే అందరికీ ఇవాళ అన్నప్రాప్తి ఉందన్నమాట. తనకు పని లేదు. ఇవాళేకాదు, నిన్నకూడా పనిలేదు. పని లేకపోతే అన్నం ఉండదు. నిన్నల్లా అన్నంలేదు. మంగమ్మ మొన్న కనిపించి తానెక్కడో వంటకు పోతాననీ, కనకయ్యశాస్త్రిని సాయం పిలుచుకుపోతాననీ అన్నదేకాని, మాట నిలబెట్టుకోలేదు. అతడు నిన్నల్లా ఆమె కోసమే, కబురు కోసమే, ఎదురుచూస్తూ గడిపాడు. ఆమె రాలేదు సరికదా, కబురుకూడా రాలేదు. నిన్న ఆ విధంగా అభోజనంగా గడిచిపోయింది. రోజంతా తిండి లేకపోవడంచేత రాత్రి నిద్రకూడా లేదు. కాస్త కలతనిద్రపట్టినా అన్నీ కలలు.

కనకయ్యశాస్త్రికి ఇతరులకు వచ్చే కలలేవీరావు. ఎల్లప్పుడూ పంక్తిభోజనాలూ, పాయిఖానాలు మాత్రమే కలల్లోకి వస్తాయి. ఆ రెండూ దారిద్ర్య సూచనలని ఎవరో అన్నారు. అయినా తనకు కొత్తగా వచ్చిపడే దారిద్ర్య మేముంది గనుక. కాకపోతే మరింత తరచుగా తిండిలేక బాధపడవలసి వస్తుందేమో! అంతకు మించి తనను కొత్తగా వరించివచ్చే బాధలేవీ లేవు. కాకపోతే ఏ జబ్బయినా రావచ్చు. అది కొంతనయం. ఆరోగ్యంగాఉండి తిండిలేక బాధపడే బదులు ఏ జబ్బోచేస్తే లంఖణాలు చేయవచ్చు. ఆ మిషతో నయినా అన్న హితవూ ఆకలీ కొన్నాళ్ళపాటు చచ్చిపోతే మంచిది. లేకపోతే యీ ఆకలితో వేగడం కష్టం. అయినా

ఎవరో చెప్పినట్టుగా తనకు ఆకలి ఎక్కువ. ఉదయం లేచింది మొదలు పొట్టలో ఏదో నిప్పుల చక్రం గిరగిర తిరుగుతున్నట్టు ఉంటుంది. ఇంత జఠరాగ్ని పెట్టాడు దేవుడు తనకు. కాని, తిండికి భరోసా యివ్వలేదు.

కనకయ్యశాస్త్రి తనలోతాను అనవసరంగా నవ్వుకుంటూ చేత్తో ఛాతిమీద రుద్దుకుంటూ సత్రంగోడకానుకుని సర్దుకు కూర్చున్నాడు. ఆకలిని మరిచిపోయి ఇతర విషయాలు ఆలోచిద్దామని ప్రయత్నంచేశాడు కొంతసేపు. ఎదురుగా కుండలు, కూజాలు అమ్ముతూ కూర్చున్న పదహారేళ్ళ పడుచు పిల్లవైపు చూశాడు. తర్వాత చూపులు మరల్చి రోడ్డుమీద పసిపిల్ల నెత్తుకుని నడిచిపోతున్న నడివయసు యువతి వంక చూశాడు. ఆమె కనుచూపుమేర దాటిపోయిన తర్వాత తన పక్కనే ఎగిరి వచ్చి కూర్చుని 'కావు కావు' మని అరుస్తున్న కాకివంక చూశాడు. బహుశా దానికి కూడా ఎక్కడ పిండం దొరికి వుండదు. నోరెత్తి దీనంగా అరుస్తున్నది. కనకయ్యశాస్త్రి దానివంక తిరిగి "ఉండు. వచ్చినదాని వెలాగూ వచ్చావు...ఉండిపో నీకు పిండం కావాలి. నాకూ తిండి కావాలి...నువ్వు నిన్న తిండి తిన్నావా ? నాకు నిన్న కూడా తిండిలేదు. ఇవాళ నాకు గిరాకీ తగిలితే నిన్నుకూడా వెంట తీసుకుపోతాను. అక్కడ వాళ్ళకు చెప్పి పిండం మామూలుగా చిన్నదిగా కాక కొంచెం పెద్దదిగా చేయిస్తాను. బాగా నెయ్యికూడా వేయిస్తాను. ఎంత ఎక్కువ నెయ్యి వేస్తే నువ్వంత ఆప్యాయంగా తింటావనీ, వాళ్ళ పితృదేవతలు మళ్ళీ సంవత్సరం వరకూ ఆకలి ఎరక్కుండా తృప్తిపడతారనీ కబుర్లు చెప్పి నీ కడుపు నిండేట్టు చూస్తాను. కాస్సేపు ఉండు" అన్నాడు.

కాకి అంతసేపూ ఎర్రనినోరు తెరుచుకుని నిశ్శబ్దంగా ఉన్నదల్లా అంతలో మళ్ళీ 'కావు కావు' మని అరిచి, రెక్కలు టప టప లాడించి తలతిప్పి ఒకసారి కనకయ్యశాస్త్రి వంక చూసి, రివ్వున ఎగిరిపోయింది. 'దానికి పిండం అక్కర్లేదు కాబోలు' లనుకున్నాడు కనకయ్యశాస్త్రి. అంతలో అతనికి ఒక పెద్ద అనుమానం వచ్చింది. 'అసలు కాకులేం తిని బతుకుతాయి?' అని ప్రశ్నించుకున్నాడు. 'గింజలా? కాయలా? ఆకులా?'

అని కాస్సేపు వితర్కించుకున్నాడు. ఎటూ తేలలేదు. 'పోన్లే మన కెందుకు ? కాకులేం తిని బతికితే మనకెందుకు ? మన సంగతి మనం చూసుకోడం మంచిది' అనుకున్నాడు.

తర్వాత ఆశ నిండిన కళ్ళతో వీధి చివరకు మెడ నిక్కించి చూశాడు. తనకు కావలసిన వారెవరూ కనబడలేదు. ఒక పదేళ్ళ కుర్ర వాడు మాత్రం నూనె సీసా చేతిలో పట్టుకుని జారిపోతున్న లాగును మరొక చేత్తో పైకి లాక్కుంటూ నడిచి వస్తున్నాడు.

మబ్బులు పైన గుమిగూడి రొద చేస్తున్నాయి, పెద్ద సైన్యం ఆకాశంలో చేరి యుద్ధ భేరీలు మ్రోగిస్తున్నట్టు...

కనకయ్యశాస్త్రి లేచాడు. మాసిన బట్ట దులుపుకుని అటూ ఇటూ చూసి సత్రం మెట్లు దిగి కిందికి వచ్చాడు. రివ్వున వీస్తున్న చల్లనిగాలికి దుమ్ము లేస్తున్నది. అతడు రోడ్డు మీద నిలబడి ఒక్క క్షణం ఆలోచనలో పడ్డాడు. ఏమీ తోచక చేతివ్రేళ్లు విరుచుకున్నాడు. తర్వాత అనవసరంగా ఆవులించాడు.

అంతలో వర్షం ప్రారంభమైంది. ముందు పెద్ద పెద్ద చినుకులు 'టపటప' మని పడ్డాయి. తర్వాత ఒక అరనిమిషం ఏమీలేదు. అంతలో చూస్తూ చూస్తూ ఉండగానే కుంభవృష్టి ప్రారంభమైంది. ఆకాశం చిల్లి పడ్డట్టు, ధారగా కుండలతో కుమ్మరించినట్టు వర్షం పడటం మొదలైంది. కనకయ్యశాస్త్రి గబగబ పరుగెత్తి సత్రం మెట్లెక్కి వరండాలోకి చేరు కున్నాడు. వర్షం ఎడాపెడా పడుతున్నది. గాలి రివ్వున వీస్తున్నది. కనకయ్యశాస్త్రి చేతిని బయటికి చాపి వరండా చివరగా నిలబడ్డాడు. ఈ యేడాదికి ఇది మొదటి వర్షం. నిన్నటి వరకూ నిప్పులు చెరిగినట్టు ఎండ...నిప్పుల మీదినుంచి వచ్చినట్టు వేడిగాలి... వేసవి ప్రాణాలు తీసింది. ఇవాళ చల్లబడింది. పెనంమీద వేగుతున్నట్టున్న పృథ్వీమీద ఏ అజ్ఞాత దేవుడో కరుణించి నీళ్ళు కురిపిస్తున్నాడు.

కనకయ్యశాస్త్రికి పొద్దు తెలియలేదు గాని మొత్తానికి ఆకలివేస్తు న్నది. బహుశా పది గంటలయి వుంటుందేమో! లోపల ఆకలి కరకర

లాడుతున్నది. ఇప్పుడే ఏదన్నా ఏర్పాటు చేసుకుంటే తప్ప లాభంలేదు. లేకపోతే ఇవాళ కూడా పస్తే...

అతడు తడిసిన చేతిని తుడుచుకుంటూ 'ఇంత ఆకలి ఎందుకు పెట్టాడో దేవుడు నాకు' అనుకున్నాడు. అంతలో అతనికి నవ్వొచ్చింది. తిండికి లేకపోబట్టే తనకు ఇంత ఆకలి. అందరూ పుట్టేటప్పుడు 'ఈ పాడు ప్రపంచంలోకి, ఈ మాయలోకి, ఈ బురదగుంటలోకి ఎందుకు వచ్చి పడ్డామా' అని ఏడుస్తారట. తాను పుట్టడమే తిండి తిండి ఆకలి ఆకలి అంటూ పుట్టివుంటాడు. అసలు తల్లి పొట్టలో ఉండగానే తనకు తిండియావ ఎక్కువై వుండాలి. ఆమె తిన్న తిండి అంతా గర్భంలో ఉండి తానేకాజేసి వుండాలి. లేకపోతే తాను పుట్టగానే ఆమె చచ్చిపోయివుండదు. తాను నేలమీద పడిన రెండోరోజే ఆమె ఈప్రపంచం నుంచి సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయింది. తనకు తల్లి ఎట్లా వుంటుందో తెలియదు. తండ్రి సరే సరి...ముందే పోయాడు. వారూ వీరూ చెప్పడం తనకు గుర్తు ..తన తండ్రి తాను పుట్టక ముందు రెండు మూడు నెలల క్రిందట కొన్ని రోజులపాటు జబ్బుపడ్డాడు. జీవితంలో ఎన్నడూ తీర్రున చీది ఎరుగని మనిషి. ఒక్కపూట అయినా పక్కవెయ్యని మనిషి, నలుణ్ణి, భీముణ్ణి మరిపించగల విధంగా వందలాది మందికి ఒక్కచేతి మీద వంటచెయ్యగలిగిన మనిషి, పక్షం రోజులపాటు జబ్బుపడి వైద్యుడు చెప్పిన ప్రకారం నోరుకట్టుకున్నాడు. కాని జబ్బు తగ్గగానే పథ్యం చేసే మాత్రపు ఓపిక లేకపోయింది. ఆబగా అన్నీ తిన్నాడు. ఏమయిందో, ఏమో తెలీదు. ఒక్క రోజులో చిలకెరిగి పోయింది. ఆ తర్వాత తనను కడుపులో పెట్టుకుని ఆ తల్లి ఏ బాధల్ని పడ్డదో ఎవరికీ తెలీదు. తిన్నదో, పస్తులున్నదో కూడా ఎవరికి తెలియదు. తనను నేలమీద పడేసి తను కూడా వెళ్ళిపోయింది.

కనకయ్యశాస్త్రికి తన వయస్సెంతో సరిగ్గా తెలియదు. పుట్టిన తేదీ, సంవత్సరం, వగైరా లేవీ అతనికి ఖచ్చితంగా తెలియవు. తెలియక పోయినందువల్ల అతనికి వచ్చిన నష్టమూ లేదు. చిన్నతనంలో గాలికి

పెరిగాడు. వారి యింటా వీరి యింటా వారాలు చేసుకొని తిన్నాడు. కొన్నాళ్ళు వీధి బళ్లో చదువుకుందామని చూశాడు. అన్నాళ్ళూ పంతులు గారి యింట్లో ఆ పని యీ పనీ చివరకు వంటపనికూడా చెయ్యడంతో సరిపోయింది. అందువల్ల అతనికి వంట వచ్చినంతగా చదువు రాలేదు. అక్షరాలు కూడా సరిగా రాకుండా చదువు ముగిసింది. తర్వాత ఒకపురోహితుడివద్ద చేరాడు. ఆయన ఇంట్లో ఆయన కాక రోగిష్టిమారి భార్య, పదమూడు మందో పధ్నాలుగు మందో సంతానమూ... లంకంత కొంప ...కొంపనిండా పిల్లలూ... వారి దగ్గులూ, జలుబులూ...బియ్యమూ... ఖర్జూరపు కాయలూ...తమలపాకులూ ...వక్కలూ...మాసినగుడ్డలూ... ఇదీ వాతావరణం. కొన్నాళ్ళకు ఆయన పెద్దవాడై పోయాడు. పోయే ముందు మాటా పలుకూ లేదు. ఆయన పోగానే ఆయన సంసారం అంతా ఎక్కడో దూరపు పల్లెటూరికి, ఆమె పుట్టింటికి వెళ్ళిపోయారు. అప్పుడు బహుశా తన పన్నెండవ యేట కనకయ్య శాస్త్రి వీధిన పడ్డాడు. సెంటర్లో ఉన్న సత్రంలో మకాం. వాళ్ళనూ, వీళ్ళనూ ఆశ్రయించి వంటలకు సాయంగా వెళ్ళడం, శవాలను మోయడం, క్షుద్ర దానాలు పట్టడం, తద్దినాలకూ, మాసికాలకూ భోక్తగా వెళ్ళడం... ఇదీ పని. పర్వదినాల్లో కృష్ణ ఒడ్డున మంచి ప్రాక్టీసు ఉంటుంది. రోజుకు రెండో మూడో సంపాయిస్తాడు. కాని అతని దగ్గర డబ్బు నిలవదు. అలా అని పెద్ద దుర్వ్యసనాలేవీలేవు. కుతి అయినప్పుడు చాటుగా బీడీలుకాలుస్తాడు. మిఠాయి దుకాణాల్లోఅవీ ఇవీ కొనుక్కుని తింటాడు. సత్రంలో తీరికవేళల ఘుక్తాయాసం తీరడం కోసం పేకాట ఆడతాడు. అడ్డాటలో అతనిది పెద్ద చెయ్యి. మూడేళ్ళక్రితం కాబోలు ఒక్క తప్పు చేశాడు. ఎన్నడూచెయ్యని తప్పు. ఆనాడు శివరాత్రి కాబోలు. కృష్ణ ఒడ్డున నాలుగైదు రూపాయలు సంపాయించాడు. రెండు రూపాయలుపైగా తిండి తిన్నాడు. సత్రానికి వచ్చి మామూలు చోట పడుకున్నాడు నిద్రపట్టలేదు. ఉదయం అంతా కృష్ణలో అంతా స్నానం చేసిన రక రకాల స్త్రీలను చూశాడు. తడి చీరెలలో వంపు సొంపులు చూశాడు. దుసులను మార్చుకొంటున్న కొందరిని చూశాడు. అన్నీ కలసి నిద్రపట్టనీయలేదు. మన్మథుడు బాణాలు గుప్పించి వదిలినట్టున్నాడు. అప్పుడు చివాలున లేచి అటా కాస్సేపు

నడిచివద్దామని బయలుదేరిన వాడల్లా ఒక సినిమా హాలు వెనక పాకల దగ్గర తేలాడు ఆ పాకలన్నీ చీకటి ముద్దల్లాగు, భూదేవి శరీరం మీద లేచిన వ్రణాల్లాగున్నాయి. అక్కడ రెండు రూపాయలకు కేవలం రెండు రూపాయలకు, సుఖం కొనుక్కున్నాడు, తిరిగి వచ్చేశాడు. కాని అది అతని కొంప ముంచింది. ఒక నాటు వైద్యుణ్ణి బతిమాలుకుని, అతనికి అడ్డమైన చాకిరీ చేసిపెట్టి రోగం నయం చేసుకోవలసి వచ్చింది.

ఇక ఇప్పుడున్న రోగమల్లా ఒక్కటే... ఆకలి... దానివల్లనే గుండెనొప్పి... కనకయ్యశాస్త్రి నిట్టూరుస్తూ గోడకానుకుని కూలబడ్డాడు. చలిచలిగా వుంది. వర్షం ఇంతలో తగ్గేట్టు లేదు. ఒక్క బీడీ వుంటే బాగుండు ననిపించింది. కాని మొలలో పైసా కూడా లేదు. నిజానికి యిప్పుడు బీడీ కాలుస్తుంటే ఎంతో బాగుంటుంది. చూసేవారు కూడా ఎవ్వరూ లేరు. ఒక్కొక్క దమ్ము పీలుస్తుంటే చురచురలాడుతూ ఎంతో మజాగా ఉంటుంది కాని ఏం లాభం ?

అతడు మళ్ళీ రోడ్డు చివరకు చూశాడు. ఎవరూ లేరు. తన కివాళ కూడా అన్న ప్రాప్తి ఉన్నట్టులేదు. ఈ ఊహ రాగానే అతని శుష్కించిన శరీరం జలదరించింది.

అతడు అంతలోనే చప్పరించి "ఆఁ ఇంత ఊయంది. ఊయ గొడ్డు పోలేదు. ఏమూలనో కనీసం ఎవరో ఒకరయినా పోకపోతారా ? అందు లోనూ సీజను మంచిది కాదు. జబ్బుల సీజను. గుండె జబ్బులు... కలరాలు వగైరా ఎన్నిటికో సీజను. నా అదృష్టం బాగుంటే ఏదో ఒక కబురురాకపోదు. మరో అరగంట చూద్దాం..." అనుకున్నాడు ధైర్యంగా.

తర్వాత తల తడుముకున్నాడు. సన్నగా ఈలవేద్దామనుకున్నాడు. వెయ్యబోయి, అంతలోనే ఆగిపోయాడు. గొడుగు వేసుకొని ఒక పంతులమ్మ కాబోలు నడుం క్రిందనుంచి చప్పగా తడిసిపోయి రోడ్డుమీదనడచి పోతున్నది. ఈలవేస్తే అనవసరంగా గొడవయిపోతుందని ఆగిపోయాడు.

వర్షం ఉధృతం కొంచెం తగ్గింది. నెమ్మదిగా నిలిచి కురుస్తున్నది. కాస్సేపటిలో తెరిపి యివ్వవచ్చు ననిపించింది. అతడలాగే వర్షంవంక

చూస్తూ కూర్చున్నాడు. రోడ్డంతా జలమయమైపోయింది. రోడ్డుప్రక్కన కాలవలోని నీరు రోడ్డు మీదికి ఎదురు ప్రవహిస్తున్నది. వర్షంలో తడిసి వచ్చిన కాకి ఒకటి అతనికి కొంచెం దూరంలో నిలబడి ముక్కుతో వొళ్లు తుడుచుకుంటూ రెక్కలు విదిలించుకుంటూంది. కనకయ్యశాస్త్రి దాన్ని చూసి 'అరె మళ్లీ వచ్చావ్' అన్నాడు. కాని అతనికి అంతలోనే అనుమానం వచ్చింది. ఇది ఇందాకటి కాకి అవునో, కాదో! వీటితో గొడవ ఏమిటంటే అన్ని కాకులూ ఒక్కలాగే ఉంటాయి. ఇదీ, అదీ ఒకటి అవునో కాదో తెలుసుకునే వీలులేదు. మనుషులు అలా కాదు. ఒకళ్ళు న్నట్టు సాధారణంగా మరొకరుండరు.

అది సరేనయ్యా! ఇప్పుడు వర్షంతగ్గింది. మరో పదినిముషాల్లో పూర్తిగా తగ్గిపోతుంది. అప్పుడు తాను ఇక వేట సాగించాలి. తిండికోసం వేట. నిజమే. ఈ వర్షం తగ్గితేగాని లాభంలేదు. వర్షం ఇలాగే కురుస్తూ వుంటే తనకోసం ఎవరూ రారు. తానెక్కడికీ వెళ్లేందుకు వీలులేదు. అతడు 'వర్షం తగ్గాలి, బాగా తగ్గిపోవాలి...' అనుకుంటూ కూర్చున్నాడు. గుండెలు చేత్తో రుద్దుకుంటూ, ఈ నొప్పేమిటి? ఏమైనా గుండెజబ్బేమో!

అతని ప్రార్థనలు ఫలించినట్టుగా మరో పది నిముషాలలోనే వర్షం బాగా తగ్గిపోయింది. వీథిలో మళ్ళీ జనసంచారం, సందడీ మొదలైంది.

అతడు వచ్చిపోయే జనాన్ని కాస్సేపు చూచి తర్వాత విసుక్కుంటూ లేచి ఇవతలికి వచ్చాడు. నెమ్మదిగా నడిచి ప్రక్క వీధిలోకి వచ్చాడు. అక్కడ కొన్ని దుకాణాలున్నాయి. ప్రత్యేకమైన దుకాణాలు. అక్కడ తాళ్ళూ, పేళ్ళూ, చాపలూ, వెదురు బొంగులూ, కుండలూ వగైరా అంతిమ యాత్రకు కావలసిన సామగ్రి అమ్ముతారు. అతడా వీథిలో నెమ్మదిగా ప్రతి దుకాణం వంకా చూస్తూ నడిచాడు. ఏమీ గిరాకీ ఉన్నట్లు అనిపించ లేదు. మళ్లీ ఆ సందుదాటి మార్కెట్ ముందుకు వచ్చాడు. అక్కడ జన సందోహం విపరీతంగా వుంది. కూరలు కొనేవారూ, పూలూ, పళ్లూ కొనే వారూ, మాంసాహారం కొనేవారూ అంతా హడావిడిగా ఉన్నారు. మార్కెట్ ముందు గంపల్లో కోళ్లున్నాయి. అతడు మళ్ళీ సత్రం ముందుకు.

వచ్చేశాడు. అక్కడ తన సహచరులెవరూ కనబడలేదు. ప్రాణం ఉసూరుమన్నాది. 'కాస్సేపు కూర్చుందామా' అనుకున్నాడు, కాని కూర్చోలేదు. 'అబ్బే! కూర్చుంటే ఎలాగ?' అనుకున్నాడు. తర్వాత మళ్ళీ నడక సాగించాడు. ఇటు అటు అని లేకుండా వీధులన్నీ తిరిగాడు.

కుక్క ఒకటి అతని వెంటనే నడుస్తూ వచ్చింది. అది ఎందుకు అతని వెంట నడుస్తున్నదో తెలియలేదు. కొద్ది సేపటి తర్వాత అతడు దాన్ని గమనించి ఆగాడు. అదికూడా ఆగి నాలికచూపి అతని వంకనే చూస్తూ నిలబడింది. అతడు నడక సాగించగానే అదికూడా నడవటం ప్రారంభించింది. అతనికి తమాషా అనిపించింది. కొంతదూరం నడిచి మళ్ళీ ఆగాడు. అదికూడా ఆగింది. అతనికి నవ్వు వచ్చింది. దానివంక జాగ్రత్తగా చూశాడు. తిండిలేక కాబోలు అది కృశించిపోయి బలహీనంగా ఉంది. 'కుక్కలకు కూడా తిండి లేదన్నమాట' అనుకున్నాడతడు. వెనుదిరిగి నడిచాడు. కుక్కకూడా ఒక్కక్షణం ఆగి వెనుదిరిగి అతని వెంటనే నడక సాగించింది. అంతలో ఏమయిందో ఏమో కుక్క ఆగిపోయింది. మరుక్షణంలో రెండు బలిసిన పెంపుడు కుక్కలు పెద్ద పులుల్లా అరుస్తూ దానిమీద పడ్డాయి. అది ముడుచుకుని 'కుయ్యోం' అంటూ వెనుదిరిగి పారిపోయింది.

కనకయ్యశాస్త్రి 'ఉస్సు'రని నిట్టూర్చి మళ్ళీ నడక సాగించాడు. గుండెలో కలుక్కుమంటున్నది.

అంతలో అతడు ఒక ఇంటిముందు ఆగిపోయాడు. పెద్ద పెంకుటిల్లు...లోపల విశాలమైన ఆవరణ. ఆవరణలో ఏవో చెట్లు చిన్నగేటు...

కనకయ్యశాస్త్రి కొంచెం ముందుకు వెళ్ళి లాంతరు స్తంభం క్రింద నిలబడ్డాడు. అతనికేదో స్ఫురించింది. ఛాతిమీద కుడివైపున చేత్తో రుద్దుకుంటూ అలాగే నిలబడిపోయాడు.

వర్షం బాగా తగ్గిపోయింది. మబ్బులు విడిపోయి ఇప్పుడిప్పుడే సూర్యకిరణాలు బంగారు రంగులో వ్యాపిస్తున్నాయి. కనకయ్యశాస్త్రి వేళ్ళు విరుచుకుంటూ తలఎత్తి ఆకాశంవంక చూశాడు. నీళ్ళతో పొట్టలు నింపు

కుని ఉదయం అనగా వచ్చి భూమిమీద దాడిచేసిన మబ్బులు తమబరువు దింపుకొని తేలికపడి దూదిపింజల్లాగా తేలిపోతున్నాయి.

కనకయ్యశాస్త్రి ఆలోచనలో పడ్డాడు. పెంకుటిల్లు తనకు తెలుసు. ఆ యింటికి ఇంతకుముందు రెండు మూడుసార్లు చంద్రమ్మకు సాయంగా వంటకు వచ్చాడు. ఆ యింటి యజమాని ఒక రిటైర్డ్ ఆఫీసరు. మనిషి చాలా మంచివాడు. కొడుకులు ఇద్దరో ముగ్గురో ఎక్కడో హాయిగా పెద్ద ఉద్యోగాలే చేస్తున్నారు. ఇద్దరాడపిల్లలకూ పెళ్ళిళ్ళయి అత్తవారిళ్ళలో హాయిగానే ఉన్నారు.

కనకయ్యశాస్త్రి మళ్ళీ చేతివ్రేళ్లు విరుచుకున్నాడు. ఆ వ్రేళ్లు కొద్దిగా వొణుకుతున్నాయి. ఆ యింటిగుమ్మంవైపు చూస్తూ ఆలోచనలో పడ్డాడు. ఆ యింటి యజమానికి వారం రోజుల క్రిందట హార్ట్‌ఎటాక్ అనబడే గుండెజబ్బు వచ్చింది. ఆ వివరం మూడు రోజుల క్రిందట చంద్రమ్మద్వారా అతనికి తెలిసింది. ఆమె మాటల సందర్భంలో ఆయన ధర్మరాజులాంటి వాడనీ, కలియుగంలో ఉండవలసిన మనిషికాదనీ, ఇలా చాలా చెప్పింది. అప్పుడే క్రింద పెట్టే పరిస్థితి వచ్చిందన్నట్లు కూడా చెప్పింది.

కనకయ్యశాస్త్రి తనలో తానే 'ఏమయింది ?' అనుకున్నాడు. 'ఏమీ కాలేదేమో' అని కూడా అనుకున్నాడు. చంద్రమ్మ చెప్పిన వివరాల ప్రకారం ఆయన ఇవాళో రేపో అన్నట్టుగా ఉన్నాడు. ఇప్పుడు చూస్తే ఇల్లు ప్రశాంతంగానే ఏమీ జరగనట్టుగానే ఉంది.

అతడు అటూ యిటూ రెండుసార్లు తిరిగాడు. ఆ యింటి పంచలో కొందరున్నారు. కొంచెం హడావిడిగానే ఉన్నట్లు అనిపించిందీసారి. అతడు మళ్ళీ లాంతరు స్తంభం క్రిందికి వచ్చి నిలబడ్డాడు.

అంతలో ఆ యింటి ముందు రిక్షా ఒకటి వచ్చి ఆగింది. అందులో నుంచి ఒక వ్యక్తి డాక్టరులాగా ఉన్నాడు– దిగి లోపలికి వెళ్ళాడు. ఆ యింటి యజమాని కొడుకేమో, ఒక పాతికయేళ్ళ యువకుడు కూడా దిగి లోపలికి వెళ్ళాడు.

కనకయ్యశాస్త్రి గడ్డం నివురుకుంటూ 'బహుశా అంతా అయి పోతుంది, లేకపోతే ఈపాటికే అంతాఅయిపోయిందేమో!' అనుకున్నాడు. గుక్కెడు ప్రాణాలు పోవటం ఎంతసేపు? చిటికెలో వ్యవహారం. అసలే గుండెజబ్బు...పైగా పెద్దతనం...కోలుకోటం అనేది ఉండదు. అసలు గుండెకాయేకదా అన్నిటికి మూలం? దానికి ఏమీ రానేకూడదు. వచ్చిందంటే మరింకేముంది. క్షణాల్లో చిలకెగిరిపోవడం ఖాయం.

కనకయ్యశాస్త్రికి అప్పుడొక బీడీ ఉంటే ఎంతో బాగుండునని పించింది. ఆ తర్వాత ఆ గుమ్మం వంకనే చూస్తూ గడ్డం చేత్తో నివురు కుంటూ నిలబడ్డాడు.

నెమ్మదిగా నిమిషాలు గడిచాయి. పదో, పదిహేనో నిముషాలు... కాలం పొట్ట పట్టినంత విపరీతంగా తిండి తిని కదలలేని కొండచిలువలా కదులుతున్నది. కనకయ్యశాస్త్రికి ఛాతీ కుడివైపు గుండెలో సన్నగా నొప్పి, తెరలు తెరలుగా నొప్పి. అతడు గుండెమీద చేత్తో తడువు కుంటూ 'ఇది ఆకలివల్ల వచ్చిన నొప్పి. కడుపునిండా పిండం పడితే అదే తగ్గిపోతుంది' అనుకున్నాడు. అంతలో 'తనకు గుండె జబ్బు కాదుగదా!' అని అనుమానం వచ్చింది. ఆ ఆలోచనతో నవ్వుకూడా వచ్చింది. తనకు గుండె జబ్బేమిటి? బాగా కలిగిన వాళ్ళకు సంపన్నులకు మాత్రమే వస్తుందని. తిండికి లేనివాళ్ళకు రాదు. ఇలా నొప్పి ఇంతకుముందు చాలా సార్లు వచ్చింది. హాయిగా తిని పడుకుంటే లేచేసరికి ఏమీ ఉండేదికాదు. ఇప్పుడూ అంతే.

ఎదురుగా ఎంగిలి ఆకులకోసం మూడు నాలుగు కుక్కలు కొట్లాడు కుంటున్నాయి. ఒక బలిసిన కుక్క— పెద్దపులిలాగా గాండ్రిస్తూ మిగిలిన వాటిని దూరంగా తరిమి కొడుతున్నది.

కనకయ్యశాస్త్రి ఆ యింటి గుమ్మం వైపే చూపులు నిలిపి లాంతరు స్తంభాన్ని ఆనుకుని నిలబడ్డాడు.

అంతలో వాళ్లు బయటికి వస్తున్న సవ్వడి వినిపించింది. ఆ యువకుడు, డాక్టరూ మాట్లాడుకుంటూ ఇవతలికి వచ్చారు. తర్వాత

డాక్టరు రిక్షా ఎక్కి వెళ్ళిపోయాడు. ఆ యువకుడు గేటు దగ్గరే నిల బడ్డాడు.

కనకయ్యశాస్త్రి గబగబ అడుగులు వేసి అతన్ని సమీపించాడు. ఆ యువకుడు కనకయ్యశాస్త్రి వంక ప్రశ్నార్థకంగా చూశాడు.

కనకయ్యశాస్త్రి నవ్వుతూ గొంతు సవరించుకుని 'బాబుగారి కెట్లా ఉంది నాయనా ?' అని అడిగాడు. అతని గొంతు అతనికే వికృతంగా వినిపించింది. మళ్ళీ 'ఆయనకు వొంట్లో బాగులేదని విన్నాను. ధర్మరాజు లాంటి మనిషి. చెయ్యెత్తి దణ్ణం పెట్టవచ్చు' అని చంద్రమ్మ మాటలే వల్లెవేశాడు.

'మీరెవరు ?' అని ప్రశ్నించాడా యువకుడు.

కనకయ్యశాస్త్రి తటపటాయించి 'వంటలు చేసుకుంటూ వుంటా న్నేను. మీ యింటికి కూడా రెండు మూడు సార్లు వచ్చాను. ఇప్పుడు అవతలి వీధిలో వంటకుపోతూ ఇలా ఆగి అడిగాను మిమ్మల్ని... అంతే...' అన్నాడు. గుండెల్లోపోటు ఎక్కువైనట్టున్నది. 'తడబడుతూ మాట్లాడానా?' అనుకున్నాడు ఒక్కక్షణం.

ఆ యువకుడు మామూలుగా 'బాగానే వున్నారు. మొన్న కొంచెం హడావిడి అయిందిగాని కోలుకున్నారు. ఈ పూట లేచి తిరుగుతున్నారు కూడా. ఇంకేమీ ఫరవాలేదన్నాడు డాక్టరు...' అని చెప్పాడు.

'డాక్టర్లకేం, అలాగే చెబుతారు. కాని మన జాగ్రత్తలో మనం ఉండాలి. గుండెజబ్బు మంచిది కాదు. మాదర్ఛెద్ జబ్బు' అన్నాడు కనకయ్యశాస్త్రి. అతనికి తన గుండెమీద ఎవరో సమ్మెటతో కొడుతున్న ట్టుగా, గుండెనెవరో పట్టుకుని పిండుతున్నట్టుగా అనిపించింది. వొళ్ళంతా చెమటలు పట్టాయి.

ఒక్క క్షణం నిశ్శబ్దం. ఆ యువకుడు లోపలికి వెళ్ళేందుకు ఉద్యుక్తుడవుతున్నాడు. అంతలో లోపలి నుంచి ఎవరో వచ్చారు. కనకయ్యశాస్త్రి అంతలో 'వస్తాను బాబూ; అవతల వేళ అయిపోతున్నది. వాళ్ళెదురు చూస్తూ వుంటారు' అంటూ గుండెలు బిగబట్టుకుని నడిచాడు.

వెనకనుంచి 'వీడెందుకు వచ్చాడు ఇక్కడికి. ఏమిటీ మాట్లాడ తున్నాడు ?' అని ప్రశ్న వినిపించింది.

"అసలతనెవరు ?"

"ఆఁ! పీనిగలు మోసేవాడు."

ఇంతవరకు వినిపించింది. కనకయ్యశాస్త్రి గాభరాగా తన నెవరో తరుముతున్నట్టు అడుగులు వేసి వీధి మలుపు తిరిగాడు. ఒక్క క్షణం ఆగి గుండె చేత్తో పట్టుకుని మళ్ళీ నడిచాడు. ఆయాసంగా ఉంది. పళ్ళు బిగబట్టాడు. వొళ్ళంతా చెమటతో తడిసిపోతున్నది. దోవలో రెండు మూడు చోట్ల ఆగి విశ్రాంతి తీసుకుని చివరకు సత్రం చేరుకున్నాడు.

అక్కడ ఎవరూ కనిపించలేదు. పళ్ళ బిగువున బాధను అణిచి పెట్టుకుంటూ వరండాలో గోడకు చేరగిలబడి కూర్చున్నాడు. అంతలో కళ్ళవెంట, ఎందుకో నీళ్ళు వచ్చాయి. క్రమంగా జారి గోడ పక్కగా పడుకుండి పోయాడు. ఎటు తిరిగి పడుకున్నా నొప్పి ఆగలేదు. గుండె చేత్తో పట్టుకుని సన్నగా మూలుగుతూ కళ్లు మూసుకుని పడుకుండి పోయాడు. ఒక్కసారి మాత్రం కళ్లు తెరిచి చూస్తే రోడ్డుమీద గుర్రంలా నడిచిపోతున్న పడుచుపిల్ల కనిపించింది. ఎదురుగా పంపుదగ్గర ఇందాకటి నడి వయసు యువతి నీళ్ళు పట్టుకుంటూ నిలబడి వుంది. ఆమె మళ్ళీ అనవసరంగా చీరెను పిక్కలు కపిపించేలా పైకి లాక్కుని నడుముమీద చెయ్యి పెట్టుకుని నిలబడి వుంది. పంపునుంచి నీటిధార తగ్గిపోతున్నదని కాబోలు ఆదుర్దాగా చూస్తున్నది. అంతలో బిందె నిండకుండానే ధార ఆగిపోయింది. ఆమె విసుక్కుంటూ సగం నిండిన బిందెను భుజాని కెత్తుకుని వెళ్ళిపోయింది.

మళ్ళీ ఆకాశంలో సందడి మొదలైంది. మబ్బులు గుమిగూడాయి. మళ్లీ యుద్ధానికి సన్నద్ధమై వచ్చిన సైన్యం లాగున హడావిడి చేస్తున్నాయి. మళ్ళీ చీకట్లు కమ్ముకొస్తున్నాయి.

కనకయ్యశాస్త్రి కళ్లు మూసుకున్నాడు. చీకటి... అంతా చీకటి... అందులో ఎక్కడో ఏదో సంచలనం, కలో నిజమో తెలియలేదు. తాను

ఉదయం మాట్లాడిన కాకి వేగంగా ఎగురుతూ దేశమంతా తిరిగి కొద్ది సేపట్లో వేలాది కాకులను పోగుచేసుకుని వచ్చింది. రోడ్డుమీద, సత్రంలో వరండాలో అంతటా కాకులే రణగొణ ధ్వనిగా అరుస్తున్నాయి.

కనకయ్యశాస్త్రికి చిన్నతనంలో ఎక్కడో చూచిన నిలువెల్లా పూచిన చెటు గుర్తుకు వచ్చింది. అదేం చెట్టు ? తాను చూచినప్పుడు దాని నిండా పువ్వులే ... ఆకులే ఉన్నట్టులేవు. 'ఎక్కడ చూశానా ?' అని ఆలోచన వచ్చింది కాని ఎక్కడ చూశాడో గుర్తు రాలేదు.

అతడు కళ్లు గట్టిగా మూసుకున్నాడు. ఎప్పుడో చూచిన సముద్రం ...ఒక తిరణాల. అందులో తనెక్కి తిరిగిన రంగుల రాట్నం... గాలి బుడగలు...ఎప్పుడో చూచిన గాలికొట్టిన బంతిలాటి కుర్రవాడు. నలుగు రైదుగురు వయసు మళ్ళిన విధవలు. భోజన పదార్థాలతో నిండిన విస్తళ్లు... నేతిగిన్నెలు కాకి పిండాలు... నువ్వుల కుప్పలు .. ఏడుకట్ల సవారీలు. 'శవాన్ని ఇంట్లో పెట్టరాదు. రోడ్డుమీదే ఉంచాలి... చెడ్డ నక్షత్రం' అనే మాటలు, నిశ్శబ్దంగా కూర్చున్న మనుషులు, ఆఖరుకు పచ్చని పిక్కలు. ఆ పిక్కలమీద నల్లని వెంట్రుకలు... ఆ తర్వాత అంటే చీకటి శూన్యం.

ఎవరో పిలుస్తున్న సవ్వడి. 'ఆఁ! వస్తున్నా వంటకా? ఎవరయినా పోయారా ? భోజనం పెట్టి మనిషికి పాతిక రూపాయ లివ్వాలి. అసలే తీరికలేక ఛస్తున్నాం. సరే అంటే వస్తాం... లేకపోతే లేదు. సరేనా ? అయితే పదండి.'

తర్వాత ఒక గంటసేపు వర్షం కురిసింది. రాత్రి పొద్దుపోయిన తర్వాత వచ్చారు అతని సహచరులు. వారిలో ఒకడు భుక్తాయాసంతో గోడ కానుకుని కూర్చుని రెండో వాడితో 'ఒరే సత్యం! ఈ కనకయ్య గాడు మొద్దులాగా ఎట్లా నిద్రపోతున్నాడో చూడు' అన్నాడు.

రెండోవాడు పెద్దగా నవ్వుతూ వెళ్ళి లైటువేసి కనకయ్యశాస్త్రిని లేపుదామని దగ్గరగా వెళ్ళి బొమ్మలాగా నిలబడిపోయాడు.

మొదటివాడు గూట్లోనుంచి పాతపేక అందుకుని కలుపుతూ 'అట్లా నిలబడిపోయావేంరా? వాణ్ణి లేపు. ఎక్కడో గొడ్డులాగా పీకల

దాకా మెక్కివచ్చి పడుకున్నట్టున్నాడు. ఒక గంటసేపు ఆడుకుందాం... లేపు వాణ్ణి...' అన్నాడు. అంతలో రెండోవాడి వాలకం చూసి తాను లేచి వెళ్లి చూశాడు. అతని కళ్ల రెప్పలు పడలేదు.

కనకయ్యశాస్త్రి కదలకుండా కళ్లు తెరుచుకుని వెల్లకిలా పడుకుని ఉన్నాడు. అతని చుట్టూ పైనా క్రిందా, అంతటా చీమలు అసంఖ్యాకంగా పాకుతున్నాయి.

# భ్రమ

"అమ్మా! నేను ఆఫీసుకు పోతున్నాను" అన్నాడు పరమశివన్. అతడు భోజనం పూర్తి చేసుకుని చొక్కామీద గచ్చకాయరంగు కోటు తొడుక్కుని చేతిలో ఫైళ్ళతో వరండాలోకి వచ్చాడు. లోపల తలుపు పక్కనే ఉన్నది మీనాక్షి. వేదమ్మకు రాత్రి అంతా జ్వరం. కాని తెల్లవారేసరికి తగ్గింది. ఆమె ఓపిక చేసుకుని ప్రక్క ఇంటి వర్ధనమ్మ గారితో ఆ కబురూ ఈ కబురూ చెప్పి వస్తున్నదల్లా ఆ చిన్న వరండాలో పక్కకు తప్పుకుని "మంచిది, నాయనా!" అన్నది.

అంతలోనే మళ్లీ ఏదో గుర్తుకు రాగా "ఈ వేళయినా ఆ చంద్రప్పన్‌కు ఉత్తరం రాయి, పరమూ!" అన్నది కొడుకుతో.

అతడు తల ఊపి చెప్పులు తొడుక్కోబోయి నాలిక కరుచుకుని, "అరెరె! మరిచేపోయాను మీనాక్షీ! నిన్న రాత్రి ఈ చెప్పు తెగింది. వీటితో ఇహ లాభంలేదు. నడవటం కష్టం" అంటూ నవ్వి, చెప్పులను కాళ్ళతో ఒక మూలకు తోసి, వట్టి కాళ్ళతోనే నడిచి మెట్లు దిగి వీధిలోకి వెళ్ళిపోయాడు.

మీనాక్షి లోపలికి వెళ్ళిపోయింది. వేదమ్మ వరండాలో చాపమీద కూర్చున్నది.

బయట రోడ్డుమీద గొప్ప సంచలనం, రొద.

రోజూ తెల్లవారక ముందే జీవితపు హడావిడి మొదలవుతుంది. బస్సులూ, లారీలూ, కార్లూ, రిక్షాలు ఎడతెగకుండా వస్తూ పోతూ ఉంటాయి. జనం పిన్నా పెద్దా అందరూ ఇరవై నాలుగు గంటలూ ఉరుకులు, పరుగులు పెడుతూ గొడవ చేస్తూ తిరుగుతూ ఉంటారు. జనం చేసే రణగొణ ధ్వనితో, బస్సుల హారన్ల మోతతో, రిక్షా గంటల గణ

గణలతో మొత్తం మీద తెల్లవారింది మొదలుకొని రాత్రి బాగా పొద్దుపోయే వరకు చెవులకు విశ్రాంతి అనేది ఉండదు.

వేదమ్మ అలానే కూర్చుండిపోయింది. లోపల కోడలు పనిలో ఉన్నట్టున్నది. వరండా ముందున్న కొద్ది గజాల ఆవరణలో ఒకేఒక చిన్న దానిమ్మ చెట్టున్నది. దానికి అయిదారు ఎర్రని పూలు పూచి ఉన్నాయి. సిమెంటు రాళ్ళ గోడమీద బుల్లిపిట్ట ఒకటి ఎక్కడినుంచో ఎగిరివచ్చి రాగాలు తీస్తున్నది. కాని, దాని గొంతు కీచుగా ఉండి సరిగా వినబడటమే లేదు. ఎదురుగా పెద్ద మేడ. ఆ పక్కన పొడుగాటి గుబురు చెట్ల మధ్యగా కొంచెం ఆకాశం-మబ్బులేని ముక్క—కనిపిస్తున్న దంతే.

వేదమ్మకు అంతలో తన ఊరు గుర్తుకు వచ్చింది. నిజానికి ఆమె తన ఊరినీ, తన ఇంటినీ మరిచిపోయిం దెక్కడ ? అరవ దేశంలో ఎక్కడో మారుమూల సముద్ర తీరాన చిన్న పల్లెటూరు. చుట్టూ చెట్ల మధ్య చిన్న ఊరు. పేదగా కనిపించినా, ఎల్లప్పుడూ శుభ్రంగా అందంగా ఉండే ఇల్లు. ఇంటి చుట్టూ విశాలమైన ఆవరణ. ఆవరణలో రకరకాల చెట్లు.

వేదమ్మ నిట్టూర్చింది. తరవాత చీరె చెరగుతో నుదురు తుడుచు కున్నది. రెండు సంవత్సరాల క్రిందట తాను ఇక్కడికి వచ్చేముందు— భర్తకు జబ్బు చెయ్యకముందే ఇంటి ముంగిట నాలుగు కొబ్బరి చెట్లు నాటింది. అవి ఇప్పుడు ఎలా ఉన్నాయో ? ఆ చంద్రప్పన్ మంచివాడే గాని శుద్ధ సోమరిపోతు. బడిలో పిల్లలకు సరిగా పాఠాలు చెప్పడానికే వాడికి బద్ధకం. ఎంతసేపూ పొగాకు నములుతూ, సినిమా కబుర్లు చెబుతూ తిరగడం తప్పిస్తే వాడికి మరో ధ్యాసే లేదు. ఏదో బడిపంతులు కదా అని తప్ప వాడి మీద ఎవరికి సదభిప్రాయమే లేదు. తాను ఇక్కడికి వచ్చేముందు చంద్రప్పన్ కాళ్ళావేళ్ళాపడి బతిమలాడితే దయతలిచి, 'సరే పిల్లాపాపా కలవాడివి. అంతగా ప్రాధేయపడుతున్నావు కాబట్టి ఇల్లు నీకు అప్పగిస్తున్నాను. కాని, జాగ్రత్తగా ఉండాలి సుమా? ఇంటిని శ్రద్ధగా చూసుకో. మీ ఆవిడ నీ కంటె బద్ధకస్తురాలు. నాకు తెలుసుగా

దాని సంగతి. పిల్లలకు స్నానంకూడా చేయించకుండా ఊరిమీద తిప్పుతూ ఉంటుంది. దానికి గట్టిగా చెప్పు. ఇంటిని శుభ్రంగా ఉంచుకోండి. మళ్ళీ నేను తొందరగానే వచ్చేస్తాను. ఎల్లకాలమూ పరాయి దేశంలో ఉండను కదా! ఎప్పటికయినా ఇక్కడ మట్టికావలసిన దాన్నే. ఇల్లు ఇప్పుడెట్లా ఉందో, నేను మళ్ళీ వచ్చేసరికి అట్లాగే ఉండాలి' అన్నది తాను. చంద్రప్పన్ అప్పుడన్నింటికీ తల ఊపాడు. కాని తనకు నమ్మకం లేదు. ఎప్పుడూ ఒక్క సాలెగూడయినా లేకుండా శుభ్రంగా కళకళలాడుతూ ఉండే ఇల్లు. ఇప్పుడెట్లా ఉందో ఏమో ? ఇంటి వెనక ఆవరణలో మూలగా పెద్దలెవరో ఎప్పుడో వేసిన మామిడి చెట్టున్నది. అది కాలం వచ్చేసరికి విరగ కాస్తుంది. తాము తినగలిగినన్ని తిని ఊరంతటికీ పంచే వారు. అది ఇప్పుడెట్లా ఉందో? చంద్రప్పన్ తానిక్కడికి బయలుదేరి వచ్చేముందు చాలా వాగ్దానాలు చేశాడు. ఇల్లు జాగ్రత్తగా చూసుకుంటా ననీ, ఊరి చివరఉన్న రెండెకరాల మెట్ట పొలంమీద వచ్చే ఆదాయం రైతు దగ్గర వసూలుచేసి సకాలంలో పంపిస్తాననీ, మామిడిచెట్టు మీద కూడా ఆదాయం చూపిస్తాననీ గట్టిగా చెప్పాడు. కాని, రెండు సంవత్స రాలు దాటింది. ఇంతవరకూ అక్కడినుంచి ఎర్రని ఏగానీ కూడా రాలేదు. ఉత్తరం వ్రాయిస్తే సమాధానమేలేదు. కొడుకును 'పోనీ, ఒకసారివెళ్ళి చూసిరా, నాయనా' అంటే అతడేమో నవ్వి 'ఎందుకమ్మా? అంతదూరం డబ్బు ఖర్చు పెట్టుకొనిపోతే వచ్చేదెంత చెప్పు? పదో పాతికో వచ్చేను. దానికోసం వందలు ఖర్చుపెట్టడం దండుగకదూ?' అంటాడేగాని, అతనికి ఇల్లూ, పొలమూ ముఖ్యం కాదు. అతనికా మమకారమే లేదు.

వేదమ్మ లేచి నెమ్మదిగా ముందు గదిలోకి వచ్చింది. ఆ గది చాలా చిన్నది. ఒక వైపున చిన్న టేబిలూ, దాని ముందొక పాతకుర్చీ, మాసిన బట్టలు తలుపులపైనా దణ్ణెంపైనా వేలాడుతున్నాయి. కిటికీలో నుంచి కాస్తంత వెలుతురు లోపలపడుతున్నది. అల్మారాలో నాలుగు అరలూ నాలుగు అరణ్యాలలా ఉన్నాయి. పై అరలో పరమశివన్ పాత చదువుకు సంబంధించిన పనికిరాని పుస్తకాలు చిందరవందరగా ఉన్నాయి. రెండో అరలో ఏవేవో కాగితాలు, క్రింద అరలో చిరిగిన

బట్టలు, ఒక పగిలిపోయిన సిరాబుడ్డి, కళాయిపోయి మాసిపోయిన చిన్న అద్దం, తిలకం సీసా.

టేబిల్ పైన పాత ఫొటో వుంది. దాని ఫ్రేము పాతబడి వెలిసి పోయి వుంది. లోపలికి పురుగులు పోయి కొట్టివేసినందువల్ల ఫొటోలో చాలా రంధ్రాలు పడ్డాయి. ఒక పెద్ద రంధ్రం సరిగా వైద్యనాథన్ నుదుట వుంది.

వేదమ్మ నెమ్మదిగా ఆ ఫొటోను అందుకుని చీరె చెరుగుతో తుడిచి కళ్ళకు దగ్గరగా ఉంచుకుని చూసింది.

ఫొటోలో వెనక తమ ఇల్లు. కుడిపక్కన ఒక చెట్టు.

వైద్యనాథన్ తలపాగాతో, నుదుట విభూతితో, చేతి కర్రతో దర్జాగా, హుందాగా కుర్చీలో కూర్చుని ఉన్నాడు. తాను ఎప్పటిదో పెళ్ళినాటి కంచిపట్టు చీరె కట్టుకుని వుంది. అది కనకాంబరం రంగు చీరె, తనకిప్పటికీ గుర్తే. ఫొటోలో తన ముఖం కళకళలాడుతున్నది. చిరునవ్వును పెదవుల మధ్య బిగించి, కుర్చీమీద ఒక చెయ్యి ఆనించి నిలబడి ఉంది.

ఆనాడు ఒక పెద్ద మనిషి తన ఇంటికి వచ్చాడు. ఆయన చాలా కాలంపాటు ఏదో తగ్గని జబ్బుతో బాధ పడ్డాడు. ఎందరి దగ్గిర ఎన్ని మందులు వాడినా ప్రయోజనం లేక ఆశ వదులుకున్నప్పుడు, ఎవరో చెప్పగా వచ్చి వైద్యనాథన్ దగ్గర మందు తీసుకున్నాడు. నెలరోజుల్లో జబ్బు తగ్గి అతడు మామూలు మనిషైనాడు. ఇక అతని ఆనందం చెప్ప నలవి కాదు. ఒకనాడు వచ్చి తన వ్యాధి నయం చేసినందుకు కృతజ్ఞత తెలుపుకుని, డబ్బు ఇచ్చి, వెళ్ళిపోయేముందు తన దగ్గర కెమేరా ఉందనీ, తమ ఫొటో తీస్తాననీ అన్నాడు వైద్యనాథన్. వద్దంటే అతను వినలేదు. దంపతులిద్దరూ పార్వతీ పరమేశ్వరుల్లాగా ఉన్నారనీ, ఫొటో తీసి తన దగ్గర ఎల్లకాలం అట్టే పెట్టుకుంటాననీ అన్నాడు. మరునాడు నిజంగానే కెమేరా పట్టుకుని వచ్చాడు. వైద్యనాథన్‌కు ఫొటో దిగడం ఇష్టంలేదు. అంతకు ముందెన్నడూ వారు ఫొటో తీయించుకోలేదు. వేదమ్మకుమాత్రం

లోలోపల ఫొటో అంటే సంబరంగానే ఉంది. కాని, భర్త ఒప్పుకోడేమోనని సందేహించింది. వైద్యనాథన్ చివరికి మెత్తబడి 'సరే' అన్నాడు. ఎన్నడూ లేనిది చొక్కా వేసుకున్నాడు. తలపాగా చుట్టాడు. నుదుట దట్టంగా విభూతి పట్టించాడు. మెడలో హారం లాగా పైపంచె వేసుకున్నాడు. ఈ లోపల తాను కూడా పట్టుచీరె కట్టుకుని సిద్ధమైంది ఒక అరగంట ప్రయాసపడి తరవాత ఒక్క క్షణంలో 'క్లిక్' మనిపించి ఆ పెద్దమనిషి వెళ్ళిపోయాడు. మరో మూడు రోజుల తర్వాత యీ ఫొటో వచ్చింది. ఆ నాడల్లా వేదమ్మ ఎంతో సంబరపడి పోయింది.

వేదమ్మ ఉలిక్కిపడింది. మీనాక్షి లోపలినుంచి ఎప్పుడు వచ్చిందో ఏమో గుమ్మంలో నిలబడి "రండి అత్తయ్యా ! చారు వేసుకుని నాలుగు మెతుకులు తిందురుగాని. ఆ తరవాత మాత్ర వేసుకోవచ్చు" అని పిలుస్తున్నది.

"నువ్వు కానీయ్, అమ్మా ! నాకు ఆకలిలేదు. లంఖణం ఉంటే మంచిది" అన్నది వేదమ్మ.

మీనాక్షి ఏమనుకున్నదో ఏమో లోపలికి వెళ్ళిపోయింది.

గోడమీద కొడుకు పెళ్ళి ఫొటో ఉంది. వేదమ్మ కొద్ది క్షణాలు దానివంకనే కళ్ళార్పకుండా చూసింది. పరమశివన్ పెళ్ళికొడుకువేషంలో కుర్చీలో కూర్చుని ఉన్నాడు. మీనాక్షి పెళ్ళి బట్టలతో, నుదుట కళ్యాణ తిలకంతో కుర్చీ పక్కనే నిలబడి ఉంది. ఇద్దరిలో ఎవరూ నవ్వడంలేదు. వేదమ్మ కోడలు బొమ్మవంక పరిశీలనగా చూసింది. మీనాక్షి బాగానే ఉంటుంది. మంచి అణకువ కలిగిన పిల్ల కూడా. కాకపోతే వైద్యనాథన్ మాత్రం చనిపోయేవరకూ మనస్సులో బాధపడుతూనే ఉన్నాడు. ఆ బాధను ఆయన దాచుకోలేదు. తనతో అంటూనే ఉండేవాడు. కొడుకు చేసిన నేరం కూడా ఏమీ లేదు. తండ్రి కుదిర్చిన సంబంధం చేసుకోనన్నాడు. ఆ పిల్ల పేరు వేదమ్మకు సరిగా గుర్తులేదు. బేబీ అని కాబోలు పిలిచే వారందరూ. అసలు పేరు సుజాతో, సుమిత్రో గుర్తులేదు. శంపన్నుల పిల్ల. తోలెడు కట్నం ఇస్తామన్నారు వారు. పెళ్ళికాగానే

పరమశివన్‌కు ఆ చుట్టుపక్కలే తమ పలుకుబడి ఉపయోగించి మంచి ఉద్యోగం కూడా ఇప్పిస్తామన్నారు. ఉన్న ఊరూ, దేశం కదలకుండా కొడుకూ, కోడలూ తమ కళ్ళముందే ఉంటారనీ, వృద్ధాప్యంలో అండగా ఉంటారనీ వైద్యనాథన్ ఎంతగానో ఆశలు పెట్టుకున్నాడు కాని, పరమశివన్ అప్పటికే డిగ్రీ పుచ్చుకుని గవర్నమెంటు ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టి కూర్చుని దేశంలో ఎక్కడికైనా వెళ్ళిపోవాలి అన్నట్టు సిద్ధంగా ఉన్నాడు. తండ్రి ఆ సంబంధం గురించి చెప్పగానే ముందు పెళ్ళి వద్దన్నాడు. తరవాత కట్నం తీసుకోనన్నాడు. ఆ పైన తనకా సంబంధం ఇష్టం లేదన్నాడు. వైద్యనాథన్ కొడుకును బలవంత పెట్ట లేదు గాని లోలోపల చాలా బాధ పడ్డాడు. తరవాత పరమశివన్‌కు ఉద్యోగం వచ్చి దూరదేశానికి వెళ్ళిపోతున్నాడని మరింత బాధపడ్డాడు. కొన్నాళ్ళ తరవాత కొడుక్కి నచ్చిన సంబంధం తప్పనిసరయి చేశాడే గాని, లోలోపల ఆయనకు కోపం, బాధ మాత్రం తగ్గలేదు. చివరకు గుండె జబ్బుతో హఠాత్తుగా గంటల మీద చిలక ఎగిరిపోయింది. పరమ శివన్ టెలిగ్రామ్ అందుకుని బయలుదేరి రోజున్నరపైగా ప్రయాణం చేసి ఊరికి చేరుకునేసరికి అంతా అయిపోయింది. అంతసేపు శవాన్ని పెట్టుకుని కూర్చోవడం కష్టమైపోయింది.

వేదమ్మకు ఒకటే తృప్తి. ఎక్కడయితేనేం ? కొడుకు సుఖంగా ఉండటమే ఆమెకు కావలసింది. కాకపోతే తాను స్వంత ఊరు వదిలి, దేశం కాని దేశంలో పరాయి వాళ్ళ మధ్య ఉండవలసి రావడం ఒక్కటే ఆమెకు కించిత్ బాధ కలిగించింది. చుట్టూ ఉన్నవాళ్ళందరూ మంచి వాళ్ళే. కలుపుగోలుగా ఉండేవాళ్ళే. కానీ, ఇప్పటికీ వేదమ్మకు మాత్రం లోపల బాధగానే ఉంటుంది. ఆమెకు తన ఊరు, ఆ ఊరి గాలి, అక్కడి చెట్టూ చేమలూ, అక్కడి ఆకాశం, అక్కడి మనుషులు ఎంతో దగ్గర. ఆమె జీవితమంతా అక్కడే గడిచింది. భూమి మీద పడింది మొదలు పుట్టిల్లు, మెట్టినిల్లు తప్ప మరెక్కడికీ వెళ్ళి ఎరగదు. జీవితంలో అతి ముఖ్యమైన పురుళ్ళు, పుణ్యాలు, కష్టాలు, సుఖాలు, కన్నీళ్ళు, పేరంటాలు, పసుపు కుంకుమలు, వంటలు, చావులు—అన్నీ అక్కడే.

వేదమ్మకు గుండెలో కలుక్కుమన్నట్టయింది. గుండెలో ఏ మూలనో బాధ, నరం కదిలినట్టు బాధ...

అంతలో పక్క ఇంటి వర్ధనమ్మ కొడుకు, చివరివాడు "మామీ, అమ్మ రమ్మంటున్నది" అంటూ వచ్చాడు.

వేదమ్మ కదిలి వస్తున్నా, పద అన్నది. వాడు ఈల వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

వర్ధనమ్మది కూడా తమ ప్రాంతంలోనే ఏదో ఊరు. ఆమె భర్త కూడా రైల్వే ఉద్యోగి. అయితే, పరమశివన్ చేస్తున్నదానికంటె కొంచెం పెద్ద ఉద్యోగం. మనిషి చాలా మంచివాడు. అతిశయం, గర్వం ఏ మాత్రం లేవు. ఇతరులకు కష్టంవస్తే విలవిలలాడి పోతాడు. వర్ధనమ్మ కూడా చాలా కలుపుగోలుమనిషి. ఇక్కడ చాలా ఏళ్ళనుంచి ఉండిపోయినందువల్ల ఇంట్లో అందరికీ తెలుగే అలవాటయిపోయింది. ఎవరూ వారిని తమిళులని అనుకోరు. వర్ధనమ్మకు నలుగురు పిల్లలు. అంతా ఇక్కడే పుట్టి పెరిగారు. పెద్దవాడు విశాఖపట్నంలో ఏదో పెద్ద చదువు చదువుతున్నాడు. తరవాతి పిల్లకు పెళ్ళిచేసి అత్తవారింటికిపంపించారు. అల్లుడు ఒరిస్సాలో ఎక్కడో ఉద్యోగం చేస్తున్నాడు. ఇంకా కాపురం పెట్టలేదు. మూడోవాడు స్థానిక కళాశాలలో బి. ఎస్. సి. చదువుతున్నాడు. చివరివాడు ఆరేళ్ళవాడు, మణి. స్కూల్లో చదువుతున్నాడు.

వేదమ్మకు తలుచుకుంటే ఆశ్చర్యంగా ఉంటుంది. వర్ధనమ్మ, ఆమె మొగుడు, పిల్లలు ఎవరికీ తమ ఊరే గుర్తురాదు. వారిది తిరుచ్చిలో ఏదో ఊరు. అక్కడ కొంచెం పొలం, ఇల్లు ఉన్నాయి. పిత్రార్జితమైన వాటినీ, ఆ ఊరినీ వాళ్లు పూర్తిగా వదిలేసినట్టే లెక్క. ఆ ఇంట్లో ఎవరుంటున్నారో, ఆ పొలం ఎవరు చేసుకుంటున్నారో వారికి అసలు తెలియదు; పట్టించుకోరు. ఒక పర్యాయం వేదమ్మ ఆ మాటే అంటే వర్ధనమ్మ నిట్టూర్చి "అవన్నీ ఇక మరిచి పోవలసిందే, మామీ! స్వంత ఊరు, ఆస్తి, మమకారం అవన్నీ ఇకసాగవు. రోజులు మారుతున్నాయి: ఇంకా మారుతాయి. ఎక్కడో పుట్టడం, మరెక్కడో కడుపు చే

పట్టుకుని పోవడం తప్పదు. ఉదాహరణకు మా అమ్మాడి సంగతి తీసుకో. ఇక్కడే పుట్టి ఇక్కడే పెరిగింది కదా? ఇప్పుడు ఒరిస్సాలో ఉండాలి. ఏం చేస్తాం? తప్పదు మరి" అని కొంచెం ఆగి, మళ్ళీ నెమ్మదిగా—"మా ఊరు, మా యిల్లు నాకు ముఖ్యమే. అక్కడి బంధువులు కూడా ముఖ్యమే. కాని, ఇంత దూరం ఏదో ప్రవాహంలో పడి కొట్టుకు వచ్చేశాం. అక్కడి మా వాళ్ళంచరూ ఎట్లా ఉన్నారో, ఏం చేస్తున్నారో, ఎవరున్నారో, ఎవరు పోయారో మాకు తెలియనే తెలియదు. బొత్తిగా సంబంధాలు లేవు. ఇక ఎక్కడుంటే అదే మన ఊరని సర్దిపెట్టుకోవలసిందే. అంతకు మించి చేసేదేమీ లేదు" అన్నది.

వేదమ్మ గుమ్మంలో నిలబడి "అమ్మా! ఆ వర్ధనమ్మగారెందుకో రమ్మన్నది, వెళ్లొస్తాను" అని తలుపు దగ్గరికి లాగి నెమ్మదిగా నడిచి పక్క యింటికి వచ్చింది. వారు వుంటున్న యిల్లు కొంచెం పెద్దది. వేదమ్మ లోపలకు అడుగుపెట్టేసరికి ముందు హాల్లో కొయ్యగుర్రం ఎక్కి వూగుతున్న మణి "అమ్మా! మామిగా రొచ్చారు" అని రాగం తీస్తూ లోపలికి వెళ్ళాడు.

అంతలో వర్ధనమ్మ చీరె కొంగుకు చేతులు తుడుచుకుంటూ ముందు హాల్లోకివచ్చి హడావిడిగా — "మామీ! ఇప్పుడే పోస్టువాడు కార్డు యిచ్చి వెళ్ళాడు. నాకు సరిగా అర్థం కావడంలేదు. కాస్త నువ్వు చదివిపెట్టు" అన్నది బల్లమీది కార్డు వేదమ్మకి అందిస్తూ.

వేదమ్మ కార్డును అందుకుని అటూ ఇటూ తిప్పి చూసింది. ఆమెది అంతంత మాత్రపు చదువు. ఆ ఉత్తరంలో వ్రాత క్లుప్తంగానే ఉన్నా గజిబిజిగా ఉంది.

వేదమ్మ — "నాకు కళ్ళు సరిగా కనిపించవు, జోడు పగిలి పోయిందిగా మొన్న? మీనాక్షిని పిలుస్తాను" అంటూ కోడలు కోసం మణిని పంపించింది. వాడు రైలులాగా 'కుంయ్' మని అరుస్తూ పరుగెత్తి పోయాడు.

వేదమ్మ ఆ ఉత్తరం వంకనే చూస్తూ కూర్చుండిపోయింది.

వర్ధనమ్మ అందులో విషయం తెలియక ఆదుర్దాగా అలాగే గుమ్మాని కానుకుని నిలబడి వుంది.

రెండు నిమిషాలు గడిచాయి. ఇంతసేపూ వేదమ్మ మనసులో తమ ఊరూ, తమ ఇల్లూ, అక్కడి పరిసరాలూ, ఆకాశం, చెట్లూ, చేమలూ కదులుతున్నాయి. అక్కడి గాలి అద్భుతమైన సంగీతం పాడుతున్నట్టు వీచేది. ఆ సముద్రం దూరతీరాల గాథలను అరవంలో పాడి వినిపిస్తున్నట్టు ఘోషిస్తూ ఉండేది. అక్కడి పక్షులు తీయనైన అరవంలో రాగాలు తీస్తూ ఉండేవి.

అంతలో మీనాక్షి వచ్చి "ఏమిటి సంగతి పిన్నీ?" అని అడిగింది. వర్ధనమ్మ ఆదుర్దాగా కార్డు అందుకుని ఆమె కిచ్చి కాస్త చదివిపెట్టు తల్లీ" అన్నది.

మీనాక్షి కార్డు అందుకుని చదవడం ప్రారంభించింది. ఒక్క నిమిషం బరువుగా గడిచింది. వేదమ్మ, వర్ధనమ్మ ఆమెవంక కదులు తున్న ఆమె పెదవుల వంక ఆదుర్దాగా చూస్తూ ఉండిపోయారు.

మీనాక్షి — "మంచివార్త కాదు పిన్నీ, మీ బాబాయిగారు— భూతలింగంగారు — వారం రోజులయింది పోయారట. కొడుకు ఉత్తరం రాశాడు" అన్నది కార్డు చించివేస్తూ.

వర్ధనమ్మ గుమ్మాని కానుకుని, "భూతలింగం బాబాయి... అయ్యో పోయాడా" అని మాత్రం అన్నది. అంతలోనే ఆమె కళ్ళు అర్ధ్రము లైనాయి.

కొద్ది క్షణాలాగి, "ఎంతో మంచివాడు, పాపం! పెద్ద వయసు కూడా వుండదు. అరవై లోపే. మహావుంటే యాభై ఎనిమిదేళ్ళు వుంటాయి. నన్ను చిన్నప్పుడు ఎత్తుకుని తిప్పేవాడు. మనిషి రాయి లాగా, ఆరోగ్యంగానే ఉండేవాడు. పిల్లల్లేరు. పెళ్ళాం పోయింది. నాకు తెలిసి ఒక్కసారి మాత్రం పెద్ద జబ్బు చేసింది. బతకననేవాడు. ఎని మందులు వాడినా లాభం లేకపోయింది. చివరకు ఎవరో చెప్పారని ఏ పల్లెటూళ్ళో ఒక ఆయుర్వేద వైద్యుడి దగ్గర మందు తిన్నాడు.

కొద్ది రోజుల్లో జబ్బు జాడలేకుండా పోయింది. అన్నట్టు, ఇంట్లో ఒక ఫొటో ఉండాలి, నాకు గుర్తు వస్తున్నది. అది ఆయనతీసిందే. ఆ వైద్యుడి ఫొటో భార్యతో సహా తీశాడు. అతన్ని గురించి చాలా పొగుడుతూ వుండే వాడు. ఎప్పుడూ కెమేరా ఒకటి మెడలో వేసుకుని, తిరుగుతూ ఉండే వాడు. అయ్యో! పాపం పోయాడా?" అన్నది కనుతుదలు తుడుచుకుంటూ.

వేదమ్మ కళ్ళు పెద్దవిచేసి "ఏది ఫొటో అది?" అని అడిగింది. కాని వర్ధనమ్మ అంతలోనే హడావుడిగా "ఇప్పుడేం చెయ్యాలి. మాపి! అక్కడికా వెళ్ళలేము. ఏం చెయ్యాలి?" అన్నది.

మీనాక్షి నెమ్మదిగా– "ఏముంది చేసెందుకు? అంతా అయి పోయింది కదా! ఒక కార్డు ముక్క రాసి పడెయ్యండి" అన్నది.

"అవును, అంతే. అంతా అయిపోయిందిగా! ఇక మనం చేసే దేముంది? బహుశా ఎవరినో పెంచుకుని ఉంటాడు. అతనేగా యీ ఉత్తరం రాసింది? అతనెవరో మనకు తెలియదు. ఒక కార్డు రాసి పడేస్తే సరి. మాకు స్నానం వగైరా లేవీ ఉండవుగా? అవున్లే. లేవు, అన్నట్టు ఆ ఫొటో...అదెక్కడ ఉందబ్బా!" అంటూ వెదకడం ప్రారంభించింది.

మీనాక్షి ఈ లోపల "అత్తయ్యా! ఎట్లావుంది ఒంట్లో?" అంటూ వేదమ్మ దగ్గరికి వచ్చి నుదుట చెయ్యివేసి, "చెమట పోస్తున్నది. జ్వరం తగ్గినట్టే. ఆ మాత్ర వేసుకోండి. రండి పోదాం." అన్నది.

వేదమ్మ లేవలేదు. "వెళదాం వుండు" అని వూరుకున్నది. ఈ లోపల వర్ధనమ్మ వెదుకులాట ఫలించినట్టున్నది. క్రింది సొరుగులోంచి ఒక ఫొటో పైకి తీసి నవ్వుతూ, "ఇదుగో, మా బాబాయి తీసిన ఫోటో. ఆ వైద్య దంపతులది" అంటూ వేదమ్మ దగ్గరి కొచ్చింది.

వేదమ్మ దాన్ని అందుకుని చూసింది. ఇది తమ యింట్లో ఉన్న దానివలె మరీ పాతబడిపోలేదు.

అంతలోనే మీనాక్షి. తల తిప్పి ఆ ఫొటో వంక చూసి, "ఈ ఫొటో...ఇది మీ ఇంట్లోనూ ఉందా?" అని ఆశ్చర్యబోయి తరవాత నవ్వుతూ వర్ధనమ్మ వంక తిరిగి, "ఈ ఫొటో మా ముందుగదిలో బల్ల

మీద చూడలేదూ. పిన్నీ ?" అంటూ ఫొటోమీద వేలు వుంచి, "ఇదెవరో చెప్పండి చూదాం అన్నది.

వర్ధనమ్మ శ్రద్ధగా చూసి "అరె, మామీ....నువ్వేనా? ... మీవారేనా ఆ డాక్టరు ! మా బాబాయి తెగ పొగిడేవాడు" అన్నది.

వేదమ్మ లేచింది. ఇప్పుడామె కళ్ళనిండా నీళ్లున్నాయి. ఏదో మాట్లాడబోయింది కాని, గొంతు పెగలలేదు.

కొన్ని క్షణాల తరువాత మీనాక్షి "రండి. పోదాం" అని అత్తగారిని నడిపించుకుని ఇవతలికి వచ్చింది. అత్తా కోడళ్ళిద్దరూ తమ వాటాలోకి వెడుతూ ఉండగా వేదమ్మ హఠాత్తుగా వీథిలోకి చూసింది. ఒక్క క్షణం కదలకుండా అలాగే నిలబడిపోయింది.

ఎవరో పోయినట్టున్నారు. నలుగురు మనుషులు మోసుకు పోతున్నారు. ముందు కుండ పట్టుకుని తడి గుడ్డలతో ఒక యువకుడు నడుస్తున్నాడు. ఎవరిదో అంతిమ యాత్ర ఆ విధంగా నిశ్శబ్దంగా కొన సాగుతున్నది. వీథిలో జన సంచారం మామూలుగానే వుంది. బస్సులూ, రిక్షాలూ వస్తూ పోతూనే ఉన్నాయి. శవం వెనక ఇద్దరో, ముగ్గురో నడుస్తున్నారంతే.

వేదమ్మ కోడలితో నెమ్మదిగా – "ఇక్కడ శ్మశానం చాలా దూరం కాబోలు" అన్నది.

మీనాక్షి ఒక్కసారి అత్తగారి కళ్ళలోకి చిత్రంగాచూసి, "అవును రెండు, మూడు మైళ్ళుందనుకుంటాను. నాకూ సరిగా తెలియదు. మీరు లోపలికి రండి. కాస్త నాలుగు మెతుకులు తింటే మంచిది" అన్నది.

వేదమ్మ లోపలికెళ్ళి మాత్ర వేసుకుని నీళ్ళు తాగింది. తరవాత "కాస్సేపు నడుం వాల్చి లేచి అప్పుడు ఆకలయితే చారూ అన్నం తింటాను. లేకపోతే లంఖణమే మంచిది" అన్నది చాపమీద పడుకుంటూ.

మీనాక్షి మరో పక్కన మంచంలో కూర్చుని పుస్తకం చేతిలోకి తీసుకుంది. పిచ్చికలు రెండు మూడు కిటికీలో నుంచి ఎగిరి వస్తూ,

మళ్ళీ బయటికి పోతూ హడావిడి చేస్తున్నాయి. దూరంగా వేగంగా వస్తున్న బస్సు హారను ధ్వని ఆగకుండా కర్ణ కఠోరంగా వినిపిస్తున్నది.

ఉన్నట్టుండి వేదమ్మ ఒక చేతిమీద కొంచెం లేచి, "అమ్మా! మీనా! నా దగ్గర వచ్చి కూర్చో కాస్సేపు" అన్నది.

మీనాక్షి లేచి చేతిలో పుస్తకంతోనే వచ్చి అత్తగారి పక్కన కూర్చుంది.

వేదమ్మ, కోడలి చెయ్యి పుచ్చుకుని హఠాత్తుగా "మన వూళ్ళో శ్మశానం వూరికి చాలా దగ్గర. బావి దాటి చెట్ల మధ్యగా వెళ్ళాలి. ఒక సారెప్పుడో మా మరిది – మీ మామగారికి వరసకు తమ్ముడులే – పోతే అతని భార్యను పట్టుకోలేకపోయాం. అప్పుడు ఆమెను బలవంతంగా వెనక్కు లాక్కు వచ్చామనుకో. ఆ దోవలో చెట్లు ఎత్తుగా ఉంటాయి" అన్నది.

మీనాక్షి పుస్తకంలోకి చూస్తున్నదేగాని, ఆమె గుండెలు భయంతో గుబగుబ లాడాయి. అనుమానంగా అత్తగారి ముఖంలోకి చూసింది.

మళ్ళీ వేదమ్మ "నేను పెద్దదాన్నయిపోయాను కదా! ఇక్కడే కన్ను మూస్తాను. అప్పుడు మన పరము నన్ను యిక్కడే...."అంటూ ఆగిపోయింది. ఆ తరువాత ఆమె గొంతు పూడుకుపోయింది.

మీనాక్షికి మతిపోతున్నట్టయింది. ఆశ్చర్యంలోనుంచి తేరుకుని అత్తగారి నుదుట చెయ్యి ఉంచి, "పడుకోండి కాస్సేపు" అన్నది.

వేదమ్మ తల వూపిందేగాని, వెంటనే పడుకోలేదు. మళ్ళీ నెమ్మదిగా..."నే నిక్కడే పోవడం ఖాయం. అప్పుడు వాడు అంత ఖర్చుపెట్టి ఈ కట్టెను అంత దూరం మన వూరికి తీసుకుపోతాడా? ఇబ్బంది కదూ? అందుకని ఇక్కడే....అంతేలే..., అంతకన్నా చేసే దేముంది? వర్ధనమ్మ చెప్పిందే నిజం. రోజులు మారుతున్నాయి. మనమూ మారాలి. ఇలాంటివన్నీ వదులుకోకపోతే కుదరదు. అంతే. అవన్నీ భ్రమలు. పాతకాలపు భ్రమలు. ప్రాణం పోయిన తర్వాత కట్టెను ఎక్కడ మట్టి చేస్తేనేం?" అన్నది గొణుగుతున్నట్లు.

ఆమెకు అంతలో నిద్ర ముంచుకు వచ్చింది. కదలకుండా బరువుగా ఊపిరి తీస్తూ పడుకుండిపోయింది. నిద్రలో ఆమెకు రెండు చిన్న కలలు వచ్చాయి. తన వూళ్ళో ఇళ్ళన్నీ మాయమైపోయాయిట. అక్కడ ఇప్పుడంతా గంధపు చెట్లు దట్టంగా లెక్కలేనన్ని పెరిగి ఉన్నాయట.

ఆమె నిద్రలో అటునుంచి ఇటు తిరిగి పడుకున్నది. మరి కాస్సేపటిలో రెండో కల. ఆకాశంలో ఒక్క అంగుళమైనా ఖాళీలేకుండా అసంఖ్యాకంగా అషలూ కోట్లాదిగా కాకులు క్రిక్కిరిసి కనిపించాయి. అవన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయిట.

వేదమ్మ మళ్లీ మరోవైపు తిరిగి పడుకుంది. మీనాక్షి అత్తగారి నుదుట చెయ్యివుంచి చూసి, 'జ్వరం తగ్గిపోయింది' అనుకున్నది తనలో.

వేదమ్మ ప్రశాంతంగా నిద్రపోతున్నది. కలలు లేని నిద్ర పోతున్నది.

# కోరిక

వంతెన కింద రోడ్డుపక్క నిలబడి వున్నాడు రాంబాబు. భుజాన బరువైన పుస్తకాల సంచీ వుంది. ఒక చేతిలో చిన్న టిఫిన్ క్యారియర్ వుంది. చాలా ఏకాగ్రతతో దీక్షగా ఎదురుగా వున్న పెద్ద సైన్ బోర్డు వంక చూస్తున్నాడు. దానిమీద 'నగరంలో సినిమాల' పోస్టర్లన్నీ వున్నాయి. రంగు రంగుల రకరకాల పోస్టర్లు.

రాంబాబు ఒక పోస్టరు చూస్తూ ఆగిపోయాడు. అదేదో ఊరి చివర వున్న సినిమాహాలు. సాధారణంగా అక్కడ పాత సినిమాలే ఆడుతూ వుంటాయి. ఇప్పుడందులో పాతిక యేళ్ళనాటి ఒక జానపద చిత్రం వేస్తున్నారు. పోస్టర్‌లో పెద్ద అక్షరాలతో 'తప్పక చూడండి' మీ అభిమాన కథానాయకుడు నటించిన ఉజ్వల జానపద చిత్రం. భయంకర మైన పోరాటాలు, 'ఉక్కిరి బిక్కిరి చేసే సస్పెన్స్' వగైరా నినాదా లున్నాయి.

రాంబాబుకు అంతలో గుర్తొచ్చింది. అతని నాయనమ్మ చాలాసార్లు అతనితో ఈ సినిమా గురించి చెప్పింది. ఫలానా పేరుగల సినిమా ఎప్పుడైనా, ఏ హాల్లోనైనా వస్తే తనకు తప్పకుండా చెప్పమన్నది. మరిచి పోవద్దన్నది. అవును, ఇదే సినిమా... రాంబాబు మళ్ళీ శ్రద్ధగా పోస్టరంతా చదివాడు. క్రింద పెద్ద అక్షరాలతో 'రెండు రోజులు మాత్రమే' అని స్పష్టంగా వ్రాసివుంది.

అతడు మెల్లగా ఇంటిదోవ పట్టాడు. దారిలో అవీ ఇవీ చూసు కుంటూ పార్కుదాటి, వంతెనదాటి, ఇంటికి వచ్చేసరికి ఆ చిన్న వరండా లోనే నాయనమ్మ ఎదురైంది. ఎందుకో రుసరుసలాడుతున్నది. తీరికగా వరండాలో గోడకానుకుని కూచుని బొంగురు గొంతుకతో "ఇంతే నా జీవితం. ఎప్పుడు సుఖపడ్డాను కనుక? ఇంతే... ఇలా వెళ్ళిపోవాల్సిందే"

అంటున్నది... రాంబాబు నెమ్మదిగా లోపలికి వెళ్ళాడు. వంటగదిలో తల్లి పనిలో వుంది. ఆమె కూడా అస్పష్టంగా ఏదో గొణుగుతోంది. రాంబాబు పుస్తకా లవతల పడేసి, క్యారియరు వంటింట్లో పెట్టి ఒక చేత్తో బాగూ పైకి లాక్కుంటూ, మరో చేత్తో ముక్కు తుడుచుకుంటూ "అమ్మా! ఆకలవుతున్నదే. తింటానికేవన్నా పెట్టవూ?' అని అడిగాడు.

వాళ్ళ అమ్మ కోపంగా వెనుదిరిగి చూసి "ఏం కాస్సేపాగలేవూ? కాళ్ళు కూడా కడుక్కోకుండా ఏమంత తొందర?" అని ఉరిమింది. రాంబాబు వెనక్కు తగ్గి "ఇంట్లో పరిస్థితి ఏమి బాగున్నట్టులేదే... అంతా రుసరుస లాడుతున్నారు" అనుకున్నాడు.

ముసలమ్మకు డెబ్బై యేళ్లుంటాయి. ఆమె జీవితమంతా ఎక్కడో పల్లెటూళ్ళో గడిచింది. అక్కడే పుట్టడం పెరిగి పెద్దది కావడం. ఆ వూరి సంబంధమే పెద్దవాళ్లు ఖాయం చెయ్యడం... అక్కడే పెళ్ళి... అక్కడే పురుళ్లు, పుణ్యాలు...అక్కడే చావులు, అక్కడే కాన్పులు, అక్కడే కష్టసుఖాలు...ఇలా అంత జీవితమూ అక్కడే వెళ్ళిపోయింది.

కొన్నేళ్ళ క్రితం భర్త పోవడంతో అక్కడ మిగిలివున్న చేరెడు నేలా అమ్ముకుని కొడుకు ఆమెను ఇక్కడికి తీసుకువచ్చాడు. ఇక్కడ ఆమెకేమీ తోచదు. పొద్దున్న లేచి అలా చుట్టుపక్కల యిళ్ళకు వెళ్ళి కష్ట సుఖాలు విచారించి వస్తూ వుంటుంది. వాళ్లు విన్నా వినకపోయినా పట్టించుకోకుండా శక్తి కొద్దీ వాగి తమ యింట్లో విశేషాలు వారిముందు ఏకరువు పెట్టి, వారి యింటిలో విశేషాలు సాధ్యమైనంత వరకు సేకరించు కుని నెమ్మదిగా ఎప్పటికో యిల్లు చేరుకుంటూ వుంటుంది. కోడలికి, ఇది గిట్టదు. "హాయిగా యింటిపట్టున కూర్చుని 'కృష్ణా రామా' అనుకోరాదా? ఆ యిల్లూ ఈ యిల్లూ బలాదూరు తిరక్కపోతే?" అని సతాయిస్తూ వుంటుంది. పైగా ముసలమ్మకు పసిపిల్లలాగా అవీ యివీ తినాలని కోరిక. ఈవేళ అదే జరిగింది. ఆమె మధ్యాహ్నం మూడుగంటలు దాటిన తర్వాత ఎండ కొద్దిగా తగ్గడం గమనించి చేతికర్ర అందుకుని నెమ్మదిగా తన 'మామూలు రౌండ్లకు' బయలుదేరింది. ఇల్లుదాటి కొద్ది గజాల దూరం

వెళ్ళగానే సీతాఫలాలు అమ్ముతున్న ఒక నడివయసు అమ్మాయి ఎదురైంది. ముసలమ్మ కళ్లు మెరిశాయి. నోరూరింది. సీతాఫలాలు ఎంతో అందంగా, ఆకర్షణీయంగా, కన్నులపండువగా కనిపించాయి. గొప్పగా రోడ్డుమీదనే బుట్ట దింపించి, నదురుగా, పెద్దవిగా వున్న రెండు పళ్లు ఏరుకుని బేరమాడింది. ఎంత కిందపెట్టి మీదపెట్టి బేరమాడినా రెండు పళ్ళూ అర్ధరూపాయికి తగ్గలేదు.

ముసలమ్మ పళ్లు రెండూ ధోవతి చివర కట్టుకుని తమ యింటివైపు వేలు చూపించి "అదుగో ఆ పక్కదే మా వాటా. మా కోడలుంటుంది డబ్బులడిగి తీసుకో" అని చెప్పి ఎదురుగావున్న వరలక్ష్మమ్మగారి యింటిలోకి వెళ్ళింది. 'అమ్మాయ్!' అని పిలుస్తూ! తర్వాత గొడవ అంతా రెండు నిముషాల్లో జరిగింది. "ముసలమ్మగారు పళ్ళు తీసుకున్నారమ్మా! రెండూ అర్ధరూపాయి... డబ్బులు మిమ్మల్ని అడగమన్నారు."

"ఆఁ! పళ్ళు తీసుకుందా? రెండు పళ్లు అర్ధరూపాయా? వెధవ సీతాఫలాలకు మొహం వాచిపోయి వుందా? తనేం పసిపిల్లా? నెలాఖరు రోజుల్లో డబ్బులేమన్నా చెట్లకు మొలుస్తాయనుకుందా? రోజులెట్లా వున్నాయి? మండిపోతున్నాయి. ఏళ్ళొచ్చాయి ఎందుకూ? ఆ మాత్రం ఇంగితం తెలియొద్దూ..."

"అమ్మా! యింతకీ డబ్బులు..."

"డబ్బులిక్కడ కుప్ప పోసుకుని కూర్చోలేదు...ఫో ఫో ఇంత జరిగాక పళ్ళ మనిషి ఊరుకుంటుందా ? బుట్టనెత్తి కెత్తుకుని విసవిస నడిచి వరలక్ష్మిదేవి యింటికొచ్చి, ముందు అరుగుమీద కూర్చుని బాతాఖానీ కొడుతున్న ముసలమ్మ దగ్గరికి వెళ్ళి, పళ్లు రెండూ పుచ్చుకుని 'మంచి బేరమే' అని సణుక్కుంటూ వెళ్ళిపోయింది. ముసలమ్మకు తల తీసేసినట్టయింది. కళ్ళవెంట నీళ్లొచ్చాయి. ఏం మాట్లాడేందుకు గొంతు పెగల్లేదు. కర్ర అందుకుని గబగబ అడుగులు వేసుకుంటూ ఇంటికి వచ్చి కూర్చుని తీరిగ్గా మొదలు పెట్టింది. ముక్కు చీదుకుంటూ, మాటి

మాటికీ కళ్లు తుడుచుకుంటూ "ఈనాటి కి గతి పట్టింది. నా కొడుకు ఇంటో నా కింత అవమానమా? వెధవది అర్ధరూపాయి డబ్బులకు నోచుకోలేదా? అందరూ కోడళ్ళూ అందరిళ్ళలో ఇలాగే వున్నారా? ఇంత అరాచకం ఎక్కడైనా వుందా?" లోపల కోడలు అన్నీ వింటూనే వుంది. కాని, పల్లెత్తి మాట్లాడలేదు. బదులు పలకలేదు. వాగి వాగి చివరకు ముసలమ్మ అలిసిపోయింది. అదుగో సరిగ్గా అప్పుడు వచ్చాడు రాంబాబు స్కూలు నుంచి.

అతడు తీరికగా నాయనమ్మ పక్కన చేరాడు. ఆమె అతనివంక చూసిందే కాని యేమీ మాటాడలేదు. రాంబాబుకు నాయనమ్మను చూస్తే జాలివేసింది. ఆమె అప్పుడు ప్రపంచంలో వున్న విషాదమంతా మూట కట్టి కూర్చోబెట్టినట్లున్నది.

రాంబాబు నెమ్మదిగా "నాయనమ్మా! సినిమా..." అన్నాడు.

ఆమె గయ్‌మని మళ్ళీ లేచింది. "ఏం నాయనా! ఎగతాళిగా వుందా? వెధవది పళ్ళకు అర్ధరూపాయ గతిలేదు. సినిమాట, సినిమా."

రాంబాబు అనునయంగానూ, నెమ్మదిగానూ స్పష్టంగానూ "అది కాదు నాయనమ్మా, వినూ. నువ్వెప్పుడూ చెబుతూ వుంటావ్, అదీ వొచ్చిందిప్పుడు రెండు రోజులే. ఇంక వుండదు" అన్నాడు.

ఆ సినిమా పేరు వినగానే ముసలమ్మ గాజుబిళ్ళలవంటి కళ్లు మెరిశాయి. అతని దగ్గరికి జరిగి "ఆ సినిమా వొచ్చిందా? ఎక్కడ? ఎప్పుడు? హాలు ఎంత దూరం?" అని ప్రశ్నలు కురిపించింది. రాంబాబు అన్ని ప్రశ్నలకూ సమాధానం చెప్పాడు – ఆ సినిమా రెండు రోజులు మాత్రమేననీ, అప్పుడే ఒకరోజు అయిపోయిందనీ మరునాడు మాత్రమే వుంటుందనీ తెలుసుకుని గంభీరంగా ఆలోచించడం ప్రారంభించింది. కాస్సేపాగి "ఒరే రాముడూ! మనం ఎట్లా అయినాసరే ఆ సినిమాకు పోవాలి తప్పదు" అన్నది ఖచ్చితంగా.

రాంబాబు ఆమె పట్టుదల గ్రహించాడు. లోపలికి వెళ్ళి కలం, కాగితం తెచ్చి ఇద్దరు మనుష్యులకు ఆ సినిమాకు వెళ్ళి రావడానికి ఎంత

ఖర్చవుతుందో లెక్కవేశాడు. రానూ పోనూ బస్ ఛార్జీలు, అక్కడ రెండు టిక్కెట్లు. మధ్యలో తానేమీ వేరుశెనగ కాయలు వగైరాలు కావాలని ఆశించడు... జాగ్రత్తగా లెక్కవేసి నిట్టూర్చి "లాభంలేదు నాయనమ్మా ! చాలా అవుతుంది......" అన్నాడు.

ముసలమ్మ వినలేదు. తల అడ్డంగా ఆడిస్తూ "అదేం వీల్లేదు. ఇద్దరం వెళ్ళి తీరవలసిందే—ఎంత ఖర్చయినా సరే— సీతాఫలాలు అక్కర్లేదు...తిండి అక్కర్లేదు !" అన్నది.

నాయనమ్మకు ఆ పాతకాలపు సినిమా మీద అంత మోజెందుకో రాంబాబుకు అర్థం కాలేదు. పోనీ, ఒక పని చేద్దాం. నేను నిన్ను హాలు దాకా తీసుకుపోయి టిక్కెట్టు కొని లోపలికి పంపిస్తాను. ఆట వొదిలే టైముకు వచ్చి నిన్ను ఇంటికి తీసుకొస్తాను. అందువల్ల బోలెడు సుఖం. పైగా నాకు ఆ పాత చింతకాయ పచ్చడి సినిమాలు ఇష్టం ఉండదు" అన్నాడు.

ముసలమ్మ ఒప్పుకోలేదు. "నువ్వూ రావలసిందే" అన్నది. "నీకు మీ తాతగారి పేరు పెట్టుకున్నాంరా—తండ్రీ!" అని గొణిగింది. తర్వాత నెమ్మదిగా అసలు విషయం బైట పెట్టింది. అది విన్న తర్వాత రాంబాబుకు కూడా ఆ సినిమా తప్పకుండా చూడాలనిపించింది. నిశ్శబ్దంగా కూర్చుని డబ్బు పోగుచేసే పద్ధతులు ఆలోచించడం ప్రారంభించారిద్దరూ.

అది చాలా పాత కాలపు సంగతి. అప్పుడు ఆమె భర్త రాయిలా హాయిగా ఆనందంగా ఉండేవాడు. తమ వూర్లో అడపా దడపా వారినీ వీరినీ పోగుచేసి నాటకాలాడుతూ వుండేవాడు. ఆయన ఎప్పుడో మదరాసు వెళ్ళినప్పుడు, స్నేహితుడు ఈ సినిమాలో చిన్న వేషం వేయమంటే 'సరేన'ని వేశాడు సరదాగా. ఆ కథ అంతా రాజులకూ రాజ్యాలకూ క్రూరులైన సేనాధిపతులకూ రాజకుమార్తెలకూ కుట్రలకు, ఎత్తులకూ పై ఎత్తులకూ సంబంధించినది. అందులో ఆయన వేషం వేశాడు. రాజ వైద్యుడి వేషం. ముసలమ్మ మాటల్లో; "చాలా సేపే కనిపిస్తారు. చెప్పి

కోటు తొడుక్కుని... తలపాగాతో... మీసాలతో — రెండు మూడు మాటలు కూడా ఉన్నాయి."

నాయనమ్మా, మనవఁడూ ఇద్దరూ కృతనిశ్చయులై లేచారు.

ఆనాడు రాత్రి ముసలమ్మ, కోడలు వంటగది శుభ్రంచేసే పనిలో నిమగ్నురాలై వున్నప్పుడు కొడుకు గదిలో చేరింది. కూర్చుని నెమ్మదిగా ప్రారంభించింది. 'తెల్లవారితే శివరాత్రి... ఇంత బతుకూ బతికింది తాను.... ఇప్పుడు కాటికి కాళ్లు చాచుకుని వుంది... పొయ్యే ముందు ఇంత పుణ్యం చిన్న మూటగానైనా కట్టుకుని పోకపోతే సద్గతులుండవు....పైగా దూరమా భారమా?....ఉంటున్నది పవిత్ర కృష్ణాతీరం. నాలుగు మునకలు వేసి అమ్మవార్ని చూసొస్తే చాలు.... వొట్టి చేతుల్తో పోలేదు కదా! అడుక్కునే నిర్భాగ్యులందరికీ పెట్టలేము.... కనీసం కొందరికైనా పైసలు పడేయొద్దూ?'

కొడుకు అంతా విన్నాడు. ఏమీ మాట్లాడకుండా లేచి చొక్కా జేబు తడివి నెలాఖరు రోజుల్లో జేబులో మిగిలిన రెండు రూపాయి కాయితాలూ, కాసిని చిల్లర నాణాలూ ముసలమ్మకిచ్చి, మళ్ళీ కూర్చున్నాడు. ముసలమ్మ ఇవతలికి వచ్చి మనుమడి దగ్గరచేరి ఆ డబ్బులన్నీ అతనికి అప్పగించింది. అతడంతకు ముందే తాను అప్పుడప్పుడు పోగు చేసిన రూపాయి, చిల్లర లెక్క చూసుకున్నాడు. తర్వాత రెండు రోజుల పాటు తాను స్కూలుకు నడిచిపోగలడు. పొద్దున్నే వీధి చివర యింట్లోని కాశీగాడు తనకు ముప్పై పైసలివ్వాలి. అవి వసూలు చేస్తే 'సుబ్బరంగా' సరిపోతుంది.

మర్నాడు ముసలమ్మ ఎక్కడినుంచో మరో పావలా పట్టుకొచ్చింది.

రాంబాబు కొంచెం శ్రమపడ్డాడు. కాని మొత్తంమీద కాశీగాడి బాకీ వసూలు చేశాడు.

సాయంకాలం అయిదు దాటిన తర్వాత ముసలమ్మ తనకున్న వాటిలో మంచి ధోవతి కట్టుకొని కళ్ళజోడు తాటితో చెవులకు బిగించుకొని

తయారైంది. రాంబాబు సిద్ధంగానే వున్నాడు. ముసలమ్మ కోడల్ని కేక వేసి "ఇదిగో నిన్నే... మొన్న చెప్పానే...మనవూరివారి అమ్మాయి కాపురానికొచ్చి ఇక్కడే వుంటున్నదని....వారింటికి పోతున్నా... మొన్న కనిపించి ఒకటే బతిమిలాడింది. పాపం.... పెద్ద దిక్కెవ్వరూ లేరట. చూసొస్తా... రాముణ్ని తోడుగా తీసుకుపోతున్నా పెద్ద ముండనుకదా. తోడుగా ఉంటాడని...." అన్నది. కోడలు తలవంచి చూసి ఏకళనున్నదో యేమో సరే అన్నట్టుగా తల వూపింది. నెమ్మదిగా 'జాగ్రత్త' అని కూడా అన్నది.

ఇద్దరూ నడచి వచ్చి వంతెన దిగి బస్సుకోసం నిలబడ్డారు. ఎన్నో బస్సులు వస్తున్నాయి... పోతున్నాయి... ఏ బస్సులోనూ ఖాళీ లేదు. చాలాసేపు పడిగాపులు పడివుంటే చివరకు బస్సు దొరికింది. అది అరగంట ప్రయాణం చేసి ఊరి చివరకు చేరింది. అక్కడి నుంచి నడిచి సినిమా హాలుకు చేరుకున్నారు. అదొక పాత హాలు... హాలు ముందు లైట్లు కూడా మందంగా ఉన్నాయి. జనం కూడా ఎక్కువ మంది లేరు. చాలా పలుచగా వున్నారు. ఆ వాతావరణం చూస్తే అసలారోజు సినిమా ఉంటుందా, ఉండదా అని అనుమానం కలిగింది. రాంబాబు వెళ్ళి కనుక్కొని వచ్చాడు. "నాయనమ్మా! ఎట్టి పరిస్థితుల్లోనూ సినిమా వేస్తారు... పదిమంది జనం ఉన్నా సరే..." అని చెప్పాడు.

అక్కడున్న పది, పదిహేను మంది చాలా నిరుత్సాహంగా నిర్లిప్తంగా ఉన్నారు. ఏమి తోచక, మరేం చెయ్యడానికి ఏమీలేక వచ్చిన వాళ్ళలాగున్నారు.

అంతలో కొన్ని లైట్లు వెలిగాయి. బెల్ మోగింది.... కౌంటర్లు తెరచి కూర్చున్నారు హాలువాళ్లు. జనం ఉన్న కొద్దిమంది చాలా నెమ్మదిగా, నీరసంగా టిక్కెట్లు కొనుక్కుంటున్నారు.

రాంబాబు టిక్కెట్లు తెచ్చాడు. నాయనమ్మ చెయ్యి పట్టుకుని లోపలికి నడిపించుకుని వెళ్ళి ఆమెను కూర్చోబెట్టాడు. లోపల ఏదో పాత కాలపు సినిమా పాట వినిపిస్తున్నది.

మళ్లీ బెల్ మోగింది. లోపల లైట్లు ఆరిపోయాయి.

కూర్చున్న కొద్దిమంది జనంలోను, ఎవడో ఈల వేశాడు.

న్యూస్‌రీల్ ఒకటి ప్రారంభమయింది... తర్వాత అసలు సినిమా అక్షరాలు పడ్డాయి... మళ్లీ ఎవడో ఈల వేశాడు.

ఆ కథ అంతా రాజ్యాలకోసం కుట్రలు, యుద్ధాలు, ముసుగు మనుషులు, ప్రేమలు ఇలా నడుస్తున్నది. పాత ప్రింటు కావడం వల్ల అన్ని సన్నివేశాల్లోనూ వర్షం కురుస్తున్నట్టుగా వుంది. మాటి మాటికీ తెర మీద గీతలూ, ఇంటూ, ప్లస్ గుర్తులు పడుతున్నాయి. జనంలో ఎవరో ఎందుకో ఏదో పెద్దగా అని, మరింత పెద్దగా నవ్వారు.

అంతలో ఇంటర్వెల్... 'ఇంక పది నిమిషాల్లో...' అనుకుంది ముసలమ్మ... "ఇంక పది నిమిషాల్లో" అని పెద్దగా రాంబాబుతో అన్నది.

కథ నడుస్తున్నది. రాజుగారు మరణశయ్య మీద వున్నారు— చుట్టూ దేవేరులూ, మంత్రులూ, ఇతరులూ నిలబడి వున్నారు... మౌనంగా— "ఇప్పుడే—ఇప్పుడే" అన్నది ముసలమ్మ ఆదుర్దాగా— రాంబాబు ఉత్కంఠతో జాగ్రత్తగా ఎదురు చూస్తున్నాడు. అంతలో "రాజవైద్యులొచ్చేశారు—" అన్న డైలాగ్... "చూడు చూడు" అన్నది ముసలమ్మ. కెమెరా గుమ్మంవైపు తిరిగింది.

ఉన్నట్టుండి తెరమీద ఎర్రటి మంట కనిపించింది. శబ్దం కూడా వినిపించింది. ఫిలిం కాలిపోయింది. లైట్లు వెలిగాయి. జనంలో ఎవడో మళ్ళీ ఈల వేశాడు. ఒకరిద్దరు లేచిపోయారు.

రీలు లోపల చుట్టుతున్న శబ్దం... అరనిమిషం తర్వాత మళ్ళీ సినిమా మొదలైంది. ఇప్పుడు విలను గుహలో నాట్యం ప్రారంభమైంది. జనంలో ఎవడో మళ్ళీ ఈల వేశాడు.

రాంబాబు నీరు కారిపోయాడు. నాయనమ్మ వంక చూశాడు. మె దిగ్భ్రాంతి చెందిన దానిలా బొమ్మలా కూర్చుని వుంది.

"నాయనమ్మా!"

"ఊం!"

"ఇంతేనా?"

"అంతే ఇక కనిపించదు" ఐదు నిమిషాల తర్వాత ఆమె రాంబాబు చెయ్యి పట్టుకుని లేచి "పద యింటికి పోదాం- ' అన్నది.

ఇద్దరూ హాలు బయటికి వచ్చి బస్సు కోసం ఎదురు చూస్తూ నిల బడ్డారు. ఎదురుగా అంత మందమైన వెలుతురు... చీకటిని మించలేని సామాన్యమైన వెలుతురు...

# ఏస్ రన్నర్

ఎవరో కుర్రవాడు రన్నింగ్ రేస్ చేస్తున్నవాడిలా పేవ్‌మెంటు మీద బాణంలాగా 'రివ్వు'న పరుగెత్తి పోతున్నాడు వేగంగా.

రామచంద్రమూర్తి ఒక్క క్షణం ఆగి వెనుదిరిగి చూస్తూ నిల బడ్డాడు. అంతలోనే ఆ కుర్రవాడు కనుచూపుమేర దాటిపోయాడు.

రామచంద్రమూర్తికి నవ్వు వచ్చింది.

వేగంగా పరుగెత్తుతున్న వారెవరిని చూచినా అతడు అలాగే నిలబడిపోతాడు. బొమ్మలా చేష్టలు దక్కి నిలబడిపోయి తర్వాత నవ్వుకుంటాడు.

అతడు మళ్ళీ నడవడం ప్రారంభించాడు.

రోడ్డ పక్కన పేవ్‌మెంట్ మీద స్తంభాలకు రకరకాల సినిమా పోస్టర్లు అతికించబడి వున్నాయి. అన్నీ అందమైన అమ్మాయిల బొమ్మలు. హీరో, హీరోయిన్లు గాఢంగా కౌగలించుకొని వున్న దృశ్యాలు. ఒకళ్ళ మీద ఒకరు పడి దొర్లుతున్న దృశ్యాలు.

అతడు మరొక ఫర్లాంగు దూరం నడిస్తేకాని బస్సు స్టాపు చేరుకోలేడు. ఎంత పెందలాడి యింట్లో నుంచి బయలుదేరితేతప్ప బస్సు అంది ఆఫీసుకు చేరుకోవడం కష్టం... అప్పటికి సీతమ్మ ఎంతో పెందలకడనే-బాగా చీకటి ఉండగానే నిద్రలేచి పనులు ప్రారంభిస్తూంది. అవి సర్దుకొని యివి సర్దుకుని వంటకు ఉపక్రమించి ఎంత ఉరుకులు పరుగులు పెడుతూ చెమటలు కక్కుతూ పని చేసినా తొమ్మిది గంటల లోపున వంట తయారు కాదు. నాలుగు మెతుకులు నోట వేసుకుని తాను తయారయ్యే సరికి తొమ్మిదిన్నర అవుతుంది. ఎంత వేగంగా నడిచినా బస్ స్టాప్‌కు చేరుకునే సరికి మరొక పావుగంట.... ఆ తర్వాత బస్సు

కోసం పడిగాపులు పడి వుండాలి. ఎంతకూ తనెక్క వలసిన బస్సు రాదు. వచ్చిన బస్సులు ఆగకుండానే రివ్వున దూసుకు పోతుంటాయి. ఆ వేళప్పుడు అన్ని బస్సులూ నల్లుల్లాగా, బల్లుల్లాగా కిటకిటలాడుతున్న ప్రయాణీకులతో కిక్కిరిసి వుంటాయి. పోనీ ఓపిక చేసుకుని నడిచి పోదామా అంటే ఆఫీసు దగ్గరా దాపూ కాదు. అయిదు కిలోమీటర్ల దూరంలో ఊరికి అవతలి వేపున ఉందది.

'పోనీ ఆఫీసుకు దగ్గర్లో ఏదైనా యిల్లు చూసుకోరాదూ?' అన్నారు చాలామంది.

కాని అక్కడి అద్దెలు తాను భరించలేడు. అక్కడ అద్దెలు చుక్క లంటుతూ వుంటాయి. తన కొచ్చే జీతంలో యిక్కడికే ఎటూ చాలక బాధపడుతున్నారు. ఆఫీసులో కొందరు జల్సారాయుళ్లు ఉన్నారు. ఖరీదైన బట్టలు ధరించి, ఖరీదైన సిగరెట్లు కాలుస్తూ, అందాల రాముళ్ళ లాగా ఘుమఘుమలాడిపోతుంటారు. కొత్త కరెన్సీ నోటుల్లా పెళ పెళ లాడుతుంటారు. కాని వారి దారి వేరు వారి సీట్లు అటువంటివి. కల్ప వృక్షాలు—కామధేనువులూ...

తన సీటు అటువంటిది కాదు. చాకిరీకి మాత్రం ఏమీ తక్కువ ఉండదు. టన్నుల కొద్దీ ఫైళ్లు పేరుకుపోతుంటాయి. ఎంత చేసినా తరగని పని—ఫలితం మాత్రం నెల తిరిగేసరికి వచ్చే ఆ జీతపు రాళ్లే. అందులో బోలెడన్ని కట్లూ, కత్తిరింపులు చేతిలో పడే మొత్తం ఆనందం కలిగించదు సరికదా ఆందోళన కలిగిస్తుంది.

అతడు కోటు వేసుకుంటాడు. పాతకాలపు పాత కోటు. 'మీకేమండి కోటు తొడుక్కుంటారు దర్జాగా' అంటారు కొందరు.

వారికి తెలియదు. తన కోటు, లోపలి చొక్కాలోని ఎన్ని చిరుగు లను బయటకి కనబడకుండా కప్పుతున్నదో!

ఎండ చిట చిట లాడుతున్నది. పెళ పెళ లాడుతున్నది. సూర్యుడు చిర్రుబుర్రు లాడుతున్నాడు. ఎండలో చురుకు అంత కంతకూ పెరుగుతున్నది.

రామచంద్రమూర్తి నుదుట పట్టిన చెమటను అరచేతో తుడుచు కుంటూ వీధి చివరకు కళ్లు చికిలించి చూశాడు. ఏదో బస్సు వస్తున్నది. దాని మీదవున్న నంబరు సరిగా కనిపించడంలేదు. అన్నట్లు ఈ మధ్య చూపు కొంచెం మందగించి నట్టున్నది. చత్వారం వస్తున్నదేమో!

చత్వారం వొచ్చే వయస్సే మరి. ఎస్సెల్సీ రిజిష్టరులో వున్న తన పుట్టిన తేదీ నిజమే అయితే తన కిప్పుడు నలభై ఎనిమిది ఏళ్లు రెండు నెలలయింది. ఇంకా ఏడేళు సర్వీసున్నది.

బస్సు దగ్గరికి వచ్చాకకానీ నంబరు సరిగా కనిపించలేదు. అది తన బస్సు కాదు. పైగా బస్టాపు దగ్గరికి వచ్చాక స్పీడు పెంచి మరీ వేగంగా పోనిచ్చాడు డ్రైవర్. ఆ బస్సు ఎక్కవలసిన వారు కొంత దూరం దాని వెంట పరుగెత్తి ఇక ఆగదనీ నిర్ధారణ చేసుకుని ఉసూరు మంటూ తిరిగి వచ్చి మామూలుగా నిలబడారు.

రామచంద్రమూర్తి ఆలోచిస్తూ నిలబడ్డాడు. తాను ఆఫీసుకు నడిచి పోతే ఎంతసేపటిలో పోగలడు ? అని ఆలోచించాడు. బాగా వేగంగా నడవగలిగితే గంట, లేకపోతే యాభయి నిముషాలు పట్టవచ్చు. పరుగెత్తి పోతే ? ఇప్పుడు తాను పరుగెత్త గలడా ? ఒకప్పుడు పరుగెత్తాడు. రివ్వున గాలిలాగా, బాగా లాగి వొదిలిన బాణం లాగా పరుగెత్తాడు. చుట్టూ చేరినవారు కరతాళ ధ్వనులు చేసి అభినందించారు. తమ జిల్లా పేరు నిలబెట్టాడని విపరీతంగా మెచ్చుకున్నారు. ఫొటోలు . దండలు వేశారు.

తానప్పుడు రోజూ పరుగెత్తే వాడు. చీకటి ఉండగానే లేచి పరుగు ప్రారంభించేవాడు. ఎక్కడా ఆగకుండా వేగంగా పరుగెత్తే వాడు. మైళ్ళకొద్దీ దూరం అతని సన్నని కాళ్ళ క్రింద తరిగిపోయేది. ఆ కాళ్లు ఇనుప కడ్డీలలా పొడవుగా ఉండేవి. ఆ కండరాలకు అలుపు తెలిసేది కాదు. ఇప్పుడు ఇంత కాలం తరువాత పరుగెత్త గలడా ? జీవితంలో ఇంత అలసిపోయి ఇప్పుడు కేవలం పది బారల దూరం కూడా పరుగెత్తడం అనుమానమే.

పక్కనే నిలబడివున్న వ్యక్తిని "ఏమండీ! టైమెంత అయింది?" అని అడిగాడతడు. అతడు కొంచెం విసుగుతో చేతిగడియారం వంక చూసి "నైన్‌ఫిఫ్టీ" అని సమాధానం చెప్పాడు.

నైన్‌ఫిఫ్టీ. బాప్‌రే. తాను పది గంటలకల్లా సీటులో ఉండాలి. లేకపోతే ఆ కొత్త ఆఫీసరు అగ్గిరాముడై పోతాడు. ఆయన అసలే ఫైర్ బ్రాండ్. పరమ చిరాకు మనిషి. ఎప్పుడూ అయినదానికీ కానిదానికీ ధుమధుమ లాడుతుంటాడు. వయసుకు చిన్నవాడే. అంత తొందరగా ఎలా ప్రొమోషన్లు సంపాయించాడో ఎవరికీ తెలియదు. చాలా డబ్బు ఖర్చు పెట్టాడని అంటారు. ఆయనకు తెలిసినవి రెండే విషయాలు. ఒకటి తాను పెట్టుబడి పెట్టిన మొత్తానికి నూరురెట్లు పోగుచేసుకోడం. రెండు క్రింది వారందరిమీదా అనవసరంగా మండిపడుతూ అయినదానికీ కానిదానికీ సాధిస్తూ ఆఫీసులో అద్భుతమైన క్రమశిక్షణ అమలు పరిచే గొప్ప ఆఫీసరుగా పేరు ప్రతిష్టలు పోగుచేసుకోవడం. ఈ రెండూ ఆయన అద్భుతంగానే చేస్తున్నాడని చెప్పుకోవాలి. తన పెట్టుబడి కోసం తాపత్రయ పడడం ఒక ఎత్తు. సబార్డినేట్సును నానా హింసలు పెట్టడం ఒక ఎత్తు. అసలా మనిషి ముఖం చూస్తేనే అదొక రకంగా ఉంటుంది. మనిషి లావుగా ఉంటాడు. మెడ అంతా కొవ్వు పట్టి ఉంటుంది. ఎవరి వంకనైనా చూడదలుచుకుంటే మెడ ఒక్కటీ తిప్పి చూడలేడు. మొత్తం శరీరమే గిర్రున తిరగవలసి వుంటుంది. కుర్చీకి నిండుగా సరిపడా వుంటాడు. జుట్టు కొంచెం తెల్లబడుతూ వుంటుంది. కళ్లు ఎర్రగా చింత నిప్పుల్లా వుంటాయి. కంఠ స్వరం సరేసరి మహా భయంకరంగా చిన్న పిలలు జడుసుకునేటు ఉంటుంది.

అదిసరే ఇప్పుడు పది దాటుతున్నది కదా? ఈ బస్సు ఎప్పుడు వచ్చేట్టు? తానెలా ఎక్కేట్టు? ఎన్ని గంటలకు ఆఫీసుకు చేరుకునేట్టు? ఆఫీసరుకు ఏమి సంజాయిషి ఇచ్చుకునేట్టు?

అదుగో బస్సు. ఇంత కాలానికి దాని దర్శనమైంది. లోపల ఇటుకలు పేర్చినట్టు ప్రయాణీకులు కిటకిటలాడుతున్నారు. అయినా దిగ

వలసిన వారిద్దరు ముగ్గురు ఉండడంవల్ల అదృష్టంపండి ఆగింది. రామచంద్రమూర్తి కమ్మీ పట్టుకుని వదల్లేదు. దిగేవారు దిగగానే లోపలికి దూసుకుపోయాడు. బస్సెక్కడం అనే విద్యలో ఈ మాత్రపు ప్రాథమిక అనుభవమైనా లేకపోతే – ఆ సూట్‌వాలాలాగా పేవ్‌మెంట్ మీదనే గంటల తరబడి నిలబడిపోక తప్పదు. సోదరా! దూసుకుపోయే వాడిదే రాజ్యం... లేకపోతే నీ సంగతి అంతే...నిలబడు. నిలబడు... గంటల తరబడి నిలబడు. నీ చుట్టూ కొందరు దూసుకుపోతుంటారు... వాళ్ళే పైకి పోతుంటారు...నీ గతి యిక నిర్గతే... 'టికెట్... టికెట్' అంటూ ఇద్దరు ప్రయాణీకుల చంకల క్రింద నుంచి దూసుకు వచ్చాడు కండక్టరు అతి లాఘవంగా.

టికెట్ తీసుకుని నిలబడ్డాడు రామచంద్రమూర్తి.

వచ్చే ఫస్టు తారీఖున జీతం అందుకోగానే ముందు కళ్ళ డాక్టరు దగ్గరికి పోవాలి. బొత్తిగా చూపానడంలేదు! చదవడమైతే మరీ కష్టంగా వుంది. నాలుగు వాక్యాలు చదివితే చాలు కళ్ళవెంట నీళ్ళొస్తున్నాయి. తల నొప్పి పుడుతుంది.

రామచంద్రమూర్తి అలాగే నిలబడ్డాడు... అతని కళ్ళముందు యెప్పటిదో దృశ్యం కనిపించింది. తనకప్పుడు ఇరవై, యిరవై రెండేళ్లు ఉంటాయి. అప్పటికే మంచి రన్నర్‌గా పేరు తెచ్చుకున్నాడు. మరీ చిన్నప్పుడు తమ వూరికి నాలుగు మైళ్ళ దూరంలో వున్న చిన్న పట్నంలో స్కూలు చదువు. పొద్దున్నే లేచి చద్దన్నం తిని పుస్తకాల సంచీ భుజానికి తగిలించుకుని నడక ప్రారంభించేవాడు. సాయంకాలం తిరిగి వచ్చేటప్పుడు మరీ హుషారుగా వుండేది. నాలుగు మైళ్ళు పరుగెత్తు కుంటూ తిరిగి వచ్చేవాడు. తోటివారిద్దరు సాయంకాలం అయ్యేసరికి నీరసపడి తోటకూర కాడల్లా వ్రేలాడిపోతుండేవారు. తాను వారిని వొదిలి రివ్వు రివ్వున పరుగెత్తుకు పోయేవాడు. ఆ విధంగా రన్నింగ్ అలవాటయింది. స్కూల్లో పోటీలలో తానే ప్రథముడు. దాంతో ఇంకా అభిరుచి పెరిగింది. ఎక్కడికి వెళ్ళినా పరుగెత్తుతూ వెళ్ళడమే. నడవటం

అరుదై పోయింది. కాళ్లు సన్నబడ్డాయి.... కాళ్ళలో బలం సత్తువ పెరిగాయి. ఒళ్లు తేలికగా హాయిగా వుండేది. ఉదయమే లేచి మైళ్ళకొద్దీ పరుగెత్తి వస్తే ప్రాణానికి హాయిగా వుండేది.

బస్సు ఆగింది - రామచంద్రమూర్తి ఇద్దరు వ్యక్తులను నిర్దాక్షిణ్యంగా పక్కకు తోసి మళ్ళీ జనారణ్యాన్ని ఛేదించుకుని క్రిందికి దిగాడు. క్షణంలో బస్సు వెళ్ళిపోయింది. టైమ్ కనుక్కున్నాడు. గుండె గతుక్కుమన్నది. నుదుట పట్టిన పడుతున్న చెమటను రుమాలుతో తుడుచుకుంటూ వేగంగా ఆఫీసుదారి పట్టాడు. మళ్ళీ నడక... మరో అర ఫర్లాంగు దూరం.

ఎండ నియంత పరిపాలనలా భయంకరంగా వుంది. ఘోరంగా వుంది...భరించరానిదిగా వుంది.

ఆ రోజు...

అంతర్ జిల్లా ఎథ్లెటిక్స్ ముగింపు రోజు...రన్నింగ్ ఫైనల్స్... ట్రాక్ అంతా శుభ్రంగా వుంది. అభ్యర్థులు మొత్తం పద్దెనిమిది మంది - అందరూ పక్కనే పచ్చికలో ఎగురుతూ, గెంతుతూ సన్నద్ధం అవుతున్నారు. బహుమతి ప్రదానం చేయవలసిన కలెక్టరుగారు యితర ప్రముఖులతో కుర్చీలో కూర్చుని వున్నారు.

ఈ ఈవెంట్ కోసం తాను రోజూ ఉదయం సాయంకాలం ఆ గ్రౌండ్‌లోనే గంటల తరబడి పరుగెత్తాడు. ఈ సమయం కోసమే ఎదురు చూస్తున్నాడు. లౌడ్ స్పీకర్లలో మాటలు వినిపిస్తున్నాయి. పేర్లు వినిపిస్తున్నాయి.

పద్దెనిమిది మంది ట్రాక్ మొదట్లోకి వచ్చి నిలబడ్డారు. నేల మీదికి వంగారు. చేతులు నేలమీద ఆనించి సవ్వడి వినబడగానే ముందుకు రేసు గుర్రాల్లా దూసుకుపోయేందుకు సిద్ధంగా ఎక్కుపెట్టిన బాణాలవలె ఉన్నారు. కొద్ది క్షణాలు నిశ్శబ్దం.....

మెత్తని ప్రేలుడు వినిపించగానే తాను ముందుకి దూకి పరుగు ప్రారంభించాడు. కళ్ళముందు ట్రాక్ తప్ప మనుషులు కనిపించలేదు.

ప్రక్కనున్న పచ్చని పచ్చిక కనిపించలేదు. పైనున్న నీలాకాశం కనిపించలేదు.

గుండెకు తగిలిన పలుచని దారం తెగిన తర్వాత కొద్ది గజాల దూరం పరుగెత్తిపోయి పచ్చికలో కూలబడిపోయాడు. అంతలో తన చుట్టూ జనం మూగారు. తన చేతులు పట్టుకున్నారు. తనను కౌగలించుకున్నారు. చివరకు ఆయాసంతో వగర్చుతున్న తనను పైకెత్తి గాలిలోకి ఎగరవేశారు.

కలెక్టరు తనకు ట్రోఫీ బహూకరిస్తూన్నప్పుడు కరతాళధ్వనులతో ఆ ప్రదేశం అంతా మారుమ్రోగిపోయింది. 'ది ఫాస్టెస్ట్ రన్నర్ ఆఫ్ ది స్టేట్' అని సావనీర్‌లో ఫొటో క్రింద వ్రాశారు.

రామచంద్రమూర్తి ఆఫీసు మెట్లెక్కుతున్నాడు. ఆయాసంతో వగరుస్తున్నాడు. నుదుట, మెడమీద పడుతున్న చెమటను తుడుచుకుంటున్నాడు. ఆ ట్రోఫీ యింకా తనదగ్గరే వుంది. దాన్నీ ఇతర చిన్న చిన్న కప్పులూ వగైరా బహుమతులు దాచేందుకు తన దగ్గర అద్దాల బీరువాలు లేవు. కొన్ని అసలైన వెండికప్పులు తనకు డబ్బు అవసరం వచ్చినప్పుడు వాటికి కాళ్ళొచ్చినట్టు వెండి దుకాణాల్లోకివెళ్ళి చేరిపోయాయి. మరి రెండు మూడు కప్పులు లోపల ఎక్కడో ఉండాలి. ఆనాటి ట్రోఫీ మాత్రం పెద్దది ఇప్పుడూ ఇంట్లో కిటికీలో మూలగా ఉంటుంది. దుమ్ము కొట్టుకుపోయి ఉంటుంది. ఎన్నో సర్టిఫికెట్‌లు స్కూలు రోజులనుంచీ తనకు వచ్చినవి పురుగులు కొట్టి పాడైపోయాయి. ముట్టుకుంటే పొడి పొడి అయ్యేట్టున్నాయి.

స్ప్రింగుడోరు తెరుచుకుని లోపల అడుగు పెట్టేసరికి అయ్యగారు పేపరు చదువుతున్నారు. శబ్దంవిని కుర్చీ మొత్తం పక్కకు తిప్పి గడియారం వంక చూసి మొహాన గంటు పెట్టుకుని పేపరు బల్లమీదపడేసి "ఊఁ" అన్నాడు. ముందు భయంకరంగా...ఆ తర్వాత రామచంద్రమూర్తి రిజిష్టరు అందుకోబోతూవుంటే "కాస్సేపాగండి — ఎలాగూ పన్నెండు అవుతుంది. ఈ పూటకు లీవు పెట్టేద్దురుగాని —"అన్నాడు.

తర్వాత మళ్ళీ అంతలోనే "లీవుఉందా! అంతా వాడేసుకున్నారా" అని అడిగాడు.

రామచంద్రమూర్తి రిజిష్టరు మీదవున్న చేతిని వెనక్కు తీసుకుని "ఉందనే అనుకుంటానండి—" అన్నాడు.

"గూడ్ — అది సరేనండీ ... మీరెన్నింటికి బయలుదేరుతారు ఇంటి నుంచి?"

"తొమ్మిదింటికి సార్!"

"గుడ్ — తొమ్మిదింటికి బయలుదేరి పదకొండు గంటలకు ఆఫీసుకొస్తారు. అంటే ఇక్కడికి రావడానికి రెండు గంటలు పడుతుంది- అంతేనా?"

"కాదండి...బస్సులతో బాగా ఇబ్బందిగా ఉందండి — బస్సులు ఆపరు. ఎక్కించుకోరు..."

"గూడ్...కాబట్టి మనకు బస్సు సరిపడదని అర్థం—అంతేనా?"

రామచంద్రమూర్తి తలవంచుకున్నాడు.

"గూడ్—బస్సుమీద వస్తే లాభం లేదని తెలిశాక మీరు వేరే వసతి చూసుకోవాలి...అంటే మరో రవాణా సౌకర్యం — మరో మీన్స్ ఆఫ్ కన్వేయన్స్ — పోనీ ఒక స్కూటరు కొనుక్కోగూడదూ?"

రామచంద్రమూర్తి నవ్వేందుకు ప్రయత్నించాడు. "డబ్బు కావాలి కదండీ" అన్నాడు.

"గూడ్—డబ్బులేదు కాబట్టి కారు, స్కూటరు వగైరాలు వీల్లేదు — ఆగవు ఎక్కించుకోవు కాబట్టి బస్సు వీల్లేదు...మరి కొంచెం ముందుగా — ఎనిమిదింటికే యింటిదగ్గర బయలుదేరితే..."

"అప్పటికి యింట్లో వంటకాదండి."

"ఓహో...అదొకటా? కాబట్టి అదీ వీలులేదు. సరే... ముందు లీవ్ లెటరు రాయండి. ఈ లోపల నేను ఉపాయం ఆలోచిస్తాను."

రామచంద్రమూర్తి కాగితం అందుకుని ఆ పూటకు లీవ్ వ్రాసి యిచ్చాడు. అది రాస్తున్నంతసేపు ఆఫీసరు అతనివంక తమాషాగా అల వోకగా హేళగా చూస్తూ కూర్చున్నాడు.

ఆ తర్వాత దాన్ని అందుకుని అవతలపెట్టి "ఆఁ? ఉపాయం తట్టింది...అది బెస్టు— అన్నాడు.

'మచంద్రమూర్తి తలెత్తి అతని మొహంలోకి చూశాడు. అతడు నవ్వుతున్నాడు.

"చెప్పండి సార్—" అన్నాడతను.

"అవును ... అది బెస్టు ... మీరు తొమ్మిదింటికే ఇంటిదగ్గర బయలుదేరవచ్చు. పదింటికల్లా ఆఫీసుకు చేరుకోవచ్చు. పైగా వొంటికి ఎంతో మంచిది. ఆరోగ్యం బాగుంటుంది. ఎంతో మంచి ఎక్సర్‌సైజ్."

"చెప్పండి సార్!"

"తొమ్మిదింటికి ఇంట్లోనుంచి బయటికి రండి— వెంటనే పరుగు ప్రారంభించండి. స్పీడుగా పరుగెత్తండి. ఎక్కడా ఆగకండి— అర గంటలో ఆఫీసులో ఉంటారు. ఏమంటారు?"

ఈ మాటలని అతడు నవ్వడం ప్రారంభించాడు. తన మాటలకు తానే బల్లమీద పడి పడి నవ్వాడు. నవ్వి నవ్వి ముఖం ఎర్రబడింది. కళ్ళవెంట నీళ్లు తిరిగాయి.

రామచంద్రమూర్తి మొహం జేవురించింది. వ్రేళ్ళు వొణికాయి— కోపంతో మనిషి నిలువెల్లా ఊగిపోయాడు.

కొంచెంగా కంపిస్తున్న కంఠంతో ప్రారంభించాడు. "మీ ధోరణి ఏమీ బాగా లేదండి... పరమ వెకిలిగా వుంది. మీ హోదాకు తగినట్టు లేదు. నేను మీకంటే వయసులోనూ అనుభవంలోనూ పెద్దవాణ్ణి, మీరు అలా మాట్లాడ కూడదు. అలా మాట్లాడకూడదని తెలుసుకునేపాటి సంస్కారం మీ చదువైనా మీకు యివ్వలేదూ, అయామ్ సారీ...రియల్లీ సారీ...ఈ వయసులో మీలాటి మనిషిని కలుసుకోవడం, మీకింద పని చేయడం నా దౌర్భాగ్యమనుకుంటాను. వ్యంగ్యం హాస్యం ఇవేననీ, ఇలాగే ఉంటాయనీ మీరనుకుంటే అది తప్పు. ఎక్కడో ఎప్పుడో మీ జోక్ మిమ్మల్ని దెబ్బతీస్తుంది. మీ సెన్సాఫ్ హ్యూమర్ ఎప్పుడో మిమ్మలి దెబ్బ తీస్తుంది."

ఈ మాటలని వెనుదిరిగి వెళుతూ ఆగి అతనివంక చూస్తూ మళ్ళీ "అన్నట్టు మీకు తెలియదేమో. పరుగెత్తమని నాకు సలహా యిచ్చారు. ఐవజ్ ఎ ఫేమస్ రన్నర్ వన్స్. మీకు తెలియకపోతే నన్ను గురించి మరెవరినైనా స్పోర్ట్స్ తెలిసిన వారిని వాకబు చేయండి... చెబుతారు... వస్తాను" అని డ్రస్సింగ్ డోరు మూసి యివతలికి వచ్చాడు.

* * *

ఆ సాయంకాలం ఆఫీసునుంచి బయటపడి రామచంద్రమూర్తి నుదురు చేత్తో రుద్దుకున్నాడు.

వాతావరణం చల్లబడింది. చల్లనిగాలి వీస్తున్నది. అతడు బస్సు కోసం ఆగలేదు. వేగంగా నడవడం ప్రారంభించాడు.

ఈ ప్రాంతంలో పెద్ద ఆవరణ వుంది. ప్రభుత్వ స్థలం. అక్కడ రోజూ కొందరు యువకులు రన్నింగ్ ప్రాక్టీస్ చేస్తూ ఉంటారు.

అక్కడే నిలబడిపోయాడు కొద్ది నిముషాలు...

తర్వాత మళ్ళీ నడక ప్రారంభించాడు. అతడిప్పుడు బొత్తిగా జన సంచారంలేని వీధుల వెంట నడుస్తున్నాడు. అతనికి పరుగెత్తాలని సరదా పుట్టింది. ప్యాంట్ కొంచెం పైకి మడిచాడు. కోటు చేతులు పైకి మడిచాడు.

"రన్...రన్..." అనుకున్నాడు. వేగంగా పరుగెత్తాడు.

అలా తమ వీధికి చేరుకునేవరకూ పరుగెత్తుతూనే వున్నాడు. మధ్యలో సెంటర్లలోనూ జనం ఎదురైతేనూ తప్ప ఆగలేదు.

ఆయాసంతో వగర్చుతూ యింటికి వచ్చిపడ్డాడు. మంచంమీద కూలబడి పోయాడు. సీతమ్మ ఆదుర్దాగా "ఏమిటండీ... అంతగా ఆయాసపడి పోతున్నారేమిటి?" అంటూ వచ్చింది.

ఆయాసంలోనే "ఏమీ లేదు ... మంచినీళ్ళు... వద్దు... కాఫీ" అన్నాడు. ఆమె లోపలికి వెళ్ళింది. అతడు కాళ్లుచాపి మంచంలో వెల్లకిలా పడుకున్నాడు.

అయిదు నిమిషాల తర్వాత ఆమె వచ్చి చూసి అదిరిపడింది. భర్త వాలకం ఆమెకు అర్థం కాలేదు. భయంతో పరుగెత్తుకు వెళ్ళి

దగ్గర్లోనే ఉన్న డాక్టరును పిలుచుకొచ్చింది. ఆయన పరీక్షచేసి "కంగారేమీ లేదు.... చిన్న పెరాల్‌సిస్ స్ట్రోక్... అదే పక్షవాతం... కుడికాలూ చెయ్యీ పడిపోయాయి... విశ్రాంతిగా పడుకోనివ్వండి... నేను మళ్లీ వచ్చి చూస్తాను. ప్రాణభయం ఏమీలేదు. తొందరలో కాలూ చెయ్యీ మామూలుగానే వస్తాయి" అని చెప్పి వెళ్ళిపోయాడు.

రామచంద్రమూర్తి కళ్ళలో నీళ్లు ఉబికివచ్చి బుగ్గల మీదుగా కిందికి జారుతున్నాయి. అతని కళ్ళలో ఒకటే దృశ్యం... ఆనాటి దృశ్యం... ఎత్తయిన ట్రోఫీ... గుండెల్లో ధ్వనులు....

"రన్... రన్ రామూ... రన్"

"ది ఫాస్టెస్ట్ రన్నర్ ఆఫ్ ది స్టేట్"

"రన్.... రన్.... రన్.... మెడియర్ బాయ్.... రన్...."

# దగ్ధగీతం

'అనవసరంగా చాలా కాలం బ్రతికాను నేను' అనుకున్నాడు సేతురామన్.

ఆ చిన్నవరండాలో స్తంభానికి ఆనుకుని కూర్చుని ఉన్నాడు. తల అక్కడక్కడ నెరిసింది. కళ్లు లోతుకుపోయి, ముఖం ముడతలుపడి అకాల వార్ధక్యం పైబడినవాడిలా ఉన్నాడు. నిన్నరాత్రి ఆ సన్నటి వరండాలో చాపమీద నిద్రపోదామని విశ్వప్రయత్నం చేశాడు. కానీ ఫలించలేదు. పైగా కన్ను మూస్తే అన్నీ పీడకలలూ, వికృతమైన దృశ్యాలూ.... నిన్ననేకాదు. నాలుగు రోజులనుంచీ అంతే.

ఎవరో వస్తున్న అలికిడి వినిపించింది. తలతిప్పిచూస్తే డాక్టరు.... సేతురామన్ లేచి నిలబడ్డాడు. డాక్టరు యువకుడు. సేతురామన్ వంక పలకరింపుగా చూసి నవ్వాడు. సేతురామన్ కళ్ళలో అకస్మాత్తుగా నీటి పొర కమ్మింది. స్తంభానికి ఆనుకుని అలాగే నిలబడ్డాడు. డాక్టరు గుమ్మంలోనే నిలబడి కొద్దిక్షణాలు చూశాడు. లోపలికి పోలేదు. లోపలికి పోనవసరంలేదని సేతురామన్‌కి తెలుసు. డాక్టరు చివాలున వెనుదిరిగి సేతురామన్ ప్రక్కగానే నడిచి అవతలివైపుకి వెళ్ళిపోయాడు. డాక్టరు బూట్లశబ్దం అతని నోటివెంట వెలువడిన మాటలను పూర్తిగా అణచలేక పోయింది. సేతురామన్‌కు, ఆ మాటలు స్పష్టంగానే వినబడ్డాయి. 'పూర్‌సోల్, షి ఈజ్ వెయిటింగ్ ఫర్ డెత్....' సేతురామన్ మళ్ళీ స్తంభానికి ఆనుకుని కూలబడ్డాడు. వెనక రెండు గదులు.... మరీ పెద్ద వేమీ కాదు. ఎడమవైపు గది ఖాళీ... కుడివైపు గదిలో... సేతురామన్ కళ్ళు తుడుచుకున్నాడు.

కుడివైపు గదిలో అతని సంగీత సామ్రాజ్యం శిథిలమై, దగ్ధమై

బూడిదయిపోతున్నది. ఇవాల్టికి సరిగా నాలుగురోజుల నుంచీ నాలుగు పగళ్ళూ, నాలుగు రాత్రులు.

ముందు పెద్ద ఆస్పత్రి భవనం...అందులో మామూలు మనుషులకు మామూలు సౌకర్యాలున్న గదులు...ప్రత్యేక వ్యక్తులకు ప్రత్యేక సౌకర్యాలున్న గదులున్నాయి. అక్కడ ఎక్కడా ఖాళీలేదు. వెనక ఈ రెండు గదుల కట్టడం ఎందుకు ఉందో తెలీదు ... ఇక్కడే ఖాళీ దొరికింది. సేతురామన్ చేతివ్రేళ్ళు విరుచుకున్నాడు. పొద్దున ఆసుపత్రి బయట తాగిన టీ తాలూకు ఆ రుచి నాలుకను ఇంకా అంటిపెట్టుకొనే ఉంది. నీరసంగా ఉంది... మనసంతా వికారంగా ఉంది.

అకస్మాత్తుగా ఆస్పత్రి వెనక రైలు ఒకటి కూత వేసుకుంటూ రణగొణ ధ్వని చేస్తూ వెళ్ళింది. అది చాలా దూరం పోయిన తరువాత కూడా ఆ వికృత శబ్దం అతని చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే ఉంది.

ఎప్పటెప్పటివో దృశ్యాలు...

ఎండాకాలం ... మధ్యాహ్నం ... విశాలమైన పెరటిలో పెద్ద సీమ చింతచెట్టు...(లేక బాదం చెట్టా ?)...కింద వెలుగును ముక్కలు ముక్కలుగా కత్తిరించి పోసినట్టున్న ఎండ ... చెట్టు మొదట్లో కూర్చున్న పంకజవల్లి ... సన్న సన్నగా కబుర్లు చిరుతిళ్లు ... చిరుచిరు తగవులు ... చిరునగవులు.

సేతురామన్ ఉలిక్కిపడి చూశాడు. ప్రహరీ గోడమీద రంగు రంగుల పక్షి ఏదో కూర్చుని పెద్ద గొంతుతో అరుస్తున్నది. ఒకప్పుడెప్పుడో...ఎండాకాలం. మధ్యాహ్నం వేళ...చెట్టు కొమ్మల్లో ఎక్కడో కోయిల కూస్తుంటే తామిద్దరూ రెట్టించేవారు ... తాము రెట్టించే కొద్దీ కోయిల మరీ రెచ్చిపోయి కూస్తూ ఉండేది. చివరకు తామో, కోయిలో, ఎవరో ఒకరు అలసిపోయి మానేసే వరకూ కొనసాగేది ఆ సంబరం... కోయిలను చూద్దామని ఎన్నోసార్లు ఎంతో ప్రయత్నం చేశారు. కానీ అదెప్పుడూ వారికి కనబడలేదు. అవును...కోయిల అలిసిపోయింది... నలిగిపోయింది...కుంగిపోయింది ... ఆ చిన్ని మేనులో పిసమెత్తు కూడా శక్తి మిగలేదు.

సేతురామన్ లేచాడు. నెమ్మదిగా అడుగులు వేస్తూ గుమ్మంలోకి వెళ్ళి నిలబడ్డాడు. కిటికీ పక్కన ఇనుప మంచం... కిటికీలో నుంచి ఉమ్మెత్త చెట్టు ఒకటి మాత్రం గోడ ప్రక్కన కనిపిస్తున్నది. గది గోడలు తెల్లగా ఉన్నాయి. మంచం పక్కన పాత చెక్క బీరువా. సేతురామన్ గుండెలు చేత్తో రుద్దుకున్నాడు...అంతలో దగ్గు వచ్చింది. ప్రయత్న పూర్వకంగా దగ్గు ఆపుకుంటూ మళ్ళీ కళ్లెత్తి చూశాడు.

తెల్లని దుప్పటిలో శుష్కించిన శరీరం పైన ముంజేతులు, తల మాత్రం కనిపిస్తున్నాయి. ఒక చేతికి ఒకే ఒక ఎర్ర రంగు గాజున్నది. గుండెలమీద ఉన్న రెండో చేతికి ఏమీ లేదు...పైన సన్నని కంఠం... నల్లని కంఠం...దేశం అంతటా సంగీత మాధుర్యాన్ని పంచిన కంఠం... బండరాళ్ళవంటి హృదయాలను జల జల కరిగించిన కంఠం. ఆ పైన చామనఛాయ ముఖం... సన్నని ముక్కు... తెల్లని పెద్ద పెద్ద కళ్లు... (అవి ఇప్పుడు మూతపడి ఉన్నాయి. మళ్ళీ తెరుచుకుంటాయో లేదో తెలీదు.) ముంగురులు సన్నని గాలి విసురుకు బలహీనంగా కదులు తున్నాయి... శుష్కించిన చెక్కిలిమీద ఒకవైపు సన్నగా చెమట...

సేతురామన్ ఇవతలికి వచ్చాడు. ఆస్పత్రి ప్రక్కగా యెవరో పెళ్ళికి తరలి వెడుతున్నారులా వుంది. సన్నాయి మృదువుగా గాలిలో తేలి తేలి వస్తున్నది.

అతనికి అంతలో బీడీ కాల్చాలనిపించింది. చొక్కా జేబులో ఒక్కటే బీడీ మిగిలి వుంది. కానీ అగ్గిపెట్టె లేదు. అందువల్ల ఆ కోరికను అణచుకున్నాడు. బీడీని అవతల పారేద్దామనుకున్నాడు. కానీ మళ్ళీ మనసు మార్చుకుని జేబులోనే వుంచుకున్నాడు. తన ఆస్తి గొప్పదేమీ కాదుగానీ అంతా వీటికే హరించుకుపోయింది. పెళ్లి చేసుకుని ఒక యింటి వాడివి కమ్మనీ, కుదురుగా వుండమనీ ఎంతగానో నచ్చజెప్పిన తల్లీ తండ్రీ పోయారు. ఇంకెవరూ మిగల్లేదు. ఆస్తి హారతి కర్పూరం లాగా కాకపోయినా నెమ్మది నెమ్మదిగా హరించుకుపోయింది...సన్నాయి వాద్యం పూర్తిగా దూరమైపోయింది. ఇప్పుడేమీ శబ్దం లేదు.

సేతురామన్‌కు పంకజవల్లి పెళ్ళి గుర్తుకు వచ్చింది. అప్పటికే ఆమె సంగీత సామ్రాజ్యాన్ని పరిపాలించే సూచనలు స్పష్టంగా ఉన్నాయి. ఆమె రవిని ప్రేమించింది. మూర్తీభవించిన పురుష సౌందర్యానికి అబ్బురపడి అతన్ని ఆరాధించింది. వారి పెళ్ళి అట్ట హాసంగానే జరిగింది. పలువురు ఆ వివాహాన్ని ఆదర్శ వివాహమని కొనియాడారు. ఎక్కువ మంది పెళ్ళి కుమారుణ్ణే మెచ్చుకున్నారు. ఎంత సంగీత సరస్వతి అయితే మాత్రం, అంత అందగాడు చేసుకోదగిన పిల్లకాదని కొందరు అనుకున్నారు. మరి కొందరు అతని కళాప్రియ త్వాన్ని కొనియాడారు. ఎందరెన్ని అన్నా, ఎందరెన్ని అనుకున్నా రవి చిరునవ్వుతోనే వున్నాడు తప్ప ఎవరికీ ఏమీ తెలియనీయలేదు. సేతు రామన్ మాత్రం అంత హడావిడిలోనూ ఒంటరిగా కూర్చుని తన ఆలోచనల్లో తానుండిపోయాడు. తాను చిన్నప్పటి నుంచీ ఎవరిని కోరు కున్నాడో, ఎవరిని ప్రేమించాడో ఆమె తనకు దక్కకుండా పోయి నందుకు అతడేమీ బాధపడలేదు. ఆమె ప్రేమించినవాణ్ణి చేసుకుంటు న్నందుకు ఆనందించాడు కూడా. ఇదంతాజరిగి దాదాపుపదేళ్ళు.రవి చాలా జాగ్రత్తపరుడు. తనకు ఏమేమి కావాలో వాటిని సాధించి సమకూర్చుకో గల తెలివితేటలు పుష్కలంగా వున్నవాడు. భార్య చేయవలసిన కచేరీలూ ...అక్కడ వసూలు చేయవలసిన మొత్తాలూ... చెక్కులు, అకౌంట్లు అన్నీ అతడే చూసుకునేవాడు. ఆ విషయాల్లో బహు జాగ్రత్తగా, ఖచ్చితంగా ఉండేవాడు. ఎప్పుడన్నా పంకజవల్లి "నాకు వొంట్లో బాగు లేదు జ్వరం... కచేరీకి వెళ్ళలేను. ఓపిక లేదు" అంటే "అమ్మమ్మా! ఎంత మాట? అలా అనకు. వాళ్ళ దగ్గర ముందే డబ్బు కూడా తీసు కున్నాను. వెళ్ళకపోతే వీల్లేదు. మామూలు జ్వరానికే కచేరీ ఎగ్గొట్టేస్తే ఎలా? తప్పు డియర్..." అనేవాడు. మరొకప్పుడెప్పుడన్నా "ఏమండీ. అతనెవరో అనాథ శరణాలయం సహాయం కోసం కచేరీ యివ్వమంటు న్నాడు. పాపం! వందమంది అనాథలైన పిల్లలు తిండీ తిప్పలూ లేక అల్లాడిపోతున్నారట" అంటే — అందంగా నవ్వి, "భలేదానివే. ఇలా పైసా ఇవ్వలేని వాళ్ళకోసం కచేరీ చేస్తే నీ ఆరోగ్యం ఏం కాను ? అలాటివన్నీ పెట్టుకోవద్దు. అనాథలకు ఎవరో డబ్బున్న వాళ్లు దానం

చెయ్యాలి గాని మనం ఎంతసి చేస్తాం? అలాటి విషయాలు నాకొదిలేయ్ డియర్!" అనేవాడు.

సేతురామన్ జేబులు వెతుక్కున్నాడు. బాగా నలిగిపోయిన రూపాయి నోట్లు రెండూ, కొంత చిల్లరా మిగిలి ఉంది. అంత ఆస్తికి ఈ నాటికి మిగిలిందిది. పెద్ద యిల్లూ... పల్లెటూర్లో మూడెకరాల మాగాణీ... పొగాకు పండే నాలుగెకరాల మెట్ట. ఇంతకు మిగిలింది ఇదే!

ఆమె పెళ్ళయినప్పటి నుంచీ, సేతురామన్ వారి యింటి ఎదురుగానే ఒక రెండు గదుల వాటా అద్దెకు తీసుకుని అందులో ఉండేవాడు... పై పనికి ఒక కుర్రవాణ్ని, ఒక వంట మనిషినీ కుదుర్చుకుని ఉండేవాడు. అలా ఏళ్లు గడిచాయి. పంకజవల్లినీ, రవినీ గమనిస్తూనే ఉండేవాడు. పంకజవల్లిని గురించి చాలా మాటలు విన్నాడు. ఎవరూ రవిని ఏమీ అనలేదు. ఆమెను గురించే అందరూ అన్నారు. ఆమె డబ్బు మనిషయిపోయిందనీ, డబ్బు లేకపోతే గొంతెత్తి పాడదనీ, స్వార్థపరురాలైపోయిందనీ, సంగీతాన్ని అమ్ముకుంటున్నదనీ .... ఇలా చాలా విన్నాడు. జనానికి ఆ డబ్బంతా.... ఏ ఖాతాలోకి వెడుతున్నదో, ఎవరి చేతుల్లోకి వెడుతున్నదో తెలిస్తేగా? చాలా తక్కువసార్లు ఆమె సేతురామన్‌తో మాట్లాడింది. మాట్లాడినప్పుడు చాలా తక్కువగా మాట్లాడింది ....రవిపట్ల ఉన్న ఆకర్షణ, రవి అంటే తన్మయత్వం ఆమెలో తగ్గడం సేతురామన్ గమనించాడు. ఆమె ఉదాసీనంగా అప్పుడప్పుడూ దీనంగా, ఒంటరిగా ఇంట్లో ఉండటం అతడు గమనించాడు. డబ్బు... వేలకువేలు డబ్బు చేసిపెట్టే ఆమె కంఠం రవికి కావాలి... అందవిహీనమైన ఆమె, ఆమె శరీరం ఆ శరీరంలోని మనసు ఇవేవీ అతనికి అక్కర్లేదు... అతనికి కావలసిన అందమైన శరీరం అతడు వేరే ఏర్పాటు చేసుకున్నాడు...క్రమ క్రమంగా కచేరీ ఏర్పాట్లు తారీఖులు, వగైరాలు తప్ప ఆమెతో అతనికేమీ సంబంధం లేకపోయింది. ఇల్లు మాత్రం గడుపుతూ ఉండేవాడు...ఇల్లంటే, ఉన్నది ఎంతమంది గనుక ? భార్య, ఆమెను కనిపెట్టుకుని ఉండే మరొక మనిషి. అంతే... కచేరీకి వెళ్ళవలసి వచ్చినప్పుడు కారులో వచ్చి తీసుకుపోయేవాడు. అది పూర్తికాగానే తీసుకొచ్చి

దించి వెళ్ళిపోయేవాడు. ఇటీవల ఒకసారి "గొంతు మంటగా ఉంది. నేను కచేరీ చెయ్యలేను అంటే" పెద్దగా మాట్లాడి కోపగించి భయపెట్టి తీసుకు వెళ్ళాడు. ఆమె తిరిగివచ్చి బాధతో మెలికలు తిరిగిపోతుంటే సేతురామన్ గబగబా వెళ్ళాడు. ఆమె దగ్గి దగ్గి చివరకు చారెడు రక్తం కక్కింది. అతనికి అప్పుడు గుండెలు దడదడ లాడాయి.

సేతురామన్ కాళ్లు బారజాపుకుని కూర్చున్నాడు. పదిగంటలవు తుందేమో ఈ చుట్టుపక్కల మంచి హోటలు ఏదీ లేదు. రాత్రి ఆస్పత్రి ముందు చిన్న హోటల్లో తిన్న రొట్టె యింకా కడుపులో అలాగే ఉన్నట్టుంది.

అయిదారు నెలల క్రిందట ఒకనాడు రవి కారులో వచ్చి భార్యను తీసుకుపోవడం చూశాడతడు తన వాటా వరండాలో నిలబడి ఉండి. తానలాగే నిలబడి ఉన్నాడు. అరగంటలో వాళ్లు తిరిగి వచ్చేశారు. తర్వాత రవి ఒంటరిగా బయలుదేరి వెళ్ళిపోయాడు. "ఏం జరిగిందో తెలుసుకుందాము"ని ఎంతగానో ఆశించినా ఆ సాయంకాలంవరకూ అతనికి వీలుపడలేదు. సాయంకాలం ఆరుగంటల వేళ పంకజవల్లితో వుండే నలభై ఏళ్ళ వనజమ్మ బైటికి వచ్చింది. సేతురామన్ ఆమెని పిలిచి కబుర్లలో పెట్టి నెమ్మదిగా విషయం తెలుసుకున్నాడు. వనజమ్మ గది బయట వుండి అంతా విన్నది. అందువల్ల ఆగలేక సేతురామన్‌కు చెప్పేసింది. సేతురామన్ అది విని ఎండుటాకులా నిలువునా గడ్డకట్టుకు పోయాడు... క్యాన్సర్. ఆ చిన్ని గొంతులో క్యాన్సర్... అతనికి ఏడుపొచ్చింది.

ఇక ఆ తర్వాత కథంతా చాలా త్వరగా జరిగిపోయింది. రవి పది రోజులు గడిచాక ఒకసారి మాత్రం వచ్చి ముక్తసరిగా ఒక అర గంట ఉండి వెళ్ళిపోయాడు. తర్వాత పది రోజులు పత్తాలేడు. మళ్ళీ వచ్చి వనజమ్మ చేతికి కొంచెం డబ్బిచ్చి వెళ్ళిపోయాడు. అదే చివరిసారి. అతడు వూళ్ళోనే మళ్ళా కనిపించలేదు.

సేతురామన్ అప్పుడప్పుడూ ఎదురింటికి ళ్ళి మాట్లాడి వచ్చే

వాడు. మామూలు మాటలు...మధ్య మధ్యలో చిన్నప్పటి కబుర్లు... ఆమె ఎక్కువసేపు నిశ్శబ్దంగా వుండేది. మాట్లాడేందుకు బాధపడేది... మాట్లాడబోతే దగ్గు తెరలు తెరలుగా వచ్చేది. దగ్గి దగ్గి నెత్తురు కక్కి నిశ్శబ్దంగా పడుకుండిపోయేది... ఒకటి రెండు మాటలు మాట్లాడినా స్వరం తెగిపోతూ వికృతంగా వినిపించేది — "నువ్వెందుకు... పెళ్ళి చేసుకోలేదు!" "ఏమీ ఉద్యోగం లేకుండా... ఎందుకిలా... వున్నావు?" ఇలాటి తెగిన ప్రశ్నలు.

అతడు ఒకనాడామెతో అన్నాడు. "వల్లీ! ఇలా చూడు...రవిని గురించి కనుక్కున్నాను. అతను ఇల్లు ఖాళీచేసి బెంగుళూరులో యెక్కడికో వెళ్ళిపోయాట్ట...బ్యాంకులో డబ్బంతా విత్‌డ్రా చేసుకుపోయాడు. అసలు నీకు తెలీదేమో, మీ పెళ్ళయిన ఆర్నెల్లకే అతనింకొక పెళ్ళిచేసుకున్నాడు. అది ఎటువంటి పెళ్ళో తెలీదుగాని మొత్తంమీద మరో అమ్మాయితో వున్నాడిన్నాళ్లూ... ఇప్పుడిక వెళ్ళిపోయాడు." ఆమె వింటూ నవ్వుతూ తల వూపింది. సేతురామన్ ఆశ్చర్యపోయి "అయితే యిన్నాళ్ళనుంచీ అంతా నీకు తెలుసా ?" అని అడిగాడు. ఆమె మళ్ళీ తల వూపింది. సేతురామన్ కాసేపు ఏమీ మాట్లాడలేదు. కొన్ని క్షణాల తరవాత లేచి "డాక్టరు దగ్గరికి తీసుకువెడతాను రా...నేనంతా కనుక్కున్నాను. ఇప్పుడేమీ మించుకుపోలేదు. ఇప్పుడైనా ఆపరేషన్ చెయ్యొచ్చు ...ఆపరేషన్ చేస్తే ప్రాణం దక్కుతుందన్నాడు డాక్టరు..."అన్నాడు.

ఆమె చివాలున తలయెత్తి "ప్రాణం దక్కుతుంది కానీ గొంతు పోతుంది...జీవితాంతం మూగగా...గొంతులేకుండా బతకాలి"..అన్నది.

"అవును...గొంతు లేకపోతేనేమి? నువ్వు బతుకుతావు... బతకాలి" అన్నాడతను.

ఆమె లేచి నిశ్చయంగా అన్నది. గొంతు వుండదు. కూనిరాగం తీయడానిక్కూడా వీల్లేదు... మాట్లాడేందుకు వీల్లేదు...కానీ, తినొచ్చు. ...తిరగొచ్చు. అంతేగా?" ఆమె కళ్ళలో చిత్రమైన వెలుగు...ఆ వెంటనే పెద్ద పెద్ద కళ్ళలో నీళ్ళు...

కొద్ది క్షణాలాగి "చిన్నప్పటినుంచీ స్నేహితుడివి. నీకు తెలియాలి. గొంతు పోయిన తరువాత నేను బ్రతకనక్కరలేదు. బ్రతకడం అనవసరం. గొంతు ఉండగా త్వరగా పోతేనే మంచిది..." ఈ మాటలని ఆమె లోపలికి వెళ్ళిపోయింది— ఇక చెప్పేదేమీ లేదన్నట్టు.

సేతురామన్ లేచాడు. అతని ఎదురుగా పెద్ద డాక్టరు వచ్చాడు. ఆయనకు నలభై అయిదేళ్ళుంటాయి. అంత ప్రసిద్ధ గాయని పంకజవల్లి ఆస్పత్రిలో ఉన్నట్టు ఎవరికీ తెలియదు. ఆయన అనుకోకుండా రిజిష్టర్లో చూసి మూడు రోజుల క్రిందటే వచ్చాడు. ఫలానా అని తెలుసుకొని ఆశ్చర్యంతో ఉక్కిరి బిక్కిరై అన్ని వివరాలు సేకరించి, ఇతర డాక్టర్లతో మాట్లాడి కేసు పూర్వాపరాలు విచారించాడు. తరువాత మళ్ళీ వచ్చి కోపంతో "అంతా అయిపోయిన తరువాత తీసుకొచ్చారా భార్యని ఇక్కడికి?" అని అడిగాడు. సేతురామన్ అంతా వివరంగా చెప్పగా విని నిట్టూర్చి వెళ్ళిపోయాడు...నిన్నా మొన్నా కూడా వచ్చాడు.

ఇప్పుడు రాగానే "మీరిక్కడే వున్నారా?" అని అడుగుతూ గుమ్మందాటి లోపలికెళ్ళాడు.

"మరెక్కడుంటాను?" అని గొణుక్కున్నాడు సేతురామన్. "కథ ముగిసేవరకూ ఇక్కడుండవలసినవాణ్నే .. తరువాత ఏమో" అనుకున్నాడు.

చేతి వ్రేళ్ళు విరుచుకుంటూ "ఆమె ఒక్కసారి తెలివి వచ్చి కళ్ళు తెరిస్తే... తాను ఒక్కమాట చెప్పగలిగితే... తన గుండె చప్పుడు వినిపించగలిగితే...ఎంత బాగుండును..." అనుకున్నాడు. "వల్లీ! మై హార్ట్ !! నేను మొదటినుంచీ నిన్ను ప్రేమిస్తున్నాను. నిన్నే ప్రేమిస్తున్నాను."

అంతలో అకస్మాత్తుగా వెచ్చని గాలి కెరటం ఒకటి వింతగా... వెర్రిగా వీచింది. చెట్ల ఆకులు జలజల రాలాయి.

మరుక్షణంలో డాక్టరు బయటికి వచ్చి చప్పట్లు చరుస్తూ పెద్దగా "ఎవర్రా అక్కడ? రంగయ్యగార్ని రమ్మను... అర్జెంట్..." అని అరిచాడు.

సేతురామన్ కాళ్ళు వణికాయి. వొణుకుతున్న వ్రేళ్ళతో జేబు తడివి బీడీ బయటకు తీశాడు. డాక్టరు అంతలో అతనివంకచూసి తల అడ్డంగా ఊపాడు.

సేతురామన్ వొణికే కాళ్ళతో నాలుగు అంగల్లో లోపలికి వెళ్లాడు. గాలి విసురుకు పంకజవల్లి ముఖం మీది దుప్పటి కొద్దిగా తొలగింది. వొణుకుతున్న వ్రేళ్ళతో శుష్కించిన ఆ చెక్కిళ్లు నిమిరాడు. 'ఇదే నిన్ను నేను తాకడం' అనుకున్నాడు. కళ్ళవెంట నీళ్ళు ధారాపాతంగా వచ్చేవే కానీ అంతలో దుప్పటి కప్పి, దుఃఖం మింగుకుని యివతలికి వచ్చాడు.

డాక్టరు నిన్న, యెవరో తెలిసిన పత్రికా విలేఖరికి ఈ విషయం మాటల సందర్భంలో చెప్పాడు. అతడిప్పుడు వచ్చాడు. డాక్టరు అతన్ని చూసి "నేన్నిన్న చెప్పలేదూ? ఆమె... ఇప్పుడే పోయింది" అన్నాడు.

'అరె' అన్నాడు పత్రికా విలేఖరి ఆశ్చర్యంతో.

పది పదిహేను నిమషాలు గడిచాయి.

సేతురామన్ అలాగే స్తంభానికి ఆనుకొని నిలబడి చూస్తున్నాడు. లోపలి నుంచి శవాన్ని తీసుకురావడం, స్ట్రెచర్ మీద పడుకోబెట్టడం... అయిదారుగురు చేరారు. సన్న సన్నగా గొంతులు వినిపిస్తున్నాయి... ప్రశ్నలు వినిపిస్తున్నాయి.

"ఎవరు? ఎవరుట పోయింది?"
"మొగుడేం చేస్తుంటాడు?"
"పిల్లల్లేరా? ఏం జబ్బు?"
"పాటలు పాడుతుందా?"
"ఏవైనా సినిమాల్లో పాడిందా?"

స్ట్రెచర్ తోసుకుంటూ వెళ్ళిపోయాడొక వ్యక్తి. డాక్టరు అలాగే వరండాలో నిలబడి ఉన్నాడు.

సేతురామన్ కళ్ళు అప్పుడు నీళ్ళతో నిండాయి. చొక్కా చివరతో కళ్లు తుడుచుకుని, వొణికే వ్రేళ్ళతో బీడీ నోట్లో పెట్టుకొని, గబగబా

నడిచి ఆస్పత్రి గేటుదాటి, వీధిలోకి వచ్చి అటూ ఇటూ చూశాడు... బడ్డీకొట్టు ప్రక్కనే వేలాడుతున్న తాడుతో బీడీ ముట్టించుకున్నాడు. ఒక్కసారి గుండెల నిండుగా పొగపీల్చి వదిలాడు. అంతలో బీడీ విసిరి కొట్టి స్టేషన్‌పక్క పేవ్‌మెంట్ మీద కొంతమేర చేత్తో తుడిచి అక్కడే ముడుచుకుపడుకున్నాడు. నీళ్లూరుతున్న కళ్ళను మూసుకున్నాడు. అంత లోనే అతనికి నిద్రపటింది.

నిద్రలో... గుంపులు గుంపులుగా పచ్చపచ్చగా కళకళ్లాడుతున్న గంథపుచెట్లు తగలబడిపోతున్నట్టు కల...

# శుక్రవారం

గుమ్మందాటి సైకిలు స్టాండువేసి, మాసిన పైపంచతో ముఖం తుడుచుకుంటూ లోపలికి వచ్చాడు రామేశం.

ముందు గదిలో నిలబడి ఉన్న భార్యను చూసి "స్కూలు బస్సు వచ్చిందా?" అని అడిగాడు.

సీతమ్మ "ఆఁ! పావుగంట సేపు నిలబడ్డాను. వెంకటేని బస్సెక్కించే వచ్చాను. అది సరే! మీరెక్కడికి వెంచేశారు, తలుపులు బార్లా తీసిపెట్టి?" అని అడిగింది కటువుగానే.

రామేశం నవ్వి "పోదూ, మరీనూ! తలుపులు బార్లా తీసిపెట్టి పోయానా? దగ్గరికి లాగి గొళ్ళెంపెట్టి మరీ వెళ్ళాను కదా?" అంటూ పంచెను లుంగీగా మార్చి కట్టుకుని చాపమీద కూలబడ్డాడు.

"అయితే మాత్రం? రోజులెలా ఉన్నాయి? మనకు తెలియకుండా మన తలకాయనే తీసుకుపోయి పక్కవీధిలో అమ్మేయగలిగిన మాయావులున్నారు. ఇంకానయం... నేను వెంటనే రాబట్టి సరిపోయింది. ఎవడైనా కొంపలో దూరి ఉన్న గిన్నే, బొచ్చే చంకన పెట్టుకు పోతే ఏం చెయ్యగలం? ఒక్క స్పూన్ కొనాలంటేనే గుడ్లు వెళ్ళుకొస్తున్నాయి..."

సీతమ్మ సణుగుడు ఇంకా కొనసాగేదే. అయితే, రామేశం అనునయంగా సమాధానం చెప్పాడు. "నువ్వలా వెళ్ళిన కాస్సేపటికి చూద్దును కదా! సైకిలు ముందుచక్రంలో గాలి బొత్తిగాలేదు. తీసుకువెళ్ళి సుభానీకి చూపిస్తే పంచరయిందని, బాగుచేసి రెండు రూపాయలు వసూలు చేశాడు. సైకిల్ మూలపడితే ఇవాళ బొత్తిగా గడవదు కదా! అందుకని వెళ్ళాను!"

సీతమ్మ "అన్నట్టు ఈ పూట ఏమిటి కార్యక్రమం? అదే! వంట సంగతి..." అన్నది జుట్టు చిక్కు తీసుకుంటూ తానుకూడా గుమ్మంలో కూర్చుని.

ఉదయం తొమ్మిదిన్నర గంటల వేళ...సూర్యుడు ఉండి ఉండి మబ్బుల్లోకి వెళ్ళిపోతున్నాడు. ఆకాశంలో గచ్చకాయ రంగులో ఉన్న మేఘాలు నెమ్మది నెమ్మదిగా గుమిగూడుతున్నాయి. ఉక్క పోస్తున్నది. బహుశా వర్షం వస్తుందేమో ! అలా అయితే ప్రాణాంతకమే... చాలా తిరుగుడు ఉంది ఈ పూట. ఎక్కడో వన్‌టౌన్‌లో మారుమూల ఏడ్చింది ఆ కొంప. పైగా శుక్రవారం సాయంకాలం బోలెడు పూజలున్నాయి ... వర్షం పగలల్లా ఆగి రాత్రి మనం ఇంటికి చేరుకున్న తరువాత కురిస్తే బాగు అనుకున్నాడు రామేశం.

సీతమ్మ మళ్ళీ పెద్దగా "మిమ్మల్ని ఇవాళ వంట సంగతి ఏమిటని అడుగుతున్నాను. చెవినపడలేదూ?" అన్నది.

"ఆఁ! ఆఁ! విన్నాను. ఇవాళ రామ్మూర్తిగారితో పోవాలి ఎక్కడో వన్‌టౌన్‌లో ఎవరో చచ్చినవాళ్ళది అబ్దికం... నిన్న సోడాబుడ్డి కళ్ళద్దాల వాడొకడు వచ్చి గీకి గీకి బేరమాడి కుదుర్చుకు పోయాడు. రామ్మూర్తిగారికి ఈ మధ్య కక్కుర్తి ఎక్కువైపోతున్నది. మంత్రం చెప్పినందుకు తనకు ఇరవై రూపాయలు, భోక్తకు పదిహేను అడగాలి. అవతలి వాడు నసపెట్టి బేరమాడితే తనకు పదిహేను, నాకు పదికీ ఒప్పేసుకున్నాడు. నేనేమీ మాట్లాడలేక ఊరుకుండి పోయాను."

"సరే అయితే...నే నొక్కదాన్నే అన్నమాట. చిన్నవాడికి క్యారియర్ కోసం ఉడకేసిన అన్నం ఉంది. ఏ పచ్చడో వేసుకుని గడి పేస్తాను." అన్నది సీతమ్మ జడ అల్లుకుంటూ.

"చిన్న వెధవకు చదువు బాగా వంటబడుతున్నదా ? లేకపోతే నా పోలికా ?" అన్నాడు రామేశం నవ్వుతూ.

సీతమ్మ కొంచెం కోపంగా "మీ పోలికేమీ కాదు. తాతల పోలిక కూడా కాదు. మేనమామ పోలిక ... మా అన్నయ్య ఎట్లా చదువు

కున్నాడు? మా నాన్న వాణ్ణి ఎస్సెల్సీతోనే ఆపేసి పౌరోహిత్యంలోకి దింపేసేవాడు... కాని, వాడు పట్టుదలగా చదివి ఎమ్.ఎ. పాసయ్యాడు. పెద్ద ఆఫీసరయినాడు." అన్నది.

రామేశం ఎగతాళిగా "అవును ... పెద్ద ఆఫీసరై తండ్రినీ, చెల్లెల్ని ఉద్ధరించాడు, చూస్తున్నాంగా!" అన్నాడు.

తమ పెళ్ళయిన తరువాత సంవత్సరానికే సీతమ్మ తండ్రి పోయాడు. తమ పెళ్ళికీ, తండ్రి కర్మాంతరాలకు రావడమే తప్ప మళ్ళీ అతగాడు ఈ దిక్కుకే రాలేదు. ఎక్కడో భిలాయ్‌లో పెద్ద ఉద్యోగంలో ఉండిపోయాడు. అప్పుడప్పుడు ఉత్తరాలు మాత్రం రాస్తూ ఉంటాడు చెల్లెలిమీద ప్రేమ కురిపిస్తూ. అదీ రామేశం కడుపుమంట.

సీతమ్మ నిట్టూర్చి "ఈ రోజుల్లో అంతే... ప్రేమలూ, అనుబంధాలూ ఏవీ లేవు. పైగా దూరాభారం ... వాణ్ణి అనుకుని మాత్రం ఏంలాభం?" అని ఊరుకున్నది.

చిన్న ఖాళీ స్థలంలో ఒకవైపు కనకాంబరం మొక్క...ఎదురుగా గోడ. గోడమీదనుంచి అవతలివైపు రాతి ఉసిరి కొమ్మలు ఇటువారి ఉండి, గాలికి కదులుతున్నాయి. దంపతులు కూర్చుని ఉన్న ముందు గది చిన్నది. వెనక చిన్న వంట ఇల్లు. ఇల్లుగలవారి బాధలేదు. వాళ్ళెక్కడో రాజధానీ నగరంలో ఉంటారు. నెలకోసారి క్రమం తప్పకుండా అద్దె — అదీ తక్కువే. కేవలం వందరూపాయలు — పంపితేచాలు.

రామేశం లేస్తూ ఉంటే సీతమ్మ అతడు బయలుదేరుతున్నాడనుకుని తానూ కదిలింది. అతనిప్పుడు వెడితే మళ్ళీ రావడం మధ్యాహ్నం రెండు గంటల తరవాతనే. తాను ఈ లోపల దగ్గరలో ఉన్న సినిమా హాలుకువెళ్ళి పదకొండు గంటల ఆట — మహిళా ప్రపంచాన్ని ఉర్రూతలూగిస్తూ, కలెక్షన్లలో ఆల్ టైమ్ రికార్డులు సృష్టిస్తున్న సంచలన పంచరంగుల సినిమా—చూసి రావచ్చు. దానికోసం ఇటీవల రకరకాల చిన్న చిన్న ఖర్చులలో జాగ్రత్తపడి ఏడు రూపాయలు దాచిందికూడా.

"స్నానం చేస్తాను" అన్నాడు రామేశం.

సీతమ్మ మెల్లిగా "నీరు పెట్టలేదు. కుంపటి ఆరిపోయి ఉంటుంది. చన్నీళ్ళు పోసుకోండి" అన్నది.

రామేశం నవ్వి "తప్పుతుందా?" అంటూ పెరటిలోకి వెళ్ళాడు. అక్కడ రాళ్ళగుంట ఉంది. బొక్కెనలో నీళ్ళు తళతళలాడుతున్నాయి. తలఎత్తి చూస్తే... ఆకాశంలో చిక్కగా గుమికూడుతున్న మబ్బులు కనిపించాయి.

'మొదటి చెంబుతోనే చలి...తరువాత చలీలేదు గిలీలేదు' అనుకుని చెంబుతో నీళ్ళు ముంచి 'జై పరమేశ్వరా' అనుకుని నెత్తిమీద బోర్లించుకున్నాడు.

స్నానం త్వరత్వరగా పూర్తిచేసి ముందు గదిలోకి వచ్చి ఉతికిన పంచె కట్టుకుని తయారై "ఇదిగో నిసా ...నేను వెళ్తున్నాను. తలుపు వేసుకో" అన్నాడు సైకిలు తీస్తూ.

సీతమ్మ భర్త వంకనే చూస్తూ తల ఊపింది. అతడు వెళ్ళిపోగానే వీధితలుపువేసి ముందు గదిలోకివచ్చి ఒళ్ళు విరుచుకుని 'చిరాగ్గా ఉంది. స్నానం చెయ్యాలి' అనుకున్నది.

తరువాత పెరట్లో స్నానం చేస్తూ తాను చూడబోయే సినిమాను గురించే ఆలోచించింది. సినిమాల్లో నాయికా నాయకులు సాధారణంగా మొదటి చూపులోనే ప్రేమించుకుంటారు. కొన్నింటిలో అయితే ముందు ఒకరికి మరొకరిమీద అసహ్యం...పగ.... ఆ తరువాత అది గాఢమైన ప్రేమగా మారుతుంది. వెంటనే ఎక్కడెక్కడో కొండల్లో, లోయల్లో కిందామీదాపడి దొర్లుకుంటూ ఎగురుకుంటూ యుగళగీతాలు పాడుకుంటారు. మాటకో డ్రస్సు మారుస్తారు. వాళ్ళ ఇళ్ళన్నీ రాజమందిరాల్లాగుంటాయి. పెద్ద పెద్ద హాళ్ళూ... పెద్ద పెద్ద సోఫాసెట్లూ... ఖరీదైన తివాచీలూ...పొడవాటి తళతళలాడే డైనింగ్ టేబుల్సూ... వాటిమీద ఎప్పుడూ ఎవరూ తినని యాపిల్ పళ్ళతో నిండిన గాజు పాత్రలూ... గిర గిర తిరిగే బెడ్‌రూమ్స్ – అంతా కన్నుల పండుగగా ఉంటుంది.

'అలా ఎవరైనా ఉంటారా ఈ ప్రపంచంలో?' అనుకున్నదిసీతమ్మ.

'ఏమో! ఎవరు చూడొచ్చారు? కొందరంత అట్టహాసంగా, ఆడంబరంగా ఉంటారేమో!' అనుకుంది మళ్ళీ.

తాను పల్లెటూరి పురోహితుడి ఇంట్లో పుట్టింది. పెద్దగా చదువు సంధ్యల్లేవు. ఎప్పుడూ ఇంటినిండా బియ్యమూ... కొబ్బరి చిప్పలూ ఖర్జూరపుకాయలూ...అరటి పళ్ళూ ఇదీ వాతావరణం. తండ్రి బయట ఏమీ పనిలేనప్పుడు అరుగుమీద కూర్చుని జంధ్యాలు వడుకుతూ ఉండే వాడు. ఎవరో పిల్లలు ఒకరూ అరా కూర్చుని ఏవో వల్లెవేస్తూ ఉండేవారు. పాత కాలపు పొలం కొంచెం ఉండేదికాని, ఎవడో కౌలుకు చేస్తూ సంవత్సరాని కొకసారి తిప్పుకుని తిప్పుకుని ఎంగిలి మెతుకులు విదిలించినట్టు కాసిని రూపాయలు విదిలించేవాడు.

ఇదుగో. ఆ తరువాత ఈ సంబంధం...రామ్మూర్తిగారు వచ్చి, చెవినిల్లు కట్టుకుని నసపెట్టాడు. "పిల్లవాడు లక్షణంగా అందంగా ఉంటాడు...ఒక్కగా నొక్కడు. తల్లీ, తండ్రీ, తోబుట్టువులూ ఏ పేచీ లేదు. మంచి మనసున్నవాడు. నెమ్మదస్తుడు. అన్నింటికీ మించి కానీ కట్నం ఇవ్వనక్కరలేదు. పెళ్ళి చేస్తే చాలు...వచ్చేవారూ, పోయేవారూ ఎవరూలేరు. చాలదూ? ఇంతకన్నా మంచి సంబంధం తేగలమా?" అంటూ పోరాడి సాధించాడు. సీతమ్మ తండ్రి తనకున్నంతలో ఆ పల్లెటూళ్ళో అట్టహాసంగానే వివాహం జరిపించాడు.

సీతమ్మ మొగుణ్ణి చూసి ఎంతో సంబరపడిపోయింది అందరూ 'పెళ్ళి కూతురు అదృష్టవంతురాలు' అన్నారు. 'నిజానికి నేనే ఆయనకు తగను' అనుకున్నది సీతమ్మ. పట్నంలో కాపురం పెట్టిన మొదట్లో, అతనికి క్రాపు లేదనీ, ప్యాంటూ, చొక్కాలు వేసుకోకుండా పౌరోహిత్యం చేస్తుంటాడనీ కించిత్తు బాధపడిన మాట వాస్తవమే కాని, తరువాత తరువాత, 'ఇలాటి భర్త ఎంత మందికి లభిస్తాడు? మనిషి బంగారం కదూ! మనసు వెన్నకదూ!' అనుకున్నది ఆమె.

స్నానం ముగించుకుని ముందు గదిలోకి వచ్చి గూట్లో ఉన్న అద్దం ముందు నిలబడి తలకట్టు సరిచేసుకుంటూ 'అయినా రోజులు

గడ్డుగా ఉన్నాయి. ఆయన ఎంత కష్టపడినా గడవడం కష్టంగానే ఉంది. ఎంతో జాగ్రత్తగా ఉండవలసి వస్తున్నది. అనేక ఖర్చులు మానుకోవలసి వస్తున్నది' అనుకున్నది.

అయినా, ఆరేళ్ళ కుర్రకుంక విషయంలో మాత్రం ఏ లోపమూ జరగడానికి వీల్లేదు. వాణ్ణి ఇంగ్లీషు మీడియంలో మంచి ప్రైవేటు స్కూల్లో చేర్పించాడు. వాడు 'మమ్మీ, డాడీ' అంటుంటే, ఇంగ్లీషు పద్యాలు చదువుతూ ఉంటే ఎంత ముచ్చటగా ఉంటుంది! మొదట్లో, రామేశం 'వెధవా! నన్ను 'నాన్నా' అని పిలు. ఏమిటో తిట్టినట్టు 'డాడీ' ఏమిటి నీ బొంద?' అనేవాడు. కాని, తరువాత తరువాత అతడు కూడా కొడుకుని చూసి ముచ్చటపడటం ప్రారంభించాడు.

వాడి స్కూలు ఫీజు నెలకు అరవై రూపాయలు. బస్సుకు ఇరవై రూపాయలు. ఏడాది మొదట్లో వంచలు జీతమూ... పైగా స్కూలు డ్రస్సు... టైలు... బూట్లు... వగైరాలు... ఇవి ఏ పరిస్థితిలోనూ ఏమరడానికి వీల్లేని ఖర్చులు... చచ్చినట్టు కట్టి తీరవలసిందే...

సీతమ్మ చెక్క బీరువాలో నుంచి శుభ్రమైన చీర ఒకటి ఇవతలికి తీసి కట్టుకోబోతూ హఠాత్తుగా ఆగిపోయింది. కొద్ది క్షణాలు అలాగే మౌనంగా నిలబడిపోయింది. అంతలో ఏమనుకున్నదో ఏమో! ఆ చీరను మళ్ళీ బీరువాలో విసిరేసి మరో మామూలు కట్టుడు చీరతీసుకొని కట్టుకుని, గోడ పక్కకు వెళ్ళి పక్కఇంటి కామాక్షమ్మగారిని పిలిచి 'ఒక్కసారి వార పత్రిక ఇస్తారూ? సీరియల్స్ చదివి ఇచ్చేస్తాను' అన్నది.

ఆ తరువాత పత్రిక అందుకుని వచ్చి చాపమీద కూలబడి 'అయిదారు రూపాయిల పిచ్చి ఖర్చు తప్పింది. లక్షణంగా సీరియల్స్ చదివితే సరిపోయె... కాలక్షేపం...' అనుకుంటూ దయ్యాల సీరియల్ చదవడం ప్రారంభించింది.

రామేశానికి విసుగ్గా ఉంది. చిరాగ్గా ఉంది. అసలే చిన్న పెంకు

?...పైగా బయట వర్షం... పక్క ఖాళీ స్థలమంతా బురదగా ఉంది. పైన పెంకులు సరిగా లేవేమో, లోపల అక్కడక్కడ చినుకులు పడుతున్నాయి.

ఆ ఇంటి యజమాని లావుపాటి కళ్ళజోడు పెట్టుకొని నిశ్శబ్దంగా చెప్పిన పనులు చెప్పినట్టు చేస్తున్నాడు. ఒకముసలావిడ తడిగుడ్డతో వంట ఇంట్లో కట్టెల పొయ్యితో సతమతమవుతున్నది. ఒక మోస్తరు అందమైన యువతి – ఆ గృహ యజమాని రెండో భార్య – అటూ ఇటూ తిరుగుతూ, అవీ ఇవీ అందిస్తున్నది.

ముసలావిడ మధ్య మధ్య విసుక్కుంటూ "మహాతల్లి ఎక్కడి ఋణమో... తీర్చుకుపోయింది... మేం చస్తున్నాం... ప్రతిఏటా ఉన్నవి గాక ఇదొక తద్దినం... తప్పదు..." అని పెద్దగానే సణుగుతున్నది.

కార్యక్రమం మూడు వంతులు పూర్తి అయి భోజనాలకు కూర్చునే సరికి రెండు గంటలు కావస్తున్నది. రామ్మూర్తిగారు మహా చాదస్తం మనిషి. 'అవతలి వ్యక్తులనుబట్టి మన పద్ధతులు మార్చుకుంటూ ఉండాలి' అని చెబితే వినడు. శ్రద్ధగా, సాంగోపాంగంగా, అన్నీ సవ్యంగా జరిపిస్తే తప్ప తృప్తి ఉండదాయనకు. 'అలా చేయడం వంచన... దైవద్రోహం' అంటూ ఉంటాడు కూడా.

కిలో రెండు రూపాయల బాపతు బియ్యం కాబోలు అన్నం అధ్వానంగా ఉంది. మూడు కూరలున్నాయని పేరేగాని అందులో ఒకటి కాకరకాయ. తనకు అదంటేనే అసహ్యం. మిగిలిన రెండు కూరలూ రుచీపచీ లేకుండా నీళ్ళుకారుతున్నాయి. "నెమ్మదిగా కూర్చోండి... ఆలస్యమైంది" అంటూ శాస్త్ర ప్రకారం రెండుసార్లు చెప్పాడు గృహ యజమాని.

రామ్మూర్తి బట్టతలమీదనుంచి పడిన వాన చినుకులను చేత్తో తుడుచుకుంటూ కబుర్లు ప్రారంభించాడు. ఆ కుటుంబ వివరాలతో ప్రారంభించి, అంతర్జాతీయ రాజకీయాల వరకూ అనర్గళంగా సాగింది ఆయన వాగ్ధోరణి—

అంతా అయి తాము తాంబూలాలు అందుకుని బయలుదేరేసరికి మూడు గంటలవుతున్నది. వర్షం కాస్త తెరిపి ఇచ్చింది. రొఖ్ఖం రొండిన దోపుకుంటూ "వెళ్ళొస్తాం మీ ్జనాలు కానివ్వండి. పొద్దు పోయింది" అంటూ రామ్మూర్తీ, ఆ వెనుకనే రామేశం సైకిళ్ళు తీసుకుని ఇవతలికి వచ్చారు.

రామేశం చప్పరించి "బస్సు ఛార్జీలు అడగవలసింది మీరు" అన్నాడు.

రామ్మూర్తి అదోక రకంగా నవ్వుతూ "సైకిళ్ళమీద వచ్చి బస్సు ఛార్జీలు ఇమ్మంటే పరమ తెలివి తక్కువగా ఉంటుంది. కాస్త మనుషులను బట్టి వెళ్తూ ఉండాలి. అయినా, ఈ మధ్య నువ్విలా 'డబ్బు డబ్బు' అంటూ కలవరిస్తున్నావేమిటి ?" అన్నాడు.

రామేశం నిట్టూర్చి "మీకేమండి బాబూ ! అలాగే మాట్లాడతారు ! ఇల్లుంది. సంపాయించే కొడుకున్నాడు. నా సంగతి అలా కాదుగా? ఎంతో జాగ్రత్తగా ఉండాలి. వెనకా ముందు ఏమీ లేదు. నెల అట్టే తిరిగొస్తుంది. అద్దెకట్టాలి. పిల్లవాడికి ఫీజుకట్టాలి. ఇంట్లో సరేసరి గడ్డి అయినా తినాలి. అదీ రేటు పెరిగిపోయింది కదా !" అన్నాడు.

రామ్మూర్తి సైకిలు తొక్కుతూనే "ఏమీ ఫరవాలేదు. అన్నీ సలక్షణంగా జరుగుతాయి. వార్ధక్యం పైబడినవాడిలా అలా మాట్లాడకు. నవయువకుడివి ముసలి మాటలు మాట్లాడితే బావుండదు..." అన్నాడు. రామేశం నవ్వాడు.

ఇంటికి రాగానే ముందుగదిలో చాపమీద విలాసంగా పడుకుని పత్రిక చదువుతున్న సీతమ్మ కనపడింది. భర్తను చూసి "వచ్చారా" ? అంటూ లేచి కూర్చుందామె. రామేశం ముందు గది తలుపుమూసి చాప మీద నడుం వాల్చి ఆవలించి భార్యకు దగ్గరగా జరిగాడు. అతని వాలకం చూసి గబాల్న లేవబోతూ "ఏమిటిది? పట్టపగలు ... ఛీ ...ఛీ ..." అంటూ గొణిగింది. ఆ తరువాత గొణగడం మానేసింది. బయట సన్నగా జల్లు మళ్ళీ మొదలైంది.

*

ఆరు గంటలవేళ అతను సంచి సైకిలుకు తగిలించుకుని బయలు దేరాడు. వాతావరణం చల్లగా ఉంది. ఆహ్లాదకరంగా ఉంది. చల్లనిగాలి వీస్తున్నది.

సీతమ్మ అప్పుడే దీపం ముట్టించి కుర్రవాణ్ణి కూర్చోబెట్టి చదివిస్తున్నది. వాడు ముఖం మీద పడుతున్న జుట్టును ఉండి ఉండి పైకి తోసుకుంటూ ఏదో ఇంగ్లీషులో చదువుతున్నాడు.

రామేశం కొడుకును చూసి ముచ్చటపడ్డాడు. సీతమ్మ "మీ దోవన మీరు పోండి... అలా చూస్తారేం? దిష్టి తగిలేను" అన్నది.

"వాణ్ణి కాదే...నిన్నే చూస్తున్నాను" అంటూ రామేశం నవ్వుతూ సైకిలు తీసుకొని వీధిలోకి వచ్చాడు.

రెండు ఫర్లాంగుల దూరంలో మొదటి పూజ... అదొక స్టీలు సామాన్ల దుకాణం. నలుగురైదుగురు ఖరీదైన స్త్రీలు బేరం చేస్తున్నారు

రామేశాన్ని పైనుంచే చూసి కౌంటర్‌లో ఉన్న దుకాణం యజమాని బొంగురు గొంతుతో "పొంతులూ! తీరికలేక పూజ సామాన్లు తెప్పించలేదు... ఎళ్ళి తెచ్చుకో..." అన్నాడు.

రామేశం సైకిలు స్టాండు వెయ్యబోతూ ఉంటే పోలీసువాడు విజిల్ ఊది, చేతిలో లాఠీ తిప్పుతూ "ఏయ్! తియ్ సైకిలు... రోడ్డుమీద పెడతావేం?" అని గర్జించాడు.

రామేశం అదిరిపడి సైకిలు పక్క స్థలంలోకి తీసుకుపోయి తాళం వేసి దూరంగా ఉన్న పచారీ దుకాణానికి వెళ్ళి కొబ్బరి కాయ, పసుపు, కుంకుమ, ఊదొత్తులు... తీసుకున్నాడు. తరువాత దోవలోనే పూలు తీసుకుని దుకాణానికి వచ్చాడు. నాలుగు రూపాయలు అయింది. వచ్చీ రాగానే లోపల ఎత్తుగా గోడకున్న దేవుడి బొమ్మదగ్గర స్టూలుమీద నిలబడి పూజ చేశాడు. ఆ తరువాత దుకాణం యజమానికి ప్రసాదం అందించి నిలబడ్డాడు. దుకాణం యజమాని గల్లా పెట్టెలోంచి అయిదు రూపాయల నోటు తీసి "ఉంచుకో పొంతులూ... కొరవసవరవలు పై వారం చూసుకుందాంలే" అంటూ అందించాడు.

రామేశం మళ్ళీ సైకిలెక్కి బయలుదేరాడు. ఈ రోడ్డు జనంతో కిటకిట లాడుతున్నది. ఏ వాహనాలు రాని కారణంగా కేవలం జనంతో కిక్కిరిసి రోడ్డంతా ఇంటర్వెల్ సమయంలో సినిమాహాలు వరండా లాగుంటుంది. రామేశం సైకిలు స్టాండులో ఉంచి కాలినడకన బయలు దేరి ఒక ఫ్యాన్సీషాపు, ఒక రెడీమేడ్ దుస్తుల షాపు, మరో ఇనుప సామానుల దుకాణం వగైరాలలో పూజలు నిర్వహించాడు. ప్రతిచోటా రెండు, మూడు రూపాయలకు తక్కువ ఏమీరాదు. అయితే, ఒక్కొక్కచోట రుసరుసలు...మరోచోట నిర్లక్ష్యంతోకూడిన ప్రవర్తన...ఇది మామూలే.

మళ్ళీ సైకిల్ తొక్కుకుంటూ బయలుదేరాడు... ఈసారి ఒక బ్రాందీ షాపు. వాళ్ళు పూజా ద్రవ్యాలు తెప్పించే ఉంచుతారు. ముందు పెద్ద గది...ఎదురుగా పెద్ద ఫ్రిజ్...చుట్టూ అద్దాల బీరువాల్లో రకరకాల రంగురంగుల సీసాలు...లోపల చిన్న గది... అక్కడ అన్నీ అట్టపెట్టెలు. వాటినిండా బీరు, విస్కీ, బ్రాందీ వగైరా సీసాలు. ఒకవైపు గోడకు దేవుడి ఫోటో...

రామేశం పూజ ప్రారంభించాడు.

అంతలో ముగ్గురు వ్యక్తులు వచ్చారు. షాపు యజమాని ముందు అక్కడ తాగేందుకు వీలులేదన్నాడు. వాళ్ళు వదలలేదు. 'త్వరగా గొంతులో పోసుకుని వెళ్ళి పోతా'మని ప్రాధేయపడ్డారు. షాపులో సీసా లందించే పదేళ్ళ పసివాడివంక చూశాడు రామేశం. వాడు ఆత్రుతగా చూస్తున్నాడు. వాళ్ళను లోపల తాగనిస్తే వాళ్ళు వాడికో పావలా పడేసిపోతారు. నీళ్ళు, గ్లాసులు అందించినందుకు, సిగరెట్లు వగైరాలు తెచ్చిపెడితే అర్థ రూపాయికూడా రాలుతుంది.

అదీ వాడి బాధ.

వాళ్ళు పోరగా పోరగా షాపు యజమాని చివరకు ఒప్పుకున్నాడు.

"త్వరగా కానివ్వాలి. పోలీసులతో, ఎక్సయిజు వాళ్ళతో చచ్చే చావుగా ఉంది. లేక పోతే ఈ ఘోరమైన టాక్సులతో వ్యాపారం చెయ్య

లేము..." అని గొణుగుతూనే కుర్రవాణ్ణి పిలిచి "వాళ్ళకేం కావాలో చూడు" అని పురమాయించాడు.

వాళ్ళు లోపలికి వచ్చారు. రామేశం పూజ చేస్తూనే ఉన్నాడు. వాళ్ళు అక్కడ తాగుతూ కబుర్లు చెప్పుకుంటూ నిలబడ్డారు. ఉన్నట్టుండి వాళ్ళలో ఒకడు – "పంతులు గారు పూజ చేస్తున్నార్రా..."అన్నాడు. మరొకడు ఇకిలించి – "ఆడి పూజ ఆడిది... మన పూజ మనది ..." అన్నాడు.

తర్వాత వాళ్ళేమీ మాట్లాడలేదు. కొద్ది నిముషాల్లో తమ కార్యక్రమం ముగించుకుని వెళ్ళిపోయారు.

రామేశం ఇవతలికి వచ్చి నిలబడ్డాడు. దుకాణం యజమాని తన బేరం చూసుకుని రెండు మూడు నిముషాల తరువాత అతన్ని గమనించి –"నువ్వింకా నిలబడే ఉన్నావా పంతులూ?" అంటూ అదొక రకంగా నవ్వుతూ గల్లాలోంచి రెండు రూపాయల కాగితం అందించాడు.

రామేశం మౌనంగా దాన్ని అందుకుని ఎదురు దుకాణంలోకి చూశాడు. అదొక మందుల షాపు...ఇటీవలి వరకూ తనదే పూజ అక్కడ...కాని నెల రోజుల కిందట ఎవడో పోటీకొచ్చిపడ్డాడు. తనకు ఉద్వాసన జరిగింది.

ఇక ఒక్కచోట మిగిలి ఉంది. మరో ఫర్లాంగుదూరం... ఇపుడు సైకిల్ తొక్కుతుంటే హాయిగా వుంది. పలుచని వెన్నెల... ఆకాశంలో తెల్లని మబ్బులు...చల్లనిగాలి...

ఆ షాపు అతని కార్యక్రమంలో చివరిది... ఆ యజమాని మధ్య వయస్కుడు. దైవభక్తిపరుడు...పాపభీతి, జీవకారుణ్యం కలవాడు... ప్రతి శుక్రవారం తన పూజ పూర్తి అయ్యేంత వరకూ పక్కనే నిలబడి ఉంటాడు. చేతులు జోడించి కళ్ళు మూసుకుని తాను కూడా ప్రార్థన చేస్తూ ఉంటాడు. ఇటీవల అతని కన్నీ బాధలే...వ్యాపారం బాగులేదు. బాకీలు వసూలు కావడం లేదు...ఋణదాతల ఒత్తిడి ఎక్కువైంది...

కొత్త గొడవలు వచ్చిపడ్డాయి. "అలాటి మంచి వ్యక్తికి ఈ బాధలు రాకూడదు" అనిపిస్తూంది రామేశానికి

షాపు మెట్లెక్కుతున్న రామేశానికి దుకాణం అంతా బోసిగా కనిపించింది. తళతళలాడే ఖరీదైన నగలు పెట్టెలుండే గాజు బీరువాలు బోసిపోతూ ఖాళీగా కనిపించాయి.

ఆయన మాత్రం అక్కడే కూర్చుని ఉన్నాడు. రామేశాన్ని చూస్తూనే లేచి నవ్వుతూ సిద్ధంగా ఉన్న పూజా ద్రవ్యాలు చూపించాడు.

రామేశం నెమ్మదిగా, వినయంగా, భక్తితో పూజ చేశాడు. మనసును ఎటూ పోనీయకుండా నిశ్చల భక్తితో దుకాణం యజమానికి శుభం చేకూరాలని భగవంతుణ్ణి ప్రార్థించాడు.

అంతా ముగిశాక ఆయన అతనికి నమస్కరించి ప్రసాదం అందుకుని, కళ్ళకద్దుకుని నోట్లో వేసుకుని "కూర్చోండి" అన్నాడు.

ఆ తరువాత జేబులో నుంచి యాభై రూపాయల నోటుతీసి రామేశానికి అందించి "ఉంచండి" అన్నాడు. తరువాత నెమ్మదిగా మాట్లాడడం ప్రారంభించాడు.

"పంతులుగారూ! నాపని అయిపోయింది. ఇక ఇక్కడ ఉండలేము. అంతా ఒక్కసారి విరుచుకు పడ్డట్టయింది. అయినా దేవుడి దయ వల్ల నేను మిగిలాను. అన్నింటిలోంచి బయటపడ్డాను... ఏమీ మిగలక పోయినా ఫరవాలేదు... నేనూ, నా పెళ్ళాం, పిల్లలు మిగిలాము... కొట్టుకూడా అమ్మేశాను. కట్టుబట్టలు, కొంచెం రొఖ్ఖం తప్ప ఏమీ లేదు. మా ఊరికి వెళ్ళిపోతున్నాము... రేపే ప్రయాణం... అక్కడో చిన్న మడి చెక్క ఉంది... పాత ఇల్లు ఉంది. అక్కడే కలో గంజో తాగి బతుకుతాము. ఇరవైఏళ్ళకిందట వచ్చానిక్కడికి... ఇప్పుడేమీ లేకుండా వెళ్ళిపోతున్నాను..."

క్రమంగా అతని గొంతులో జీర అధికమైంది. ఉన్నట్టుండి చేతులు జోడించి "వెళ్ళిరండి" అన్నాడు బొంగురుగొంతుకతో. ఆ మాట అని గిరుక్కున వెనుదిరిగి లోపలికి వెళ్ళిపోయాడు.

రామేశం మనసు బరువెక్కింది. విలవిలలాడిపోయాడు. కళ్ళు చెల్లాయి. కొన్ని క్షణాలు అలాగే విగ్రహంలా నిలబడి తరువాత మెట్లుదిగి ఇంటివైపు ప్రయాణం సాగించాడు.

అతడింటికి చేరేసరికి కుర్రవాడు హాయిగా నిద్రపోతున్నాడు. సీతమ్మ అంతవరకూ ఆ ప్రక్కనే భర్తకోసం ఎదురుచూస్తూ కూర్చున్నది. చుట్టుప్రక్కల ఎక్కడో ఏదో పురుగులు చేస్తున్న సవ్వడి తప్ప చుట్టూ నిశ్శబ్దం...

సీతమ్మ భర్తను చూసి లేచి – "ఏమి తినరా?" అని అడిగింది. అతడు తల అడ్డంగా ఊపి – "ఊఁహూఁ – తినను... కాసిని మజ్జిగ ఉంటే ఇవ్వు" అన్నాడు చాపమీద పడుకుంటూ.

"అలా ఉన్నారేం?" అంటూ సీతమ్మ మజ్జిగ తెచ్చి ఇచ్చింది. అతను మాట్లాడలేదు. ఆ తరువాత ఆమె వంటగదిలో అన్నీ సర్దుకుని పావుగంటలో ఇవతలికి వచ్చేసరికి రామేశం కదలకుండా పడుకుని నిద్రపోతున్నాడు.

సీతమ్మ భర్త సంచి అందుకుని చూసింది. డబ్బు అంతా ఒక చోట చేర్చి దీపపు వెలుగులో లెక్కపెట్టింది. మామూలు కంటే చాలా ఎక్కువ ఉంది డబ్బు...

ఆమె తనలో తాను నవ్వుకుని ఆ డబ్బు బీరువాలో దాచి ఉంచి తాను కూడా భర్త సరసనే చాప మీద నడుం వాల్చింది. –"ఈ నెల ఫరవాలేదు, గడిచిపోతుంది" –అనుకున్నదామె.

అంతలో రామేశం ఏదో కలవరిస్తుంటే తలతిప్పి చూసింది. నిద్రలో అతను ఆబ్దికపు మంత్రాలు చదువుతున్నాడు.

నెమ్మదిగా, మృదువుగా అతని నుదురు స్పృశించి పక్కకు తిరిగి పడుకున్నదామె.

బయట మళ్ళీ మబ్బులు గుమికూడాయి...గర్జించాయి...అంతలో కుండలతో బోర్లించినట్లు వర్షం మొదలైంది.

# ఇరవై అయిదవ గంట

చేస్తున్న పని ఒక్క క్షణం ఆపి శుష్కించిన చేత్తో నుదురు తుడుచుకున్నాడు నరహరి.

ఎదురుగా పెద్ద తేనెటీగల తుట్టె ఉన్నట్టున్నది.

చిన్న చిన్న అరలు...వాటిలో అక్షరాలు...ఒత్తులు...కామాలు...చుక్కలు...

పైన ట్యూబ్‌లైటు వెలుగుతున్నది.

అవతలిపక్క చిన్న గదిలోనుంచి ట్రెడిల్ సవ్వడి నిర్విరామంగా వినబడుతున్నది.

నరహరి మళ్ళీ పనికి ఉపక్రమించాడు. కుడిచేయి చకచక కదులుతున్నది. వేగంగా అక్షరాలు మాటలుగా రూపొందుతున్నాయి. అతనికి సరిగ్గా వెనక అలాటి పనిలోనే నిమగ్నుడైవున్నాడు సుబ్బరాజు. అతను చిన్నవాడు. పాతికలోపే వయసు... పుట్టిపెరిగిన వూరువిడిచి, కడుపు చేత్తో పట్టుకుని యీ నగరానికి వచ్చాడు. ప్రెస్‌లో చేరి పని నేర్చుకుని, కంపోజింగ్‌లో నిష్ణాతుడై సంపాదిస్తూ ముసలి తల్లిదండ్రులకు కొంత డబ్బు పంపిస్తూ ఒంటరిగా బ్రతుకుతున్నాడు.

నరహరి వెనుదిరిగి కళ్ళజోడు క్రింద నుంచి సుబ్బరాజు వంక చూశాడు. అతనికి జాలివేసింది. 'ఈ కుర్రవాడు తన కోసం ఎంత శ్రమ పడుతున్నాడు', అనిపించింది.

ఇప్పు సరిగా మూడుపగళ్ళూ మూడురాత్రులూ విరామం అనేది ఎరగరు ముగ్గురూ... అప్పుడప్పుడు బైటికి వెళ్ళి ఏదన్నా తిని, టీనీళ్ళు తాగడమే.... మధ్య మధ్యలో చిన్న చిన్న కునుకులు తప్ప నిద్రలేదు.

రాత్రి పదిగంటలవుతూ వుండవచ్చు. ముందువైపు ప్రెస్ యజమాని గదిలో లైటు వెలుగుతున్నది. ఆయన మధ్యవయసువాడు. అతి శ్రద్ధగా ప్రూఫులు దిద్దుతున్నాడు.

బుచ్చి – ఎనిమిదేళ్ళ పసిపెధవ. మాసిన లాగూ చొక్కాతో యజమాని గది గుమ్మం ముందు స్టూలుమీద గోడకానుకుని కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు.

లోపల ట్రెడిల్ శబ్దం ఆగింది. రుమాలుతో మొహం తుడుచుకుంటూ ఇవతలికి వచ్చాడు నారాయణ. గుమ్మంలో నిలబడి "ఫారం సిద్ధమేనా?" అని అడిగాడు నరహరిని.

"ఆఁ! అదుగో స్టోన్‌మీద" అన్నాడు నరహరి.

నారాయణ "వస్తానిప్పుడే" అంటూ బయటికి నడిచాడు.

ప్రెస్ యజమాని "నారాయణా! ఇలారా" అని పిలిచాడు.

"ఇదుగో చూడు. ఆఖరి ఫారం, ఇన్నర్ లైటిన్... ఒక వంప కొట్టుచాలు. మిగతాపని తర్వాత చేసుకోవచ్చు మెల్లిగా..." అన్నాడు.

నారాయణ 'అలాగేనండి' అని బైటికి నడిచాడు. చల్లని గాలితెర వీచింది. వీధి మూలవున్న టీ దుకాణం దగ్గర పెట్రొమాక్సు లైటు మందంగా వెలుగుతున్నది. నారాయణ అక్కడికి వెళ్ళి బల్లమీదకూలబడి "వెంకులూ! టీ యివ్వు" అన్నాడు. అతనికి కాళ్ళు తేలిపోతున్నాయి. చేతులు రెండూ గాల్లోకి అటూ యిటూ విసిరి వ్రేళ్ళు విరుచుకున్నాడు. ఇంత ఘోరంగా రోజుల తరబడి నిర్విరామంగా ఎన్నడూ పనిచేయలేదు. చేయవలసిన అవసరం కూడా రాలేదు. తాను చేస్తున్నది కాంట్రాక్టు పని. కష్టపడినంతసేపు కష్టపడితేచాలు... ఉన్నది తాము మొగుడూ పెళ్ళాలిద్దరు. తిండికి, బట్టకు లోపం లేకుండా కాలం వెళ్ళిపోతే చాలు. అలాటిది నరహరి గొప్ప అవసరం వచ్చి ప్రాధేయపడితే తానూ సుబ్బరాజూ యిద్దరూ కాదనలేకపోయారు. ఈ రోజుల్లో ఎవరు ఎవరికి యిబ్బందిలో అడ్డుపడతారు? కాని యిలా మరొకరి కోసం శ్రమపడుతుంటే ఇందులోనూ వింత ఆనందం ఉన్నదనిపిస్తుంది.

నారాయణ టీ తాగడం ముగించి చిల్లర చెల్లించి ప్రెస్‌లోకి వచ్చే సరికి ప్రెస్ యజమాని గదిలో ఆయన కెదురుగా ఇద్దరు ఖరీదైన వ్యక్తులు కూర్చుని వున్నారు. ప్రెస్‌ముందు రంగుల హంసలాటి కారు నిలిచివుంది. బుచ్చి నిద్ర మైకం వొదిలిపోయి చేతులుకట్టుకుని నిలబడి వున్నాడు.

నారాయణ లోపలికి వెళ్ళి కొత్త ఫారం ట్రెడిల్ మీదికి ఎక్కించే పనిలో నిమగ్నుడైనాడు.

ప్రెస్ యజమాని "నన్ను నమ్మండి ... ఉదయం పది గంటల కల్లా కనీసం యాభై కాపీలు నేను స్వయంగా హాలు దగ్గరికి పట్టుకొస్తాను" అంటున్నాడు.

ఒకడు బొంగురుగొంతుకతో "కాబట్టే మీకు పని యిచ్చాను... డబ్బెక్కువైనా సరే నేను లెక్కచెయ్యను. నాకు పనికావడం ముఖ్యం... అందులోనూ ఫంక్షన్ ఏర్పాటయింది...ముగ్గురు మంత్రులొక్కసారిగా దొరికారు.... అలాటిలాటి ఫంక్షన్‌కాదు — బ్రహ్మాండమైన ఫంక్షన్. ఊరంతా మోగిపోవాలి... అదీ సంగతి" అని ఆగి, "కుర్రాడేడీ?" అని ప్రశ్నించాడు. ప్రెస్ యజమాని వెంటనే "ఏం కావాలి ?" అంటూనే "బుచ్చీ" అని కేకవేశాడు.

బుచ్చి లోపలికివెళ్ళి నిలబడ్డాడు.

బొంగురుగొంతు వ్యక్తి పక్క అతనితో "ఎంత తెప్పించను ? హాఫ్...చాలా ?" అన్నాడు. రెండో వ్యక్తి టెరిలిన్ లాల్చీ, బంగారు గొలుసు, వగైరాలతో తళతళ లాడుతున్నాడు. అతడు "చాలు...చాలు హాఫ్ చాలు" అన్నాడు.

మొదటి వ్యక్తి యాభై రూపాయల నోటుతీసి బుచ్చికి అందించి "రేయ్ ! రోడ్డుమీద బ్రాందిషాపుకెళ్ళి... ఇదుగో ... ఈ కాయితంలో రాసింది పట్టుకురా...అర్జంటు..." అంటూ కాయితం ముక్కమీద తమకు కావలసిన బ్రాండుపేరు వ్రాసియిచ్చాడు. బుచ్చి దాన్ని అందుకుని వెళ్ళి

పోయిన తర్వాత ప్రెస్ యజమానివైపు తిరిగి "మీరు కూడా పుచ్చు కుంటారా ?" అని అడిగాడు.

ఆయన తల అడ్డంగా వూపి "వొద్దొద్దు! మీరు కానివ్వండి" అన్నాడు కంగారుగా.

నిజానికి అది ప్రెస్ యజమానికి అసలు యిష్టంలేదు. ప్రెస్‌లో, అందునా తన గదిలో...పనివాళ్ళముందు... ఇతరులు ఆ పనిచేయడం మరింత అసహ్యమైన విషయం. కాని యిప్పటి పరిస్థితి వేరు ... ఆయన నెత్తిమీద పెద్దకత్తి వ్రేలాడుతున్నట్టున్నది వారం, పదిరోజుల నుంచీ. మరునాడు మధ్యాహ్నం కోర్టు ముగిసే వేళలోగా అయిదువేలరూపాయలు కట్టకపోతే పెద్ద ప్రమాదం ముంచుకు వస్తుంది. వీళ్లు తనకు తెలిసిన వాళ్లే...పాల కష్టమర్లే... ఇప్పుడు తనకు హడావిడిగా ఈ పెద్దనవల ముద్రణకు యిచ్చి గొంతుమీద కూర్చుంటే కూర్చున్నారు గాని తన ఆపద గడుస్తున్నది. అందువల్ల ఇలాటి స్వల్ప విషయానికి అభ్యంతరం చెప్పడం తెలివితక్కువ. సహించడం ఉత్తమం.

లోపల సుబ్బరాజు నరహరితో "ఈ పేరాతో ఖతం... పని పూర్తయినట్టే..." అన్నాడు వొళ్లు విరుచుకుంటూ...

నరహరి అతనివంక చూశాడు. అతని కళ్ళలో కృతజ్ఞత నీటి పొర రూపంలో పేరుకున్నది. అంతలో కళ్లు తుడుచుకుని తన పనిలో లీనమైనాడు. అతని వ్రేళ్లు వొణుకుతున్నాయి.

...ఇంటిదగ్గర తమ్ముడు కళ్ళలో వత్తులు వేసుకుని ఎదురు చూస్తూ వుంటాడు. మీనాక్షి కూడా కంగారుపడుతూ వుంటుంది. బహుశా. మరిది సంచి సర్ది అంతా సిద్ధంచేసి వుంటుంది. బోలెడన్ని జాగ్రత్తలు కూడా చెప్పి వుంటుంది...రెండు రోజులనుంచీ యింటిమొహం చూడ లేదు తాను...సరిగ్గా సమయానికి డబ్బు తీసుకువస్తానని చెప్పి రావ డమే...

సుబ్బరాజు నెమ్మదిగా "అబ్బ! ఏం నవలయ్యాయిదీ! అంతా క్రిందికి పేర్చుకుంటూ పోవడమే ... ఒక్కొక్క అక్షరం ఒక్కొక్క

లైను.... పేజీల నిండా 'ఊ'లూ, 'ఆ'లూ... చుక్కలూ... ఇంతే అంతానూ... పని మహా సుఖంగా వుందిలే... పేజీకి అడ్డంగా వాక్యం కంపోజ్ చేసే పనేలేదు... అన్నట్టు హీరోయిన్.... యిప్పుడు రక్తం కక్కుకుని చచ్చిపోతున్నది. పేరు 'డాక్టరు ఋధిర'ట... అంటే ఏమిటో నీకు తెలుసా?" అన్నాడు.

నరహరికి ఏం జవాబు చెప్పాలో తెలియలేదు. ఉన్నట్టుండి "ఏమయితే మనకెందుకు?" అని వూరుకున్నాడు.

"అంతేలే – మనకెందుకు? కళ్లు మూసుకుని పనిచేయడమే."

అంతలో బుచ్చి తూలుతున్నవాడిలా చేతిలో సీసా పట్టుకుని మరో చేతిలో చిల్లరతో వచ్చాడు.

బొంగురుగొంతు వ్యక్తి చిల్లర అందుకుని "ఏరా కుర్రనాయాలా! రెండు రూపాయలు ఎక్కువ తీసుకున్నాడే షాపువాడు వాడు సు కున్నాడా లేకపోతే నువ్వే దొబ్బేశావా?" అన్నాడు పెద్దగా.

బుచ్చి గడగడలాడిపోతూ "లేదండీ అంతే యిచ్చాడు...' అన్నాడు.

"అయితే వెళ్ళి రసీదు పట్టుకురా వెధవా."

సిల్కులాల్చీ వ్యక్తి కలగజేసుకుని "పోనేరా. పాపం. మళ్ళీ పసివాణ్ని ఎందుకు తరుముతావు...? వూరుకో..." అన్నాడు.

బొంగురుగొంతు వ్యక్తి నవ్వి "నువ్వెప్పుడూ యింతే... ఏదీ లెక్కలేదు నీకు" అంటూ ప్రెస్ యజమాని వంక తిరిగి "గురువుగారూ! రెండు గ్లాసులు... మంచినీళ్ళు..." అన్నాడు.

బుచ్చి గ్లాసులు కడుక్కువచ్చి బల్లమీద పెట్టాడు. కూజా నీళ్ల ప్రక్కన పెట్టాడు. ప్రెస్ యజమాని కుర్చీలో వెనక్కు ఆనుకుని కూర్చున్నాడు.

బొంగురుగొంతు వ్యక్తి తనపనిలో తానుండగా సిల్కులాల్చీ వ్యక్తి జేబులోనుంచి నోట్లకట్టతీసి బల్లమీద వుంచి "ఇది ఆరువేలు" అన్నాడు.

ప్రెస్ యజమాని దాన్ని అందుకుని 'థ్యాంక్స్...రశీదు రాస్తాను అన్నాడు.

బొంగురుగొంతు వ్యక్తి "మాకు అవేవీ అవసరం లేదు. పని కావడం మాకు ముఖ్యం...అంతే... రేపు ఫంక్షన్..." అంటూ సిల్కు లాల్చీ వ్యక్తికి గ్లాసు అందించి 'ఛీర్స్' అని ఒక గుటకవేసి మళ్ళీ "రేపు ఫంక్షన్ అదిరిపోవాలి. ఇదేం సామాన్యమైన ఫంక్షనా? ముగ్గురు మంత్రులు...ఇంకా పెద్ద పెద్ద వాళ్ళు... వూరంతా దడదడలాడిపోవాలి. మా వాడి భార్య... మా చెల్లెమ్మ... మహారచయిత్రి... రెండువందలవ నవల ఆవిష్కరణ... అసలు అదికాదు ముఖ్యం...మూడేళ్ళలో రెండు వందల నవలలు రాయడం అంటే అది టెరిబుల్ ఫీట్... అచీవ్‌మెంట్. వరల్డ్ రికార్డు...పత్రికలవాళ్ళు ఆలిండియా పబ్లిసిటీ యిస్తారు. వరల్డంతా మోగిపోతుంది" అంటూ ఆపకుండా మాట్లాడటం సాగించాడు.

బుచ్చి కళ్ళింతలు చేసుకునిచూస్తూ స్టూలుమీద కూర్చునివున్నాడు. ప్రెస్ యజమాని ముఖం ఇప్పుడు కళకళ లాడుతున్నది. గొప్ప ఖరో సాతో ఎదుటివ్యక్తి మాటలు వింటున్నాడు.

లోపల సుబ్బరాజు నిట్టూరుస్తూ పక్కనే బల్లమీద కూర్చుని వున్నాడు. నరహరి ఇన్నర్ టైటిల్ ఫారం కొట్టడం పూర్తి అయింది. అందులో ముందుమాటలు, అంకితం, ఫొటో బ్లాకులు వగైరాలున్నాయి. అది మెషిను కెక్కితే నారాయణ మరో అరగంటలో పని పూర్తిచేస్తాడు. బహుశా అప్పటికి పన్నెండు దాటుతుందేమో! తమ్ముడికి మూడు గంట లకు రైలు... వాడు వందలాది మైళ్ళు ప్రయాణం చేసి రెండో రోజుకు ఇంటర్వ్యూకు అందుకోవాలి... ఇంటిదగ్గర వదినా మరుదులిద్దరూ ఎంత కంగారు పడుతున్నారో!

తమ్ముడు తన తల్లీ తండ్రీ పోయేనాటికి పసివాడు... తల్లి ఆ పసివాణ్ణి తన భార్యకప్పగించి 'వీడికి తల్లివైనా వొదినవైనా నువ్వే తల్లీ' అని చెప్పి కన్ను మూసింది. అప్పటినుంచి తామిద్దరూ కన్న కొడుకులాగే— నిజానికి అంతకంటె మిన్నగా— పెంచి పెద్దచేశారు. వాడు కూడా ఈ కాలపు కుర్రవాళ్ళకుమల్లే కాదు. గొప్ప బుద్ధిమంతుడనే

చెప్పాలి. బాధ్యత ఎరిగి బుద్ధిగా చదువుకుని ఈనాటికి ఇంత యోగ్యుడై నాడు. దేవుడి దయవల్ల అంతా సవ్యంగా జరిగి వాడికి ఈ ఉద్యోగం వస్తే అంతకంటె కోరుకోదగింది ఏమీలేదు.

ప్రెస్ యజమాని నాలుగు రోజుల క్రిందట అసలు ఇంత పని ఒప్పుకుని ఉండేవాడు కాదు. ఆయనకు ఏదో కోర్టు వ్యవహారం పీకల మీదికి వచ్చింది. తమ్ముడికి అంతదూరం నుంచి ఇంటర్వ్యూకు పిలుపు రాగానే 'ఎలారా దేవుడా' అని కంగారుపడుతున్న తనను పిలిచి అంతా చెప్పి 'ఇదీపని...మాట యిచ్చామంటే చేసితీరాలి...మామూలు కాంట్రాక్టు రేటుకంటే ఎక్కువిస్తాను. ఏమంటారు? ఒప్పుకోనా?' అని అడిగితే, సుబ్బరాజు నారాయణ యిద్దరితో తనబాధ చెప్పుకుని సాయం చెయ్యమని కోరాడు తాను. వాళ్ళిద్దరూ వెంటనే ఒప్పుకున్నారు. ఒప్పుకోడం అంటే అసాధ్యమైన పనిని ఒప్పుకోడం... మూడు రోజులు... అంటే డెబ్బయి రెండుగంటలు...నిద్రాహారాలు త్యజించి పనిచేయడానికి సిద్ధపడటం... కాలగమన వేగంతో పోటీపడటం... పోటీ పడటమేకాదు... అధిగ మించడం... వాళ్ళు చేసిన సాయం మామూలు సాయం కాదు. డబ్బు అయితే తాను తీర్చేయగలడు...కాని వారు చిందించిన స్వేదానికి, రక్తానికి బదులు ఏమివ్వగలడు తాను?

బయటి గదిలో ఆ యిద్దరు వ్యక్తులూ లేచారు. ప్రెస్ యజమానికి షేక్‌హేండ్ యిచ్చారు.

"పది గంటలకల్లా..."

"హాలు దగ్గరికి..."

"యాభై కాపీలు చాలు..."

అని మాటి మాటికీ హెచ్చరిస్తూ బైటికి నడిచారు.

ప్రెస్ యజమాని వారిని సాగనంపి లోపలికి వచ్చాడు. "ఎంతలో వుంది" అన్నాడు వాస్తూనే.

"ఇదిగో! ఇన్నర్ టైటిల్ ప్రెడిల్ ఎక్కింది"

ప్రెస్ యజమాని తేలికగా నిట్టూర్చి "నారాయణా! ఒక వంద వెయ్యి చాలు" అన్నాడు.

మిగిలిన ప్రింటయిన ఫారాలన్నీ కలపడం పూర్తయింది. టైటిల్ సిద్ధంగా వుంది. ఇక ముందూ వెనకా ఈ ఫారాలు చేర్చి, పిన్నింగ్‌చేసి, టైటిల్‌వేసి, కటింగ్ చేయడమే. ఈ పనంతా ఉదయం బైండర్ వచ్చి గంటలో లాగించెయ్యగలడు.

"నరహరీ! మీరు వెళ్లేటప్పుడు ఈ బుచ్చిగాణ్ణి కూడా తీసుకువెళ్ళి వాళ్ళ యింటిదగ్గర దింపండి. ఒక పాతిక రూపాయలిస్తాను. వాళ్ళ అమ్మకు ఇవ్వండి" అన్నాడు ప్రెస్ యజమాని.

లోపల ట్రెడిల్ చప్పుడు... ఇన్నర్ టైటిల్ ప్రింటవుతున్నది. అక్కడే ఇరుకు గుమ్మంలో ఒక పక్కన నరహరీ, మరోపక్క సుబ్బరాజూ నిలబడి చూస్తున్నారు. నారాయణ అతి చాకచక్యంగా పనిచేస్తున్నాడు. అతడెప్పుడూ ఏమీ మాట్లాడడు." ఎప్పుడూ తనపనేమో... తానేమో... మహా నిపుణుడైన ట్రెడిల్‌మన్.

"అసలు తెలుగులో ముద్రణ ఇంత యాతనామయంగా ఎందుకుండాలి? ఇతర రంగాలలో ఎంతెంత మార్పులొస్తున్నాయి." అనుకున్నాడు నరహరి చొక్కా వేసుకుంటూ.

నారాయణ మెషిన్ ఆపి ప్రింటయిన ఫారాలు దింపి క్రిందపడేసి చేతులు తుడుచుకున్నాడు. లైటు తీసేశాడు. చొక్కా తొడుక్కున్నాడు.

ముగ్గురూ యివతలికి వచ్చారు. ప్రెస్ యజమాని వారిని లోపలికి పిలిచి ఎవరి డబ్బు వారికి అందించాడు.

"చాలా పొద్దుపోయింది. కుర్రవెధవను యింటి దగ్గర దింపండి. కునుకుతున్నాడు. నేను తాళాలు వేసుకు వస్తాను. అన్నట్టు రాజూ! ఈ సీసావీధిలో పారెయ్."

రాజు ఖాళీసీసా అందుకుని వీధి అవతలి వైపుకు చీకట్లోకి విసిరి కొట్టాడు. అది ఎదురు గోడకు తగిలి ఛళ్ళున బద్దలైంది. "

ముగ్గురూ బుచ్చిని వెంటబెట్టుకుని వీధిలోకి వచ్చారు. వీధి చివరి

వరకూ వెలుగునీడలు పరుచుకుని వున్నాయి. ఆ నిశ్శబ్దంలో ఏదో పక్షి వికృతంగా అరుస్తూ ఎగిరిపోయింది.

బుచ్చిని ఇంటిదగ్గర తల్లికి అప్పగించి, ఆమెకు డబ్బు యిచ్చి మళ్ళీ నడక ప్రారంభించారు. నారాయణ, సుబ్బరాజు తమ డబ్బు నరహరికి అందించారు. నరహరి కళ్ళనీళ్ళు ఉబికి వస్తూవుండగా డబ్బు అందుకుని తొందరలో తీర్చేస్తాను అని గొణిగాడు.

నారాయణ మనసులో తృప్తి... సుబ్బరాజు మనసులో ఏదో తెలియని ఆనందం...తమ తమ్ముణ్ణి ఉద్యోగానికి పంపిస్తున్నట్టు వింత అనుభూతి ఇద్దరిలోనూ.

ముగ్గురూ వెళ్ళేసరికి నరహరి తమ్ముడు ఆదుర్దాగా ఎదురువచ్చి "ఇంత ఆలస్యమైందేం అన్నయ్యా?" అన్నాడు.

మీనాక్షికూడా ఆ చిన్న పెంకుటింటి వరండాలోనే నిలబడివుంది. ఆమె భర్తను చూసి తేలికగా నిట్టూర్చింది.

నరహరి "ఇదిగో డబ్బు. వదిన చేతుల మీదుగా అందుకో" అన్నాడు భార్యకు అందిస్తూ.

మీనాక్షి అలసటగా నవ్వుతూ "మీరే ఇవ్వరాదూ?" అన్నది.

"కాదులే...నీ చేతుల మీదుగా యిస్తే శుభమవుతుంది. నాలుగో రోజుకు ఉద్యోగంలో చేరానని ఉత్తరం రాస్తాడు మరిదిగారు."

సుబ్బరాజు "ఉత్తరం వద్దు...టెలిగ్రామ్ బెటరు" అన్నాడు. అందరూ నవ్వారు. మీనాక్షి చీర చెంగుతో దగ్గు ఆపుకుంది. ఆమె చేతి నుంచి డబ్బు అందుకుని వంగి కాళ్ళకు నమస్కరించాడు మరిది.

స్టేషనులో రైలు సిద్ధంగా ఉంది. అన్‌సీజన్ కావడంచేత రైలు మరీ రద్దీగా లేదు. ఒక సీటులో సంచీ ఉంచి తమ్ముడికి ఏవేవో జాగ్రత్తలు చెబుతున్న నరహరివంక కన్నార్పకుండా చూస్తున్నారు. మిగిలిన యిద్దరూ. వున్నట్టుండి ఆ అబ్బాయి వంగి అన్న పాదాలకు నమస్కరించాడు.

రైలు కదిలింది. ముగ్గురూ చేతులూపుతూ వుండగా వేగం పుంచు కుని అంతలోనే ప్లాట్‌ఫారం దాటి కనుమరుగై పోయింది.

కళ్ళనీళ్ళు పెట్టుకొని అలాగే నిలబడిపోయిన నరహరిని వీపుమీద తట్టి "రావయ్యా! మహానుభావా! బైట'టీ' అయినా ఇప్పించు" అన్నాడు నారాయణ.

"టీ ఏమిటి? బిస్కట్లు కూడా కావాలి" అన్నాడు సుబ్బరాజు.

స్టేషను వెలుపల చల్లని గాలి వీస్తున్నది. మూల కాకా హోటల్లో ముగ్గురూ బిస్కట్లు తింటూ, టీ తాగుతూ కూర్చున్నారు నిశ్శబ్దంగా.

"ఈ కుర్రవాడికి ఉద్యోగం వస్తుందా అసలు..."

నారాయణ మనసులో మెదలుతున్న ప్రశ్న.

"ఈ ఉద్యోగం వచ్చాక ఇంతోటి మరిదిగారు అన్నా వదినెలను ఆదుకుంటాడా? వదిన టి.బి. చికిత్సకోసం డబ్బుసాయం చేస్తాడా? లేక మరచిపోతాడా?"

సుబ్బరాజు మనసులో అనుమానం

"వీడికి ఉద్యోగం వచ్చి తీరుతుంది. ఇంట్లో వదినకు దణ్ణం పెట్టాడు. స్టేషన్‌లో నా కాళ్ళకు దణ్ణం పెట్టాడు. ఉద్యోగంలో చేరగానే మాకు అండగా నిలుస్తాడు. అన్నిటికంటె ముందు మీనాక్షికి మందుల కోసం డబ్బు పంపిస్తాడు. మీనాక్షికి టి. బి. తగ్గుతుంది.

నరహరి మనసులో ఆశ...

తర్వాత పది నిముషాల్లో ఎవరి ఇళ్ళకు వారు వెళ్ళిపోయారు.

మరునాడు...

ఫంక్షన్...ఫెళ్ళున జరిగింది. రంగ రంగ వైభవంగా జరిగింది. మూడేళ్ళ స్వల్ప వ్యవధిలో రెండువందల నవలలు రాసిన మహా రచయిత్రిని అందరూ పొగడ్తల వర్షంలో ముంచెత్తారు. మంత్రులూ, అధికారులూ, మాన్యులు, అసామాన్యులు, వందిమాగధులు, ఖరీదైన కార్లు, పొగడ్తలు, ఉత్ప్రేక్షలు, చదివింపులు, దండలు, ఫోటోలు, అంతా కళ్ళు మిరుమిట్లు గొలిపేట్టు జరిగింది.

మహా రచయిత్రి, ఆ రాత్రి డిన్నరూ వగైరా ముగిసి అందరూ వెళ్ళిపోయాక గాఢంగా నిట్టూర్చి భర్తతో దిగులుగా బాధగా "ఇవాళ ఒక్క అక్షరంకూడా రాయలేదు. రోజంతా వేస్ట్ అయిపోయింది" అన్నది.

ఆ తర్వాత హడావిడిగా పూనకం వచ్చినదానిలా వెళ్ళి బల్లముందు కూర్చుని కాయితాలు ముందుకు లాక్కుని ఒక్క క్షణం కలాన్ని పళ్ళ మధ్య వుంచుకుని ఆలోచించి....

"ట్రింగ్... ట్రింగ్..."

ఫోను గణ గణ మని మోగింది.

అంటూ తన రెండు వందల ఒకటవ నవల ప్రారంభించింది...

# కోళందవేలు బొమ్మ

కోళందవేలు ఉన్నట్టుండి ఆదుర్దాగా లేచాడు.

కొద్ది దూరంలో ఏదో పెద్ద ఊరేగింపు వొస్తున్నది. ముందు పోలీసులతో నిండిన రెండు వ్యానులు నెమ్మదిగా వెళుతున్నాయి. ఆ వెనక కాలి నడకన కొందరు పోలీసులు లాఠీలు ఝుళిపిస్తూ జనాన్ని పేవ్‌మెంట్ల మీదికి తోలుతున్నారు.

పేవ్‌మెంట్ల మీద తొడతొక్కిడి అయింది. మగా ఆడా అందరూ సిటీ బస్సుల్లోలాగా కిక్కిరిసి నిలబడవలసి వచ్చింది. ఆ వెనక రెండు వరుసలుగా ఊరేగింపు సాగింది. అందరూ నినాదాలు చేస్తున్నారు. ఎక్కువ మంది చేతులలో రకరకాల నినాదాలు వ్రాసి ఉన్న అట్టలున్నాయి. అసలే సన్నని రోడ్డు అటూ యిటూ ఖరీదైన షాపులు ... ఎక్కువ భాగం రంగ రంగ వైభవంగా వెలిగిపోయే బట్టల షాపులు... రెడీమేడ్ దుస్తుల దుకాణాలు...ఫ్యాన్సీ సామానులూ, రేడియోలు, టీవీలు అమ్మే షాపులు... ఆ వీధి అంతా ఉదయం మొదలుకొని రాత్రి పది గంటల వరకూ కిటకిటలాడుతూ వుంటుంది. వాహనాలను అనుమతించని కారణంగానూ, కోట్ల రూపాయల వ్యాపారం జరిగే రోడ్డు కావడం చేతనూ ఎల్లప్పుడూ జనం భుజాలు రాసుకుంటూ నడుస్తూ వుంటారు.

ఊరేగింపు నెమ్మదిగా ముందుకు సాగిపోయింది. పేవ్‌మెంట్ల మీద పోలీసు లాఠీల భయంతో సర్దుకున్న జనం నెమ్మది నెమ్మదిగా రోడ్డు మీదికి దిగారు.

కోళందవేలు అంతసేపూ తన బొమ్మను భద్రంగా కౌగలించుకుని నిలబడ్డాడు. ఆ తర్వాత జనం రద్దీ తగ్గగానే మళ్లీ యధాప్రకారం

పేవ్‌మెంటుమీద ఉపనిష్టుడై బొమ్మను అతి భద్రంగా తన ముందుంచు కున్నాడు. చుట్టుప్రక్కల పేవ్‌మెంటుమీద అసంఖ్యాకమైన వస్తువులు దొరుకుతాయి. అరటిపళ్లు, నిమ్మకాయలు మొదలుకొని స్మగుల్డ్ వాచీలూ, జల్సా వస్తువులూ, టేప్ రికార్డర్లూ, టేప్‌లూ, రేజర్లూ, ప్లేట్లూ, విదేశీ సెంట్లు వగైరా సామాగ్రి 'త్రో అవే' ఖరీదుల్లో లభిస్తాయి.

కొళందవేలు వెనకనుంచి గర్జన లాటిది వినిపించడంతో ఉలిక్కి పడి వెనుదిరిగి చూశాడు.

అదొక బనియన్లూ, లుంగీలూ వగైరాలు అమ్మే చిన్న దుకాణం ...దుకాణం ఇరుకైనదే గాని వ్యాపారం మాత్రం గొప్పదే.

ఆ దుకాణం యజమాని నల్లగా సిమెంటు బస్తాలాటి పొట్టతో కదలలేని వాడిలా కూర్చుని వుండి అరుస్తున్నాడు.

'నువ్విట్టా షాపుముందు నుంచుంటే నా యాపారం ఏం గావాల? దూరంగా పో...?' కొళందవేలు మర్యాదగానే కొంచెం పక్కకు జరిగి కూర్చుని తన బొమ్మను ముందుకు జరుపుకున్నాడు. పైగా ఆయన వంకచూసి చిరునవ్వు నవ్వాడు కూడా.

ఆయన "నవ్వుతావేంది?" అంటూ ఏమిటో విసుక్కుంటూ ఉండిపోయాడు.

కొళందవేలు వచ్చే పొయ్యే వారందరి వంకా ఆశగా చూస్తున్నాడు. ఎవరైనా ఒక్క క్షణం ఆగి తన బొమ్మవంక చూస్తేచాలు. పళ్ళుబైట పెట్టి నవ్వుతూ వారు కొంటారనే ఆశతో మెరిసే కళ్ళతో చూస్తున్నాడు.

ఒక నడి వయసు ఆమె— పచ్చగా బంగారపు బొమ్మలాగున్నది. చిన్న పిల్లవాణ్ణి నడిపించుకుంటూ వెడుతూ ఆగింది. ఆ బొమ్మవంక కొన్ని క్షణాలు చూసింది.

కొళందవేలు 'అమ్మణ్ణీ! సూడమ్మా! ఎంతో కష్టపడి తయారు చేసినాను. పదిరోజులపని...?' అన్నాడు ఆశగా.

ఆమె విచిత్రంగా చూసింది. ఆ తర్వాత ఏమనుకున్నదో ఏమో చివాలున ముందుకు కదిలిపోయింది.

కొళందవేలు నిట్టూర్చాడు. తర్వాత తన బొమ్మ వంక చూశాడు

పది రోజుల కష్టం... ఈ పది రోజులూ మీనాక్షికి జ్వరం... మందులేదు మాకులేదు. ఉండేది సిటీకి మూడు కిలోమీటర్ల దూరంలో విసిరేసినట్టున్న మురికి పేటలో. చిన్న గుడిసెలో...

"మందు తెస్తాన"ని కొళందవేలు అంటే మీనాక్షి నవ్వి శుభ్రమైన తమిళంలో, "ఏం ఫర్వాలేదు లేవయ్యా! మామూలు జ్వరానికే నీ మీనాక్షి చచ్చిపోదులే" అనేది. ఇంట్లో మిగిలిన కాసిని బియ్యమూ అతనికి ఉడకేసి పెట్టి చాపమీద పరిచిన బొంతమీద పడుకుని అత్యంత చాక చక్యంగా పనిచేసే అతని వ్రేళ్ళనే చూస్తూ వుండేది. కొళందవేలు అలిసి పోయి కాసేపు నడుం వాలిస్తే అతని నుదురు తుడిచి వ్రేళ్ళు నిమిరి సేద దీర్చేది. కొళందవేలు మళ్ళీ నిట్టూర్చాడు. తాను ఉదయం అనగా సిటీ బస్సులో బయలుదేరి వచ్చాడు. ఉదయం అంతా బొమ్మ చేతిలో పట్టుకుని ధనవంతులుండే పేటల్లో తిరిగాడు.

మధ్యాహ్నం ఒంటిగంట వేళ ఒక చవకబారు హోటల్ కని పించింది తిని యిన్ని టీ నీళ్లు తాగాడు.

ఆ తర్వాత బీసెంట్ రోడ్డుమీదికి వచ్చి రెండుసార్లు అటూయిటూ చేతిలో బొమ్మతో చక్కర్లు కొట్టి ఇదుగో, ఇక్కడ స్థిరపడి పోయాడు. జనం తండోప తండాలుగా వస్తున్నారు, పోతున్నారు. షాపుల్లోనూ పేవ్ మెంట్లమీదా ముమ్మరంగా వ్యాపారం జరుగుతున్నది. కాని...కొళందవేలు ముందున్న కళాఖండాన్ని కాస్త నెమ్మదిగా చూసినవారే లేరు.

కొళందవేలు ఆవులించి చేతివ్రేళ్ళు విరుచుకున్నాడు. నోరంతా వగరుగా అరుచిగా వుంది. మనసంతా దూరంగా గుడిసెలో నీరసంగా పడివున్న మీనాక్షి మీదేవుంది. మీనాక్షి...అయిదేళ్ళ క్రిందట ఎలాగుం డేది? బ్రహ్మదేవుడు తీరిగ్గా కూర్చుని, మనసుపెట్టి, శ్రద్ధగా చెక్కిన శిల్పంలాగుండేది. చామనచాయ అయితేనేం... కనుముక్కు తీరు మహా అందంగా ఉండేది. ఆమె నవ్వితే బుగ్గన అందంగా సుడిపడేది. ఆమె మనసెంత మంచిదని? తమవి ఇరుగు పొరుగు యిళ్లు. మీనాక్షికి తల్లి

లేదు. తండ్రి సవతి తల్లిని తెచ్చాడు. ఆమె మీనాక్షిని వేపుకుతినేది. ఆ తర్వాత ఆమె తండ్రి చెట్టు నరుకుతూ దాని కిందనే పడి చనిపోయాడు. మారుటి తల్లిని పుట్టింటివారు తీసుకుపోయారు. మీనాక్షి దిక్కులేనిదై పోయింది. అప్పుడు కొళందవేలు తల్లి ఆ పిల్లను కరుణతో చేరదీసి కోడలిగా చేసుకుని కడుపులో పెట్టుకుని ఆదరించింది. తర్వాత ఎంతో కాలం గడవలేదు. కొళందవేలు తల్లి కూడా పోయింది. ఎక్కడో కోయంబత్తూరు జిల్లాలో మారుమూల ఉన్న ఆ కుగ్రామం శిథిలమై పోయింది. ఎటు వారటు క్షామ బాధ తట్టుకోలేక తోచిన దిక్కుకు వలస వెళ్ళిపోయారు.

కొళందవేలు భార్యతో రైలెక్కి ఆంధ్రదేశపు నడిబొడ్డు చేరుకున్నాడు. ముందు ఊరి మధ్యగా ప్రవహించే కాలువ గట్టున చిన్న పాక అద్దెకు తీసుకుని కాపురం పెట్టాడు. తనకొచ్చిన ఒకే ఒక విద్య బొమ్మలు చేయడం ... అలా అలా కష్టపడి బ్రతుకు వెళ్ళదీస్తూ వచ్చాడు. మీనాక్షికి రెండుసార్లు గర్భం నిలవలేదు. తర్వాత రోజులు మారుతూ వచ్చాయి. పట్టణం పేదవారిమీద పగబట్టినట్టు మారిపోయింది. కాలువ పక్కన గుడిసెలు కాలిపోయాయి. దూరంగా ఎక్కడో చిన్న చిన్న స్థలాలిచ్చామన్నారు. అవి అవసరమైన వారికి దక్కలేదు. కాలం మరీ కఠినమై పోయింది. మీనాక్షి కాలపు కాటు తిన్నదానిలా అయి పోయింది. ఆమె ముఖంలో నవ్వు సకృత్ అయిపోయింది.

కొళందవేలు మళ్ళీ నిట్టూర్చాడు. ఒకామె- ఇరవై అయిదు ఉంటుందేమో వయసు- పేవ్‌మెంట్ పక్కనే నిలబడి బొమ్మ వంక తదేకంగా కళ్ళార్పకుండా చూస్తున్నది. ఉద్యోగిని అయి వుండాలి. చేతిలో ఒక బ్యాగ్ ఉన్నది.

కొళందవేలు ఆశగా తెల్లని పళ్ళన్ని కనబడేట్టు నవ్వుతూ మెరుస్తున్న కళ్ళతో ఆమె వంక చూశాడు.

"ఖరీదెంత?" సన్నని అందమైన కంఠస్వరం...

"యాభై రూపాయలు... ఎంతో కష్టం తల్లీ ఈపని... పదిరోజులు

కష్టపడితే తయారైంది. ముందు గదిలో ఉంచుకుంటే ఇల్లంతా కళకళ లాడిపోతాది. డబ్బుగల తల్లివి... తీసుకో అమ్మా!"

ఆమె పెదవి విరిచింది. ఆ విరవడంలో బొమ్మపట్ల అయిష్టత కంటె, నెలాఖరు రోజుల్లో అంతడబ్బు ఖర్చుపెట్టడమా అన్న మీమాంస, లేక చేతి సంచిలో అంతడబ్బు లేదే అన్న నిరాశ... అన్నీ ద్యోతకం అయాయి.

"నలభై అయిదు కిచ్చేస్తాను. ఎత్తుకుపో అమ్మా"

ఆమె ఆసక్తిగా ఆ బొమ్మవేపే చూస్తూ కదిలి, తర్వాత నెమ్మదిగా నడిచి వెళ్ళిపోయింది. కొళందవేలు ఆశ నిరాశకాగా పేవ్‌మెంట్ క్రిందికి ఉమ్మేసి సర్దుకు కూర్చున్నాడు! మరో నడివయసు వ్యక్తి ధనం వాసన వెదజల్లుతున్నవాడు భార్యవెంట నడవగా వచ్చి నిలబడి చూశాడు. తర్వాత భార్యతో బెంగాలీలోనో గుజరాతీలోనో ఏదో అన్నాడు. ఆమె నవ్వింది. వాళ్ళు వెళ్ళిపోయారు. చీకటిపడింది. లైట్లు ముమ్మరంగా వెలుగులు చిమ్ముతున్నాయి. వీధివీధి అంతా పట్టపగలుకన్నా జ్వాజ్వల్యమానంగా ఉంది.

కొళందవేలు నిరాశతో అటూ యిటూ కదిలాడు. గుండె బరువెక్కి నట్టయింది. ఆకలో లేక మరేమిటో కారణం తెలియదు కాని నీరస భూతం నెత్తికెక్కినట్టున్నది. కళ్ళముందు నీడలు కదులుతున్నాయి. ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నాడు. అదుగో, అప్పుడు వినిపించింది మళ్ళీ ఆ అందమైన కంఠస్వరం... అతడు ఉలికిపడి కళ్ళు తెరిచాడు.

"నలభైరూపాయలిస్తాను..."

కొళందవేలు లేచి నిలబడ్డాడు. ఏదో అనబోయాడు. ఆమె అతన్ని ఏమీ మాట్లాడనివ్వకుండా మళ్ళీ అన్నది.

"నలభైకిస్తే తీసుకుంటాను. లేకపోతే లేదు. సరిగ్గా అంతే ఉంది డబ్బు నా దగ్గర... అసలు బేరమాడేదాన్ని కాదు. కాని... అంతకంటే నాదగ్గర రిక్షా ఖర్చుకు తప్ప డబ్బులేదు..." ఇంత మాట్లాడిందంటే ఆమెకు ఆ బొమ్మ ఎంతగా నచ్చిందో, అసలామె మనసులో ఎంత కళా

దృష్టి అభిజ్ఞత ఉన్నాయో కొళందవేలు అమాయకపు మనసుకు స్ఫురించి అతని కళ్ళవెంట నీళ్లుతిరిగాయి. ఇరవై అయిదు రూపాయల మెటీరి యల్...పదిరోజుల కష్టం...ఇంట్లో అవసరం... మీనాక్షికి కనీసం ఒక సూదిమందు...తిండికి అవసరమైన కొద్దిపాటి వస్తువులు... మళ్ళీ పని చెయ్యడానికి రోజులు గడవాలి కదా... కొళందవేలు కనులు తుడుచుకుని "తీసుకో అమ్మణ్ణీ" అన్నాడు ఎంతో తృప్తిగా.

ఆమె రెండు ఇరవైరూపాయల నోట్లు బ్యాగ్‌లోనుంచి తీసి అతని చేతికిచ్చి "రిక్షాదాకా తీసుకురా" అని ముందుకు నడిచింది.

కొళందవేలు అతి ప్రేమగా పసిబిడ్డను వలె జాగ్రత్తగా బొమ్మ ఎత్తి గుండెలకు హత్తుకుని ఆమెవెంట నడిచి కొద్ది గజాల దూరంలో ఆమె బేరం ఆడిన రిక్షాలో ఉంచి, ఆమె రిక్షాలో ఎక్కి కూర్చోగానే పూడుకు పోతున్న గొంతుకతో "దయగల తల్లివి చల్లగా ఉండాలి"అని గొణిగాడు.

రిక్షా సాగిపోయింది.

కొళందవేలు తేలికపడిన మనసుతో వడివడిగా అడుగులు వేశాడు. ముందు దగ్గరలో కనపడిన హోటల్లోకి వెళ్ళి టీ తాగి ఇరవై రూపా యిల నోటు మార్చి, చిల్లర చొక్కా జేబులో ఉంచుకుని రెండో నోటును భద్రంగా బనీను లోపలివైపు జేబులో జాగ్రత్తచేసి గబగబ నడిచాడు. బొమ్మ అమ్ముడు పోయింది...ఇష్టపడి చల్లనితల్లి కొనుక్కుపోయింది... దాన్ని జాగ్రత్తగా చూసుకుంటుంది. అప్పుడప్పుడు దాన్ని దుమ్ముదులిపి శుభ్రం చేస్తుంది. దాన్ని కొంతకాలం గడిచాక, మోజు తీరిపోయి పాత సామాన్లలో పారెయ్యదు. ఆ యింటికొచ్చిన వారందరూ దాన్నిచూస్తారు. కొందరయినా మెచ్చుకుంటారు. ఎక్కడ కొన్నావని అడుగుతారు. అప్పు డామె పేవ్‌మెంట్‌మీది ఈ నిర్భాగ్య కళాకారుణ్ణి గుర్తుచేసుకుంటుంది. అతడు నడుస్తున్నాడు. పొడవైన రోడ్డు.... పక్కన లైట్లు మందంగా వెలుగుతున్నాయి. దూరంగా రైల్వేగేటు...దాటి మరో రెండు కిలో మీటర్లు నడిస్తే తమ గుడిసెలు...

గేటుదాటి ఫర్లాంగుదూరం నడిచే సరికే చీకట్లు చిక్కబడ్డాయి. దూరం దూరంగా తప్ప లైట్లు లేవు.

అప్పుడు కొళందవేలుకి ఎదురైనాడు ఒక భీకరాకారుడు... ఒడ్డూ పొడుగూ ఉండి ముందు ఉబ్బిన పొట్టమీద తోలుబెల్టు వీధి దీపపు కాంతికి తళతళ మెరుస్తూ ఉండగా, చేతిలో లాఠీతోపాటు రెండు మూడు రకాల పొట్లాలతో, ఎర్రగా వున్న కళ్ళతో...

"ఏరా! ఎక్కణ్ణుంచి ఇంత రాత్రివేళ..." అని గర్జించాడు.

ఆ కంఠస్వరం చిరకాలంగా ఎండకు ఎండి వానకు నాని తుప్పు పట్టిన ఇనుప రేకులను కదిలించినట్లున్నది పూటుగా తాగి వున్నాడేమో మాటలతోపాటు ముక్కలు బద్దలయ్యే వాసన వస్తున్నది.

"బొమ్మలు చేస్తుంటాను దొరా! పిసెంటు రోడ్డులో బొమ్మలమ్ము కుని వస్తుంటాను..."

కొళందవేలు గొంతు అనవసరంగా వొణికింది.

"చాల్లే కబుర్లు...దొంగ రాస్కెల్... బాస్టర్డ్... నా దగ్గరా నీ వేషాలు? సిటీబస్సులోనా? గవర్నర్‌పేట మార్కెట్ దగ్గరా నీ ప్రాక్టీసు? ఎంత కొట్టేశావు? తియ్ జేబులోడబ్బు...వెర్రి వేషాలేస్తే లాక్కుపోయి లాకప్‌లో పడేసి తెల్లారాక గుండు గియిస్తాను. కీళ్ళు వూడగొడతాను... నీలాటి దొంగనాయాళ్ళ మూలంగా జనం బతకడం కష్టమై పోతావుంది. ఇంకా చూసావేం? తియ్ జేబులో డబ్బు ..

కొళందవేలు గుండెలు దడదడలాడాయి. పెద్దపులికి ఎదురుగా నిలబడ్డట్టు నిలువునా కంపించిపోయాడు. చుట్టు పక్కల నర సంచారం లేదు.

"లేదు దొరా! నిజంగా బొమ్మ అమ్ముకొస్తున్నాను. పదిరోజుల కష్టం...అమ్ముకొస్తున్నాను" గొంతులో జీర... తనెందుకిలా వొణికి పోతున్నాడు? మాట ఎందుకు ఇలా తడబడుతున్నది? గొంతు ఎందుకు పోతున్నదెందుకని?

"నీ వాలకం...నీ మాటలు...చూస్తున్నాను...చూస్తున్నాను."

అతని గొంతు భీకరంగా తయారైంది. పొట్లాలొక చేతిలోకి లాఠీ ఒక చేతిలోకి చేరుకున్నాయి.

కొళందవేలు వొణికిపోతూ చొక్కా జేబులో చెయ్యిపెట్టి డబ్బు తీసి "ఇంతే వుంది... కావలిస్తే తీసుకోండి. కానీ మళ్ళీ చెప్తున్నాను నేను దొంగను కాను...ఒకామె నా బొమ్మను కొన్నది..." అన్నాడు.

"ఎవరామె ? ఆమె యిల్లెక్కడ ?"

"తెలీదు, రిక్షా ఎక్కి వెళ్ళిపోయింది."

"అన్నీ వేషాలు ... వెధవా ...సర్లేపో ... అదృష్టవంతుడివి. రాజారాం చేతిలోపడ్డ కేడీగాళ్లెవరూ తప్పించుకోలేదు. సరే...రాసియ్... మళ్ళీ నా కళ్ళబడ్డావో లాక్కుపోయి లాకప్పులో ఏసి కుళ్ళబొడుస్తాను. గుర్తుంచుకో." భీకరాకారుడు కొళందవేలు చేతిలో డబ్బు లాక్కుని సిమెంటు బస్తాలాటి జేబులో కుక్కుకుని తూగుతూ ఊగుతూ గొణు క్కుంటూ వెళ్ళిపోయాడు.

కొళందవేలు కొన్ని క్షణాలు బొమ్మలా నిలబడిపోయి తర్వాత 'థూ' అని నేలమీద ఉమ్మేసి వెనుదిరిగి విసవిసనడవడం ప్రారంభించాడు. చీకటి ఘనీభవించింది. ఆకాశంలో మబ్బులు గుమిగూడాయి. అతడు చేతితో బనీను లోపలి జేబు తడువుకున్నాడు. రెండో అరవైరూపాయల నోటు భద్రంగానే వుంది. కొళందవేలుకు అంత వ్యవధిలోనూ నవ్వు వచ్చింది. పిచ్చివాడిలా నవ్వుకుంటూనే ముందుకు నడిచాడు. ఎత్తయిన కట్ట ఎక్కేసరికి కింద వరసగా భూదేవి శరీరం మీది వ్రణాలలాటి, చీకటి కుప్పలాటి గుడిసెలు కనిపించాయి. అక్కడక్కడ మినుకు మినుకుమంటూ బుడ్డిదీపాలు... బురదతో నిండిన సన్నని దారులు....

పైన మబ్బులు ... ఇప్పుడో మరి కాస్సేపటిలోనో కుంభవృష్టి యసుందనిపించింది

# చిలిపితనం

అంతవరకూ టైపుచేసి అలసిపోయిన వ్రేళ్ళు విరుచుకుని యెడమ చేత్తో ముఖం మీదకి జారుతున్న ముంగురులను సవరించుకుంది. తర్వాత ఆవులించి కుర్చీలో వెనక్కు జారి సుఖంగా సర్దుకు కూర్చున్నది మిస్ భారతి... బి. ఎ. ఆమెకు కుడివైపు పెద్దగదిలో ఉన్నాడు ఆఫీసరు. ఇటీవలే ఇక్కడకు ట్రాన్స్‌ఫర్ మీద వచ్చాడు. నలభై ఏళ్ళు కూడా వుండవు. పొడవుగా, పచ్చగా, అందంగా ఉంటాడు. పలుచని ఫ్రేమున్న కళ్ళద్దాలు కూడా అతని ముఖానికి అందాన్నే ఇచ్చాయి. మాటిమాటికీ మీసాలమీద ఎడమచేతి చూపుడువ్రేలు త్రిప్పుతూ వుంటాడు, ఆ మీసం అక్కడ వుందోలేదో అని అనుమానం వచ్చినవాడిలా. మనిషికి గర్వం వగైరా గుణాల్లేవు గాని స్ట్రిక్ట్. పేరే పవిత్రన్ .... ఇవ్వాళ సెంట్రల్ ఆఫీసునుంచి ఫోన్‌కాల్ రావాలని ఆరు గంటలు దాటుతున్నా వెయిట్ చేస్తున్నాడు. లోపల ఏం చేస్తున్నాడో తెలీదు. బహుశా ఎప్పుడూ చేతిలో వుండే ఆ దిండు లాంటి పుస్తకం నవులుతున్నాడేమో !

స్ప్రింగ్‌డోరు తెరుచుకున్న సవ్వడి వినిపించి గుమ్మం వైపుకు చూసింది భారతి. ప్యూను...కంఠస్వరం తగ్గించి 'నన్ను వెళ్ళమంటారా అమ్మా' అని అడిగాడు.

భారతి ఆవులిస్తూ చెయ్యి గాలిలోవూపి వెళ్ళమన్నట్టు సైగచేసింది. తర్వాత లోలోపల 'నాకెలాగూ తప్పదు శవజాగరణ... నీ కెందుకు కష్టం పో...పో...ఏదైనా రంగుల సినిమాకు పోయి కూర్చో...' అనుకున్నది.

ఆమెకు అంతలో తండ్రి గుర్తుకు వచ్చాడు. ఇప్పుడేం చేస్తున్నాడో? ఉదయం తాను ఆయనతో చాలా కటువుగా ప్రవర్తించింది. ఒక కూతురు

తండ్రిని అనగూడని మాటలెన్నో అన్నది. చాలా నిర్దయగా సాయంకాలం తాను వచ్చేవరకూ బల్లఎక్కి నిలబడమని కసిరింది. ఆయన కళ్ళనీళ్ళు పెట్టుకుని బల్లఎక్కి నిలబడితే మారుమాటాడకుండా వచ్చేసింది. ఆయన గురించి తెలిసీ బజారుకు పంపడం తన తప్పు. మతిస్థిమితం లేని మనుషులకు పనులు చెప్పకూడదు. అసలు జరిగిందేమిటంటే ఉదయం ఆఫీసుకు వెళ్ళే హడావిడిలో వుంది తాను. ఆయన ముందుగదిలో కూర్చుని అనవసరంగా కాగితాలు ముక్కలు ముక్కలుగా చించిపోస్తున్నాడు. తర్వాత పెన్సిలు వెదికి పుచ్చుకుని ఒక్కొక్క కాగితంముక్క మీద ఒక్కొక్క అంకెవేస్తూ కూర్చున్నాడు. ఆయనకు పిచ్చి అంటారందరూ...కాని అదేమీ ప్రమాదకరమైన పిచ్చికాదు. కాస్త చిత్తచాంచల్యం ...అది చాలాఏళ్ళుగావుంది. ఎవరికీ ఏ ఇబ్బందీ కలిగించడు. తన ప్రపంచంలో తానుంటాడు. ఎప్పుడూ ఏదో గొణుక్కుంటూఉంటాడు. ఉదయం వంట హడావిడిలో తాను ఆయనకు అయిదు రూపాయల నోటు ఇచ్చి వీధి చివర కొట్లో కూర, ఏదైనా సరే, ఒక పావుకిలో పట్టుకు రమ్మంది. ఆయన తనకూతురు పని చెప్పిందనే ఉత్సాహంలో లేచి ఏదైనాసరేనా... "బంగాళా దుంపలయినా... వంకాయలయినా...?' అని అడిగాడు నోటు అందుకుని.

"ఏదైనాసరే...త్వరగా...పట్టుకురా' అన్నది ఆమె. ఆయన అయిదు నిముషాల్లో తిరిగివచ్చాడు. చేతిలో నిలువెత్తు పొడవున్న సేఫ్టీపిన్నుల దండలతో...వచ్చి నివ్వెరపోయి నిలుచున్న కూతురితో 'వీధిలో ఇవి అమ్ముతున్నాడొకడు. మొత్తం ఎంతకిస్తావని అడిగితే ఆరు రూపాయలవుతాయన్నాడు...అయిదే ఇస్తానన్నాను. సరే అని ఇచ్చాడు. మొత్తం అయిదొందలుంటాయి. చీప్‌కదూ...'అన్నాడు. ఇంకా ఆయన ధోరణి అలాకొనసాగేదే...కాని ఆమె గయ్యిమని లేచింది. అరిచింది... తిట్టింది. చివరకు 'నువ్వింకా బ్రతికుండి నా ప్రాణాలు తీస్తున్నావు' అని కూడా అన్నది.

అవును—తాను ఆ మాటకూడా అన్నది. చివరకు తాను వచ్చేవరకూ బల్లమీద నుంచోమన్నది. ఆయన గడగడలాడుతూ బల్లఎక్కి

తప్పు చేసిన పిల్లవాడిలా తలవంచుకు నిలబడ్డాడు. రాసు ఆఫీసుకు వచ్చేసింది. మధ్యాహ్నం లంచ్ టైములో కానేదోతిన్నది. పాపం ఆయన— ఏం చేస్తున్నాడో— ఇంకా అలాగే బల్లమీద నిలబడి ఉన్నాడేమో! ఈ ఊహ రాగానే ఆమె గుండెలు కలవరించాయి.

నిజానికి ఈ లోకంలో పిచ్చివాళ్ళు కానిదెవరు? ఇంకా ఇతరులలో పోలిస్తే తన తండ్రి చాలా నయం. ఎక్కువ మందికి డబ్బుపిచ్చి—కొంత మందికి మతపిచ్చి—కొంతమందికి అధికారపిచ్చి—

మళ్ళీ స్ప్రింగ్ డోరు కొద్దిగా కదిలింది. పూర్తిగా తెరుచుకోలేదు. ని దాని కిందనుంచి దూరి లోపలికి వచ్చిందొక ఆర్తి— ఆరేళ్ళుంటా యేమో—

భారతి కళ్ళు పెద్దవి చేసుకుని చూసింది.

రబ్బరు బొమ్మలాటి అందమైన ఆడపిల్ల— కనకాంబరం రంగు ఫ్రాక్ వేసుకుని ఉంది. చెవులకు రింగులు, కాళ్ళకుసాండల్స్—గోళ్ళకు రంగు—లోపలికి వస్తూనే ఎదురుగా వున్న భారతివైపు చూసింది చక్రల్లాటి కళ్ళతో.

"ఎవరమ్మాయీ నువ్వు? ఏం కావాలి?" అని అడిగింది భారతి.

"ఏమీలేదు. బయట వర్షం—పెద్ద వర్షం—"

భారతి ఆశ్చర్యపోయింది. తన ఆలోచనల్లో తానుండి వర్షంపడటం కూడా గమనించలేదు. అయినా అంత భవంతిలో లోపల ఈ ఆఫీసులో ఎలా తెలుస్తుంది ?

"మరి—కింద ఎక్కడో నిలబడక ఇంత లోపలికి వచ్చావేం ?"

"ఊరికినే—" అన్నదా పిల్ల.

"సరే ఇలా వచ్చి కూర్చో—"

నెమ్మదిగా నడిచివచ్చి భారతి ఎదురుగా కూర్చీలో ఎగిరి కూర్చుంది.

భారతికి ఆ వాలకం నవ్వు తెప్పించింది.

"నీ పేరు ?"

"అరవింద... అరవిందమణి...'

"ఏం చదువుతున్నావు?"

రెండువేళ్ళు చూపించింది.

భారతికి చిరాకనిపించింది. బాస్ గదివైపు చూసింది. ఆ ఫోన్ ఎప్పుడు వస్తుందో... తనకు విడుదల ఎప్పుడో?

ఈ ఆఫీసరుకు ముందు నెలరోజుల క్రిందటి వరకూ మరొక ముసలాయన ఉండేవాడు. మెతక మనిషి. ఎవరే అబద్ధం చెప్పినా తేలిగ్గా నమ్మేసేవాడు. ఇప్పుడు రిటైరైపోయాడు.

ఒకరోజు... ఆ ఆఫీసులో కొత్తగా అప్పాయింట్ అయి వచ్చిన యువకుడు నేరుగా ఆమె దగ్గరికే వచ్చి తాను వచ్చిన పని చెప్పాడు. 'ఆఫీసరుగారిని కలవండి...ఇటు...' అని చెప్పి భారతి సరదాగా అన్నట్టు "ఒక విషయం వినిపొండి...మీరు కొత్తకదా... లోపల ఆయనతో కాస్త— కాస్త ఏం...బాగానే దిగ్గరగా మాట్లాడండి. ఎందుకంటే ఆయనకు ఘోరమైన చెవుడు..." అన్నది.

అతడు నవ్వి "అలాగా, మంచిదయింది మీరు చెప్పడం. లేకపోతే చిక్కులో పడేవాణ్ణి." అని లోపలికి వెళ్ళాడు.

లోపల అతను పెద్దగా అరిచినట్లు మాట్లాడటం... ఆఫీసరుగారు నెమ్మదిగా 'ఎందుకలా పెద్దగా మాట్లాడతారు...? స్సాఫ్ట్...' అని పదే పదే అనేదం ఒక ప్రహసనంలా ఆనందించారంచరూ...అయిదునిముషాల తర్వాత ఆ యువకుడు బయటకు వచ్చి భారతి వంక భయంకరంగా క్రూరంగాచూస్తూ వెళ్ళిపోయాడు. అయితే అదృష్టవశాత్తు అతన్ని మరో బ్రాంచిలో పోస్టు చేశారు. భారతి బతికిపోయింది.

తనకు ఇది చిన్నప్పటి నుంచీ అలవాటే. కాలేజీలో అమాయకంగా కనిపించే పిల్లలను ఏడిపించేది. అన్నింటికన్నా అన్యాయం ఒకసారి జరిగింది. తనకప్పుడు పదిహేనేళ్ళు ఉంటాయేమో. వీధి అరుగుమీద కూర్చుని వుంటే జట్కాబండి వీధిలో ఆపి 'సింగరాజు వారిల్లేది తల్లీ...' అని అడిగిందొకామె తల బయటికిపెట్టి. 'కొత్తగా యిల్లుకొన్నారు...' అని వివరంగా కూడా చెప్పింది.

"అదుగో...ఆ దూరంగా కనిపించే మేడ... కాని ఆయన నిన్న రాత్రి చచ్చిపోయాడు. గుండెజబ్బు—" అన్నది భారతి.

ఆమె మతిపోయినట్టు చూసి అంతలో గుండెలు బాదుకుంటూ ఏడుపు ప్రారంభించింది. భారతి ఆ బండిని షాతో అయి వెళ్ళింది. దారి పొడుగునా ఆ వయసు మళ్ళినావిడ ఏడుస్తూనే వుంది. జట్కా దిగి పక్కతలుపు తోసుకుని లోపలికి శోకాలుపెడుతూ వెళ్ళింది ఆమె. భారతి గోడచాటున నక్కి నిలుచుంది. వరండాలో ఎదురైన అల్లుణ్ణి చూసి ఆమె కొయ్యబారిపోయింది. ఏడుపులు పెడబొబ్బలతో లోపలికి వస్తున్న అత్తగారిని చూసి ఆయన 'ఏమిటి...ఏమిటి...' అంటూ అరిగిపోయిన రికార్డులాగా కంగారుపడ్డాడు.

భారతి ఆపులించి 'నీపేరు...బావుంది అరవిందమణి...అన్నట్టు నీకు రాక్షసులెలా వుంటారో తెలుసా?' అని అడిగింది.

ఆ అమ్మాయి కళ్ళు పెద్దవి చేసి తల అడ్డంగా వూపుతూ 'తెలీదు' అన్నది.

"తెలీదూ..."

భారతి అనవసరంగా నిట్టూర్చింది. తల్లి దండ్రులకు తానొక్కతే కూతురు. తాను పుట్టిన వెంటనే తల్లి పోయింది. తండ్రి కొన్నేళ్ళపాటు మామూలుగానే ఉన్నాడు. ఇదుగో, ఇటీవల అయిదారేళ్ళుగా చిత్త చాంచల్యం పట్టుకుంది. పసిపిల్లాడిలా ప్రవర్తిస్తాడు. తనకేమో ఈచాకిరీ తప్పదు. పెళ్ళి ఇంతలో అయ్యేట్టులేదు. వేలకువేలు కట్నం కుమ్మరించాలి. అది జరిగేపనికాదు. తనజీతం కాస్త కంటికి ఆనేదైతే ఎవరన్నా ముందుకు వచ్చి వుందురేమో! కానీ తనది గొర్రెతోక జీతం... ఇక అందం... అదెందుకు? కొరుక్కుతింటామా? అనుకుంటారు.

భారతి మళ్ళీ 'వర్షం తగ్గిందేమో...' అన్నది.

ఆ పిల్ల మాట్లాడలేదు.

భారతికి 'ఊరికే ఇలా కూర్చోడం బోర్... ఏదైనా చెయ్యాలి...' అనిపించింది.

ఉన్నట్టుండి 'నువ్వెప్పుడూ రాక్షసుడ్ని చూశ్చేదా ? లావుగా, ఎత్తుగా, నల్లగా...భయంకరంగా వుంటారు రాక్షసులు..ఇంతంత పొడుగు పళ్ళూ...ఇంత పొట్టా ...మెళ్ళో ఎముకల దండలు...' అన్నది.

ఆ పిల్ల బిక్కు బిక్కుమంటూ 'కథల్లో సినిమాల్లో వుంటారు...' అన్నది.

'నీకు రాక్షసుణ్ణి చూడాలనివుందా ?'

ఆ పిల్ల ఏమీ మాట్లాడలేదు.

"నీకు ఇప్పుడే చూపిస్తాను కావాలంటే .. అయితే చూసి వెంటనే వెళ్ళిపోవాలి."

"ఇదిగో...ఈ గది లోపల ఉంటాడు. మూడు రోజుల క్రిందట అడవుల్లో దొరికితే పట్టుకొచ్చి కట్టి పడేశారు .. ఏమీ చెయ్యడు... నీకేం భయం లేదు తొంగిచూసి పరుగెత్తుకొచ్చేసెయ్ .."

ఆ పిల్ల భయపడుతుందనుకుంది భారతి. 'బాబోయ్ నేను చూడను' అని పారిపోతుందనుకుంది.

కాని ఆ పిల్ల కుర్చీదిగింది. నెమ్మదిగా అడుగులువేస్తూ వెళ్ళి ఎదురు గది ముందు ఆగి భారతి వంక చూసింది. తర్వాత తలుపు తోసుకుని లోపలికి వెళ్ళింది. తలుపు వెంటనే మూసుకుంది.

ఒకటి...రెండు...మూడు... క్షణాలు దొర్లిపోతున్నాయి.

భారతికి కంగారు పుట్టింది. కుర్చీలో నిప్పులున్నట్టుగా ఫీలవ సాగింది. లోపలి నుంచీ ఏమీ వినిపించడంలేదు. ఈయన ఆఫీసరుగా రాగానే చేయించిన మొదటి పని అది. రూమంతా సౌండ్ ప్రూఫ్ చేయించు కున్నాడు.

భారతి లేవబోయింది.

అంతలో ఆఫీసరు గది తలుపు తెరుచుకొంది. పవిత్రన్ వస్తున్నాడు. ఆ పిల్ల ఆయన చంకలో ఉంది.

అతడు నేరుగా భారతి దగ్గరికే వచ్చాడు. ఆమె ఒళ్లముందు ఆగి 'ఫోన్ వచ్చింది మనం వెళ్ళవచ్చు' అన్నాడు.

"పప్పా ఈమె ఎవరు" అన్నది పిల్ల.

"వారి పేరు భారతి...స్టెనో... నమస్తే చెప్పు" అన్నాడాయన.

"నమస్తే..." అన్నది అరవిందమణి.

"మా అమ్మాయి...ఏకైక పుత్రిక...అల్లరిపిల్ల... మా మిసెస్ కూడా వచ్చిందట. షైట బల్లమీద వెయిట్ చేస్తున్నది."

ఆయన మళ్ళీ "చాలా కథలు చెప్పినట్టున్నారే ఇంతసేపూ... రాక్షసులూ...వగైరా..." అన్నాడు నవుస్తూ.

భారతి కంగారుగా "అబ్బే... ఏం తోచక... ఏదో వాగాను" అన్నది.

పవిత్రస్ భార్య అక్కడే పచార్లు చేస్తున్నది. ఆయన ఆడవాళ్ళిద్దరికీ పరిచయాలు పూర్తిచేసి ముందుకు నడిచాడు. ఆమె భారతివంక అదోరకంగా చూస్తూ ముందుకునడిచి అతని పక్కనే నడుస్తూ ఏదో అన్నది. ఆయన నవ్వాడు.

భారతి నీరసంగా నెమ్మదిగా అడుగులు వేస్తున్నది. అన్ని అంతస్థులూ నడిచి క్రిందకి వచ్చింది. ఎదురుగానే బస్సుస్టాపు. అక్కడికి వెళ్ళి నిలబడి 'వర్షం తగ్గి ఎంతసేపయిందో...' అన్నది పక్కావిడకు వినిపించేట్టుగా.

ఆమె మతి పోయినట్టుచూస్తూ 'వర్షమా? కలగన్నారా ఏమిటి?' అన్నది.

"వర్షం పడలేదూ?' అన్నది మళ్ళీ భారతి.

"చుక్కయినా పడలేదు... అయినా ఇప్పుడేం వర్షం?" అన్నదావిడ మళ్ళీ.

భారతి నీరసంగా ఇంటికి చేరుకుని ముందు గదిలో లైటువేసింది.

ఎదురుగా బల్లమీద ఆమె తండ్రి ఇంకా అలా నిలబడే వున్నాడు.

ఆమెకు కన్నీళ్ళుబికి వచ్చాయి.

# చుక్కమ్మ కథ

"మంచినీళ్ళు."

బొంగురు గొంతు వినిపించి సుబ్రమణి వెనుదిరిగి చూశాడు. లోపల తడికె పక్కగా ఉన్న స్టూలుమీద కదలకుండా మెదలకుండా చాలా సేపటినుంచీ కూర్చుని ఉన్నాడా వ్యక్తి. సన్నగా, పొడవుగా ఉన్నాడు. గడ్డం మాసి ఉంది. కళ్ళకు పాత ఫ్రేముగల జోడు ఉంది. పొట్టిచేతుల చొక్కా భుజంమీద చిరిగి ఉంది. కట్టుకున్న పంచె మాసి ఉంది. కళ్లు లోతుకు పీక్కుపోయి ఎక్కడో చూస్తున్నట్టున్నాయి. తెల్లవారుతూ ఉండగా టీ దుకాణంలోకి వచ్చాడు ఆ వ్యక్తి.

వచ్చీరాగానే చుక్కమ్మను పలుకరించాడు. ఆమె తలఎత్తి అతన్ని చూసింది గాని, ఏమీ మాట్లాడినట్టు లేదు. అంతే... అప్పుడు వెళ్ళి ఆ అవిటి స్టూలుమీద కూర్చున్న ఆ మానవుడు కదలలేదు. మెదలలేదు. ఉండి ఉండి గల్లా దగ్గర కూర్చున్న చుక్కమ్మ వైపు చూపులు సారిస్తున్నాడు. చుక్కమ్మ మాత్రం తన పని తాను చూసుకుంటున్నది. టీ కోసం వచ్చేవారు, టీ తాగి వెళ్లేవారు—— అంతా ఒక మోస్తరు హడావిడి....చుక్కమ్మ ఇప్పుడు సుబ్రమణి వంక చూసింది. ఆ వ్యక్తిని చూపుతూ 'నీళ్ళివ్వు...తరువాత టీ ఇవ్వు' అన్నది.

సుబ్రమణి ముందు మంచినీళ్ళ గ్లాసు తీసుకువెళ్ళి అతనికి అందించాడు. ఆ వ్యక్తి నీళ్లు తాగిన తరువాత గ్లాసు క్రిందపెట్టి "టీ వొద్దు——" అన్నాడు. తర్వాత జేబులోనుంచి బీడీతీసి నోట్లో ఉంచుకుని అగ్గిపుల్ల గీసి వెలిగించుకునేందుకు ప్రయత్నించాడు. చేతివ్రేళ్లు సన్నగా వణుకుతున్నందువల్ల మూడు పుల్లలు గీచాక గాని బీడీ వెలగలేదు. ఆ తర్వాత ఒక్కసారి పొగ పీల్చిన వెంటనే దగ్గు వచ్చింది. అరచేత్తో

గుండె చద్దుకున్నాడు. ఆ తర్వాత తేరుకుని అలాగే కూర్చుండిపోయాడు.

చుక్కమ్మ హడావిడిగా ఉంది. ఉదయం వేళ...వచ్చేలారీలు... పోయే లారీలు....బస్సులు.

స్టౌమీద నీళ్లు మరుగుతున్నాయి. సుబ్రమణి రెండు చేతులా పని చేస్తున్నాడు. పాకముందు ఉన్న పొడవాటి చెక్క బల్లలమీద కూర్చుని టీ తాగుతున్నారు కొందరు...కబుర్లు చెప్పుకుంటున్నారు.

పక్కనే కొంచెం దూరంలో నిద్ర గన్నేరు చెట్టు...ఎప్పటిదో... పెద్ద గొడుగులాగా వ్యాపించి ఉంది. ఎదురుగా కొండల మధ్య ఆకాశంలో సూర్యుడు మందంగా వెలుగుతున్నాడు. పైన మబ్బులు కమ్ముకొస్తున్నాయి. చల్లనిగాలి వీస్తున్నది.

చుక్కమ్మ పాత సొరుగుల బల్ల వెనుక స్టూలుమీద కూర్చుని ఉండి ఒక్కసారి ఆ వ్యక్తివైపు చూసి మళ్ళీ అంతలోనే చూపులు తిప్పుకున్నది.

సుబ్రమణి టీలు అందిస్తూ హడావిడిగా ఉన్నాడు. అతనికి ఒక కాలు అవుడు. కాలు ఎత్తి ఎత్తి వేస్తూ నడుస్తున్నాడు.

అంతలో ఒక లారీ డ్రయివరు రోడ్డు పక్కగా లారీ ఆపి, క్లీనరుతో సహా వచ్చి 'రేయ్ కుంటోడా ! టీ చెయ్యి.... స్పెషల్' అన్నాడు.

సుబ్రమణికి కోపం వచ్చింది. మొహం ఎర్రబడింది. నుదుటిమీద పడుతున్న వెంట్రుకలు వెనక్కు తోసుకుని ఏమీ మాట్లాడకుండా టీ కలపడంలో నిమగ్నుడైనాడు.

కాని చుక్కమ్మ ఊరుకోలేదు. కస్సుమని లేచింది. "ఏమయ్యా ! ఎందుకట్టా అనవసరంగా నోరు పారేసుకుంటావు ?" అన్నది.

అతడు అనవసరంగా నవ్వుతూ "నేనేమన్నాను చుక్కమ్మా ! ఎందుకంత కోపం నీకు ?" అన్నాడు.

చుక్కమ్మ ఎర్రబడ్డ కళ్ళతో చూస్తూ "ఏమీ అనలేదా ? ఛీ.... సిగ్గులేని మనుషులు..." అన్నది.

లారీ డ్రయివరు జంకాడు... ఏదో గొణుగుతూ సుబ్రమణి ఇచ్చిన టీ అందుకుని నెమ్మదిగా తాగుతూ కూర్చుండిపోయాడు.

సుబ్రమణి లోలోపల ఉడికిపోతున్నాడు. కోపంతో మొహం జేవురించి ఉంది. తల వంచుకుని నిలబడి ఉన్నాడు.

లోపలి స్టూలుమీది వ్యక్తి మళ్ళీ 'మంచినీళ్లు' అన్నాడు బొంగురు గొంతుకతో. ఈసారి చుక్కమ్మ లేచింది. వెళ్ళి మంచినీళ్లు అందించి అతడు తాగినంతసేపూ ఎదురుగా నిలబడి ఉండి, ఆ తర్వాత గ్లాసు అందుకుని, 'ఊఁ! ఏమిటి సంగతి?' అని మాత్రం అడిగింది.

అతడు వెంటనే ఏమీ మాట్లాడలేదు. అంతలో ఎందుకో ఒకసారి తల దించుకున్నాడు. మళ్ళీ సందేహిస్తున్నవాడిలా నెమ్మదిగా తల ఎత్తి చూసి లోగొంతుకతో 'ఏమీలేదు. ఊరికే చూసిపోదామని...' అన్నాడు.

చుక్కమ్మ చిరాకుతో 'బేరం టైము... చూశావుగా? ఇంకా ఎందుకిక్కడ కూర్చోడం? టీ ఇమ్మన్నాను. తాగి వెళ్ళిపోవచ్చు...' అన్నది.

అతడు హడావిడి పడుతూ గొంతు సర్దుకున్నాడు. 'వొద్దు... వొద్దు... నీతో ఒక్క క్షణం మాట్లాడాలి...'

చుక్కమ్మ మళ్ళీ చిరాగ్గా 'ఏముంది మాట్లాడేందుకు? ఇంకా ఏం మిగిలి ఉంది మనిద్దరి మధ్య?' అన్నది, నెమ్మదిగానే అయినా తీవ్రంగా. వాళ్ళ మాటలు సుబ్రమణికి వినబడుతూనే ఉన్నాయి. పాక బయటి వారికి వినిపించే అవకాశంలేదు. అక్కడ బల్లలమీద కూర్చున్నవారు ఎవరి గొడవలో వారున్నారు. లారీలు...ట్రిప్పులు...ప్రమాదాలు.... రూట్లు.... లోడు... వీటిపైన కబుర్లు సాగుతున్నాయి. సుబ్రమణి వచ్చిన వారికి టీ అందిస్తూనే ఒక చెవి ఇటు పడేసి ఉంచాడు.

ఆ వ్యక్తి గొంతు వణుకుతున్నది. 'లేదు....నామాట ఒక్క క్షణం విను...నీకు కోపంగా ఉందని నాకు తెలుసు... అయినా నా పరిస్థితి...' అంటున్నాడు.

'నీ పరిస్థితికేం? నిక్షేపంగా ఉంటుంది... నా బతుకంతా నాశనం చేశావు. బంగారంలాటి నా కొడుకును పొట్టన బెట్టుకున్నావు' అని మొదలుపెట్టింది చుక్కమ్మ కసిగా.

'కలిసి ఉన్నన్నాళ్ళూ నన్ను కాల్చుకుతిన్నావు. ఆ మహాతల్లి మా అత్తగారు చచ్చి ఏలోకాన ఉన్నదో ఆమె బతికుండగా మాత్రం కొంచెం సుఖపడ్డాను. ఆమె పోయింది... నీకు అడ్డులేకుండా పోయింది. నన్ను మనిషిలాగ ఎన్నడైనా చూశావా? ఎన్ని హింసలు పెట్టావు? చివరకు జంతువులాగా కన్నబిడ్డను పొట్టనబెట్టుకున్నావు. అదృష్టమంతుడివి.... మంచిదాన్ని గనక వొదిలేశాను. లేకపోతే కేసుచేసి నీ అంతు చూసే దాన్ని...'

చుక్కమ్మ కళ్లు నీళ్ళతో నిండుతున్నాయి. గొంతు వణుకుతున్నది. అయినా మాట్లాడుతూనే ఉంది.

'ఇప్పుడు మాత్రం నీకేం? నా పీడా విరగడైపోయింది. మళ్ళీ మరో అమాయకురాల్ని కట్టుకుని దానికి నరకం చూపిస్తున్నావు. అన్నట్టు కట్నం కూడా తీసుకున్నావా? ఏమాత్రం తీసుకున్నావేం? అవున్లే... పెళ్ళికాని ఆడపిల్లలు కోల్లలు. వాళ్ళని వొదిలించుకోడానికి మగపురుగు దొరికితే చాలని చూస్తారు పెద్దవాళ్ళు. నీలాంటి మగ జంతువులు దొరికితే చాలు వాళ్ళకి.... ఆడపిల్లలు ఎట్లాచస్తే మాత్రం ఏమి?...'

ఆ వ్యక్తి మాటి మాటికీ తల ఊపుతూ ఏదో చెప్పాలని ప్రయత్నిస్తూనే ఉన్నాడు. కాని చుక్కమ్మ అతనికి ఆ అవకాశం ఇవ్వలేదు. చివరికి అతడు అరచేత్తో నుదురు బాదుకున్నాడు.

ఆ చప్పుడు విని సుబ్రమణి వెనుదిరిగి చూశాడు. చుక్కమ్మ ఉన్నట్టుండి చుట్టూ చూసి కదిలింది, 'టీ ఇప్పిస్తాను... తాగి పో...' అంటూ.

ఆ వ్యక్తి హఠాత్తుగా ఆమె చెయ్యి పట్టుకుని 'నీకు దణ్ణం పెడతాను... ఒక్క క్షణం నన్ను మాట్లాడనివ్వు...' అన్నాడు.

చుక్కమ్మ పురుగు పాకుతున్నట్టు చివాలున చెయ్యి విదిలించుకుని, 'సుబ్రమణీ! ఒక టీ పట్టుకురా!' అని అక్కడే నిలబడింది.

సుబ్రమణి వెంటనే టీ తెచ్చి అందించాడు.

అతడు దాన్ని అందుకుని స్టూలు పక్కనే నేలమీద ఉంచి వణుకు

తున్న వ్రేళ్ళ జేబులో ఉంచి మరో బీడీ ఇవతలికి తీశాడు. దాన్ని వ్రేళ్ళ మధ్య ఉంచుకున్నాడే తప్ప కాల్చలేదు.

చుక్కమ్మ కను తుదలు తుడుచుకుని అక్కడే కొన్ని క్షణాల నిలబడింది. ముఖం కందగడ్డలా ఉన్నా తెచ్చికోలు నవ్వుతో సుబ్రమణి వంక చూసింది.

సుబ్రమణి ఆ వ్యక్తి వంక చూశాడు. అతడిలో కదలిక లేదు. జేవురించిన ముఖంతో శూన్యంలోకి చూస్తున్న వాడిలా, శిలా ప్రతిమలా కూర్చుని ఉన్నాడు.

చుక్కమ్మ కదిలి రాబోయింది.

ఆ వ్యక్తి నెమ్మదిగా 'చూడు...ఒక్క నిముషం నిలబడు... నేను చెప్పేది విను... నేను పాపాత్ముణ్ణి... ఇప్పుడు ఇబ్బడి ముబ్బడిగా అనుభవిస్తున్నాను' అంటూ గొంతు పూడుకుపోగా ఆగిపోయాడు.

'ఏం? ఏమయింది?' అన్నది చుక్కమ్మ వ్యంగ్యంగా కటువుగా.

'అది...రాక్షసి—చిత్రవధ అనుభవిస్తున్నాను— దాని తల్లీ, అన్నా చేరారు. ఇల్లూ వాకిలీ అన్నీ పోయాయి. ఉద్యోగం పోయింది. ఇక ఏమీ మిగిలిలేదు. అంతా నేనే చేతులారా చేసుకున్నాను. ఇంక—'

చుక్కమ్మ అడ్డు తగిలింది. 'ఇక ఇక్కడ దిగబడిపోదామని వచ్చావు. అదేమీ కుదరదు. ఇక నీలాటి వాడికి మిగిలిందొకటే తోవ—' ఆమె కంఠస్వరం కటువుగా కరకుగా మారింది. ఒక్క క్షణం ఆగి కసిగా 'ఇక మిగిలిందొకటే తోవ— అలవాటైన విద్యే— దోపిడీలు మొదలుపెట్టు— దేశాలు పట్టి తిరుగు— నీకేం? హత్యలుచేసి కూడా బ్రతగ్గలవు—' అన్నది.

అతడు తల వంచుకున్నాడు. నేల చూపులు చూస్తూ చేతి వేళ్ళ మధ్య బీడీ నలుపుతూ కూర్చున్నాడు.

చుక్కమ్మ ఆ మాటలు పూర్తిచేసి చివాలున కదిలి ఇవతలికి వచ్చి పాత బల్ల వెనుక స్టూలుమీద కూలబడింది. క్షణాల్లో ముఖకవళికలు మార్చివేసింది.

క్రమంగా బయట మబ్బులు చిక్కబడుతున్నాయి. ఉండి ఉండి 'కురుస్తాం—కురుస్తాం—' అని గర్జిస్తున్నాయి. అవతల హైరోడ్డుమీద లారీలు, బస్సులు 'రివ్వురివ్వున' వెళ్ళిపోతున్నాయి. పట్నంలో బస్‌స్టాండు రెండు మైళ్ళ ధూరం ఉంటుంది.

క్రమంగా టీ దుకాణం దగ్గర బేరం తగ్గింది.

చుక్కమ్మ సొరుగు లాగి డబ్బు లెక్కపెట్టుకుంటున్నది. సుబ్రమణి ఆమె పలుచని వేళ్ళవంకనే చూస్తున్నాడు.

అంతలో ఎవరో తరుముకుని వచ్చినట్టు దడదడమని పెద్ద పెద్ద చినుకులు ముందు పడ్డాయి. అంతలో తగ్గాయి. ఆ తర్వాత రెండు, మూడు క్షణాల్లో చప్పుడు చేస్తూ వర్షం పడటం ప్రారంభించింది. తాటాకుల చివళ్ళనుంచి నీళ్ళు ధారగా పడుతున్నాయి.

చుక్కమ్మ సొరుగుమూసి 'ఈ దొంగచచ్చినోడు రాలేదు—' అనుకున్నది.

సుబ్రమణికి నవ్వు వచ్చింది. కాని పైకి నవ్వలేదు. పక్కకు తిరిగి వర్షపు చినుకుల వంక చూస్తూ ఉండిపోయాడు.

ఆనాడూ ఇలాగే వర్షం. ఇప్పటికి సంవత్సరం దాటిపోయింది. తాను దిక్కూమొక్కూ లేక ఎక్కడో తమిళనాడు మారుమూల నుంచి రైలెక్కి వచ్చాడు. టిక్కెట్టు లేనివాళ్ళను టి.సి. లు పట్టుకుంటూ ఉంటే పసిగట్టి, చివరి పెట్టెలో నుంచి వేగం తగ్గిన అదను చూసి క్రిందికి దూకేశాడు. చుట్టూ చూస్తే అంతా కొత్తదేశం—ఊళ్ళోకివచ్చి నడవటం మొదలుపెట్టాడు. ఏది ఏమిటో తెలియదు. భాష రాదు. జేబులో ఉన్నవి కాసిని చిల్లరనోట్లు మాత్రం. ఒక హోటల్లో కడుపు నింపుకుని తోచిన దిక్కుగా నడవడం సాగించాడు. ఊరు వెనకబడింది. నడుస్తూనే ఉన్నాడు. అంతలో ప్రమాదం జరిగిపోయింది. రివ్వున దూసుకు వచ్చిన లారీ అతన్ని పక్కకు కొట్టేసి, ఆగకుండా వెళ్ళిపోయింది. తాను విసిరేసినట్టు దూరంగా పడిపోయాడు. వెంటనే లేద్దామనుకున్నాడు కాని లేవలేకపోయాడు. తన కంతవరకే తెలుసు. ఆ తర్వాత ఏం జరిగిందో తెలి

యదు. ఎదురుగా టీ దుకాణం. దేవతలా చుక్కమ్మ తనను రక్షించింది. పదిహేను రోజులు కాబోలు ఆస్పత్రిలో ఉండి ఈ లోకంలో పడ్డాడు. అవిటి కాలితో. తర్వాత ఎక్కడికీ పోలేదు. ఇదే లోకమైపోయింది. తనకు వచ్చిన ఒకే ఒక విద్య తనకు ఆధారమైంది. సుబ్రమణి ఉలిక్కిపడి చూశాడు.

ఉదయం నుంచీ లోపల కూర్చున్న వ్యక్తి ఎప్పుడు లేచివచ్చాడో ఏమో, చుక్కమ్మకు ఎదురుగా నిలబడి పెద్దగా అరుస్తున్నాడు. చుక్కమ్మ అంతకంటే గట్టిగా అరుస్తున్నది.

ఆ వ్యక్తి అంతలో తల ఊపి ఏమనుకున్నాడో ఏమో, విసవిస నడిచి బయటికి వర్షంలోకి వెళ్ళిపోయాడు.

పలుచని చినుకుల తెరల మధ్య ఆ వ్యక్తి కొన్ని క్షణాల్లో అదృశ్యమైపోయాడు.

సుబ్రమణి చుక్కమ్మ వంక చూశాడు.

ఆ ముఖం ఇప్పుడు తేటగా ఉంది. సుబ్రమణిని చూసి నవ్వింది. అతి సహజమైన సుఖప్రదమైన నవ్వు—సుబ్రమణి నివ్వెరపోయాడు. చుక్కమ్మ నెమ్మదిగా 'శని వొదిలి విరగడైపోయింది' అన్నది. ఆ తర్వాత మళ్ళీ 'సుబ్రమణీ! మంచి టీ చెయ్యి—మనిద్దరికీ' అన్నది. అతి మెత్తని కంఠస్వరంతో.

'ఆ తర్వాత ఈ దొంగ చచ్చినోడు రాలేదు చూడు- అన్నది మళ్ళీ. దొంగచచ్చినోడు—రాడు ఇప్పుడప్పుడే రాడు—

ఈపాటికి ఏ సారాదుకాణంలోనో, ఏ క్లబ్బులోనో హుషారుగా ఉండి ఉంటాడు. ఇది మొదటిసారి కాదు. కనీసం నెల కో సారయినా ఇలా జరుగుతూనే ఉంటుంది. చుక్కమ్మ ఎంత జాగ్రత్తగా ఉన్నా లాభం ఉండదు. దొంగచచ్చినోడి పేరు నాగులు— నాగేశ్వరరావు. చుక్కమ్మ కన్నా రెండు, మూడేళ్లు చిన్నవాడు. అంతకు ముందు ఏం చేసేవాడో తెలియదు గాని, చుక్కమ్మ నీడలో చేరిన తర్వాత మాత్రం ఈ సంవత్సర కాలమూ అతడు ఏ పనీ చేయలేదు. అవతల ఉన్న

వసారాలో ఇరవై నాలుగు గంటలూ నవారు మంచంమీద, శేషతల్పం మీది విష్ణుమూర్తిలా పడుకుని ఉంటాడు. పేకడు తినడం, సుబ్రమణిని కాల్చుకు తినడం, తొంగోడం తప్ప మరోటి ఎరగడు. అప్పుడప్పుడు చుక్కమ్మ దాచుకున్న డబ్బు మాయమైపోతూ ఉంటుంది. నాగులు కూడా మాయమైపోతాడు. రెండు, మూడు రోజులు అయిపు లేకుండా పోతాడు. ఆ తర్వాత వొట్టి చేతులతో తిరిగి వచ్చి చుక్కమ్మ పెట్టే చివాట్లన్నీ భోంచేస్తాడు. తర్వాత వాక్చాతుర్యం అంతా ప్రదర్శిస్తాడు. కళ్ళనీళ్ళు పెట్టుకుంటాడు. కాళ్ళు పట్టుకుంటానంటాడు. లెంపలువాయించుకుంటాడు ఇక జన్మలో తప్పుడు పన్లు చెయ్యనని చచ్చిపోయిన తల్లిదండ్రులమీద, కనుపించని దేవుడిమీదా వొట్లు వేసుకుంటాడు. మళ్ళీ దారి తప్పితే చెప్పు తీసుకుని కొట్టమంటాడు. వొళ్ళు వంచి పని చేస్తానంటాడు.

చుక్కమ్మ ముందు కస్సుమని లేస్తుంది. భగభగ మండుతుంది. 'ఆడదాని కష్టార్జితం అట్లా దోచేందుకు సిగ్గులేదూ?' అని అరుస్తుంది. కరిచినంత పని చేస్తుంది. "కష్టాలు పడి పడి ఈ రోజున ఈ మాత్రంగా ఉన్నాను. నాకు సాయపడవలసింది పోయి ఇట్లా అన్యాయం చేస్తావా?" అంటుంది. 'వొదిలిపో—సుఖపడిపోతాను—' అని కసురుకుంటుంది.

తర్వాత నాగులు తల బాదుకుని 'నేను పాపాత్ముణ్ణి— చచ్చిపోతాను—' అని చివాలున లేచి కొడవలికోసమో, కత్తికోసమో వెదుకుతాడు. అప్పుడు చుక్కమ్మ అడ్డుపడుతుంది. 'చాల్లే నిర్వాకం—చస్తాట్ట—చస్తాడు—అదికాదు ప్రయోజకత్వం—ఇక నుంచి బుద్ధి తెచ్చుకుని మసులుకో చాలు—' అంటుంది. దాంతో అంతా సద్దుకుంటుంది. రాత్రి పొద్దుపోయేవరకూ అతని పక్కన మంచంలో కూచ్చుని ఎన్నో బుద్ధులు చెబుతుంది. కళ్ళనీళ్ళు పెట్టుకుంటుంది. అతడు మళ్ళీ వొట్లు పెట్టుకుంటాడు. ఆ తర్వాత అంతా నిశ్శబ్దం.

సుబ్రమణి మాసిన పైతుండుతో ముఖం తుడుచుకున్నాడు. వర్షపు జోరు తగ్గింది. తాటాకుల చివరల నుంచి నీళ్లు సన్నగా పడుతున్నాయి. కాకి ఒకటి నిలువెల్లా తడిసి వచ్చి చూరుక్రింద నిలబడి రెక్కలు విదిలించుకుంటున్నది.

సుబ్రమణి చూపులు రోడ్డు దిగి వస్తున్న ఆకారంపైన పడ్డాయి. అస్పష్టమైన ఆకారం కొంచెం కొంచెం స్పష్టంగా కనిపిస్తున్నది.

'వాడే... వొస్తున్నాడు...' అనుకున్నాడు సుబ్రమణి.

నాగులు వచ్చాడు. మనిషి మామూలుగా లేడు. వొస్తూనే తల విదిలించుకుని, 'అబ్బబ్బ! ఏం వాన! ఏం వాన!' అన్నాడు. నిలువెల్లా తడిసిపోయి ఉన్నాడు.

'చుక్కాలూ! తల తుడుచుకోవాలి. తుండు అందుకో' అంటూ లోపలికి అడుగులేయబోయాడు.

అప్పుడు చుక్కమ్మ అపరకాళికలా లేచింది. ఆమె ముఖం కోపంతో ఎర్రబడింది. కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి. గొంతు పెద్దది చేసి 'ఆగు' అని గద్దించింది.

"ఆ గక్కడే... లోపలికి రాకు" అని మళ్ళీ గర్జించింది.

నాగులు వింతగా చూస్తూ సుబ్రమణి వంక తిరిగి ఏమీ ఎరగనట్టు "ఏమిటీ? ఏం జరిగింది!" అన్నాడు.

చుక్కమ్మ ఇవతలికి వచ్చి 'ఏమీ జరగలేదు. కాని నువ్వు మాత్రం లోపల అడుగు పెట్టకు' అన్నది తీవ్రంగా.

"ఏం ?" అన్నాడు నాగులు.

"ఏమీ లేదు... లోపల అడుగుపెట్టావంటే మాత్రం కాళ్లు విరగ్గొ కతాను. మర్యాదగా వెళ్ళిపో..."

చుక్కమ్మ కర్ర అందుకుంది.

నాగులు కొంచెం జంకినట్టు కనిపించాడు. అయినా నవ్వుతూ "బాగానే ఉంది సరసం..." అని గొణిగాడు.

కాని అంతలో అతని మొహం మాడిపోయింది. నెమ్మదిగా "నీకు బాగా కోపం వచ్చినట్టుంది" అన్నాడు.

చుక్కమ్మ కర్ర రెండు చేతులలోకి తీసుకుంది. సుబ్రమణి భయ

పడ్డాడు. నాగులు అకస్మాత్తుగా కుంచించుకుపోయాడు. మొహంలో దైన్యం కురిపిస్తూ నెమ్మదిగా మొదలుపెట్టాడు.

"నేను తప్పే చేశాను... కాని ఎందుకు చేశాను ?

డబ్బు సంపాయిద్దామని చేశాను. నీ కష్టం చూడలేక చేశాను. నన్ను నమ్ము. నువ్వు నా దేవతవి. పువ్వుల్లో పెట్టి పూజించుకోవాలని చేశాను. ఎనిమిది వందల రూపాయలు— ఏం సరిపోతుంది. దాంతో పెద్ద క్లబ్బు కెళ్లాను. అక్కడ రూపాయికి వంద రూపాయలొస్తాయి— వొస్తాయని వెళ్లాను. కాని కర్మ రాలేదు— మొదట్లో బాగానే ఉంది. నోట్లతో జేబులు నిండిపోయాయి. అప్పుడే లేచి రావలసింది. కాని ఇంకా ఆడాను. చక్రం తిరిగింది. పూటలో అంతా ఖాళీ— చిల్లర నోట్లు మిగిలాయి. ఇవిగో అయిదు రూపాయల నలభై పైసలు. ఇవిగో లాటరీ టిక్కెట్లు పది మొత్తం సొమ్ము ఏభై లక్షలు..."

సుబ్రమణి ముందు తడిబట్టల్లోంచి డబ్బు... రంగురంగుల లాటరీ టిక్కెట్లు ఉంచాడు. ఆ తర్వాత భుజాలెగరేశాడు.

మరుక్షణంలో బావురుమని ఏడుస్తూ కూలబడ్డాడు. నెత్తి బాదుకుంటూ 'ఇక దురాశకు పోను—నీ కాళ్లు పట్టుకుంటాను—చుక్కలూ! నువ్వు కాకపోతే నన్నెవరు క్షమిస్తారు?' అంటూ ఏడవటం ప్రారంభించాడు.

చుక్కమ్మ కదలలేదు. మెదలలేదు. లావాటి ఆ కర్ర పట్టుకుని ఉగ్రంగా మహిషాసురమర్దనిలా నిలబడి ఉంది.

అతని ఏడుపు ఉధృతి తగ్గాక మొదలుపెట్టింది.

'లే ముందు. నీలాటి ఏడ్చే మగాళ్ళను చూస్తే అసహ్యం నాకు' అన్నది.

నాగులు ఆశగా చూస్తూ లేచి నిలబడ్డాడు. లోపలికి రాబోయాడు. చుక్కమ్మ పెద్దగా గర్జించింది.

'ఇటు కాదు... దారి అటు. ఇంతకుముందే ఒక దుర్మార్గపు చచ్చినాణ్ణి వెళ్ళగొట్టాను. ఇప్పుడు నీకూ అదే గతి... నడు ముందు నీ వెధవ మొహం నాకు బతికుండగా చూపించకు.'

నాగులు కంగుతిన్నాడు. మళ్ళీ ఏదో అనబోయాడు. కాని అంతలో గొంతు మార్చి వంకరగా నవ్వుతూ 'అలాగే అంటావు... కాని...నన్నొదిలి...నేను లేకుండా...బతగ్గలవా?' అన్నాడు.

చుక్కమ్మ మొండిగా 'నిక్షేపంగా బతగ్గలను' అన్నది.

అతని చూపులు క్రూరంగా మారాయి.

"అంతేనా? ఇదే ఆఖరి మాటా?"

"ఆహా! ఆఖరి మాట ఇదే..."

నాగులు ఈసారి సుబ్రమణి వంక కొన్ని క్షణాలు చూశాడు. తర్వాత "అవున్లే...నీకు నే నొక లెక్కా? ఒకణ్ణి వొదిలి బరితెగించి వొచ్చినదానివి... నన్ను వొదిలెయ్యడం నీకు మహాతేలిక. ఇడుగో ఉన్నాడుగా అవిబోడు... అసలిన్నాళ్ళూ నేనే మోసపోయానేమో...నా చాటున ఇద్దరూ ఏం కథలు నడిపారో..." అన్నాడు.

చుక్కమ్మ ఆవేశంతో ఊగిపోతూ చేతిలోని కఱ్ఱ విసిరివేసింది. అది నాగులు కాళ్ళకు విసురుగా వెళ్ళి తగిలింది. అతడు మండిపడుతూ ఆ కఱ్ఱ చేతిలోకి తీసుకుని చుక్కమ్మ మీదికి రాబోయాడు.

సరిగా ఆ క్షణంలో అతని మొహంమీద దెబ్బపడింది. కొరడాతో ఛళ్ళున కొట్టినట్టు, మాడుమీద తేలు కుట్టినట్టు అయింది. కళ్ళు బైర్లు క్కమ్మాయి. చేతిలో కఱ్ఱ కిందపడిపోయింది. మనిషి తూలబడిపోయాడు.

మళ్ళీ డొక్కలో పిడుగులాగ మరో దెబ్బ...

నాగులు ఉండచుట్టుకుపోయాడు. పొట్ట చేత్తోపట్టుకుని విలవిల లాడుతూ వెనక్కు అడుగులువేస్తూ కొంతదూరం వెళ్ళి నెమ్మదిగా నిటారుగా నిలబడి వర్షంలో తడుస్తూ కొద్ది క్షణాలు నిలబడ్డాడు. ఆ తర్వాత...కదిలి నెమ్మదిగా అడుగులువేస్తూ దూరంగా వెళ్ళిపోయాడు. కొద్ది క్షణాల్లోనే సన్నటి వర్షపు చినుకుల మధ్య అదృశ్యమైపోయాడు.

ఆ రాత్రి వర్షం బాగా పెద్దదయింది.

ఇంగువ గింజలంత చినుకులు రొదచేస్తూ పడుతున్నాయి.

చుట్టూ కీచురాళ్ళ రొద... చేత్తో తాకితే తగిలేంతగా ఘనీభ

వించిన చీకటి. అదృశ్య దుష్టశక్తులేవో కసిగా భూమిని వర్షరజ్జువులతో పైకి లాగేందుకు ప్రయత్నిస్తున్నట్టు...

పాక ముందు భాగంలో సుబ్రమణి తల్లి కడుపులో ఉన్న పిల్లవాడిలా ముడుచుకు పడుకుని వణకుతున్నాడు.

లోపల చుక్కమ్మ మెత్తని బొంతలమీద వెచ్చగా పడుకుని ఉంది. అంతలో ఒక్కసారి లేచి మధ్యలో నిలబడి చూసింది.

ఎంత సేపయిందో తెలియదు సుబ్రమణికి. పైన వెచ్చనిది, మెత్తనిది ఏదో పరుచుకుంటున్నట్టనిపించి కళ్ళు తెరిచి చూశాడు. పైన పరుచుకుంటున్నది దట్టమైన బొంత... పక్కనే లీలగా ఒక ఆకారం.

కొద్ది క్షణాలు కదలకుండా నిలబడింది ఆ ఆకారం.

తర్వాత నెమ్మదిగా కదలి లోపలికి వెళ్ళిపోయింది.

సుబ్రమణి కొద్దిసేపట్లో హాయిగా నిద్రపోయాడు. నిద్రలో మంచుతో నిండిన అందాల పర్వతశిఖరాలు, రంగురంగుల సముద్రాలూ పువ్వులూ కనిపించాయి. 